# సూక్తిసుధాకరము

(A Dictionary of Quotations)









సంపాదకుఁడు

పండిత పెనుమెత్స సత్యనారాయణరాజు

ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ

హైదరాబాదు

# పీఠిక

మానవులకు సత్కవులు అకారణ బంధువులు. అనుభవపూర్వకములు సుధామయములు శాశ్వతములు దేశకాలాతీతములు నగు వారి ఉక్తులె, సూక్తులు. ఆసూక్తుల కాకరమైనది యీ సూక్తి సుధాకరము.

ప్రతిమానవుఁడు తన దైనందిన జీవితమున ఏదియేనొక సూక్తి నాధారముగాఁ జేసికొనియే సుఖదుఃఖమయమైన జీవయాత్రను కొనసాగించుచుండును.

ఈ యిరువదియవ శతాబ్దిప్రారంభమునుండియు భారతవర్షము సర్వతోముఖ సంస్కరణముఁ గోరి సంక్షోభము చెందుచున్నది. పురాతన నవీనకాలములకుఁ బోరాటము జరుగుచున్నది. దీనివల్లఁగలుగుచున్న పరివర్తనములకు లెక్కలేదు. సంఘము కదల నారంభించినది. ప్రాఁతపద్ధతులు పోయి క్రొత్తయాచారములు రేకెత్తుచున్నవి. చిత్తమున శాంతిలేదు. సంఘములో స్తైమిత్యములేదు. సాధ్యసాధనములకు సామంజస్యములేదు. త్రోవలు పెక్కులైనవి. లక్ష్యములు వ్యత్యస్తములైనవి. మార్గదర్శకు లనేకులు వచ్చుచున్నారు. కార్యకారులు వివిధసాధనములను నిర్మించుచున్నారు. కాని మార్గదర్శకులువచ్చిన కొలఁదియుఁ గర్మక్షేత్రము చీకాకుచెందుచున్నది. ఏమతమునకు నిలుకడలేకున్నది. ఏకార్యమునకు స్తిమితత్వము కుదురకున్నది. ప్రచండమారుతమున సంక్షుభితమగు జలధిభంగి, భారతవర్షమునఁ బెక్కుమతములు నానా సంప్రదాయములు అనేక పరివర్తనములు, సభలు, మఠములు, పరిషత్తులు, మార్గములు, ఉపాసనలు, సంస్కర

ణములు తరంగములవలె లేచి పెరిఁగి విఱిగి తిరిగి అవ్యాకృతమగు వైదిక సాగరములోఁ బడుచున్నవి.

ఎంతకాలమీ సంక్షోభము? ఎంతకాలమీ ప్రచండకల్లోలము? మానవజీవనమీ యొత్తిడిని చిరకాలము భరింపలేదు. సంఘము క్రమముగాఁ దిరుగుటకును బెరుఁగుటకును మధ్య సాధనభూతములగునవి సూక్తులు.

భారతవర్షము యొక్క సాంఘిక ఆర్థిక రాజకీయ పారిశ్రామిక పారిజ్ఞానిక అధ్యాత్మిక లక్షణములను విశాల విశ్వమానవజాతికిఁ బ్రత్యేకముగాఁ దెలుపునవి సూక్తులు.

ఈశ్వరుఁడెట్లు నిత్య శుద్ధ ముక్త బుద్ధ స్వరూపుఁడై యున్నాఁడో అట్లే ప్రతిమానవుఁడును స్వతంత్రుఁడై ముక్తుఁడగు స్వభావము కలిగి యున్నాఁడు. స్వాధీనత మనుజుని 'జన్మహక్కు'. అది యీశ్వర ప్రసాదితమైనది. మనుజుఁడు దేవునిఛాయ కాడు; బ్రహ్మ పదార్థమే.

సర్వమతస్థులు స్వతంత్రులు, నిత్యులు. స్వాతంత్ర్యమనఁగా నిగ్రహము లేకపోవుటకాదు; ఆత్మనిగ్రహము. స్వాతంత్ర్యమనఁగా నియంతృత్వ విహీనతకాదు; స్వయం నియంతృత్వము. స్వాతంత్ర్యమనఁగా ఆత్మ నిశ్చయ విహీనతకాదు; స్వాత్మనిశ్చయము. మహాకవుల అట్టి స్వాత్మనిశ్చయముల సుభాషితములె సూక్తులు.

మోడువాఱిన వృక్షములన్నియు వసంతమునఁ బైరుగాలికిఁ జిగుర్చునట్లు మోసు చెడియున్న మానవ హృదయములు సూక్తుల మూలమున పల్లవితములు పుష్పితములు ఫలితములు నగుచుండును.

బలహీనునకు బలము, భీరువునకు ధీరత్వమును, దుఃఖితునకు సంతోష మును, లోభికిఁ ద్యాగమును, దేశద్రోహికి దేశాభిమానమును, స్వార్థ పరునకుఁ బరోపకారబుద్ధియును, ద్వేషబుద్ధికిఁ బ్రేమయును, విరోధుల కన్యోన్యమైత్రియును గలిగించునవె సూక్తులు.

సమష్టిజ్ఞాన ప్రదానమె సూక్తి సుధాకరము యొక్క యాశయము. వికలత్వమునొందిన మానవజాతికిఁ దుష్టియుఁ బుష్టియు నొసఁగి దొసఁగుల పొసఁగ నీయక నడవడిని దీర్చిదిద్దునదే యీ సూక్తి సుధాకరము.

ఇందు నన్నయ మొదలుకొని నేఁటివఱకుఁ గీర్తిశేషులైన పెక్కుమంది మహాకవుల సూక్తులు చేర్పఁబడినవి.

తెలుఁగునేల నలుకెలఁకులఁ గల మహాకవి పండితులు సూక్తులు సేకరించి సూక్తి సుధాకరమున కర్పించిరి. వారందఱికి నా నమస్కారములు.

దీనిని తీర్చిదిద్దియొసఁగిన డాక్టరు శ్రీ యస్వీ జోగారావుగారికిని శ్రీ తనికెళ్ళ శ్రీరామమూర్తిగారికిని నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

ఈసూక్తి సుధాకరముఁ గూర్పింప నాకాజ్ఞాపించిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారికి నా వందనములు.

అడిగిన సాయమెల్లఁదడయక చేసిన అధ్యక్షులు మాన్యశ్రీ డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారికిని, కార్యదర్శులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికిని నా జోహారులు.

మాచేసిన దిద్దుబాటులకు విసువుచెందక ఈగ్రంథముఁ జక్కఁగ ముద్రింపించి యొసంగిన సరస్వతీ పవర్ ప్రస్ వ్యవస్థాపకులు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారికి నాధన్యవాదములు.

ఇది మహాసభ కావున

"మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁదథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగుపలు
కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్"

అనుసూక్తిని బాటించి సెలవుదీసికొనుచున్నాను.



రామకృష్ణవిహారము
కోటపాడు
కోరాపుట్టి జిల్లా (ఒరిస్సా)
4—3—1963

పండిత
పెనుమెత్స సత్యనారాయణరాజు

## సూక్తులు సేకరించినవారు

1. డాక్టరు ఎస్. వి. జోగారావుగారు
2. ,, బి. రామరాజుగారు
3. ,, పి. ఎస్. ఆర్. అప్పారావుగారు
4. ,, పల్లా దుర్గయ్యగారు
5. ,, కేతవరపు రామకోటిశాస్త్రిగారు
6. శ్రీ నిడదవోలు వేంకటరావుగారు M. A.
7. ,, కె. శ్రీరామమూర్తిగారు M. A.
8. ,, ఎమ్. వి. సత్యనారాయణగారు M. A.
9. ,, ఎస్. శ్రీరామచంద్రమూర్తిగారు M. A.
10. ,, చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు M. A.
11. ,, పి. వి. రమణయ్యగారు M. A.
12. ,, మానాప్రగ్గడ శేషశాయిగారు M. A.
13. ,, తనికెళ్ళ శ్రీరామమూర్తిగారు M. A. B. Ed.
14. ,, శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు M. A.
15. ,, శ్రీభాష్యం వేంకటనరసింహభాష్యకారాచార్యులుగారు
16. ,, శ్రీభాష్యం తిరుమల రామానుజాచార్యులుగారు B. A.
17. ,, వి. రామచంద్రగారు M. A.
18. ,, చెఱుకుపల్లి జమదగ్నిశర్మగారు M. A.
19. ,, చాగంటి గోపాలకృష్ణమూర్తిగారు M. A.

20. శ్రీ ఎ. నాగభూషణరావుగారు M. A.

21. ,, ఆర్. దొరసామిశర్మగారు M. A.

22. శ్రీమతి సుశీలరాణిగారు M. A.

23. ,, ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు

24. శ్రీ పి. వి. సాయినాథశాస్త్రిగారు M. A.

25. ,, ఆర్. పి. సత్యనారాయణశాస్త్రిగారు M. A.

26. ,, దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు

27. ,, కొమ్మనమంచి జోగయ్యశర్మగారు B. A.

28. ,, వి. నారాయణరెడ్డిగారు M. A.

29. ,, కె. సుప్రసన్నాచార్యులుగారు M. A.

30, ,, ఎమ్. నాగభూషణశర్మగారు M. A.

31. ,, ఉపాధ్యాయుల సత్యనారాయణగారు

# వి ష య సూ చి క

## అ

## ఆ



## ఇ

## ఈ

---

అ

అంగీకార్యము

ప్రియ మొసఁగం దగంబిలిచి పెట్టెడు కూడది లెస్సకూడు

తిక్కన. భారత. ఉద్యోగ. III. 222

అంతఃకరణము

వినుము మనోవాక్కా-యము
లన మూఁడు తెఱంగులందు నంతఃకరణం
బనఘ ప్రధానము

ఎఱ్ఱన భారత. అరణ్య. VII-183

అంతరాత్మ

జలముఁ గదిసి యుండ జలముచే నార్ద్రింబు
గాక యుండునట్టి కమలదళము
భంగి నంతరాత్మ ప్రకృతిఁ బొందియును
దద్వికృతిఁ బొందకుండు

తిక్కన. భారత. శాంతి. VI-109

హింసలేకయునికి యింద్రియ జయము నై
రాశ్య మచపలత్వ మను గుణములు
నాల్గు గలుగునట్టి నరునకుఁ గరతలా
మలక మంతరాత్మ మహిమయెల్ల

తిక్కన. భారత. శాంతి. VI-315

పదిలంబగు అంతరంగమే
పరమపు వైకుంఠము

తనువులో నంతరాత్మ
దైవ మాట దప్పదు

తా. అన్నమయ్య. అధ్యాత్మసంకీర్తనము

అంతరాత్మ సహింపని పని
కొడఁబడుటకంటెఁ జచ్చుటే యుత్తమంబు

కాళ్ళకూరి వరవిక్రయము. V-58

అంతశ్శత్రులు

మదముఁ గామంబుఁ గ్రోధంబు మత్సరంబు
లోభమును మోహమును నను లోని సహజ
వైరివర్గంబు నోడిచిన వాఁడ యొడుచు
నశ్రమంబున వెలుపలి యహితతతుల

నన్నయ. భారత.ఆది. III – 206

వెలి పగఱ గెలుపు గెలుపే
యలఘుమతిన్ గెలువవలయు నభ్యంతర శ
త్రులఁ దద్విజయము మోక్షము
నలవఱుపం జాలు నొంట నమ్మోలగునే

తిక్కన. భారత. అశ్వమేధ. I-124

కామక్రోధ మదాద్యమైన యసుహృద్వర్గంబులన్ గెల్వనే
ధీమంతుండు సమర్థుఁ డాతఁడు విరోధి వ్రాతముం గెల్చు

ఎఱ్ఱన. నృసింహ. II-139

విను సక్తుండగు కుత్సిత
జననాథునిఁ జెఱుచు కడిఁది శత్రులు సుమ్మీ

జననుత కామముఁ గ్రోధ
మ్మును లోభము మదము మానము నమర్షంబున్
మారన. మార్కం. పు. III-130

బాహ్యశత్రులఁ బరిహరింపంగవచ్చు
నంతరారుల నిర్జింప నలవి గాదు
శ్రీనాథుడు. కాశీ. ఖం. IV-203

ధనకులరూప శౌర్యగుణదాన వయోబల రాజ్య భోగ సం
జనిత మదాంధులై నృపతి సంఘము లెల్ల నిజాత్మ శత్రులన్
మునుకొని గెల్వనోపక సమున్నత సైన్యసమేతులై రయం
బునఁ దనువుల్ త్యజింత్రు ధన పూర్ణధరాతల లాభ కాంక్షులై
హరిభట్టు. మత్స్యపురాణము

ఇతరు లరులె కా రింట జన్మించువారె
ఖరతరాన్యోన్య శత్రుత్వగరిమగాంత్రు
జలములోఁబుట్టి వహ్నియే జలముఁగాల్చు
పానుగంటి. బుద్ధ.

...కామము లోభముఁ
గ్రోధము నజ్ఞునిగఁ జేయుఁ గోవిదునైనన్
బోధమునుగోరు మనుజుఁడు
దా ధీ నిడనీక వానిఁదఱలింపఁ దగున్
విక్రమదేవవర్మ రచనలు పుట 51

తగునిది తగదని మొదలో
వగవక సాధులకుఁ బేద వారల కెగ్గుల్
మొగిఁజేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబు లైన భయంబుల్
నన్నయ. భారత. ఆది. I-58

## అకార్యములు

...మధురాహారంబులు
గొనుటయును బలువురు నిద్రఁగూరినయెడ మే
ల్కని యునికియుఁ గార్యాలో
చనము దెరువు నడచుటయును జన దొక్కనికిన్

తిక్కన. భారత. ఉద్యో. II-38

అంగవిహీనునైన వికలాంగునినైనఁ బ్రసిద్ధరోగదు
ష్టాంగునినైనఁ జూచి చెడనాడుట, యొప్పనివానిఁజూచి సౌ
మ్యాంగుఁడితండు వీని కెన యన్యులు లేరని గేలిగొంట తప్పు

కేతన. విజ్ఞా. ప్రాయ. 42

పరులకు నుపతాప మొనరించు
పను లెప్డు నుడుగవలయు

మారన. మార్కం. పు. III-239

పయిచీర లేక సురవిప్రుల నర్చన సేయఁ
దెల్ప భోజన మొనరింపఁగాదు

మారన. మార్కం. పు. III-231

అరయంగ బ్రహ్మహత్యయు
గురుహతి వనితావధమును గోవధమును నాఁ
బరఁగు దురితములు న్నాశ్రితుఁ
బరిత్యజించుటయు నొక్కభంగియ యెందున్

మారన. మార్కం. పు. I-279

అనలము నోరనూదఁ దగ, దగ్గియు నీరును నొక్కమాటు తేఁ
జనదు విలంబనంబు నిజశౌచ విధానమునందుఁగూడ, దె

గ్గానరుగురుండు దేవతలు నుండఁగ నద్దెసఁగాళ్లు చాచుట
ర్థినిగూడఁద్రేపు చన్గుడుపుధేనువుఁ గొట్టుట తప్పు.

మారన. మార్కం. పు. III-274

దిగంబరత శయనింప నీరాడఁగాదు

మారన. మార్కం. పు. III-230

ధర దుష్టసఖుల గుణములు। వెరపున నేమేనిఁ జేయ వేచుట
తప్పుల్ ।

పురిగొలుపుట మర్మాంతర । పరిహాసము సేయుచునికి

మంచన. కే. బా. చ. III-283

దాసీవధం బెందుఁ దగదు చింతింప

రంగనాథ. యుద్ధ. పు. 622

చేతగాని పనులఁ జేయరాదు

వేమన.

అకార్యకరణశీలుర కెవ్వాటఁగలదె సుఖము?

తెనాలి రామకృష్ణుడు. పాండు. మాహా. V-283

ఘన కిరీటంబు ధరియించుకొనిన తలకు
సుళ్ళు లెక్కలు పెట్టుట చొప్పుకాదు

కనుపర్తి అబ్బయామాత్యుడు. అనిరుద్ధ చరిత్రము పీఠిక. 11

నిరతము విషయాసక్తి
స్ఫురిత మనోవృత్తిసాధ్వసూయయు హింసా
పరతయు నాత్మస్తుతియునుఁ
బరనింద యొనర్పవలదు

శ్రీధరమల్లె వెంకటరామకవి. బ్రహ్మోత్తర ఖండము IV-86

చుట్టత్రిక మెంత గలిగిన
రట్టున రారాని యెడకు రావారలపై
నెట్టి సుబుద్ధులకైనను
బుట్టును రోషంబు దానఁబుట్టుం జెట్టల్

అయ్యలరాజు నారాయణామాత్యుడు. హంసవింశతి V-332

నమ్మినవాని నన్యాయంబు సేయుట
కాశిలో గోహత్య గాదె

మాడభూషి వేంకటాచార్యుడు. రామావధూటీతారావళి

......తనుఁదానె మహాత్ముఁ డనంగరాదు తా,
పరిపరిత్రోవలం దిరిగి బాధలనొంది కృశింపరాదు, ప
మరి కనుమూయ రా, దటవిమధ్యను జాలముఁ జేయరాదు —

బాలకృష్ణకవి. వరదరాజ శతకము

చెడ్డకార్యమునకుఁ జేరరాదెప్పుడు
చేరనేని మేటి చేటువచ్చు

కందుకూరి వీరేశలింగం పంతులు. నీతి దీపిక. 85

తనకు తగని యట్టి పనిసేయఁబూనిన
చేఁతకానివాఁడు చేటుఁ బొందు

అ. నారాయణదాసు. నూఱుగంటి. 72

మిగుల నుపకారి యైనను మిత్రుఁడైనఁ
గాని పని సేయుమనఁ జేయఁగలఁడె నరుఁడు ?
అరసి పాలిచ్చి పెంచిన యమ్మ యైన
విసముఁ బెట్టినఁ గుడుచునే ప్రియసుతుండు

చిలకమర్తి. గయోపా. V-102

పరుల యీవుల నడ్డగింపకుము

విక్రమ. రచ. 69

## అక్రోధనత

...క్రతుసహస్రంబులు సే
సిన వారికంటె నక్రో
ధనుఁడ గరంబధికుఁడండ్రు తత్త్వ విధిజ్ఞుల్

నన్నయ. భారత. ఆది. III-146

## అగోప్యములు

కులము సత్కీర్తియు గుణము తేజంబు
నలవోకఁ దాఁచిన నణఁగ వెవ్వరికి

తిమ్మయ. ద్విప భా. విరాట. I 26

## అగ్నిహోత్రము

... రేపును మాపు హవ్యములచేతన్ దృప్తుఁడౌ వహ్ని స
త్కరుణా దృష్టి నొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే

పెద్దన. మనుచరిత్ర. II-65

## అజ్ఞాతము

శూ (సూ?) రుల జన్మంబు సురల జన్మంబును
నేఱుల జన్మంబు నెవరి కెఱుక ?

నన్నయ. భారత. ఆది. VI-60

వానరాకడ మఱి ప్రాణంబు పోకడ
కానఁబడదు ఘనులకైన గాని

వేమన

## అజ్ఞానము

రవిబింబము రాహువుపయిఁ
గవిసినఁ జూసినను దోఁపకయుఁ దోఁచియు నుం
డువిధమ యజ్ఞానంబున
యవిరతి విరతుల యధీనుఁ డగు టాత్మునకున్.

తిక్కన. భారత. శాంతి. IV-184

తనతన ధర్మమున్ నడిపి దానన సంతస మంది శాంతభా
వనరతి నుండు వారిగని వారల చెప్పెడు ధర్మవృత్తి ని
చ్చనయుగ నూఁది సత్పదముఁ జెందుటకెక్కుఁడు పొత్తినూలిపు
ర్వ్యనకెనగాకు, బంధకుఁ డవుందన కజ్ఞుఁడు దానయమ్మెయిన్.

తిక్కన. శాంతి. IX-227

ఆ శ్మశాన గమను లంతియు చుట్టంబు
లగ్నిఁ గలిపి మరలు నఖిలమైన
జ్ఞాతిజనము దీనిఁ జర్చింప కందఱ
యందు మమతఁ బెనుచునజ్ఞుఁడు

తిక్కన. శాంతి. VIII-235

పరము జ్ఞానము లేమిని
బరులును నేమనుచుఁ దోఁచుఁ బ్రాణుల కెల్లన్

పోతన. భాగవత. VII-99

ఎఱిఁగిన వారల మనుచును
గొఱమాలిన యెఱుక లెఱిఁగి కొందఱు నీచే
రెఱిఁగియు దలఁపఁగ నొల్లరు
పఱతు రధోగతులజాడఁ బద్మదళాక్షా

పోతన. భాగవత. -9

చిరదూరాంధునకును గర్మగతుల నగునే శుభముల్

సింగయ. భాగ. VI-235

ఎఱుకమాలువాడి కే మేమి చదివినఁ
జదివి సంతసేపె సద్గుణి యగు

వేమన

ఎఱుక మాలు జీవి యెంతకాలంబుండి
చచ్చి పుట్టుచుండు సహజముగను

వేమన

కుక్క నందలమునఁ గూర్చుండఁబెట్టిన
నొక్క మనసుతోడ నుండఁబోదు
ఆత్మ నిలుపలేని యజ్ఞానియును నట్టె

వేమన

అజ్ఞుల నోరులు మూయవచ్చునే

పాపరాజు. ఉ. రా. VI-201

తెలియని వాడైతే తెలియఁ దెలుపవచ్చు

క్షేత్రయ పదములు. పరకీయ.

అజ్ఞానంబునఁదోఁచు సంసరణ దుఃఖావాప్తి

కనుపర్తి అబ్బయామాత్యుడు. కవిరాజమనోరంజనము I-140

అతిథి సత్కారము

వండ నలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
అతిథు లేతేర నడికిరేయైనఁ బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారిగాఁగ

పెద్దన. మను.

...అతిథి గృహంబునకుం
జనుదెంచినఁ దనకు దొరకు శక్తిం బూజిం
పని దుర్మతి నిజమాంసా
శనుఁడగుఁ బరలోకమున నసత్సాక్షి గతిన్

భాస్కరుడు. అరణ్య. I-96

.. దివసాష్టమభాగం
బున సదన ద్వారమునకుఁ బోయి కడుఁ బ్రియం
బున నతిథి నరయువలయుం
దనయ తదర్చనకు నెనయె ధర్మువు లెందున్

మారన. మార్కం. పు. III-154

ఎలమి నెవ్వని గృహమున కేఁగుదెంచి
యఫలితాశుఁడై క్రమ్మఱు నట్టి యతిథి
తనదు దుష్కృత మాగృహస్థునకు నిచ్చి
యతని సుకృత మంతయుఁ గొని యరుగు

మారన. మార్కం. పు. III-159

అతిథికిఁ బెట్టక కుడిచిన
యతికష్టుఁడు దురితభోక్త యగుం డ్రు మునీంద్రుల్

మారన. మార్కం. పు. III-158

అతని కులశీలవిద్యా
స్థితులడుగక యెంత వికృత దేహుండైనన్
మతి విష్ణునిఁగాఁ దలఁచుచు
నతి ముదమునఁ బూజసేయునది నిజశక్తిన్

మారన. మార్కం. పు. III-157

భోజన వేళ నతిథి క్షుత్పీడితుఁడై
చనుదెంచి గ్రాసమడిగినఁ
దనముందట యశనమైనఁదగు నొసఁగంగన్

అనంతా. భోజరాజీయము. III–126

అతిథి గడునల్పుఁడైనను నధికుఁడైన
నింటికే తేరఁ బ్రియమందు నెవ్వఁడేని
వాని గౌరవ మది గౌరవంబు కాని
కాదు గౌరవ మాకార గౌరవంబు

శ్రీనాథుడు. కాశీఖండము. I

అన్నమైనఁ దక్రమైనఁ దోయంబైన
శాకమైనఁ దమకు జరుగు కొలఁది
నతిథి జనుల కడ్డ మాడక యిడ లేని
లేమ వారు గలిగి లేని వారు

పోతన. భాగవత. VIII–462

ఆకొన్న యతిథి శివుఁడని
కాకించుక లేక మదినిఁ గరుణాన్వితుఁడై
పోకంత యన్న మిడిననె
నూఁకొని యా యమునిఁ గొట్టను

వేమన

వాఙ్మనఃకాయ కర్మ ప్రవర్తనముల
సంభవించిన పాపంబు సంహరించి
యతిథి గృహమేధి కిచ్చు శాశ్వత సుఖములు

తెనాలి రామకృష్ణుడు. పాండు. మహా. IV–156

ఆనిష్ఠానిధి గేహసీమనడురే యాలించినన్రోయి నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలున్ దివ్యప్రబంధాను సం

ధాన ధ్యానము నాస్తిశాక బహుళతా నాస్త్యుష్ణతానాస్త్యపూ
పోనాస్త్యోదన సౌష్ఠవంచ కృపాయా భోక్తవ్య మన్వేలుక్ఖలున్ ॥

రాయలు. ఆము. I

అతిథివచ్చి యాఁకలన్న నన్న మిడినదే చాలు
క్రతువు సేయ వలయు ననెడి కాంతకు లేటికే

రామదాను చరిత్ర.

నిత్య మభ్యాగత పూజమాని కుడువం జనరాదు

శ్రీధరమల్లె వెంకటరామకవి. బ్రహ్మోత్తర ఖండము. IV-85

## అత్త

అత్తగారి పొత్తు కత్తికోత

క్షేత్రయ పదములు. ఇతరుల పదములు.

అత్తలెల్లను మంచి అలవేము తియ్యన
ఎందునైనాగలదె మందు కైనాను

కుశలాయకము

## అత్త-కోడలు

అత్తలేని కోడ లుత్తమురాలు
కోడలు లేని యత్త గుణవంతురాలు

టేకుమళ్ళ కామేశ్వరరావు. పాతపాటలు. 30

అత్తను కోడండ్లు ఆడుటలెల్ల
గొప్ప తప్పులలోన ఘోరమహాతప్పు

ఆంధ్రసారస్వత పరిషత్తు. స్త్రీలరామాయణపు పాటలు. 114

## అత్యాశ

అక్కఱకురాని ధనము
ఆసపడితే నేమి ఫలము ?

క్షేత్రయపదములు. 126-97

సుమలత ఘన తరుసంస
ర్గమె కోరుంగాని యెంతరసమయుఁడైనన్
దమకించునె ఘనమణికిని
తమళీలకుండ గని కోర్కె తరమే పడయన్

వెంకట పార్వతీశ్వర కవులు. బృందావనము.

అదను

కడలేని మనసునకుఁ గడమ యెక్కడిది?
దాహమణఁగిన వెనుక తత్త్వమెఱిఁగెదనన్న
దాహమేలణంగుఁ దాఁ దత్త్వమేమెఱుంగు?

తా. అన్నమయ్య. అధ్యా. సం.

బాలప్రాయమందె భ్రమల నడంపక
మేలు పొందరెప్డు

వేమన

అదను దప్పిన కార్య మనువునఁ బడునె

తిమ్మయ. ద్విప. భార. అరణ్య I-9

అదనులేదే దేని కైనను అందరెఱుఁగనిదే?
పండగలదని కాయ కుడుతురె?
తిండి యెల్లిది నేడు తిందురె
అండమందున చిలుక కలదని అరచి జీరెద రే:

గురజాడ అప్పారావు, ముత్యాలసరాలు

అదృష్టము

పెట్టిన దినముల లోపల
నట్టడవులకైనవచ్చు నానార్థములున్

పెట్టని దినములఁ గనకఁపు
గట్టెక్కిననేమి లేదుగదరా సుమతీ !

సుమతీ శతకము

కలఁగన్న చోటికి గంపఁ గొంపోవ
ఫలసిద్ధి యగుటెల్ల భాగ్యంబుఁగాదె

పా. సోమన్న. బసవ. III-61

అడవిలోపల నున్న గేహముననున్నఁ
బొందఁగల భాగ్యవిభవంబు పొందుఁబురుషు

శ్రీనాథు. కాశీఖండము IX-221

భాగ్యమొదవెనేనిఁ బ్రాపించుఁ దను దాన
పుణ్యలక్ష్మినిధియుఁ బోలెఁ బురుషు

తెనాలి రామకృష్ణుడు. పాండు. మహా. IV-258

భాగ్యాయత్తముల్గా సిరుల్

వసుచరిత్ర III

సిరితా వచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలిలము భంగిన్

సుమతీ శతకము

ఊరక వచ్చుఁ బాటుపడకుండిన నైన ఫలంబదృష్టమే
పారగఁగల్గు వానికి

మారన వెంకయ. భాస్కర శతకము

యోగంబొక్కటి మంచిదైన యెడ నేయూరేఁగినన్ జక్కఁగా
యోగించున్ విపరీతమైన యెడలన్ యోగింపదు...”

తిరుపతి వెంకట కవులు. పండితరాజము I-7

భాగ్యమునె నమ్మికొన్న య
భాగ్యుఁడెవఁ డభీష్టసిద్ధి పడయం గల్గున్

కం. వీరేశలిం. ద. గో. గ్ర V-1

తిన్నగా నదృష్టమున్నపు డన్నిట
బుద్ధి తిన్న గానె పోవుచుండు

కాళ్ళకూరి. పద్మవ్యూహము VI-99

## అద్వైతము

పురుషోత్తముండుఁ బురుషుఁడు
నిరువు రగుటగలఁగు గలిగెనేనియుఁ బురుషుం
బురుషోత్తమునందుఁ గలుపు
వెరపున నేకత్వమహిమ విజ్ఞాత మగున్

తిక్కన. భారతము. శాంతి. I-160

... దేవుఁడనంగా
జీవుఁడెయని వివరించిన
భావింపన్ ముక్తిబట్టబయలగు వేమా !

వేమన

శివుఁడు జీవుఁడు రెండు వస్తువు లటంచు
నెంచు వారికి సాయుజ్య మెట్లు గల్గు
జీవ శివ భేద మెన్నడు సేయరాదు
నవ్యతర భోగి శ్రీ సదానంద యోగి

సదానందయోగి. సదానందయోగి శతకము.

సత్యము సత్యము సత్యము
నిత్యము నద్వైతమతము నిరుపమ మఘరా

హిత్యము మోత శ్రీసా
హిత్యము మీరెల్ల సందియింపకుఁడింకన్

అలూరి కుప్పన. శంకర విజయము

అధముఁడు

మఱి నుపకారంబు మఱచినవాఁడు
ప్రతిన దప్పినవాఁడు పాడిమైఁదనదు
చెలికాని కార్యంబు సేయనివాఁడు
తలపోయ మానవాధముఁడండ్రు బుధులు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. కిష్కిం. 253

పరదోషము సెప్పఁగ నే
ర్తురు గా కాత్మీయమైన దోషంబు మదిం
బరికింపఁగ నధములు నేర్తురె

తిక్కన. భారతము, కర్ణ. XI–112

లోకము తను ఛీయననా
యాకీడు లొనర్చుచుండు నధముడు

వేమన

హీనుఁడెన్ని విద్యలే నభ్యసించిన
ఘనుఁడుకాడు హీనజనుఁడెకాని

వేమన

పరుల మేలుఁ జూచి పలుగాకివలె నెపుడు
వట్టిమాటలాడు వాఁ డధముఁడు

వేమన

తనదుఁబాగుఁ గోరి ధర్మంబుఁ జెప్పినఁ
దిట్టుచుండు నధము డెట్టయెదుట

వేమన

అధముండు గర్వించు నల్పవిద్యలను

తిమ్మయ. ద్విప. భారత. ఆది. V-293

అధముఁడగువాని సామవాక్యముల యోగ్య
లనునయింప నాతని యల్క యినుమడించు
నెఱయఁ గ్రాగిన చమురుపై నీళ్ళు చల్లఁ
బొగయు మంటయు బుస్సున నెగయునట్లు

చిలకమర్తి. ప్రసన్నయాదవము I-19

## అధర్మము

సర్వభూతదయకు సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మమొండెఱుంగ
నొరుల నొప్పి కోడకుపతాపమొనరించు
నదియొకండు నధర్మమనిరి బుధులు

నన్నయ. భారత. ఆది. III-219

అగునె ధర్మక్రియాలోపంబు
హృదయంబులో సహింప

నన్నయ. భారతము. ఆది II-158

అధర్మవర్తులయందు దర్పంబుపుట్టు
దర్పంబు వలన మానంబు పుట్టు
మానంబు వలనఁ గ్రోధంబు పుట్టు
క్రోధంబు వలనం జేసిలజ్జయు వృత్తం

బునుం జెడు. నష్టలజ్జావృత్తు
లయిన వారి నుపశమంబును లక్ష్మియు విడుచు

నన్నయ. భారతము. అరణ్య. II-315

పెద్దవాడుండఁ గొండుక వానికి
వివాహంబగుట ధర్మవిరుద్ధంబు

నన్నయ. భారత. ఆది. VII-212

ధర్మమార్గంబు దొఱఁగి దుర్మంత్రంబు
మైఁబగ యడఁగింపఁ గడఁగిన
నసురవృత్తిఁ జేటకాక కార్యసిద్ధి గానేర్చునే.

తిక్కన. భారత. సౌప్తిక. I-105

ధర్మమైన దూష్య కర్మయుతంబైన
నదియ కడు నధర్మము

ని. కొమ్మన. శివలీలా. II

మేదిని నన్యాయరతుల
నా దైవంబేల చక్కనరుగఁగ నిచ్చున్

అనంతా. భోజరాజీయము. VI-362

వావి వర్తనలును వరుసను మర్యాద
దప్పినడచె నేనిఁ దగులు కీడు

వేమన

తనరంగఁదృణ సంవృతములైన యట్టి
ఘనకూపములఁబోలుఁ గపటధర్మములు
వాని దూరంబున వర్జింపవలయు

సోమన. ద్విప. భారత. అరణ్య. అను-18

విపరీత ధర్మంబులెల్ల భంగులఁ జెఱచున్

కాం. కన. ఆనందసారము. 4

## అధర్ములు

వసుధ నధర్మవర్తు లగువారల వర్ధనమెన్నఁడున్ సమం
జసమయి నిల్వనేరదు

నన్నయ. భారత. అరణ్య. XI-312

మహిత శాస్త్ర కలిత మార్గంబు విడిచి, ని
జేచ్ఛఁ బగఱ గెలువ నెవ్వఁడరుగు
వాని నయ్యధర్మవర్తన క్రౌర్యమ
యెవ్విధమునఁ జెఱచునింత నిజము

తిక్కన. భారత. సౌప్తిక. I-104

అనయపరుండగు మనుజుఁడు
తనవారిం జెఱిచి పిదప తానుం జెడుఁబో

బైచరాజు వేంకటనాథ కవి. పంచతంత్రము. I-669

ధర్మమునకు గీడు దలఁచినవాఁడు తా
దుష్టమార్గుఁడగును ద్రోవ నెచెడు

వేమన

ధర్మసత్యములను దప్పగాఁ జెడఁబుచ్చు
కర్మజీవి మేలుఁ గానలేడు

వేమన

తప్పుసాక్ష్య మిచ్చి ధర్మంబు పడఁగొట్టి
వట్టినిందఁబెట్టు వాజ గొట్టు
అట్టివారి కెల్ల ననుభవంబుండురా!

వేమన

పృథివి నధర్మికెన్నఁ బరపీడయె యుత్తమలాభ మెప్పుడున్

సూరన. ప్రభా. IV-154

ప్రియభాషణముల నప్రియము సేయుదురు
నయ వివర్జితులు

బాలసర. ద్విప. భారత. II–587

ధారుణి ధర్మంబు దప్పివర్తిల్లు
వారి కృత్యంబులు వర్ణింపఁదగదు

బాలసర. ద్విప. భారత. సభా. II-599

ధర్మము చెడి రెండాడిన
దుర్మార్గుఁడు గృహము పట్టు తుడిచిన ధూళై
నిర్మాలోన్మూలంబై
ధర్మజుపురి కేఁగు మలముద్రావుచు నుండున్

వేటూరి. చాటు. మణి.

**అధికములు**

జ్ఞానంబొకటే జగమునకధికం మఱి
నానా విధములు నటనలు
బహుదాన ఫలము పడయుటకంటే
ఇహమున వైరాగ్య మెక్కుడు
సహజ కర్మములు శతముల కంటె
అహిశయనుని భక్తియధికము
ధరఁ దపము లనంతంబులకంటే
గరిమల శ్రీహరి తమము ఘనము
విరసాచారము వేవేల కంటే
హరినామ పఠనమధికము

తా. అన్నమయ్య. అధ్యా. సం. సం. X సం 231

## అధికారము

శ్రవణ యుగాంతరావరణ చక్రము లగ్గల పట్టు తోరపుం
జెవుడు కనీ నికా వసుధ సీమకు నుమ్మలి కాడు దృష్టిపా
టవము దురుక్తి నాలుకకు డాసిన చుట్టము పారుపత్యమ
న్తైవులునవైద్య సాధ్య మెడ త్రేవ్వవ యెవ్వనినాశ్రయించినన్

బైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము I–371

అవనిలోపల నధికారమబ్బెనేని
క్రింది వారల నెప్పుడుఁగినియఁ దగదు

కందుకూరి వీరేశలింగంపంతులు. నీతి. దీపి. 42

అరయ నధికారు లెందును
బరికించిన దుష్టులగుచుఁ బరవిత్తములన్
హరియించుచు నిఱుపేదలఁ
బరితాపము నొందఁజేసి బ్రతుకుదురెచటన్

సురవరం ప్రతాపరెడ్డి. ఉచ్చుల విషాదము I – IV–25

పదవిలబ్ధి తమకు ధర్మ పథమటంచుఁ
దలఁచి నడుచు వారు ధన్యతములు

సౌభాగ్యవతి చాటువులు

పదవినంది జనుఁడు పతితుండునాఁ జెల్లు

శాంతిదూత. 24

అధరముఁ కదిలియుఁ గదలక
మధురములగు భాషలుడిగి మౌనవ్రతుడై
అధికార రోగపూరిత
బధిరాంధక శవముఁజూడఁ బాపము సుమతీ.

సుమతీ శతక.



అల్పబుద్ధివాని కధికారమిచ్చిన
దొడ్డవారినెల్లఁ దొలఁగఁగొట్టు.

వేమన.

అధికుఁడు

అధికుండేగ్గేల సైచున్

అయ్యలార్యుడు. భా. రా. యుద్ధ, 887

దొడ్డవాఁ డేమిసేసినా దోసమందు నేది?

తా. అన్నమయ్య. అధ్యా. సం. X సం. 89

అధికుఁడైన వాని కధికార మిచ్చిన
నచటివారి నెల్ల నాదరించు

వేమన

గొప్పవాఁడు మిగులఁ గొద్దివాని నయినఁ
గాచివానివలనఁ గావఁబడును

అ. నారాయణదాసు. నూరుగంటి. 21

అధికుండు పంతంబు లాడక గెల్చును
నధముండు పంతంబు లాడియు నోడు

గోనబుద్ధా రెడ్డి. రంగ. రామా. యుద్ధ. 537

అధికుఁడు : అల్పుఁడు

అల్పుఁడెపుడుఁ బల్కు నాడంబరముగాను
సజ్జనుండు బల్కు చల్లగాను

వేమన

అల్పుఁడెన్ని పలుకు లలయక పలికిన
నధికు దూరకుండు నదరి పడక

వేమన

అలఁతి వానికి బలువుని చెలిమి మొదల
దొడ్డగానున్నఁ దుదకది చెడ్డసేయు

అ. నారాయణదాసు. నూరుగంటి. 6

గొప్పవారు పోరు నప్పుడు తక్కువ
వారు చేరితనుండి బాగుపడరు

అ. నారాయణదాసు. నూరుగంటి. 14

ఇతఁడు నాశత్రుఁడితని శిక్షింతునను చు
నతని నడఁచి త్రొక్కెడు నాతఁడత్యధముఁడు
అందఱకు నేను దాసుఁడ ననుచు శిరము
నవనతము సేయు నాతఁడే యత్యధికుఁడు

పానుగంటి. బుద్ధ. 3

## అధ్యయనము

తనకే విద్యాభ్యాసంబున ముఖ్యఖ్యాతి లాభములు సిద్ధించున్
ఘనతరముగఁగల పురుషుం డనఘుండయి నేర్వవలయు నా
సద్విద్యన్

బైచరాజు వేంకటనాథ కవి. పంచ. I–162

తఱచు చదువు చదువ తర్కవాదమె కాని
దివ్యమైన తెలివి తేటపడదు

వేమన

వేదబాహ్యముగాని విమల మంత్రమును
గురూక్త మార్గమున జపించుటయు నధీతమగు

సూరన. కళా. V–154

పొలుపొంద గురుముఖంబున నేర్వ కిట్లు
బలిమి తపంబునఁ బడసిన విద్య
జగతిలోపల నెట్టి సాధులకైనఁ
దగ ఘనమదము మత్సరముఁ గావించు

సోమన. ద్విప. భార. అరణ్య అను. 56

చదువనివాఁ డజ్ఞుండగు

పోతన. భాగ. VII-130

చదివిసంగాని చిత్తంబు కుదుటఁబడదు
హృది కుదుటఁ బడకుండఁగఁ జదువు లెట్లు

పానుగంటి. విప్ర. 4

అనపత్యత

వినవయ్యా యేక పుత్త్రుఁడు
ననపత్యుఁడు నొక్కరూప

నన్నయ. భారతము. ఆది. IV-181

స్వర్గద్వారం బన పత్యులు
గాన నోపరటె మునులయ్యున్

నన్నయ. భారతము. ఆది. V-99

ఎంత తపంబొనరించియు
సంతానము లేని వారు సద్గతిఁ బొందంగాంతురె

నన్నయ. భారతము. ఆది. VIII-299

ధనము లెంత గలిగినను సుతరహితుల
కెమ్మెయిని మనఃప్రియమ్ము లేదు

నన్నయ. భారతము. అరణ్య. I-81

కుల ముద్ధరించు కొడుకులు లేకున్నఁ గోటి పుణ్యములఁ
బడయ రుత్తమలోక పదము లెవ్వారు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. బాల. 11

సంపదలబ్బనేని, లేబరముగాదె బిడ్డలు లేని బ్రతుకు

నాచన సోమన. ఉ. హ. వం. ఆ. II–16

.........లక్షణ వతులై
పుత్ర విహీనతఁ బొరసినఁ
బాత్రములే సతులు పతులు పాటించుటకున్

నాచన సోమన. ఉ. హ. వం. ఆ. II–81

సుతులం గానని వారికి గతిలేదు ముదంబు లేదు

మల్లికార్జునుఁడు. భాస్కరరామాయణము. బాల. 50

అపుత్ర కులకుఁ బుణ్యలోకంబులులేవు

శ్రీనాథుడు. శివరా. II

సుతుఁడు వెలియైన బ్రదుకేమి సొంపుదలఁప

నృసిం. కవికర్ణ. ప్ర. 137

పుత్రులు లేనట్టి పురుషు భాగ్యంబు
విపినంబులోఁ గాయు వెన్నెలరీతి
కొడుకులు లేనట్టి కోమలి బ్రతుకు
పూచికాయనియట్టి భూజంబు విధము
పున్నామనరకంబుఁ బొందకుండంగఁ
దల్లిదండ్రులఁ గావఁ దనయుఁడెకర్త

శ్రీనాథ. పల్నాటి వీరచరిత్ర

కులవర్ధనుండగు కొడుకుఁగానని యట్టి లాఘవాస్పదుని
యాలయము లయము
రహి నిహపర సుఖప్రదుఁ బుత్రునెత్తని వర పుణ్యహీను
భవమ్ము వమ్ము
పితరుల ఋణముఁ బాపెడు సూనుఁజెందని దౌర్భాగ్య శీలు
గోత్రమ్ము త్రమ్ము
సిరులకుఁ దొడవైన వరసుతుఁబడయని ఘనకలుషాత్ము జీవనము
వనము

చెలువమరు ధర్మమునఁబు
త్రలలామముఁ బడయ లేమిఁ దాపసనాథా
కుల వ్యావర్తన మగునా
కలుషపు జీవనము కంటెఁగష్టము గలదే

సూరన. రాఘవ. I–45, 46

వారణవాజి వధూవసు
వారాత్మకమైన రాజ్యవైభవ మిదిదా
నౌరసుఁడు లేని కతమునఁ
జారుముఖీ! యెన్న లేని సస్యమకాదే !

తెనాలి. ఉద్భట II–21

ధాత్రిం బున్నామ్నో నర
కాత్త్రాయత యనవె శ్రుతులు గణ్యచరిత్రుం
బుత్రుంగనక నరుండు జ
గత్త్రితయము నేలెనేని గతిఁగనఁ గలఁడే ?

తెనాలిఅన్నయ్య. సుదక్షిణా II–40

సుతహీనత మదిచింతిలు వెంతవారు మానరు సుమ్మీ

రుద్రకవి. నిరం. I–64

కడుపారఁగ ముద్దుల పట్టిఁ గానఁగా
నోఁచని యింతి జన్మము గనుంగొన రిత్త

తరిగొప్పుల మల్లన్న. చంద్రభాను చరిత్రము. I–87

కొడుకుల్ పుట్ట రటంచు నేడ్తు రవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నేగతుల్
వడసెం? బుత్రులు లేని యాశుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్?
చెడునే మోక్షపదం బపుత్రకునకున్? శ్రీకాళహస్తీశ్వరా!

దూర్జటి. కాళ. శతకము

కొడుకులు లేనట్టి గోత్రాలి మనువు
అడవిఁగాచిన వెన్నలై పోవుఁ గాదె

తిమ్మయ. ద్విప. భార. అది. IV-232

తనయుల గుణవంతులఁ గాం
చని మానవపతుల సకలసంపద లెన్నన్
వనమునఁ గాచిన వెన్నెల
కెనగా వృథయగును సుమ్మి

అ. వీరభద్రకవి రాఘవ పాండవ యాదవీయము

కొడుకులు లేనివాని బ్రదుకున్ బ్రదుకే
పరికించి చూచినన్

వరద. శ్రీరంగ మా.

చిన్ని పాపఁడుండని యిల్లు చిన్నఁబోవు

జగద్గురువు. కుమారి సుందరి. III–6

జగతి సంతతి లేనట్టి జనుల కలిమి
యొలమి వెలయింపఁ జాలునే

చే. వెం. కృ. కవి. నయనోల్లాసము

గొడ్డాలు బ్రతుకేల కోటి ధనమేల
స్వారాజ్య మిచ్చినా సవతి పోరేల
పుత్రులు లేనివారికి పుట్టగతి లేదు

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి సంపాదితము. స్త్రీలరామాయణపు పాటలు

## అనవధానత

భూపతులకు ననవధానమునఁ బుట్టు ననే కాపదలు

తిక్కన. ని. రా. VIII–80

అనవధానత నావగింజంత సూవె
పర్వతంబంత యపరాధ భరము

శ్రీనాథుడు. భీమ. II–158

## అనాత్మజ్ఞత

మదిఁ దమ్మెఱుంగని మంద బుద్ధులకు
నెదిరి యంతస్తుల నెఱుఁగుట తలఁప
జీఁకు దర్పణము వీక్షించిన యట్లు

గౌరన. నవనాథ IV–223

ఏందకు లెఱుఁగరు నిజదోషములను

నీతి పదములు. I–14

## అనుచితము

### అనుచిత క్రియలచే నందునే ఫలము

గౌరన. నవనాథ V-269

పేదవారి తోడఁ బెనఁగరాదు

వేమన

కుంటి కుక్కకేల కుందేటి పరువులు ?
పిరికి బంటుకేల బిరుదు గొడుగు ?
ముసలిదాని కేల ముసిముసి నగవులు ?

వేమన

న్యాయాధీనము లింతే నిఖిలప్రపంచమును
నీకు నరుహంబైన నిండిన యీ మనసు
కాకు విషయాల పాలుగా నరుహమా ?
చేకొని నీవు పెరకేఁచిన యీ చైతన్యము
పైకొని అకర్మముల పాలు సేయఁదగునా ?

తా. అన్నమయ్య. అధ్యా. సం.

పరిహరించుట కీడు తెరువరిఁ బసిబిడ్డ
నర్థి నాఁకటిచేత నలయువాని

తెనాలి రామకృష్ణుడు. పాండు.-IV-166

పట్టరాని వధూటి నిటు చేపట్ట రాదిలఁ
బ్రేమతోఁ జేఁపట్టునెడ నాపట్టు
వదలుట పాటిగాదు

దినవహి అమోబలకవి, గరుడాచలము. 31

అంతఃపురంబులో నతిమైత్రి తగదు
కాంతలు సభనున్న( గాన్పింపరాదు

తిమ్మయ. ద్విప. భార. విరాట I–11

రానిపోని ప్రయోజనంబులు పూనుకొన( దగవౌనె

కంకంటి పాపరాజు. విష్ణుమాయావిలాసము. 20

కలవి లేనివి దొరసమ్ముఖమున(
గలదటంచు(బలుకంగ వచ్చునె?

రఘునాథరాయలు. వాల్మీకిచరిత్ర. III–85

పెన(గకు పిలువని పేరంటమునకు

విజయ రాఘవు(డు. పూతనా హరణము. య. గా.

ఆదాయ మెఱు(గని అప్పు సేయ(గ రాదు
పలువుర ద్వేషము పడ(గరాదు

నూరకవి. రామలింగేశ శతకము. 51

ఎంగిలాకున సోమరి, రంగని గుడి
భక్తు(డుంటయె యుచితత వా(డుగుడి ని
తందు పెంట్నపై నుండ నింద్యంబు గాదె
యనుచిత గతి యెట్లైన దూష్యంబు సుమ్ము

పానుగంటి. విప్ర. V

అనుబంధము

నరకంబైనను నాకమైన మది నానందంబు గావింపదే
పురుషుండింతియు( దాను(గూడి చనినన్

అనంత. భోజరాజీయము. VII–194

ఎక్కడి సతు లెక్కడి సుతు
లెక్కడి బంధువులు సఖులు నెక్కడ భృత్యుల్
డొక్కవడిపోవు వేళల
జక్కటికిని నెవరురారు సహజము వేమా!

వేమన

సతు లెవ్వరు సుతులెవ్వరు
హితు లేవ్వా రేటి వఱద నెందే నొకచో
జతగూడిన కాష్ఠంబుల
గతి నించుక గూడి విచ్చి కదలుదురవలన్

రఘునాథ రాయలు. వాల్మీకి చరిత్ర. II–35

జగమున నొక యంగనయే
మగవానికి సంకిలండ్రు మరి శత శతముల్
తగులంబగుచో నేగతి
యగునోయది యెంత గిజగిజాయెనొ హరికిన్

దా. శ్రీ. దేవీ భాగ. V–20

పొత్తులన్నవి సంపదలకే
ఆపదల కగునే?

గురుజాడ. ముత్యాలసరాలు

ఉత్తములకును నధముల కుప్పు నిప్పు
గలసినట్లుండు సఖ్యంబు గాంచగాను

వరదరాజ శతకము

## అనుభవము

విను మనుజున కెవ్విధమునఁ
దనచేసిన సుకృతదుష్కృతంబులు నెరయం

దనకనుభవింపఁ బాలివి
తనువు సెడుఁగాని కర్మతతి సెడ దనఘా

తిక్కన. భారత. అరణ్య. IV–172

అనుభవమునకుఁ బ్రాప్తమైనది
తనకుఁదానె వచ్చి తగిలికాని పోదు
తనకర్మవశంబించుక దైవకృతంబొక యించుక
మనసువికారంబించుక మానదు ప్రాణులకు
కిందు పడిమఱి కాని గెలుపెఱుఁగరాదు
అటమటపు వేడుకల నలయించి మఱి కదా
ఘటియించుఁబరము తట్టులైన దైవము
ఎండ దాఁకక నీడ హితవెఱుఁగ రాదు
తినక చేఁదును దీఁపు తెలియనే రాదు

తా. అన్నమయ్య. అధ్యా, సం.

స్వానుభూతి లేక శాస్త్ర వాసనలచే
సంశయంబు విడదు సాధకునకు

వేమన

అనుదినము తత్త్వశాస్త్రము
లనువుగఁ దాఁజదివిచదివి యందుల యర్థం
బను భవముగాక యుండిన
తన చదువులు వ్యర్థమాయె దత్తాత్రేయా

పరమానందయతి. దత్తాత్రేయ శతకము

ఆసక్తి లేక యత్నాయత్నత ఘటించు
ననిషిద్ధ సుఖముల ననుభవింపు

కనుపర్తి అబ్బయామాత్యుఁడు. కవిరాజమనోరంజనము I–174

ప్రాగ్జననకృత్యజమిది ప్రారబ్ధమనుభ
వమునఁగాని శాంతింపదు బాధమాకు
వలదనిన నోసరిలునె? కాపాడవలయు
నంచు నుండిన స్వాధీన మగునె నీకు

పానుగంటి. విజయరాఘ.–III

అనుభవము లేని నరులకు ననుమానము హెచ్చు హెచ్చు
– నభిమానంబున్

గను వారినెల్ల వాదంబున కీడ్చుట వారి నైజము గద ధరిత్రిన్
కాంచనపల్లి కనకమ్మ. జీవయాత్ర. III–240

అనురాగము

ఇలఁబుట్టదు పుట్టియుఁదా
నిలువదు నిలిచియును నొక్కనిజముఁ దిరమై
కలదాఁక నెయిద నేరదు
వెలయాండ్రకు వలపు

నన్నెచోడుఁడు. కు. సం. VIII–165

మించిన చిత్తములో మేలు గలిగిననాఁడు
ఎంచరాని చవులౌ నెంగిలి మోవి

తా. అన్నమయ్య. అధ్యా. సం.

కాని కులముదైనఁ గంటి కింపైనపుడు
విటుఁడు వలచెనేని విడువలేడు

వేమన

అనురాగము లేని మనసున
సుజ్ఞానము రాదు

త్యాగరాజు. విష్ణుకీర్తనలు.–406

తిట్లు దీవనలను గాని తెట్లఁబోవు
ప్రేట్లుముద్దుల నడగును ప్రేల్లఁబోవు
కత్తికౌఁగిలిచేఁ దెగుఁగత్తిఁ దెగదు
రుషకరుణచేతఁబోవును రుషనుబోదు
మాయ ధారాళతను బోవు మాయఁబోదు
శాత్రవత శాత్రవతఁబోదు మైత్రిఁబోవు
మిథ్య సత్యంబుచేఁబోవు మిథ్యఁబోదు
చెట్టమంచిచేఁబోవును చెట్టఁబోదు

పానుగంటి. బుద్ధ—V

అనురాగం బతి దుఃఖం
బున కే హేతువు

విక్రమదేవవర్మ. శ్రీనివాస కల్యాణము IV—121

మనిసేసాలు మనిసిమాటేసాలు
మనిసి వోసనె సాలు మనసేసాలు

నండూరి సుబ్బారావు. ఎంకిపాటలు

ప్రేమించుటకన్న సద్ర్వతమెయ్యది చెపుమా !

బసవరాజు అప్పారావు

అనురూపత

వాటమైన మగవాఁడు దొరికేది వ్రాతఫలము గదవే

క్షేత్రయ్య

పతిభక్తి సౌందర్యవతికి చేకూరిన మణి సానదీరినట్లు
సుగుణంబు వ్యవహార శూన్యుని ఁబొందిన పొందిన పవిజోడు
పూసినట్లు

పైడిపాటి వెంకటనృసింహకవి. మన్నారు కృష్ణశతకము

కులము రూపంబు కొలఁది సద్గుణము వలదె

పూనపాటి వేంకటపతి. ఉషాభ్యుదయము

## అన్నదమ్ములు

తండ్రి పిమ్మట నన్నయ తండ్రి పిన్న
వారలకు నెల్ల నాతని వనిత తల్లి
దల్లి గడచన్నన్

తిక్కన. భారత. అనుశాసనిక. IV–135

అనుజునిఁ దనుజుని యట్లగ్రజుండు
మనుపంగవలె నండ్రు మహిధర్మవిదులు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. కిష్కిం. 244

ఎలనాగలుఁ జుట్టంబులుఁ గలుగుదురెచ్చోటనయినఁ గరమరుదారం
దలఁప సహోదరు నెలమింగలుగఁగ నెచ్చోటఁబడయఁగాఁ దరమగునే

అయ్యలార్యుడు. భా. రా. యుద్ధ. 1598

అన్నదమ్ములు దమలోనఁబిన్నపెద్ద
వరుసలెఱిఁగియథోచిత వర్తనముల
మెలఁగుచుండుట తమయాంధ్ర సొలపుమాట
లోలిఁజెవిఁబడ్డ పిమ్మట నేలజరుగు

అనంత. భోజరాజీయము. VI–140

తనకు నాప్తుఁడైన తమ్ముఁడు గలిగిన
గోర్కులన్న కేల కొఱఁతనొందు?

పోతన. భాగ VIII–683

అన్నదమ్ముల కుర్వి అన్యోన్యమైనఁ
గన్నుల పండువై గాన్పించుఁ బ్రజకు

తిమ్మయ. ద్విప. భార. ఉద్యోగ. I–34

అన్న పతితుం డయిన నటుగాక
యలవడ సన్న్యాసి యయినను నతని
తమ్ముఁ డాతఁడుండ దార సంగ్రహము
క్రమ్మఱఁ జేసినఁ గలుషంబులేదు

సోమన. ద్విప. భార. శాంతి. I–27

అగ్రజుండు పితృసమాను డవరజునకు

చింతమర్తి. మధ్యమవ్యాయోగము. I–8

అన్నదానము

గ్రహవక్రత్వము మానుఁ బీడలణఁగున్ గర్మక్షయంబొందు వి
గ్రహముల్ రావపమృత్యుదోషములు వేగంబాయు భూపత్యను

గ్రహముల్ గల్గు ననిందయుంబొదవు లోక ఖ్యాతి చేకూరుఁబ్ర
త్యహమున్ దీనుల కన్న దానమిదు పుణ్య ప్రాణికిన్

ప్రౌఢకవి మల్లన. రుక్మాంగద. II–79

అన్నమిడుటకన్న నధిక దానంబుల
నెన్ని చేయనేమి యెన్నఁ బోరు

వేమన

పూజించి యశన మెప్పుడుఁ బెట్టు నధిక
తేజుఁ డుర్విని యుండి దేవత్వ మొందు

తిమ్మయ. ద్విప. భార. అరణ్య V–99

## అన్నము

అన్నమధికమైన నమర మృత్యువునిజం
బన్నమంటకున్న నాత్మ నొచ్చు
చంపఁబెంప బువ్వె చాలదా వెయ్యేల ?

వేమన

అశన నియమమున్న యతనికిఁ గాయస్థ
దోషసమితి యంత తొలఁగిపోవ
స్ఫటిక తుల్యమైన శాశ్వత దేహంబు
నిల్చి వెలుఁగుచుండు నిర్మలముగ

పానుగంటి. చూడామణి–II

## అన్యాయము

.........అన్యాయ కార్య చింతనము
భావింప నఖిల విపత్కారణంబు

గౌరన. నవనాథ. V–253

అన్యాయ మెన్నఁడు నవనిఁ జేయకుము

సోమన. ద్విప. భార. అశ్రమ I–8

అన్యాయ వర్తనులు
పట్టినపని గాదు బలమెంత యున్న

తిమ్మయ. ద్విప. భార. విరాట. II–47

...అన్యాయ మగు గెలుపు
మదిగోర రార్యులుమాట లెట్లున్న

తిమ్మయ. ద్వి. భా. భీష్మ. I–218

## అపకారము

తెరవాటు గొట్టి తెచ్చి తేగమిచ్చే కీర్తికంటె
నొరుల నొప్పించక యుండుటే చాలు
పరుల బాధించి సంపదలఁ బొందుటకంటె
ధర దున్నుకొని బ్రదుకు దారిద్ర్యమే చాలు.

గార్లపాటి లక్ష్మయ్య. ఏగంటివారి వచనములు

ఉపకారికి నుపకారము
విపరీతము గాదుసేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడు నేర్పరి.

సుమతీ శతక.

ఒకని యపకృతి ద్విగుణమై కర్తనంటుఁ దుదకు

పానుగంటి. రాఘ. 1II

ప్రాణగొడ్డం బెద్ది వచ్చినన్నుంతయు
జనముల కపకృతి సల్పరాదు

ఆ. నారాయణదాసు. యథార్థరామాయణము 116

మారొనర్పకు మేయపకారికైన

ఆ. నారాయణదాసు. జానకీ శపథము III

వినిగూఢమొ బహిరంగమొ
ఘనమో స్వల్పంబొ తానొ కా కితరుండో
పొనరించుట యుపకారం
బును నపకారులకు నది ప్రమోదము సేయున్

వడ్డాది సుబ్బారాయకవి. వేణీ సంహారము XI-14

ఇతరులకుఁగీడు సేయుఁగ
మతి నెంచిన వాఁడు తానమడియుఁ జెడివడిన్

శ్రీపాద. శ్రీకృష్ణభారతము. అరణ్య VII–285.

పరాపకృతి కిన్న లేదు పాపము

తిరుపతి వెంకటకవులు, నానారా. సం

## అపకారి

తగునిది తగదని మొదలో
వగవక సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగిఁజేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబులయిన భయంబుల్

నన్నయ. భారతము. ఆది. I–76

సర్వప్రకారంబుల నపకార కారణులయిన వారిం
బరుల నయిన బాంధవులనయిన నుపేక్షింపక
యాత్మరక్షా పరుండవయి దూరంబు సేసి దూషించునది

నన్నయ. భారతము. ఆది. IV–120

అహితమొకని కించుక యెవ్వఁడాచరించు
నజ్ఞుఁడై వానిఁదత్ఫల మపుడపొందు.

మారన. మార్కండేయ. VIII–10

అన్యదోషకారి దన పాపమునఁ దాన కాలిపోవు

ఎఱ్ఱన. భారతము. అరణ్య. V–39

## అపకీర్తి

.........అపకీర్తి లేని జీవనము
నిక్కంబుగా నొక్కనిమిషంబె చాలు

గౌరన, హరిశ్చంద్ర. II–258

ఎవ్వరెఱుఁగకుండ నెప్పుడు పోవునో
పోవు జీవ మకట బొంది విడిచి
యంతమాత్రమునకె యపకీర్తి నెఱుఁగక
విఱుగ బడును నరుఁడు

వేమన

భూమిని నిందఁజెంది మృతిఁబొందిన యయ్యపకీర్తి భాజనుం
డామిహిరేందు తారముగ నాపదఁబొందును రౌరవాదులన్

పావరాజు ఈ. రా. VI–216

మనసు కంటెను ద్రుతగతి జనును దుర్యశమ్ము

నారునాగ నార్యకవి. ఆర్యవాణి.–22

## అపనింద

సడికంటెఁ జావుమేలు

తిక్కన. నిర్వ. VI

ఏపాప మేని లేనిది
కాపురుషత నొకని మీఁదఁగల్గించిన న
ప్పాపము సేసినవాఁడగు
నాపోలువ యనంగవిందు మార్యుల చేతన్

తిక్కన. భారత. శాంతి. III–439

పుడమినప్రథయగు నెడఁ
బడఁతికి దేహంబు విడువఁబాడియకాదే

సడికంటెఁ జూవుమేలను
నొడువు పురాతనముగాక నూతన పదమే

అనంతా. భోజరాజీయము. VII–157

ఘనులకు నపవాదుకన్నఁ గష్టము గలదే ?

తిరుపతి వెంకటకవులు. శ్రవణానందము. II–6

అపరిణతి

గురు వచనంబతి నిర్మలంబయ్యు
సలిలంబునుంబోలె శ్రవణస్థితంబై
యభవ్యునికి శూల పుట్టించు

శ్రీనాథ. కాశీఖండము. IV–98

అపరిపూర్ణత

పూర్ణ దుశ్శీలుఁడెవ్వఁడుఁ బుడమి లేఁడు
పూర్ణ సచ్ఛీలుఁడెవ్వఁడు భూమి లేఁడు
మంచితన మెక్కువగనున్న మంచి వాఁడు
చెడ్డ తన మెచ్చుగా నున్నఁ జెడ్డ వాఁడు

కూచి నరసింహం. రూపలత. II–5

అపాత్రదానము

పాడియు నాడియు బ్రతుకువారలఁబరి హాసకు దుర్జనునంగహీను
మత్తుని ముచ్చు నున్మత్తు నపుంసకుఁ జెనఁటి మాటలఁదేల్చు
మనుజుఁ గులము
చాలమి వేదంబు చదువమి నిజవృత్తి హాని దుర్వృత్తి గలట్టి
వాని
దానపాత్రంబులు గానియ్య కొనరు పెద్దలు దీనుఁడును విప
ద్బాధితుఁడు

నీగి కర్షులు దయపేర్మి నిచ్చుచోట
నైన నవగుణ మెక్కుడై కానఁబడిన
నిందితాత్ములకిచ్చుట నిష్ఫలంబు
పాత్ర నిశ్చయ మిట్టిది

తిక్కన. భారత. శాంతి I–329

మంమునకు బిడ్డ నిచ్చిన చందమొందు
బూదిలోనేయి వేల్చుటఁబోలునోటి
కడవనీళ్ళులు వెట్టిన కరణి యగు న
పాత్ర జనులకుఁబెట్టుట

తిక్కన. భారతము శాంతి I–332

..................పాపో
త్పన్నులకు వరము లిచ్చుట
పన్నగముల కమృతమిడుట పంకజగర్భా

పోతన. భాగ. VII–383

రిత్త వారికి మదోద్రేకంబు తోడ
నుత్త మార్థంబుల నూఱ కిచ్చినను
నవ్వారె జనులు ధనంబు గల్గినను
గ్రొవ్వునఁబాఱ గ్రక్కున వైవఁదగునె

సోమన. ద్విప. భార. కర్ణ. III–4

## అప్రయోజకులు

శాస్త్రమాచార్య సన్నిధిఁజదువఁడేని
నిద్ధబోధంబుమది సంగ్రహింపఁడేనిఁ

దెగువ మీఱి ప్రతిజ్ఞ సాధింపఁ జేని
జ్ఞాతి జయమందఁ జేని తజ్జనుఁ డనుజనుఁ డె?

శ్రీనాథ. కాశీఖండము, I–9

చేతులారంగ శివుని పూజింపఁ డేని
నోరు నొవ్వంగ హరి కీర్తినుడువఁ డేని
దయయు సత్యంబు లోనుగా దలఁపఁ డేనిఁ
గలుగ నేటికి తల్లుల కడుపుచేటు

పోతన. భాగ. I–13

అశక్తుండయిన భక్తుండునుభక్తి లేని
శక్తుండును నప్రయోజకులు, త్యాజ్యులు

బైచరాజు వేంకటనాథకవి. పంచ. V–177

విమవముమవ లేక కుడువఁ గట్టఁగ లేక
వెఱపు లేక విద్య నేరయ లేక
వెడల లేని వాని నడపీనుఁ గందురు

వేమన

శత్రుని సాధింపఁ జాలని రాజు
పుత్ర సంతానంబుఁ బొరయని మనువు
నురుకీర్తి లాభంబు నొరయని ధనము
చిరకీర్తి వృథయని చెప్పఁగా వినమె

తిమ్మయ. ద్విప. భార. ఆది. I–15

మరికొఱ మాలిన మానిసి కన్న
వేవేల రెట్టులు వెఱబొమ్మ మేలు

ఆ. నారాయణదాసు. వేల్పుమాట. 22

గొడ్డుబోతు బర్రెఁగొని పెంచు వారును
తాలు వడ్లఁదెచ్చి దంచువారు
సములు నిన్ను గనని సంసారి జనములు
పాపభయ విభంగ భావలింగ

భా. లిం. శ. 11

అప్రియము

ప్రియవస్తు వెడలుటయున
ప్రియంబు వాటిల్లుటయుఁ బరిజ్ఞాన విని
శ్చయహీనులైనయల్పా
శయులకు దుఃఖంబుచేయు

తిక్కన. భారత. స్త్రీ I–30

జననీ జనకుల కప్రియ
మనఁజను సద్ధర్మమైన నది దురితము కా
మును లుగ్గడింతురు

ఎఱ్ఱన, నృ. పు. V–15

ప్రియము పలికెడు వారిన పెద్దమెత్తు
రప్రియంబును బథ్యంబునైన పలుకు
వినఁగ నొల్లరు గావున వేడ్కఁదానిఁ
బలుక రెవ్వరు నుత్తమ ప్రతిభులయ్యు

మొదల నప్రియమయ్యును దుదిఁ గరంబు
పథ్యమగుపల్కుఁ బ్రియులందు బలిమినైనఁ
బలుకవలయు మోమోడక

నన్నయ. భారత సభా. II–19, 19

ఒరులేయవియొనరించిన
నరవర యప్రియము లవి మనంబునకగుఁదా
నొరులకు నవిచేయకునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్

తిక్కన. భారత.

దుష్టజనునకు నీతివాగ్ధోరణివలె
కఠినమానసున కనూన గానమువలె
విరసజనునకుఁ గవితానివేదనంబుఁ
బోలె జ్వరితునకగుఁగాదె భోజనంబు

పానుగంటి. నర్మ. వ V

అభాగ్యుఁడు

విహీన భాగ్య దుష్కృతులకుఁ
బరమ తీర్థసేవఁ బడయనగునె

నన్నయ. భారతము. అరణ్య. II–241

భాగ్యహీనునకును పరుసవేదిదొరుక
నదియునిల్వ దపుడె వదలుఁగాక
వానతోడవచ్చు వడగండ్లు నిల్చునా

వేమన.

ఇంట బంగరు తొట్లలో నిడిననైనఁ
జచ్చుఁ దల్లి కడుపు చల్వ చాలదేని

కం. వీ. లిం. పం. ఉత్తర. I–138

నిఖిలలోకులకును నీరిచ్చు మేఘుండు
పిడుగువైచు భాగ్యవిముఖు మీఁద

వేదము వేంకటరాయశాస్త్రి. ఉషానాటకము. V–83

## అభావము

అల్లుని మంచి తనంబును
గొల్లని సాహిత్య విద్య కోమలి నిజమున్
బొల్లున దంచిన బియ్యముఁ
దెల్లని కాకులును లేవు తెలియర సుమతీ

సుమతీ శతకము

నేర్పుకంటెఁ బెన్నిధి గద్దా ?
ఓర్పుకంటె సుఖమొకటిఁకఁ గద్దా ?
కరుణకు నెక్కుడు గతియిఁకఁ గద్దా ?
సరసతకెక్కుడు సరిగద్దా ?
గురుమతిఁజిత్తము కూరిమి నిలిపిన
వెరవు కంటె విధమిఁకఁ గద్దా ?
కలిమి కంటెఁజేఁకటి మరికద్దా ?
బలిమి కంటె నాపద గద్దా ?
గెలుపు (గఁ) దెలిసి లంకించిన మదితోఁ
జెలఁగు కంటె నిజసిరి యిఁకఁగద్దా ?
ప్రాయము కంటె నపాయము గద్దా ?
కాయపు రోఁతకుఁగడ గద్దా ?

తా. అన్నమయ్య, అధ్యా. సం

అడుగంబోవుట కన్న లాఘవము కన్యాదానముంబోలి చొ
ప్పడు దానం బనృతంబుకన్న ఘనపాపం బర్థి యాచించిన
న్నడి దానిచ్చుట కన్నఁ గీర్తియును నెవ్వాన్నాందు కన్న న్వెత
ప్పడ మిన్లేవు తలంప

సాహెబురాణ రామన్న. సీతాపతి శతకము

అచ్ఛమగు నీశ్వరకై లొంగనట్టి త్రాచు
పైనకును బడి కాపులు వడనిబంటు
సతికి లొంగని మగవాఁడు స్తుతికి వశ్య
గాని యోఁడుది యుఁకముండు గలుగవలయు

వణిజునకు యథార్థత న్యాయవాదికి మొగ
మోటమియు విదూషకునకు మాట కొంకు
తొత్తునకులజ్జ సమరయోధునకు భయము, వృలే.

పానుగంటి. కోకిల ||

## అభినివేశము

తనిసిరే వేల్పులుదధి రత్నముల చేత .
వెఱచిరే ఘోరకాకోల విషముచేత
విడిచిరే యత్నమమృతంబు వొడము దనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు

లక్ష్మణకవి. సుభాషితములు

## అభిమానము

దేహాభిమానము తెగవిడిచినంగాని
ఈహాల దేవుండు తన్నేల మెచ్చును?
సాహసించి కోరికల సంగము మాన కుంటె
ఓహో పరమ పదమూరకేలకలుగు?
నిచ్చలును వైరాగ్య నిష్ఠుండు కాకుండి తేను
ఎచ్చిన జన్మాదు లెల్ల నేల కడచు?
కొచ్చి కొచ్చి తనలోని కోపముడుగ కుండితే
అచ్చపు బ్రహ్మానంద మదియేల కలుగు?

భావించి తనలోని భక్తి నిలుప కుండితే
తావులన్నిటను సంతత పుణ్యుండవునా ?

తా. అన్నమయ్య. అధ్యా. సం.

మతిలోని దేహాభిమానంబు విడుచుటకు
రతి పరాఙ్ముఖుఁడుగాక రపణంబు లేదు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

మానసమున దేహాద్యభిమానము లేకున్నచోఁ బ్రమాదము
గలదే ?

పు. తిమ్మన. సమీర. IV-107

నిజదేశంబుల వేషభాషలపయి న్నిత్యాభిమానస్థులై
ప్రజమెచ్చ న్నసలుబ్ధ బుద్ధులగుచుం బ్రాజ్ఞుల్ స్వదేశ్యంబులే
నిజమంచుంగాని యన్యదేశముల వానిన్మెచ్చరే పట్టునన్

అప్పకవీయము. I-224

.........అభిమాన రక్షకులైనవారు
దొలఁగు సమయంబునకుఁదామె తొలఁగిపోక
ఒరులచేఁ ద్రోపుఁ బడుదురె పలుచనగుచు

ధరణి దేవుల రామయమంత్రి. దశావతారచరిత్ర. III-86

అభ్యర్థన

వేఁడుటెంతయుఁ గష్టమైనను
వెఱులేనిసుహృజ్జనున్ వేఁడికో లుచితంబ

నన్నయ. భారత. ఆది. V-218

అడుగఁడగు వారినడుగుట
యిడిన మొడం గొసరకుంట యీాశేననఁగా

గడ్డుపై వేడక యుండుట
యడిగెడువారలకు నీతియగురా వేమా!

వేమన

## అభ్యాసము

అనఁగనఁగ రాగ మతిశయిల్లుచునుండు
దినఁగఁదినఁగ వేము తీయనుండు
సాధనమునఁ బనులు సమకూరు ధరలోన –

వేమన

వగరు జేదును నభ్యాస వశముచేత
వెగటు దోఁపక తినెడు వారికి రుచించు

చిలకమర్తి. గయోపాఖ్యానము

తెలిసియు నలవాటు తెగసేయలేవు

ఆ. నారాయణదాను. వేల్పుమాట. 52

## అభ్యుదయము

మంచి గతమున కొంచెమేనోయ్
మందగింపక ముందు అడుగేయ్

గురుజాడ. ముత్యాలసరాలు

## అయోగ్యత

అది సభయే ప్రియంబెసఁగ నార్యులు నిల్వరయేని నార్యులే
మదిఁదలఁపంగ వారలు సమంచిత ధర్మము వల్కరేని న
ట్టిదియును ధర్మమే తగఘటించిన నిక్కము లేద యేనిఁదాఁ
బదిలపు నిక్కమే యొక నెపంబిడు చొప్పగు నేని భూవరా!

తిక్కన. భారతము. ఉద్యోగ. II-70

అతి రోషుండయి శాంత
స్థితికి మతిం గపట మూఁది చెలిమికి సుఖసం
గతుఁడై విద్యకుఁ బరుష
వ్రతుఁడయి యంగనకు నాస పడఁజన దెందున్

బైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము. I-670

కాముకుఁడైన వాఁడు ధనకాంక్ష వహించిన వాఁడు మత్తుఁడుం
బామరుఁడైన వాఁడుఁ బరిపాటి నెఱుంగనివాఁడు మూర్ఖుఁడు
న్నోమర సేయువాఁడు మఱి ముక్తిని గాంచునె?

వేమన

కాయ మనిత్యమన్ దెలివి గానక మంత్రలయాది యోగసో
పాయములైన సిద్ధులను బ్రజ్ఞలుగాఁదలపోసి మూఢులై
మాయల నందువారు నసమంత్రపు యోగులుగాని ముక్తికిన్
దాయఁగలేరు వీరలకు దంభమె మోక్షములెంచి చూడఁగన్

ముమ్మడి మల్లన. శ్రీరామస్తవ రాజము

పేడివానికి నేల పెద్దఱికంబు

తిమ్మయ. ద్విప. భార. ఉద్యోగ. III-84

కపటవచనముల నిస్త్రిపునకు నిర్వాణమబ్బదు

కొక్కొండ వేంకటరత్నం, నరకాసుర విజయవ్యాయోగము

## అరసికత

సరసకవిత రుచి యెఱుఁగని
పురుషులఁ బశువులని నిక్కముగ నెఱుఁగుఁడు వా

రురవడిఁ దృణంబు మేయమి
పరికింపఁగ ధరణి పసుల భాగ్యం బెందున్

అభినవ భోజుఁడు. నీతి భూషణము

భువినట్లు గాదె యువతియుఁ
గవితయు సహజ ప్రసంగ గతినొందినచోఁ
దివిరి కడు బల్మి చేసిన
నవి సరసత యుడిగి విరసమయి చను టరుదే

అనంత. భోజరాజీయము. VI-21

గురుతర మైన కావ్యరస గుంఫన కబ్బుర మంది ముష్కరుల్
సరసుల మాడ్కి సంతసిలఁ జాలుదురోయి ?

కంచర్ల గోపన్న. దాశరథీ శతకము 12

చెవిటివానికి సత్కథా శ్రవణమేల
సరసకవితా రసంబు ముష్కరునకేల

ఆడిదం సూరన. రామలింగేశశతక.

## అరాజకము

అవని యరాజకంబయిన యప్పుడ భూ ప్రజయందు సర్వ ధ
ర్మవులుఁ దొలంగు దేవముని ముఖ్యులు వాయుదు రోలి వృష్టిలే
దవు మఱి యర్ఘ్యవుల్ దఱుఁగు

నన్నయ భారతము. ఆది. IV-250

రాజు నశించిన రాజ్యమందు
బలవంతుఁడగు వాఁడు బలహీను పశుదార

హయ సువర్ణాదుల నపహరించు
జారచోరాదులు సంచరింతురు ప్రజ
కన్యోన్య కలహంబు లతిశయిల్లు

పోతన. భాగ. I-483

గోపకులకాఁపు లేకున్న గోగణంబు
ప్రోపుమాలి నాశనమును బొందునట్లు
భూపతులఁ బ్రాపు లేకున్న భూమి ప్రజలు
ప్రోపు మాలి వినాశంబుఁ బొందఁగలరు

వేటూరి ప్రభాకరశాస్త్రి. ప్రతిమా నాటక. III-70

## అరిషడ్వర్గము

మదముఁ గామంబుఁ గ్రోధంబు మత్సరంబు
లోభమును మోహమును నను లోనిసహజ
వైరి వర్గంబు నోడిచిన వాఁడ యొదుచు
నశ్రమంబున వెలుపలి యహిత తతుల

నన్నయ. భారతము. అది. III-206

మను జేంద్ర సంకల్పమునఁబుట్టుఁ గామంబు
రూపఱు దేహ నిరూపణమునఁ
బరుల దోషంబునఁబ్రభవించుఁ గ్రోధమ
క్షీణ క్షమా యుక్తిఁ జేసి పొలయు
భూతాస్థిరత్వంబు బుద్ధిఁగానమి లోభ
మానఘు జనించుఁగాంచిన నడంగు
నజ్ఞానమున మోహ మావహిల్లు నధర్మ
లేపవర్జనమున లేక తక్కుఁ

కులమునను విద్య ధనమునఁ గలుగు మదము
మరలి వాని పెంపూహింప మ్రందిపోవు
సాత్త్వికుఁడు గామిఁబొడము మాత్సర్య మదియుఁ
జెడుఁ (గురూత్తమ) సాధు సంసేవనమున

తిక్కన. భారతము. శాంతి III-421

కామంబుం బెడఁ బాచుఁబండితుఁడు సంకల్పంబు వర్జించి ని
ద్రా మోహంబు నడంచు సత్త్వగుణచింతన్ లోభముం బ్రాజ్ఞ సే
వామ్రుదందోలఁగించుఁ గ్రోధము శమ వ్యాప్తిన్ మగుడ్చున్
మతి
శ్రీమాన్యా భయ మప్రమాదమున నిర్జించున్
దృఢస్వాంతుఁడై

తిక్కన. భారత. శాంతి. V-116

కామక్రోధ మదాది నిర్జితుఁడు
దుష్కర్ముండునై యుండువాఁ
డీమై నెవ్వరి చేతనేనియు రమాహీనుండగున్ వేల్మిడిన్.

ఎఱ్ఱన. నృసింహ. II-139

నిన్ను నిబద్ధుఁజేయునీ
భీకర శత్రులార్వురఁ బ్రభిన్నులఁజేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁడొకఁడు

పోతన. భాగ. VII-267

మాలతనము వంటిది మతిందగులు గామము
అలరి మట్టు వంటిది యంటుం గ్రోధము

కేలి నొదిగించు నెంగిలి వంటిది లోభము
చుట్టి మద్యము వంటిది చొక్కించు మోహము
వట్టి మాంసము వంటిది వయోమదము
పుట్టిన భ్రమ వంటిది పొదిగిన మచ్చరము
గోడ మఱుంగు వంటిది గుట్టు తోడి సంసారము

అన్నమయ్య. అధ్యా. సం.

కామ లోభాదులఁ గలుషముల్ సేయు
పామరు నట్టి పాపఁబులే చెఱచు

వరద. రామా. అరణ్య. 96

## అరిష్టశంక

కారణము లేక యె ప్రకృతి క్రమము దప్పఁ
గీడు రానున్న దనుచు శంకింపవలయు
హేతు రహితార్తి యెద్దియో హృదయ మావ
రించునపు డాపదను నిశ్చయింప వలయు

పానుగంటి. విజయ రాఘ. I

## అరుదు

ధనముగల చోటఁ ద్యాగంబు తఱచు సున్న
శౌర్యముండు చోట వివేక సరణి మిథ్య
విద్యగలచోట నిలువదు వినయమల్లె
గర్వ శూన్యత చక్కని కాంతకరుదు

పానుగంటి. కోకిల. II

అరూఢి

మేను క్షణభంగురంబౌట మానసమున
నుంచి రేపు చేసెద ననియంట మాన
వలయు సద్ధర్మములనేఁడె సలుపవలయు
నెల్లి మన ముందుమోలేమొ యెఱుఁగరాదు

కం. వీ. లిం. పం. నీతిదీపి. 100

రేపు రేపను మాటకు రూపులేదు

దువ్వూరి రామిరెడ్డి. కుంభరాణా. I-3

అర్థసిద్ధి

పౌరితంబు లేకయ్యేడునర్థసిద్ధి వెడఁగైనను నొల్లక యొందు సేయునే

తిక్కన. భారతము. ఉద్యో. I-304

కావని నట్లయుండి యవుఁ గార్యము లట్లగుటంబ్రయత్న సం
భావననేఁత పౌరుషము పద్ధతి తత్ఫలసిద్ధి వొందుచో
దైవము దోడ్పడన్ వలయు

తిక్కన. భారత. ఉద్యో. III-73

అర్థానర్థములు

అధికారి కాని వానికి
నధిక పదవి దెలుపఁ బ్రాప్తమయ్యెడు పాపం
బధికారియైన వానికి
నధికపదవి దెలుపకున్న నగునిక్కముగన్

నూరన. కళా. II-112

గుళ్ళలోన వేదఘోషంబుదగుఁగాని
సురత శాస్త్రచర్చ జరుగఁదగునె?
మృత గృహంబులోన నేడుపు లోదార్పు
లర్హమగును బోగమాట లగునె

పానుగంటి

## అల్పత్వము

అల్పరసకృతి కెఱఁగుమరల్పు లెల్ల
జెఱకు విడిచిన రసమున కెఱఁగ రాక
పిప్పి కరిగెడునీఁగల పెల్లువోలె

నన్నిచోడ. కు. సం. I–30

ప్రియవస్తు వెడలుటయు నప్రియంబు వాటిల్లుటయుఁ బరిజ్ఞాన విని
శ్చయ హీనులైన యల్పాశయులకు దుఃఖంబుఁ జేయు

తిక్కన. భారతము. స్త్రీ. I–30

అదటఁ బూర్వశాస్త్రముల యర్థము లారఁగఁ గ్రోలి తత్త్వసం
వేద సుధారసంబున చవిం జిరసౌఖ్యముఁ బొంద నేరకి
మ్మేదిని నెందునుందిరిగి మేలని కర్మము చెల్లఁజెప్పు చుం
గాదని శాంతి యొప్పనిదిగాఁ జెడ నాడుదు రల్పబోధనుల్

శాంతిపర్వము. I–141

అల్పమున నిండు శశపద
మల్పంబున నిండు మూషికాంజలి కుఱుచ పెం
చల్పమున నిండు గుపురుషుఁ
డల్పమునం బూర్ణుఁడగు మహాత్ముఁడు గామిన్

బైచరాజు. పంచ. I–137

అల్పుఁడైనవాని కధికారమిచ్చిన
దొడ్డవారిఁ దిట్టి తొలగఁగొట్టు

వేమన

అల్పుఁడెపుడుఁబల్కు నాడంబరముగాను

వేమన

ఆదిమ కవులవలెనల్పుండు తానొగి
జెప్పలేడుగాని తప్పుబట్టు

వేమన

ఎంత చదువు చదివి యే నీతివిన్నను
హీనుఁడవగుణమ్ము మానలేడు

వేమన

తా మొరులను చాలఁదగనాడుదురుగాని తా మొక్క రాడినఁ
దాళలేరు
అతివేడ్క పరుల సొమ్మపహరింతురుగాని తమసొమ్ము
పరులకుఁదగులనీయరు
ఒకరి సంపదఁజూచి యోర్వకుందురుగాని తమ సంపదలమేలు
దలఁచుకోరు
గొందఅల్పులు ధరలోని కోహకముల నెంచి మఱిమించి
గర్వించి యెమ్మెదిరుగు
నట్టి జనులకు యమబాధ లెట్టులుడుగు

సిద్ధరామకవి. సిద్ధరామ శతకము

......సంపద కలరుచుండు
రాపదలకును దుఃఖింతురల్పమతులు

ధా. శ్రీ. దేవీభాగ. III–768

అలఁతి వాని కెక్కువగు ప్రాపు గల్గిన
దిమ్ము వట్టి యొరులఁ దిట్టుచుండు

అ. నారాయణదాసు.

గొప్పవారు తగవుఁ గొను నప్డు తక్కువ
వారిపైని కత్తినూఁటు చుండ్రు

అ. నారాయణదాసు.

గొప్పవాని సాటిఁ గోరి కొంచెము వాఁడు
చేతకాని పనినిఁ జేయఁ జెడును

అ. నారాయణదాసు.

జగతి నెక్కుడు వారితో సమత గోరు
నల్పులకు ధాత గర్వంబు లణపకున్నె ?

తిరుపతి వెంకటకవులు. నానా. రా. సం. 62-28

అల్లుఁడు

పేదలయ్యెను గడు బిఱ్ఱబిగిసియుండ్రు
వట్టి యభిమానములను గర్వములఁ బట్టి
యల్లు వారికి నెల్లనీ యవగుణంబు
వెన్నతోఁ బెట్టినది యింతవిసువనేల ?

శ్రీనా. కాశీ. VII-50

ఎఱుఁగునే అల్లుఁడత్త వారింటి లేమి

సూరకవి. రామలింగేశ శతకము. 61

గడ్డిపోచఁ దెచ్చి కన్య నిచ్చిన యంత
నిగిడి గంట మగుచు నిలుచు నంట

చాటువులు. దశమగ్రహము

గ్రహము లన్నింటికిని శాంతి కలుగు చుండు
జపములం దాన ధర్మాలఁదపము చేత
నల్లుఁడన్ననొ దశమ గ్రహంబు గాన
శాంతిఁబొందునె యేదాన జపము చేత ?

చాటువులు. దశమగ్రహము

కాలకర్మంపుఁబాశానఁ గట్టువడుచుఁ
దాశద్రుమ మొండు నమ్రతఁదవిలి యుండు
నిదియ నాయల్లుఁడని చెప్ప నెవ్వరేని
నిట్ట నిలువున నాతాడి యట్టె నిలుచు.

చాటువులు. దశమగ్రహము

## అవధి

గరగరికలన్నియును గలసి నందాఁకా
విరసంబులన్నియును విసుగు నందాఁకా
ఎడమాటలన్నియును నెనసి నందాఁకా

అన్నమయ్య. అధ్యా. సం

పాయపుమతిలో బలువగు నాసలు
కాయముభువిలోఁ గలదాఁకా
మానదు కోపము మతి చంచలమును
కాని కర్మమిది గలదాఁకా
అందదు మోక్షంబవ్వలనివ్వలఁ
గందువనిను మతిఁగనుదాఁకా

అన్నమయ్య. అధ్యా. సం.

## అవధ్యులు

గురులను మునులను సుకవుల
నరిదూతలఁ బూతలగు నరాంగనల మహీ
సురులను మిత్రుల బాలుర
నిరతము సంపఁదగదెంత నేరకయున్నన్.

నన్నెచోడ. కు. సం. X -156

గోవు బ్రాహ్మణు బాలకుని వృద్ధునంధుని
సఖుఁడోడఁ బుట్టువు జడుఁ బ్రమత్తు
మత్తుని గురుని నున్మత్తుని సుప్తుని
సంగన భీతుని నస్త్రశస్త్ర
నిహతి నొప్పించుట విహితంబు గాదని యార్యులు సెప్పుదురు

తిక్కన. భారతము. సౌప్తి I- 105

వెఱచి దాఁగినవారి వెన్నిచ్చు వారి
ముకుళిత హస్తులై మ్రొక్కెడు వారిఁ
జకితాత్ములై వచ్చి శరణన్న వారిఁ
గదనంబులోఁ బూరిఁ గఱచిన వారిఁ
బిదప నాయుధములు ప్రిదిలినవారి
నిద్రవోయెడు వారి నిర్జింపఁదగునె?

గోనబుద్దా రెడ్డి. రంగ. రామా. యుద్ధ. 406

దీనుఁగృతాంజలి నడిగెడు
వానిన్ శరణార్థిఁజంప వలవదు శత్రుండైనన్

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ.179

చేతవచ్చిన శత్రుఁ జెలఁగి వధింప
బలు పాతకము

శ్రీనాథుడు. పలనాటి. 95

శరణాగతుల వధూ జనుల బాలకుల
దొరకొని హింసించు దోసకారులకు
నిలను ప్రాయశ్చిత్తమే పుట్టదనుచుఁ
బలికెడు శ్రుతి వాక్యపద్ధతి వినవె.

నాదెండ్ల గోపమంత్రి. కృష్ణార్జున సంవాదము

......నిద్రించిన వానినాయుధము
మఱచిన వానిని మసలక పూరిఁ
గఱచిన వానినిఁ గడువడి తోడఁ
బఱచిన వాని దుర్బలుఁడైన వాని
శరణు చొచ్చినవానిఁ జంపినవాఁడు
సరవితో భాస్కర చంద్ర తారకము
లెంతకాలంబుండు నిలమీఁద వాఁడు
నంతకాలంబుండు నట నారకమున

సోమన. ద్విప. భార. సౌప్తిక. I–4

చంపఁదగినయట్టి శత్రువుతనచేతఁ
జిక్కెనేనిఁ గీడుసేయరాదు

వేమన

## అవమానము

ఎఱిఁగియైన నెఱుక లేకయు నొక్కని
భంగపెట్టి పిదప సంగతుఁడుగఁ

జేసి కొనుట మేలె సిరిగలవారికి
నట్టి నిలుపు వాని కగునె హితము ?

తిక్కన. భారత శాంతిపర్వము. III-78

నమ్మినవారిపట్ల శయనస్థులపట్ల బరాభవంబునీ
చమ్మనియెంచి పల్కుదురు

తిరుపతి వేంకటకవులు. మృచ్ఛకటికము. III

## అవస్థ

విరహార్తుల ద్వేషియై దహించున్
విరహాతీతుల నెయ్యుఁడై భజించున్
పరికింతు రవస్థనన్న సూక్తిన్
బరమార్థంబుగఁ బద్మవైరి సేయున్.

వేదము వేంకటరాయశాస్త్రి. ఉషానాటకము. III-53

## అవినీతి

నీతికి బాహ్యులైన ధరణీవర మెత్తురె వారి నుత్తముల్

తిక్కన. భారతము. ఉద్యో. XI-71

నీతి దొఱంగి కార్యముల నెట్టన యుగ్రహవృత్తిఁ జేసినం
బ్రీతిగ సిద్ధిఁబొందినను భీతియుఁగుత్సయుఁబుట్టు.

తిక్కన. భారతము. - సౌప్తి. I-35

నయవిగర్హిత చేష్టుఁడు మాన నీయుఁడే !

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 2275

నీతిలేనివాని నిందింత్రులోకులు, లేదు సేగిలాఁతిలేకయున్న

వేమన

నీమము తప్పకమంచి నీతి
బల్కని వాఁడు మత్తుఁడూ
మూఢ చిత్తుఁడూ

రామదాసుచరిత్ర. 248

నీతిమాలినయపుడు మన్నింపఁదగదు
గురులనైన మరెట్టి భూసురులనైన

అ. నారాయణదాసు. భీష్మచరిత్ర. 21

## అవివేకము

వివేక విహీనులకైన
లక్ష్మి సుచిరమగునె యెందు

నన్నయ. భారత. సభా. I–121

పురుషుఁడు సెఱుగను వాఁడును
బురుషుఁడు సెఱుచునని పలుకుపురుషుండును
నయ్యిరువురు నవివేకులు,

తిక్కన. భారతము. భీష్మ. I–198

తివిరి నిండఁగముంచి యవియొఁగఁ ద్రోయు నవివేకి

నా. సోమన. బన. 190

పెన్నిధి దొరకొని యుండ
జరగడుగఁగఁ బోవు వెరవిఁడి

నా. సోమన. బన. 193

తృష్ణాతంతు నిబద్ధ బుద్ధులగు రాధేయాదులంగూడి శ్రీ
కృష్ణుం గేవల మర్త్యుగాఁదలఁచి మర్దింపంగ నుత్సాహ వ

ద్ధిష్ణుండయ్యె సుయోధనుం డకట, ధాత్రీనాథ! యూహింపుమా
యుష్ణీషంబునఁగట్టవచ్చునె? మదవ్యాఘోగ్ర శుండాలమున్.
ఆధర్వణాచార్యుఁడు. భారతము. ఉద్యోగ.

ఎలుకతోడికోపమున నిల్లేర్చునట్లు
నన్నెచోడ. కుమా. 1-58

మదము పెంపునఁ జేసి మఱి యెవ్వఁడైనఁ
దుది మొద లెఱుఁగక తొడరుఁగార్యంబు
వాఁడు గదా యెల్లవలనఁ జే టొందు
గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ. 454

తనకుఁగానని దయ్యం బెదిరికి వరమిచ్చుననుట చదురే
నాచన సోమన. ఉ. హ. వం. I-97

ఇది యగుఁగాదనఁదగు వారొదవని దుర్మతులఁగీడు లొదవును
ఎఱ్ఱన. హ. వం. IX-29

పాయక చేసిన పనికి రోదనము
సేయుట గతజలసేతు బంధనము
గౌరన. నవనాథ. II-90

మొగిలు లోపలి నీళ్ళు నమ్మి
దొన నీళ్ళుఁ జల్లు వేదుఱుఁ డొందుఁగలఁడె?
గౌరన. హరిశ్చంద్ర. II-273

వృథా బోధకుండు వీఱిఁడి గాడే
బైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము. I-663

వెడఁగుల పని పంపు సేయు వీఱిఁడి గలఁడే
బైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము. I-737

ఎవ్వఁడు మీఁదెఱుంగక యథేచ్ఛసుఖైకరతిన్ జరింపఁగా
నవ్వల వంశహాని వ్రతహాని యశోధనహాని పుట్టుఁదా
నవ్వెడఁగమ్మనుష్యపశు వయ్యవివేకి చెడున్ జగంబునన్
నవ్వఁగఁబాలు రౌరవమునన్ బడఁబాలును నిందపాలునై

మను. I-135

......మిన్ను పడిన
నఱచేతు లిడెదు సాహసు లున్నవారె

తిమ్మయ్య. ద్విప. భార, విరాట. IV-113

చైతన్యమెడలిన శవమును గూర్చి
విలపింప బ్రతుకునా వెఱ్ఱితనంబు

శ్రీనాథ. పల్నా.

మీఁదెఱుంగని వారల కేది సుఖము?

గోగులపాటి కూర్మనాథకవి. మృత్యుంజయ విలాసము. II-48

భూమిలో రాజ్యవిభూతి మంతులకు
కామాంధులకు వివేకంబెందు గలదు

తిమ్మయ. సారంగధర చరిత్ర. II

ధాత్రి నవివేకమున కన్న
పిచ్చితనము కలదె?

రంగావధూత. జ్ఞానబోధ

కలనిజమంచు నమ్మి కడగానని కష్టములన్
గలుగఁగఁ జేసి కొంద్రు జగంబు సతంబగునె?

భక్తిరసామృతము

## అవివేకి సాంగత్యము

కడునను రక్తియు నేర్పును
గడఁకయుఁ గలవారి నుఱకఁ గడవఁగ నెగ్గుల్
నొడివెడు వివేక శూన్యుల
కడనుండెడు నంతకంటెఁ గష్టముగలదే

నన్నయ. భారత. ఆది. III-148

వివేక హీనుల స్నేహం బోవలదు తోడి చెలిమిరా
నే వెంటనైన నాపద గావింపక పోదు

మంచెన. కే. బా. చ. III-282

సువివేక హీనుసంగతిఁ
దవులఁగ వలదాపదలకుఁ దప్పఁదలఁచినన్

మంచెన. కే. బా. చ. III-339

## అవిశ్వసనీయులు

గుఱుకొని నమ్మంగనగునె క్రూరాత్మకులన్

నన్నయ. భారతము. ఆది. VIII-315

ఎవ్వారలు నాత్మ నమ్ముదురె వక్ర విచారులఁబాప కారులన్

ఎఱ్ఱన భారతము. అరణ్య. VII-470

తగ దొరులనమ్మ కెప్పుడుఁ
దగు వారల నమ్మ రేనిఁ దగుఁగాక మహిం
బగువారల నమ్మదగదు

మంచెన. కే. బా. చ. IV-94

నమ్మక పోరాదనుతఱి
నమ్మి రిపునిఁగలసి నమ్మి నడచుట యొప్పున్
పిమ్మట నేమఱక తొలఁగి
నమ్మకయుం డంగవలయు నరవర వానిన్

మంచెన. కే. బా. చ. IV-97

అనుకూల శత్రులగు మిత్రులనమ్మదు రయ్యా? యెయ్యెడన్

జక్కన. విక్రమార్క. III-66

## అశాశ్వతము

గజతురగాది సంపదలుఁ గాంతలతోడి విహారలీలలుం
బ్రజకనురాగ మొందఁబరిపాలనసేయు క్రమంబుఁబోరులన్
విజయముఁబొంది పేర్చుటయు విస్ఫురితాభరణానులేప వ
స్త్రజనిత వైభవంబుఁగల రాజులుఁ బోయిర కాక నిల్చిరే

తిక్కన. భారతము. ఉద్యో. II-93

తన దేహము నిత్యంబే తన ధనమది చెప్పనేల తాను తనధన
బును దైవ ధనంబులు తన ధనములు పఱచినట్టు తగదే పడఁగన్

మంచెన. కే. బా. చ. III-186

దైవాధీనము తగు సంసారము
వావిరి జీవుల వసమవునా?

అన్నమయ్య. అధ్యా. సం.

కారేరాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిన్ బొందరే
వారేరీ సిరిమూటగట్టుకొని పోవంజాలిరే భూమిపై
పేరైనం గలదే

పోతన. భాగవతము. VIII-594

ప్రాయము జలకల్లోల
ప్రాయము కాయంబు నస్థిరంబు

రఘునాథరాయలు. వాల్మీకి చరిత్ర. II-64

ఒడల్ దిరమే చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్
మీసాలపైఁ దేనియల్

పెద్దన, మను.

పోకన్ మానదు దేహమెవ్విధమునన్ బోషించి రక్షించినన్

ప్రాచీన చాటువు II-135

చనినారార్యులు చక్రవర్తులు మహీచక్రంబుఁ బాలించి ధ
ర్మనిరూఢిన్ జనినారు షోడశమహారాజు ల్మహేంద్రాభులై
చనుచో వారలు మూటగట్టుకొని యైశ్వర్యంబుఁ గొంపోయిరే

చిలకమర్తి. గయోపాఖ్యానము

## అసంగతి

వేదవిప్రులకును ధారుణీశులకుఁ
బోలఁగ సఖ్యము సంభవించునే

నన్నయ. భారతము. ఆది. V-203

ధనపతితో దరిద్రునకుఁ దత్త్వవిదుండగు వానితోడ మూ
ర్ఖునకుఁ బ్రశాంతుతోడఁ గడుఁ గ్రూరునకున్ రణశూరుతోడ భీ
రునకు వరూధితోడ నవరూధికి సజ్జనుతోడఁ గష్టదు
ర్జనునకు నెవ్విధంబునను సఖ్యము దానొడఁగూడ నేర్చునే

నన్నయ. భారతము. ఆది. V-204

వదన బాణాసన వ్యక్తముక్తములైన
పలుకులన్కడు వాఁడి బాణతతులఁ
బరమర్మ లక్ష్యముల్ పాయక భేదించు
చుండెడు దుర్జన యోధవరుల కడనుండ కున్నది

నన్నయ. భారతము. అ౩. III-206

రాజయోగ్యమైన రమణీయవస్తువు
యోగిజనుల యొద్ద నునికిదగునె

జక్కన. విక్రమార్క. 7-21

చెలువల పొంతనుంటే చిత్తమే చెదరుఁగాని
కలుగ నేర దెంతైనా ఘన విరతి
ఉలుకకగ్గి పొంతనుంటేఁగాఁక లేకాక
చలువలు గలుగునా? సంసారులకును
బంగారు వోడఁగంటేఁ బట్ట నాసపుట్టుఁ గాని
సంగతి విజ్ఞానపుజాడకురాదు
వెంగలియభిని దింటే వెటి వెటాలాడుఁగాని
అంగలించు నా వివేకమప్పుడే లోకులకు?
శ్రీ వేంకటేశు భక్తి చేరితే సౌఖ్యము గాని
అవలనంటవు పాపాలతి దుఃఖాలు
చేవనమృతముగొంటె చిరజీవియగుఁగాని
చావులేదు నోవు లేదు సర్వజ్ఞులకును

అన్నమయ్య. అధ్యా. సం.

వైరిదూతలతోడ వడినల్పుతోడఁ
జేరి భాషించినఁజెడు నెంతవాఁడు

తిమ్మయ. ద్విప. భారత. విరాట. I-12

ఒడదారులేయూరు జవ్వను లేయూరు

విజయరాఘవుఁడు. విప్రనారాయణ చరిత్ర. XIX

సానులకును మానులకును సంగతి గలదే ?

విజయరాఘవుఁడు. విప్రనారాయణ చరిత్ర. XIX

అజ్ఞానములను నెఱపుచు
ప్రజ్ఞలు బలుకుచును మిట్టి పడుచుండెడునా
యజ్ఞానులతో స్నేహము
సుజ్ఞానుల కేలనిలను శుభకర రామా !

శాంతానందయోగి. రామశతకము

## అసంతృప్తి

ధనమున విద్యను సంతతిఁ
దనిసిన వారెందుఁగలరె

నన్నయ. భారతం, ఆది. V-119

వంతులకుఁ బారనేల వగరించ నేలా ?
దక్కనివి గోర నేల తట్టు ముట్టు పడనేల ?
చిక్కినంతకే సంతసించరాదా
ఒక్కమాటే యుప్పుదిని యుపతాప మందనేల ?
చక్క జాడఁ దగినంతే చవిగొన రాదా ?
పారిపారి వేఁడనేల ? బడలిక పడనేల ?
మీరి దైవ మిచ్చినంతే మెచ్చరాదా
వీటిఁడై పొడవెక్కి విరుగఁబడఁగనేల ?
చేరి యుండి నంతకే చేచాచ రాదా
జీవులఁ గొలువనేల ? సిలుగులఁబడనేల ?

శ్రీ వేంకటేశుఁడాత్మఁ జిక్కియుండఁగా
దావతి పడఁగనేల? తప్పులఁ బొరలనేల?
కైవసమైనందుకేగతి కూడరాదా

అన్నమయ్య. అధ్యా. సం.

దేహము తోడిది లంకె తీరదిది హరిమాయ
నెట్టనఁబెక్కిండ్ల విందు నిండు కొన్న యాఁకలి
ఒట్టి నిచ్చు కల్యాణి కామోద్రేకము
కట్టిన యోడదూలముకాయపు సంసారము
దట్టమైన ప్రాణులకుఁదని వేడ దయ్యా?

అన్నమయ్య. అధ్యా. సం.

పరితోష హీనతఁబ్రభ సెడి పోవును
జలధార ననలంబు సమయునట్లు

పోతన. భాగ. VIII-576

కోరినట్టులు చేసు కొన వీలుకాదు
ఉంపిక తీరదే దోవెల్తి తుదకు

అ. నారాయణదాసు. వేల్పుమాట. 45

......అసంతృప్తుఁడు
నాకమునకుఁ జనిన మేరునగముంగనినన్
లోకేప్సిత సుఖముంగన
లేకుండును జుమి విషాద లిప్త హృదయుఁడై

విక్ర. దే. వర్మ

ఆడపడుచుల నల్లుర నాటకత్తి
యల నెవండేని తనియింపఁగలఁడెవసుధ

కాళ్లకూరి. వరవిక్రయము

## అసంభవము

దూరము వ్యవసాయకులకు
భారంబు సమర్థులకును భాసుర విద్యా
పారగులకును విదేశము
వైరము ప్రియవాదులకును వసుమతిఁగలదే

ప్రతాపరుద్రుడు. నీతిసారము

అస్తవ్యస్తున కెఱుక, స
మస్తేంద్రియ మగ్నునకు విమలబుద్ధియు న
ప్రస్తుత వాదికి గోష్ఠియు
నాస్తికునకుఁ గృపయుఁగలదె

పా. సోమన. అనుభవసారము. 86

జూదరికి బొంకుఁ బొరయమి
పాదలికిని భక్తివలని భయమును విషయా
హ్లాదికిఁ బ్రసాద భోగా
స్వాదన సుఖమును నసంభవము త్రిపురారీ!

పా. సోమన. అనుభవసారము. 87

దుర్గుణికిఁ గీర్తి గర్వికి
భర్గార్చన క్రోధికినిఁదపఃఫల మరిష
డ్వర్గ పరతంత్రునకు నప
వర్గ సుఖంబును నసంభవము త్రిపురారీ!

పా. సోమన. అనుభవసారము. 88

ఏవల నరుఁడు లేక యెద్దే తానున్ననా?
దేవుఁడు సూర్యుఁడు రాక తెల్లవారునా రేయి?
కుమ్మరి వాఁడు లేక కుండే తాఁబుట్టునా?
పమ్మి నీయర్పణలేక భవములు మానునా?
మక్కువ మగఁడు లేని మనువు గలుగునా?

అన్నమయ్య. అధ్యా. సం.

భాగీరథి లోనఁ బాప మున్నదా?
పుణ్యా వేదములలో బొంకు లున్నవా?
సాగరపుటమృతపు చవిలోఁ జేఁదున్నదా?
హరి దాసుల కపరాధమున్నదా?

అన్నమయ్య. అధ్యా. సం.

దక్కునా? పేదకును దరము గాని ధనంబు
అరుగునా? దుర్బలున కరుదైన యన్నంబు
చెల్లునా? యమృతంబు సేవించనధమునకు

అన్నమయ్య. అధ్యా. సం.

తగిలి సంపదలచేఁదనిసిన వారు లేరు
ఒగరు సంసార భారమోపనన్న వారు లేరు
జడిసి ఆయుష్యము చాలు నన్న వారు లేరు
తడివి తనముదిమి తారోసే వాఁడు లేడు

అన్నమయ్య. అధ్యా. సం.

బ్రహ్మ వ్రాత కెదురు పల్కిన వాఁడును
ఆదివిష్ణు సూత్రమడుచు వాఁడు

మూఁడు కనుల వాని మొనసి నిల్చిన వాఁడు
కానఁ బడరు

వేమన

వ్యాధి పీడితంబు వ్యసన సంతాపంబు
దుఃఖ సంభవమునఁ దొడరు భయము
లేని వారలుండ రేనాటి కైనను

వేమన

ఇరుగురు స్వతంత్రులొక దేశమేలఁగలరె?
యతుకునే రెండు ముదిరిన యవని జమ్ము?
లిముడునే రెండు కత్తు లెందేని నొక్క
యొఱను?

తిరుపతి వెంకటకవులు. పాండవోద్యోగము

ములగ మొక్కకుఁజేవ వేమునకుఁ దీపి
కటికి వానికి జాలి చిల్కలకుఁ బ్రేమ
గులకరాతికిఁ గాంతి బొగ్గునకుఁ దెలుపు
పడుపుఁ గత్తెకు వలపు విశ్వమునఁ గలవె?

కాళ్లకూరి. చింతామణి

## అసతి

భాండశుద్ధి లేకి పరగ దేవాతిథి
పూజనముల పొంతఁ బోక నీచ
వర్తనమున మెలఁగువనిత ప్రాణేశున
కుభయలోక హాని యొనరఁజేయు

అనంత. భోజరాజీయము. IV-282

పదవులు దప్పిన పతులఁ జీరికిని
మదినెంచ రసతులౌ మదవతులెల్ల

వరద. రామా, అయోధ్య. 414

ఆలు మగని మాట కడ్డుమాటాడెనా
ఆలుగాదు నుదుటి వ్రాలుగాని

వేమన

పతిభక్తి విడచి సంపదనొందు జవరాలు
ఆలు గాదది నీచురాలు గాని

యోగానందకవి. రాజగోపాలశతకము. –70

## అసత్యము

తీర్పరాదనృతాభి భాషణమునఁ బెనఁ
పాపభయము

నన్నయ. భారతము. ఆది. I–130

చనుఁబొంకఁగఁ బ్రాణాత్యయ
మున సర్వధనాపహారణమున వధగావ
చ్చిన విప్రార్థమున వధూ
జన సంగమమున వివాహసమయములందున్

నన్నయ. భారతము. ఆది. III–178

మౌనాగ్నిహోత్రమును మఱి
మౌనాధ్యయనమును మౌనమౌనంబు నవి
జ్ఞానమున మానయజ్ఞము
నా నయథార్థంబు లివియు నాలుగు నుర్విన్

నన్నయ. భారతము. ఆది. III–222

భూతములకు హితముసేయు బొంకులెల్లను ధర్మముల్

తిక్కన, భారతి. శాంత, III-45

అనృతము పాతకమగునై
నను వనితల యెడలఁ బెండ్లినవ్వున మృతి వ
చ్చిన సర్వధనముఁజెడుచో
వినుమది పాపంబుగాదు

తిక్కన. భారతము. శాంతి. III-438

వినుమిచ్చెదనని యీమియుఁ
గానియెదనని పలికి పిదపఁ గొనకునికియున
త్యనృతంబులు

తిక్కన. భారత. శాంతి. IV-150

బొంకు కంటెను జావైనఁ బొంకము

మారన. మార్కం. పు. I-198

బొంకిన సర్వ ధర్మముల్
వేకడ తేఱి పోవె యుకువిశ్రుత కీర్తియు మాసిపోవదే

మల్లికార్జునుడు. భాస్కరరామాయణము. బాల.

బొంకిన పాపంబు పొలియ దేమిటను

గౌరన. హరిశ్చంద్ర. II-259

బొంకిన మగసిరి వొలియు నాయువ్వ
మింకుఁ దేఁకువదప్పనెడ తెగుఁగీర్తి
నమ్మికమాలు మానము దూలపోవు
వమ్మగుపుణ్యంబువచ్చు నాపదలు

గౌరన. హరిశ్చంద్ర. II-259-62

వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణ విత్తమాన భంగమందుఁ
జకిత గోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘముబొందదధిప

పోతన. భాగ. VIII-585

ఎట్టి దుష్కర్మునినే భరించెదఁగాని
సత్యహీనుని మోవఁజాలననుచుఁ
బలుకదే? తొల్లి భూదేవి బ్రహ్మతోడ

పోతన. భాగ. VIII-588

భార్యావిక్రయపాతకంబునైనను బాయంగావచ్చుఁగాని
మఱి మిథ్యావాగ్దోషంబుఁ బాయఁ దరమెవ్వారికిన్

శంకర. హరి. II-52

తప్పు పలుకు పలికి తాటోటు జేసిన
గూడియున్న లక్ష్మి గుంగిపోవు

వేమన

కల్లలాడుట కంటె గష్టంబు మఱిలేదు

వేమన

ప్రాణసంకటముల బ్రాహ్మణక్రియల
రాణతోఁ బెండ్లిండ్ల ద్రవ్యభంగముల
నతివయు ఋతుమతియై యుండుచోట్లఁ
బతికల్ల లాడినఁ బాపంబులేదు

తిమ్మయ. ద్విప. భార. అది. II-133

భయవేళ బొంకినఁ బాపంబులేదు

తిమ్మయ్య. ద్విప. భార. ద్రోణ. V–117

ఆడినమాటలు దప్పిన
గాడిదకొడుకంచుఁదిట్టు గావిని యయ్యో
వీఁడానాకొక కొడుకని
గాడిద యేడ్చెంగదప్ప। కవిచౌడప్పా.

కవిచౌడప్ప శతకము

మహీనసత్యము కన్న కల్మషము గలదె

పో. వీరన్న. భల్లాణ చరిత్ర. II–88

దబ్బరలాడిన దైవంబు నిన్ను
గొబ్బున నిడుముల గుడిపించు జుమ్మి

తిమ్మయ. సారంగధర చరిత్ర. II

ఎప్పుడైనఁగల్ల నించుక పలికిన
నమ్మరెన్నఁ డితరనరులు వాని

కం. వీ. పం. నీతి. దీపి. 34

జనుఁడొనర్పంగఁ దగిన దోషంబులన్ని
తలఁచిచూడ నసత్య తత్త్వంబుతోడఁ
గలసి యుండని నేరమొక్కటియు లేదు
శాంతి లేని కషాయంబుఁ జూడఁగలమె.
కల్లలాడవలదు వివేకంబుగల్గి
కరుణగల బుద్ధితోడ నిష్కారణము ని
కృతిని జేయక నిజము వచింపు మయ్య
ఎవని చేతను గల్లలాడింపకయ్య

పానుగంటి. బుద్ధ.

అనృతముకన్నఁ బాతకములంచు
మఱొండు జగాన నున్న వే

తిరుపతి వెంకట కవులు

## అసత్యవాది

ఉన్నరూప పలుకునన్నరు లెక్కడఁగలరు

తిక్కన. భారతము. విరాట. I-161

సత్యహీనుఁడైన పురుషు దేహముదా
శ్మశాన తుల్యము

మారన. మార్కం. పు. I-194

డబ్బులు పల్కువారి కడ్డంబు గలదె?

శ్రీనా. కాశీ. IV-96

బొంకెడువాఁ డొక్కపురుషుఁడే యకట

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. అయో. 71

అనృతభాషణుకంటె దోషాధికుండు
సత్యవాచాన్వితునికంటె నిత్యసుకృతి
వెతకి చూచినఁ బొడమ మూర్వ్యేతలేశ
పవనభుజ్మానవామర భువనములను

శంకర. హరి. 53

బుజ్జగింపరాదు బొంకువాని

వేమన

ఆడితప్పువార లభిమాన హీనులు

వేమన

టక్టోటునమ్మఁ గూడని
మాటలె యెల్లపుడుఁ బలుకు మహిలో వానిం
గూటమునకు దగఁడంచును
జాటించిన మేలుసుమ్మి జనులకు

వేమన

కల్లుద్రాగువాని కల్లుమ్రుచ్చనరాదు
కల్లలాడు వాఁడె కల్లుమ్రుచ్చు
కల్లు ద్రాగుట కంటె కల్లలాడుట కీడు

వేమన

తఱచుకల్లలాడు ధరణీశునిండ్లలో
వేళ వేళ లక్ష్మి వెడలిపోవు

వేమన

బొంకెడు వారలం బొడగని ప్రజలు
శంకింపుదురు క్రూరసర్పంబు లనుచు

వరద. రామా. అయో. -653

ఆడి దాఁటిన నేరికి నౌనె లగ్గు?

కం. వీరే. వం.

దబ్బరలు పల్కి పెంపొందఁ దలచకల్లఁ
బోతు తప్పక మొదటికి మోసపోవు

ఆ. నారాయణదాసు.

నవ్వులాటకనుచు నలుగురితోఁగల్ల
చెప్పునట్టివాఁడు ముప్పుబొందు

ఆ. నారాయణదాసు.

గడియ కారాగృహావాప్తి ఘనత కాదు
పదియు నాల్గబ్దములది లోపంబు కాదు
ఒక యసత్యంబ సత్య వాదికి విశేష
మింకఁబదునాల్గ సత్యముల్ హేయమగునె ?

పానుగంటి, చూడామణి. –3

కొంకు జంకు లేక కోఁతలు కోసెడి
ఘనుల ధాటి కడ్డు గలదె

తిరుపతి వెంకటకవులు. గుం. సీమ, 134–2

కర్కశాసత్య వాక్యములఁ బలుకు
వానికంటె మూఁగవాఁడె శ్రేష్ఠుఁడగును

వత్సరమాలిక –25

## అసమయము

విరిదలవానిని విరథుని నాయుధం బిడినవానిని శూరులేయ
రెందు

తిక్కన. భారత. కర్ణ.

సురతవేళ నీనుచో నిద్రవోయెడు
నెడలఁ గ్రేపుచన్నుఁ గుడుచుతఱిని
దప్పివచ్చి నీరుద్రావెడు చోటఁ గ్రూ
రంపు మృగమునైనఁ జంపరాదు

అనంత. భోజరాజీయము. V. 91

ప్రొద్దుగాని ప్రొద్దువేళ పోవరాదు

క్షేత్రయపదములు. ఇతరుల పదముల 31–3

## అసమర్థత

పులి నడుగరు మేఁక పోతులఁ గాని
బలహీనుఁ గాని చంపవు దయ్యములును

గౌరన. హరిశ్చంద్ర. II-338

ఉద్ధతుల మధ్య పేదలకుండ దరమె

సంకుసాల నృసింహకవి. కవికర్ణ.

కోపంబులేని పతియును
శాపాక్షరశక్తి లేని సంయమివరుఁడున్
దాపంబులేని వహ్నియు
రూపింపఁగ నొక్కరూప

రామవరాజు రంగవరాజు. నాంబోపాఖ్యానము

చేఁతకానిదానిఁ జేసెదనని పల్కి
నెఱపలేనివాఁడు చెఱుపుఁగొనును

అ. నారాయణదాసు. నూరుగంటి. 28

మనకు ముందునకుఁ జూడ వెనుక సున్న
కనిన వినలేము వినుచుఁ బల్కంగలేము
పలుకుచుండి వ్రాయఁగలేము వ్రాయుచుండి
తలఁపలేము తలంపులో నిలువలేము

పానుగంటి. వి నారా. I-

అసమర్థుల కెందును బరోక్షమునందె
ప్రగల్భోక్తులు మెండు

తిరుపతి వేంకటకవులు. పాండవోద్యోగము. 2-22

## అసాధ్యము

తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ
దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చు
జేరిమూర్ఖుల మనసు రంజింపరాదు

ఏనుఁగు లక్ష్మణకవి. సుభాషిత.

గవ్వను రత్నమున్ సలుపఁగాఁ గలరెవ్వరు కొంగహంసయై
నివ్వటిలంగఁ జేయుటకు నేర్పరు లెవ్వరు కుక్క గోవుగా
నెవ్వరొనర్ప నేర్తురు యథేచ్ఛగ వ్రాతురుగాక, యక్కటా!
అవ్వకు జవ్వనంబొదవునా, ముసలయ్యకుఁ బండ్లు వచ్చునా

తిరుపతి వేంకటకవులు. గుంటూరుసీమ 82-6

## అసూయ

పరుల ధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడున
న్నరుఁడు దెవులు లేని వేదనంబడు నధిపా.

తిక్కన. భారతము. ఉద్యో. II-58

తనతక్కువ యునికియు న
న్యుని యున్నత లీలయుం గనుంగొని చిత్తం
బున నెఱియు చునికి గలుగును
జననుత సురలోక వాస జనులకు నెల్లన్

ఎఱ్ఱన. భారతము. అరణ్య. VI-137

సిద్ధింప వీప్సితంబులు
సిద్ధించెన యేనిఁ బిదపఁ జెడు నన్యునిసం

వృద్ధిఁగనుంగొని యెవ్వని
బుద్ధినసూయాగ్రహంబు వొడముదతనికిన్

శ్రీనా. కాశీ. III-7

ఎదుటి కలిమి జూచి యేడ్చెడి వారికి
భాగ్యమెటుల గూర్చుఁ బరమ గురుఁడు?

వేమన

ఇరుగు పొరుగు వారికైనయు సంపదఁ జూచి
తనకు లేదటన్న ధర్మమేమి?

వేమన

యౌవనంగ వచ్చునై నది కానిది
యన్యుఁడెదుటనుండి యడుగఁడేని
నిలిచి యడుగువాఁడు కలిగిన నిలువఁడు

వేమన

కుళ్ళుఁబోతు నొద్దఁ గూడి మాట్లాడిన
గొప్పమర్మములను జెప్పరాదు

వేమన

మచ్చరమునకంటెఁ గీడు మఱి యుంగలదే

నృసింహ. కవికర్ణ. 135

చిచ్చులేక చిముడు మచ్చరీఁడు

సూరన. ప్రభా. I-135

అన్యులకల్మిఁ గన్గొని యసూయామగ్నుఁడౌ వానికా
పద సేకూరు నవశ్యము

పాపరాజు. ఉ.రా. II-311

ఎట్టిశాంతులకైన నీసులు వుట్టు

బాలసర. ద్విప. భార. సభా. II-574

తనసాటి వారిగొప్పఁజూచి సుంతయు నోర్వఁడు మునిమైన

అ. నారాయణదాసు. యథార్థరామాయణము. 70

ఒరులగొప్పఁజూచి యోర్వలేకుండిన
వాఁడు తప్పకుండ కీడు పొందు

అ. నారాయణదాసు. అంబరీష చరిత్ర. IV

అతివలందుఁ బురుషులందు హేతువులేక
యే యసూయఁజెంది యెప్పుడులుకు
నాఁడు వారి చిత్త మలరారు గాలియే
లేక కదలు రావియాకు భంగి

పానుగంటి. నర్మదాపురుకుత్సీయము. II

శిరముచుట్టు కన్నులు సాలెపురుగుపోలె
శశమువలె వాఁడి చెవులును సర్పమటులు
విసపునాల్కఁ గోఁతివలె నావేగకలన
గల యసూయ సంకర రూపగాదె? యిలను

పానుగంటి. రాధాకృష్ణ. II

మత్సరయుతు మనసు మండుచు నుండును

వత్సర మాలిక

సరివారి పరువు సైఁపని
నరుఁడే ధర తెవులు లేక నవయుచుఁగుందున్

కోలాచలం. సుల్తానా చాందుబీ

## అహంకారము

విధివిహితంబుం
దన చేతగఁ దలఁప ఫలము దగులు నహంకా

రనిరూఢున కనహంకా
రున కదిలేమి ఫలయుక్తి(ద్రోవంజాలున్

తిక్కన. శాంతిపర్వము. IV-374

చిత్తము బుద్ధియు మనసున
హత్తునహంకారగుణము నాత్మకు లోఁగా
మొత్తము జేయఁగ నేరని
మత్తులకును లేదుముక్తి

వేమన

తా ననెడి యహంకారము
మానక తనుఁ దానె చెఱచు మైమఱపించు
న్నే నని పలికెడి వారికి
మానునె దుష్కర్మ ఫలము ?

వేమన

అమలజ్ఞాన సుదాన ధర్మరతి సత్యక్షాంత నిర్మత్సర
త్వములన్ యజ్ఞతపోనసూయలఁగడున్ దర్పించు ధాత్రీసురో
త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు

పోతన. భాగవతము. VII-351

విశ్వమాత్మ ప్రణీతమై వికృతిఁబొందు
నందు లోన నహంభావ మనుచితంబు
గా నెఱింగి వివేకులు మానిరనిన

నందిమల్లయ్య. ఘంటసింగయ్య. వరాహ. 2-20

భువనమందుఁ దా నేయోగ్యుఁడని
పొంకి పొట్టసాఁకఁగరాదు

త్యాగరాజు

ఎంతఁదాక నహంకృతి యేచు జనుల
దన్మయత్వాన నందాఁకఁ దగులకుండ్రు

కాం. కన. ఆనందసారము. 460

## అహింస

దానంబును బ్రియంబుచేఁతయును
సత్యంబును నహింసయు నను నివి
నాలుగును సమానంబు లయినను
నహింసయ విశేషంబు

నన్నయ. భారతము. అరణ్య. IV-290

తమ తమ యోపినట్లు
హింస తెరవున కెడగల్గి యేఁగవలయు
నదియెచూవె యహింసగా నతిశయిల్లు

నన్న. అ. V-59

ధర్మకోటులన్నియు లోనగు
నిద్ధగుణ యహింస కింత నిజము

తిక్కన. భారత. అను. IV-298

దానము ధర్మము తపమి
జ్యానిష్ఠయునంగఁ గల్గు సత్క్రియ లెల్లన్
మానవనాథ యహింసా
నూనాకృతులండ్రు శ్రుతులనూనిన పెద్దల్

తిక్కన. భారత. అనుశాసనిక పర్వము. VI-290

దానమును దపంబు ధర్మంబు యజ్ఞంబు
శౌచమంత్ర తంత్ర సత్యములును

బుధు లహింస రూపములు గాఁగఁ జెప్పుట
నెల్ల కల్మి సుమ్మహింస కలిమి
తిక్కన. భారత. అనుశాసనిక పర్వము. IV-310

విను మహింస ధర్మ వితతి కెల్లను మేటి
ఎఱ్ఱన. భారతము. ఆరణ్య. V-48

జీవిఁ జంపు టెల్ల శివభక్తిఁ దప్పుట
వేమన

హింసలన్ని మాని హితుఁడయి జనుఁడు సం
సారియయిన ముక్తిఁ జేరవచ్చు
వేమన

ఎప్పుడు నేజంతువులకు
నెగ్గొనర్పకయునికి యహింస యనఁగ
సూరన. కళా. V-148

పరుల హింస సేయకున్నా పరమ ధర్మమంతే చాలు
పరులను రక్షింతునని పల్క నేటికే
రామదాసు చరిత్ర 234-3

పర మెఱిఁగి నరుఁ డహింసా
నిరతుఁడు గావలయు వినుము నిఖిలనదుల్ సా
గరుఁజేరుభంగి ధర్మము
లురుపుణ్యా మహింస యందు నొప్పుగనుండున్
ఏనుఁగు లక్ష్మణకవి. జాహ్నవీమాహాత్మ్యము

మనమున వాక్కునఁ గర్మం
బున నొకరికిఁ జేటుఁ దలఁపఁ బోకుండుటయే

దనర నహింస యనందగు
మనుజేంద్ర యహింసకును సమానము గలదే

విశ్వకర్మ పురాణము

పరము తుచ్ఛకీటకము మొదల్ నరులవఱకు
నెట్టిప్రాణిని నీవు హింసింపఁగూడ
దెవరిచే నట్టి హింస సేయింప వలదు
హింసఁజేసెడు వారి మన్నింపఁదగదు
స్వల్పబాధ నైనను జంతు సమితి కెపుడు
నీవు సేయకు మొరునిఁజేయింపకయ్య
బాధకరులకు నీతిఁ జెప్పంగదయ్య

పానుగంటి. బుద్ధ. V

ఒడలు విఱుచుచుఁ జఱచుచుఁ దొడలఁ గయ్య
మునకుఁ బనిలేక కాల్ద్రివ్వఁ జనదు కాని
యన్నివిధముల పోరాట మాగనప్పు
డాత్మ రక్షకై తగు నంతె యుద్ధమయ్య

పానుగంటి. బుద్ధ. V

ఇచటి కాంతలు చాలక యెటనొ యున్న
యూర్వశినిఁ దన కుండలాలూఁగ ముద్దుఁ
గొనఁదలచి హోమవహ్ని మేఁకను దహింప
వ్యసనములఁదన్ను మాడ్చుకొంటగును గాదె

పానుగంటి. బుద్ధ. V

ఆఁకలి

ఆఁకలి రుచియెఱుఁగదు;
నిద్రసుఖ మెఱుఁగదు

ప్రసిద్ధలోకోక్తి

ఆఁకటికిఁ దొలంగు నాచార విధులెల్లఁ
జీఁకటికిఁ దొలంగుఁ జిత్తశుద్ధి
వేఁకటికిఁ దొలంగు వెనుకటి బిగువెల్ల

వేమన

ఆఁకలన్నవాని కన్నంబుఁ బెట్టిన
హరున కర్పితముగ నారగించు
ధనవిహీనునకిడు దానంబు నటువలె

వేమన

ఆఁకటఁ బడఁన్వాశమేక్షణమైన నేరికిన్
ధరణిదేవుల రామయమంత్రి. దశావతార చరిత్ర. II–137

దురంత దుఃఖకర మాఁకలి బాధ భరింపశక్యమే?
ధర్మవరం. చిత్రనళీయము. IIII–48

ఆఁకొన్నకూడె యమృతము

సుమతీ శతక. 9

తన యాఁకలి తానె యెఱుంగును
దనకెట్టులఁ దృప్తి యగునొ తానె యెఱుంగున్
కాంచనపల్లి కనకాంబ. ఆనందసారము. 408

కుక్షిదరికొన్న పట్టున
వీక్షించునె దేహిరుచులు వేళలు

పంచతంత్రము. అ–1

ఆచరణ శూన్యత

బోధ చేయువారు బుద్ధిమంతులె గాని
యట్లొనర్చు వార లరుదు గాదె

భక్తిరసామృతము

చెప్పువార లెల్లఁ జేయువార లెయ్యెన
లోప మేమి గలదు లోకమునకు

భక్తిరసామృతము. 99

ఆచారము

వినుమాచార మవశ్యం
బును నడుపఁగవలయు ధర్మమున కది మూలం
బనఘా ధర్మం బాయువుఁ
బెనుచును లక్ష్మిని యశంబుఁ బెంపొందించున్

తిక్కన. భారతము. అను. IV-127

ఆచార పరుఁడె యుత్తముఁ
డాచారములేనివాఁడె యధముఁడు

కేతన. విజ్ఞానేశ్వరీయము. ఆచార. 7

కుల దేశాచారంబులు
తలకొని చేయంగవలయు

కేతన. విజ్ఞానేశ్వరీయము. ఆచార. 9

దేశాంతర మరిగియు నిజ
దేశాచారంబె గాని ధృతి హీనుండై
దేశాంతర వర్తనమున
కాశపడం జనదు నింద్యుఁడగు నట్లైనన్.

కేతన. విజ్ఞా. ఆచార. 33

ప్రీతి మంచఁబుపై నుండి పీఁట నుండి
చెప్పు పావలు దొడి తల చీర చుట్టి

నవ్వుచును మాటలాడుచు నడిచినడిచి
వంగి శయనించి నిలుచుండి వార్వఁ జనదు

కేతన. విజ్ఞా. ఆచార. 53

నిజ సంతానోచితా చారముల్
మఱ పంతంబును దక్కినన్ జనము లేమండ్రు.

కేతన. దశకుమార. XII–50

గురు ద్విజ రాజ మంత్రి పతివ్రతా తపస్వుల
యందుఁ బరివాద పరిహాసంబులు
పరిహరించుట యాచారము.

మారన. మార్కండేయ. III–242

క్షౌరక్రి యాంగనా సంగ మావసాన వమన శ్మశాన
ప్రదేశంబుల సచేల స్నానంబు సేయుట యాచారంబు

మారన. మార్కండేయ. III–242

ఆచార పరంపరా స్థితికి శాస్త్రము మూలము శాస్త్రచోదితా
చార వివేకహీనుఁడగు జాల్మని మెత్తురె పండితోత్తముల్.

శ్రీనాథుఁడు. శృం. నై. VI–57

ధారుణిఁదమ తమ వంశా
చారంబులు విడుచుటెల్లఁ జచ్చుట కాదే

వెన్నెలకంటి సూరన. విష్ణుపురాణము. V–241

పూని శిష్టాచారమునఁ బోవ వలయు

సోమన. ద్విపద. భార. అరణ్య. పు. 81

నడుపు నీ పెద్దలనాఁటి మరియాద

అదిభట్ల నారాయణదాసు. వేల్పుమాట. పు. 4

శాస్త్రవిధులఁ ద్యజియించి యెవఁడు ఇచ్ఛను
సారముగఁ దన విధులన్ సంచరించు నాతని
కలభ్యమా సౌఖ్యము సిద్ధియు మోక్షంబున్

సదానంద. గీతామత.

శిష్టాచారమైనను నీతికి బాహ్యమైనచో నది మాన్యము కానేరదు.

తి. వేం. కవుల పాండ. ప్రవాస. IV-30

రాజకీయ ప్రపంచ సామ్రాజ్యమందు
శౌర్య ఖడ్గంబులకు లేదు శాసనంబు
సంఘ రాజ్యంబు నేలు విస్తార శక్తి
సతము నాచార ఘోర పిశాచరాజు

దువ్వూరి. కృషి. 23

శౌర్యమునకును నాచార చక్రమునకు
మధ్య లోకంబు మిగుల సమ్మథితమగును
కాలగర్భంబునం దెట్టి ఘటన గలదొ
పూర్వ పద్ధతి విప్లవ స్ఫురణఁ గొలుప

దువ్వూరి. కృషి 74

## ఆతురత

తామసించి చేయఁదగ దెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషమ మగును

వేమన

తమకించిన విషమించును
దమ కించిన దల్లియైన దగఁ దెగఁ జూచున్

దమకింపఁ గార్యహాని నవుఁ
దమకించిన ప్రాణభయము తప్పదు వేమా

వేమన.

కాఁగలిగిన కార్యమునకుఁ దాళక కను తొందరపడుదురె

కంకంటి పాపరాజు. విష్ణుమాయా. పు. 64

అతిరయంబున నొక కార్యమాచరించు
నతని యవివేక మఖిలాపదాస్పదంబు

కదిరీపతి. శుక. I–191

త్వరిత గతి నొక్క కార్యంబుఁ దలఁచి సేయు
దాన ఫలమంద నేరఁడు ధరణి వరుఁడు

కోటీశ్వరకవి. భోజసుతా. I–125

మంచితనముననే కార్యమెపుడుఁ
దీర్పవలెఁగాని పని గాదు తీవ్రపడిన

కం. వీరేశలింగము. నీతిదీపి. 74

కృతి విలంబి సిద్ధియుతుఁడు గాఁడని యతి
శీఘ్రముగ నొనర్పఁజెడును పనులు
కానఁ జేయవలె నిదానించి వానిని

వత్సరమాలిక. 32

ఆత్మ

జీర్ణంబులైన వస్త్రములు విడిచి నూతనంబులైన వానిం
గైకొనిన చాడ్పుననుంగాని దేహాంతర గమనం
బాత్మ హానిం జేయదు

తిక్కన. భార. భీష్మ. I–196

పుట్టువుఁ జావు నను నివి లేమింజేసి శరీరంబు వోలె
శస్త్రచ్ఛేదనంబు మొదలైన వికృతి కారణంబులకు
నాత్మ యందు లోను గాఁడు

తిక్కన. భార. భీష్మ. I-196

అవయవము లెట్లు కూర్మము
నివిడించును లోని కడఁచు నెటి నట్టుల భూ
త వితతి భూతాత్మకుఁడును
ప్రవర్తన వివర్తనముల పాల్పడఁజేయున్

తిక్కన. భార. శాంతి. V-162

జలములందు నిలిచి జలపక్షి మునుగదు
మేడిపండు మశకపీడఁ బొరయ
దట్లు విషయ సమితియందుఁ దానది దన
యందు నుండు వికృతి నొందదాత్మ

తిక్కన భార. శాంతి. V-173

పాలకడవ పెక్కుపసుల లోడించిన
యాతఁడెట్లు దాని నరసికొనుచు
నుండునట్లు లోన నునిచినమనసు నే
మఱక యాత్మ వెదకు తెఱఁగు మేలు

తిక్కన. భార. అశ్వ. I-220

ఆత్మతత్త్వమేకంబ దీపాంతరములఁ
గలుగఁజేయు ప్రదీపంబుకరణి నావ
హించు రూపాంతరముల నవ్యోలమియును బు
ధుండు గనుఁగొని భ్రమయక యుండునొకట

తిక్కన. భార. అశ్వ. II-156

ఆకసం బొక్కటియె యెట్లనేక ఘటము
లందుఁ బెక్కయితోఁచుఁ దా నట్ల యాత్మఁ
డొకఁడ సకలంబు నందును నొగి వెలుంగు

మారన. మార్కండేయ. III-297

......ఔదుంబర
మున మశకము నీట మత్స్యము నిషీక కుశన్
గనుఁగొన నొకఁడై వేత్తై
చనుగతి దేహాత్మలందుఁ జరియింపఁదగున్

మారన. మార్కండేయ. III-307

బీజములు చేన వెదవెట్టి ప్రీతిఁగాంచి
పండుటయుఁ గోయు హాలికు భంగి నొకఁడ
కాలములు మూఁటికిని దానె కర్తయగుచు
బ్రహ్మవిష్ణు రుద్రాత్మలఁ బరఁగునాత్మ

మారన. మార్కండేయ. IV-15

ఆత్మ దొల్లిటిదే అంతరాత్మ దొల్లిటిదే
నీతితో నీదేహములే నిత్యకొత్తలు

అన్నమయ్య. అధ్యా. సం

హరి హరి యిందఱికి నబ్బురముగాని యిది
పరఁగ నీదాసుఁడే పరతత్త్వవేది
పొలసి మశకమందుఁ బొడమేటి జీవుని
తలఁపు బ్రహ్మాండాలు దాఁటి పోయీని
తగిలి చూచిన నాత్మదనుఁగానరాదు
గాని జగమెల్లఁ దానైతే సరిగనీని

అన్నమయ్య. అధ్యా. సం

కామముఁ గ్రోధము కాయపు గుణములు
నేమపుటాత్మకు నిందేది?
పాపముఁ బుణ్యము భావవికారము
పైపై నాత్మకుఁ బనిలేదు

అన్నమయ్య అధ్యా. సం.

దూషణల్ దండనల్ దేహంబునకుఁగాని
ఆత్మకు సుంతైన నంటఁబోదు

వేమన

ఘనములుపైఁ బాఱఁ గమలాప్తుఁడున్న
యనువున నుండు దేహము లీఁగనాత్మ

తిమ్మయ. ద్విపద. భార. భీష్మ. పు. 2-25

ప్రకృతి సంబంధమున భిన్నభంగిఁదోఁచు
నాత్మ యింతియెకాని వేదాంతయుక్తి
నరసి చూచిన భేద మావంత లేదు

ధరణిదేవుల రామయమంత్రి. దశావతారచరిత్ర. III-136

పచ్చికుండవంటి మేను ఇది చచ్చుఁగాక
ఆత్మ చావదెన్నఁడును

శ్రీపాద గోపాల కృష్ణమూర్తి సంపాదితము. పల్లెపదాలు. పు. 249

ప్రాణులన్నియు బహువిభిన్నాకృతులను
గర్మభేదంబులను బట్టి కలిగియున్న
నన్నిప్రాణులలో నిండియున్నయాత్మ
తత్త్వమున నొక్కటేయంచుఁదలఁపవలయు

పానుగంటి. పద్మిని. II

అర్కుఁడని చంద్రుఁడని శుక్రుఁడని గ్రహంబు
లన్ని వేర్వేఱు నామంబు లందియున్న
నన్ని రూపంబులను వెల్గుచున్న యట్టి
తేజమొక్కటి యానుగాదే

పానుగంటి. పద్మిని. II

పూర్ణమగు నాత్మ లౌకిక స్ఫూర్తి మాయఁ
బరమహా తత్త్వగతిని దివ్యముగ వెలయు
నంకె లందునఁ బడి వట్టిదయ్యె సున్న
యక్షరంబయ్యెనద్ది వర్ణాళిఁబడుచు

పానుగంటి. వన. రాఘ. V

తనదు నాత్మఁ బరీక్షించుకొనిన యోగి
యెల్లవారల నాత్మల నెఱిఁగియుండు

పానుగంటి. పద్మిని. II

అంతరంబగు కొఱవిదయ్యంబె యాత్మ
యాంతర మరీచికా ప్రవాహంబె యాత్మ
యాంతరాకాశ తత్త్వసంవ్యాప్తి యాత్మ
యాంతరాహంస్వరూప విభ్రాంతి యాత్మ

పానుగంటి. బుద్ధ VII

ఆత్మ స్వాతంత్ర్య శూన్యత్వ మందినపుడె
భగవ దాదరణార్హమై వఱలుగాదె

పానుగంటి. విజయరాఘ. VI

తనువు లెన్నియైనఁ దానొక్కఁడే గదా

భా. విం. ४. 79

దేహంబు నడుపు నింద్రియము లింద్రియముల
నడపించు నదియె మనస్సు దాని

పోకడ నరికట్టి బుద్ధి నడపు చుండు
బుద్ధికి న త్మయె పూఁటకాఁపు

వేంకట పార్వతీశ్వర కవులు. భావసంకీర్తనము

## ఆత్మగుణము

కలిమిగలదని యుబ్బవలదు కడఁగి లేదని సగ్గవలదు
నేరనని దైన్యం బదేటికి నేర్తునని గర్వం బదేటికి
వారి వారికి నాత్మగుణములు వసుధ నిలిచినవి

అన్నమయ్య. అధ్యా. సం.

## ఆత్మగౌరవము

ఆత్మగౌరవమున కాదె అమర జీవు
లసువులం బాసి రిద్దర నర్థప్రాణ
ములను లెక్కచేయంగ నే మున్న దందు
ఆత్మగౌరవ మఖిలంబు నరయుగాను

అన్నంభొట్ల. ఆత్మగౌరవము. 103

## ఆత్మజ్ఞానము

విను తాత్మ జ్ఞానంబునఁ
దనరు మహామాయ చెడు

నన్నెచోడుఁడు. కు. సం. XII 189

శమనిరతియు నాత్మ జ్ఞా
నముఁజూవ్వే బుద్ధ లక్షణంబులు పర్యా
ప్తము లివి రెండు నరయ మో
క్షము సాధించుటకు వేఱ కల్పన లేలా

తిక్కన. భారత. శాంతి. V–177

ఇను రూపము జలములఁదోఁ
చినక్రియబుద్ధిఁ బ్రతిబింబసిద్ధత వెలుఁగొం
దిన యాత్మను బరమార్థతఁ
గనుసత్త్వస్థులకు నిజము గానంగనగున్

తిక్కన. భార. శాంతి. V-196

సత్త్వమార్గాభిరతి యాత్మ తత్త్వదర్శ
నంబు గావింపఁదనుఁ దాననరుఁడు గాంచు
విశ్వమునఁ దాను దనయందు విశ్వమును వ
సించుటయుఁ జూచుచును ముక్తిఁ జెందియుండు

తిక్కన. భార. శాంతి. VI-281

నరుఁడు సుఖదుఃఖముల వెఁటఁ బొలఁక
మలచియాత్మునిఁ జేర్చిన మానసంబు
లీనమగు నందజలములలోన నిడిన
లవణకణము చందమున

తిక్కన. భార. శాంతి. 357

అజితాత్ముఁడైన యాతని
విజయంబును సిరియు విరియు వేగంబ

ఎఱ్ఱన. నృసింహ. II-140

......అసమ్యగాత్మద
ర్శనులగువారు దుఃఖజలరాశి నిమగ్నులుగారెయెప్పుడున్

మారన. మార్కండేయ. III-298

ప్రత్యభిజ్ఞానమనియెడి ప్రత్యయమున
విశ్రుతంబైన యాత్మ భావింపవలయుఁ

పెద్దకాలంబునకుఁ గన్న ప్రియవయస్యు
నానవాల్పట్టి తెలిసిన యట్లవోలె

శ్రీనాథుఁడు. భీమ. V-181

త్రాడుఁజూచి భ్రాంతి దందశూకంబని
యాత్మవలనఁ దలఁచినట్లవోలె
వేదశాస్త్ర జనిత విజ్ఞానబలమునఁ
దెలివి వడసి యాత్మఁ దెలియవలయు

శ్రీనాథుఁడు. భీమ. V-182

ఎన్ని క్రతువులు సేసిన నేమిఫలము
మగుడవలయును సుకృతంబు దెగినయపుడ
యపునరావృత్తికిని మూలమాత్మవిద్య
యాత్మవిద్యావిదూషణమఘముఁజేయు

దగ్గుపల్లి దుగ్గన. నాసి. III-16

తన్నుదాఁదెలిసిన దైవంబు తానాయె

వేమన

కన్నులకింపగు దృష్టిని
దన్నెఱుఁగుటము క్తికిరవుతపమగు

వేమన

తనుఁ దానెఱుఁగలేని తలఁపేటి తలఁపు

అన్నమయ్య. అధ్యా. సం

తను దాఁనేమఱక దైవము మఱవకుంటే మనసులోనే కలుగు

కనురెప్ప మూసితేనే కడదాఁగె జగమెల్ల
కనుదెఱచి నంతనే కలిగెఁదాను



తనతోడిదే యిన్నిదాఁ గలిగితేఁగలవు
కడుపునిండి నంతనే క్రైపాయరుచులెల్లా

అన్నమయ. అధ్యా. సం.

పలుమఱు చీకటి చూడఁగ బయలేవెలుఁగై
తోఁచినయట్లు అలయుక తనలో చూపు
చూచినను అంతరంగమున హరిఁగనును

తా. అన్నమయ్య అధ్యా. సం.

ఘనమనోరాజ్య సంగతిఁ జెలఁగినఁగాని
జనుల కెప్పుడు నాత్మసౌఖ్యంబులేదు
ప్రతిలేని ధైర్యరంబు పదిల పఱచినఁగాని
మతిలోని పగవారి మదమణఁపరాదు

అన్నమయ. అధ్యా. సం.

పరుషాలాపములాడనోడి మది నీ పాదార్చితారంభుఁడై
పరమానంద సుబోధ దీపకళచే భస్మంబు నొందించి యా
నిరతజ్ఞాన సుకాంతి దర్పణమునన్ నిస్సంగుఁడై తన్నుఁదా
నరయం గాంచినవాఁడు నిన్నుఁగనువాఁడబ్జాక్షనారాయణా

పోతన. నారాయణశతకము.

నేనను నాకు నేనను ననిత్య శరీరము దోఁచు భ్రాంతిచే
నేనను నేన నేననిన నిర్మల నిత్యతఁగల్గుఁ గావునన్
నేనను దాని కాదియగునే గద యాత్మన దానిఁగన్గొనం
బూని యొనర్చు యోగమునఁ బొందఁగ వచ్చు సమాధి
సౌఖ్యముల్

ఈశ్వర ఫణిభట్టు. పరతత్త్వరసాయనము

ఉన్నచోటనె యుండి తానుల్లమునను
సకలమును గాంచువాఁడెంత సుకృతి యొకో-

సూరన, కళా. VIII-157

ముకురము గన్నపుడె కదా
మొకము కురూపము సురూపమును నేర్పడుటల్

కాకుమాని మూర్తికవి. పాంచాలీ I-8

అజ్ఞాన మాత్మ జ్ఞానంబున నాశనంబగు

కనుపర్తి అబ్బయామాత్యుఁడు. కవిరాజమనోరంజనము. I-140

తన్నుఁ దాఁదెలిసినఁ దత్త్వమేల

త్యాగరాజు ప్రహ్లాద. భక్త విజయము

తనువు తానుగాదని యెంచువానికి తపసుచేయనేల ?
కన్నుగట్లు మాయలని యెంచువానికి కాంతల భ్రమలేల ?
అటు దేహ బహురూపమిటు గానకుం టేను
వట్టి గుళ్ళలో నమశ్శివాయ యనుటగాదా

త్యాగరాజు కీర్తన

మృత శరీరమునందిట్టి వితము దోఁప
దగుటఁ జైతన్యమది దేహమందు నున్న
దగును నిజ జీవతత్త్వము నరసి మున్ను
బ్రహ్మసాయుజ్యమున కింత ప్రమితి వలయు

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి. అమృతానందము VI-90

నరుఁడు నిజనేత్రముల తోడఁ బరుని లోటు
చూచెడినిగాని తనలోటు చూడలేఁడు

తనదులోటును దానెప్డు గనఁగలండో
యపుడు సుజ్ఞానియను నాఖ్య నందుఁగాదె

విక్ర. దే. వ.

ఆత్మజ్ఞాని

వినుమాత్మ తీర్థ సంసే
వనము తెఱంగెఱుఁగు నట్టివానికిఁ దిరుగం
జనవలయునె పెఱచోటుల
కని చెప్పుదు రాశ్రితులకు నధ్యాత్మవిదుల్.

తిక్కన. భారత. శాంతి. V-150

నగములెల్లఁ బుణ్య నగములు నదులెల్లఁ
బుణ్యనదులు వినుము భూసురాగ్ర
గణ్య యకలుషం బకర్దమ మనఁజాలు
నాత్మ తీర్థమెఱుఁగు నకలుషునకు

తిక్కన. భారత. శాంతి. V-236

ఒడలు నస్థిరత్వ మూహించి యాత్మ యం
దధిక నిష్ఠగలుగు నతఁడు సకల
భూతకోటి వలనఁ బొందఁడు భయము రా
గాది దుఃఖములకు నగపడండు.

తిక్కన. భార. అశ్వమేధ I-201

తన పూర్వార్జిత పుణ్యపాపఫలముల్ దానప్డు భోగించుట
న్వినునిత్యోక్తములైన కర్మములాగి స్నిష్కాముఁడై సేయుట
న్దను బంధంబును వెండిఁ బొందఁడ నిజాత్మ జ్ఞానవంతుండు యో
గ నిరూఢాత్మకుఁడైన యుత్తముఁడు

మారన. మార్కండేయ. III313-

విసువక యాత్మ వివేక నేత్రమునఁ
బొడఁగాంచు యోగికిఁ బొడమునే మాయ

తిమ్మయ. ద్విపద. భారత. ఉద్యోగ. ప. I-22

తన స్వరూపము తా నెఱిఁగిన యెడ నరుఁ
డైహికా లోలతను దేవులాడఁ డెప్పు
డాట వస్తువుకై యేడ్చునట్టి బిడ్డఁ
డైన నద్దముఁగని యేడ్పు మానుఁగాదె

పానుగంటి. పాదుక. IV

## ఆత్మదోషము

తప్పు లెన్ను వారు తమ తప్పు లెఱుఁగరు

వేమన

తన మొగంబు తనకుఁ । గనఁబడ కాదర్శ । మందుఁజూడఁబడెడు నవ్విధముగఁ
దనదుతప్పు తనకుఁ గనఁబడ కగపడు । బుధ విమర్శనమునఁ బొందుగాను.

వి. దే. వ.

## ఆత్మనాశము

ఇట్టుల మగు నాత్మవినాశము
కలుగుట యది విపుల పాతకం బండ్రు బుధుల్

తిక్కన. భారత. శల్య. I-57

## ఆత్మబలము

పశు గుణము వోదు ప్రతిపశువర్తనమున
నాత్మ తేజంబు చేతనే యణఁగుఁగాని.

పానుగంటి. రాతిస్తంభము. నాంది

## ఆత్మబుద్ధి

వెరవిట్టి తెఱఁగిది వెంగలి తనమని
యెల్లవాఁడును దనయెఱిఁగి నట్టి
తెఱఁగున నిజకార్య దృష్టియ కయికొను
నొరుల నేర్పులు పట్ట నొల్లఁడాత్మ
బుద్ధియ మేలని పొగడు

తిక్కన. భారత. సౌప్తి. 1–46

తగునని మరణాదుల కై
తెగువ దెసన్ మానవుండు దృఢ నిశ్చయతం
దగిలిన యది పరమహితం
బుగ వదలక నడుపు నన్యబుద్ధులు గొనమిన్

తిక్కన. భారత. సౌప్తి. I–47

తనబుద్ధిఁ గాదె బాలుఁడు
జననిఁ బ్రసన్నాత్మఁ జేసి చన్నిచ్చువిధం
బునకుం జేర్చుందగ నె
వ్వనితో నేచదువు చదివెవాడుం బెంపన్

కేతన. దశకుమార. II–10

తన కెవ్వరెంత మంతనము చెప్పినను
దన బుద్ధిలోఁగాని తానుండువలదు

తిమ్మయ. ద్విప. భారత. అది. పు. 5–304

పలు తెఱంగుల విను పరబుద్ధి కంటెఁ
బొలుపొందఁగా నాత్మబుద్ధియె మేలు

సోమన. ద్విప. భారత. సౌప్తిక. పు. 1–6

## ఆత్మవిద్య

పెడవిద్య లెవ్వియును భవ
ముడుపఁగ లేవాత్మ బంధముడుపు నదియ యె
క్కుడువిద్య యట్టివిద్యలు
దొడఁగు పనియ మంచిపని

ఎఱ్ఱన. నృసింహ. IV–161

వంచన మదిగల వారికి
సంచితకర్మములు విడని సందేహాలకున్
బంచేంద్రియ లోలురకును
ప్రాంచితముగ నాత్మవిద్య యందదు

వేమన

## ఆత్మవిశ్వాసము

విదిత స్వశక్తిపై విశ్వాసమున్న
ఎదిరి సామర్థ్యంబు తృణముగాఁ దోఁచు

శ్రీనాథుడు. పల్నాటి వీరచరిత్ర. పు. 36

## ఆత్మశుద్ధి

విను మానస ప్రసన్నతఁ
దనుగను పురుషుండు గలుషతంగానఁడు దే
ఱిన నీట రూపు సూడఁగ
ననువై కలఁకనది లేని యట్టుల పోలెన్

తిక్కన. భారత. శాంతి. IV–185

నియతేంద్రియులకు నాత్మ ప్రత్యాశనంబు యుక్తంబు

మారన. మార్కండేయ. VII–17

ప్రాజ్ఞులు పూర్వకర్మ కృతంబైన సుఖదుఃఖ జాతంబు
భోగంబున నాశంబు నొందించి
యాత్మప్రక్షాళనంబు నేమఱరు

మారన. మార్కండేయ. VII-17

వినుఁ డనేక జన్మ జనితమై బహుకర్మ
పుంజకర్దమమున బ్రుంగునట్టి
యాత్మనిర్జితేంద్రి యాదులచేఁ గడు
గంగఁబడు మహాత్మసంగవారి

మారన. మార్కండేయ. VII-16

చిత్త శుద్ధిగల్గి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియు గొదువకాదు

వేమన

ఆత్మశుద్ధిలేని యాచారమది యేల

వేమన

ఆత్మశుద్ధిలేక యంటునా మోక్షంబు

వేమన

తాలిమినాయందు మంచితనములు గలిగితే
మూలనున్న నాకర్మములె కట్టివేసునా?
నాలోబుద్ధి గలిగితే నలిఁగామ క్రోధములు
ఈలీల సొమ్ములని యెన్నుకొందునా?

అన్నమయ్య. అధ్యా. సం.

చల్లనగు వాని కగ్ని యుష్ణత్వమీదె
కల్మషా సహ్యులకు శుద్ధి గంగయీదె

విషము సంజీవి చేయఁడే భేషజుండు
శిష్టత నొసంగు స్వచ్ఛాత్మ చెనఁటికట్లు

పానుగంటి

శుద్ధమగు నాత్మ తన పారిశుద్ధ్య గంధ
మంతికాత్మలకిచ్చుఁ దన్నంటి యున్న
ద్రవ్యములకు విద్యుచ్ఛక్తి భవ్యమైన
ద్రవ్యమాత్మ నొసంగెడు దారిగాఁగ.

పానుగంటి

## ఆత్మస్తుతి

పరనిందయు నాత్మగుణో
త్కర పరికీర్తనముఁ జేయఁగా నుచితమె స
త్పురుషులకు?

నన్నయ. భారత. ఆది. II-114

. . . . . . . . . . . . . .
తనుఁదాన పొగడుకొనమి
. . . . . . . . . . . . . . .
నడువడికొప్పు సేయు

తిక్కన. భారత. ఉద్యో. II-45

ఆత్మ పంస్తుతి పౌరషంబగునె చెప్పుము

తిక్కన. భారత. ఉద్యోగ. II-264

ఆత్మ ప్రశంస సేయుమది మరణంబని పెద్దలు సెప్పుదురు

తిక్కన. భారత. కర్ణ. III-90

కులజుండు తనుఁ దానె కొనియాడు కొనునె

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. అర. పు. 190

తనుదాన పొగడుకొనినను
గనునే నిజగుణము నధిక గౌరవమును స
జ్జన సేవ్యములై యవి పే
ర్చినఁ గలుగుంగాక యొందుఁ జిర తర మహిమల్

ఎఱ్ఱన. హరివంశము. పూ. భా. VIII-87

తనుదానె పొగడు కొనుటది
ఘనమతుల పథంబుగాదు

నృసింహకవి. కవికర్ణ. II-215

తనుదానె పొగడుట తగనిచ్చి వగపు
మనసు నొచ్చెడి పల్కు మహి నోజగాదు

తిమ్మయ ద్విప. భారత. ఉద్యోగ. పు. I-19

ఎవ్వఁడు సంప్రాప్త మృత్యుఁడో నతఁడు
క్రొవ్వునఁదన్ను నల్గురిలోనఁ బొగడి
హతుఁడగు

వరద. రామా. అరణ్య. పు. 98

తనకుఁదానె పొగడు కొనునట్టి వానికిఁ
దెలివిఁ గలుగు వాఁడు దెలియఁజేయు

అ. నారాయణదాసు

ఆత్మహత్య

తనుదానె హత్యచేసిన
మనుజున కిహపర సుఖములు మాలుట తథ్యంబు

కేతన. దశకు. VI-10

పాపమ్ము చేసికొని బావిలో పడితే
పై మురికియేగాని పాపాలు పోవు

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి సంపాదితము
పల్లెపదాలు పు. 49

ఆత్మహత్యకంటె నఘము గలదె

దా. శ్రీ. దేవీభాగ. VII-428

ఆదరము

నిండు దలంపునందగ రా
పొండను గారవము లేని పొరపొచ్చెమునం
గొండంత పసిండి యిచ్చిన
నుండంగాఁదగునె

పొన్నికంటి తెలగన. యయాతి. III-90

ఆనందము

విమల జ్ఞానులు శమమును
దమమునుఁద్యాగంబు శాశ్వత ప్రచురానం
దమునకు మూలము లంద్రు ని
జముగాఁ గైకొందురవి ప్రసన్న వివేకుల్

తిక్కన. భారత. శాంతి I-142

నలిచిన ప్రపంచకల్పములలో
నానావిధముల జంతువులు
తముదాఁజూడఁగరాని రూపు
లద్దములో పలఁగన్నట్లు
శ్రీవేంకటపతి రూపము

గ్రక్కున నెదుటనె సేవించి
అనయము తనుదా సేవించుచు
యాత్మానందం బిది నుండీ !

తా. అన్నయ్య. అధ్యా. నం.

ఆపద

ఆపత్పరికలన ప్రమాదంబు నంగాక యున్నె

తిక్కన. భారత. శాన్తి. II-15

ఆపద సమస్త లోకులఁ
బ్రాపించుఁ దొలంగు నపుడు పవనము భంగిం
బైపడు నాపద సైఁచిన
......క్షణములోనఁ బొందు శుభంబుల్

భాస్కరుఁడు. రామా. అర. II-34

ఆపదలు గాఁపులుండవు
చూపులకుఁ గులాద్రి యట్లు చుట్టు కొనుఁదుదిన్
రూపేది విరిసి పోవు మ
హా పవనాహత పయోధరావలి భంగిన్

అనంతుఁడు. భోజరాజీయము V

ఆలోచనంబు సేయక వేగిరించు
పాలసు లెందు నాపద పొందుటరుదె

వరద. రామా. సుందర. 184

అల్పరోష మానాది విదూరుఁడై
పరఁగు నాతని కాపదలంట నేర్చునే

భవానీశకవి, ధర్మ. VI-35

ఆపత్తయిన వచ్చినపుడు ధైర్యమంతయు విడువరాదు

బొబ్బిలిరాజు కథ పుట. 39

## ఆపద్ధర్మము

అయనయహీనతం దమకు నాపదయైనెడ నిట్టునట్టునే
మియునలేని కూడదియు మేవడియై చను.

తిక్కన. భారత. ఉద్యో. III-222

ప్రాణములు పోవకుండఁగఁ బరిహరింప
నొండుపాయ మెయ్యదియు లేకుండ నేని
ముచ్చిమియు ధర్మమగు నధముని ధనంబు
గొనుట యెందును ముఖ్యమై చనుట గలదు

తిక్కన. భార. శాంతి. III-287

ఆపదవసరముల నధముఁ డెక్కువజాతి
వృత్తినున్న దోషవిధముగాదు

పోతన. భాగవతము. VII-410

## ఆప్తవాక్యము

మొదల నప్రియమయ్యును దుదిఁ గరంబు
పథ్యమగు పల్కు ప్రియులందు బలిమినైనఁ
బలుకవలయు మోమోడక

నన్నయ. భార. సభా. II-192

మతిమంతులైనవారికి
హితులగు వెఱవుగలవారలెఱిఁగింతురు దు
స్థితిగాకుండఁగఁ గార్యము
గతి యొత్తియుఁ దప్పులిడియుఁ గడవఁబలకయున్

తిక్కన. భారత. సౌప్తిక. I-79

ఘనుఁడాప్తుఁడునగు సచివుఁడు
వినిపించిన రాజనీతి వేయేటికి రు
గ్ణునకుఁ జికిత్సాక్రియవలె
మును వెగటుం బిదప హృద్యమును నై యుండున్
కరాజు వేంకటనాథకవి. పంచ. I–385

అయిన వారి మాట అమృతంపు తేట
బ్రతికి ఉన్నదాఁక భాగ్యంపుమాట
త్రివేణి. పు. 315 - ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

## ఆప్తులు

స్నేహితుండొకఁడుఁ దరుణియు నొకర్తు
నిర్వికారకద జనులకీయుర్విఁ బ్రియులు
తిరుపతి వేంకటకవులు మృచ్ఛకటికము. IV–52

## ఆయవ్యయములు

అమరఁగ నాయవ్యయముల
క్రమము జలము పెద్దయెత్తు గైకొని యది స
న్నముగ వెలార్చుచు నుండెడి
కమండలువుఁ జూచియైనఁ గాదే తెలియన్
మంచన. కేయూరబాహు. III–163

లోభంబొప్ప జేనియు
నతివ్యయ శీలత్వంబు మేలా?
మంచెన. కే. బా. చ.

పిల్లుగట్టునల కుబేరుండు దానైన
నాయమునకు వెచ్చమధికమైనఁ

బేదయైన ధనదు పెన్నుద్దియై చను
నాయమునకు వెచ్చమల్పమైన

జక్కన. విక్రమార్క. II–171

నేఁటి నాగరకత నీమేలుగోరక
యప్పుచేసి బ్రతుకుమని విధించు
నాయవృద్ధికన్న నావశ్యక పదార్థ
సంఖ్య హెచ్చఁజిత్తశాంతి యున్నె

దువ్వూరి. కృషి. 107

ఆయువు

క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల
వలని భక్తియు నాయువు వొలుపు నిచ్చు
నలుకబొంకు క్రూరత శుచితాపగమము
గురు విరోధ మాయువుఁ గడుఁ గుందఁ జేయు

తపముననుబ్రహ్మచర్యవ్రతమున హితమి
తాశనమున రసాయనాభ్యాసముననుు
బెరుఁగు నాయువు

తిక్కన. భార. అను. V–130, 131

తన లావున కధికమయిన
పనిసేయు టయుక్తమును నపథ్యమునగుభో
భోజనములు హరించు నాయువు

తిక్కన. భార. అను. V–133

ఆయువు శేషించినచోఁ
బాయక జననంబు వసుధ ప్రాప్తంబగు న

య్యాయువు పూర్ణంబుగ ధృతి
నాయత పుణ్యమున జీవుఁడగును మహాత్మా

హరిభట్టు.

## ఆర్జవము

కుటిల బుద్ధులఁ గెలువంగఁ గుటిలమతియ
యర్హమగుఁ గాని నీతిగా దార్జవంబు

శ్రీనాథుఁడు శృం. నై. III-65

విహిత కర్మంబు లెందుఁ గావించు నెడల
మఱి నిషిద్ధ కర్మంబులు మాను నెడల
వాఙ్మనః కాయ కార్యైక్య వర్తనంబు
సూవె యార్జవమన

సూరన. కళా. V-147

ఎంతటివాఁడైన నగు న్నిశ్శంక వర్తనుఁడెందున్

సూరన. కళా. III-167

## ఆర్తరక్షణము

శరణము సొచ్చినందఁగఁ బ్రసన్నతఁగైకొని రక్షణంబుసా
దరముగఁ జేయుటత్యధిక ధర్మముగా బుధకోటిసెప్పు

తిక్కన. భారత. శాంతి. III-313

చెడిన మానవులను జేపట్టి రక్షించి
కడకు జేర్చినట్టి ఘనులు తలఁప
విడని పుణ్యమగుట విశ్వేశు సన్నిధి
నెడ తెగకయ యుందు రెపుడు వేమ.

వేమన

...మహాభయార్తులం
గుఱుకొని యెంత నిర్దయులుఁ గ్రూరత కోర్చి వధింప నేర్తురే
జక్కన. విక్రమార్క. III-83

అరయ నాపన్నుని కభయ మీవలెఁ గాక
ఇరవైన సుఖిఁగావనేలా
అనయము దుర్బలుని కన్న మిడ వలెఁగాక
తనిసిన వానికిఁ దానేలా
తా. అన్నమయ్య. అధ్యా. వం.

ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన
ప్రాణుల రక్షింప వలయుఁ బ్రభువుల కెల్లం
ప్రాణుల కిత్తురు సాధులు
ప్రాణంబులు నిమిష భంగురములని మగువా
పోతన. భాగవతము. VIII-234

......అవదాత సువృత్త మూర్తు లెం
దును నిజ సౌఖ్య భంగము గనుంగొన రార్తులఁ బ్రోచు వేళలన్
భట్టుమూర్తి. వసుచరిత్రము. IV-102

ఆర్తరక్షణమె యనంత పుణ్యంబు
గీర్తియు మహిఁ గలిగించు నెల్లరకు
వరదరాజు. రామా. అరణ్య. పు. 29

ధూర్త దండంబు గాకున్న నార్త రక్ష
జరుగదని నేను మనవిని జలుపు కొనెద
పానుగంటి. వన. రాఘ. IV

శరణు శరణన్న వాని రక్షణము సేయ
నట్టి వానిని జయలక్ష్మి యాదరింప
దాదరింపరు నెచ్చెలు లాత్మ బంధువులును

తిరుపతి వేంకటకవులు. మృచ్ఛకటికము. IV-80

## ఆర్తుఁడు

నెవ్వగఁ గుందిన మానవుండు వైరుల చేతం
దెగుఁ గాని తనదు కార్యముఁ దగ నొనరింపంగ లేఁడు

తిక్కన. భార. ద్రోణ. II-357

ఆపత్కాలంబునఁ గార్యము సెడి
బాలిశుఁడత్యంత శోకపరుఁడై పొలియున్

భాస్కరుఁడు. రామా. అరణ్య. II-324

ఆర్తుండైన నరునికి విజ్ఞానంబేల కలుగును

భాస్కరుఁడు. రామా అర. II-346

## ఆర్యులు

పెద్దల చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్

నన్నయ. భార. సభా. II-19

శారీర మానస మహా
దారుణ దుఃఖములఁ జేసి తఱిఁగి శరీరుల్
క్రూరతర బాధఁ బొందుదు
రా రెంటిని జెఱుతురార్యు లమలిన బుద్ధిన్

నన్నయ. భార. అరణ్య. I-23

గతము నందును ననాగతమునందు
వగవరార్యులు సంతోషవంతు లగుచు

ఎఱ్ఱన. భార. అరణ్య. V-141

ఎడపక వాఙ్మనః క్రియలనేరికి నెగ్గొనరింపఁ బూనరె
య్యెడలను దీనులం గరుణ నేర్పడఁ బ్రోవన చూతురిచ్చచోఁ
గడమనడంగ నీకెదిరి కాంక్షితముల్ దుదిముట్టఁ దీర్తురె
క్కుడు మదిఁగూర్తు రాశ్రితులకున్ వినుమిన్నియు నార్యధర్మ-
ముల్

ఎఱ్ఱన. భార. అరణ్య VII–228

ఆర్యులు తఱితోఁ దగియెడు
కార్య మనుష్ఠింతు రట్లుగాకప్పనిమా
త్సర్యమునఁ దగిచి పట్టియు
నార్యులు దుది దూరవగతు రాపదయైనన్

తిక్కన. భార. స్త్రీ. I–18

కలఁగుదురే విపద్దశల కాఱియ నార్యులు

తిక్కన. భార. ద్రోణ. II–149

ఆర్యులు జనన మరణాదుల వలని భయంబు
నుజ్జగించు పరమ సుఖంబు నొందుదురు

తిక్కన. భార. స్త్రీ. I–61

ధైర్యంబున వీర్యంబున
శౌర్యంబునఁ బ్రజ్ఞఁబడయఁ జాలునెనరుఁడె
క్కార్యము నప్రాప్యమయిన
నార్యుండది యెఱుఁగు గాన యడలఁడు

తిక్కన. భార. శాంతి. IV–415

ఆర్యవచనామృత మానినవాఁడు గీడు మేల్
గనుఁగొనఁజాలు

తిక్కన. భార. అశ్వ. II–75

ఆతతమైన కర్మగతి నాయువు వీడ్కొను నప్పుడాత్మలోఁ
గాతుక మావహించునది గావున నాక సుఖంబపథ్య మా
పాత సుఖోన్ముఖుండయిన పంచజనుండు భజించుఁ దానిఁగా
మాతురతాతిరేకమున నార్యుల కింపవు దత్ప్రకారముల్

శ్రీనాథుఁడు. శృం. నై. III-135

కలిమిని కనునొక్క సమంబై కాని
తొలఁగింప రార్యులు తోడ్పడువారి

వరద. రామా. కిష్కింధ. పు–305

## ఆలస్యము

తామసించి చేయఁ దగదెట్టి కార్యంబు

వేమన

గోరంతాలస్యంబునఁ
గొండంత ప్రయోజనముదప్పు

సూరన. కళా. II–180

రమ్యబహుళాచ్ఛ సద్గుణరాజినైన
నెట్లుగర్వము నింద్యమానట్లు చేయు
నట్లె యెట్టి క్రియా కౌశలాధికతను
నైన నలసత ధ్వంసమానట్లుసేయు

పానుగంటి. కోకిల. 2

పని యదనునఁజేయక మూల్గువానికిఁ
బని యెక్కువగుఁ గష్టమును నష్ట మినుమడించు.

పానుగంటి. కల్యా. రాఘ. III.

## ఆవేశము

ఆవగింజంత భూతి మైనలందిఁ కొనిన
వెలఁది గుమ్మడి కాయంత వెఱ్ఱిపుట్టు

శ్రీనాథుఁడు. హర. II-98

## ఆశ

అది సర్వదోషములకా
స్పదమది దురితక్రియాను బంధంబులకున్
మొదలు నిరంతరదుఃఖ
ప్రదమని యెఱిఁగినను దృష్ణఁ బాతురు సుమతుల్

తృష్ణాతురుండర్థలోభంబునఁ గోటరస్థంబయిన
యనలంబునం జేసి దగ్ధంబగు వృక్షంబును బోలె
వినాశంబును బొందు

నన్నయ. భార. అరణ్య. I-25, 26

అనుభవించి తనిసియట మఱి విషయముల్
విడుతునని తలంచు వెడఁగుఁదలఁపు
లఖిలశిఖిశిఖాళియఁ దింధ నాజ్యముల్
గమియ వైచియార్పఁ గడఁగునట్లు

నన్నెచోడుఁడు. కు. సం. VI-69

మది సుఖము గోరి దుఃఖం
బొదవంగల కార్యములకు నుత్సాహము సే
యుదు రొప్పని తృష్ణం బడి
చదు రేమియు లేని యట్టి జనులాతురులై

తిక్కన. భార. ఉద్యోగ. I-360

ధనవత్త్వము దుఃఖకరం
బని కని తత్కాంక్ష విడుచు నతనికధనతా
జనితాత్మాధీనత్వం
బనుపమ సౌఖ్యంబు సేయు నక్షీణముగన్

తిక్కన. భార. శాంతి. IV–38

దొరకొన్న ననుభవించుచు
దొరకొనమికిఁ జింతనొంది దురపిల్లక ని
ర్భరుఁడై యున్నను దృష్ణకుఁ
జొరవచ్చునె యతని మనసు సువ్రత శీలా

తిక్కన. భారత. శాంతి. V-376

రమణీ! తృష్ణాసమదుః
ఖమును బరిత్యాగసమసుఖముఁ గలదే కా
యము ముదిసిన ముదియదు ప్రా
ణము గొనిపోఁజాలు తెవులనం జను కృష్ణా!

తిక్కన. భారత. అను. V 232

ఆకలియు నీరు వట్టునయ్యె వెరవుల
నడఁచు దాఁక సౌఖ్యముఁ జూతురల్పబుద్ధు
లెపుడు నాఁకని చిచ్చుతో నిడుమఁ బడుట
గరము దుఃఖంబు గాక. సుఖంబె

ఎఱ్ఱన. నృసింహ IV-66

పసిఁడియుఁ బశువులు భామలు
వసుమతి మీఁదఁగల యంత వట్టునొకఁడయిం
పెసఁగఁగఁ బడసియుఁ దనియఁడు
విసువ వలదె తృష్ణవలన విరతి ప్రాప్తిన్

ఎఱ్ఱన. హరి. పూ. భా. III- 62

ఆశ చాలించుటే ఆనంద పదవి

**శ్రీనాథుఁడు పల. వీ. చ. వు. 41–69**

ఆశయె యిహపర సౌఖ్యవి
నాశము భవబంధములకు నైరుతి తానై
యీశుని గనుగొననీయదు
యాశ వినాశమయి పరగు నవనిని

**వేమన**

ఎక్కుడైన యాశ కేనుమడియైయుండ
దిక్కుపట్టి నరుడు తిరుగుచుండు

**వేమన**

కలిగినట్టులుండు గలుగకయుండును
మఱియు లేక యుండు మఱియుగలుగ
నాశకొలదిని శివుడందించు చుండును

**వేమన**

పదిలమగు నాశానుభవము పాపినయట్టి
తుదఁగదా తాను సంతోషంబు గనుట

**తా. అన్నమయ్య అధ్యా. సం.**

ఆసలకుఁ జోటుగద్దు అంతరంగాన నెంతైనా
వీసమంతాఁ జోటులేదు విరతికిని

**తా. అన్నమయ్య అధ్యా. సం.**

పెంచఁగఁ బెంచఁగఁ బెరిఁగీనాసలు
తుంచఁగఁదుంచఁగఁ దొలఁగునవి
తడవఁగ ఁదడవఁగఁదగిలీ బంధము
విడువఁగ విడువఁగ వీడునది

**తా. అన్నమయ్య అధ్యా. సం.**

కోరఁగోరే యాసలెల్లఁ గోటానకోటి
అరితేరి బ్రతుకఁగానాసలే మిగిలెను

తా. అన్నమయ్య ఆధ్యా. సం.

ఆశాపాశము దాఁగడున్నిడుపు లేదంతంబు రాజేంద్ర వా
రాశి ప్రావృతమేదినీ వలయసామ్రాజ్యంబు చేకూరియుం
గాసిం బొందిరిగాక వైన్యగయ భూకాంతాదులున్నర్థ కా
మాశం బాయఁగ నేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే

పోతన. భాగవతము. VIII-579

అదలదు ప్రాణములదరిన
గదలదు సర్వాంగకములుఁ గదలుచు నుండన్
వదలదు బిగువులు వదలిన
దుదిలేఁదీ తృష్ణదీనిఁ ద్రుంపగ వలయున్

పోతన. భాగ. IX-576

ముదియనివి రెండు సిక్కెను
బ్రదికెడి తీపియును విషయపటు స్పృహాయున్

పోతన. భాగ. IX-578

కడలేదాశాలతకుం
గడఁజూడఁగఁ గానరాదు కడఁగని రేనిన్
గడుముదమున సంసారము
గడఁగందురు తత్త్వవిదులు

పోతన. భాగ. IX-579

మఱచి కాననమునఁ గొఱవిదయ్యముఁ గాంచి
యగ్నిఁ గోరివెంట నరుగుమాడ్కిఁ

గాంచనంబుఁగోరి కలవారియిండ్ల పం
చలను దిరుగునరుఁడు చలనమంది

గంగన. భాగ. V–168

జీర్ణించు వెంట్రుకలుగడు
జీర్ణించును లోచనములు చెవులును ముక్కున్
జీర్ణించుగాని యాశలు
జీర్ణింపవు ముదిమి నరుని జెందినవేళన్

వెన్నెలకంటి సూరన. వి. పు. VI–179

అవివేకులు తృష్ణలచేఁ
దవిలి ప్రవర్తింతు రధికతర దుఃఖములన్
సువివేకులు తృష్ణలచేఁ
దవులకవర్తింతురధిక తర సౌఖ్యములన్

వెన్నెలకంటి సూరన. వి. పు. VI–180

చావంగాలము చేరువౌటెఱిఁగియున్ జాలింపఁగా లేకత
న్నేవైద్యుండు చికిత్సఁ బ్రోవఁగలఁడో యే మందు రక్షించునో
యేవేల్పుల్ కృపఁ జూతురో యనుచునిన్నింకైనఁజింతింపఁడా
జీవశ్రాద్ధముఁ జేసికొన్నయతియున్

ధూర్జటి. కాళహస్తీశ్వర శతకము–34

ఆశ మానుట వినుమత్యంత సుఖము

సోమన. ద్విప. భార. శాంతి.

ఇలమీఁద నాసయు నింతులయాస
కలిమిపై నాస యెక్కుటియె యెల్లరకు

వరద. రామా. కిష్కింధ. పు–337

ఆశాసాగర పారమేరికిని శక్యంబౌనె చేరంగ

లక్ష్మణకవి. సుభాషితములు. II-28

అగ్గలమగు తృష్ణ యెవ్వనికిని గాఢదరిద్రుఁడువాఁడు

లక్ష్మణకవి. సుభాషితములు. III-53

ఆశ విడువక యున్న సౌఖ్యంబు కలదె

నూరకవి. రామలింగేశ శతకము. 20

పొందఁజాలని కోర్కెను పొందఁగోరు
నట్టివాఁ డుండునది చెడగొట్టుకొనును

అ. నారాయణదాసు

తనకుఁగల కొలందిఁ దనియ కొరుని దాని
కాస చేయువాఁడు మోసఁబోవు

అ. నా. రా.

కడలుఁద్రొక్కు కొలఁదిఁ గప్పగంతులెగయు
నడచిన కొలంది మిట మిట లాడుతృష్ణ

పానుగంటి. బుద్ధ. II-

అగ్నిరాజు చుండ నట్టె యార్పఁగ వచ్చు
నాశలనెడు మంటనార్పఁ దరమె

పానుగంటి. చూడామణి. II-

చేయు నగమ్యాగమనము
పాయక సలిపెఁడు నభక్ష్యభక్షణమిఁక తా
నేయది యాశా బద్ధుఁడు
సేయఁడు లోకమున నాస, ఛీ! ఛీ! తగునా

దా. శ్రీ. దేవి.

ఆశారాక్షసి కుక్షి దొడ్డది

దా. శ్రీ. దేవీ. భాగ. III–325

సుతులును దల్లిదండ్రులును సోదరులుంగల రే ధనాశకున్

దా. శ్రీ. దేవీ. భాగ. VII–320

ఆశం బోలఁగఁ జాలు శాత్రవుఁడు లేఁడు

తిరుపతి వేంకట కవులు. బుద్ధచరిత్రము. IV–69

కనినంత దానిని గబళింపఁ గలను
కనులు పెద్దవి గావె కడుపునకంటె

నీతి పదములు. I–47

ఆసకు దాసుండెవ్వఁడొ
దాసుఁడగు నతండు సర్వధాత్రి చరులకున్
ఆస యెవని కిం దాసియొ
దాసులగుదు రెల్ల జనులు తథ్యమతనికిన్

వి. దే. వ. ర. పు. 12

ఆస హెచ్చి హెచ్చి మోసపుచ్చు

కాంచనపల్లి కనకాంబ. జీవయాత్ర. ప్రా. ఉ. 547

## ఆశుకవిత్వము

ఆశుధారాకవిత్వంబులందు శయ్య
లుపమ లుత్ప్రేక్షలును లేక యుండుఁగాన
నెంత యోజించినను బద్యమంత సార
వంతమగుఁగాన నిలుకడ వలయుఁ గృతికి

అప్పకవీయము I–59

ఎఱుఁగని మొఱకుల తిట్లును
నెఱుఁగని యాశుకవనములు నెక్కటిగా రా

పఱు గాలికిఁ బోయెడి యల
కొఱగాని పరాగమట్లు

తిరుపతి వేంకటకవులు. గుంటూరుసీమ. పు. 133-350

## ఆశ్రమధర్మము

బ్రహ్మచర్య వ్రత పరమ నిష్ఠయు గురు, నాశ్రయించుటయు నధ్యయనకృతియు
నగ్నికార్యంబు గుర్వర్థ సంచారంబు, భైక్షచర్యయుఁ గమలాక్షి బ్రహ్మ
చారి ధర్మంబు లాశ్రమముల కెల్లనా, శ్రయణీయమై గృహస్థత్వ మొప్పు
శౌచంబు నిజదార సంతుష్టియును బంచ, యజ్ఞంబులును నిగమాభిరతియు

దాన హోమ దయాతిథి మాననములు
వలయు గృహమేధికిని వనవాస వన్య
భోజన బ్రహ్మచర్య జటాజినప్ర
ధారణములు వానప్రస్థ ధర్మకోటి

తిక్కన. భారతము. అను. V-15

బ్రహ్మచర్యాదులగు నాల్గుఁ బాదమహిమ
గాఁగఁ బరఁగెడు ధర్మమొక్కటియ చూవె
యెవ్వఁడెందు వర్తించిననేమి సకల
కర్మఫలరూపకత్వ మొక్కటియకాదె

తిక్కన. భారత. శాంతి. V-336

అనఘ బ్రహ్మచారి కవలియాశ్రమముల
కరుగుచోట వినుము వరుస వలవ

దిష్టమైన యట్టి దే యాశ్రమంబైనఁ
జేకొనంగఁదగు విశిష్టచరిత

ఎఱ్ఱన. మార్కం. పు. III-144

ఇదియు మేలన్న యట్లుండు నిదియు లెస్స
యన్న యట్లుండు నొక్కొక్క యాశ్రమంబు

శ్రీనాథుఁడు. కాశీ. III-209

వ్రతము మానఁ దగదు వటుగు గుఱ్ఱనికిని
క్రియలు మానఁ దగదు గృహాగతునికి
దపసి కూరనుండఁదగదు సన్యాసికి
దరుణితోడి పొత్తుదగదు తగదు

పోతన. భాగవతము. VII-463

ఆశ్రయము

ఇట్టి చందంబు వాఁడని యెఱిఁగి యెవ్వ
రాశ్రయింతురు బ్రదుకుదు రట్టి వారు

తిక్కన. భార. ఉద్యో. II-318

జితశత్రుఁడు బలవంతుఁడు
నతిధర్మపరుండునైన యవనీశుకడన్
మతిమంతుల కుండఁదగుఁ గు
పతి కడ వసియించునతఁడు పడయు నె సుఖముల్

మారన. మార్కండేయ పురాణము. 3-249

పట్టెడు చోటుగాల్చు కొను బాలిశుఁడుండ గలఁడే

నాచనసోమన. ఉ. హ. వం. V-305

అండ దప్పిన నరుఁడతి ధార్మికుని యిల్లు
చేరవలయు బ్రదుకఁజేయు నతఁడు

వేమన

తమ్మున్ నమ్మినవారి డిగ్గవిడువన్ ధర్మంబుగాదంబ్రదు

పోతన భాగ. X-1434

ఘనుఁడు తృణంబైనఁ గడఁగి పట్టినను
ననఘాత్మ మేరుమహాశైల మగును

సోమన. ద్విప. భార. శల్య. పు. 2-38

తన్ను గాచువాని దాపును విడనాడి
తిరుగఁబోవువాఁడు తిన్నఁబడఁడు

అ. నారాయణదాసు. నూరుగంటి. పు. 54

ధనికుని చెంతకు యాచక
జనమచ్యుత యేఁగు నితరుసన్నిధి కేపుడున్
జనదు గుడముండు తానం
బునకుఁ బిపీలక సమూహము సనునుగాదే?

విక్రమదేవవర్మ రచనలు-నీతి. కం. వ్రా. పు. 62

లతలకుఁ బండితులకు మద
వతులకు బలమాశ్రయంబు వలనఁగదా

తనికెళ్ల ప్రకాశశాస్త్రి. నిశ్శంకవంశము. I-20

## ఆస్తికత

ఏకడఁ జూచిన నితరములేదు
చలమునఁదనమతి సందేహించిన
కలఁగిమూఁడు లోకంబులలేఁడు

వెసఁ గనుదెఱచిన విశ్వాత్మకుడిదె
దెసలనింతటాదృష్టంబు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

వినుపుణ్య పాపములుగల
వనియెడు విశ్వాసమెద్ది యదియాస్తిక్యం
బనఁ బరఁగున్

సూరవ. కళా. V-152

ఇంగితజ్ఞత

...సతులు భావించిన యా
కృతిఁగూడ నేర్పుగాదే
యతిశయముగ నింగితజ్ఞులకు ఫలమెందున్

నన్నె చోడుఁడు. కుమార సంభవము. I-103

పాడయినట్టి చిత్తమొకపాటున నిల్పఁగ మాటిమాటికి
ట్టాడుచు నుండఁగా తనదు నాత్మయు నుం దనకట్టిదానినం
గూడునొ కూడదో యెదిరికోర్కె యెఱుంగుట యెట్లు
కుట్టియా

చూడఁగ దోసకాయలె విశుద్ధ యశోధన! యన్యచిత్తముల్.

శ్రీనాథుఁడు, హరవిలాసము. 63

ఇంగితం బెఱుఁగ దే జాణతనము

గౌరన. హరిశ్చంద్రోపాఖ్యానము. 1 పుట. 100

ఇష్టమెఱుఁగు నతఁడె యిలమంచి బుధుఁడౌను

వేమన

చిత్తమెఱుఁగని సతిఁ జేరంగ రాదయా

వేమన

డీకొనంగఁ దగదు డెంద మెఱుంగక
అడుగవచ్చి కొంత యనిన వానిఁ
జెప్పనంత వినియు మెప్పుగాఁ బలుకుమీ

వేమన

## ఇంటిగుట్టు

ఇంటిగుట్టు లంకకుచేటు

లోకోక్తి

అధిప యిదిశాస్త్రమతము గాదరసి చూడ
ధనము వోయిన ఘనమనస్తాపమయిన
నొకటి తన యింట దుశ్శీల మొదవిన నది
బయలు సేయంగఁ దగదను నయము గలదు

చేమకూర వేంకటకవి. సారంగధర చరిత్ర. II-242

## ఇంద్రియ నిగ్రహము

అరయఁగ విషయము లెంతయు
దురంతములు వానియందుఁ దొడరినఁ జేటుం
బొరయుదురు దొడరకున్నం
బరమ పదవి యమ్మహాను భావులకు నగున్

తిక్కన. భారతము. శాంతి. IV-310

విడుపు వలయు సకల విషయవాంఛలయందు
విడుపుఁబోలు గుణము వెదకి యెందుఁ

గానరైరి బుధులు కలదె పరిత్యాగ
శీలునకు నసాధ్య సిద్ధియెందు ?

ఎఱ్ఱన. భారత. అరణ్య V-38

నీవంతర్యామివైన యీ దేహము
పంచేంద్రియముల కొప్పన సేతురా ?
నీకుక్షిలోన నెత్తిన యీ జన్మము
కొంచెపు భోగములకు గురి సేయవలెనా ?

తాళ్ళపాక అన్నమయ్య అధ్యా. సం.

విషయములఁ బొరలి రోయక
విషమంటిన గతినిఁజూచు విధమున ధరలో
విషసమము లాయె సుఖములు
విషయమ్ములఁ గూడకుంద్రు వేత్తలు

వేమన

వెలుపల మరగిన విషయవైభవము
లవి లోపనిడక నిల్పదు తత్త్వచింత

తమ్మయ. ద్విపద భారతము. 5. పు.1 21.

## ఇంద్రియలోలత

హారివిషయాభిలాషము
గారణముగ నెంత యెఱుక గలవారును దు
ర్వార వికారముఁ బొందెదు
వారు నిజేంద్రియము లవి యవశ్యము లగుటన్

నన్నయ. భారతము. అర. I-32

ఇంద్రియములవశగతులైనవారికి
శివుఁగాన వచ్చునే జగతి

నన్నెచోడుఁడు. కు. సం.

విను విషయ జ్ఞానమునకు
ననయంబును మనసు మూల మది కామక్రో
ధనిరూఢ మగుచుఁ బురుషుని
ననిశము నెలయించు నింద్రియార్థంబులకున్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V—80

అడఁగి యుండవు కర్మేంద్రియములు పురుషు
గలఁచు సవతులు గృహమేధిఁ గలఁచునట్లు

పోతన. భాగవతము. VII–363

అక్క, తల్లి, చెల్లె, లాత్మజ యెక్కిన
పానుపెక్క జనదు పద్మనయన
పరమ యోగికైన బలిమిని నింద్రియ
గ్రామ మధిక పీడఁ గలుగఁ జేయు

పోతన. భాగవతము. IX–582

రోసిరోయదు కామినీ జనుల తారుణ్యోరు సౌఖ్యంబులన్
బాసీపాయదు పుత్ర మిత్రజన సంపద్భ్రాంతి వాంఛాలతల్
కోసీకోయదు నా మనం బకటనీకుం బ్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు దీని త్రుళ్ళణఁపవే శ్రీకాళహస్తీశ్వరా!.

ధూర్జటి. శ్రీకాళ. శ. 32

అనఘ! మూఢాత్ము చిత్తంబునందు విషయ
జ్ఞాల మత్యంతగాఢ సంసక్తినొందు

లక్కరసము దండాదులఁ జిక్కఁబట్టు
చందమున దీనిఁగనుట ప్రశాంతి కరము

తిక్కన. భారత. శాంతి. V-528

విను సుమతి విషయముల యం
దునికి గలిగెనేనిఁ బొందఁ దుదకంబులఁ బొం
దని బిసరుహ పత్రము చా
ద్పున నది విజ్ఞానఫలము భూపవరేణ్యా!

తిక్కన. భారత. శాంతి. V-527

విషయంబులు నశ్వరములు
విషసన్నిభములు సమగ్ర వికృతి జనకముల్
ధిషణాగుణముల నెల్లఁగ
లుషములుగాఁ జేయు మోహలోభకరములై

తిక్కన. భారత. అశ్వ. II-139

జాగరమే కడుఁ జేయఁగఁ జేయఁగ
సతతము నిద్దుర రానట్లు
చేగల నింద్రియములతోఁ దిరిగిన
చిత్తవికారము లయపడదు

తా. అన్నమయ్య. అధ్యాత్మ. సం.

కంటకపు టింద్రియాలు కడువింత శత్రులై
అంటిన మోక్షము ద్రోవనంటకుండా జేసెను

తాళ్ళపాక అన్నమయ్య. అధ్యా. సం

వట్టి భ్రమవంటిది పంచేంద్రియ సుఖము
మిక్కిలి తీపై యుండు మీసాల మీఁదఁటి తేనే

తాళ్ళపాక అన్నమయ్య. అధ్యా. సం. సం.

ఉర్వి నెవ్వారల కింద్రియంబులనివార్యము లుద్ధతముల్
గణింపఁగన్

పెద్దాద నాగరాజామాత్యుడు. శకుంతలా పరిణయము. II-95

విషయేచ్ఛతో సంచరించెడి వారి వెఱ్ఱిని
శక్యమేమహిఁ జెప్పఁగన్

రంగావధూతలవారి జ్ఞానబోధ. 64

## ఇల్లఱికము

ఇల్లటపు టల్లుండు ఇంటికిచేటు
పేడిమూతివాఁడు పెండ్లానికి చేటు

తెలుఁగు జానపదగేయ సాహిత్యము. పు. 275

## ఇహపరములు

ఇది కర్మభూమి భోగాస్పదమాలోకమ్ము ధర్మపరులకు
సులభం బదిసత్యశౌచసౌజన్యదయాదులు లేనివారి కప్రాప్య
మగున్
ఈలోకము దుఃఖ బహుళ మాలోకము భూరి సుఖనిరంతర
మందే జాలియును లేక యెుండొరు తో లెస్సగఁబొంది
యుందుదురు జను లనఘా

తిక్కన. భారత. శాంతి. IV-110, 111

ఈ లోకంబు గర్మభూమియు నాలోకంబు
ఫలభూమియు ననీ యెఱుంగు

ఎఱ్ఱన, భారతము. అర. VI-138

ఇహపర సౌఖ్యము లొల్లక
దహరమునను గుఱిని డించి దత్తము గాగం

గుహారములో వెలిబయలున
మహాదాకాశంబుఁజేరు మహిలో వేమా!

ఇహామునందు గురుని కీ దేహ మిచ్చినఁ
బరముఁజూపి గుఱుతుఁ బట్టి యిచ్చు
స్థిరముగాను బుద్ధి చెడనీక చూడరా॥

ఇహామునందు సుఖము లింపార కుండిన
పరమునందు నెట్లు పడయవచ్చు
మొదటలేని చేవ తుదనెట్లు కల్గురా?॥

ఇహాము విడిచి ఫలము లింపుగఁ గలవని
మహిని బల్కువారి మతము కల్ల
ఇహాములోనె పరము నెసఁగుటఁ గానరో!॥

ఇహామున సుఖయింప హేమతారకవిద్య
పరమున సుఖయింపు బ్రహ్మవిద్య
కడమ విద్యలెల్లఁ గల్లమూఢుల కెరా!

వేమన

ఎంచి చూచినను నిహామే పరము వేవేలు
వగలు వేడుకలె సందియము లేదిదె భావమున
నమ్మిన ప్రపన్నులకును

తాళ్ళపాక అన్నమయ్య. అధ్యా. సం.

పరలోక సౌఖ్యానుభవమెన్నఁ డొదవు
నురుతర భోగంబు లొల్లక చెడుట

యడరు నజీర్ణ భయంబునఁ గూడు
విడచి యూరక చచ్చు వెంగలి విధము
గౌరన. హరిశ్చంద్రోపాఖ్యానము

పరవనితాసక్తులకును
బరధన రక్తులకు నిహముఁ బరముం గలదే
పోతన. భాగవతము. IX–310

## ఈషణత్రయము

ధన దారా పుత్రేషణ
మనెడిది ఘనలోక వాంఛయగు
వేమన

సంకిలిఁబడ్డ వానికొకసారి విముక్తి ఘటించుఁగాని చి
ట్టంకిలి నీషణత్రయమునందుఁ దగుల్కొనినట్టి వానికిన్
శంకరుఁడైన ముక్తినిడఁ జాలఁడు
దేవీ భాగవతము. I–509

## ఉచితజ్ఞత

.........బ్రహ్మాస్త్రంబు పిచ్చుకమీఁద
నురవడి సంధింప నుచితమే యకట
గౌరన. హరిశ్చంద్రోపాఖ్యానము. పు. 1. 126

ఔచితింగన్న వాఁడెప్డు నర్హమయిన
గౌరవమ్మును బడవిని గనుచునుండు
సర్వజనులును బూజింప సంతతమును
దండిదాకీర్తి నార్జించు చుండు

చూచి యనఁగఁ దగును సూచన కన రాదు

ఉచితాహారమువల్లనె
యుచితంబుగ బుద్ధి స్థిరత యొప్పునటులనే
యుచిత గురుబోధవల్లను
సుచరితుఁడై పరము గాంచు నుమ్మర వేమా!

వేమన

సముచిత మెఱుగక తక్కుఁడుం
గ్రమరహితు గుఱించి పోవఁ గడుఁ గీడొదవున్

బైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము. III-98

ఎవ్వానికి నెయ్యది యుచితం
బానియతి నతండు పోవు టర్థం బు

మారన. కళాపూర్ణోదయము. III-281

తనసరి చుట్టఱికము పొం
దినపంతము దోఁపుదురము దిట్టఱికము మే
కొనుచెట్టఱికముఁ దగని
చ్చిన వారల తోడఁదగవు చిఱుత వజీరా

పూసపాటి వీరరాజు. చిఱుత వజీరు శతకము

పెద్దవారలైనఁ బిన్నవారైనను
జెప్పునట్టి పలుకుఁ జెవిని జొనిపి
యుక్తియుక్తమైన నొయ్యన గ్రహియింపు
కానిదైనఁ గొనకమాను మీవు

కందుకూరి వీరేశలింగము. నీతి. దీపి. 96

## ఉత్తమ మధ్యమాధమములు

కృత మెఱుఁగుట పుణ్యము స
న్మతి దానికి సమము సేఁత మధ్యము మఱిత

తత్కృతమున కగ్గలముగ స
త్కృతి సేయుట యుత్తమంబు కృతబుద్ధులకున్
నన్నయ. భారతము. 1. VI–244

నీతి పథంబునన్ బ్రతుక నేర్చుట యుత్తమభంగి; శౌర్యసం
జాతములైన కరంబలరు సంపదలొందుట మధ్యవృత్తి; య
స్ఫీతములైన భారవహ జీవనముల్ దలఁపం గనిష్ఠముల్
నీతికి బాహ్యులైన ధరణీవర మెత్తురెవారి నుత్తముల్
తిక్కన. భారత. ఉద్యో. II–71

ఉత్తముండు హితము చేసి యూరకుండు
మధ్యముండు హితముచేసి మాఱువెదకు
నధముఁడొరు చేయు హితమైన నణఁచిపుచ్చు
హితమునకు నెగ్గుచేయు వాఁడెవ్వఁడగును
నాచన సోమన. ఉత్తర హరివంశము. V–300

అఖిల సమ్మతిఁ గావించు నదియు బహు వి
చారములు దోఁపనందొక్క సరణి నడపు
నదియు నౌగాదు నాఁ జేయు నదియు నివ్వి
ధంబు లుత్తమ మధ్యమాధమము లండ్రు
అయ్యలార్యుఁడు. భాస్కర రామా.

ఏకారణము లేక హితమితరులకుఁ
జేకొని కావించు సృష్టి నుత్తముఁడు
ఇతరుఁడు చేసిన హితమాత్మఁ దలఁచి
ప్రతిహిత మొలమి నేర్పఱచు మధ్యముఁడు

తగ మేలునకు మేలు దాఁ జేయకమును
మగిడి కీడొనరించు మనుజాధముండు

తిమ్మయ్య. ద్విపద భారతము. 5. పు. 1. 20

ఉద్ధరింపఁ గలుగు నుత్తముండు కులంబు
మధ్యముండు దాని మాట గనడు
అధముఁడైన వాఁడడంగించు నొక్కట

వేమన

ఉత్తమోత్తముఁడగు నుర్విఁ దత్త్వజ్ఞుండు
మహిమ జూపువాఁడు మధ్యముండు
వేషధారి యుదరపోషకుం డధముండు

వేమన

పనస రసాల పాటలుల పాటిగ నుత్తమ మధ్యమా ధముఃల్
వినఁబడు పువ్వులేకయు ఫలించియుఁ బూచి ఫలంబు నొంది
యున్
ననిచి ఫలంబు లూరక వినాశముఁ బొందినయట్టి పోలికన్
మును ఫలమిచ్చి పూచి ఫలముల్ ఘటియించియుఁ బూచి
పండియున్

ఎఱ్ఱన. సకలనీతికథానిధానము.

.........నీతి సాహస భృత్యగతుల
మనువార లుత్తమ మధ్యమాధములు

తిమ్మయ. ద్విపద భారతము. 5. పు. 1. 20

తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
తమకార్యంబు ఘటించుచున్ బర హితార్థ వ్యాపృతుల్
మధ్యముల్

తమకై యన్యహితార్థ ఘాతుక జనుల్ దైత్యుల్ వృథాన్యార్థభం
గము గావించెడు వార లెవరో యెఱుంగన్ శక్యమే యేరికిన్

ఏ. ల. కవి. సుభాషితము

పూచి కాయని పాటల భూజమువలె
పలుకరయె చెప్పుదురు నీచ జనులు పొగడి
పూచికాచునట్టి రసాల భూజమట్లు
పలికి చెప్పికొందురు మధ్యములు సెలంగి
పూయకయె కాచెడి పనసభూజమటుల
చేయుదురు కాని సుజనులు చెప్ప రెపుడు

విక్రమదేవవర్మ

## ఉత్తమములు

మేటి వైరాగ్యముకంటే మిక్కిలి లాభములేదు
గాటపు విజ్ఞానము కంటే సుఖములేదు
మీఁదైన గురువుకంటే మీఁద రక్షకుఁడు లేఁడు

అన్నమయ్య. అధ్యా. సం.

బ్రహ్మచర్య మహింసగాఁ బరగు పరమ
ధర్మములు రెండు సువ్వె యుత్తమ తపములు

వేమన

సముచిత భాషణంబులకుఁ జాతురిసాలకయున్న మౌన ము
త్తమము పరాంగనా గమన తత్పరుఁడయ్యెడు దానికంటె మం
దమతము మేలు చాడికి నొడంబడి యుండెడి వృత్తికన్నఁ జా
వుమిగుల లెస్స ......

బైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము. II–144

దొడ్డ కొంచెమయినా నేమి

క్షేత్రయ్య

సత్యంబు దమ మహింసయు శమగుణము
నత్యుత్తమములగు నందు నహింస
సత్యంబుఁ గాచుట సరి హింస మఱియు
సత్యంబుగావంగఁ జనదండ్రు బుధులు
ప్రాణహాని యొనర్చు పట్టున ధనము
త్రాణతో హరియించు తఱి ధాత్రి నెపుడు
సత్య మసత్యమై సరవి దీపించు
నిత్య మసత్యంబు నిజమని పరఁగు

సోమన. ద్విపద భారతము

అంత చనుటకంటెఁ గొంత దక్కుట మేలు
కున్నప నగరికంటె వనము మేలు
మానహాని కంటెఁ బ్రాణహాని మేలు
పదుపుఁ గూడు కంటెఁ బస్తు మేలు

విక్రమ దేవవర్మ

## ఉత్తమాధములు

విధి వశమున వచ్చిన కీ
డధములు గొనియాడి వ్రేగులై విపుల భవాం
బుధి మునుఁగుదురు మునుంగరు
సధర్ములగు నుత్తములు ప్రశాంతిఁ జులుకనై

తిక్కన. భార. అను. I-9

అలఘుఁడు దుఃఖముఁ బొందిన
నలఁగక బుద్ధి ధృతిఁ బెంచు నల్పుఁడు దుఃఖం

బలమిన ధృతిసెడి మునుఁగును
జలములలో శిలలు మునుగు చాడ్పున
భాస్కరుడు. భాస్కర రామాయణము. II-322

అధముఁడు దనుఁ దాఁ బొగడిన
నధికుఁడుగాఁడల్పు భంగినాత్మ శ్లాఘా
విధికిఁ జొరఁ డుత్తముండ
వ్విధ మొప్పమిఁ జేయుటను
అయ్యలార్యుఁడు. భాస్కర రామాయణము. యుద్ధ-1039

అమరు మరాళ సంవలితమై సితగృధ్రము హంసమట్ల హం
సము పరుష స్మశాన ఖగ సంవృతమై గనుపట్టు గృధ్రమ
ట్లమలమతుల్ దురాత్ము విమలాత్మునిఁ జేయుదు రల్పు
లుత్తముం
దమవలె నుండ జేయుదురు
బైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము. I-531

గ్రావాగ్రమునకు భూరి
గ్రావం బెక్కింప భరముగానది ధరకున్
ద్రోవఁ బ్రయాసమె యున్నతి
కైవలెఁ బా టధమవృత్తి కది యేమిటికిన్
బైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము. I-143

ధన వయో వంశ విద్యల నుత్తముండు
వినయాఢ్యుఁడగు హీన విపరీతుఁ డుబ్బు
తిమ్మయ. ద్విపద భారతము. 5. పు 1. 18

అఖిలలోకైక విఖ్యాతమగుటచేతఁ
దనగుణంబును దాఁ జెప్పికొనఁడు ఘనుఁడు

ధరణి నెవ్వారెఱుంగని దగుటఁ జేసి
తన గుణంబును దాఁజెప్పుకొను ఖలుండు

గోపినాథము వేంకటకవి. శిశుపాలవధము

.. ...ఘనుని వచనము
శిలాక్షరమువోలె మిగులస్థిరమైయొప్పున్
జలలిపి విధముగ నీచుని
పలు కస్థిరభావమొంది పరఁగు

విక్రమదేవవర్మ. నీతి. కం. పు. 62

న్యూనతయు గౌరవంబు మహోన్నతులకె
గాక నీచుల కెట్టంగి గలుగవచ్చు
నలఘు తేజులౌ సూర్యచంద్రులకెగాక
గ్రహణముండునె మింటిచుక్కలకు నెల్ల

చిలకమర్తి లక్ష్మీనరశింహము. ప్రసన్నయాదవము III-51

ఉత్తములు

మనమున వేరమి దలఁపమి
యును సత్క్షమ చిత్తుఁడగుటయును గుణములు కై
కొని దోషంబులు విడుచుట
యును నుత్తముఁ డయిన పురుషు నుత్తమ గుణముల్.

నన్నయ. భారతము. పభా. II-267

అహంకృతి సత్యముగాఁ దలఁతురే ఉత్తములు

తిక్కన. నిర్వచనోత్తర రామాయణము. IV-36

పురుషుండు రెండు దెఱఁగుల
ధరనుత్తముఁడనఁగఁ బరగుఁ దానెయ్యెడలం

బరుసములు వలుకకునికిన్
దురితంబులు వొరయు పనులు దొఱఁగుట కతనన్

తిక్కన. భారతము. ఉద్యోగ. II-41

పాపాత్ములందైన ఘనులు దయాబుద్ధి గలిగి యుండుదురు

గోనబుద్దారెడ్డి. రంగనాథరామాయణము. పు. 622

.........ఆత్మనమ్మినం
జెఱుపఁ దలంతురే ఘనులు
చిత్తమునన్ బగవారి నేనియున్

శ్రీనాథుఁడు. శృంగారనైషధము I-106

శమదమపరినిష్ఠా సత్య భూతానుకంపా
సమనిగమ నివృత్తి జ్ఞానవృత్తి ప్రశాంతుల్
కమల దళ నిభాక్షీ కల్గినన్ కల్గు నయ్యు
త్తమునకుఁ జిరకాల స్థాయి కైవల్య లక్ష్మల్.

శ్రీనాథుఁడు. భీమఖండము. V-176

...............
పెఱవారల బుద్ధులాత్మఁ బెట్టునె యనఘుం
డొఱపిడి చావ్పున

జక్కన. విక్రమార్క చరిత్ర. III-101

.........ఆడిన యట్టులు చేయు వారలుం
బనివడి మున్ను గొన్నటుల పైకొని యుప్పులఁ దీర్చువారలుం
బొనరిన మేలు గీడులకుఁ బొంగక క్రుంగక యుండు వారలున్
మనుజులలోన నుత్తము లమర్త్యులు మెత్తురు

అనంతామాత్యుఁడు. భోజరాజీయము. IV-301

ఉత్తములా శ్రితులఁగృపా
యత్తతఁ జేపట్టిప్రోతురు

అనంతామాత్యుడు. భోజరాజీయము. IV-108

సాధువర్తనంబు గలవారలు
పరుల దోషంబులనైన గుణంబులు గానను గ్రహింతురు

పోతన. భాగ. IV-86

పురుషవరుని స్వేచ్ఛ భూతినిగూర్చు

వేమన

పురుషవరునిబొంకు పూరి తడికె

వేమన

తత్తర మొప్పదు పనియెడ
నుత్తములకు ఘన విచార యుక్తాత్ములకున్
జిత్తమున మెచ్చిలీలా
యత్తముగా లక్ష్మికడుఁ బ్రియంబునఁ బొందున్

కూ. తిమ్మకవి. శివలీలా విలాసము. II

.........సంశయ విచార పదంబగునట్టి వస్తుసీ
మందమ చిత్తవృత్తులు ప్రమాణము లుత్తములైనవారికిన్.

పిల్లలమఱ్ఱి. శృ. శాకుంతలము. II-64

ఉత్తములగు వారి కొక నింద వొడమ
నుత్తలపడి తీర్పకోర్తురే నిలువ

సింగన. ద్వి. భాగ. కల్యాణ. 99

పరమశుచిన్ సమిద్ధులు నపార మహామహు నుత్సవ క్రియా
స్థిరు నిరసించి క్రిందుఁ పడఁ జేసినఁ గ్రిందు పడంగ నేర్చునే

కెరలి యొకప్పుడేనిఁ దలక్రిందుగఁబట్టిన నూర్ధ్వకేలుఁడై
దరికొన కంబు సంభవుఁ డధశ్శిఖుఁడై నశియింప నేర్చునే

బైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము I–169

చాల నెత్తయిన వారికి నెందును బేసు తప్పునే

భట్టుమూర్తి. వసుచరిత్ర. V–103

స్వధర్మము న్విడన్వర్తింప రత్యుత్తముల్

బాలసరస్వతి. మల్లభూపాలీయము I–74

ఏలికయును వేల్పునిలఁ గుల స్త్రీలుఁ
దాలెస్సవారైనఁ దగ ఫలింపుదురు

తిమ్మయ. ద్విపద భారతము, 5. పు. 1. 18

చలమును జూదంబు సంభాషణంబుఁ
జెలిమియు నధముతోఁ జేయరుత్తములు

తిమ్మయ. ద్విపద భారతము, 5. పు. 1. 19

బొంకనివాఁడె యోగ్యుఁ డరి బృందము లెత్తినచోటఁ జివ్వకుం
జంకని వాఁడె జోదు రభసంబున నర్థి కరంబు సాచినం
గొంకనివాఁడె దాత మిముఁగొల్చి భజించిన వాఁడె పో నిరా
తంక మునస్కుఁడెన్నఁగను దాశరథీ కరుణా పయోనిధీ

కంచెర్ల గోపన్న. దాశరథీ శతకము

స్వకర్మ నిరతులైనవారల కౌన్నత్య మబ్బుటరుదె

భవానీశకవి. ధర్మ. III–27

ఎవనికరమున వితరణ మెసఁగుచుండు
నట్టి మనుజుఁడె మిగుల హెచ్చైనవాఁడు
ఎవని నాల్కను సూనృత మెసఁగు చుండు
నట్టి యాతఁడె మిగుల హెచ్చైనవాఁడు

హృదయమున భూతకారుణ్య మెవని కుండు
నతఁడె సర్వజనోత్కృష్టుఁడైనవాఁడు
ఎవని మదిలోన శ్రీజగదీశుభక్తి
యుండు నాతఁడె సర్వలోకోత్తరుండు

పానుగంటి నరసింహారావు. మాలతీ మాల. II

ఎవఁడు గొప్పతనము భువిఁ బొందఁ గోరునో
వాఁడు గొప్పవాఁడు గాడు సుమ్ము
ఎవని గొప్పతనము భువి నుతి గోరునో
వాఁడె గొప్పవాఁడు ప్రజలయందు

విక్రమదేవవర్మ

పురుషులు సత్యమార్గమునఁ బోవక సత్యము దప్పకుండినం
బరతరుణీ ప్రసంగమును బట్టక స్వాఁగనఁ బాయకుండినన్
బరగుదు రుత్తమోత్తములునాన్

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి. కనకగిరి 60

వజ్రములకంటె నొకవేళ పరుషతరము
కుసుమమున కంటె నొకవేళ కోమలంబు
వసుధ లోకోత్తరుండైన వానిహృదయ
మెప్పు డేరీతి నుండునో యెవ్వఁడెఱుఁగ

కా. పెద్దన. ముకుందవిలాస, తృ. ఉ. 75

## ఉత్సాహము

సకల యత్నముల నుత్సాహంబె మనుజు
లకు సకలార్థ మూలము

రంగనాథరామాయణము. అరణ్య. పు. 225

ఉత్సాహియగు వాని కులుకుదు రహితు
లుత్సాహ రహితున కులుకరుగాని

రంగనాథరామాయణము. యుద్ధ. పు. 324

అసిఁజెండాడి, విపక్ష వృక్షములు శౌర్యాగ్నిచ్ఛటం బేల్చి శ
స్త్రప్రసరత్సీరములన్ రణోర్వితలమున్ సంక్షుణ్ణముంజేసి వై
రృస్పృగార్ద్రం బొనరించి ప్రోదిగా న కుద్యత్కీర్తి సస్యౌఘముల్
వెస సిద్ధించునె ?

నరస భూపాలీయము. III–12

ఉదాసీనత

తన యెఱిఁగిన యర్థం బొరు
లనఘా యిదియెట్లు సెప్పుమని యడిగినఁ జె
ప్పనివాఁడును సత్యము చె
ప్పనివాఁడును ఘోరనరక పంకమునఁ బడున్

నన్నయ. భారత. ఆది. I–136

చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి వారితోడఁ గొట్లాడి యైనఁ
దానయిడుపంగఁ జొరకున్న వానిఁ గ్రూర
కర్ముఁడని చెప్పుదురు కర్మకాండ విదులు.

తిక్కన. భారత. ఉద్యోగ. III–242

సారపు ధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁబొందలేక చెడఁ బాలివియైనయవస్థ దక్షులై
వ్వారలుపేక్ష సేసిరది వారలచేటగు

తిక్కన. భారత. ఉద్యోగ. III–273

.........సత్యము ధర్మమెఱింగి యుండియున్
దెగ మొగమోడియున్న జన నిందితు లొందుదు రెందఱో
గతుల్

పావరాజు. ఉ. రా. VII-237

## ఉపకారము

.........పుణ్యగతికిఁ జే
చ్చెరఁ బోవునట్లు సేయుట
పరికింపఁగ మేల కాదె పగతురకైనన్

తిక్కన. భారత. సౌప్తిక. I-153

ఎగ్గుసేసిన వారికి హితముసేఁత
యార్యజనములు గీర్తింతురు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-39

చంపదగినయట్టి శత్రువుదనచేతఁ
జిక్కెనేనిఁ గీడుసేయరాదు
పొసఁగ మేలుఁజేసి పొమ్మనుటేచాలు

వేమన

ఉపకారికి నుపకారము
విపరీతముగాదు సేయ వివరింపంగా
అపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడు నేర్పరి

సుమతీ శతకము

ఉరుదయాఢ్యులమేను పరోపకార
కలనరాణించు గంధంబువలనఁగాదు.

ఏ. ల. కవి. సుభాషిత. నీతి. 63

సజ్జనులుదారె పరహితాచరణమతులు

ఎల. సుధా. నీతి. 64

మతకులాచారముల్ మానకలోకోప
కారులై చెలఁగుడు

అ. నారా. రుక్మి.

జగతి నుపకారు లనుల యశశ్శరీర
మంది ధృతజీవులగు చుందురు

చిలకమర్తి. పార్వతి II-16

చేతునని చెప్పియును జెడ్డచేయరాదు
చేయనని చెప్పియును మంచిచేయవచ్చు

తి. వేం. కవులు. శ్రవ. IV-99

ధనికులకు నాయపడుకంటె ధనములేని
జనుల క్షుత్తును దీర్పంగఁ జనుటమేలు.

అన్న. సుధా. రత్నావళి. 140

ఉపవాసము :

తపము లేదుపవాస వ్రతంబుకంటె
నధికమైనది యంద్రు మహాత్ము లనఘ

తిక్కన. భారత. అను. IV-153

.........ఉపవాస వ్రత
సేవనము శరీరమునకుఁ జిత్తంబునకుం
బావనమైహిక మహిమయు
దేవనిలయ సుఖమునిచ్చు ధీరవిచారా!

తిక్కన. భారత. అను. IV-157

ఉపశమము

విను తెవు లుడుపంగ భేషజ
మునకుం దలకొనిన చందమున మది సత్యం
బును శౌచము శమమును దమ
మును నెలకొలుపంగవలయు మోహచ్యుతికిన్

తిక్కన. భారత. శాంతి. IV-286

తడవి వేఁపచేఁదు త్రావెడివాఁడు – ఎడనెడదిను తీపేమైనను
దొరకొని హేయమే తోడేటివాఁడు –
పరిభవించును మేన పరిమళము

తా. అన్నమయ్య. అధ్యా. సం.

ఏద్రవ్యంబు వలన నేరోగంబు జనియించె
నాద్రవ్యం బారోగంబు మానుప నేరదు

పోతన. భాగవతము. I-77

ఉపశాంతి లేని మనుజుల
జపతపములు యోగవిధులు సవనాదులిలన్
గపటములై చెడుఁ గావున
నుపశాంతియె పరమధర్మము

తరిగొండ. వేంకమాంబ. వేంకటాచల మాహాత్మ్యము

ఊరటకు రోదనమె యొక కారణంబు

పానుగంటి. వన. రాఘవ. III

ఉపాయశాలిత

.........అవశ్యముఁ బెనఁకువ
గాని యుపాయమునఁ బగఱఁ గడ తేర్చు ధృతిం
బూని నడచు నెవ్వఁడు డెం
దానం జెయివెట్టికొని యతఁడు నిద్రించున్.

తిక్కన. భారతము. ఉద్యోగ. III-19

విను ముపాయ పూర్వకముగు విపుల యత్న
మరయ సర్వార్థ సాధకము

ఎఱ్ఱన. హరివంశము – పూ. భా. I-128

బలిమిఁ జేయరాని పనియెట్టిదైన ను
పాయ బలముచేతఁ జేయవచ్చు
సాహసంబుచేసి చనరాని జలనిధి
నావచేఁ దరించు ఠేవ ననఘ.

చరిగొండ. ధర్మన. చిత్రభారతము. II-58

తనప్రతితోడుత నామము
తనకించుక యెక్కుడైనఁ దగు భేదంబున్
దనకధికునకును దానము
తనకన్నను దుర్బలునికి దండన మొప్పున్

మల్లారెడ్డి. షట్చక్రవర్తి చరిత్ర. VI-62

ఎయ్యదిగాదు లోకువ మహీస్థలి సమ్యగుపాయశాలికిన్

అడిదం సూరకవి. కవిజనరంజనము III-84

## ఉపేక్ష

సారపు ధర్మమున్ విమల సత్యముఁ బాపముచేత బొంకు చేఁ
బారముఁ బొందలేక చెడఁ బాలివియైన యవస్థ దత్సు లె
వ్వారలుపేక్ష సేసిరది వారల చేటగు

తిక్కన. భారత. ఉద్యోగ. III-275

తెగఁదీర్పక తెగనార్పక
తెగటార్పక కడమ కొంతద్రిక్కఁగనున్నన్
జగదీశ యప్పు నగ్నియుఁ
బగయును గడుఁ బెరుఁగుఁగీడు వాటిల్లుఁ దుదిన్

తిక్కన. భారత. శాంతి. III-276

చిరకాలమున నుపార్జింపఁబడ్డ ప్రసిద్ధి వేగఁ బొందఁగ
నుపేక్షింపవలదు

శ్రీనాథుఁడు. శృంగార నైషధము. III-68

ఈఁగరాని యప్పు వగల నీనకున్న

మారన. మార్కండేయ. పు. I-205

## ఋణము

పేద నేనని నోరఁ బ్రేవులు జూపఁ
బోదురే ఋణముఁ దెంపునఁ గొనువారు
అప్పుపై నుండంగ నన్నపానాదు
లెప్పాటఁ జవి యగు నెన్ని చందముల

గౌరన. హరి

అప్పు తీర్పలేని యా నేర్పి కేటికి

వేమన

అప్పుఁ దీయ రోఁత హరిహరాదులకైన

వేమన

అప్పులేనివాఁడు అధిక సంపన్నుండు॥

వేమన

ఋణము పెంచి యిచ్చి హీనుగా నొనరించి
విడుచు తండ్రి వైరి వీరుఁ డరయ
అలవిగాని యట్టి యాలును నట్టులే॥

వేమన

ఋణ మొసంగు నాతఁ డినుఁడగు దొలుఁదొల్త
నదియు మఱల నడుగ యముడన నగు
అప్పుజేసి తీర్చ నరయని వారికి॥

వేమన

అప్పుగొను వేళ నధిక సౌఖ్యమగుఁ దీర్చు
నట్టితఱిఁ బ్రాణసంకటమై తనర్చు
ఋణము గలవారు జననమరణములందు
నేనిఁ బూనరు సుఖమించుకైన నధిప !

అప్పుగొని పప్పుకూడును
గొప్పగ భుజియించుకన్నఁ గూరఁ దినుట మే
లొప్పగు నుపవాస మయిన
నొప్పగు దినపంచకమున కొకపరి దిన్నన్

ఋణము కష్టద మగునది యిక్క డక్క
డనఁగ వల దెట కేగిన నచటి కరగు
దెంచి బాధించుఁ గావున దీని నెపుడు
విడిచి యుండుము శుభములు పడయు దీవు

అప్పిచ్చినవానికి న
య్యప్పుగొనిన వానికిని సుఖాయాసంబుల్
జొప్పడు నెచ్చటికేగినఁ
దప్పవు గాన ఋణముఁ గొనఁదగ దార్యులకున్

అల్లమరాజు. సుబ్రహ్మణ్య కవి. శేషధర్మములు

ఋణ భార మమితంబగణ్య మసహం బెవ్వానికిన్ ధాత్రిలోన్

కోలాచలం. శ్రీనివాసరావు. సత్యహరిశ్చంద్రీయము III–1

అప్పుగొనుటగుఁ జుమ్ము నింద్యమ్ము తలఁప
దానిఁ గొననగు నేని బిరానఁ దీర్పు

విక్రమదేవవర్మ.

## ఋణానుబంధము

డాకతో నదిని గాష్ఠంబుఁ గాష్ఠంబు
జోకయై పాసిన చొప్పు దీపింపఁ
బుత్త్ర మిత్త్ర కళత్రములు డాయుఁ బాయు
మైత్రి ఋణాను సంబంధరూపమున

రంగనాథ రామా. II–157

కొన్న ఋణంబుఁ దీర్ప కరగుం ధరపై ఋణదాతకే నరుం
డన్నరుఁ డాత్మజాతుఁ డయి యాలయి యెద్దయి దాసి కుట్టుఁడై
యెన్నటి కప్పు దీర్చుకొను నేఁగును సద్గతి కాక్షణంబునం
దన్ని భవంబులన్ లఘుతరాయువు నొందును బుట్టి కిట్టుచున్

అల్లమరాజు. సుబ్రహ్మణ్యకవి. శేషధర్మములు

ఋషి

ఋషు లెఱుంగనట్టి విషయంబు భువిలేదు
వారు చెప్పినంత వరుస నగును
తెలియ కనెడువారు దేబెలు నిజమయా

వేమన

ఋషులు గానుపింత్రు హీనుల యట్టుల
వారిబోధ పెద్దమేరువంత
లోన నున్నయట్టి జ్ఞానంబు మహిమరా

వేమన

దిరిసెన బూవు కంటెను నుతింపఁగ మెత్తన వారి చిత్తముల్
కెరల యుగాంత వాయు సఖ కీలల కంటెను వేడి నాలుకల్
దొరసిన కూలఁద్రోయుదురు దొంతుల తోడి దిగీశ రాజ్యముల్
కరుణ వహించిరే మునులు కట్టుదురల్పుల బ్రహ్మపట్టముల్

పిల్లలమఱ్ఱి. పినవీరభద్రుఁడు. శృం. శా. II-37

ఒనర శాంతుల గతి నుండిన నేమి
మునులకుఁ గోపంబు ముక్కుపై నుండు

భద్ర. లింగకవి. పానం. పు. 25

ఋషుల మహిమంబు లెవ్వార లెఱుఁగఁ గలరె

రఘునాథరాయలు. రామా. I-122

గరిమతోఁ గామ భోగంబులు విడిచి
గుఱుతుగాఁ గాయలాకులు నీళ్ళు గాలి
యనుభవించిన మునులట వెఱ్ఱివార

సోమన. ద్వి. భార. శాంతి. పు. 1. 16

ముని యాజ్ఞ మీఱుట మోసంబుగాదె

తిమ్మయ. ద్వి. భార. ఆది. పు. 445

## ఐకమత్యము

బలముగలవానిఁ బలువురు బలవిహీను
లొక్కటై కూడి నిర్జింతు రుత్సహించి

నన్నయ. భార. అరణ్య. I-251

అన్నదమ్ములును బొందిన నేరి కసాధ్య మట్లు గా
కెరవయి నిల్చినం గెలని కెల్లిదమై పఱివోదు రెంతయున్

తిక్కన. భార. ఉద్యో. II-88

ఐకమత్య మొక్క టావశ్యకం బెప్డు
దాని బలిమి నెంతయైన గూడు

వేమన.

బలవంతుడ నాకేమని
పలువురతో నిగ్రహించి బ్రదుకుట మేలా
బలవంతమైన సర్పము
చలిచీమలచేతఁ జిక్కి చావదె సుమతీ

సుమతీశతకము

మతం వేరైతేను యేమోయ్ మనసులొక్కటై మనుషులుంటే
జాతమన్నది లేచి పెరిగి లోకమున రాణించు నోయ్

గురజాడ. ముత్యాల సరాలు

ఐకమత్యము కాదె యీ యవనియందు
నెట్టిపనులను సాధించు నెట్టి శక్తిని

కోలాచలం. శ్రీనివాసరావు. రామరాజు చరిత్రము. VIII-87

## కక్కుర్తి

కడుపు కక్కుర్తికిఁ గర్మకాండంబు
తడయక పెట్టు తంత్రంబును గాదు

పిడుపర్తి. సోమన. ప్రభులింగలీల

కక్కుఱితిఁ గాఁడు కార్యము
చక్కటి యెఱుఁగండు

దూబగుంట. పంచతంత్రము. I-320

కక్కూర్తిపడి తేను కడుపునిండగవలెను
కడుపునిండని వట్టి కక్కూర్తి ఏల

పసగాడ. సన్యాసి. గంగావివాహము. పుట. 15

న్య

విను పాణిగ్రహణముసే
యని వనితకుఁ బుణ్యలోక మప్రాప్యము

తిక్కన. భార. కల్య. II-210

మున్ను వివాహముసేయని
కన్నియ యొరుఁగలిసెనేని క్షతయగు, మగపాం
డెన్నఁడు లేక విధవయగు
కన్నియ యక్షత సమాఖ్య గలిగి చరించున్

విజ్ఞా. ఆచార. కాం. 118

జనకుండు వెలిగాఁగఁ దనయంతఁ గన్నెకుఁ
బతివరియించుట పాడియగునె?

మారన. మార్కం. పుట. 5. 242

పడతికిఁ గన్యాధర్మం
బెడలినఁ గొఱయగునె వెండి యెవ్వరికైనం
గడివోయిన పువ్వులు మఱి
ముడుచునె రసికుఁడగు వాఁడమోఘ వివేకా?

అనంతా. భోజరాజీయము. IV-224

................

నిక్కమ్ముగఁదండ్రి చాయగల కన్యలు ధన్యలుగా వసుంధరన్

భట్టుమూర్తి. వసు. II-3

కన్యాదానము

అతివా కన్నియ నిచ్చిన
పితృపతి ముదమందు సురలు ప్రీతులగుదు గం
చితగతి కర్తకు దొరకును
నతి తేజశ్శ్రీయశస్కమగు నభ్యుదయమున్

తిక్కన. భారత. అను. V-194

కన్యకాదానవేళల గలదు చనవు
క్షితి గృహస్థులకంటె సద్గేహానులకు

శ్రీనాథుఁడు. హర. 467

విద్యలేకయున్న విత్తములేకున్న
మూఢుఁడైనఁదుదకు మూగయైన
నిష్టబంధువునకు నీయుఁడు కన్యను

వేమన

నేరము లెన్నిగల్గిన గణించుట నేరము లల్లు వారిపై
నేరుపులైన యల్లురును నేరములెన్నదు రత్తవారిపై
వారలనేర్పు నేరములు వంకలు దీర్చన యుక్తమెల్లెడం
గౌరవ హీనులిజ్జగతిఁ గన్నియ నిచ్చినవారు కోమలీ!

పిల్ల. పిన. శృం. శా. VI-73

కన్నియలను దేశకాల పాత్రంబు
లెన్నియొగ్గురుఁ బిల్చియిచ్చుట యొప్పు

వరద. రామా. బాల. పుట. 116

సిరిగల వారికి చేడెల
నరయుచు నెవ్వరైన నిత్తురది ఘనమగునే
నిరుపేదకిచ్చి చేసిన
సరసాగ్రణి కిహము పరము సౌఖ్యము లబ్బున్

అప్పప్ప. ౪౫౭౫-2

## కపటము

కపటమైన పనులు కడంబెట్టి చూడక
తత్త్వమెట్లు తనకు దగులు పడును

వేమన

కపటమున్నవాని గనిపెట్టవలెనయా

వేమన

అపగత సుకృతము లోకనికి
నెపమిడి యందఱును గూడి నెఱిఁబన్నిన పా
పపుఁ దలఁపు ఘనులకైనన్
గపటంబని తెలియరాదు

భానుకవి. పంచతంత్రి

తలపోయఁ గపటకృత్యంబుల సేఁత
బలిమి మిక్కిలి యిహపరహానిసేయు

తిమ్మయ్య. ద్విప. భారతము. ఆది. 1 పుట. 63

కపటమైత్రి యుపద్రవకరము

విక్ర. దే. పర్వ

## కర్త

కర్త యీశ్వరుండని యెఱు నిశ్చంబు దృఢమై మదినిల్పినఁజాలు

తిక్కన. భారత. శాంతి. I–277

కార్యఫలముల యెడఁ దాన కర్తననుట
కడునెఱుంగమిఁ జూవ్వోతాఁగర్త యేనిఁ
దగిలి తనదైన కార్యజాతంబునెల్లఁ
జెడక ఫలియించుపట్లుగాఁ జేయఁ రాదె

ఎఱ్ఱన. భా. రణ్య. V-66అ

కర్మమే కర్తయైతేఁ గడకు మోక్షములేదు
జీవుఁడు కర్తయైతేఁ బుట్టుగేలేదు
మాయ కర్త అయితే మఱి విజ్ఞానమేలేదు
ప్రపంచమే కర్తయైతేఁ బాపపుణ్యములులేవు

మనసు గర్తైయుంటే నాచారమేలేదు
దేహములే కర్తలయితేఁ జావులేదు
శ్రుతులు కర్తలై పరగితే మేలులేదు
బట్టబయలు గర్తైతే నాధారములేదు

తా. అన్నమయ్య. అధ్యా. వం.

## కర్తవ్యము

బలహీనులయిన వారలు
బలవంతుల నోడుచునపుడు బహుమాయల న
చ్ఛలమునఁ జేయుట యెందును
గలయదియ జయంబకాదె కర్తవ్యమిలన్

నన్నయ. భారత. సభా. II-170

జనులకునోడఁ బాటగు విధ
మున నడచుచు లోకనింద్యములనుడుగుచు మీఁ

దని యొకని కలిమి కులుకక
మనుజులతోఁ బొందిపొసఁగి మనుటొప్పు

తిక్కన. భారత. ఉద్యోగ. II-31

కొంచెమైనను దగఁ బంది కుడుపుమేలు
పనులయెడ దుఃఖమోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము శత్రునకునైన
నిచ్చుటయు లెస్స యడిగిన యెడ

తిక్కన. భారత. ఉద్యోగ. II-47

వినుము తఱివేచి రిపు మూఁ
పునమోవగ వలయు సమయమునుం గనికొని గ్ర
క్కునఁ గడవ శిలాస్థలి వై
చినచాడ్పున నేర్పు మెఱయఁ జెఱచుటయొప్పున్

తిక్కన. భారత. శాంతి. III-271

వెఱవవలె బాపములకును
వెఱవఁగ వలె ఋణములకును విశ్వములోనన్
మఱవవలె బరులనేరము
మఱువంగా వలదు మేలు

వేమన

## కర్మానుభవము

ఎట్టి విశిష్టకులంబునఁ
బుట్టియు సదసద్వివేకములు గల్గియు మున్
గట్టిన కర్మఫలంబులు
నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్

నన్నయ. భారత. ఆది. V-58

కర్మ విపాకంబు గడవంగలావె

నన్నయ. భారత. ఆది. VI–250

కర్మఫలంబులు దైవమానుష సిద్ధంబులయినను బురుషోత్సాహ
సముపార్జితంబులయిననవి సుస్థిరంబులయి సురక్షితంబులయి
వర్తిల్లు

నన్నయ. భారత. అరణ్య. I–236

...దుష్టాత్ములకున్
దౌర్గత్యము సుజనులకు న
నర్గళసద్గతియు నగుటయరుదే యెందున్

తిక్కన. భారత. ఉద్యోగ. I–202

తమ తమ సుకృత దుష్కృతంబుల తెరువులంబోయిన
నీతి నయాదులవలని వగలంబొగులం బ్రయోజనంబులేదు.

తిక్కన. భారత. స్త్రీ. I–35

చనినం జనునున్న నుండు
న్మనుజుండొకటిసేయం జేయు నరనాయకతో
డన తగిలి నీడవోలెను
వినుచేసిన కీడు మేలు విడువవు వానిన్

తిక్కన. భారత. శాంతి. IV–78

సమయంబైనను గుసుమఫ
లము లెట్టులుదోంచుం దరువు లందటితోంగ
ర్మములం బొందమున్ సుఖదుః
ఖములట్టుల నిష్ప్రయత్నకలితో ద్భూతిన్

తిక్కన. భారత, శాంతి. IV-77

ద్రుమముల దళ కుసుమ ఫలో
ద్గమముల క్రియఁ గర్మముల నొదవుఁదత్ఫలముల్
దమతమ తఱిఁగర్తకు భో
గ్యములై నియతిని శుభాశుభాకారములన్

తిక్కన. భారత. అను. I-145

నేయి పొలుపఱిన దీవియ మాయు కరణిఁగర్మ సిద్ధి మలిగిన హీన
త్వాయత్తంబై తానును, మాయును దైవానుకూల్యమహిమ

తిక్కన. అను. I-139

అశుభములును శుభమ్ములునైనకర్మ
ముల ఫలంబులు గుడువక పోవఁగాదు
మన్యువశగతమైన యాత్మకు నుదాత్త
చరితయది కారణముసువ్వో జన్మమునకు

తిక్కన. అశ్వమేధ. I-186

తనువు సెడుంగాని కర్మతతి సెడదనఘా

ఎఱ్ఱన. భారత. అరణ్య. IV-172

మనుజులు పుణ్యపాపములు మానక యిందొనరించుచుం దుదిం
దనువుదొఱంగి పోవునెడఁ దప్పవు నీడయపోలెఁ గర్మమున్
వెనుకనయేఁగి భూరిసుఖవిస్మృతియుం బటు దుఃఖ దైన్యముం
దనకుఁగఁ జేయుఁ గ్రమ్మఱఁగదాన యొనర్చు భవంబు దేహికిన్

ఎఱ్ఱన. భారత. అరణ్య. IV-171

విను మనుజున కెవ్విధముఁ
దనచేసిన సుకృత దుష్కృతంబులు నెఱయం
దనకనుభవింపఁ బాలివి...

ఎఱ్ఱన. భారత అరణ్య. IV-172

మును తమచేసిన కర్మం, బునఁజూవె నశించు భూతములు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-52

స్థిరమగు పుణ్యకర్మమున దేవభవంబగుఁ బుణ్యపాప సం
కరమున మానుషత్వమగుఁ గల్మషముల్ పశుకీటభావముం
బొరయఁగఁ జేయు...

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-75

దైవంబునకునైనఁ దనకర్మఫలము
భావించి కుడువక పాయరాదెందు

గోనబుద్ధారెడ్డి రంగ. రామా, అయో

విద్యాప్రాప్తికిఁ గర్మంబు కారణంబు

మారన. మార్కం.

## కర్మ

మేలున సంతసిల్లునెడ మేకొని యాపదలొందు నాపదల్
దూలఁగ భూరి సౌఖ్యములుదోఁచుఁ గృతంబులు దప్ప వెమ్మె
యిన్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-341

కారణంబులేక గలుగదు జన్మంబు
కారణంబు పూర్వకర్మఫలము

ఎఱ్ఱన. నృ. పు. IV-63

ఉద్యోగములకెల్ల నొదవునె ఫలసిద్ధి
యెవ్వాఁడు దొలుమేననెంతఁజేసె
నంతియ వాసికినబ్బు

ఎఱ్ఱన. నృ. పు. IV-163

తనదు తొంటిజన్మమునఁ జేయు పాపంబు
శుభమునయినఁ బిదపఁ జొలవకెలవు
ననుభవింపవలయు నదియెన్ని విధముల
లేఁడుగీకు సేయువాఁడు దనకు

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 2322

అవిద్యాస్మిత రాగద్వేషాది
లక్షణ క్లేశపంచక మూలంబునఁగదా కర్మాతిశయము

శ్రీనా. కాశి. II 143

కర్మంబులు సంసారహేతుకంబులయ్యు నీశ్వరార్పితంబులై
తమ్ము తాము చెఱుచుకొన నోపియుండు

పోతన. భాగ. I–77

కర్మానుబంధంబులం గలుగున్ సంగము
లేకమానుఁ బిదపం గర్మాంతకాలంబునన్

పోతన. భాగ. VI–52

కర్మములు మేలునిచ్చును
గర్మంబులు గీడునిచ్చుఁ గర్తలు దనకుం
గర్మములు బ్రహ్మకైనను
గర్మగుఁడై పరులఁ దడవగా నేమిటికిన్

పోతన. భాగ. X–3

కర్మము గర్మముచేతను
నిర్మూలముగాదు

పింగయ. భాగ. VI–84

కాలంబెడగని పాపము
మూలముఁ జెఱుపంగవలయు మును రోగములం

దేలిన దోషము నెఱుఁగుచు
వాలాయము దానినడచు వైద్యుని భంగిన్

సింగయ. భాగ. VI-45

పరమ మునులకైనఁ బాయవు కర్మంబు
లోరు లనంగ నెంత నరవరేణ్య

గంగన. భాగ. V-113

వెట్టిదీరె రోఁ, కలి దలఁజుట్టుమన్న క్రియగా నొకకొందఱు
దాల్తు రప్పటిం,
గలుషపథ ప్రవర్తనమె కర్మపువాసనలన్ను గొల్పఁగన్

సూరన. కళా. II-108

బాలిశునైనను బండితునైనన్ గాలవశంబునఁ గర్మఫలంబుల్
మేలయి కీడయి మేకొనకున్నే.

పాపరాజు. ఉ. రా. V-21

ఎంతబోధించియేమిసేసిన తనదొంతికర్మములు తొలంగెనా?
సతత దురాచార జడునకుం బుణ్యసంగతి తలపోసినం గలిగెనా?

అన్నమయ్య. అధ్యా. సం.

దిక్కుమొకమువలెఁ గిందికిమీఁదికిఁ దిప్పెడిఁ గర్మము దేహమును
మెఱయునఁ బెరిఁగెడి నీయాసలు మఱియును బెరిఁగెడి పుణ్య
పాపములు
మలసిరాసులై పెక్కుగుచు

అన్నమయ్య. అధ్యా. సం.

కట్టెడి కర్మము కాయజు మర్మము
నెట్టుకొన్నదిదె నిఖిలంబెల్లా

పుట్టేటి జీవులు పొదలేటి జీవులు
జట్టిగాని రిదియే జగమెల్లా

అన్నమయ్య. అధ్యా. సం.

తగిలెడి అనుబంధము మానదు తెగనియ్యదు కర్మము
చేసిన అలవాటు మానఁడు జీవుఁడు
తనగుణము వేసరదు అనుభవించుటకు

అన్నమయ్య. అధ్యా. సం.

పెట్టిన దైవమెరుఁగు బీరకాయలోని చిక్కు
కాయము మోచిపుట్టి కర్మమున కొడిగట్టి
రోయఁబోతే మేనిలోనిరోఁత వోయినా !

అన్నమయ్య. అధ్యా. సం.

పెంచినఁబెరుఁగును పెక్కుబంధములు
తుంచినఁదునుఁగును దుఃఖములు
పఱపినఁబారును బహుళపు టాసలు
తఱపినఁ దరఁగును తనమదము
వెఱవఁగ నేటికి వెడకర్మములకు ?

అన్నమయ్య. అధ్యా. సం.

లక్షోపలక్షలు కర్మలంపటములు
నానాముఖములు పుణ్యములెల్లాను

అన్నమయ్య. అధ్యా. సం.

చేతులు చాచుచు సేయఁగఁదొడఁగిన
ఘాతలనిన్ని గర్మములే
నాతులు మోవఁగ వలెనని వెదకిన
పూతలనిన్నియు భోగములే

అన్నమయ్య. అధ్యా. సం.

ఏమిసేయవచ్చుఁ గర్మ మిచ్చినంత కాని లేదు
తాము సేసినంతవట్టు తమకుఁ బోరాదు

అన్నమయ్య. అధ్యా సం.

చిన్ననాటనుండి చేసినకర్మంబు
పిన్నపెద్దలకును బెళిగివచ్చు

వేమన

కంటిగంటిననుచు గర్మాధికారంబు
వెంటగొనుచు జెడును వెఱ్ఱినరుఁడు

వేమన

కట్టికొట్టను జిక్కదు కర్మఫలము

వేమన

కర్మవశమున సంస్కారకష్టములను
జెంది మోహాతిశయమున జెడును నరుఁడు

వేమన

రానిది కోరిన రాదది
రానున్నది కోరకున్న రానేవచ్చుం
దానెంతచింతపడినను
గానున్నది గాకపోదు

వేమన

...సౌఖ్యదుఃఖ మూలము వివరింప
బుణ్యపాపకలిత పూర్వకర్మ

వేమన

...పూర్వకృతమైన యఘంబులు వ్యాధిరూపమై
పొదివినఁదాను గైకొనకపోవునె చచ్చినఁ గర్మశేషమై

వదలక క్రమ్మఱం దగిలి వచ్చుట సిద్ధ ముపాయ యుక్తిమై
మెదలినఁగీడుతప్పుఁ దుది మేలొదవున్.

అనంత. భోజరాజీయము. I-106

......అగ్ని సమారాధనమున
జెలరేఁగి పౌరుషశ్రేష్ఠత, భవ్య
కలితదానములకు ఘనతరమహిమ
నయమొప్ప మౌనంబునకుఁ బరిజ్ఞాన
జయశక్తియును, బ్రహ్మచర్యంబునకును
బరమాయువును, జలఫలములఁదినుచు
నిరతిమై యున్న వానికి రాజ్యపదవి
క్షితిలోనఁ బత్రభక్షకునకు దివము
నతుల తపంబున కధికభోగములు
నివి కర్మఫలములు...

సోమన. ద్విప. భార అను. I

తల్లిదండ్రులు నన్నదమ్ములు బిడ్డ
లెల్లరుఁ దమపురాకృత పుణ్యపాప
ఫలములు తమపాలఁ బంచుకయందుఁ
దొలఁగక యనుభవింతురు దాఁచియుంచి

వరద. రామా. అయో. పు. 364

కాటుక కొండలవంటి (వి) కర్మమూలు

రామదాసు చరిత్ర. పుట 245-3

...కర్మానుసార, మాపదలు సంపదలు జయమప జయంబు

ధర. రామయమంత్రి. దశా. చరిత్రము. II-431

కాననమున రణమున సలి
లానలరిపు మధ్యమున మహాబ్ధి నగాగ్ర
స్థానమున మత్తు నిద్రితుఁ
బూనికతోఁ బూర్వపుణ్యములు రక్షించున్

లక్ష్మణకవి. సుభాషితములు. I-99

తొలికర్మమే బలము తోయఁగూడదు విధికి
ప్రకృతి స్వభావములు ప్రజ్వలించుచు నుండు
మ్రింగిన కళ్ళకు రుచులమేలు కనే వారెవ్వరు?

త్యాగరాజు. ప్రహ్లాదభక్తవిజయము

చేసిన పాపంబు వండిన చద్ది
కుడువక పోవమ్మ కొంతకాలముకు

శ్రీపాద. గో. మూర్తి వం. స్త్రీల. రామా. పాటలు. పుట. 173

నోచిన వారికి నోచినంతదాకా
చేసిన వారికి చేసినంత కాదా

బాలనాగమ్మకథ. పుట 8

ప్రారబ్ధము దప్పదెట్టి వారికైనను
కుడువక తీరదు చేసికొన్న కర్మము

అ. నారాయణదాసు. యథార్థరామాయణము. పుట. 208

ప్రాక్కృతి ఫలంబుఁ గుడువవలయు నొకనినననిఁ బాపమెకాని
యొండులేదు

పానుగంటి.

నీడలాగునఁ గర్మంబు నిన్ను విడువ
దెపుడు దుష్కృతు లుపసంహరింపఁబడవు

ధర్మకార్యంబు లెపుడు వ్యర్థములుకావు
భావిఫలదానచర్య వైభవము లగును

పానుగంటి

కర్మమేసర్వలోకాళి కర్తృకంబు
పాలకము నాశకంబు నిష్పారమాది
రహితమవ్యయశక్తి విభ్రాజితంబు
వర్ణనాతీత మాహాత్మ్య వైభవంబు

పానుగంటి

పూర్వ సుకృతంబు చేతను బుట్టుభక్తి
పూర్వదుష్కృతముల నద్ది పొలియుఁగొంత
యిహపురాకృతకర్మంబులేచి నరుని
ద్రిప్పుఁజుమ్మి! జలావర్తతృణము గతిని

పానుగంటి

సాలెపురు గాత్మ నిర్మిత జాలమందుఁ
జిక్కుకొనియుండువడువున జీవుఁడాత్మ
రచితకర్మజాలంబునం బ్రబలముగను
జిక్కుకొని పరమ పదంబుఁ జేరలేఁడు

విక్ర. దే. వ. ర.

కర్మము లొనర్పుటకె యధికారము నరు
లకుఁ గలదు; లేదు కర్మఫలములందు;
లేశమేనియు మదుల ఫలాశలేక
నరులు విహితకర్మంబు లొనర్పవలయు

సెట్టి లక్ష్మీనరసింహము

రుద్రుఁడు కపాలి చంద్రుడు రోగియౌట
సూర్యుఁడు పరిభ్రమించు టించుకయు నన్య
కారణమ్మునఁ గాద్దది కర్మఫలము
సకల జగమును గర్మవశమ్ము సుమ్ము

తిరుపతి వెంకట కవులు. పాండవజననము

కర్మాచరణము

ఎఱుకగల వారికిం గర్మంబు గర్తవ్యంబు కర్మరహితులయి
స్థావరంబులయట్లు జనులు జీవింపనేరరు

నన్నయ. భారత. అరణ్య. I-233

హీనాధికారుఁడగును గర్మఁగాఁడు ముక్తికర్హుఁడు

మారన. మార్కం. పు. V-323

ఈశ్వరునియందు సమర్పితంబయిన కర్మంబు తాపత్రయంబు
మాన్పు నౌషధంబగు

పోతన. భాగ. 1-77

సర్వేశ్వర పరితోషకం బేది యదియ కర్మంబు

పోతన. భాగ. V-878

...నిజవంశ కర్మంబు నడపు

సోమన. ద్విప. భార. శాంతి. I పుట 25

ఒనరంగ నాత్మకులోక్త కర్మంబు
ఘనముగా నూర్ధ్వలోకమునకుఁ జేర్చు
పరకర్మ మొనరింపఁ బాపంబువచ్చు

సోమన. ద్విప. భార. శాంతి. I పుట 25

...కర్మనిష్కృత గత కల్మషుండైన ముముక్షుండు
అయ్యవిద్యావరణంబువాసి సముదంచిత బోధమునొందు

కనుపర్తి అబ్బయామాత్యుఁడు. కవిరాజమనోరంజనము. I-141

...పురాకృతకర్మ భావ్యమె
వ్వాఁడును నేర్చునే తొలఁగఁద్రోవఁగ నోర్వకపోవవచ్చునే

తిక్కన. భారత. విరాట I-238

## కల—నిజము

కలలోపలఁ గల సుఖము ఘనసంతోషముకొఱకే
ఇలలోపలఁ గలిగినసుఖము ఇది సంతోషముకొఱకే
కలలోపలివి జీవునిసంకల్పన లిన్నియును
ఇలలోపలి ప్రపంచమింతయు నీశ్వరు సంకల్పము

అన్నమయ్య అధ్యా. సం.

## కలహము

సంతాపకారుల
కాక పెనఁకువలు సుఖంబులగునె

తిక్కన. భార. ఉద్యోగ. I-307

కలహమగుట లక్ష్మిఁ గాఱిం (విం?)చు బ్రాణ హా
నియునుజేయు నింతనిక్కువంబు

తిక్కన. భారత. ఉద్యోగ. III-17

పగ యడఁగించుటెంతయుశుభం బదిలెస్స యడంగునే పగం
బగ వగగొన్న మార్కొనక పల్కకయుండగవచ్చునే కడుం

దెగ మొదలెత్తిపోవఁ బగదీర్పఁగవచ్చినఁ గ్రౌర్యమొందు నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమిలేమి ధ్రువంబు

తిక్కన. భారతము. ఉద్యోగ. III-21

వట్టి యూర్వైరమున బలవంతుతోడి
సాటికిఁ బెనంగుటెల్ల నిష్ఫలముగాదె

కనుపర్తి అబ్బయామాత్యుఁడు. అనిరుద్ధచరిత్రము. I-89

కలహాపడు నింట నిలువదు
కలుముల జవరాలు

వేంకటనరసింహకవి. కుమారీశతకము. 68

కలహప్రియులాప్త దుఃఖకారకులుగదా!

ముత్తరాజుసుబ్బారావు. శ్రీకృష్ణతులాభారము. III-58

## కలికాలము

కలియుగమునందు ధర్మము
బలమఱివర్తిల్లు నేకపాదంబున

నన్నయ. భార. అరణ్య. III-340

వైరమున నశేషవర్ణులు నన్యోన్య
పీడచేయుచును విభిన్నబుద్ధి
నొక్కఁడొకఁడు మేరనుండక వర్ణసం
కరముసేయఁగలరు కలియుగమున

ఎఱ్ఱన. భారత. అరణ్య. IV-288

పదియాఱువర్షముల్ పరమాయు వయ్యెడు
ధరణీశ కలియుగాంతమున వినవె

ఎఱ్ఱన. భారత. అరణ్య. IV-302

కలియుగంబున ధర్మంబు కఱవుగాన
నందుధర్మంబుఁజేసినయతఁడు ఘనుఁడు
నిండు వేసవి మఱుభూమి నిర్మలముగ
జేర్మి సలిలాన్నసత్రంబుఁబెట్టినట్లు

శ్రీ నా. భీమ. V-153

సారిది ననాచారంబుల
మురువగుచుం బ్రథమపాదమునఁ గలిమహిమం
బెరుగును వడ్లును గలిపిన
కరణిన్ వర్ణాశ్రమములు కర్తరిగలయున్

పిల్లలమఱ్ఱి. జైమిని. 6-213

ఆమ్నాయపథవిహీనాచారములచేతఁ
ప్రబలు నన్యోన్యవైరములచేత
నన్యాయవర్తనులైన రాజులచేత
సమకొన్న దుర్వ్యసనములచేత
ధర్మపత్నీ నిరాదర కృత్యములచేత
ప్రభవించు వేశ్యాభిరతులచేత
పరధన పరదారహరణ బుద్ధులచేత
నలమిన ఘోరమోహములచేత
జాలికాదులచేత దూషకులచేతఁ
బ్రల్లదుల చేతవంశమాపకులచేత
డాంబికులచేతఁ బట్టిబండగులచేతఁ
గల్లరులచేత దర్పించుఁ గలియుగంబు

పిల్ల. పిన. జై. VI-212

ఇలఁగలియుగమను నెండలు గాయఁగ
చెలఁగి ధర్మమను చెఱువింకె

అన్నమయ్య. అధ్యా. సం.

కలికాల దోషంబు కడవరానిది
ఏలసమకొను సుకృత మెల్లవారికి?
తలఁపు దురితముల కాధారంబు
బలుపూర్వ కర్మములు పట్టరానివి
రాఁపైన గుణ వికారములు బహుళము
దాఁపరంబగు మమత దయ దలంపదు
హృదయంబు చంచలంబిరవు గానదు
చదువు బహుమార్గములఁ జాటు

అన్నమయ్య. అధ్యా. సం.

బలిమిగలవాఁడె రాజు సంపదలుగలుగు
నతఁడె మాన్యుండు సభలమాటాడ నేర్చు
నతఁడె పూజ్యుండు కాల్చినయతఁడెహితుఁడు
జనుల కెల్లను కలియుగ సమయమునను

వెన్నెలకంటి సూరన. వి. పు. VI–400

ఈకలికాలమున కుపకారము కలదా యెవరికైన

క్షేత్రయ్య

కలిమానవులు వెఱ్ఱిచలమునఁ దత్త్వము తెలియలేరు సుమ్మీ

త్యాగరాజు

తల్లియైన నేమి? తండ్రియైననేమి
పుత్రుఁ డధికుఁడైన మఱియు చుండ్రుడు

కాకయున్న సుతుఁడు గాఁడు మాకనుమహా
కలియుగంబువచ్చె గాదె యిప్డు

పానుగంటి. కోకిల.

## కలిమిలేములు

కలిమి లేములు కావడికుండలు -

లోకోక్తి

కలిమిలేములనఁగఁ గలవొక రెండవి
యత్నగౌరవము నయత్నతయును
గలుగవచ్చుననుట గాదది సూ బేలదనము

తేరకయుండఁగఁ జేరుం
దేరంగాఁ బోలియు విధియధీనంబులుగా
కారయ విత్తంబులు పురు
షారంభాయత్తములె

తిక్కన. భారత. IV-372, 373

కలిమియ చుట్టలఁ జేర్చుం
గలిమియ చెలులను ఘటించుఁ గలిమియ శౌర్యో
జ్జ్వలుఁడనిపించుం గలిమియ
పలువురు సద్బుద్ధి యనఁగఁ బరగం జేయున్

తిక్కన. భారత. శాంతి. I-51

ఓడల బండ్లును వచ్చును
ఓడలు నాబండ్లమీఁద నొప్పుగవచ్చున్
ఓడలు బండ్లునువలెనే
వాడంబడుఁ గలిమిలేమి వసుధను-

సుమతీ శతకము

కలిగిననాఁడే చుట్టరికంబులఁ దిరుగు
ఇవిసతమని నమ్ముట పాపమయా!

అన్నమయ్య. అధ్యా. సం.

లేమికాలమప్పు డేమేమిచేసిన
గలిసిరాదు ఫలము కాసుకూడ
కలిమివేళనన్న తులదూగు చుండును

వేమన

కలిగినట్టులుండుఁ గలుగక యుండును
మఱియు లేకయుండు మఱియుఁ గలుగు
నాశకొలఁదిని శివుఁ డందించుచుండును

వేమన

కలిమి గలిగెనేనిఁ గాముగాఁ జూతురు
లేమిచేతఁజిక్క లేమ లధిపు
మదనువంటి వాని మాలగాఁ జూతురు

వేమన

కలిమినాఁడు నరుఁడు కానఁడు మదమున
లేమినాఁడు మొదలెలేదు పెట్ట
కలిమి లేమిలేని కాలంబు గలుగునా?

వేమన

లేమియుం గలిమియు లేవు
సమ్మోదవికస్వర మానసులైన వారికిన్

ఏ. ల. కవి. సుభాషితము

లేకన్మాన వదెంత జాలిఁబడినన్ లేముల్ సిరుల్

రామదాసు చరిత్ర. పుట. 78

కలిమిగలలోభి కన్నను
విలసితముగఁ బేద మేలు వితరణి యైనన్
జలిచలమ మేలుగాదా
కులనిధి యంభోధికన్న గువ్వల చెన్నా

పట్టాభిరామకవి. గువ్వలచెన్న శతకము.

కలిమిగల వారిపక్షమె
పలుకుదు రెవ్వరైనఁగాని భావింపంగా
నిలలోఁ బేదల పక్షము
కలలోనం బలుకరనుచు ఘనులన విందున్

అప్పప్పకవి. శశిరేఖాపరిణయము.

దుడ్డుగల్లుగొప్పవారి - దోసము లెక్కింపరెవరు
గుడ్డలేని పేదవాని - కులమెంచఁగ పెద్దలంత

అ. నారాయణదాసు. జానకీశపథము. పుట. 12

కీడ్వడిన మీఁద జనుఁడు సుఖింపవచ్చు
గటిక చీకటిలో దివ్వెఁ గాంచినట్లు
మే లనుభవించి మీఁద లేమివడెనేని
వాఁడు నిజముగ జీవచ్ఛవంబు చూవె

తిరుపతి వెంకటకవులు. మృచ్ఛకటికము. I-7

పరిభవము వచ్చునే పేదవాఁడటంచు
గలిమియును లేమి విధికి నొక్కటియె సూవె!

తిరుపతి వేంకటకవులు. మృచ్ఛకటికము. I-15

కవి

ఓలినకడచన నరువది
నాలుగువిద్యలను నేర్పునై సర్గికమై

వాలిన సుకవులకుం గా
కేలతరమె కృతులు చెప్ప నెవ్వరికైనన్

నన్నెచోడుఁడు. కు. సం. I–42

భూరి వివేక చిత్తులకుఁబోలునసం దలఁపన్ దళంబులన్
సౌరభమిచ్చుగంధవహు చందమునన్ బ్రకటంబుచేసి యిం
పారెడుపల్కులంబడయ నప్పలుకుల్సరి గ్రుచ్చునట్లుగాఁ
జేరుపనేరఁ గావలయుఁ జేసెదనేఁ గృతియన్న వారికిన్

తిక్కన. నిర్వ. రామాయణము. I–5

ఎట్టికవికైనఁ దనకృతియింపుఁబెంపఁ
జాలుఁగావునఁగావ్యంబు సరసులైన
కవులచెవులకు నెక్కినఁగాని నమ్మఁ
డెందుఁ బరిణతిఁ గలుగు కవీశ్వరుండు

తిక్కన. నిర్వ. రామాయణము. I–9

అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయెకాదె కవి వివేకంబు

పా. సోమన. బసవపు. I– పు. 4

రవిగననిది కవిగాంచును
కవిగాంచనిచోటు రవియుఁగానఁడు

వేమన

తోటకూరకైన దొగ్గలికైనను
తమిదకుడుముకైనఁదవుటికైన
గావ్యములనుజెప్పు ఘనులెల్ల ధనపరుల్

వేమన

రవిగాననిచోఁ గవిగాంచునే కదా

ధూర్జటి. చాటువు.

ధరణీ సురుఁడు ప్రశాంతుఁడు
గురుభక్తుఁడు శుచియుఁ గల్పకుఁడు పూర్వకవీ
శ్వర వాక్ప్రయోగ దక్షుఁడుఁ
గరుణామతి యెవ్వఁడతఁడు కవియనఁ బరగున్

అప్పకవి. అప్పకవీయము. I–207

శ్రుతి శాస్త్రాంగ పురాణ
ప్రతతియు నితిహాస కావ్యభరతాగమముల్
స్మృతి సంగీత రతికళా
గతులనలంకృతుల నెఱుఁగఁగాఁదగుఁ గవికిన్

అప్పకవి. అప్పకవీయము. I–208

గణవర్ణశబ్దార్థగుణదోష నికరంబుఁ బరికించికూర్చుఁ గబ్బము వివేకి
బహుళతరానుప్రాస పదబంధ నియమంబు వదలక కృతిసేయు వాచకుండు
మృదుమధురోక్తులు వెదకి కావ్యంబెల్ల రచియించుఁ బదపడి రాచికుండు
మితశబ్దములలోన నతివిపులార్థంబు నిమిడించు నర్థాఖ్య నెసఁగు నతఁడు
సెప్పుయమకంబు లెప్పట్ల శిల్పికుండు
పొందుపఱుచు నలంకృతుల్ భూషణార్థి
సరళపద విరళార్థ విస్ఫురణముగను
జూపురసమొందు మార్దవస్ఫుటకరుండు

అప్పకవి. అప్పకవీయము. I–211

వర్తమాన కీర్తిదుఁడవుఁ బండితుండు
భావి ఫలదుండయా దానపాత్రుఁడర్థి
కవియొ సంతతఫలదుఁ డౌ కావ్యకలన
నాన్నృపీఃకురు తే కావ్య మనరె బుధులు

కొక్కొండ. బిల్వే. I 181

కవికి జాలిన మిత్రుండు కలఁడె జగతి

కా. కనకమ్మ.

చీకాకౌను జగంబు సత్కవు లుపేక్షింపంగ నానాటికిన్

కాం. కనకమ్మ.

మోదములోన మోదమయిపోదురు, ఖేదములోన ఖేదమై
పోదురు సర్వమున్ గరఁగిపోవును వారలదృష్టి వారి యా
హ్లాద వినోదముల్ కడు విలక్షణముల్, కవులన్న నిత్య సూ
ర్యోదయ కాలమానస సరోవర హంసలటుల్ రసప్రియుల్

మాదవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి. పంచవటి.

కవిత

సరళముగాఁగ భావములు జానుఁదెనుంగున సంపుపెంపుతో
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
బంధురముగఁ బ్రాణముల మధుమ్మృదుత్వ రసంబునఁ గంద
ళింప న
క్షరములు సూక్తులార్యులకుఁ గర్కరనాయనలిలఁ గ్రాలఁగాన్

పన్నెచోడుఁడు కు. సం. I-౩౬

తజ్ఞానం దెలుఁగనగు కవితా విశేష
మజ్ఞానం దేమి యెఱుఁగంగనగు సమ స

కనకవర్ణోత్కరమ్మొరగంట నొరసి
చూచి కాకెఱుఁగవచ్చునె సుద్దరాత

నన్నెచోడుఁడు. కు. సం. I-32

వారచూడాహరిణాంకవక్రతయుఁ గాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢపయోధరస్ఫుటతటీ పర్యంత కాఠిన్యముల్
సరసత్వంబును సంభవించెననఁగా సత్కావ్యముల్ దిక్కులం
జిరకాలంబు నటించుచుండుఁ గవిరాజీగేహరంగంబులన్

శ్రీనాథ. భీమఖండము. I-11

తప్పుగలిగిన చోటనే యొప్పుఁగలుగు
సరసకవితా వశోక్తుల సరణియందు
గప్పుకలిగిన నీహార కరునియందు
నమృత ధారాప్రవాహంబులడరుగాదె

తెనాలిరామకృష్ణుఁడు. పాండు. మహా. I-14

పొసగుముత్తెపుసరుల్పోహాణించినలీలఁదమలోన దొరయుశబ్ద
ములు గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు లెఱిఁగి నిర్దోషత నెసఁగఁ
జేసి
రసభావములకు నర్హంబుగ వైదర్భిమొదలైనరీతు లిమ్ముగ
నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు ప్రాణంబులింపుగాఁ బొదుకొల్పి
అమర నుపమాదులును యమకాదులు నగు
నట్టియర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె?

పింగళిసూరన. కళా. I-82

చలువగలవెన్నెలలచెలువునకు సౌరభము గలిగినను సౌరభముఁ
జలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁబలుకులకుఁ గోమలత నెలకొనిన సౌర
భముఁ జలువపసయుం గో
మలతయునుగలిగి జనములమిగులఁ బెంపెసఁగు మలయపవ
నఁపుఁ గొదమలకు మధురత్వం
బలవడిననీడు మఱికలదనఁగవచ్చుఁ గడువెలయఁగల యీ
సుకవి పలుకులకు నెంచన్

పింగళిసూరన. కళా. I–83

శబ్ద సంస్కారమెచ్చటను జాఱఁగనీక పదమ్ములిరియర్థసంపదలఁ
బొదలఁ
దలపెల్లన క్లిష్టతను బ్రదీపితముగాఁ బునరుక్తిదోషంబు పొంత
బోక
యాకాంక్షిత స్ఫూర్తియాచరించుచును శాఖాచంక్రమక్రియఁ
గడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాదుకో నదుకుచు నుపపత్తియొందు
నత్యూర్జితముగ

నొకటఁబూర్వోత్తర విరోధమొందకుండఁ
దత్తదవయవవాక్య తాత్పర్య భేద
ములు మహాకావ్య తాత్పర్యమునకు నొసర
బలుక నేర్చుట బహు తపఃఫలముగాదె

పింగళిసూరన. ప్రభావతీప్రద్యుమ్నము. III–3

ఘనతర ఘూర్జరీకుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం

జనుగవఁబోలి గూఢమును జాటుదనంబునుగాక యుండఁ జె
ప్పినయది పో కవిత్వమనిపించు, నగించటుగాక యుండినన్

వైచరాజువేంకటనాథకవి, పంచతంత్రము. I–18

తిన్ననిపదములు నడవడిఁ
జెన్నాపలుకులను రసము చిప్పిలుచుండన్
సన్నపువార్త నటించెడి
యన్నవ సతివోలెఁ గవితయమరఁగ వలదే

అద్దంకి గంగాధరకవి. తపతీసంవరణోపాఖ్యానము

పలుకఁగవలె నవరసములు
గులుకంబద్యములు చెవులకున్ హృద్యముగా
నళుకకయుటుఁగాకున్నం
బలుకకయుండుటయె మేలు బహుమానముగన్

రఘునాథరాయలు. రామాయణము. I–16

సందర్భము నవరస ని
ష్యందియగుచుఁగవుల చెవులఁజవులు దవుల నిం
పొందినఁదగుగా కూరక
యందదుకులుగూర్చు కవితయందంబగునే

రఘునాథరాయలు. రామాయణము. I–17

విబుధలోకంబు కవితైవ విద్యయనుచుఁ
జదువు వచనార్థముసను సంశయముగలదె
విద్యలకునెల్ల నుత్తమ విద్య కవిత
దాని తెలియుట విశ్వమంతయును గనుట

అప్పకవీయము .I-53

జననాథాగ్రణి యాత్మరాజ్యమున నిచ్చల్ పూజ్యుఁడాసీమ బా
సినఁదాగవ్వయుఁ జేయఁ డన్నికడలన్ శ్రేష్ఠుండు విద్వాంసుఁ డా
యనకన్నం గవిమేటియౌ సుకవితాయద్యస్తి రాజ్యేనకి
మ్మను వాక్యంబు నిజంబు దీనిఁగని కావ్యంబుల్ రచింపందగున్

అప్పకవీయము. I-55

తనరన్ వ్యాకరణజ్ఞుఁ డంధ్రియనుచుం దర్కజ్ఞునిన్ భ్రాత యం
చును మీమాంసకునిన్ నపుంసకుఁడటంచు న్వీడి దూరంబునం
గనియున్ పృచ్ఛనిఁబోలె ఛాందసుని వేడ్కంగావ్యలీలా రస
జ్ఞు నిజేచ్ఛం గవితావధూమణివరించున్ భావగర్భంబునన్

కాణాదం పెద్దన సోమయాజి. ముకుంద విలాసము

కనవృత్తుల గుణముల్ గణింపక యలంకారంబులున్ రీతులున్
మనవాక్యార్థపదార్థ సంగతు లెఱుంగన్నేరకే యూర కిం
పునఁ బ్రాబంధికులై రి కొందఱు కవుల్ 'పుణ్యైర్యశోలభ్యతే'
యనువాక్యంబు ప్రమాణమయ్యెనిపుడాహా! చిత్రమిద్ధారుణిన్

రేకపల్లి సోమప్ప. రుక్మవతీ పరిణయము.

కవితగల్గిన రాజ్యాధికారమేల ?

నూరకవి. రామలింగేశ శతకము. 44.

కవిత యనంగఁ బద్యములు గద్యములున్ రచియించుటౌనె భా
వ విలసనంబు లోకహిత వర్తనముం బచరింపఁజేసి క
న్గవఁను నద్దమెట్టుల గ్రంథచమత్కృతినేర్పు పెంపునన్
బ్రవిమల వస్తుతత్త్వమును భాసిలఁ జేయుటగాక యూరయున్

పూర్వకవి చాటువు

కవితా కన్యకు నలుగురు
కవి జనకుఁడు భట్టుదాది గణుతింపంగా

నవరస రసికులకు వేఱిమిటి
యవివేకియె తోడఁబుట్టువన వేమనృపా!

పూర్వకవి చాటువు.

రసములు కావ్యప్రాణము
లసమాన కవిత్వ కాంత కవనీస్థలిలో
రసహీనమైన కవితకుఁ
బొసఁగించు నలంకృతి శవమునకిడు తొడవౌ

కం. వీరేశలింగము. సరస్వతి.

సుందర బహురసపుష్టి న
మందానందంబుబుధుల మదికిడ దేనిన్
ఛందో బద్ధంబగు పద
బృందాటోపంబు తాఁ గవిత్వంబగునే

కం. వీరేశలింగము. సరస్వతి.

ఒగరు పులుసు విఱిగియురు మధురంబగు
భక్ష్యమైనకాయ పండుకొలఁది
కవికవితయు నట్లె క్రమముగా హృద్యత
గాంచు వృద్ధివయసు గడచు కొలఁది

పానుగంటి. చూడామణి.

వయసు గడచిన కొలఁదిని వన్నె కెక్కు
వస్తువులు కొన్ని గలవీ ప్రపంచమందు
వంటమందులు ద్రాక్షాసవంబునిట్టి
వానిలోనిదెసూ! కవిత్వంబుగూడ

పానుగంటి. పద్మిని.

కవితయాంతరసృష్టియై గానితత్స
మయమునందుఁ బ్రత్యక్షమౌ మహితవస్తు
పాళి మెల్లఁగఁగావ్యకల్పనముఁజేరు
బాహ్యానిన దాదిగతులు స్వప్నమునవలెను

పానుగంటి. వవ. రాఘ.

తలఁచినట్లొనరినఁదగునది కవితనా
చెప్పినట్లు వినినఁ జెలువచెలువ
తలచినట్లొనరమిఁదగునది కవితనా
చెప్పినట్లువినమిఁ జెలువ చిలువ

కొక్కొండ. విశ్వే. I–179

వీనుల విందుసేయఁగల విద్య కవిత్వము

తిరుపతివేంకటకవులు. నానారా.

కైతయు భక్తియుంగలసి గల్గజేయు నఖండమోదమున్

కాం. కనకాంబ

## కవి : తాత్త్వికుఁడు

తత్త్వవేత్తకునేది సత్యముగఁదోఁచు
నదియె సౌందర్యరూపమై యమరుఁ గవికిఁ
జండమార్తాండ తేజః ప్రసారమె గద
నిండు చందురు పండువెన్నెలగ మారు

జివమంచివేంకటరామయ్య. నవకుసుమాంజలి

## కవితాదర్శము

లలితపద హృద్య పద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై

యలఁతి యలఁతి తునియలుగా
హాల సంధించిన విధంబు నమరఁగ వలయున్

తిక్కన. నిర్వ. రామాయణము. I-16

చెప్పఁదగు కవిత రసముల్
చిప్పిల నప్పప్పబళిబళీయన; లేదా
యొప్పకు చెప్పకయుండుట
యొప్పుసుమీ! సుకవియొంత యుచితజ్ఞుఁడో కో!

మాదయగారిమల్లన. రాజశేఖరచరిత్ర

చెప్పవలెఁ గప్పురంబులు
కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపై
గుప్పినక్రియ, విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనంగ గవిత్వము సభలన్

రఘునాథరాయలు. వాల్మీకిచరిత్ర. I

యతియుఁ బ్రాసంబు దప్పని యంతమాత్ర
మునకె తన్నును దామెచ్చుకొనెదు వానిఁ
బాటిసేతురె? రసపరిపాటిఁ జేలు
మాటలఁ గవిత్వము ఘటించు మేటికవులు

రఘునాథరాయలు. వాల్మీకిచరిత్ర. I

చెవులకుఁ జవులై చల్లఁగఁ
గవులకుఁ దవులై సమస్త కావ్యకళా బం
ధువులై రససింధువులై
యవురాయనఁ గవితలవని నలరఁగవలదా

రఘునాథరాయలు. వాల్మీకిచరిత్ర. I

కవితాసతి జీవకళన్
శ్రవణోత్సవభాషణంబు సలిపెడు నట్లుం
డవలెంగాక యొకప్పుడు
శవమువలెన్నిద్రితవలెఁ జనమండంగన్

కం. వీరేశలింగము. సరస్వతి

## కష్టకాలము

...ఘనార్తిజనించెనేని నీ
చుల కడ కేగరే నిజ విశుద్ధతఁ జూడక యెట్టివారలున్

తరిగొప్పుల మల్లన. చంద్రభాను. V-34

అమృతమును విషమగు విపత్ప్రాప్తియందు

లక్ష్మణకవి. సుభాషితములు. II-8

## కష్టము

వచ్చుం జైపైన చెడ్డవారికిఁ జేటుల్

రామభ. రామా. VII-129

తమ్మిచూలి కొలిగాములు
బాములుగా దలంచెదన్

కూచిమంచి తిమ్మకవి. నీలాసుందరీ పరిణయము. I-170

కష్టపడుట మంచికార్యం బటంచును
కానిపనుల యందుఁ గష్టపడకు

కం. వీరేశలింగం. నీతిదీపిక. 49

ఒక్క నెలవునంద కష్టములు గాపురముండునె యెల్లయప్డు?

చింతకుర్తి. ప్రసన్నయాదవము. I-14

ఒడలు వంచక బుద్ధి నొదవ దెవ్వనికి

అ. నారాయణదాసు. వేల్పుమాట.

చావును లేమియున్ మనుజ సంతతికిన్ వ్యసనంబులు

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి. సత్యహరిశ్చంద్రీయము. IV-52

కరిగిననుగాని పసడికి గాంతరాదు
తఱచిననుగాని పాలజేకురదు వెన్న
యొరచిననుగాని మణికైన నొఱపురాదు
ఇడుములనుగాని నరుని కేర్పడదు కీర్తి

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి. సత్యహరిశ్చంద్రీయము. VI-108

## కష్టసుఖములు

ఇడుమలేని సుఖమించుక కానము

అన్నమయ్య. అధ్యా. సం.

అహర్నిశమును నాపదలే సహించిననవి సౌఖ్యములే

అన్నమయ్య. అధ్యా. సం.

తాను కష్టపడిన తగినంత సుఖమిచ్చు

వేమన

ఆపత్సంపద లలఁతులఁ బ్రాపింపవు ఘనులగాని

బైచరాజువేంకటనాథకవి. పంచతంత్రము. II-29

కారణములేక చెందవు ధారుణి నాపదలు సంపదలు నిందులకై
యారటపడి సర్వేశ్వరు దూఱుట గోరుటయుఁదగదు తోయజ
నయనా

సారంగు తమ్మయ్య. వైజయంతి. I-67

కష్టసుఖము లెందు గాత్రధారికి నైజమగును వానికింత యడల
నేల ?
కాలగతిని సుఖము కష్టంబువచ్చును ధాత్రిగతిని పగలు
రాత్రి వోలె

పానుగంటి. నర్మదాపురుకుత్సీయము. III

సుకము మిగుల హెచ్చి ప్రకటకష్టంబగు, నదియెతగ్గి కష్ట
మగును మఱల
జనునితనువు కాక ఘనమాచు మృతినిచ్చు, నదియెతగ్గి చావు
నందఁ జేయు
ఉభయదిశల కష్టముండు సౌఖ్యమునకు, నదియె నడుమఁ జేరి
యగును సుఖము
బాధసుఖము నొకటివస్తునైజమునను, గతినిబట్టి భేదకలనకలిగె

పానుగంటి. బుద్ధ. I

కష్టసుఖముల నీచోచ్చగతులుగలవు, చక్రదండంబునకుఁ బోలె,
సమయమందు
నిట్టిమార్పు లనంతమై యెసఁగుచుండు, భావిపరిణామమెవ్వరు
పలుకగలరు

దువ్వూరి. కృషీవలుఁడు. 26

అవనిసుఖములు క్షణికంబులైనయపుడు
కాపురం బుండునే యిక గష్టవితతి ?
కష్టమావశ్యకము ధైర్య కలనకెపుడు

కూచి నరసింహం. రూపలత. III–I–49

## కాంతాకనకములు

కనకము దాటితేనే ఘనసుఖమున్నది
వనితల అవ్వలనే వరవిజ్ఞానమున్నది

అన్నమయ్య. అధ్యా. సం

బుడిబుడిమాయలఁ బొరలేటి దేహికి
కడవరానిబంధము కాంతలు
ఎడపకందుకంటె నెక్కుడైన బంధము
కడునాసఁ బొంలించు కనకము

అన్నమయ్య. అధ్యా. సం

కాంచనంబుపైన గాంతలపైనను
బ్రహ్మకైనబుట్టు రిమ్మ తెగులు

వేమన

ధనతరుణులకాశించుపెల్ల వెనుకతనువు కలసటే

త్యాగరాజు.

ధనముజూచినవధూ, జనముగన్గొన్న
మనసు మారదె యెట్టి మానులకైన.

బాణాలశంభుదాసుఁడు. సారంగధరచరిత్ర. I

ధనము గలుగకున్న దారిద్ర్యదుఃఖంబు
ధనముగలిగెనేని దాచవగపు
దారలేకయున్న దర్పకదుఃఖంబు
దారగలిగియున్నఁ దనుపనేద్పు

దా. శ్రీ. దేవిభాగ. I—664

బంగారపు భక్త్యర్చల, కంగజమంత్రముల కెట్టులదుకును
ముదితా!

పానుగంటి. విప్రనారాయణ

ధనకాంతామోహమ్ములు, జనులకు స్వాభావికములు జగమున
నెవఁడీ
ధనకాంతామోహమ్ములఁ, గనకుఁడునో వానిశివునిగా నెన్నఁ
దగున్.

తిరుపతివెంకటకవులు. శ్రవణానందము III-71

కామక్రోధములు :

ఘనతరప్రజ్ఞయను తెప్పగలుగువాఁడు
సంసరణనదిఁ గడవంగఁ జాలుఁగాక
కామమును గ్రోధమును మదిఁ గలిగి ప్రజ్ఞ
చించునేని యాకడచుట చిక్కువడదె

తిక్కన. భారతము శాంతి. V-86

కామంబు పెంపునఁ గడఁగుఁ గ్రోధంబు

ఎఱ్ఱన. భారతము. అరణ్య. IV-288

కామంబును గ్రోధంబును, నేమరక జయింపపలయు నెల్ల
విధములన్
ధీమహిత యదియసతతి, క్షేమంకరమైన పథము కృతబుద్ధు
లకున్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-109

కామక్రోధుఁడు దపంబొనర్చితే కాశీ రక్షించునో ?

త్యాగరాజు.

కామము

కామశక్తియుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్

నన్నయ. భారతము. ఆది. VII-59

కామినులులేక లోకులఁ, గామునికెట్లగు మనోవికారులఁ జేయన్
గాము కనికరములేకయు, గామినులను జనులనెట్లు గలిపింప
నగున్

నన్నెచోడుఁడు. కు. సం. V–18

కామరహితంబుగా రతి గలదె యెందు

నన్నెచోడుఁడు. కు. సం. V–63

వలను గలదేని రూపేల వలనుఁగలిగి, రూపు గలదేని వలనేల
రూపువలనుఁ
గలకళావతిఁ గలిపించి కలిచియుండె, నేని గామసుఖంబెల్ల
వానియదియ

నన్నెచోడుఁడు. కు. సం. VIII–166

బంధనములలో నెల్లఁ బరమబంధనంబు కామంబు తద్వర్జనమున
నాత్మ
యభ్రపటలంబు వాసిన యమృతకిరణ, పూర్ణమండలమును
బోలెఁ బొలుచు

తిక్కన. భారతము. శాంతి. V–190

కామములు భోగములఁ దెగు, నేమెలతుక! నేతనాఱునే
చిచ్చుధృతిం
గామములఁ దొఱఁగు సౌఖ్యము, నేమెయి సౌఖ్యములుఁ
బోలునే యమరంగన్

తిక్కన. భార. అనుశాసనిక. V–233

కామరసమునను తృష్ణుఁడై మనుష్యు
డర్థతృష్ణా పరీతాంత రంగుఁడైన

గోరియ నడవిలో నెత్తెడు కోలుపులియుఁ
బోలెమృత్యు వాతనిఁ గొనిపోవు.

తిక్కన. భారత. అను. IV-235

సంకల్పంబారయ కామము

కేతన. దశకు.

కామము హేయము విషవం, గా మదికిని శక్యమెట్లుగాకున్న ముము

క్షామతి వలయుం గలవే, కామవ్యాధికి ముముక్షుఁగడచిన మందుల్

మారన. మార్కం. పు III-287

సమధిక భోగంబులచే సమయుం గాయమనునది మృషావాదము

ఎఱ్ఱన. హ. వం. పూ. భా. III-63

కామోపభోగసుఖములు, వేమాఱును బురుషుఁ డనుభ వించుచు నున్నం

గామంబు శాంతిఁ బొందదు ధూమధ్వజుఁడాజ్యవృష్టిఁ ద్రుంగుడు వడునే?

పోతన భాగ. IX-581

భీమాటవిలోనున్నం గామాంధునిబాఁదవు బాతకంబులు రాజ
గ్రామమున నున్న దూరితకాముని గల్మషములంటఁగా శంకించున్

బైచరాజువేంకటనాథకవి. పంచతంత్రము. IV-79

తమియుండ దెల్ల సమయములందున్

పింగళిసూరన. ప్రభా. V-23

అధిక కామంబు నరులకుఁ గొఱగాదు

తిమ్మయ ద్విప. భారత. అ ౨

కుపితులై కామంబు గోరుమానవులు
అపచారములకెల్ల నాదులుగారె!

సోమన. ద్విప. భారత. కల్య.

తలలుబోడులైన తలపులు బోడులా?

వేమన

అతివలఁ గామించునట్టి వారెందు
ఋతుకాలమనరు కోరిక గల్గెనేని

వరద. రామా. బాల.

కామము ధైర్యవారణనికామము దుర్గసు దుష్క్రియా లతా
రామము సత్క్రియాధృతి విరామము క్రోధముఖాది వంచక
క్షేమము నాస్తికత్వమతిసేమము దుర్వ్యసనాబ్ధి రాట్సుధా
ధామము సర్వదుష్టగుణధామము దానిఁ బరిగ్రహింతురే

ధరణిదేవుల రామయమంత్రి. దశావతారచరిత్ర. III-97

## కాముక పద్ధతి

కామికి నయంబున నొందు దలంపఁబోలునే

నన్నయ. భారత. ఆది. IV-215

కామాంధుఁడు గనునె యర్థ్యాకార్యముచేయున్

మల్లికార్జునుఁడు. భా. రా. కిష్కింధ. 478

నిక్కము కృపగలదె కామినీ మగ్నులకున్

కుమారరుద్రదేవుఁడు. భా. రా. అయోధ్య. 222

కలదె వివేకంబు కామాంధునకును

గౌరన. నవనాథ. పుట. 281

కామియైన హరుఁడు ఘనుఁడుగాఁడాయెనా
కామియైన విష్ణు ఘనుఁడుగాఁడె?
కామిగాక మోక్షగామిగాఁ డిలలోన

వేమన

కామిగానివాఁడు కవిగాడు రవిగాడు
కామిగాక మోక్షగామికాఁడు

వేమన

కామాతురులకుఁ జీఁకటి వెన్నెలాయె

అన్నమయ్య

అనఘ! విరక్తులకైనం దనయంతలభించు సౌఖ్యతతి వర్జింపం
జనదఁట, కాముకులకు నబ్బిన మానుదురే లభించు ప్రియ
సౌఖ్యంబుల్

పోతన. భాగ. III–783

పుడమిఁ గామాంధచిత్తుఁడెవ్వరి వధింపడెటు సేయఁడేమిగాఁడు

అల్లసాని పెద్దన. మను. VI–50

మన్మథాస్త్రకీలా కులతప్తచిత్తులకు లక్ష్యమె తక్కినవొప్పు
లెవ్వియున్

తెనాలి రామకృష్ణుఁడు. పాండు. మాహా. III–82

కాముకుల్ నూతన ప్రియులుగారె?

సూరన. కళా. III–248

అతివల యెడలఁ బాత్రాపాత్రచింత
యతనుండుతా నెఱుంగఁగనీఁడు



మదనార్తులు మీఁదటి హాని యెంతు రే

పాపరాజు. ఉ. రా. VII-332

కామాతురులను భయమును లజ్జయుఁ బొరయవు

ధరణిదేవుల రామయమంత్రి. దశావతారచరిత్ర. VII-1-68

వేదము లెల్లనుం జదివి వెంగలియై సుర తాశఁగామినీ
పాదము లాశ్రయించుఁ గులపాంసుఁడు గన్యుఁడె పండితుండె

దా. శ్రీ. దేవీభాగ. I-515

పడుచుఁదనము జారి వాంఛలన్నియుఁదీఱి
యంగపటిమ తగ్గినప్పుడైన
గామసరణి నీఱుగాక మానదుగానఁ
గామి జ్ఞానమోక్షగామి యగును

పానుగంటి. కోకిల. II

గతజల సేతుబంధములుగావా కాముకకోటి యోజనల్

ముత్తరాజు సుబ్బారావు. శ్రీకృష్ణతులాభారము. III ii -57

కామేచ్ఛ

వరసతి సురతకళాగమ పరిణతుఁడగు విటునిఁగూడి పాయదు మఱి డె
ప్పరమునఁ బాసియు నెన్నఁడు నొరుఁగవయదు జున్నుదిన్న యొట్టియబోలెన్

నన్నెచోడుఁడు. కు. సం. VIII-160

కార్యకారణములు

కారణగుణంబు గార్యమున సంక్రమించుట గలద కాదె?

శ్రీనా. శృం. నై. VI-175

అన్నిటికిఁ గారణము హరియే లోకుల కెల్లఁ బ్రకృతికారణము
తలఁపు కారణము తత్త్వవేత్తలకును చలము కారణముసంసా
రులకును
ఫలము గారణము పరమవేదాంతులకును కలిమి కారణము
కర్ములకును
తనయాత్మ కారణము తగిన సుజ్ఞానులకును
అన్నమయ్య. అధ్యా. సం.

దుఃఖముదుటయిన తాపమున కుండఁగజోటు
పదిలమగు తాపంబు ప్రాణసంకటము
మదము పెంపునకు దన మనసు కారణము
అన్నమయ్య. అధ్యా. సం.

కర్మానుగుణము కాలము ధర్మానుగుణము దైవము
అజ్ఞానహేతువులాసలు విజ్ఞానహేతువు విరతొకటి
అన్నమయ్య. అధ్యా. సం.

## కార్యగతి

కార్యగతుల తెఱఁగు కలయూపుసెప్పిన, నధికమతులు దాని
నాదరింతు
రల్పకార్యబుద్ధులగు వారలకునది, విరసకారణంబు విషమపోలె
నన్నయ. భారత. అరణ్య. I–59

కార్యఫలంబు లెల్ల సద్భావమునన్, విచారసులభంబులయుండ్రు
విచారపారగుల్
నన్నయ. భారత. అరణ్య. I–257

బెడిదముగఁ గత్తి గొడ్డటఁ బొడువఁదెగిన మ్రానఁ జిగురు
వొడముఁ బలుకులం
జెడ దునిసినకార్యంబు నిగుడనేరదు పిదపనెట్టుఁగురువంశ నిధీ!
తిక్కన. భారత. ఉద్యోగ. II–61

కార్యఫలము లయెడఁ దాన కర్తననుట కడు నెఱుంగమిఁ జువ్వె.

ఎఱ్ఱన. భారత. అరణ్య. V–66

సర్వకార్యములొక్క– చాయనరావు

శ్రీనాథ. పలనాటి. పుట. 36

జలముల సేతువు బెడిదపుఁ బలుకులభీతుండు చెనటిపాడిం జాతిన్
జెలిమిరహస్య మొనర్పం, దలపనిపని చెడునిగూఢతర మంత్రం
బున్

బైచరాజువేంకనాథకవి. పంచతంత్రము. I–183

అపరీక్షితం బకార్యము, సుపరీక్షిత మభిమతంబు సుమ్మొవ్వా
రికిన్

బైచరాజువేంకటనాథకవి. పంచతంత్రము. V–3

సగుణనిర్గుణకార్యముల్ సలుపుసుమతి, సేఁతపరిణతిఁ గడుఁ
బ్రతీక్షింపఁదగును
బరుపకర్మవిపాకంబు ఫలముదనుక, హృదయముదహించు
శల్యంబురీతిజగతి

లక్ష్మణకవి. సుభాషితములు.

కొండవిధానమెవ్వనికి కొండొకకార్యము నెత్తిమీద కూ
ర్చుండునొ వానిజీవనము రోతయె యయ్యది తీరునంతకున్

సెట్టిలక్ష్మీనరసింహం. చిత్రహరిశ్చంద్రీయము. IV

సంకల్పంబులు కార్యరూపమును దాల్పం బోవు నప్పట్ల నా
తంకంబుల్ పలు తెన్నులై గదియు

శ్రీరామలింగేశ్వరశతకము

## కార్య విచారము

ధీరమతియుతులతోడవి,
చారము సేయునది మును విచారితపూర్వ
ప్రారబ్ధమైన కార్యము
పారముఁ బొందును విఘాతపదదూరంబై

నన్నయ. భారత. ఆది. VI-104

కార్యవిచారము చిరముగ,
ధైర్యముతో నడపవలయుఁ దత్త్రక్రియలం
దార్యుఁడనార్యుడు వీఁడని
యార్యులు సేయుదురు నిశ్చయమును జిరముగన్

తిక్కన. భారత. శాంతి. V-288

కాలము దేశము శక్తియుఁ
దాలెస్సగఁ దెలిసి చేయఁదగు కార్యమునా,
ర్యాలోచనపూర్వకముగ.........

శ్రీధరమల్లెవేంకటరామకవి. బ్రహ్మోత్తరఖండము. IV-98

తన కెంత తెలివి కలిగినఁ
దన కార్యముపట్లఁ దానె తగుదుననుట యొ
ప్పనిపని; యోగ్యతగలిగిన
తనమిత్రులనడుగుటొప్పుఁ దగవరి కెందున్

తిరుపతివేంకటకవులు శ్రవణానందము. IV-56

## కార్యశూరత

కార్యంబున నార్యులు నిజప్రయోజనంబు నెఱింగింతురు గాని మాటలం బ్రకటింపరు.

శ్రీనాథ. శృం. నై. II-25

అరయఫలకాముకులగు. వారలు గుణవత్ప్రసక్తి వదలవిడుతురే

తెనాలిరామకృష్ణుఁడు. పాండు. మాహా. IV-232

మందుచేదుచూడకు, పెరిగిన తెవులడఁగఁజూడు

రామభ. రామా. VII-75

కష్టపడునట్టివారు లోకంబుతోడ
మొఱ్ఱపెట్టరు తమకష్టములను గూర్చి
వట్టివారలె యఱతురు మిట్టిపడుచు
గొడ్డుగేదెల కఱపులు గొప్పగావె.

కందుకూరి వీరేశలింగం. నీతికథామంజరి.

మానసంబున రవులు క్రోధానలంబు
గానబడకుండ దిగమ్రింగి కార్యవాది
సమయమగునప్డు చెలరేగి జగములడల
బైటబడఁదగు నగ్నిపర్వతమువోలె

చిలకమర్తి. ప్రసన్నయాదవము. V-86

చేఁతలు సరిగాను జేసెదనని పెంపుఁ, జెప్పువారు వానిఁ జేయలేరు
చేయువారెపుడును జెప్పికొనరుగాంచ, నఱచుచుండు కుక్క-
కఱవదెచట

విక్ర. దే. వ.

## కార్యసాధన

ఫలార్థియైనవాఁడు తత్ఫలాను బంధంబున దోషంబులు పరి
కింపండు

నన్నయ. భారత. ఆది. VII-12

కార్యసిద్ధిఁ బొంది కాలంబు దేశంబు
నెఱిఁగి బుద్ధిమంతులెల్ల ప్రొద్దు

సాహసంబు విడిచి సామాద్యుపాయ ప్ర
యుక్తి చేయుదురు యథోచితముగ.

తిక్కన. భారత. అరణ్య. III–348

తనియఁ బండకుండమును గోసికొనఁజవి
చేటుకాదు విత్తుచేటుఁ గలుఁగు
బక్వమైనఁ గొనిన ఫలమించుఁ జెడదు బీ
జంబుఁగార్యసిద్ధి చందమిట్లు.

మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ దేఁటి
పువ్వుఁ దేనియఁగొనియెడు పోల్కి నెదురు
గందకుండఁగఁ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁబోలె మొదలంటఁ బొడువఁజనదు

తిక్కన. భారత. ఉద్యోగ. II–56, 57

ధర్మము దప్పక నయగతిఁ గర్మాచరణంబు నడపఁగా ఫలసిద్ధిన్
నిర్మలయశమగు

తిక్కన. భారత. సౌప్తిక. I–34

చాలనభీష్టముల్ తనవశంబుగఁ జేయునయోగ్యుఁడైన న
మ్మేలుదలంచి దానియెడ మిక్కిలి వేడుకసేత నేర్పగుం
గాలపువేఁటకాఁడు ఝషకాంక్షను తానుదకంబు మీఁదటన్
దేలెడుదృష్టిపై నిలుపు దృష్టియుఁ జిత్తము నాదరంబునన్

మంచన. కే. బా. చ. IV–105

తనకార్యము కొఱకై హీనుని యొద్దకునైనఁ బోఁజను

మంచన. కే. బా. చ. IV-106

ప్రభువుల్ ప్రయోజనాపేక్ష నొకప్పుడాశ్రితులకీరె సముచిత
గౌరవోన్నతుల్

శ్రీనాథ. హర. III-39

మనసులోఁ బుట్టిన మంచితలంపు
లాచరణమునందు అలవికాకున్న
జన్మఫలంబేమి చచ్చుటే మేలు.

శ్రీనాథ. పల.

భోజనము సేయుమనఁగఁ దాంబూలగంధ
పుష్పములు గొమ్మనఁగఁ ద్రోసిపోవఁజనదు
ఇంపుతోడుత నంగీకరింపవలయుఁ
గార్యఫలసిద్ధి కవి యాదికారణములు

పిల్లలమఱ్ఱి. శృం. శాకుంతలము I-130

నీతిపథము దప్పి నెఱివేగపడి సేయు
నతఁడు దుఃఖఫలము లనుభవించుఁ
గ్రిందుమీఁదెఱింగి కృతకార్యుఁడగువాఁడు
చేయుకార్యమెల్ల సిద్ధిఁబొందు

మడికిసింగన. పద్మపురాణము.

ఆర్యుల సమ్మతిగాకే కార్యముఁ బూనంగరాదు కాదనిగర్వో
దార్యమునఁ బూనెనేఁ దత్కార్యముకాదె కడతాను
గడునార్తుఁడగున్

పు. తిమ్మన. సమీర VII-95

ఒకచో నేలను బవ్వళించు నొకచో నొప్పారుఁబూసెజ్జపై
నొకచో శాకములారగించు నొకచో నుత్కృష్ట శాల్యోదనం

బ్రాకచో బొంతధరించు నోకొక్కకతతిన్ యోగ్యాంబరశ్రేణి; లె
క్కకు రానీయఁడు కార్యసాధకుఁడు దుఃఖంబున్ సుఖంబున్
మదిన్

లక్ష్మణకవి. సుభాషితము.

పరులవేఁడునట్టు పనిచేయఁ బనిచినఁ జెప్పఁదడవదానిఁ జేయు
చుండు
చేయుపనియుఁ జాలశ్రేష్ఠంబుగానుండు మనసుకుదిరిచేయు
మహిమ కతన

కం. వీ. పం. నీతిదీపిక. 73

నూఱుమాటలాడవచ్చునుగాని యొకమాట నెఱవేర్చుట
దుర్భరముకదా!

తిరు. వేంకటకవులు. పాండవోద్యోగములు.

పనులొను బ్రయత్నముచేతన కావవి బహుమనోరథము
లున్నంతన్
దనగుహ నిద్రించినహరి ఘనముఖమునఁ జొచ్చునే మృగప్రవర
మెటున్

వి. దే. వ. రచనలు.

## కాలప్రభావము

కాలోపహత మనస్కుఁడు
మేలు తెరువు వట్టునెట్లు ?

తిక్కన. భారతము. శల్య II-368

కాల సంప్రాప్త మేరికిఁ గడవవచ్చు

తిక్కన. భారతము. శల్య 11-382

లోకము కాలముచేని
ట్లాకుల పడుచునికి గాంచి యధికధృతిని ధ
ర్మైకాంతతా నిరూఢిం
గైకొని త్రోవంగ వలదె కాలవికృతులన్

తిక్కన. భారత. శాంతి. III-236

అశుభమునకు శుభమునకును గాలము సూవె కర్త

తిక్కన. భారత. శాంతిపర్వము. IV-430

చెడు కాలమైన నెవ్వరి దెస నే వికారములు వచ్చునో

నాచన సోమన. ఉ. హ. వం. V-45

కలిసివచ్చు వేళ ఘనులౌదు రల్పులే

వేమన

కాడైనఁ జూడవీడగు
వీడగు నెడఁగాడు పసును విభవోన్నతుఁడే
కీడొందుఁ గీడు సెందిన
వాఁడే మేలందుఁ గాలవశమునఁ గాదే

పు. తిమ్మన. సమీర. VII-75

......జననము మరణము వృద్ధి
వఱలు హానియుఁ గాలవశత వచ్చునవి

సోమన. ద్విప. భార. శాంతి. I-18

కాలగతి తప్పి వచ్చిన ఘనుడయినను
నిగ్రహింపఁగఁ బడుఁ జుమీ నీచు చేత
జగములన్నియు వెలిగించు చండకరుఁడు
చిన్నమబ్బులచేత సంఛన్ను డగును

చిలకమర్తి. ప్రసన్నయాదవము

......అని వార్యంబైనకాలంబె మి
క్కిలి యాశ్చర్యములైన మార్పులను గల్గించుంగదాధారుణిన్
చిలకమర్తి. గయోపాఖ్యానము

మాన్యులొనరింప నేరని మహిత కార్య
మొక్క యల్పుఁడె యొడఁగూర్చు నొక్క వేళ
దువ్వూరిరామిరెడ్డి. సీతావనవాసము

కింకరుడే ధ్రాజగు, రాజె కింకరు డగున్ గాలాను కూలంబుగన్
బలిజేపల్లి. సత్యహరిశ్చంద్రీయము

కాలంపుం గతి నెప్పుడేది యెటు భోగ్యం బప్పు డప్పాటనౌ
బలిజేపల్లి. సత్యహరిశ్చంద్రీయము

కాలము

కాలం బొక్క విధంబుననుండక
పెక్కు ప్రకారము లనుండు భిన్నావస్థన్
నన్నయ. భారతము. అరణ్య. III-334

కాలమడఁగించు జనుఁగ
ల్లోలిని గిరిఁద్రెంచు కరణి లోభక్రోధా
శీలత్వకామ భయములఁ
దేలు జనుఁడు గాలవృత్తి తెఱఁగు నెఱుఁగునే
తిక్కన. భారత. శాంతి. IV-444

ధరణి మొదలైన పంచ భూతములకంటె
మనసు కంటెను బుద్ధి కంటెను మహత్త్వ

రంబు గాలంబు గాలతత్త్వంబు మిగిలి
యుండు విభుఁ డిజ్జగంబుల కొడయఁడతఁడు

తిక్కన. భారత. శాంతి. IV–197

కళలుం గాష్ఠలు లోనుగఁ
గల చిదురలఁ గూర్చుకొనుచుఁ గాలంబు జనం
బు ఒ వడ్డికిచ్చు నాతని
వలె నలవడఁబొదివి తనకు వశ్యులఁజేయున్

తిక్కన. భారతము. శాంతి. IV-443

కాలము నెవ్వండు గడిమిఁగడవఁగ నోపున్

భాస్క రుఁడు. భాస్కర. రా. అర. III–372

కాలమెవ్వరుం దిరుగఁగ బెట్ట లేరు విధి త్రిప్పులు దప్పి చనంగ నేర్చునే

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ 1370

ఒక్క నాటి ప్రపంచము ఒక్కనాటి వలె రాదు
ఒక్క నిమిషమువలెనొకటి గాదు
పొద్దు వొడచేది గొంత పొద్దు గూఁకేది కొంత
చద్ది గొంత వేఁడి కొంతచవులు గొంత
ఒద్దనే కాలమునందు ఉండుండీ దవ్వాయి పోవు

అన్నమయ్య అధ్యా. సం.

ముగియదు కాలము ముందరి కింకాఁ
దిగని ప్రవాహము దిన దిన మిదిగో

అన్నమయ్య. అధ్యా. సం.

లాలసులగు మానవులనుఁ
గాలము వంచించు, దురవగాహము సుమతీ

పోతన. భాగ. I–275

కాలమన్నియుం జేయుచునుండుఁ గాలము విచిత్రము దుస్తర
మెట్టివానికిన్

పోతన. భాగ. I–177

ఉన్నట్ల యుండఁగా దరి
కిన్ నరులను నావచేర్చు క్రియ వెసఁదాఁ బో
కున్నట్ల యుండి కాలం
బున్ నరులకు వయసుఁబుచ్చి మోసము దెచ్చున్

ఆముక్తమాల్యద. II–79

కాలపర్యాయంబు గడవ నెవ్వరికిఁ
బోలును ?

సోమన. ద్విప. భార. అశ్వ. I–19

కాలము పోవును కడకు మాట నిలుచు

క్షేత్రయ.

కాలము ఒకరీతిగా వచ్చునా ఉండి ?

క్షేత్రయ.

కాలమండటికినిఁ గర్తయౌఁ గాని
కాలమునకు నొరుల్ కర్తలు గారు

వరద. రామా. కిష్కింధ. 378

కాలమొక రీతి నెవ్వరైన గడుపఁగలరె

అ. నారాయణదాసు. సావిత్రీ చరిత్ర. 23

బాలుకంటఁ గాలంబు తాఁబేలు వలెను
ప్రాఁకు ఘనతయందలి యాస బాలునంట

వృద్ధుకంటఁగాలంబు పర్వెత్తు లేఁడి
రీతిఁ జావునందలి భీతి వృద్ధుడుంట

పానుగంటి. కల్యా. రాఘ.

దైవరూపంబు కాలంబు దానికెపుడు
లోటు గలుగదు మనబుద్ధిలోటు దాని
యందునారోపణము సేయుచుందుము తల
దిరుగుమానిసి యిల యెల్లఁదిరుగు ననఁడె

పానుగంటి. సారంగధర. I

సర్వ పరిమాణ కలన ప్రశస్తమైన
కాలమున కొండు పరిమాణ లీల కలదె?

పానుగంటి. పాదుక. VII

కాలమా నీదు మాహాత్మ్యగరిమ దాట
ధరను సాధ్యంబె జీవనధారులకును

పానుగంటి. సారంగధర. IV

కాలము గడచుట నైజం
బే లీలల నైనఁ గడచు హీనులకు సము
ద్వేల వ్యసనమ్ముల గుణ
శాలురకున్ హరికథా ప్రసంగ వశమునన్

త్రిపురాన తమ్మయదొర. దేవీభాగవతము

కాని కాలమునకు తారహారము
విషవ్యాళమై కఱచు

దు. రామిరెడ్డి. సీతావనవాసము. IV

కష్టజీవితు కన్నీటి కాల్వకైనఁ
గాలచక్రము నిలువదు......

ధారుణీ పాల పాలనా దండమునకు
వెఱచి యాఁగదు......

దు. రామిరెడ్డి. వనకుమారి. IV-44

కానలేము కాలపు మర్మమేను నీవు
ఆ జిలుఁగు వ్రాత చదువ సాధ్యంబె మనకు
తెరవెనుక నేను నీవను పొరపుగలదు
ఆవిభేదము తెరయెత్త నంతరించు

దు. రామిరెడ్డి. పానశాల

బలవంతులు తెగుదురు దు
ర్బలులు జయముఁగొంద్రు కాలవశమున

తనికెళ్ళ ప్రకాశశాస్త్రి. శ్రీకృష్ణరాయబారము

కాలము: కర్మము:

కాలమెంతైనాఁగద్దు కర్మములు వేవేలు

అన్నమయ్య. అధ్యా. సం.

కాలపాశాను వర్తియై కర్మఫలము
లనుభవించక తీరునా మనుజునకును

దా. శ్రీ. దేవీభాగ. IV-461

కాలము గర్మంబు గడవఁగలరే మనుజుల్

తిరుపతి వెంకట కవులు. పాండవవిజయము

కాలయాపన

కాలయాపన సేయఁగాదు నిశ్చయముపైఁ
గర్తవ్యమగునట్టి కార్యమునకు

శ్రీనా. శృం. నై. IV-17

చేయ లేక పోదునా యని జాగును
సేయు వాఁడు పనిని చేయు లేఁడు

అ. నారాయణదాసు, నూరుగంటి.

తనకుంగీడు ఘటించు నట్టి పనికిం దానెమ్మెయిం గాలయా
పనముంజేయుట మేలు

వరిహగిరి కొండ్రాజు. జగన్నాయక శతకము

## కావ్యము

పరఁగ సువర్ణ బంధ మృదు భావము గల్గియు లోను చూడఁగాఁ
బోరపగు చిత్ర రూపమును బోలెన సత్కవి కావ్యమిమ్మహిన్
బరఁగు సువర్ణ బంధ మృదు భావ విశేషము లొప్పు దెల్పలన్
సరియగు రత్నపుత్రికయు సత్కవికావ్యము నొక్క రూపమై

నన్నెచోడుఁడు. కు. సం. I-37

అక్కజమై మహార్థ నివహంబు సదుక్తులు మెచ్చఁజూచినన్
గ్రుక్కదమైన సత్కృతియగుర్వగుఁగా కిలఁజీకు లావుకం
ద్రొక్కినయట్లు నోరఁగొలఁదుల్ పురికొల్పఁగనందు లోన నొ
క్కొక్కఁడు సకనై నఁగృతియుం గృతియందురె వానిమెత్తురే

నన్నెచోడుఁడు. కు. సం. I-38

పూనినరీతి వానితలఁపుల్ వడిఁ బ్రాసములుం జలంబునం
బానగిలంగ నీడ్చి యొక పద్యముఁగూర్పఁగ వచ్చుఁగాక యా
ఖ్యాన కథానుకూలముగఁ గావ్యముఁజెప్పవశంబె సన్నమై
కానఁగ జల్లి నేయునది కట్టెడు పుట్టము నేయనేర్చునే!

కొఱవిగోపరాజు. సింహాసనద్వాత్రింశిక. I-20

నానుళ్ళును శృంగారము
నానావిధవృత్త వర్ణనలు సంపూర్ణం

వైనిల్చిన కృతి సత్కృతిఁ
గానుతియింతురు గదా సుకవులెయ్యెడలన్

ప్రౌఢకవి మల్లన. రుక్మాంగద చరిత్ర. పీఠిక. 25

సౌరభ్యంబును బంధచాతురి తగన్ శయ్యాచమత్కార శృం
గారంబున్ వివిధార్థముల్ సరససాంగత్యంబు నానాకళా
పారీణత్వము మంజువాగ్విభవమున్ బాంచాలరీతిన్ దగన్
వారస్త్రీయును బోలె నొప్పవలదా వర్ణింపఁ గావ్యంబిలన్

ప్రౌఢకవి మల్లన. రుక్మాంగద

లోకోత్తరగుణ పుణ్య
శ్లోకకథా మధురి మధురశుభవాఙ్మయ ర
త్నాకల్పంబగు కావ్యం
బాకల్పంబగుఁ గృతార్థుఁడగు కవివరుఁడున్

భైరవకవి. శ్రీరంగమాహాత్మ్యము

సప్తసంతానములలోఁ బ్రశస్తిఁగాంచి
ఖిలము గాకుండునది ధాత్రిఁగృతియ

పెద్దన. మను. పీఠిక. 14

వేదంబుల్ నృపశాసనంబులు సుహృద్విజ్ఞాపనంబు ల్పురా
ణాది గ్రంథము లంగనాజన విలాసాలాపలీలా సము
త్పాదుర్భావములౌర కావ్యములు కర్తవ్యోపదేశ క్రియా
వాద ప్రక్రియనెన్నఁ గావ్యమహిమ ల్వర్ణింపఁగా శక్యమే

భట్టుమూర్తి. కావ్యాలంకార సంగ్రహము. I-25

పరమజ్ఞాన లతాలవాలము జగత్ప్రఖ్యాతి విఖ్యాత సా
గర చంద్రోదయ మిష్టసంఘటన రేఖాదివ్యధేనూత్త మం

బురు కార్పణ్య దశానిశాదినముఖం బుద్వేల నిర్వాణ భ
వ్యరసాస్వాద రసాయనంబనినఁ గావ్యంబెన్న సామాన్యమే
భట్టుమూర్తి. కావ్యాలంకార సంగ్రహము. I-26

కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము లాద్యసత్కథ
ల్వావిరిపుట్టు రత్నము లవారిత సత్కవికల్పనా విభూ
షావహ పూర్వ వృత్తములు సానలఁదీరిన జాతిరత్నముల్
రామరాజభూషణుఁడు. వసు. I-19

భావం బెక్కడ లేక వృత్త నియమాపాయంబుఁ జంతింప కెం
దేవర్తించి పరార్థ వంచనలచేదీపించి మూర్ఖాళి సం
భావింపం గుకవి ప్రణీత కృతి సామాన్యాకృతింబూని పై
పై వన్నెల్పచరింప దానిఁదిలకింపంబోరు ధీరోత్తముల్
రామరాజభూషణుఁడు. వసు. I-11

తేనె సోక నోరు తీయన యగు రీతి
తోడ నర్థ మెల్లఁ దోఁచకుండ
గూఢ శబ్దములను గూర్చిన కావ్యంబు
మూఁగ చెవిటి వారి ముచ్చటరయ
మొల్ల. రామా. I-16

ధర్మములలోన నుత్తమ
ధర్మము కావ్యము నిజంబు ధర నెవ్వని కా
ధర్మము చేకుఱు నతఁడు సు
ధర్మను వసియించుఁ బెక్కుదైవత యుగముల్
అప్పకవీయము. I-126

నిలిపి రెక్కడ నచటనె నిలిచియుండు
నగ్రహారాది సంతతు లరసిచూడ

నవియు గృతి ముఖ్య రచనచే నఖిలదిశల
నెగడుఁగావునఁ గావ్యమన్నిటికిఁ దొడవు

అప్పకవీయము. I-128

తనకు హితార్థము లెఱిఁగిం
చు నఘంబులడంచు ధనము శోభనము యశం
బును గూర్చు నఖిలసురలన్
గనఁబడఁగాఁ జేయు నెపుడుఁగావ్యము కవికిన్

అప్పకవీయము. I-131

ఇల సప్త సంతతుల లో
పల (గావ్యముదక్క దేవభవన వనాదుల్
ఖిలములగుఁగొన్ని వర్షం
బులకని చంపువు రచించె భోజుండెఱుకన్

అప్పకవీయము. I-137

గుడి వడును నూయిపూడును
వడినీళ్ళకుఁ జెఱువు దెగును వనమిలఖిలమౌ
చెడనిది పద్యము సుమ్మీ
కుడి యెడమలు చూడకన్న గువ్వల చెన్నా

గువ్వలచెన్న శతకము. 110

తల్లి కడుపున బొడమని
తనయుగాదె కృతి

కొక్కొండ. బిల్వే. I-10

ప్రకటితమగు దాఁకనె కృతికర్త ధనము
పిదప నద్ది సారవిదుల ధనము

కన్నె యయిన కాంత కన్నవారలసొమ్ము
పెండ్లియైన పిదపఁబ్రియుని సొమ్ము

జయంతి రామయ్య. చంపూరామాయణము. అవతారిక

......అపూర్వ కావ్యసృష్టి
అమరతం గూర్చుఁగర్తకు నాశ్రితునకు

దువ్వూరి రామిరెడ్డి. నలజారమ్మ. పీఠిక

కావ్యములు మానవులపాలి కల్పలతలు

నా. కృ. రావు. గ్రంథాలయ సూక్తులు. V-3

సరసులగు పండితుల విమర్శనము లెల్ల
గడచినదె కద నిర్దుష్ట కావ్యమగును

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి. సత్యహరిశ్చంద్రీయము

## కీడు

అంతిపురము చుట్టఱికం
బెంతయుఁగీడు

తిక్కన. భారతము. విరాట. I-131

తొడిఁబడ నొకకీడు దొడరిన చోటఁ
దడవు సేయక దానిఁ దప్పింప వలదె

తిమ్మయ. ద్విప. భా. ఆది. I-63

భుక్తి వధూజనరక్తి నిద్రాసక్తి
అగ్గలంబైనఁ గీడావహిల్లు

నూరకవి. రామలింగేశ శతకము. 76

తమ్ములు సద్గృహమ్ములు సుత ప్రకరమ్ములు సొమ్ములిష్ట వ
ర్గమ్ములు వైభవమ్ములు జగమ్ములు గ్రమ్మఁగ నెమ్మినుండి పా
పమ్మనిశ మ్మొనర్చుట నెపమ్ముగఁ గీడగు

పిండిప్రోలు లక్ష్మణకవి. లంకావిజయము

పరువంబు కలిమి, దొరతన
మరయమి యనునట్టి వీనియందొకఁ డొకఁడే
పొరయించు ననర్థము నాఁ
బరగినచో నాల్గు చెప్పవలయునె చెపుమా!

చిన్నయసూరి. నీతిచంద్రిక

బాగుసేయు వానిఁ బరికింప కీడుమల
కీడు వానిమెచ్చు వెడఁగు చెడును

అ. నారాయణదాసు. నూరుగంటి. 7

లొంగరాని వాని లొంగింపఁజేయఁగఁ
బూనునట్టివాఁడు తానె చెడును

అ. నారాయణదాసు. నూరుగంటి. 10

తనకు మించినట్టి దాని నిల్లాలుగఁ
జేసికొనెడువాఁడు చెట్టబొందు

అ. నారాయణదాసు. నూరుగంటి. 21

తన్ను లొంగఁజేయు దారి యొక్కనికిఁదా
మప్పుకొన్నవాఁడు ముప్పుజెందు

అ. నారాయణదాసు. నూరుగంటి. 22

కొత్తనేస్తకానిఁ గుట్టెఱుంగక నమ్మి
యిరవునిచ్చువారు చెఱపుఁగొంద్రు

అ. నారాయణదాసు. నూరుగంటి. 57

పాటు పడెను మంచివానితో నెగసక్కె-
మాడువాఁడు తుదకుఁ గీడుఁబొందు

ఆ. నారాయణదాసు. నూరుగంటి. 69

అంతరు వెతింగికొనియుఁ దనంతఁబోక
గోటు చూపెడు వాఁడు దా జేటుబొందు

అ. నారాయణదాసు. నూరుగంటి. 73

చేయవలయుదాని జేయక తా మానఁ
బూనునట్టివాఁడు మోసపోవు

అ. నారాయణదాసు. నూరుగంటి. 76

లలనలకు స్వేచ్ఛ, గృహమేధులకు ఋణంబు
గత్తులకు ద్రుప్పు హానికిఁ గాణములు

కాళ్ళకూరి. మధు సేవ. VII-65

## కీర్తి

నిత్యమయిన ధనము నిర్మల కీర్తియ

నన్నయ. భారతము. ఆది. VII-31

కీర్తి నిలుపుటయ కాదె
జనులకు జన్మ ఫలంబు

నన్నయ. భారతము. ఆది. VIII-30

కీర్తి లేని వానికిని జీవనంబు ని
రర్థకంబ చూవె యవని మీఁద

నన్నయ. భారతము. ఆది. VIII-30

ఇలఁగీర్తి యెంతకాలము
గలిగి ప్రవర్తిల్లె నంత కాలంబును ని

త్త్యల కారె కీర్తి గల పు
ణ్యులు కీర్తి విహీనుఁ డెందునుం బూజ్యుండే?

నన్నయ. భారతము. ఆది. VIII-31

ధరణిఁ బొగడిత యెందాఁకఁ బరఁగు నంత
కాలమును బుణ్య లోకంబు గల్గునండ్రు

తిక్కన. భారతము ఉద్యోగ. II-67

వెదక వలదె చిరతర కీర్తిన్

తిక్కన. భారత. ఉద్యోగ. IV-18

తనకుఁ దనయులకు సతులకు
జననీ జనకులకు బంధు జనులకుఁ గీడౌం
దని తెరవునఁ గీర్తిఁ గొనం
జనుఁగా కందఱును జెడు యశం బేమిటికిన్

ఎఱ్ఱన. భారతము. అరణ్య. VII-268

కీర్తియయిచ్చుఁ బుణ్యగతిఁ గీర్తియతల్లియుఁబోలెఁ బ్రోచు స
త్కీర్తియ యాయువున్ సిరియుఁ గీర్తివిహీనుఁడచూ శవంబు

ఎఱ్ఱన. భారతము. అరణ్య. VII-294

దివి ముట్టి ధరణి యంతట
నివిడి మెఱయు చుండు నెవ్వని యశోరమ య
ట్టి విశిష్ట చరిత్రుఁడు య
త్నవరాపురుషుండునాఁ బ్రకాశత నొందున్

ఎఱ్ఱన. భారతము. అరణ్య. VII-454

అధ్రువంబైన మల భాండమైన దేహ
మనఘుయనోన్యోపకా రార్థమై వ్యయించి
ప్రవిమలంబుఁ గల్పాంతరధ్రువమునైన
కీర్తికాయంబుఁ గైకొంట కార్తి యేల

శ్రీనా. హర. II-80

బ్రతుకు లస్థిరములు పడుట సిద్ధంబు
సంపదల్ని లువవు జలబుద్బుదములు
సత్కీర్తియొక్కటి సమయ దెన్నటికి

శ్రీనా. పల. వీ. చ

మెఱసి యుపకార మొనరింప మేలు వచ్చుఁ
గీడు వచ్చు మనంబులో నోడ వలదు
వాఁడు చేసిన ధర్మంబు వానిఁగాచుఁ
గీర్తి యొక్కటి చాలదే కేవలంబు

శ్రీనా. కాశీ. II-107

యశో విహీనులు జీవన్మృతులు

పిల్ల. పిన. జైమి. IV-41

ఇచ్చెడు వానికి రణమునఁ
జొచ్చిన వానికిని గాక సురుచిర కీర్తుల్
వచ్చునె పందకు లోభికి

పుష్పగిరి. తిమ్మన. చాటువు

తా సంపాదించి చేసిన
ధర్మానఁగల్గును కీర్తి

రామదాసు చరిత్ర.

సిరిగలనాఁడె మానవుఁ డశేష జగద్విదితంబు గాఁగ సు
స్థిరతరమైన కీర్తులను జెందుట మేలగు

కూచిమంచి తిమ్మకవి. శివలీలా విలాసము. I

కీర్తి యుపార్జింపు మెపుడు కృత పుణ్యుఁడవై

శ్రీధరమల్లె వెంకటరాయకవి. బ్రహ్మోత్తరఖండము. VI-94

బ్రతుకునందు గడింప వలసిన దెల్ల
మానిసి కెంతయు స్మంచి పేరొకటె

అ. నారాయణదాసు. వేల్పు మాట.

ఎవ్వరు కవి సంశ్లాఘ్యులో
యివ్వసుమతి వారె బుట్టు వెనసిన వారల్
సువ్వెమది కీర్తి నిత్యులు

కొక్కొండ. చిల్వ. I-123

తుచ్ఛ మగు రాజ్య మేటికి?
స్వచ్ఛంబగు యశము లేని సౌఖ్యము ఘనమే?

తిరుపతి వేంకటకవులు. పాండవ.

వరకీర్తిం జనువారు చచ్చియును చావం బోవ రెప్పట్టునన్

శ్రీపాద. బొబ్బిలివిజయము

## కీర్తి అపకీర్తి

కీర్తియు నపకీర్తియు జనులకు
స్వర్గనరక నిమిత్తంబులు

నన్నయ. భారతము. ఆది. VII-30

సత్కీర్తి వేగమే సరవి నశించు
అపకీర్తి జగముల నధికమై యుండు

శ్రీనా. పల. వీ. చ.

## కుకవి

పలుకులపొందు లేక రస భంగము సేయుచుఁ బ్రాతవడ్డ మా
టలఁదమ నేర్పు చూపి యొకటన్ హృదయంబలరింపలేక యే
పొలమును గాని యట్టి క్రమముం దమ మెచ్చుగ లోకమెల్ల న
వ్వులఁ బొరయం జరించు కుకవుల్ ధరదుర్విటు లట్లచూడగన్

తిక్కన. నిర్వచనోత్తర రామాయణము. I-9

వెస వసుధా స్థలంబునఁ గవీంద్రులు గొందఱు శేముషీ మషీ
రసము మనఃకటాహకుహరంబులనించి కలంచి జిహ్వాకా
కిసలయ తూలికంగొని లిఖింతురు కబ్బము లెన్నఁగా మహా
వ్యసనముతో నిజానన వియత్తల తాళ ఫలాశ రేఖలన్

శ్రీనా. భీమఖండము. I-12

ఒదుగుచు లక్షణమెఱుఁగక
కొదుకుచుఁ బ్రాసంబు వడియుఁగూడక మీఁదుల
వెదకుచుఁ బదసంధులు చెడ
నదకుచు వెడకవిత చెప్పనతఁడుంగవియే

భైరవకవి. కవిగజాంకుశము

కుకవి ప్రణీత కృతి కృత్రిమరత్నము

లక్ష్మణకవి. రామ. I-7

కూడదనఁగనుఁ గవితలగూర్చి బలిమిఁ
గుమతులకు నిచ్చు వాఁడొక్క కూళసుమ్ము

తిమ్మకవి. కుక్కుటేశ్వర శతకము. 43

కుకవి గణము లేకున్న సుకవికి ఖ్యాతిగలదే?

త్యాగరాజు మొదలి. విద్వత్కర్ణామృతము

అనిశంబు గూఢవర్తనమునేరిచి కోశసంచయంబులఁ బరీ
క్షించు చుండి
సుగుణాశ్రయములగుచును సువర్ణమయంబులగుచును దన
రారు నట్టివృత్త
రత్నహారములఁ బ్రయత్నపూర్వకముగ ఖండించి యితరులు
గాంచకుండఁ
గను విరూపంబుగ ఘటియించుచు నభేద్యముగ నర్థమును
గూర్చి మోసమనక

వ్రీడ యించుకయును లేక విఱ్ఱవీఁగు
గాకవులు తలపోయఁ దస్కరులు గాన
నిట్టి దుష్టచరిత్రులనెన్నఁడేనిఁ
జేరనంగీకరింతురే సారమతులు

తనికెళ్ల ప్రకాశశాస్త్రి. నిశ్శంకవంశము. I-6

## కుపుత్రుడు

తనయుండు తల్లిదండ్రులు
పనిచిన పనిసేయఁడేని పలుకెదలోఁ జే
కొనఁడేని వాఁడు తనయుం
డనఁబడునే పితృధనమున కర్హుండగునే

నన్నయ. భారత. అది. III-199

పుత్త్రుఁడు పుట్టమి మేలు కు
పుత్త్రుఁడుఁ జన్మించు కంటెఁ బురుషునకును దు
ష్పుత్త్రుఁడు దహించు నిజ చా
రిత్రాగ్నిని దండ్రి మనము రేయును బగలున్

మారన. మార్కం.పు. V-263

స్వర్గముననున్న పితృ మాతృవంశ పాత్ర
గణము నెల్లను బహు నరకములఁద్రోచు
నఖిల బంధులకపకార మాచరించు
దుస్సుతుఁడు వానిజన్మంబు దుస్సహంబు

మారన. మార్కం పు. V-264

కొడుకు తండ్రిమాటఁగొనక యూర
నడచునేని వాఁడు కడిఁదిదాయ

ఎఱ్ఱన. నృ. పు. IV-26

కుపుత్రత్వంబు కంటె నపుత్రత్వంబు మేలు

శ్రీనా. కాశీ. IV-110

తల్లిదండ్రిమీఁద దయలేని పుత్రుండు
పుట్టనేమి? వాఁడు గిట్టనేమి?
పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా

వేమన

గుణవిహీనుఁడైన కొడుకుచే నాపద
దనకకున్న తల్లి దండ్రులకును

అనంత భోజరాజీయము. V-372

......కుపుత్త్రుని
గని పరితాపంబుఁబొందు కంటెను ధరలో
ననపత్యుండగు టొప్పును

పోతన. భాగ. IV-404

చెల్లుబడి గలిగి యెవ్వఁడు
తల్లికిఁదండ్రికిని దేహధనముల వృత్తుల్
చెల్లింపఁడట్టి కష్టుఁడు
ప్రల్లదుఁడామీఁద నాత్మ పలలాశి యగున్

పోతన. భాగ. X-1390

తనయుండు జనియించి తల్లి దండ్రులను
ననుపమంబగు భక్తి నరయకుండినను
దనయుండె? యాతఁడు తల్లి యౌవనముఁ
గొనఁగొని తెగఁజూచు గొడ్డలి గాక

సింగన. ద్వివ. భాగ.

శ్రీలాలిత్యము నిత్యశుద్ధియు గుణోత్సేకంబునున్నల్గి యు
ద్వేలస్ఫూర్తిఁదలిర్చు తండ్రియను నబ్ధిన్ జంద్రుఁడై తోఁచినన్

బోలుంగాక భవాదృశుం డితరుఁడై పుణ్యాంబులన్ ఖాసివన్
సాలగ్రామ ఖనిన్ జనించునెగదా జాత్యల్పపాషాణముల్
తెనాలిరామకృష్ణుఁడు. పాండురంగ.

తండ్రికి మాఱొడ్డు తనయుండు సకలదుః
ఖములకు హేతువు గాఁడె తలఁప
చింతలపూడి యెల్లనార్యుఁడు. రామా. III-48

కడఁగి మూర్ఖుండయిన పుత్త్రుఁగనుట కంటె
మరణమే మేలు సూడంగ మానవునకు
దా. శ్రీ. దేవీభాగ. III-205

కులకాంత

పాపంబు లేని కులసతిఁ
గోపంబునఁ గుదిల పఱుచు కుత్సితునకుఁ ద
త్పాపంబులు బహుతరపరి
తాపంబిహపరములందుఁదరికొల్పు
ఎఱ్ఱన. హ. వం. IX-84

పతియేమి నేరని పని చేసిన స
మ్మతినుండుట ధర్మము కులసతికిన్
దినవహి అహోబలకవి. గరుడాచలము. 36

కులకాంతల్ పతిసేయు నేరముల
కెగ్గుల్పట్టి పల్లార్తురే ?
చెంగల్వ కాళకవి. రాజగోపాలవిలాసము. III-16

వెలకాంత లెందఱైననుఁ
గులకాంతకు సాటి రారు
గువ్వలచెన్న శతకము

## కులధర్మము

ఎల్లధర్మంబులకంటెఁగులంబు
నిలుపుటయ మిక్కిలి ధర్మంబు

నన్నయ. భారత. ఆది. IV-252

ఒప్పకున్నను నాత్మ కులోక్త కర్మ
మూర్ధ్వగతిఁ జేర్చుఁ బరధర్మ మొప్పెనేని
నార్యజనములు కిల్బిషమండ్రు దానిఁ
గాన నడుపుము నిజవంశ కర్మము-

తిక్కన. భారత. శాంతి. I-279

తనకులధర్మము విడువక
మనుట పరమ ధర్మమండ్రు మాన్యులు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-37

ఒప్పెడునది యైనను గడు
నొప్పని యది యైన నిజకులోచిత పథముం
దప్పఁదగ దండ్రు ధార్మికుఁ
లప్పని నిజభాగ్యవిహితమని యుండఁదగున్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-64

తన కులోచిత మైన ధర్మ మార్గమున
మనినవాఁ డిహాపరమాన్యుఁ డై యుండు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. అయో. 157

తనకుల ధర్మంబు తప్పక నడిచి
ఘనమైన సైరణ గలుగంగ వలయు

సోమన. ద్విప. అరణ్య. 81

గర్హితమె యైనను స్వజాతి కర్మమెప్పుడు
వదలఁగూడదుగాదె యెవ్వారలకును ?

కందుకూరి. అభి. శా.

కులవిహిత ధర్మము న్మాను కొనఁగరాదు

అ. నారాయణదాసు. యథార్థరామాయణము. 194

కులపాంసనుఁడు

ప్రహ్లదుఁడైన యొక్క కుల పాంసను చేసిన దానఁ దత్కులం
బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము

నన్నయ. భారత. ఆది. II–129

కులమునకు నఖిలలోకం
బులకు నపాయంబుసేయు పురుషాధము ని
మ్ముల దూషించి జగంబును
గులమును రక్షించు టుఱదె

నన్నయ. భారత. ఆది. V–III

సత్కులముఁ బాలింపఁగవర్జింపరాదె దుష్టాత్మకునీచునినొక్క
రుని

తిక్కన. భారత. ఉద్యో. III-378

కులనాశము సేసినఁ ద
త్కుల ధర్మములడఁగు నష్టకుల ధర్మలకుం
గలుగును దుస్సంకరము

తిక్కన. భారత. భీష్మ. I–187

కులపాంసనుండైన యొకనిం ద్యజించి
కులంబు రక్షించుట నీతియ కదా

శ్రీనా. కాశీ. IV–110

కులములోన నొక్క గుణహీనుఁడుండినఁ
గులము చెడును వాని గుణము వలన
నెలమిఁ జెఱకునందు నెన్ను పుట్టినరీతి

వేమన

మంచి కులమున బాపి జనించె నేని
వాఁడె చెడుఁగాని చెడు టెట్లు వంశమెల్ల ?
చెట్టునను నొక్క చెడుకాయపుట్టెనేని
నదియె చెడుఁగాని చెట్టు పాడగుట యెట్లు ?

కాళ్ళకూరి నారాయణరావు. చిత్తాభ్యుదయము

## కులము

కులము చేఁతబట్టి గుంభించ నేటికి
పాదులున్నచోటఁ బ్రబలు విత్తు
లేటి కులము లింక నెక్కడి ద్విజులయా

వేమన

జాతి నీతి వేఱు జన్మం బదొక్కటి
అరయఁ దిండ్లు వేఱె యాఁకలొకటి
పసుల వన్నె వేఱు పాలెల్ల నొక్కటే

వేమన

జాతిభేద మెంచి జన్మంబు తెలియక
ముక్తిఁ గానలేరు మూర్ఖజనులు
జాతు లెంచనేల జన్మంబు తెలియరో

వేమన

కులము హెచ్చు తగ్గు గొడవలు పనిలేదు
మానుజాతమయ్యె సకల కులము

జాతులందు మిగులనే జాతియెక్కువో
ఎఱుక లేక తిరుగ నేమిఫలము
ఎఱుకగలుగువాడె హెచ్చైన కులజుండు

వేమన

......తనదు వర్ణము
బాధితమగు నేని వెలుక బాఱు ఘనుండున్

తెనాలి రామకృష్ణుఁడు. పాండు. IV-35

కులమేల దాఁగును గోప్పి చెప్పినను

తిమ్మయ. ద్విప. భార. ఆది. V-290

తపము దమము నన్న దానంబు బ్రహ్మవి
త్త్వము తితీక్ష మఖము శమము నెచట
నమరనుండు నదిమహాకుల మగునది
లేకయున్న కులము కాకులంబు

భవానీశకవి. ధర్మ. II-25

వెలివిద్య లెన్నియైనను
గులవిద్యకు సాటిరావు కుంభిని లోనన్

పట్టాభిరామకవి. గువ్వలచెన్నశతకము.

ఎవ్వరైనను గుర్తింపఁగ రాని యన్వయము వింతంగాంచు

జనమంచి శేషాద్రిశర్మ. కౌమారికా ఖండము

కొనఁడిచ్చెదున్గాని కొలమున్న వాఁడు

అ. నారాయణదాసు. వేల్పుమాట. 59

నీకొలంబు పరువు నిలఁబెట్టుకొనుము
నీవారి పరువెల్ల నీటఁ గల్పకుము

అ. నారాయణదాసు. వేల్పుమాట. 14

మంచి చెడ్డలు మనుజులందున
ఎంచి చూడగ రెండు కులములు
మంచి యన్నది మాలయైతే
మాలనే నగుదున్

గురుజాడ. ముత్యాలసరాలు

నాకులమెద్దియో యెఱుగ నామతిమెయ్యదియో యెఱుంగగా
లేక దశాబ్దముల్ గడచె లేళ్ళది యేళ్ళది రాళ్ళదే కులం
బా కులమే మదీయము నరాళికి లేని విరాళి గుండెకున్
దాకఁగ వానిలో గలను దాశరథీ కరుణా పయోనిధీ

దాశరథీ శతకము.

## కులము, గుణము

కులము కన్న మిగుల గుణమె ప్రధానంబు

వేమన

కులములో నొకండు గుణవంతుఁడుండె నా
కులము వెలయు వాని గుణముచేత
వెలయు వనములోన మలయజంబున్నట్లు

వేమన

కులమెంచఁగా నేల గుణమె కారణము

దూదేకుల సిద్దయ్య. కాలజ్ఞాన తత్త్వము

## కృతఘ్నత

విశ్వసించిన వారికిం దనకుఁ గుడువంబెట్టిన వారికి
నెగ్గుసేయుట కడుం బాపంబు

నన్నయ. భారత. అరణ్య. III-385

ఒకరునిచేతి ప్రోపును దమన్నతి ప్రాపునుగాంచి యెల్ల వెం
టకును గొఱంత లేక పొగడందగు సంపదనొంది యట్టి దా
తకుఁ దుదిఁగీడు సేసిన కృతఘ్నుని పీనుఁగునైన రోఁత పు
ట్టక కబళింపఁ గుక్కలు నోడంబడు నే కురువంశ వర్ధనా

తిక్కన. భారత. ఉద్యో. II-77

భ్రూణ హత్యాదులగు పాపములకు నవధి
గలదుగాని కృతఘ్నుని కలుషమునకు లేదునిష్కృతి

ఎఱ్ఱన. హ. వం. VIII-68

ఉపకృతుఁడై యుపకారికి నుపకారంబిచ్చఁ జేయకుండు
కృతఘ్నుం
డపగతుఁడైనం దద్గాత్ర పరీతామిషముఁ దినవుక్ర
వ్యాదములున్

మల్లికార్జునుఁడు. భా.రా. కిష్కింధ. 475

మతిదలఁప వచోభగ్నవ్రతునకును సురాపునకు నిరంత
రమును ని
ష్కృతి గలదు గాని తగ నిష్కృతిలేదు కృతఘ్నబుద్ధికిని

మల్లికార్జునుడు. భారా. కిష్కింధ. 475

తనకొక యాపద వచ్చిన
గనికరమున దానిఁబాపి కాచిన యుప్పా
ణ్యునకుం దుదిఁ గీడొనరిం
పనెచూనఁ గృతఘ్నుఁడెన్ని భంగులనైనన్

జక్కన. విక్రమార్క. III-90

ఆపద చక్కఁబెట్టి తన యక్కఱలెల్లను దీర్చి యెయ్యెడం
బ్రాపయినట్టి కార్యముల పట్టున నిర్వహణంబొనర్చఁగా

నోపితనున్మరించిన బుధోత్తము నొప్పరికించు నమ్మహా
పాపికి నెన్ని జన్మముల బాయు నొకో క్రిమికీట జన్మముల్
జక్కన. విక్రమార్క. V-152

పడుచునిచ్చునతని పద్య మిచ్చినవాని
గడుపు చల్లఁజేసి ఘనతనిడఁగ
నడవ నేరఁడతఁడు నాలి ముచ్చేగదా
వేమన

తన్ను మోచిన చోటఁ దగవట్టి పెట్టి
మిన్నక సురిగిన మెత్తురే జనులు
గౌరన. హరిశ్చంద్ర. II-474

నెలకొను చుట్టరికంబును
జెలికారము మునుపుఁ దనకుఁజేసిన మేలుం
దలపక యెగ్గులు వలికెడు
ములుచలకడ నుండిరేని మోసమువచ్చున్
పొన్నికంటి తెలగన. యయాతి చరిత్రము. III-91

ఇలఁగల పాపసంఘములకెందును నిష్కృతి గల్గుఁ గాని మేల్
దలఁపని పాపకర్ముని కృతఘ్నతకున్ మఱిలేవు నిష్కృతుల్
చెంగల్వ కాళకవి. రాజగోపాలవిలాసము. V-22

తన్ను రక్షించిన దాతపైఁగపట
మెన్ను వారికిఁ గల్గ విహపరోన్నతులు
తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ. I-20

ఒరులచేఁ దనకు మే లొందవిన మేలు
మఱచినట్టి కృతఘ్ను మాంసరక్తములు
నంటఁగ రాక్షసులైన రోయుదురు
వరద. రామా. కిష్కింధ. 413

కృతఘ్నుండని రోయక సరి చేసుక చనునే మాటాడ

ధరణిదేవుల రామయమంత్రి. దశావతారచరిత్ర. II-434

అన్నమిచ్చినవాని ఆలి నిచ్చినవాని
అపహాసించుట హాని ఓ కూనలమ్మా

కూనలమ్మ పదాలు

ఉర్వి పాపంబులన్నియు నొక్క చిప్పఁ
గుప్పగాఁబోసి వేఱొక్క చిప్పలోప
లను గృతఘ్నతఁ బెట్టి తూచినను ముంటి
మొనకృతఘ్నత ప్రక్కనే మొగ్గుగాదె

పానుగంటి. పూర్ణిమ. 2

ద్రోహమ్మది యొజ్జ పట్టున జయమ్మగునే
తగునే కృతఘ్నతల్ ?

తిరుపతి వెంకటకవులు. పాండవోద్యోగము

యౌవనమ్మంతయును జూజులాడి నట్టి
కితవునకు వారసతి యెడఁ గేరడంబు
వ్యాధి కుదిరిన వానికి వైద్యు పట్ల
వెగటు తామీయ వలసిన విత్త మడుగ

వేంకటరామకృష్ణ కవులు. విశ్వగుణాదర్శము

చేదు వస్తువులందు ముసిండి యెట్లో
భయదవిష సర్పములఁ ద్రాచు పాము దెట్లో
పాపపాళిఁ గృతఘ్నతా పాపమట్లు

కూచి నరసింహం. పవవాపి

## కృతజ్ఞత

కృతమెఱుఁగుట పుణ్యమున న్మతిదానికి సమముసేఁతమధ్యము మఱిత
త్కృతమునకగ్గలముగ సత్కృతిసేయుట యుత్తమంబు కృత బుద్ధులకున్

నన్నయ. భారత. ఆది. VI-242

ఎందుఁగుడిచిన చోటికి నెగ్గు సేయ
రెట్టి దుర్జనులైనను నెఱుక విడిచి

నన్నయ. భారత. అరణ్య III-330

నిలిపిన వానికి నిక్కంబు గాఁగ
వెలయ నాపదయైన విడిపింపవలయు

తిమ్మయ. ద్విప. భారత. విరాట. III-88

గారవంబున మేలుగావించి నట్టి
వారిని మన్నింపు

సోమన. ద్విప. భారత. ఆశ్రమ. I-8

ఒరులొనరించిన మేలును
గరువంబున మఱువరాదు కలలోనైనన్

కం. వీ. పం. శుద్ధా. భార. III-50

## కృతికర్త — కృతిభర్త

మణివలనఁ గంకణమును గంకణము వలన
మణియును బ్రకాశమగు నట్లు మదిఁదలంప
సుకవి వలన నాయకుఁడు నాయకుని వలన
సుకవియుఁ బ్రసిద్ధి గాంతురు సకల దిశల

అప్పకవి. అప్పకవీయము. I-41

## కృతిపతిత్వము

గురువుర క్లిష్టదైవ మునకుం బలికిం గృతిచెప్పి పుణ్యమున్
వరమును దేజముం బడయవచ్చు జగంబుల నిశ్చయంబు

నన్నెచోడుఁడు. కు. సం. I-51

క్షితిమీద సప్తసంతతు
లతిరయమున నిలుపుసరుల కబ్బిన ఫలముల్
గృతినాయకునకుఁ గలుగును
మతిఁదలపఁగ జగతిఁగృతియె మాన్యంబు

హరిభట్టు. మత్స్య. V-152

బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసీమలఁ గందమూల కౌ
ద్దాలికులైన నేమి నిజదార సుతోదరపోషణార్థమై

పోతన. భాగ.

కృతికన్య యలంకృత గుణ
వతి సాభిప్రాయ దోషవర్జితయైనం
బతిమెచ్చునతఁడు ధనపతి
హితుఁ డష్టైశ్వర్యశాలి యేనియు నరయన్!

తనికెళ్ల ప్రకాశశాస్త్రి. ప్రాకృత రాజకుమారాభ్యుదయము. I-9

సప్తసంతానములలోఁ బ్రశస్తమైన
కృతిలభించుట యేచాలఁ గీర్తికరము

తనికెళ్ల ప్రకాశశాస్త్రి. నిశ్శంకవంశము. I-11

## కృపణత

అడుగని లేమిఁ బొట్టు పొఱలయ్యును ధీరుఁడొకానొకప్పుడున్
విడిచి చరింపఁడుగ్ర పదవిం గృపణుం డసమాన సంపదం
బొడవయి యుండియుం దడయుఁ బోఁడది యెవ్వరి కేదిమార్గమా
నడవడి వారొకింత విడనాడరుగా గడతేరు నంతకున్

బైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము. II–166

కృపణునకు వ్యయము తుదకు నెక్కువగునింత
మెప్పు లేదు పై పెచ్చుగ దెప్పులగును

పానుగంటి. కల్యా. రాఘ. 3

## కృషి

తనయందు తన్ను లెస్సగఁ
గనుటం గడచిన సుఖంబు గలుగదు లోకం
బున నెందు దానికయ్యెడు
వినుతాపానమునకు విసువమి వలయున్

తిక్కన. భారత. I–212

పాటుపడినట్టి వారికిఁ జేటు లేదు

అ. నారాయణదాసు. సూరుగంటి. 55

తగు రాజు గలిగినఁ గరిసనంపు
జీవనముఁబోల దొండొక జీవనంబు

మంచన. కేయూరబాహుచరిత్ర. III-309

నృపుల పదహాల రేఖల కెల్లమాభు
జాగ్రహాల రేఖలే మూలమనుచుఁ గోటి
కొండలుగ ధాన్యరాసులు పండపీట
సుజనభజనైక విఖ్యాతి శూద్రజాతి

శ్రీకృష్ణ-ఆముక్తమాల్యద. II-36

కృషీవలుఁడు

పల్లెయెల్లయె సర్వ ప్రపంచసీమ
ప్రియయొకర్తయె రమణీయ విగ్రహంబు
బంగరుం బంట పొలములే భాగ్యనిధులు
అనుదిన పరిశ్రమమె మహమగును నీకు

దువ్వూరి. కృషీవలుఁడు

ఊడిఁ తిన్నను లేక పస్తున్నఁగాని
యాసచేయవు పరుల కష్టార్జితంబు
నాఁకలెత్తఁగ నీపంచకరుగు నతిథి
తినక త్రావక పోయిన దినములేదు

దువ్వూరి. కృషీవలుఁడు

ప్రొద్దు వొడిచిన దాదిగాఁబ్రొద్దు గ్రుంకు
వఱకుఁ గష్టింతువే గాని యిరుగుపొరుగు
వారి సంపదకై యీసుఁగూరఁబోవ
దెంత నిర్మల మోయి నీ హృదయకళిక

దువ్వూరి. కృషీవలుఁడు

దైనికావశ్యకమ్ముల దాఁటిపోవ
వెగుర టెక్కలు రాని నీయిచ్ఛ లెపుడుఁ
బైరుపచ్చలె యవధిగాఁ బ్రాఁకుచుండు
నీ విచారము నూహయు నిపుణతయును

దువ్వూరి. కృషీవలుఁడు

సైరికా నీవు భారతక్ష్మాతలాత్మ
గౌరవ పవిత్రమూర్తివి శూరమణివి

ధారుణీపతి పాలన దండ మెప్పుడు
నీహాలంబు కన్నను బ్రార్థనీయమగునె?

దువ్వూరి. కృషీవలుడు

## కొండెము కొండెగాడు

జగడమాడు చుండుఁ జాడీలకోరెప్పు
సాధుజనులమీారి బాధపెట్టు
యముడుతప్ప వెరతురందరు వానికి

వేమన

వేడుచున్న యట్టివినయంబు జూపుచు
గోతదింపుసుమ్ము కొండెగాడు

వేమన

జట్టుదారులొాగుని చాడీలు విని విడఁ
బడిన వారికెల్ల నికుమవచ్చు

ఆ. నారాయణదాసు. నూరుగంటి

ఓర్వలేమితోడ నొరులపైఁ గొండెంబు
చెప్పి చెఱచువాఁడు ముప్పుఁబొందు

ఆ. నారాయణదాసు. నూరుగంటి.

చాడి మాటల నొకరిపై సాహసమున
బెట్టకుండిన జాల్ గుహాల్ గట్టినట్లె

వరదరాజ శతకము. 68

## కోవనుడు

చుంబనము సేయఁగరువంగఁ జొచ్చుఁద్రాచు
చెవులు నిక్కించుఁ దన్నెంచిన హాయంబు

సాపడఁగనున్న మొసలి బాష్పముల విడుచుఁ
గొట్టుటకు ముందు నవ్వును కోపనుండు

పానుగంటి. పూర్ణిమ.

మిక్కుటపుఁ గోపమునఁ గ్రిందు మీఁదుఁ జూడ
కనపరాధుల హింసించునట్టి వాని
వానిసిరియును సంపద వాసి చెడును

శ్రీపాద. శ్రీకృష్ణభారతము. అరణ్య. VII-30

కోపము

క్రోధమ తపముం జెఱచును
క్రోధమ యణిమాద్యులైన గుణములఁ బాపుం
క్రోధమ ధర్మక్రియలకు
బాధయగుం గ్రోధిగాఁ దపస్వికిఁ జన్నే

నన్నయ. భారతము. ఆది. II-174

నుతి మఱచి యవిస్తీర్ణ
ప్రతిజ్ఞుఁడగు వానికోప పటు దహన మని
ర్గతమయి పడి నరణి సము
త్థిత దహనముపోలె నాత్మదేహము నేర్చున్

నన్నయ. భారతము. ఆది. VII-143

అలయక నిమిత్తజంబగు
నలుకను క్షమియించి శాంతుఁడగు పురుషుం డి
మ్ముల రక్షింపఁగ నోపును
పొలుపుగ ధర్మార్థ కామములు సమములుగాన్

నన్నయ. భారతము. ఆది. VII-144

క్రోధ వర్జితుండు గుఱుకొని తేజంబు దాల్చు

నన్నయ. భారతము. అరణ్య. I-222

తనమదిఁ బుట్టిన కోపము
తనుఁజెఱుపును గాని యెదిరి దాఁజెఱుపునె పు
ట్టిన యిల్లుండఁగననలము
మునుఁ జెఱుచునె యితర సదనముల

కోపంబు పాపహేతువు
కోపము దుర్గతికి నూఁతి కోపమె పగవాఁ
డేపారఁగ భక్తునకుం
గోపముఁ దాఁబుట్టునయ్యా? కోపవిదూరా

లేకుండును కోపం బధ
వాకలిగినఁ బూరిచిచ్చు వడువున పాఱుం
గాకెగయును సద్భక్తుని
యాకోపము శమము పెరుగ

కోపంబు పెరిగి శాంతత
రూపణచుంగర్మి కొక్కరూపగునది ధ
ర్మాపాదికి నతి శాంతత
కోపముఁ బరిమార్చు భక్తి గుణికి మహాత్మా

నిండిన మనమునఁ గోపం
బుండిన నెడఁగలదె భక్తి కుండఁగ గరిసెన్
నిండితిపుడుండు నెడఁబుల
ఖండమునకుఁగలదె చోట ఖండిత చరితా

పా. సోమన. అనుభవసారము 125, 26, 27, 28, 31

క్రోధంబున వైర మెంతయును బెరుఁగు

ఎఱ్ఱన భారతము. అరణ్య. IV-288

అలుక మనంబునం గదిరి నాతఁడు దాను నెఱుంగఁ డొడ్డచేఁ
దెలియఁడు కార్యతంత్రములు

తిక్కన. భారతము. సౌప్తిక. I-76

తన కోపమె తన శత్రువు

బద్దెన. సుమతి. 50

కోపులు గురువధ కోడరు కోపులు పరనింద సేయఁగొంకరు కోపం
బాపదలకెల్ల మూలము కోపము పాపంబు పొత్తు

మల్లికార్జునుఁడు. భా. రా. సుందర. 498

కోపమే తాపము సుండీ

తా. అన్నమయ్య. అధ్యా. సం.

కోపమునను ఘనత కొంచెమైపోవును
కోపముననను మిగుల కోడు జెందు
కోపమడచెనేని కోరిక లీడేను

వేమన

కోపముననను బ్రతుకు కొంచెమై పోవును
కోపముననను గుణము కొఱతపడును
కోపముననను నరక కూపము జెందును

వేమన

...చలమునఁ బ్రబలుఁ గోపంబు
ప్రాపించుఁ గోపంబు పాపంపుఁ బొత్తుఁ
బాపంబు నరక కూపమునకుఁ దెరువు

గౌరన. హరిశ్చంద్ర II-308

పేద కోపమెందుఁ బెదవుల చేటు

సూరన. కళా. VI-30

కోపము గల్గిన చోటన
పాపము వర్తిల్లుఁ బాప పరులకుఁ గోప
వ్యాపారంబులె తోఁచును
గోపము పాపంబు నొక్క కుదురై నడచున్

వెన్నెలకంటి సూరన. వి. పు. I-19

ధీమంతులకుఁ గృపాదృష్టియుక్తులకుఁ
గోమల యశులకు గుణవిశాలురకుఁ
జారు నిర్మల ధర్మ చరితులైనట్టి
భూరి తేజులకు నెప్పుడుఁ గోపమేల?

పాలసర. ద్విప. భార. సభా. II-548

అలుక మనంబున నధికమౌ నతఁడు
ఎలమి తోడుత నేమి యెఱుఁగఁడు ధాత్రి

సోమన. ద్విప. భార. సౌప్తిక. I-8

క్రోధి యొరుం దను నెఱుఁగఁడు
క్రోధము బలవద్విరోధి క్రోధి యకార్యా
రాధనపరుఁడగుఁ గావునఁ
గ్రోధము విడువఁదగు శుభముగోరు జనంబుల్

భవానీశ కవి. ధర్మ IV-19

ఫలయుక్తమగునె దురాగ్రహంబు

లక్ష్మణకవి. రామేశ్వర. III-46

కోప ప్రసాద భావము
భూపతులకు నైజగుణము బుధజను నెడలం

గోపము పుట్టిన నెంతటి
భూపాలుండైనఁ జెడు నభోమణి తనయా

శివరామ కవి సానందోపాఖ్యానము

కనలి కోపించినఁ గార్యంబుగాదు

పినయెల్లయ. కాటమరాజు కథ

చిటుకు మన్నను గిన్కచెందు నచ్చోట
నెటు సమకూరు నే యింతి కోరికలు

చెయ్యూరు చెంగల్వరాయకవి. సుందరేశ్వరవిలాసము.

త్వరపడి చీటికి మాటికిఁ
బొరయందగ దలుక దానఁ బొదవును జేటుల్

కం. వీ. శు. భార. సంగ్ర. III–5

పాపం బెఱుఁగని నరుపైఁ
గోపము పడరాదు

దా. శ్రీ. దేవీభాగ. VII-320

కోపము విచిత్ర రూపము కోపమునకుఁ
గనులుఁ గర్ణములును దయాకలన లేవు
సర్వమును గబళింపంగఁ జాలు నోరొ
కఁడె యజగరమునకు వలెఁగలదు గాదె

పానుగంటి. రాధాకృష్ణ

అధిక రాగ మసూయచేనకట వికట
మైనఁ బ్రకట కోపముగాగ నగును గాదె
కొలదియాకోప మనునయములను బోవు
పెద్దకోపము వానిచే వృద్ధినందు

పానుగంటి. రాధాకృష్ణ

కోపియైన జనవంచితుఁడై నరుఁడందు కష్టముల్

శ్రీపాద. శ్రీకృష్ణభారతము. అరణ్య. II–50

అగ్ని లేక కోపంబు దేహమును గాల్చు
గోప మెడలిన మేలైన గుణము నిలుచు

వరదరాజశతకము. 60

కోపంబునకుఁగన్న లేపట్లలేవు

నీతి పదములు. I–103

## కోరిక

విచారము గోర్కికిఁగాని వావియే

తిక్కన. భారతము. విరాట. II–260

అడియాస కోరికలు అదుకునందాఁకా
జడిగొన్న కుక్కిళ్ళు చవిగొన్నయందాక
ఒడలోనుటలు మోహముదుగు నందాకా
చేకొన్న కోరికలు చేరు నందాఁకా
దొరతోనములన్నియును దొరసినందాఁకా

తా. అన్నమయ్య. అధ్యా. సం

కచ్చుమీఁద యాస కనకంబుపై యాస
లేనివాడు పుడమి లేనివాడు
కలిగెనేని యతడు గానఁగరాడయా

వేమన

......అవని పతుల
కధికధనవంతులకు గాంక్షలగ్గలములు

రామపరంగపరాజు. సాంబోపాఖ్యానము

క్రొవ్వాడి కోర్కెను కొనసాగనీకు
కోరికకంటె నీకున్నగ లేదు

అ. నారాయణదాసు. వేల్పుమాట.

కోర్కులుడుపఁగఁ జాలనికుమతి కర్మ
మాచరింపకయున్న సన్న్యాసియగునె?

తనికెళ్ల ప్రకాశశాస్త్రి. వేదాంత సిద్ధాంత ప్రకాశము. 45

## కౌతుకము

కౌతుకము కాలయాపనాక్షమము గాదు

శ్రీనా. కాశీ. V 318

కుతుకము లేనట్టివారి కూటము లేలా?

కాం. క. జీవయాత్ర. II- 200

## క్రూరకర్ముఁడు

చుట్టములలోన నొప్పమి వుట్టినప్పు
డడ్డవడి వారితోడఁ గొట్లాడియైన
దాన యుడుపంగఁజోరకున్న వానిఁ గ్రూర
కర్ముఁడని చెప్పుదురు కర్మకాండవిదులు

తిక్కన. భారత. ఉద్యో. IV–242

క్రూరులగు జనులు ప్రత్యప
కారంబుల నెందు సేయకయ సుజనులపై
నారోపింతురు తప్పులు

మంచన. కేయూరబాహుచరిత్ర. III–79

క్రూరకర్మ బ్రతుకు చోరుల పాలౌను

వేమన

సార ఘనసార ముఖ సం
స్కారంబుల లశునమశుభ గంధము బోలెం
గ్రూరుఁడు ప్రతి వాసర రచి
తారాధన విధుల విడువఁడాత్మ ప్రకృతిన్

బైచరాజు వెంకటనాథకవి. పంచతంత్రము. I 397

క్రూరకర్మము సేయు కుచ్ఛితుఁడెల్ల
వారలచే నపవాదంబు నొందు

వరద. రామా. అరణ్య. 96

క్రూరకర్ములకుం దయ దూరము కద

అ. నారాయణదాసు. సావిత్రీ చరిత్ర

## క్షత్రియ ధర్మము

శత్రులనాజి నోర్చుటయు సర్వభయంబులఁ బొందకుండఁగా
ధాత్రిఁబరిగ్రహించి యుచితస్థితిఁ గాచుటయుం బ్రియంబుతో
బాత్రుల కర్థమీఁగియును బ్రాహ్మణ పూజయుఁజువ్వె యుత్తమ
క్షత్రియ ధర్మముల్ సుగతి కారణముల్ విపులార్థ మూలముల్

నన్నయ. భారత అరణ్య. I-247

క్షాత్త్రము దలకొని సంగర
ధాత్రికి నేతెంచి గురులు దండ్రులు దమ్ముల్
పౌత్త్రులు శిష్యులు మనుమలు
పుత్త్రులనంగలదె తొడరి పోరన వలయున్

తిక్కన. భారత. భీష్మ. III-216

రాచూలికి నుచితంబగు
నాచారము గాదె రణమునందరులఁ దెగం

జూచుచుఁ దిరుగని నడపున
నేచి యమర లోకమునకు నేగుట తరుణి
తిక్కన. భారత. ద్రోణ. II-322

క్షత్రియ కాంత పుత్త్రకునిఁ గాంచుట వాఁడతి లోక వీరుఁడై
ధాత్రిఁ బ్రసిద్ధి కెక్కుటకు
తిక్కన. భారత. ద్రోణ. II-325

క్షత్త్రియునకు శస్త్రధారణం బార్త
త్రాణ రక్షణార్థంబు గాదె
మారన. మార్కం. పు. VIII-165

క్షితిపుల కరిజయము ధనో
న్నతియుఁ బ్రజానీతిరక్షణము ధర్మంబుల్
రాయలు. అము. III-35

సత్క్షత్రియులకు భైక్షంబు కీడు
రాయలు. అము III-62

.... . క్షత్రాచార సం పన్నులయును
దగవౌని తమపోటుఁ దమరె వాకొనఁగ
వరద. రామా. అరణ్య. 98

దుష్టశిక్షణము సంతుష్టిగాఁ జేసి
శిష్ట రక్షణమును జేయంగ లేని
క్షత్రియులకు నేల సత్కీర్తి కలుగు
సోమన. ద్విప. భార. కల్య. III-64

వేటలు గీటలున్ జముని వీటికి బాటలు రాచపాడికిన్
జేటులు గాక మార్తు రెదఁజిందఅవందఅవో రొదన్ దెసల్
బీఁటలు వాఱఁగా నసికిఁ బెండ్లికిఁబోయిన యట్లపోవలెన్
వత్సవాయి వేంకటనీలాద్రిరాజు. చాటువు

విహిత కర్మంబు క్షత్రియ వీరులకు స
మిత్తు చేయుట వారు నిమిత్త మాత్రు
లగుటయే గానిస్వయముగా నంతయుభగ
వంతుఁడే చేయుచుండు ధ్రువంబుగాఁగ

పెట్టి లక్ష్మీనరసింహము. ప్రభాసుశాపవిమోచనము. VI-120

## క్షత్రియులు

ఉత్తమ క్షత్రకులజులు చిత్తగించి
యాదరింతురు కరుణతో నార్తరవము

పిల్ల. పిన శృం.శా. III-97

బ్రాహ్మణోత్తము గృహములపజ్జఁ జేరు
భూమి వరునకు క్షాత్రవిస్ఫూర్తితగ్గు
నందుపై బ్రాహ్మణుని వేషమవధరించు
క్షత్రవరునకు వేఱేది శాంతికంబు

పానుగంటి. పూర్ణిమ.

## క్షమ

క్షమలేని తపసి తపమును
బ్రమత్తు సంపదయు ధర్మబాహ్య ప్రభు రా
జ్యము భిన్న కుంభమున తో
యము లట్టుల యధ్రువంబులగు నివియెల్లన్

నన్నయ. భారతము. ఆది. II-175

నిత్యక్షమాన్వితుండయిన వానికి
భృత్యులు వెఱవక యవమానంబు సేయుదురు

నన్నయ. భారతము. అరణ్య. I-218

క్షమగల వానికిఁ బృథ్వీ
సమునకు నిత్యంబు విజయ సంసిద్ధియగున్
క్షమియైన వాని భుజవి
క్రమము కడున్ వెలయు సర్వకార్యక్షమమై

నన్నయ. భారత. అరణ్య. I-223

వేదంబులు యజ్ఞంబులు శౌచంబును
సత్యంబును విద్యయు ధర్మము
సచరాచరంబయిన జగమంతయు
క్షమ యంద నిలిచినవి

నన్నయ. భారత. అరణ్య. I-224

తేజః ప్రభవంబులైన యమర్ష
దాక్షిణ్య శౌర్య శీఘ్రత్వంబులను
నాలుగు గుణంబులు క్షమావంతునంద
వీర్యవంతంబులగు

నన్నయ. భారత. అరణ్య. I-224

తపస్స్వాధ్యాయ యజ్ఞకర్తలయు
బ్రహ్మవిదులయుం బడయుపుణ్యగతులు
క్షమావంతులు వడయుదురు

నన్నయ. భారత. అరణ్య. I-224

అనూనక్షమయ కడు మెఱయు తొడవు
ఉత్తమరూపముగోరువారు దాల్తురు దానిన్

తిక్కన. భారత. ఉద్యో. II-40

క్షమ మేలగునైన నతిక్షమదైన్యముఁ దెచ్చు

తిక్కన. భారత. శాంతి. III-18

క్షమయును దమమును సత్యము
నమేయమహిమాస్పదంబులనవిందుము ధ
ర్మములందెల్లను నభివ
ర్ణ్యములవి హృద్గ్రంథి భేదన ప్రౌఢంబుల్

తిక్కన. భారత. శాంతి. V–544

క్షమయె సత్యంబును క్షమయె శీలంబు
క్షమయె తపంబును క్షమయె కీర్తియును
క్షమయె ధర్మంబును క్షమయె లోకంబు
నమరంగ రక్షించు

గోనబుద్దారెడ్డి. రంగ. రామా. బాల. 38

క్షమయ జనుల కాభరణము క్షమయ కీర్తి
క్షమయ ధర్మంబు క్షమయ సజ్జన గుణంబు
క్షమయ యజ్ఞంబు క్షమయ మోక్షంబు క్షమయ
సకల దానంబు క్షమయందె జగము నిలుచు

మల్లికార్జునుడు. భాస్కర రామా. బాల. 327

.........కోపానలమున్
విపులక్షమాజలంబుల
నుపశమ మొందింతు రార్యులుత్తమ బుద్ధిన్

మల్లికా. భా. రా. సుందర. 499

నిండిన కోపములకు నెపములు గలిగితే
దండికోఁగలఁగని యాతఁడే ధీరుఁడు

అన్నమయ్య. అధ్యా. సం.

సూదుల వంటి మాటలు సొరిదిఁ జెవిసోఁకితే
వాదులు వెట్టుకొననివాఁడే దేవుఁడు

అన్నమయ్య. అధ్యా. సం.

క్షమ గలిగిన సిరిగలుగును
క్షమ గలిగిన వాణి గలుగు

పోతన. భాగ. IX-465

కొట్టి దిట్టనైన గట్టి మాటాడిన
నూరకున్న యట్టి యోర్మికాడు
వాఁడె పరమ శివుఁడు

వేమన.

క్షమగలట్టి యతఁడు సాధువై శోభించు

వేమన.

ఓర్పులేనట్టి వారలకోరుల యశము
విన్నకొలఁదిని బెంపొందు వెఱ్ఱితెవులు
దాని పరిహారమునకు నై పూనకెపుడు
తమఘనంబును జాటింత్రు ధరణి

వేమన.

క్షమకవచంబు.

ఏ. అ. కవి. సుభా

క్షమ బలము శక్తి జనులకు
క్షమయె బలం బంద్రు మిగుల శక్తులకైనన్
క్షమ లోక వశీకరమగు
క్షమకు నసాధ్యంబు లేదు క్షమ గలుగవలెన్

భాస్కరాచార్యులు. వైశ్యపురాణము.

క్రోధంబు విడనాడికొని తాల్మినుండు
సాధువులకుఁ గాక సౌఖ్యంబు గలదె

వరద. రామా. సుందర. 184

క్షమయె దానంబును సత్యంబు విద్యయు
ధర్మంబు నర్థంబు దపసులకును
క్షమయె తపమును బరలోక సంగ్రహంబు
క్షమయె బంధులు మిత్రులు క్షమయెతోడవు

భవానీశకవి. ధర్మ. II-240

తల్లి దండ్రియు గురుఁడు నందనుఁడు విప్రుఁ
డాచరించిన యపరాధ మది సహింపు

శ్రీధర మల్లె వెంకటరామ కవి. బ్రహ్మోత్తరఖండము. IV-93

చాలఁగ గీడగు నపుడును
దాలిమియే పూనవలయుఁ దప్ప కదానన్
మేలిమి చెందును మానిసి

కం. వీ. కు. భార. సంగ్ర. III-47

ఓర్చి మీఁదు తెలిసి యుండెడు వానికిఁ
గలుగు చిక్కు-తుదకుఁ గలుఁగబోదు

అ. నారాయణదాసు. నూరుగంటి.

ఓర్చిన నీకు లో టొదవదెన్నటికి

అ. నారాయణదాసు. వేల్పుమాట.

యశము వచ్చిన నుప్పొంగి యపయశంబు
వచ్చినప్పుడు దైన్యంబు వడయఁదగునె
యన్ని యనుభవింపఁగవలె నలుగు గనక
యోర్పువంటిది నరునికింకొంటి లేదు

పానుగంటి. చూడామణి.

జనుఁడదృష్టముఁ బాసిన సమయమందు
నలజడిని బొంది తనదు బాధలను ద్విగుణ

ములుగ నొనరించు కొనక యోర్పును వహించ
వలెననుచు జ్ఞాన వాసిష్ఠ పంక్తి గాదె

పానుగంటి. పాదుక.

చెడుగు వేఱొక చెడుగుచే నుడుపనెంతు
వేని యింకొక దుష్కృతిఁబ్రుద్ధిఁజొన్పు
దందుచే శాంతినే యది యడఁచి వైచు
నంచు బుద్ధుఁడు ప్రజకు బోధించినాడు

పానుగంటి. రాతిస్తంభము.

ఖలుని సంపద

ఎవ్వఁడు నిసర్గ కఠినుం
డెవ్వఁడు సన్మార్గ రోధి యీర్ష్యా పరుఁడై
యెవ్వఁడు దన కధికనితోఁ
జివ్వకుఁజేసాచు వాని సిరులధ్రువముల్

శ్రీనా. కాశీ. II-99

అప్రయోజనమభివృద్ధి నతిశయిల్లు
నప్రయోజన మడఁగుఁ గాలాంతరమున
నకట యీర్ష్యాగ్రహ గ్రస్తుఁడైన యట్టి
ఖలుని సంపద విధవ చన్నులను బోలె

శ్రీనా. కాశీ. III-4

ఒక మంచి వలువతోనే అల్పునికి
ధర నైశ్వర్యము వచ్చితే
అరదరాతిరి గొడుగు బట్టు కొన్నట్లు

క్షేత్రయ.

వెరతురయ్య దుష్టు విభవమునకు

వేమన

మఱియు నన్యాయపరుల సంపదభివృద్ధి
నిలువకప్పుడయణఁగు సందియము లేదు
తగనవశ్యాయసిక్త గాత్రములఁజెందు
నివము వైశాఖ సూర్యుచే నింకునట్లు

భవానీశ కవి. ధర్మ. IV-153

ధరణిఁ బరమ నికృష్టుని దండనున్న
ధనము వృధయగు నేరికిఁబనికి రాక

తిమ్మకవి. కుక్కుటేశ్వర శతకము

దుష్కరుఁడై ధర్మమువీడు మానవుమహైశ్వర్యంబులీ

భూమికిన్

బరువై గట్టిపునాదిలేని యిలు లేవంగూలు నొక్కుమ్మడిన్

చిలకమర్తి. ప్రసన్నయాదవము

## ఖురాను

విగ్రహారాధనంబుల విడువ వలయు
దేవునైదు కాలములఁ బ్రార్థింపవలయు
జనులమిత దానములచేత దనుపవలయు
నెనర నవమమాసమునఁ బస్తుండవలయుఁ
గొలఁతిఁదూనికన్నమముగ సలుపవలయు
వడ్డిగొనుకోర్కి బొత్తిగ వదల వలయు

విక్ర. దే. వర్మ

## గతము

గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్

నన్నయ. భారతము. ఆది. V-163

గత వృత్తములకు వగవం గతమేమి

తిక్కన. భారతము. ద్రోణ. IV-227

మిగుల

జేసిన పని కింతఁ జింతింప నేల

గౌరన. హరిశ్చంద్ర. I-204

మించిపోయిన పనికింత మిడుకు వేల

వేమన

## గతి

వేదవిహిత విధుల నాదరించుట యూర్ధ్వ
గతికిఁ దెరువు విధులఁగడచి యొందు
నాఁగఁబడిన వాని లోఁగడ చేయుట
యధమగతికి మార్గమనిరి బుధులు

నన్నయ. భారతము. ఆది. III-221

కులమును శీలమున్ యశము
గోల్పడినన్ గతి గూర్పవచ్చునే

దగ్గుపల్లి దుగ్గన. నాచికేతూపాఖ్యానము. -220

గతి వేఱు కలదె పతికిన్
వ్యతిరేకముగా జరించు వనితల కెందున్

అహల్యాభాయి

## గయ్యాళి

ఆలుమగని మాట కడ్డంబు వచ్చెనా
యాలుగాదు నుదుటివ్రాలు గాని
యట్టియాలి విడిచి యడవి నుండుట మేలు

వేమన

వశముగాని యాలి వైర మేమనవచ్చు
యశము జెఱచుగాని యనువు పడదు
కొసరుకెల్లదాని కోరిక నే తీర్చు

వేమన

వాడకుఱికి తిట్టు వలదన్న మొఱబెట్టు
ముందుమగని తిట్టు ముసుకు వెట్టు
గడుసురాలు మగని గంపఁబెట్టుమ్మురా

వేమన

గట్టువా
పడతుక యెయ్యెడందలకు బాసిన వెంద్రుక గాదె యెన్నఁగన్.

తిమ్మకవి. అచ్చ. రామా. అయో. 71

మగనిమాటకు మాటికెదురు బల్కెడుబోటి
మృత్యుదేవతసాటి ఓకూనలమ్మా.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి సంపాదితము. పల్లెపదాలు. పుట. 244

## గర్వము

...అల్పమయ్యు ద
ర్పము బహుకాల సంచిత తపః ఫలహాని యొనర్పకుండు నే

నన్నయ. భారతము. ఆది. III-217

దర్పితులైనవారి పేర్మియభ్రువంబు

నన్నయ. భారత. అరణ్య. III-59

గర్వము నిలుచునె నయమార్గవృత్తి నిలిచిన భంగిన్.

తిక్కన. భారతము. ఉద్యోగ. III-303

సర్వజన సమ్మతుండగు గర్వ ముడిగి

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-452

ఓపగల్గుదునని యొక్కింత మిణికిన,
నున్న వాసికూడ సున్న చుట్టి
మూలలంకులాగి గేలిసేయుదురయా!

వేమన

ఒక కొంత ధనము గనినవాఁడు
వెలలేని గర్వముతో విఱ్ఱవీఁగీని
ఒక రాజుఁబట్టి కొలిచినవాఁడు
సలిగెతో నాకెవ్వరుసరి యనీని
ఒక మంత్రము పంపుసేయించుకొనేవాఁడు
అంతటికి గురుఁడుంటానని మురిసీని.

అన్నమయ్య. అధ్యా. సం.

ఏరికిఁ జెల్లునె, యరయఁగ నే మింత వారమనుకొన

పింగళి సూరన. కళా. I-73

గర్వాంధుఁడగువాని గర్వింపఁజాలు
నిర్వాహమునఁబల్కు నెఱిఁ దీర్పవలయు

తిమ్మయ. ద్విప. భారతము. ఆది.

కుడిచి కట్టితినేమి కొఱఁత నాకనుచుఁ
బుడమిలో మెఱయుచుఁ బొంగంగరాదు.

తిమ్మయ. ద్విప. భారతము. విరాట.

గర్వ మెంతటివారికిఁగాదు సుమ్ము

కూచిమంచి తిమ్మకవి. శివలీలావిలాసము. I-29

తోఁచదు పొగరుఁబోతునకు నిక్కువము

అ. నారాయణదాసు. వేల్పుమాట. పు. 23

పనికిరానిమూఁక-తనుఁ గొనియాడఁగ
విఱ్ఱవీగునట్టి-వెఱ్ఱి చెడును.

అ. నారాయణదాసు. నూఱుగంటి.

చేయకుండఁ జేసితినని చెప్పునాతఁ
డధముఁడు, రవంతచేసి కొండంత చేసి
నాఁడనను వాఁడుగర్వి; యెంతయొ యొనర్చి
యింతఁ జేసితి ననువాఁడు సుజనుఁ డిలను.

సర్వలోకోపకార విస్తారకార్య,
వార మొనరించి భగవంతు వైభవంబొ,
శిష్టకరుణయొ దానిని జేసె ననుచు
తన్ను మఱచెడువాఁడెపో దైవ మిలను.

పానుగంటి. కల్యా. రాఘ. V

కన్నులుండియు దీనులఁ గాంచలేఁడు
వీనులుండియు మనవుల వినఁగలేఁడు
చేతులుండియు సత్కృతుల్ చేయలేఁడు
గర్వియగురాజు శవతుల్యుఁ డుర్వియందు.

విక్రమదేవవర్మ

## గుణగ్రహణము

తక్కువజాతియందు వనితామణి యున్నను నీచమర్త్యునం
దెక్కువ విద్య చొప్పడిన నెంగిలిచోట సువర్ణమబ్బినన్
దక్కక విన్విషంబున సుధారసముండిన గ్రాహ్యమంద్రుడు.

అనంత. భోజరాజీయము. II-145

ఉద్వేజనులు పరమయోగీశ్వరునిజూచి
తెగడువారుగాని తెలియలేరు
అమృతస్వాది సురలహస్తమే మెఱుఁగును

వేమన

ఎయ్యెడమేలె చూతురు గ్రహింపరు జాణలు జాఱుపాటులన్

చేమకూర. విజయవిలాసము. I-107

ఇష్టులగు పూవుబోండ్ల గ్రహించువాఁడు
మించురుచ్యవస్తువుల గ్రహించువాఁడు
గొప్పవాఁడని యనిపించుకొనఁగఁదగునె,
యొప్పుగ్రహియించు నాతఁడే గొప్పవాఁడు

పానుగంటి. బుద్ధ. I

గొనము లెఱుంగనట్టి మొఱకుల్ నరకుంగొనకున్న లెక్కయే

తిరుపతి వెంకట కవులు. నానారాజ.

## గుణము

గుణములు గలవాని కులమెంచఁగా నేల?
గుణము కలిగెనేనిఁ గోటిసేయు
గుణము లేనివాని కులమెంత గొప్పైన నెంచవలదు

వేమన

ఏగుణము లొపదలనిదు నాగుణము లడంపవలయు

వేమన

వలను మీఱఁగ గుణవంతుల గుణము
గొలఁదిలేనట్టి దుర్గుణుఁడేమి యెఱుఁగు

సోమన. ద్విప. భారతము. కర్ణ

ఒకగుణమున్నచోట మఱియొక్కగుణం బరు దెన్ని చూడఁగా
ధరణిదేవుల రామయమంత్రి. దశావతార చరిత్రము. II–264

కులము ప్రధానమే గుణము లేకున్న
కలశాబ్ధిఁ బుట్టదే కాలకూటంబు

గౌరన. హరిశ్చంద్ర

గుణములను బట్టి పూజ్యత కూడివచ్చు
కులముసం బట్టియెందుఁ జేకూరఁబోదు
శేషాద్రి రమణకవులు. బాలనీతి శతకము. 72

## గుణము - రూపము

రూపులేని వనిత రూ : పతివ్రత

వేమన

ఎచటరూపమబ్బు నచట గౌనములు సంభవించు
తిరుపతి వేంకట కవులు. పాణిగృహీత. I-78

## గుణవంతులు

గుణములు గలవాఁడు గోత్రంబునందు
బ్రబలుతికి నెక్కు
గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ. పుట. 384

కులములోన నొకఁడు గుణవంతుఁ డుండిన
కులము వెలయువాని గుణముచేత

వేమన

తండ్రికన్న సుగుణి తనయుఁడై యొప్పినా,
పిన్న పెద్దతనము లెన్న రెవరు

వేమన

గుణయుతునకు మేలుగోరంతచేసిన, గొండగాగ జూచుకొనును
వేమన

గుణము గల్గియున్న గులసతి నెవ్వారు, నింద జేయలేరు నీతిజూచి
వేమన

ఒడలు నల్లనైన నోరుపుగలసతి, గుణము మేల్మిబట్టి కోటిసేయు
వేమన

గుణవతిగల గృహము గోము నొందించును
వేమన

సంపదఁగన్న వేళ గుణశీలురచిత్తము గ్రూరవృత్తి వ
ర్తింపక నూత్న పల్లవశిరీషసుమోత్పల కోమలస్థితిన్,
సొంపువహించు నాపదలు సోఁకినవేళ విశాలశైలని
ష్కంపతటస్థల స్ఫురదఖండ శిలాకృతి కర్కశంబగున్
పుష్పగిరి తిమ్మన. సుభాషితములు

## గుణహీనుఁడు

గుణవంతుల గుణములు నిర్గుణుఁ డెఱుఁగమిదెల్లము
తిక్కన. భారతము. కర్ణ. II-44

గుణరహితుఁడు మేలుకోరి తాబొందియు,
నెంచడెప్పుడు దాని యెచ్చుగనడు
కూళగూళ మెచ్చు గుణవంతు విడనాడి,
యిట్టివారు మిత్తు రట్టివారి

కులములోన నొకడు గుణహీనుఁ డుండిన,
గులము చెడును వానిగుణము వలన
కులము గోరువాఁడు గుణహీను డగునయా !
వేమన.

## గురుకృప

గురుకృప గలిగిన గుణనిధికి, అరయఁ బాపపుణ్యము మరిలేదు
విరసపుఁజీకటి వెడలినవారికి, పరగమరియు దీపంబేలయ్యా!

అన్నమయ్య. అధ్యా. సం

పట్టినజన్మము పావనమైతే, మట్టులేని తిరుమంత్రము దొరకు
గురుకటాక్షమొక కొంతసోఁకితే, శరణాగతి నిశ్చలమవును

అన్నమయ్య. అధ్యా. సం

గురుకటాక్షంబుఁజెందిన కుశల మతుల
కవని సాధింపరాని కార్యములు గలవె

శ్రీధరమల్లె వేంకటరామకవి. బ్రహ్మోత్తరఖండము. IV-175

## గురువు

గురుకార్య నిరతులగు, సత్పురుషుల కగుటరుదె యధిక పుణ్య
ఫలంబుల్

నన్నయ. భారత. ఆది. I-120

......గురునియాజ్ఞ రంజిల్లగఁ జే
రోజంజేసిన కృత్యము
సూ జగములు రెంటియందు శోభనమిచ్చున్.

తిక్కన. భారత. ఆశ్రమవాస. I-28

ఒక్కఁ యదున్గైన గురుల ప్రత్యుద్గతియును
వందనము నర్చనంబును వలయు నాను
కూల్యమును జేయవలయును గురునియెడ

మారన. మార్కండేయ. పు. III-320

గురువు చిల్లగింజ- గురు వే భ్రమరము- గురుఁడే భాస్కరుఁడు-
గురుఁడే భద్రుఁడు- గురుఁడే యుత్తమగతి.

త్యాగరాజు. కృతులు. విష్ణు కీర్తనలు.

ఇరవై దేవుండు తన యెదుట నెంతయుండిన
గురు వనుమతి లేక కొనసాగదు

అన్నమయ్య. అధ్యా. సం

ఆచార్య పాదపద్మమూలమే- సావధానమున సర్వశాస్త్రార్థ
ఫలము

అన్నమయ్య. అధ్యా. సం

పదిలపు టాచార్యుండు గలుగంగ- నిహాపరములక్రో వదుగ నేల?

అన్నమయ్య. అధ్యా. సం

మొదటనిల మాత దేవత పదపడి జనకుం డగుటను బరికింప
నిఁకన్

గుదిరిన పదమలగురుఁడే తుదిదైవము పెఱలు లేఱు

వేమన

హరిహరాదులకైన నయ్యాత్మవిద్య
గురుకటాక్షముఁబొందక యెఱుక పడదు

వేమన

గురునితోడ బొందుకూడియుండినవాఁడు
చేరి బ్రహ్మమంటి చెలగియుండు

వేమన

సగుణ నిర్గుణభేదార్థ సంశయంబు
పరమగురునాజ్ఞచేగాక పట్టువడదు.

వేమన

గురువులేక విద్య గుఱుతుగా దొఱకదు.

వేమన

దేహమాత్మరూపు తేటతెల్లముచేసి
యవలిచూపుఁ జూపునతఁడె గురువు

వేమన

హరిమహిమ దనకుఁజెప్పిన
గురువున్ నరుఁడనుచుఁ దలఁచి కుంఠిత భక్తిం
దిరుగు పురుషు శ్రమమెల్లను
గరిశౌచము క్రియనిరర్థకంబగు నధిపా!

పోతన, భాగ. VII-458

గురునాథుఁడును ముముక్షులకును దీక్ష,
కరుణించి గతిఁ జూపఁ గలవాఁడు గాక
వివరింపఁ గులగోత్రవిద్య లేమిటికి
శివునట్లు మాయఁబాసిన మహాత్మునకు

పిడుపర్తి బసవన, గురుదీక్షాబోధ

తల్లియును దండ్రి దైవంబు తలఁపగురుఁడ
కాఁడె యతఁడేమి చేసినఁ గనలఁదగునె...
'నాస్తి తత్త్వం గురోఃపర' మనఁగ వినవె

శృంగారషష్ఠము

అనిశమాచార్య సేవగల్గిన జనులకు దేవభూదేవ తీర్థసంసేవలేల
అనిశమాచార్య సేవగల్గని జనులకు దేవభూదేవ తీర్థసంసేవలేల

సారంగు తమ్మయ్య. వైజయంతి. 113

విను చదువు చెప్పినతఁడుం దన తండ్రియు నొక్కరూపు తలఁపఁగ

పొన్నిగంటి తెలగన. యయాతి చరిత్ర. III-157

తండ్రిని గడవ నాచార్యుఁడేవిధంబునఁ జూడ నెచ్చైన వాఁడు

వరద. రామా. అయో. పు. 658

విలసల్లీల మహాసభాంతరమునన్ విద్యాప్రసంగంబు శి
ష్యులు గావింపనెసంగుఁ దద్గురునకున్ శుంభద్గుణస్ఫూర్తి యు
జ్జ్వలసూక్తిచ్ఛటలం జలంబుఘనముల్ వర్ణింపధాత్రిన్ నిర
ర్గళ విఖ్యాతిఁ బయోధిగ్రక్కొనుఁగదా రత్నాకరాఖ్యానమున్

బిజ్జుల తిమ్మభూపాలుఁడు. అనర్ఘరాఘవము

గురుఁడె బ్రహ్మంబు విత్తంబు గురుఁడె తత్త్వ
మతని మించిన పరతత్త్వమవలఁ గలదె
యట్లుగావున గురుపూజ యాచరింప
సర్వహితగు నందురే యుపాయముననైన

భవానీశకవి. ధర్మ. IV-114

ఆత్మబుద్ధి సుఖంబిచ్చు నంతకన్న, గురువుసెప్పిన సద్బుద్ధి

ధరణిదేవుల రామయమంత్రి. దశావతారచరిత్రము. V-86

విమలతరమైన సరసవివేకబుద్ధి
శిష్యసమితికి బోధఁ జేసినను గాని
దేశికుఁడుకాఁడు మంత్రోపదేశమాత్ర

అడిదము సూరకవి. రామలింగేశ శతకము. 64

ఆత్మబుద్ధియె కఁడుసౌఖ్య మవనియందు
నరయ గురుబుద్ధి యుత్తమమండ్రు బుధులు

సౌగంధిక ప్రసూన సంగ్రహము.

గురువుగ్రోత్తశక్తి గూర్పఁగలేడెప్పు
డున్న గుణవితతికె వన్నెవెట్టు

కూచి నరసింహం. రూపలత. II

శ్రీ నిరంతరానంద నిశ్శ్రేయసార్థ
సాధకము సర్వకిల్బిష బాధకము స
మగ్రవిజ్ఞానదము మహామహిమ ఘనము
శరణమగు మాకు సద్గురు చరణయుగము

వేటూరి ప్రభాకరశాస్త్రి. చాటువు

## గురు శిష్యులు

గురులకు శిష్యులు పుత్త్రులు, పరమార్థమ లోకధర్మపథమది

నన్నయ. భారత. ఆది. III–131

శిష్యులు బలాఢ్యులైనవి, శిష్యస్థితినొందిగురువు జీవించును

పోతన. భాగవత. X-1414

గురువులకును శిష్యవరులె కూర్చిన ధనముల్

సింగయ. భాగవత. VI-290

గురుముఖంబువలనఁ గుదురుగాఁ దనమూర్తి
నెఱిఁగికొనిన యట్టి నరవరుండు
సురలువినుతిసేయ శుభరూపసహితుఁడై
చెడని పదమునకును జేరుకొనును

హరివంశము. మత్స్య. IV–77

గురునిసేవించి తానేర్చుకొనిన నాల్గు
ముక్కలును మఱచి పోకుండఁ బుణ్యమూర్తి,

శిష్యుఁడు లభించెనని ప్రీతిఁజెందియతని
నిత్యగౌరవ మునను మన్నింపవలయు

పానుగంటి. విప్ర. II

శిష్యునెపుడు గురుఁడు నిరసింపఁగూడ
దాత్మసమునిగ భావింప నగునతండు
తనదు సహపాఠకునిగాఁగఁదలఁప వలయు
నిద్దఱుస్వగురు శిష్యులం చెన్ననగును

పానుగంటి. విప్ర. II

శిష్యునాత్మకు భక్తి విశేష్యమిచ్చి
పరమదయ దానిఁబోషింప గురునిభార
మధికభక్తిని గురు దేహమాచరించి
రక్షణము సేయ శిష్యుభారమ్మ సుమ్మ

పానుగంటి. విప్ర. II

వాదమున శిష్యుఁడే జయపత్ర మొంద
గురునిఘనత వేమడుగులు మెఱయకున్నె ;
శిష్యునెడచేసి గురుఁడట సిద్ధపడిన
గురుఘనత యేది శిష్యుని గురుతయేది ?

పానుగంటి. కల్యా. రాఘ. III

గురునిగనిన శిష్యుఁడు దిగ్గునను లేచి
పరమగౌరవ యుక్తుఁడై శిరముఁలెత్తి
మ్రొక్కితగినట్టి యుపచారములను జేసి
నిశ్చలశ్రద్ధతో విద్య నేర్వవలయు

శాస్త్రపాండిత్యమును బ్రపంచ స్ఫురణము
సత్ప్రవర్తనము దేహశక్తి గురుఁడొ
సంగఁదగునన్నాశిక్ష సేయంగఁ దగును
సుతుల శిష్యుల నొకరీతిఁ జూడవలయు

పానుగంటి. బుద్ధ. X

## గృహస్థ ధర్మము

ఆర్తునకు శయనంబును భీతునకభయంబును
దృషితునకు జలంబును బుభుక్షితునకు నన్నంబును
శ్రాంతునకు నాసనంబును నిచ్చుట
సనాతనంబైన యుత్తమ గృహస్థ ధర్మంబు

నన్నయ. భారత. అరణ్య. I-31

నిజదారైక పరత్వముం గరుణయున్ నిక్కంబునుం దాల్మియున్
సుజనాసంగము దేవపిత్రతిథి సంశుద్ధార్చనల్ హవ్యభు
గ్భజనంబున్ సకలాశ్రమస్థులను శక్యప్రక్రియంబ్రోపుఁ బం
కజ గర్భుండు గృహస్థధర్మములుగాఁ గల్పించె నుర్వీశ్వరా!

తిక్కన. భారత. శాంతి. I-327

ప్రజలుదల్లిఁజెందు పగిది గృహస్థ ధ
ర్మంబునెల్ల యాశ్రమములుఁ జేరి
కాచె జీవనంబు గావించుకొను గృహ
యుక్తుఁ డోషధులకు నొడయుఁడగుట

తిక్కన. భారత. శాంతి. V-312

అంబుజ సూతియేర్పడ గృహస్థసమర్థముగాఁ బ్రవృత్తి ధ
ర్మంబునొనర్చె నార్యజనమాన్యము దాని తెఱంగుచాల సూ

త్మం బలికాంక్ష లేక తగు కాలమునన్ సమచిత్తవృత్తి ని
త్యంబును ధర్మముఖ్యముగ నర్థము గామము జల్పుటొప్పగున్

తిక్క-న. భారత. అను. V-30

జనని జనకుఁడు సద్గుగుడనలుఁడాత్మఁ
డనఁగ నిర్వురును నే గృహస్థుచేత
సుగతివాంఛఁ బ్రసాదితు లగుదురట్టి
వాఁడచూవె ధర్మాత్ముండు వసుధమీఁద

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-118

దార స్వీకృతియు న్దయాభి రతియున్ ధర్మార్జితార్థక్రియా
సారత్వంబును దేవపిత్రతిథిపూజా స్థైర్యమున్ దీన దా
సీరాజీసుత బాంధవాతుర జన శ్రేణీసమృద్ధాన్న స
త్కారోదారతయున్ గణింప గృహికిన్ ధర్మంబులుద్యన్మతిన్

మారన. మార్కం. పు. III-145

అతిథుల కభ్యాగతులకుఁ
బితరులకును వేల్పులకును బెట్టిన శేషం
బతి శుద్ధమట్టి యన్నము
సతతము గుడుచుట గృహస్థ సద్ధర్మము...

కేతన విజ్ఞా. ఆచా. 70

అనఘ గృహస్థధర్మపరుఁడైన నరుండు త్రిలోకపోషకుం
డనుపమ పుణ్యమూర్తి యతఁడాతని సంతత ధర్మసంపద
న్మని పితృ దేవ భూతగణముం గ్రిమికీటక పక్షిసంఘమున్
మనుఁ గనుఁగొంచు నుందురు మానవ యర్థులువాని వక్త్రమున్

మారన మార్కం. పు. III-152

పరిణీతయగు నింతి ప్రతికూలగాదేని
తనయుండు తనయాజ్ఞ దాటఁడేని
నిజసహోదరులు వినీతులై మసఁగేని
కోడలోరుపు దక్కి కొనఁగదేని
కూతురీలువునందుఁ గొదవ చూపదయేని
ఋణమను పాతకంబెనయదేని
తేజోగరిమ పరాధీనతఁ జెడదేని
నిందాంధకారంబు నెఱయదేని
న్యాయమున మొల్లముల పెల్లుడాయునేని
యతిథి సంతర్పణంబింట నమరునేని
సముచితాచారములు కొనసాగునేని
కలదె గృహమేధి ధర్మంబుకంటె మేలు

తెనాలి రామకృష్ణకవి. పాండు. మా. V-166

ధర్మహీనుఁడై గృహియును ధనము సంగ్ర
హించి యతియును జెడిపోదురిది నిజంబు

భవానీశకవి. ధర్మ. V-174

ధనము సంగ్రహించి దానం బొనర్పని
గృహపతికిని భైక్షువృత్తిమేలు
కాకయుండెనేని గరళాశనంబు మే
లగ్నిఁ జొరుట యంతకన్న మేలు

శ్రీధర మల్లె వేంకటరామకవి. బ్రహ్మోత్తర ఖండము. IV-275

తనవారి మరియాదఁ దప్పనిగేస్తు
కాన కేగినజోగి కంటె నయంబు

అ. నారాయణదాసు. వేల్పుమాట.

## గృహస్థాశ్రమము

సంతతగృహమేధిఫలం
బంతయుఁబడయంగనోపు ననుగుణ భార్యా
వంతుండగువాఁడు క్రియా
వంతుఁడు దాంతుండు బుత్త్రవంతుండునగున్

నన్నయ. భారత. ఆది. IV-83

అభిమతాశ్రమంబులందు గృహస్థాశ్రమంబుకాదె యుత్తమంబు

నన్నయ. భారత. అరణ్య. I-30

అతిథి జనులు దమతమవాం
ఛితము లనుభవించునట్లు సేయం గనినం
గృతకృత్యతఁ బొందరెగృహ
పతియును గృహిణియును ధర్మ భారము వలనన్.

తిక్కన. భారత. అను. I-67

......అఖిలాశ్రమ సువి
ధానంబులకును గృహస్థతయ నెలవగుటన్
దాని పదాఱవపాలిస
మానముగా దరయ నాశ్రమంబెయ్యదియున్

తిక్కన. భారత. అను. V-34

......లోకమున నెవ్వరికైనను మేలుసేయఁగా
నోఅపగునాశ్ర మంబున సమున్నతమైన గృహస్థ ధర్మము
బఱగడవైచి గోచి గొని పాత్రకు పోల్లకు ముక్తిగల్గునే

నాచన సోమన. ఉ. హ. వం. IV-48

తనర గృహస్థతా భరముఁ దాల్చి చరించుచునుండు నమ్మహా
త్మునికి ననేక భూరిశుభముల్దగ నెప్పుడు నిచ్చు దేవతా

ముని పితృ బాంధవాతిథి సమూహములన్ బశుపక్షికీటకా
ది నిఖిలభూత కోటియును దృప్తియతం డొనరించుటన్

మారన. మార్కం. III-167

అధిపతియాశ్రమస్థుల కందఱకును
వినుగృహస్థాశ్రమమువాఁడె వెలయనూఁత

అనంత. భోజరాజీయము. II-71

పురశాసన మురశాసన
సరసిరుహాసనులుఁ బాకశాసన ముఖ్యా
మరవరులు గృహస్థాశ్రమ
పరులౌట యెఱుంగవయ్య పావన చరితా

ద. దుగ్గన. నాసి. I-116

ఇతరాశ్రమ దుర్జయంబులైనయింద్రియ శత్రువర్గంబుల
భార్యా సమేతుండైన గృహస్థుండు దుర్గాధిపతియైన రాజు
శత్రు సంఘంబుల జయించు చందంబున జయించు

పోతన. భాగవ. III-459

కెలఁకులనున్న తంగెటిజున్ను గృహమేధి
యజమానుఁ డంకస్థితార్థపేటి
పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు
దొడ్డిఁబెట్టినవేల్పు గిడ్డికాఁపు
కడలేని యమృతంపునడబావి సంసారి
సవిధమేరునగంబు భవనభర్త
మరుదేశ పథమధ్యమ ప్రపకులపతి
యాఁకటి కొదవుపస్యముకుటుంబి

బధిరపంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటిపరివ్రాజకాతిథి క్షపణకావ
ధూతకాపాలికాద్య నాథులకుఁగాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె

పెద్దన. మనుచరిత్ర. II-27

కులధర్మం బెడలించి శ్రీగురునకుం గోపంబుపుట్టించి మి
త్రుల సౌభ్రాత్ర నివాసదేశములనీ తోఁబుట్టులంబాసి ని
శ్చలతన్ వ్రేలెదవుట్టిగట్టుకొని దుస్సాధంబు సుమ్మీ! స్మర
జ్వలన జ్వాలికసోఁకనీక నిలుపన్ జ్ఞానామృత స్యందమున్

తెనాలి రామకృష్ణుఁడు. పాండు. మా.

ఎవ్వరికినైన ముక్తిలభించుమాట
సత్యమగునేని యద్ది సంసారియైన
యతనికి లభించు మొదటనే యతని పిదప
యతికొ వటునకొ ప్రాప్తించు నభవుకరుణ

పానుగంటి మాలతీమాల. IV

మోక్షమునకు గార్హస్థ్యమే ముఖ్యపథము
వటుఁడు కడుభీరుఁడై యొడ్డుపైనిఁగూలఁ
బడిప్రతాప వాక్యంబు లుపన్యసించుఁ
గాని కాలైనఁ బెట్టఁడు దానిలోన
ఆశ్రమంబుల గార్హస్థ్యమధికతరము
సర్వసత్కర్మ వితతికి స్థానమిదియె

పానుగంటి. మాలతీమాల. IV

## గృహిణి

ధర్మార్థ కామసాధన కుపకరణంబు
గృహనీతివిద్యకు గృహము విమల
చారిత్ర శిక్షకాచార్యకం బన్వయ
స్థితికి మూలంబు సద్గతికి నూఁత
గౌరవంబున కేక కారణం బున్నత
స్థిరగుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
నూవె భర్తకు నొండ్లుగావు ప్రియము

నన్నయ. అది. IV-84

సతియు గల్గినగల్గు సకల సంపదలు
సతియుఁ గల్గినఁగల్గు సకలపుణ్యములు
సతి గల్గినఁగల్గు సత్పుత్రచయము
సతి గల్గినఁగల్గు సద్గతిత్రోవ

గౌరన. హరిశ్చంద్రోపాఖ్యానము

గృహిణీ సమేతముగు తప
మిహపర సౌఖ్యములకెల్ల నిరవుఁ బ్రమోదా
వహమని యార్యులు శ్రుతులును
బహుముఖములఁజెప్ప వినవె పరమ మునీంద్రా

ద. దుగ్గన. నాసికేతూ. I-115

ఇల్లాలు గుణవతియేని యింటికిఁ గీర్తి ఘటియించు దిశలు
ప్రకాశము గన
ప్రబలు సౌభాగ్యంబు పాలు పొంగినరీతి సిరివచ్చి వాకిటఁజేరి
యుండు

సకలగుణసంపదల్ సరవితోడుతనొప్పు మదికి సంతోషంబు
వదల కుండు
పాడిపంట లభీష్టఫలితంబు నేవేళ సకలకార్యంబులు సఫలమౌను
మన్ను బట్టిన బంగారమైరహించు
కులము లేటికి వసతలగుణము కులము

ముగ్గి సెట్టి పులియప్పరేడు. మల్లెల రామలింగశతకము

ఇల్లాలుగల్గుట యింటి తేట

వేంకటకవి. మదనగోపాలశతకము. 42

## గోపూజ

గోవులకు బ్రాహ్మణులకును గుల మొకండ

తిక్కన. భారత. అను. II-273

శ్రుతులు నౌపనిషదసూక్తులు గోస్వరూ
పంబులని సరోజభవుఁడు సెప్పె
ధర్మపరత పరమతపము మహాధ్వర
మనఁగఁబరఁగు గోసమర్చనంబు

తిక్కన. భారత. అను. III-95

## గ్రంథము

సృష్టి మొదలుగ మనుజు లార్జించినట్టి
నిస్తులంబగు మాన్యముల్ పుస్తకములు

నా. కృ. రావు. గ్రంథాలయసూక్తులు

శేముషీవంతుల పవిత్రజీవిత ప్ర
శస్తరక్తపుంజంబులు పుస్తకములు

నా. కృ. రావు. గ్రంథాలయసూక్తులు

అండబాయక ఎపుడు వెన్నంటితిరుగు
పొచ్చెములులేని నేస్తముల్ పుస్తకములు
నా. కృ. రావు. గ్రంథాలయసూక్తులు.

సతము సద్గ్రంథపఠనంబు కతనగాదె
పృథివి నాగరికతజెంది వృద్ధిజెందు
నా. కృ. రావు. గ్రంథాలయసూక్తులు.

గ్రంథాలయము

గ్రంథనిలయంబు శారదకనకపీఠి
గ్రంథనిలయంబు కవులశృంగారవీటి
గ్రంథనిలయంబు మోక్షసద్గతికి చీటి
నా. కృ. రావు. గ్రంథాలయసూక్తులు.

దివ్యమగునొక్క గ్రంథమందిరములేని
వీడువీడుగాదది పాడుబీడుగాని
నా. కృ. రావు. గ్రంథాలయసూక్తులు.

జీవితంబును సరియైన త్రోవనడప
సదరుల గ్రంథపఠనంబు సాధనంబు
నా. కృ. రావు. గ్రంథాలయసూక్తులు.

సంస్కృతికాటపట్టు, అఖిలకళ్యాణకరము గ్రంథాలయమ్మ
నా. కృ. రావు. గ్రంథాలయసూక్తులు

ఘనత :

ఉన్నఘనత బట్టి మన్నింతురేగాని
పిన్నపెద్దతనము లెన్నబోరు

కలియుగంబునందు ఘనతకు నైచ్యంబు
ఘనతనైచ్యమునకు గలుగుచుండు
శ్రద్ధభక్తిలేక జనులుంద్రుగావున

వేమన

గూఢార్థము ఘనుఁడెఱుఁగును
మూఢాత్ముండేమి యెఱుఁగు?

వేమన

గొప్పకష్టమెంతొ గొప్పవానికిఁ గాని
బడుగులకును సంభవంబుగాదు

పానుగంటి. నర్మదా. I

పరులసుఖఘనతలఁగూర్చి నరులువాంఛ
నూహములువారియు పరివేషోజ్జ్వలతల
గలిగియుంటచేతను సరికావు వారి
మనసులను గన జనులకుఁ గనులులేవు
పిలువఁగనె పల్కువానిని బెద్దసేయ
రెంతకయినఁ బల్కనివాని నెంత్రుజనులు

పానుగంటి. బుద్ధ. I

చట్టము

చట్టమునకెప్పుడాచార సరణి భేద
మగునో యాచారమును ద్రోయఁదగును తండ్రి
శ్రుతి తతికి స్మృతి యెపుడు విరుద్ధమగునో
యపుడె స్మృతి నిరాకరణీయమగును గాదె

పానుగంటి. పాదుక. VII

## చపలత

చపలచిత్తము వారి సంగమిక వలదు

అన్నమయ్య. ఆధ్యా. సం.

కానలేక భువిని గాలార దిరిగినఁ
బూని మదిని నిలుప బూనుటరుదు

వేమన

చపలాత్ముం గనిపెట్టి యుండుఁ గద యస్వాపంబులై యాపదల్

రుద్రకవి. నిరం. IV-65

చపలత్వమైన తఱి గౌరవమెట్లగునో తలంపుఁడీ

రోవనూరి వేంకటపతి (విష్ణుమాయావిలాసము)

## చావుబ్రతుకులు

పూర్వకర్మంబు లాయువుఁ బొదలఁజేయ
సన్నముగఁజేయ బ్రదుకును జావుగలుగు

తిక్కన. భారత. అను. V-128

తాము గన్నవారు తము గన్నవారును
జచ్చుటెల్ల తమకు సాక్షి గాదె
బ్రతుకుటెల్ల తమకు బ్రహ్మకల్పంబులా

వేమన

ప్రాణులన్నియు నన్యోన్య వధము కొఱకె
యిలను సృజియింపఁబడెను దైవేచ్ఛచేతఁ
బ్రాణివధ దైవసృష్టికిఁ బ్రాతిపదిక
చావె బ్రదుకగును బ్రదుకె చావుగాదె

పాముగంటి. బుద్ధ. IV

చింత

కడవంబడిన దానికి వగవం బనిలేదు

తిక్కన. భారత. కర్ణ. I-226

చింతాపరత్వంబునఁజెందు దుఃఖాక్రాంతత్వము

తిక్కన. భారత. స్త్రీ. I-229

తృణోత్కరముకంటెఁ జింత గరము తేలిచు

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-435

భేషజం బెద్దాని భేదింపఁ జాలదు లంఘనంబున నెద్ది లావు చెడదు

తఱిగించు బుద్ధి నిద్రామహోత్సాహ క్షుధాకార తేజో బలాదినెద్ది

నాసత్య చరక ధన్వంతరి ప్రభృతివైద్యులకు నసాధ్యమై యుండునెద్ది

దివసంబులాతే డతిక్రమించిన యప్డు జీర్ణత్వ దశనధిష్టింపదెద్ది

ప్రత్యహంబు నవత్వంబు వడయునెద్ది యట్టి చింతాజ్వరంబు

శ్రీనాథుఁడు. కాశీఖండము I-111

వింత లుడుగని మదిలోన జింతకలుగు

వేమన

చింతలేకయున్న చెడని సంపద జూచు
చింతచేత మిగులఁ జివుకు మనసు

వేమన

అపరిమితచింత వింత సౌఖ్యంబునిచ్చు

పానుగంటి వన. రాఘ. III

చింత మహాజ్వర మెప్పుడు
చింతించుచునున్న వాఁడు చెన్ను ఱిపోవున్

శ్రీపాద. శ్రీకృష్ణభారతము. అరణ్య. VII-402

## చిత్తశుద్ధి

చిత్తశుద్ధి మాత్రఁజేసె నేనియు నవి
ద్యాత్మ కంబ చూవె యరయఁ గర్మ
మదిదొలంగు టంచితాత్మ విద్యాత్మక
ధర్మమదియ మోక్షదంబు సుమ్మ

తిక్కన. భారత. శాంతి. V_127

తపము లాదిగ నియమముల్ దశవిధములు
మఱియు దానము శివపూజ వ్రతము జపము
వినుట యాస్తిక్యమును సిగ్గు వెలయ నివియె
చిత్త శుద్ధికి హేతువులు

వేమన

చిత్త శుద్ధిగల్గి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియు కొదువగాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత

వేమన

ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా

వేమన

చిత్తశుద్ధియొకటి శ్రేష్ఠలాంఛనమగు

వేమన

చిత్తసంశుద్ధిలేకున్నఁ జెలువ బాహ్య
బహు విధాయాస చేష్టల ఫలములేదు

అహోబలపతి. కాళిందీ. III. 199

మానసశుద్ధి గల్గిన నరశ్వానం బ్రబర్తిల్లుటల్
గనకా గారమునందు నుంట సరియే కాదే

ధరణిదేవుల రామయమంత్రి. దశావతార. VI-30

శుద్ధమనసులేక పూజచేయుట సూకరవృత్తి

త్యాగరాజు. విష్ణుకీర్తనలు. 434

చిత్తశుద్ధిలేక చేసిన తపములు
రిత్తలగును గాక పృథివి

దా. శ్రీ. దేవీభాగవ. VI-249

దేహజమలంబు దీర్థముల్ దీర్పఁగలవు
మానసంబును గడుగంగఁ బూనలేవు

దా. శ్రీ. దేవీభాగవ. VI-211

ఇంద్రియములెన్ని బాధలనిడినఁ గఠిన
యత్నమున మది వానిపై నాడ వలయు
నేటిమున్కల గణియింప కీదు వాఁడు
క్రమముగా నీది నదిదాటు కరణిఁగాఁగ
పాపచింతలు వ్యాయామ పటిమఁ బోవు
నపుడె చిత్తము పరిశుద్ధి నందఁ గలదు

పానుగంటి. బుద్ధ. III

## చైతన్యము

జ్ఞాతృజ్ఞాన జ్ఞేయము
లే తాదృశబుద్ధి నిడక నేకాకృతి నీ
చైతన్యంబునఁ గనఁబడు
చైతన్యమెచూడు కలుగు సౌఖ్యములెల్లన్

పుష్పగిరి తిమ్మన. సమీర. IV-115

ప్రీతిని హృదయాకాశము భూతాకాశంబుఁ గలయఁబొంది యొసఁగుచో
నాతతి గతలక్ష్యంబగు చైతన్యాకాశ మొదవు

పుష్పగిరి తిమ్మన. సమీర. IV-118

చలనమే లేనిదే ప్రపంచంబులేదు
జనుల గతులకుఁ జలన మాశ్చర్యమేమి

పానుగంటి. పాదుక-IV

## చౌర్యము

సహజక్రీడలుకావె యెల్లప్రజకుం
జౌర్యక్రియావైఖరుల్

చదలువాడ మల్లన. విప్ర. చరి. III-26

... ..వినుమెంత వానికైన
దొంగతన మున్నయప్పుడె దొడరు భయము

ధరణిదేవుల రామయమంత్రి. దశావతార. I-273

పనికిమాలిన దొంగ బ్రతుకెల్లచేటు

అ. నారాయణదాసు. వేల్పుమాట.

బలముననుగాని మాయల వలనఁగాని
పరులధనమును హరియింపఁ బాపకృత్యమగు

పానుగంటి. బుద్ధ. V

## ఛందస్సు

ఛందము వాఙ్మయ విద్యా
కందము యతిగమక సమక గణ వృత్తకృతా
నంద మమందార్థ కళా
విందము వాణీ కరారవిందము ప్రతిభన్

విన్నకోట పెద్దన. కావ్యాలంకార చూడామణి. VII-5

విను ఛందోబద్ధంబను
ఘన కారణముననె బ్రతుకుఁ గననగు నేనిన్
తనువది వదలి వెసం జ
క్కని మృతినొందుటయె లెస్స కవితాసతికిన్

కందుకూరి వీరేశలింగము. సరస్వతీనారదవిలాపము

## జంతుస్వభావము

సకల జంతువులకు జన్మ వర్ధన
పరిణామ గుణచయంబు నైజము

మారన. మార్కండేయ. VII-141

నోరులేని జంతువులకు నొప్పి ఘనము

రాయలు. అముక్త. V-43

ధరఁ గడపటనే జంతువుకైనా
తన జన్మమె సుఖమైతోఁచు

అన్నమయ్య. అధ్యా. సం.

## జగత్కల్యాణము

దుష్టజన బాధనొందుచు శిష్టరక్ష
జరుపు లోకోపకారికిఁ జావుగలదె
అజ్ఞ భూపదత్త దరిద్రతార్తిఁ బడుచు
భువికి జ్ఞాన తేజంబిచ్చు కవికివలెను

పానుగంటి. వన. రాఘ. V

కేవలాత్మ సుఖార్థ దృష్టియతి ముక్కు-
మూసికొని గుహానుండు నన్న్యాసికంటెఁ
బృథుల లోకోపకార ప్రవృత్తి మనసు
తోడఁదిరిగెడు... వాఁడె ఘనుఁడు

కూచి నరసింహం. రూపలత. I. i-19

## జనకుఁడు

తాన తన నీడ నీళ్ళల
లో నేర్పడఁ జూచునట్లు లోకస్తుత త
త్సూను జనకుండుచూచి మ
హా నందము పొందు నతిశయ ప్రీతిమెయిన్

నన్నయ. భారత. ఆది. IV-86

ఆకసంబుకంటెఁ బొడవు జనకుఁడరయ

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-435

కుడువను గట్టను బూయను
దొడువను బోఁబనిచి కాక తొలుత మొనసారం
గొడుకుంబనుచుట కెవ్వఁడు
గడఁగునె

తిక్కన. భారత. ద్రోణ. II-142

కొడుకంచుఁ బ్రియోక్తులు వల్కినఁ జెంపుసెడున్

తిక్కన. భార. స్త్రీ. II-31

జనకుఁడు దపమును ధర్మం
బును విద్యయుఁ బరమదైవమును గావున నా
తనికిఁ బ్రియంబగు పనిసే
సిన దేవతలెల్లఁ బ్రీతిఁ జెందుటగల్గున్

తిక్కన. భారత. శాంతి. V-271

తనయుండు చేసిన తప్పనఁ గూర్చి
జనకుఁడే గతినైన సైరింపవలదె

గౌరన హరిశ్చంద్ర. పు. I-127

హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి

పోతన భాగవ. VII-169

కుపుత్రు మోహంబు విడువఁజాలక బహుమాన
సంగతిఁ గనునెవ్వఁడతని గేహంబు దుఃఖాలయంబు

పోతన. భాగవ. IV-406

పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడున్
మిత్రత్వంబున బుద్ధిసెప్పి దురితోన్మేషంబు వారింతురు

పోతన. భాగవ. VII-126

తండ్రికన్నను వేఱె దైవంబులేదు

విజయరాఘవుఁడు. రఘునాథాభ్యుదయము. య. గా.

తనయుఁడు జ్ఞానియై తప్పొనర్చినను
గినియక తండ్రి శిక్షింపఁగఁదగదె

తిమ్మయ. ద్విప. భార. ఆది. పు. I-26

పుత్రునకున్ విశుద్ధ గుణబోధకుఁడై తగువాఁడె తండ్రి
భవానీశకవి. ధర్మ. VI-44

కొడుకుకంటెను కూతురు కూర్చువస్తు
వైననద్దానినే కష్టమైనఁ బడుచుఁ
ద్వరగ వదలుచుకొనుదాఁక దండ్రియోర్వఁ
డకట యిదియేమి చోద్యమొ యవనిమీఁద
పానుగంటి. కల్యా. రాఘ. V

ఘనుఁడైన నల్పుఁడైనను
జన నింద్యుండైన లోక సమ్మతుఁడైనన్
ధనియైనఁ బేదయైనను
దన తండ్రియె మంచివాఁడు తనయున కెపుడున్
చిలకమర్తి. ప్రసన్న యాదవము V.

తన తనయుం గుఱించి యెడదం గరువంబును బొందు భాగ్యమె
వ్వనికి లభించు నాత్మజుని ప్రాభవ రూప వివేక వీర్య వ
ర్తనముల చేత నెవ్వఁడు పరాజయమందు సుఖంపఁగాంచు నం
దనుని యశంబునందెవఁడతండె కృతార్థుఁడతండె తండ్రియున్
కాళ్ళకూరి. పద్మవ్యూహము. IV-68

పాపాత్ముండగునేని బుత్రకు గృపాబంధంబు సంధింప కే
ప్రోపాడందగుగాదె తండ్రులకు
వేటూరి ప్రభాకరశాస్త్రి. ప్రతిమానాటకము. III-67

## జనన మరణములు

చావును జేటును మనుజుల
కావిర్భావంబుతోన యైనవిగాదే
తిక్కన. నిర్వచనోత్తర. IX-56

తనకుఁ దాన కలఁడు జననంబు నప్పుడు
మరణమునకు సుగతి నరకమునను

తిక్కన. భారత. అను. IV-250

జనన మరణములు జనులకు నిక్క-
మాలయంబున నున్న అడవిలో నున్న
తప్పక తార్కొ-ను తథ్యంబుగాను

శ్రీనాథుఁడు. పల. వీ. చ.

మాపులే మరణములు రేపులే పుట్టువులు
చాలునంటే యించుకంతే చాలును
చాలకున్న లోకమెల్లఁ జాలదు
పీలినయాయాస వెట్టివాని చేతిరాయి

అన్నమయ్య. అధ్యా. సం.

ఉదయాస్తమయము లొకదినమున నే
ఎదుటనె యున్నవి యెంచినను
జీవులు ఎంచక తమతమ
బ్రదుకులు సతతమని బ్రమసెదరు

అన్నమయ్య. అధ్యా. సం.

జనన మరణములు జంతురాసులకు
వెనక ముందరను విడువని కొలువులు
తలఁచిన చోటను దగు దేహములై
పొలసి పోయినా బోనీవు

అన్నమయ్య. అధ్యా. సం.

ఏమి గొంచువచ్చె నేమి దాగొనిపోవు
బుట్టువేళ నరుఁడు గిట్టువేళ

వేమన

జనన మరణములన స్వప్నసుషుప్తులు

వేమన

అంతఃకరణ వశంబున
జంతువులకుఁ జావుపుట్టు సంగతమైన
ట్లింతయును దోఁచుఁ జూఁచిన
భ్రాంతియ కాకందు లేవు భవ మరణంబుల్

పుష్పగిరి తిమ్మన. సమీర.. IV-112

పుట్టుట గిట్టుట పుడమి జీవులకు కట్టడి

కాటమరాజు కథ.

తొలఁగదు పుట్టుకతోఁ గల్గు సేగి
యెగ్గులగ్గులు సల్ప నెటు చెల్లునుఆక

నారాయణదాసు. రుబాయత్

చావు బ్రతుకు వర్తించు జక్రగతి

సురవరం ప్రతాపరెడ్డి. ఉచ్ఛృలవిషాదం. III-62

## జనని

ఒరుల వలనఁ బుట్టు నోటమియును నెగ్గుఁ
బొరయకుండ నరసి పుత్రవరులఁ
దగిలి కాంచునట్టి తల్లి

నన్నయ. భారత. ఆది. I-160

గురులలోనఁ బరమ గురువు తల్లియ యట్టి
తల్లి వచనమును విధాతృ కృతము
నన్యథాకరింపనలవియే

నన్నయ. భారత. ఆది, VII-254

కలవాఁడు లేనివాఁడు స
బలుఁడబలుఁడు మూఢబుద్ధి ప్రౌఢుండనఁగా
వలదెవ్వరికైన జనని
కలిమియ యత్యంత సౌఖ్యకరమై యుండున్

తిక్కన. భారత. శాంతి. V-278

ధర్మదేవత మాట తల్లి మాటండ్రు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా.

పంచకరపాట్లు వడి తన్నుఁ బెంచి పిసికి
యాపదలఁ బాప రక్షించినట్టి తల్లి
దేవతాబుద్ధి వాటించి తెలియవలయుఁ
గొడుకు వంశాభిసంవృద్ధి కోనలుసాగ

శ్రీనాథుఁడు కాశీ. IV-18

శేషాడిఁ గొడుకు జననీ
శ్రీపాదములకు నమస్కరింపఁ గఁ దగుఁ ద
చ్ఛ్రీపాదక్షాళ సలి
లాపోశన మెపుడు సుతునకాయుఃప్రదమౌ

శ్రీనాథుఁడు. కాశీ. IV-19

సర్వ తీర్థాంబువుల కంటె సమధికంబు
పావనంబైన జననియుత్రి పాదజలము

శ్రీనాథుఁడు. కాశీ. IV-20

ఎట్టి యపరాధ మొనరించెనేనిఁ దల్లి
కొడుకు శపియింపదు

శ్రీనాథుఁడు కాశీ. IV-269

తగిన పోడిమిసేయు తల్లిలేకున్న
వగవరే మఱియెట్టి మగబిడ్డలైన

పాల్కురికి సోమన. బసవ.

తల్లి పిల్చిన రాని తనయులు గలరె

పాల్కురికి సోమన. బసవ

తల్లియున్నపుడె దనదుగారాబంబు
ఆమెపోవ దన్ను నరయరెవరు

వేమన.

మఱపింపలేవు పతిభక్తుల్ మాతృవిశ్లేషమున్

సూరన కళా. VII-96

చులకన మఱి తల్లిలేని సుతుఁడు కుమారా

అనంతామాత్యుడు. భోజరాజీయము. పు-15

తనరిన యేగురు తల్లులలోనఁ
దన గురుసతి యొక్క తల్లియై యుండుఁ
దన రాజు సతియొక్క తల్లిగానుండుఁ
దన యన్న సతియొక్క తల్లిగానుండుఁ
దన సతి తల్లియే తల్లిగానుండుఁ
దను గని చన్నిచ్చు తల్లియుఁగాక
తన తల్లి సములైన తల్లులు వీరు

భక్తపురి రాఘవాచార్యులు ద్విపద నల చరిత్ర.

తల్లి చెప్పినఁజేసి తండ్రి వాక్యములు
పొల్లువుచ్చిన నఘంబులు దాన రావు

వరద. రామా. అయోధ్య. పు. 658

తల్లి మొదటి వేల్పు ధర్మశాస్త్రంబుల

శివరామకవి. సానందో. V-26

తనయుని నేజాతియైనఁ బ్రోవని
తల్లియు భువిని గలదా

త్యాగరాజు. దివ్యనామసంకీర్తనము-74

తల్లి విషంబిడ్డ తల్లమ్ముకొనిన
నెల్లెడ మాన్పు వారెవ్వరు గలరు

బాణాల శంభుదాసుఁడు. సారంగధర-I

మాత తీర్పు కొలంది కూఁతురు నడవళ్ళు
నేలమంచి కొలంది చేలపంట

వేంకటకవి. మదన గోపాలశతకము-57

కన్నతల్లినిఁ బోలు చుట్టాలు లేరు
పట్టుచీరను బోలు చీరల్లులేవు
ఆకలివంటి మంట లోకాన లేదు
తల్లివంటి బంధువులు ధరణిలో లేరు

సెలయేరు నేదునూరి గంగాధరం-సేకరణ.

పూదోటనీరులే పాదములుసోకినా
వెన్న కరగిన రీతి తల్లి గర్భంబగును

దక్షునియజ్ఞము. పు-10

తల్లిచాటున ఎంత తప్పు చేసినగాని
అది పైకి పోవునా అమ్మ! లోకమున

పసగాడ సన్యాసి. గంగావివాహము. పు-14

ఏటికి కాలువ యెంతదూరమ్మో
ఎత్తిపెంచిన తల్లి కెంత మోహమ్మో

పాతపాటలు పు-4 టేకుమళ్ళ కామేశ్వరరావు సంపాదితము.

కొడుకు మర్మము కన్నతల్లికే యెఱుక
అడవిలో దిరిగేటి అయ్యకే మెఱుక

త్రివేణి. పుట. 355 ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడమీ ప్రచురణ.

తల్లియె వేదము శాస్త్రము
తల్లియె జపమున్ దపంబు తల్లియెగురువున్
దల్లియె సకలము తల్లియె
తల్లిని సెదిరించు వాఁడ ధమగతి నొందున్.

తిరుపతి వేంకటకవులు. పాండవజననము

అవని యందలి సర్వవస్తువుల లోన
తనదు బిడ్డలె యధిక సౌందర్యవంతు
లనుచు మనమున దలపని జనని గలదె

నా. కృ. రావు. వేటకాఁడు-రాబందు

విసుగుచు బిడ్డనుం గనిన వేదనఁ గుందుచునున్న యప్పుడా
నిసువునుదెచ్చి పొత్తులను నించినచోఁ దన కష్టరీతులన్
మసలక తత్సుతావన విమర్శ ఘనంబుగఁ జిందుద్రొక్కఁదా
మనమునఁ బ్రోచు నేర్పుగల మానినిఁ దల్లినిఁబోల రెవ్వరున్

మాతక్తురి అప్పారావు మొదలి మాతృశతకము.

తల్లి చలువ చేతి తాకుడు సంతాప
మార్చు చల్లనీటి యంజలి గద

వేటూరి ప్రభాకరశాస్త్రి. ప్రతిమానాటకము III-62

జనని : జన్మభూమి

ఉన్న యూరు విడిచి ఉండనే లేము
కన్న తల్లిని విడిచి గడియుండలేము

త్రివేణి పు. 315 ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడమీ.

ఉన్న ఊరే నాకు చెన్నపట్నమ్ము
కన్న తల్లే నాకు కల్పవృక్షమ్ము

త్రివేణి పు-316 ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడమీ.

ఎన్న తానున్న యూరును తన్ను గన్నతల్లి యొకరీతి

వా. కృ. రావు. నాయిల్లు పు-4.6 వెన్నెలల వెలుగులు.

జనని : జాయ

అమ్మ పెట్టిన్న అన్నము కన్న
భార్య పెట్టిన్న బలుసాకు మేలు
పెళ్ళామంటే బెల్లమురా
తల్లిఅంటే దయ్యమురా

పాతపాటలు పు_30 టేకుమళ్ళ కామేశ్వరరావు. సంపా.

జననీ జనకులు

తల్లిదండ్రులఁ బూజించి తగ వెలింగి
మన్న ఘోడవైన నే యుత్తమామలనియు
బ్రియు మెఱుంగు

నన్నెచోడుఁడు. కు. సం. II-4

తనయుఁగని తల్లిదండ్రులు దనకు నతఁడు
భక్తుఁడగుటకు ధర్మాను రక్తుఁడగుట కాసపడుదురు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-5

ఉదరమునన్ భరించి ప్రసవోద్భవ వేదనఁ బొంది పిమ్మటన్
ముది ముదియైన పితఁబడి మూత్రమునం బడి లజ్జ నందుగా

నదవదమైన తల్లికిఁ బ్రియుంబొ సుతుండు వృథాభిమాన దు
ర్మదుఁడగు తండ్రికిం బ్రియుఁడొ మానసవీధిఁ దలంచి చూడుమీ
శ్రీనాథుఁడు. హర. II-58

ప్రేమపుఁ దల్లి దండ్రులను నెఱుఁగని దే కులహీనత
అన్నమయ్య. అధ్యా. సం.

తల్లి దండ్రులతోటి తగవులాడుటకీడు
వేమన

తల్లిదండ్రు లెన్న దన మొదలి గురువులు
వేమన

కలవార లెందరేనియు
తలిదండ్రుల కెన యొనర్పఁ దగుదురె యెందున్
తిమ్మన. అచ్చ. రామా. అయోధ్య. 61

కన్న వారలుం దనయను బంపలేక పరితాప భరంబున నెట్లు
సైతురో
కృష్ణకవి శకుంతలాపరిణయము.

మగవానిఁ గన్న తండ్రియు మగువం గన్నట్టి తల్లి మక్కువ
పడరే
కందుకూరి. శుద్ధ.

......తలి దండ్రులు బిడ్డల కూహవచ్చుచో
నెఱి గలిగించు మార్గములు నేర్పనిచోఁ జెడిపోదురవ్వలన్
శ్రీపాద. కనకగిరి. 82

## జనవాక్యము

భూజన పరివాదంబు
వ్యాజంబునఁ బరిహరింప వలయును
నన్నయ. భారత. ఆది. VIII-123

పమగురాడు మాట పాటియై ధరఁజెల్లు
ఒక్కఁడాడు మాట యెక్కదెందు

వేమన

ప్రజలు మూఁకలు గట్టి బహుభాషలాడ
నిజము నిక్కముసేయ నృపునకుఁ గాదు

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

బుద్ధి హీనులైన పురజనులాడెడు
పలుకులెపుడు నమ్మవలను పడదు

దుప్పూరి రామిరెడ్డి. సీతావనవాసము III-i-23

జన్మ

క్రియానివృత్తియైన లోక యాత్ర లేకుండు

నన్నయ. భారత. ఆది. I-140

జీవుఁడు జీర్ణ శరీరముఁ
బోవిడిచి దివంబుఁబొందఁ బుట్టను పేరం
దా వెలయుం దద్దశ జీ
వావలి వర్తించు నిట గతాగత పదవిన్.

తిక్కన. భారత. అను. V-126

స్థిరమగు పుణ్యకర్మమున దేవభవంబగుఁ బుణ్యపాపసం
కరమున మానుషత్వమగుఁ గల్మషముల్ పశుకీట భావమున్
బొరయఁగఁజేయు నిప్పగిదిఁ బుట్టుచుఁ జచ్చుచు మోహ
వార్ధిలోఁ
దిరుగుచు నుండుఁగాని యొక తీరము సేరఁడు జీవుఁడెన్నఁడున్.

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-75

జన్మవృక్షమునకుఁ జవి గలయట్టి
పటుతర కమనీయ ఫలములు రెండు
కెరలు భోగము లొండు కీర్తి రెండవది

శ్రీనాథుఁడు .పల. వీ. చ.

మనవంటి జీవులే మహిలోన నొక కొన్ని
శునకములై కుక్కుటములై సూకరములైనవి

అన్నమయ్య. అధ్యా. పం.

వాని జన్మంబు సఫల మెవ్వాని వలన
వంశ మధికోన్నతి వహించి వన్నెకెక్కు

ఏనుగు లక్ష్మణకవి. సుభాషితము

......మన్మథసౌఖ్య లీలలం
గ్రమమున నోలలాడుటయెగాదె సుజన్మ ఫలంబు ధారుణిన్

కల్లాణ చరిత్ర. III-13

ఈశుఁగనలేని జన్మంబు ఇలకు మోపు

త్యాగరాజు. ప్రహ్లాద భక్తవిజయము

జగము మఱచ గాంచు జన్మఫలత

వేం. క. శివయాత్ర. II-318

## జన్మభూమి

పుట్టి పెరిగిన దేశం
బెట్టిజనులకైనఁ జూడనిచ్చగు

జక్కన. విక్రమార్క. II-226

ఉన్నయూరుఁ గన్న తల్లియు నొక్కరూపు

శ్రీనాథుఁడు కాశి. VII-164

విమల జన్మభూమికంటె నాప్తమేదిలేదు
ఆత్మ ధరణికి వెనుకనే యఖిలముండు

అన్న. సుభా. రత్నావళి.

## జపము

జపము సెల్లించు పురుషుండు సర్వలోక
విజయ విస్ఫృహామగు జపవిధి విశోక
హర్ష రాగాది కంబును నవ్యయంబు
నైన పదముఁ బొందించు నృపాగ్రగణ్య

తిక్కన. భారత. శాంతి. IV-131

శ్రుతిస్మృతీతిహాస ముఖ్యవాఙ్మయంబు
మునుకొని యావర్తనంబు సేఁత జపమనంగఁ బరగు

సూరన. కళా. V-154

## జయము

వినుము విజయంబు గోరెడి మనుజవిభులు
తమకుఁ బ్రతివీరుఁడైన శాత్రవుఁడు దప్పి
చనిన నతనిన కాని తజ్జనులఁ దొడర
నొల్లర ఫలంపుఁ బెనకువ యొప్పకునికి

ఎఱ్ఱన. హరి. ఉత్తర. I-26

అపజయము గొప్ప మాయాజయంబుకంటె
జయము కంటెను న్యాయమౌ చావె ఘనము

## జయాపజయములు

రాలచ్చికినై పెనంగిన బలం[illegible] గెల్వనేర్చునే

తిక్కన భారత. విరా. IV-23



పరిగొని శూరులు బవరంబులోనఁ
బరులచేఁ జత్తురు పరుల జంపుదురు
జయమిద్దఱకు లేదు సమరంబులోన
జయపరాజయము లస్ఖలితముల్ గావు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

అరయ నెవ్వాని సొమ్ము జయాపజయములు

శ్రీనాథుఁడు. శృం. నై. VII-168

జయమపజయము నీశ్వరునకుఁ దెలియు

శ్రీనాథుఁడు. పల. వీ. చ.

వ్యాజ్యమునఁ బందెమున శాస్త్రవాదమునను
బవరమున జయాపజయ సంభవము వెట్టి
వానిచేఱాయి జలగతావర్త చలము
గాలిపాటుగాదే యెట్టి ఘనులకైన

పానుగంటి. విజయ రాఘ. III

## జారిణి

అన్యునిన్ మరగిన యింతి కాంతులకు
మానుగఁ బశ్చిమ గణ్యయే కదా

అయ్యలార్యుఁడు. భాస్కర. రామా. యుద్ధ. 2616

ఒఱపరిఁ గన్నఁ గూడఁ జనునూరక సన్నలు వాఱనాడు ద
త్తఱపడు బోటిఁ బిల్పెడు విధంబున నొత్తిలి బల్కునవ్వుబ
ల్మఱుఁ బొరుగిండ్లకేఁగునొకపట్టున నిల్వదుచంటిమీఁద ముం
జెఱఁగెడలించు వైశికపుసిగ్గు నటించుచు జారధారుణిన్

పిల్లలమఱ్ఱి. జైమిని భారతము. III-28

పరులఁగన్నఁ జంక పాపని ముద్దాడు
గోడనిక్కి చూచుఁ గొప్పుఁదీర్చు
మాఱుమలయు నత్తమామలతో లేని
కిటుకువెట్టి బంధకీ వధూటి

పిల్లలమఱ్ఱి. జైమిని భారతము. III-29

జగడమునకుఁ బోదుజారిణి యెప్పుడు
మాయజేసి పురుషుమమత బెట్టు

వేమన

జిలిబిలి మాటల పలికెడు
కులటల నమ్మంగరాదు

వేమన

వ్యభిచారి మనసు నిలుపగ
ప్రభువులకును సాధ్యపడదు

వేమన

మందుబెట్టి మగని మఱపించి విటుజేరు
సుందరాంగి పాడుసుదతి సుమ్ము

వేమన

మగడు తప్పులేక మనసిచ్చి యున్నను
సహజగుణము విడదు జార కాంత

వేమన

పతినిఁ దిరస్కరించి పరభర్తలఁ జెందిన భామ పుణ్యము
ల్గత జలసేతు బంధములుగావె వచింపఁగ నెంత నోఁచినన్

అయ్యలరాజు నారాయణామాత్యుఁడు. హంస వింశతి I-128

ధవుని యెదలోన తరుగని తంపివెట్టి
జారగా నుంటకన్నను చావుమేలు

నారాయణదాసు. సారంగధర. III-పు.42

## జితేంద్రియత

ఈలోకము నిస్సారం
బాలోకింపంగ ననంటి యట్లుల యనితా
లోలతం బొందని పురుషుం
డేలా నెవ్వగలం జెందనిచ్చు మనంబున్

తిక్కన. భారత. స్త్రీ. I-32

కామముం గ్రోధమున్ మనసుగాడంగ బాఱుట మాన్పియింద్రియ
స్తోమ విమార్గ వర్తనము ద్రుంచుచు నెవ్వగ లేక రక్షణం
బేమఱ కెవ్వరింజెనకి యించుక నొంపక లోకమేలంగా
నామహితాత్ము సర్వమహిమాతిశయంబును జెందు

తిక్కన. భారత. శాంతి. I-147

తను దాన లోలుత గెలువన్
మనుజపతికి వలయుం బిదప మాార్తుర గెలువన్
మనమునం దలంచునది మును
దను గెలువని పతికిం గెలువం దరమే పగఱన్

తిక్కన భార. శాంతి. II-276

వర్ణములకెల్ల నింద్రియ వ్యాప్తి నిగ్ర
హంబు వలయు నియ్యది గన్న యన్నం దృప్తిం
బొంది యొం డాసపడకున్న నొందు సాధు
జనులు వెదకు ననామయ సత్పదంబు

తిక్కన. భారత. అను. III-318

విచ్చలవిడి నింద్రియముల
నిచ్చటికై నను జనంగ నిచ్చిన నరకం
బచ్చు పఱచుచుఁ గుదియించినఁ
దెచ్చు సుగతి నరున కది

తిక్కన. భారత. అను. V-234

బలిమిమై నింద్రియంబులఁ బట్టి తెచ్చు
నది సుమీ యిందువదన ప్రత్యాహరణము

శ్రీనాథుఁడు భీమ. V-164

నిర్జి తేంద్రియులై నట్టి నియమ పరుల
నంత రాయంబు లేమిసేయంగఁ గలవు

శ్రీనాథుఁడు. హర. III-63

కడుపు చిచ్చు చేతఁ గామానలము చేతఁ
గ్రోధ వహ్ని చేతఁ గుటిల పడక
యుక్త మనసు తోడ నుండి నప్పుడె ముక్తి

వేమన

కడఁక తోన నరుఁడు కామంబు గట్టిన
చిత్తమునను జికిలి చిత్ర రూపు
కై వడి నిల నుండు ఘనుడాతడే సుమ్మి

వేమన

కడక నింద్రియముల గట్టివేయగ లేక
చావు వచ్చినపుడు సన్యసించు
నాత్మ జితముగామి నందునా మోక్షంబు

వేమన

కుశలతయే వ్రతముల నగు
నశనాయాస పీడ నింద్రియ నిరోధమునన్
గృశుఁడ వయి యాత్మ నలఁచుట
సశరీర స్వర్గ సుఖము సమకొని యుండన్

పెద్దన. మను. II-58

పంచభూతములకుఁ బది యింద్రియములకు
విషయములకుఁ జిత్తవృత్తులకును
దెలియఁ బడక తాన తెలివియై యన్నింటిఁ
దెలియుచున్న తెలివిఁ దెలిసి కొనుము

పుష్పగిరి తిమ్మన. సమీర. IV-114

కుముదంబుల కే శశియును
గమలంబుల కే రవియు వికాస మొసంగున్
స్వమనమటు జితేంద్రియులకు
విముఖంబగు బర వధువుల బిగి కౌగిలికిన్

కందుకూరి అభి. శా. V

పైఁబడి పులినడఁచు వాఁడు బంటుకాఁడు
పరుల నెల్ల గెల్చినవాఁడు బంటుకాఁడు
లోన బాధించు వైరుల లోను గాక
వాని నిర్జించు వాఁడె పో బంటు; బంటు!

పానుగంటి. బుద్ధ. III

పర పరిగ్రహా సంశ్లేష పరత కెందు
విముఖము జితేంద్రియుల మనోవృత్తి నిజము

కాంచనపల్లి కనకాంబ. అభి. శాకుం. V-పు.69

## జీవన్ముక్తి

పొలియుట బ్రతుకుట పోవుట
కలుగుటనే నతఁడు ననుట గలుగక మదిలోఁ
దలఁచిన యట్టి మహాత్ముం
డిల జీవన్ముక్తుఁడగు నహీన వివేకా

మడికి సింగన. వాసిష్ఠరామాయణము

మోక్షము గలదా భువిలో
జీవన్ముక్తులుగాని వారలకు

త్యాగరాజు. విష్ణుకీర్తనలు. 110

## జీవన్మృతుఁడు

దేవాతిథి పితృభృత్య జనావళులకు
నిడక కుడుచు నతఁడు జీవన్మృతుఁడు

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-432

క్షితిమీఁద బ్రతికి యుండియు
మృతిఁ బొందినవారు నిందలెనసిన వారల్
మృతిఁ బొందియు బ్రతికిన ఘను
లతి నిర్మలకీర్తి దేహులు.

పాపరాజు. ఉత్తర. రామా. VI-218

చెనక కొంకని వాఁడె జీవన్మృతుండు

తిమ్మయ. ద్విపద. భారత. అరణ్య.

## జీవలక్షణము

ఒకరినొరు గొట్టి యొకరు భక్షింతురు
వారినొరు మిత్తి వరుసఁగొట్టు

పెద్దచేపచేరి పిల్లచేపలజంపు
జనము పెద్దచేపఁ జంపు వేమ

వేమన

## జీవాత్మ: పరమాత్మ

చూచే చూపొకటి సూటిగుఱి యొకటి
తాచిరెండు నొకటైతే దైవమే సుండి
భావమే జీవాత్మ ప్రత్యక్షమే పరమాత్మ

అన్నమయ్య. అధ్యా. సం.

నేరమెల్లా జీవునిది నేరుపెల్లా దేవునిది
ప్రకృతి కాతుమదాను పరమాత్మఁడాతఁడు
సకలము నాతఁడు సత్తామాత్రముదాను

అన్నమయ్య. అధ్యా. సం.

లోకము దేవుని మాయ సాకిరిమాత్రమునేను
సర్వజ్ఞుఁడాతఁడు అంతరాత్మ యాతండు
ఆతనిబంట జీవుఁడ

అన్నమయ్య. అధ్యా. సం.

అన్నిటనీ జీవునికిని అంతర్యామీ దేవుఁడు

అన్నమయ్య. అధ్యా. సం.

పూర్ణమది పూర్ణమిదియుం
బూర్ణంబగు దానివలనఁ బూర్ణము పొడమున్
బూర్ణమగు దానిదే యగు
పూర్ణముగొని మిగులుచుండుఁ బూర్ణమె యెందున్

పరవస్తు వెంకటరంగాచార్యులు. ఉపనిషదనువాదము

ఎచటనుండి వచ్చితి నెటకేఁగెదనని
తలఁప దలఁ పంగఁ బరమాత్మ తెలియఁబడును
ఎవఁడ నేనని తర్కింప హృదయమందుఁ
దెలియఁ బడియెడు జీవాత్మ తెల్లముగను

విక్ర. దేవ.

నీవన నేనన వాఁడనఁ
గావేఱని తలఁప కాత్మగతి యొక్కండే
నీవును నేనును వాఁడును
దేవుని ప్రతిబింబమనుచుఁ దెలియఁగవలయున్

శ్రీపాద. భద్రాచల రామచరిత్రము. V-105

జీవుఁడన్ని కోర్కులు వీడ దేవుఁడౌను

వేం. క. అమృతసారము. పు. 4. 10

**జీవుఁడు**

చరజీవులకు నెల్లఁ జావును నొప్పిసరియె

పా. సోమన. బసవ. పు. 125

సంసారరంగములోనం బహురూపమాడు వెలయంగా జీవి

యథా. అన్నమయ్య

వ్రేగు పెద్దైన నోడవారిధిఁ దరింప
లేనిభంగి మనోభవాలీఢ వృత్తి
యగుచు నుండు జీవుండు భవాబ్ధియుత్త
రింపలేఁడిది నిజము

తిక్కన. భారత. శాంతి. V-535

విను రేఖామాత్ర పుఁజం
బ్రదుని యట్టుల జీవుఁడతని దుష్పక్షముఁబో

లినయజ్ఞానమున పగమ
మున బోధానందసాంద్రపూర్ణతఁ బొలుచున్

తిక్కన. భారత. శాంతి. V-130

విను జీవుండు సనాతనుఁ
డనఘుఁడు నిజకర్మవశత నధ్రువదేహం
బునుబొందు దేహపాతం
బున నెప్పుడుఁ జెడఁడతండు భూసురవర్యా!

ఎఱ్ఱన భారత. అరణ్య V-72

పుట్టి పెరుగుఁ బ్రాయములఁ జాలఁజెన్నొందు
ముదిమిచేతఁ జిక్కుఁ బిదపఁ జచ్చుఁ
బురుషుఁ డట్టి దెసలఁబొందు టదృష్టంబ

ఎఱ్ఱన. నృ. పు. IV 61

ఒక్కఁడే జీవుఁడు ఒడలు మోవని నాఁడు

అన్నమయ్య అధ్యా. సం

పులుసు నంజినఁగాని భూమిలో మిక్కిలి తీపు
తలపోయ నోటికిని తవుగానరాదు
వావిరి లోకపు మాయవలలఁ జిక్కినఁగాని
వేవేగ వెడలి ముక్తి వెదకఁడు జీవుడు

అన్నమయ్య అధ్యా. సం

నామమాత్ర జీవులము నడుమంతరాల వచ్చి
నేము గర్తల మనుచు నిక్కముగాక !

అన్నమయ్య అధ్యా. సం

ఏమో తెలిసెఁ గాని యీజీవుఁడు నేమపు నెర
విద్య నేరఁడాయె కపటాలే నేరిచెఁగాని జీవుడు
ఎప్పుడైన నిజసుఖంబెరఁగఁ డాయె

అన్నమయ్య. అధ్యా. సం

చుక్కలై యుండినవారు సురలైయుండినవారు
ఇక్కడ నుండి పోయిన యీ జీవులే
పాతాళ వాసులును పలులోక వాసులును
ఈతరువాత నుండిన యీ జీవులే
శరణాగతులు దక్కఁ జక్కఁ గారు జడులు

అన్నమయ్య. అధ్యా. సం

జీవుఁడించుకంత చేఁతసముద్రమంత

అన్నమయ్య. అధ్యా. సం

చిత్త వికారము జీవుల పాపము
పాము చెలిమి రంపపు సంసారము.

అన్నమయ అధ్యా. సం

సురలును జీవులే నసురలును జీవులే
ధరనిందుఁ బ్రకృతి భేద మే కాని
పొలఁతులు జీవులే పురుషులు జీవులే
తలఁప భావ భేదములే కాని
రాజులును జీవులే రాసి బంట్లు జీవులే
ఓజతో సంపద చెల్లే దొకటే వేఱు

అన్నమయ్య. అధ్యా. సం

ఏది తుద దీనికేది మొదలు
పాదుకొను హరి మాయఁబరఁగు జీవునికి

ఇన్నియును దిరు వేంకటేశు లీలలుగాఁగ
నెన్ని చూచినను తానెవ్వండు గాఁడు

అన్నమయ్య. అధ్యా. సం.

అంతటఁ జూచిన నాహార నిద్రలు
జంతురాసులకు సహజములు
సంతోషంబును సాత్త్వికగుణమును
శాంత చిత్తులకు సహజములు మనసున

అన్నమయ్య. అధ్యా. సం.

పుట్టుక జావును చావును
పుట్టుకయునుగాని జీవములకొక చోటన్
నెట్టుకొని యుండఁ జెల్లదు
ముట్టిన కర్మములు మూరి మోచిన కతనన్

వెన్నెలకంటి సూరన. వి. పు. VIII-373

లలి జీర్ణ వస్త్రము మొల్లక క్రొత్తచీర
వెలయఁ దాల్చిన మాడ్కి వినుము జీవుండు
అరయ వార్ధక మగు మేను విడిచి
సారెకుఁ జొచ్చు శైశవమైన తనువు.

తిమ్మయ. ద్విప. భారత. భీష్మ.

......దేహవికార మేమియును
జీవాత్మ సోఁకదు జీవుఁడద్వయుఁడు
నిత్యనిశ్చింతుండు నిత్య నిర్మలుడు
నిత్యసంకల్పుండు శాశ్వతుండతఁడు
జీవాత్మ చెడునకు జేకును గలఁదె

తిమ్మయ. ద్విప. భార. భీష్మ.

విద్యయబ్బువరకు విను చిదాభాసుఁడౌ
జీవుఁడు భవమందు చిక్కుపడును

అ. నారాయణదాసు యదార్థ రామా.

జీవుఁడాత్మఁజేరిన శాంతిఁజెందు కరణి
నదులనీ రబ్ధిఁ గదిసినం ద్వార శమించు

విక్ర. దే.

జుగుప్స

అనుమానపు బ్రదుకది రోఁతా
తన మనసెనయని కూటమి మఱిరోఁతా
అపకీర్తులఁబడి ఆడిక లోనై
అపవాది యాటయదిరోఁతా

తన గుట్టెల్లా నెఱిఁగినవారి ముందట
తనయెమ్మెలు చెప్పుకొనుట రోఁతా
వనితల ముందట వదరుచు వదరుచు
గనుఁగవ గాదని గర్వము రోఁతా
భువి హరిగతియని బుద్ధిఁ దలంచని
యవమానపు మనసది రోఁతా.

అన్నమయ్య. అధ్యా. సం

చేతకాని పనులు చేసితే రోత
నీతిమాలిన చోట నిలుచుంటె రోత

నేదునూరి గంగాధరం. సేకరణ : సెలయేరు

జ్ఞాతి

అలమికాని యొండొరుల ప్రో
పులఁ బ్రాపులనెలమి కలిమిఁబొందిబహు జ్ఞా
తులు నెమ్మిఁగూడి తామర
కొలని క్రియన్‌సిరికిఁ బట్టగుదురుజ్వాలుగై

తిక్కన. భారత. ఉద్యోగ. II-87

జ్ఞాతి జనంబులు దమలో నెట్టివారైన
నొప్పంగాని యన్యుల వలనం బరిభవంబు
దొడరి నప్పుడు దారొండురులఁ జేకొనకునికి లోకనింద్యంబు.

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-409

జ్ఞాతి శ్రీమంతుఁడగు నిజ జ్ఞాతిఁజేరి
యును గరంబు దరిద్రుఁడై యుండెనేని
నతఁడు చేసిన దురితంబు ననుభవించు
ననఘ శ్రీమంతుఁడతడుఁ దా నరయకునికి

కేతన. మార్కండేయ. III-165

ధనము విద్య కీర్తి దమలోన నొకనికిఁ
గలుగుటకు నసూయఁ గ్రాలువారు
నెడరు నేచువారు నెందు దాయాదులు కారె ?

అయ్యలార్యుడు. భాస్కర రామా. యుద్ధ. 137

జ్ఞాతి యుండంగ అగ్నితోఁ బనియేమి ?

శ్రీనాథుఁడు పల. వీ.

ఆతత జ్ఞాతి మాన్యత గలయట్టి
యేతటి సంసార మెన్న నెక్కడికి.

తిమ్మయ ద్విపద. భారత. ఉద్యోగ.

ఇహలోక పరలోక హితులు దాయాదు
లహితంబు వారికి నాచరింపుదురె.

తిమ్మయ. ద్విపద. భారత. ఉద్యోగ.

ప్రబల శార్దూలమును నమ్మవచ్చుఁ గాల
లేలి హాసంబు మెడఁదగిలించు కొనఁగ
వచ్చు నెదను గుంపటఁబూని పండవచ్చు
గాని దరిజేరనీరాదు జ్ఞాతి నెపుడు

పరమదుష్ట భీకర పరిపంథియైన
మన మరణమె కోరును గాని మదిని సర్వ
వంశనా శనమును జ్ఞాతివాఁడు గోరు
ధరను దాయాది కంటె భీకరుఁడు లేఁడు

పానుగంటి. విజయ. రాఘు. I

ఖ్యాతినిగన్న పూరుషుని గాంచిన జ్ఞాతుల మానసంబునన్
భూతల మందుఁ బావకుడు భూరిగ కాల్చుట నైజమే కదా

కోలాచలం శ్రీనివాసరావు. ద్రౌపదీ వస్త్రాపహరణము.

ఇంటిపేరు మాత్ర మేకమైనంతనె తగిన జ్ఞాతి యగునె తనకు.

తిరు. వేం. కవులు. గుం. సీ.

పురుషున కర్థ దాయాదులు దొరకుట సుకరంబుగాని
ధర్మదాయాదులు దొరకుట దుర్లభంబు.

తిరుపతి వేంకట కవులు. బుద్ధ చరిత్రము.

తన్ను ప్రక్కలోన నున్న బల్లెంబని
తలఁచు దాయ వచ్చి తలను ముట్టి

బాసచేసెనేని దోసిలియిడెనేని
విశ్వసింపరాదు విజ్ఞుఁడెపుడు

శ్రీపాద బొబ్బిలి. I-13

## జ్ఞాతివైరము

చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డుపడి వారితోడఁ గొట్లాడినైన
దాని నుడుపంగఁ జొర కున్న వానిఁ గ్రూర
కర్ముఁడని చెప్పుదురు కర్మకాండవిదులు.

తిక్కన భారత. ఉద్యో. III-242

మాను పగ వచ్చునే చంపరాని పగయు
అన్నదమ్ముల పోరాట మజునకైన

ధూర్జటి. శ్రీకాళహస్తి మాహాత్మ్యము. III-12

జ్ఞాతి వైరంబు వలనను సంభవిల్లు
క్రోధ శిఖి నిర్దహించును గులమునెల్ల
ఘన సమీరాహిత మహీజ ఘట్టనమున
గలుగు దహనంబు వన మెల్ల గాల్చినట్లు

కందుకూరి. ప్రబోధ చంద్రోదయము. V-80

ఒక్కచో బుట్టి పెరుగుచు నున్నవయ్యు
నొండొరుల పొడగిట్టక యున్నవకట
కలువ పూల్దమ్మి పూవులు కాలవశత
జ్ఞాతివైర ముండును పుష్పజాతికైన

చిలకమర్తి. గయోపాఖ్యానము. I-20

తన కులమువాఁడు పగతుఁడై దనరెనేని
తరుగు లేనన్ని కడగండ్లు దాపురించు

శేషాద్రిరమణకవులు. బాలనీతిశతకము. II

## జ్ఞానదానము

జ్ఞానము కేవల కృపన
జ్ఞానికి నుప దేశవిధిఁ బ్రకాశముసేయం
గానది సకల ధరిత్రీ
దానంబునకంటె నధికతర ఫలదమగున్

తిక్కన. భారత. శాంతి. IV-255

జ్ఞానం బొరులకు నొసఁగినఁ
దానెగడుం దీపమువలె

తిరు. వేం. కవులు. బుద్ధచరితము V-105

పాత్రుఁడగు బ్రాహ్మణునకుఁ బ్రపంచమెల్ల
దానమిచ్చుటకంటె నుత్తమము మోక్ష
మార్గమొకనికిఁ జూపుట మదిఁదలంప
ననిరి వేదాంత శాస్త్ర రహస్య విదులు

తనికెళ్ళ ప్రకాశశాస్త్రి. వేదాంతసిద్ధాంత ప్రకాశము.

## జ్ఞానము

వనటయనియెడు నగ్ని నెఱుక యనియెడు నీటనార్పుము

తిక్కన. భారత. స్త్రీ. I-92

జ్ఞానమ యింధనముగ వి
జ్ఞానాగ్నిం బ్రబలఁజేయ జరయు మరణమున్

నానావిధ దుఃఖంబులు
లేని యమృత మక్షరంబు లెస్సై తోఁచున్

తిక్కన. భారత. శాంతి. IV-317

జ్ఞానంబు దృష్టినరునకుఁ
గాని నయన హీను నడపుకరణియగునుఁ బ్ర
జ్ఞానవిహీనుని నడవడి
దీని నెఱుఁగ వలయు నెఱుక దెచ్చి కొనంగన్

తిక్కన. భారత. శాంతి. IV-298

జ్ఞానము ధర్మమున కధి
ష్ఠానము మూలంబు పరమ సంతోషము భ
వ్యానూన త్యాగము రూ
పానందము ప్రాఁకు దానికను వేదంబుల్

తిక్కన. భారత. శాంతి. V-339

జ్ఞానము సవిశేషస్థితి
దానికి నాశంబులేదు దానిఁ దెలియుటన్
మానాహంకృతి మమతలు
మానిన నిర్మలుఁడు మోక్షమార్గముఁ గాంచున్

తిక్కన. భారత. అశ్వమేధ. II-166

జ్ఞానాభ్యాసం బల్పం
బైన మహాపాతకముల హరియించును గం
జానదీపం బించుక
యైనను హరియించు గాదె యంధతమంబున్

శ్రీనాథుఁడు భీమ. V-87

జ్ఞానసంపదఁగాని మోక్షంబు లేదు
కర్మశతమున నేనియో నిర్మలాత్మ
జ్ఞానమనఁగ వేదాంతవిజ్ఞానమబల
యితర విజ్ఞానమజ్ఞానమెంచి చూడ

శ్రీనాథుఁడు భీమ. V 186

తానెపుడు శుచియౌట తప్పని విజ్ఞానము
కంచపు సంసారము గడచుటె జ్ఞానము

అన్నమయ్య. అధ్యా. సం.

విన్నగఁ బూర్వ జ్ఞానంబున సర్వేశ్వరుఁడగు
హరిఁదలపోసినను సన్నిధియగు సుజ్ఞానానంద ము
సత్యము సత్యంబది సుండీ!

అన్నమయ్య. అధ్యా. సం.

కనకపు టాసల గరళంబంటి న
నచిన విజ్ఞానము చెదరు

అన్నమయ్య. అధ్యా. సం.

పట్టితేఁ దన మనసు పరమాత్మఁ గనిపించు
చుట్టుకొంటే బంధమై సూడు సాధించు.

అన్నమయ్య. అధ్యా. సం.

మొదలే తెలియవలె మోసపోక మానవలె
పదిలపు యోగికైనా బ్రహ్మకైనాను
అలుగులపై బడితే నాయాలు దాఁకకుండునా
కలికి సతుల చూపు కాఁడ కుండునా.

అన్నమయ్య. అధ్యా. సం.

నిలిచిన దొకటే నిజమని
తెలిసిన తెలివే ఘనము.

అన్నమయ్య. అధ్యా. సం.

క్షితి దేహాలు ప్రకృతిఁ జెందిన వికారములు
మతినిది దెలియుటచే మహిత సుజ్ఞానము.

అన్నమయ్య. అధ్యా. సం.

గాజు కుప్పెలోనఁ గడఁగుచు దీపం బ
దెట్టులుండు జ్ఞాన మట్టులుండు
తెలిసినట్టి వారి దేహంబు లందును॥

జ్ఞానముద్రచేతఁ గనఁగ వచ్చెడి తళు
కదియె మదికి శ్రేష్ఠమనుచు మునులు
పలికి రద్దె తెలియఁ బరమార్థ మగునయా॥

జ్ఞాన మెన్న గురువు, జ్ఞానహైన్యము బుద్ధి
రెంటిసందు రిమ్మ జేచునపుడు
రిమ్మఁ దెలిసెనేని రెండొక్క రూపెరా॥

ఎఱుకలోన జగము నెందాక చూచిన
గుడికి బయలఁ ద్రొక్కి కొక్కెలడఁచి
సరికి బయలునంటి సంయమి గావలె॥
ఎఱుకకన్నను సుఖ మేలోకమున లేదు॥

ఎఱుకసాటి దెఱుక, ఎఱుకయే తత్త్వంబు।

ఎఱుక నెంచిచూడ నెఱిగించు చుండును
బరము దాఁకి చూడఁ బట్టువడును
గుఱికి బయలు జేర గుణరహితంబురా॥

ఎఱుక మఱపులందు నేమేమి తోఁచిన
సరికి గుఱియె కాదు సత్త్వమునకు
పరమ నిర్గుణంబుఁ బాటించి కనవలె॥

వేమన

జ్ఞానము జ్ఞానమునకు న
జ్ఞానమునకు గారణంబు జ్ఞానాజ్ఞానా
ధీనము విజ్ఞానం బగుఁ
గాన నరుం డెప్పుడు జ్ఞాని గావలయుఁ జుమీ

వెన్నలకంటి సూరన వి. పు. III. 140

ఈ జగం బెల్ల మిథ్యగా నెఱిఁగికొనుట జ్ఞానము.

హరిభట్టు. మత్స్య. I. 152

జ్ఞానంబు లేక యుశమున
కై నడపిన కర్మ మార్గమతి ముదమున వ
ర్త్యానీకమునకు ముక్తిని
దానముగా నేరదు.

హరిభట్టు. మత్స్య. IV. 53

.....జ్ఞానంబు నడఁచు
శిష్టు వాక్కుటి సిరికంటె వసుధఁ గలదె

భవానీశకవి. ధర్మ. VII–27

జ్ఞానమునఁ బూర్వ కర్మ సంచయము లెల్లఁ
దీఱునప్పటి కర్మము ద్వేషహితుల
కగును ప్రారబ్ధమను భూతమగుచుఁ దెగిన
జనుఁడు కైవల్య సామ్రాజ్య సౌఖ్యమొందు.

ధరణిదేవుల రామయమంత్రి. దశావతార చరిత్ర. I 223

బోధ లీలావిభవంబు చేతసకలంబును బ్రహ్మముగా నెఱుంగు.

కనుపర్తి అబ్బయామాత్యుడు. కవిరాజమనోరంజనము I-141.

జ్ఞానము వలనం జెడు న
జ్ఞానము కర్మమునఁ జెడదు జ్ఞానము నాఁబ్ర
జ్ఞానిలయ పరబ్రహ్మ
జ్ఞానము వేదాంత వాక్య జనితంబు సుమీ.
... ..ముఖ్యాధికారికి సంభవించు
జ్ఞాన విభవంబు గురుని ప్రసాద మహిమ.

లక్ష్మణకవి. రామేశ్వర. III

అల గ్రీష్మర్తువుచేతఁ బంకమునిరాహారమ్ము సూర్యోదయా
కలనన్ చీకటి మాడ్కి జ్ఞాన మొదవంగాఁ గర్మవిచ్ఛిత్తియా

పెద్దయకవి. మాఘమాహాత్మ్యము

పాలలో నేయి గూఢమై పరగు చుండు
నెల్లజీవుల జ్ఞాన మట్లే దహించు
గాని మధియించి మధియించి కడను గనుము
కదసి మనసను కవ్వంబు గదలద్రిప్పి.

దా. శ్రీ. దేవీభాగ. VII-840

నిజమెరింగిన వాఁడు నేమ మున్విడఁడు.

అ. నారాయణదాసు. వేల్పుమాట

జ్ఞాన మీఁతవంటిది యీఁదఁజాలువాఁడు
ముందునకు నిల్వనను వెన్కనందు నీఁదు
జ్ఞానము కుదురవలయునుగాని కుదురు
పిదపఁ గాలభేదము లేదు ముదిత మిన్న

పామగంటి. వనవాస. రాఘ. II

జ్ఞానమెంత మంచిదైన నకాలంబు
నందు దూష్యమగుట సందియంబె
సంతసమునఁ బెండ్లి జరుగంగ హరహరా
యనెడు పలు కవాచ్యమగును గాదె.

పానుగంటి. వన.

సంపదకుఁ గృషిరీతిగ జ్ఞానమునకు
ననుభవమె ముఖ్య సాధనమగునుగాదె.

పానుగంటి. బుద్ధ.

ఇదియె యాథార్థ్య విజ్ఞానమెద్ది లేక
పోవుట యవిద్య తమ మనః పూర్ణ వివిధ
సర్వబాధ లవిద్యచే జన్మమొందు
జ్ఞానమే సుండి మోక్షైక సాధనంబు.

పానుగంటి, బుద్ధ.

మనకున్ దక్కిన జంతుజాలములకున్
భావింప విజ్ఞానమం దొనరున్ భేదము

శ్రీపాద. బొబ్బిలియుద్ధము. IV-79

## జ్ఞానాజ్ఞానములు

జ్ఞానంబు నాశ్రయించిన
వానికి నేపనులఁ గీడు వాటిల్లదు ప్ర
జ్ఞానరహితుండు కామా
ధీనతమెయిఁ గర్మసమితి ద్రిప్పనఁ జిక్కున్

తిక్కన. భారత. శాంతి. V-326

అజ్ఞ జనునకుఁ గో అవిదయ్యంబులైన
వగును వాయు భేదములు విద్యాన్వితునకు
అజ్ఞునకంటను పామురా౹నయద్ది
ఛాయగాఁ గానఁ బడును విజ్ఞానికంట

పానుగంటి. బుద్ధ. III

జ్ఞాని

ఉత్తమ జ్ఞానవృద్ధునా నుండేనేని బాలుఁడయ్యును బూజ్యుడు

నన్నయ. భారత. సభా. III-25

పద్మ పత్రంబు నీరంబొందని యట్లెఱుక
గలవారినెట్టి యెడలను స్నేహంబు వొందదు

నన్నయ. భారత. అరణ్య. I-24

ఎఱుకగల మహాత్ముఁడెఱుక యన్జలముల
నార్చుఁగ్రోధమను మహానలంబు

నన్నయ్య. భారత. అరణ్య. I-222

జ్ఞానము గలఁడేనిన్ బాలుడయినఁగడు వృద్ధుమహిన్

నన్నయ. భారత. అరణ. III-248

జ్ఞానవృద్ధుఁడైన వానిమాటలు గదా
సభలఁ జెల్లు నార్యజనులకెక్క

ఎఱ్ఱన. భారత. అరణ్య. IV-201

తోలుదిగవిడచి నాగము
లీలఁ బొలుచు మాడ్కిఁ గర్మలేపముఁ దనతోఁ
గీలుకొన నీక వెలుఁగు ని
రాలంబన బోధఘనుఁడు

తిక్కన. భారత. శాంతి. IV-359

చుట్టము పగయను భేదం
బెట్టి జనులవలనఁ దగులదెల్లప్పుడు నె
ప్పట్టున నెద్దానను మదిఁ
బుట్టదు సంతోషహాని బుద్ధాత్మునకున్

తిక్కన. భారత. శాంతి. V–26

విను సుమతి విషయముల యం
దునికి గలిగెనేనిఁ బొందఁ దుదకంబులఁ బొం
దని బిసరుహపత్రము చా
డ్పున నది విజ్ఞానఫలము

తిక్కన. భారత. శాంతి. V-527

విమల విద్యాకుఠారము తత్త్వవిత్సాధు
జన సంగ పాషాణమున గరంబు
వాఁడిగావించి యెవ్వరు నఱకంగ నే
ర్తురు వెస నమ్మహాతరువు వారు

నిష్కంటకంబును నీరజస్కంబునై
రాజిల్లు చల్లని బ్రహ్మవనము
చొచ్చి నిత్యానంద సుఖలీల నపునరా
వృత్తి నందుదురందు

మారన మార్కండేయ. III-306

అభ్యుదిత మతులగు సనాథులఁ గదియునే యేవికృతులును

ఎఱ్ఱన. హరి. ఉ. భా. IX-29

దైవంబొకఁడే తత్త్వజ్ఞానికి
భావింపఁ బలువురు భ్రాంతునికి

వేవేలకు మఱి విత్తు ఒక్కటే అవి
కావంగఁ బూవంగ ఘనము

భువి సాకారము పూర్ణజ్ఞానికి
అవలనిరవయవ మధమునికి
ఈశ్వరశరణాగతియే శాస్త్రజ్ఞునికి
సర్వం గర్వమే జడునికిని

ఇరవై యెఱుంగువారి కిహామే పరము
అన్ని చదువులును నాతిని కొరకే
సన్నెరిగిన సుజ్ఞానికిని
శూరుఁడైన వాఁడేడఁ జొచ్చిన నడ్డము లేదు

జ్ఞానికి విధు లడ్డములేవు
దీపము వట్టి యొకడు తెగని చీకటి బాసి
చూపుల నిన్నిటి గని సుఖమందీని
అచ్చమైన జ్ఞానికి అంతా వైకుంఠమె
నిక్కమెఱింగిన మహానిత్యుండె ఘనుడు

అన్నమయ్య అధ్యా. సం.

జ్ఞానవంతునిఁ గడుకర్మసంబద్ధులు
వెఱ్ఱియంద్రు ప్రకృతి విడువలేక
వెఱ్ఱికనని ప్రకృతి వెదకినఁ గల్గునా॥

జ్ఞానియైనవాఁడు ఘన తేజమందును
బూని సుఖముఁబొంది పుట్టఁబోఁడు
తానె తానుగాను తనలోనె వెలుఁగును

వేమన

ఎఱుకువ గలవార లేది యెట్లైన
దల్లడిల్లరు బిగి దప్పరుల్లముల

నారాయణదాసు. వేల్పుమాట.

జ్ఞాని చేసిన కర్మంబు వానికేమి
కార్యమొసఁగదు లోకోపకారమగును

పానుగంటి. రాధాకృష్ణ

## డంబము

డంబములు పలుకువాని ని
జంబుగ దానమ్మొనట్టి జనుడరయఁగ జ్ఞా
నంబిసుమంతయు లేని మృ
గంబని యెంచుటకు నడ్డు కలదా!

డగ్గఱకుము పాపడాంబికులను నీవు
మోసపుత్తురయ్య దోసమనక

మేడి పండు చూడ మేలిమై యుండును
పొట్ట విచ్చి చూడ పురుగులుండు
బెరుకు వాని మదిని బింక మీలాగురా

దీవి లేదటంచు డెందంబులోనెంచి
జ్ఞాని నెఱుఁగ లేని మానవుండు
డాంబికునకు లొంగి డయ్యు రాకడపట

వేమన

పట్టె నామంబులు ఫాలభాగమునఁ
బెట్టిన వచ్చునే పెద్ద తికంబు

తాళ్ళపాక. తిరు. వెం. పరమయోగి.

మెప్పులకై బహు ధర్మముఁజేసిన
మిగులఁ బ్రోవఁదగునే?

త్యాగరాజు

లేని గొప్పఁజూపఁ బూని నల్లురి లోన
వాలకంబు వేయు వాఁడు చెడును

అ. నారాయణదాసు. నూరుగంటి

వాడు మొగమునకే పూఁత పసలు వలయు
నామహీనునకే వసనాల తళుకు
శక్తి హీనునకే స్వసంస్తవన పటిమ
సత్య హీనునకే ప్రమాణ జల్పనంబు

పానుగంటి. బుద్ధ. ౯

గుణి కంటె హృషీకేశా
గుణి వేషధరుండు దోఁచుగురుతరుని వలెన్
మణి వరము కంటెఁగృత్రిమ
మణిదగు రమ్యతర కాంతి మంతంబగుటన్

విక్ర. దే. వర్మ.

## తత్పరత

పరగిన సత్య సంపన్నుఁడైన వాఁడే
పరనింద సేయ తత్పరుఁడు గానివాఁడు
అరుదైన భూత దయానిధియగు వాఁడే
పరులు దానేయని భావించు వాఁడు

నిర్మలుఁడై యాత్మ నియతి గలుగువాఁడే
ధర్మతత్పరబుద్ధిఁదగులు వాఁడు

అన్నమయ్య. అధ్యా. సం.

## తత్త్వజ్ఞులు

సర్వమాత్మయటంచు సత్యంబుగా జూచు
వారెత త్త్వజ్ఞులు

వేమన

తిట్టికొట్టి రేని తిరిగి మాటాడక
యట్టునిట్టు జూచి యదరి పడక
తన్నుగాని యట్లు త త్త్వజ్ఞుడుండును

వేమన

గత జీవులకుం జనునె దుఃఖింపఁదత్త్వ సంవేదులకున్

ధరణి దేవుల రామయ మంత్రి. దశావతార చరిత్రము. IV-14

## తత్త్వము

......తత్త్వజ్ఞానము
దలకొనినన్ గర్మశమము దానై కలుగున్

తిక్కన. భారత. భీష్మ. I-202

మూర్తు లెందఱైనమూల మొక్కండె
బిందునాదకళాతీత భిన్న పరమ
తన్మయ శరీర మందు లే త త్త్వమగును

వేమన

తన్నుఁదాఁ దెలిసిన త త్త్వమేల ?

వేమన

కర్మమూలమే కాయము నిజ
ధర్మమూలమే తనయాత్మ
బహుభోగమయము ప్రపంచము
నిహితజ్ఞానము నిజముక్తి
అతిదుఃఖకరము లాసలు
సతత సుఖకరము సమవిరతి

పుట్టించిన దైవము పూరిమేపునా ?
పట్టిన పూర్వ కర్మము పాసిపొయ్యేనా ?
మెట్టిన సంసారము మెదిగిన పాటేచాలు
నొసల వ్రాసిన వ్రాలు నుసిగితే మాసీనా ?
ఉసురు తోడి సుఖము ఉండిన పాటే చాలు
ఏలిన వాఁడు శ్రీహరి ఏమిసేసినా మేలె

ఈ దేహవికారమునకు నేదియుఁ గడపలఁగానము
మోదమెఱుంగని మోహము ముందరఁగననీదు
నిత్యానిత్య వివేకము నీరసునకు నొనఁగూడదు
సత్యాలాపవిచారము జరగదు లోభికిని

తనవెంట వెంటఁ జనుఁదెంచేవారెవ్వరు ?
చేసిన పాపపుణ్యాలే కాక
పొగడించను దూషించను ముఖ్యులెవ్వరు ?
గుడిఁగొన్న తనలోని గుణాలే కాక
కఁడుగీర్తి నపకీర్తిఁగట్టెడి వారెవ్వరు ?
నడచేటి తనవర్తనము లేకాక
ఘన బంధమోక్షాలకుఁ గారణమిఁక నెవ్వరు ?
నవిచినజ్ఞానాజ్ఞానము లేకాక

ఎట్లయినా గురు వాక్యమేమరకుఁడీ
కాంతఁదలచు కొంటేనే కామోద్రేకముపుట్టు
ఇంతలోఁగూడెనా ? ఏడకీడు సూత్రము
చింతకాయతొక్కు చూచితేనే నోరూరు
ఎంత కెంత దవ్వు ? ఎడకీడు సూత్రము ?

పూనిన పురాణగోష్ఠి పుణ్యమూలము
మానిసి యాచారమాత్మకుఁబడ్డ పాటు
బలుచుట్టరికములు బట్టబయలు తగుళ్ళు
చెలఁగు నాచార్య సేవ జీవన్ముక్తి

తా ననియెడ బుద్ధి దైవంబందు నునిచి
తానే తనమఱతి మరచిన సుఖతత్త్వానందమిది

తా. అన్నమయ్య. అధ్యా. సం

చిల్లరరాళ్ళకు మ్రొక్కుచునుంటే
చిత్తము చెడురా వోరేవోరే
చిత్రము నందున చిన్మయజ్యోతిని
చూచుచునుండుట సరే సరే
ఒక్కపొద్దులని ఎంచుచునుంటే
ఒనగూడ జెడుదువు వోరే వోరే
ఏకమైన యావైభవమూర్తిని
చూచుచు నుండుట సరే సరే

పోతులూరి వీరబ్రహ్మముగారి కాలజ్ఞాన తత్త్వాలు.

సతముఁ దత్త్వవిచారంబు సలిపి సలిపి
మూలసూత్రంబు నెవ్వరైన ముట్టినారె

నేడు నిన్నట్లు రేపును నేటియట్లు
అందని ఫలంబు చేచాపనందు టెట్లు

దువ్వూరి రామిరెడ్డి. పానశాల

నాయది నేనను మాట పోలదీ
యందఱి నున్న యాత్మ యొకడన్నదె తత్త్వము

కాం. కనకమ్మ.

## తపస్సు — తపస్వి

ఎల్లబలంబులకు మిక్కిలి తపోబలంబ

నన్నయ. భారత. VII-109

తపస్సిద్ధులైన వారు దమతలంచిన దాని నశ్రమంబునం బడ
యుదురు

నన్నయ. భారత. అరణ్య. I-35

తపము నిధానము ధర్మ
ప్రపంచమునకెల్ల దానిఁగ్రమమున వ్రత తం
త్రపరాయణు లొనరింతు ర
ధిప ఫలమూలంబు వృత్తిఁదృప్తిఁబొరయుచున్

తిక్కన. భారత. శాంతి. III-413

వాకును మనసును గాయము
నేకాయన వృత్తి శౌచమెడలని తపముం
జేకొను నది యది బోధ
శ్రీకి ఘృతంబునకు వెన్నక్రియ జనకమగున్

తిక్కన. భారత. శాంతిపర్వము. IV-333

పరధర్మము నర్థంబును
సరసంబగు విషయ సుఖము సద్గతియుఁ దపః
పరిపాకమునన కలుగున్
నరునకుఁ దత్త్వద్విధాత్త నైపుణుఁడైనన్

తిక్కన. భారత. శాంతి. V-505

భోగములు సం పరిత్యక్తములుగఁ జేసి
కేవలాంగుఁడై నిర్మల భావయుక్తిఁ
దపము గృహమున నేనిఁ దత్పరత నాచ
రించి సంసారజలధిఁ దరించు నరుఁడు

తిక్కన. భారత. శాంతి. VI-299

ధీరుఁడు నిర్జితేంద్రియుఁడు తెల్లముగాఁదనుఁగాంచు భూతవి
స్తార నిరూఢమైన పరతత్త్వముగాఁ దనయందు భూతవి
స్తారము నెల్లఁగాంచు సతత స్ఫుట దర్శనుఁడై సమగ్ర చి
త్సారముఁబొంది నిర్మల తపంబుల యందు జరింపఁజేగడున్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-89

తపమనఁగ సకల విషయ
వ్యాపేత మగునట్టి బుద్ధి వైభవము సుమీ

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-90

క్షమయు నహింసయు సత్యము
సమతయు నింద్రియ జయంబు శమముఁబరిత్యా
గమును దపోలక్షణములు
క్రమమున నివి యన్నియును నూర్ధ్వగతికారణముల్

ఎఱ్ఱన. భారత. అరణ్య. VI-108

మనమును నింద్రియములవ
ర్తనమును సరిగా నొనర్చు ధర్మంబు దపం
బని చెప్పుదురు

ఎఱ్ఱన. భారత. అరణ్య. VI–124

శాపగరళాకరంబులు క్రోధంబు లేల తపోధనులకు

శ్రీనా. భీమ. IV–189

తపసి క్రోధియైన దయలేని వాఁడైనఁ
దాల్మి హీనుఁడైన దనకుఁదాన
దురితమునకు వట్టి దూఱుకుఁదానకం
బగుట దప్ప దెట్టి యధికుఁడైన

ద. దుగ్గన. నాచి. III-24

......లో వికారం బెల్ల
ధరుగకున్న వాడు తపస్వి గాదు

వేమన



తిట్టిన యప్పుడు దీవించినప్పుడు
అట్టి సమమగునది తపము
వట్టినేమములు వేవేలు సేసిన
బట్ట బయలే కాని ఫలము లేదు
ఇచ్చినయప్పుడు నియ్యని యప్పుడు
అచ్చుగ సవ్వినదది తపము
కూడినయప్పుడు గొణగినయప్పుడు
ఆడిక విడిచిన యది తపము

అన్నమయ్య. అధ్యా. ౨౦

తపము పండిన మీఁదఁ దాల్తురే జడలు

తాళ్ళపాక. తిరు. వేం. పరమ

తప్పనేటికి నేర్చుఁ దపసి మంత్రంబు

తిమ్మయ. ద్విప. భారత. ఆది. IV-216

అవ్యాజ తపంబు కన్న భువి
నాత్మ హితంబగు కృత్యమున్న దే

లక్ష్మణకవి. సుభాషితములు

శమము దమము బ్రహ్మ చర్యంబు శాంతియు
దాపసులకు సర్వధర్మములగు
నొక్క తఱినిఁ గోపముదయింప దుదయించె
నేని జగము లెల్ల హానిఁ బొరయు

పెద్దాడ నాగరాజామాత్య. శకుంతలా పరిణయము. II-5

తరణోపాయము

మమకార దూరంబు మనసు గెలుచుట కొఱకు
సమవివేకంబు శాంతముల కొఱకు
అరయగ లేదా ధ్యయనమదఁ బ్రహ్మశుద్ధి కొఱకు
ఇరవైన శాస్త్రంబు లెఱుక కొఱకు
తఱి యజ్ఞములు బుణ్యోత్తార మయ్యెడి కొఱకు
సరిలేని దానములు జన్మములకొఱకు

తా. అన్నమయ్య. అధ్యా. సం

తల్లికూతులు

తనయులకంటె బుత్రికలె దల్లికిఁ దద్దయు గూర్తు రందుచే
ననయము నాడు వారలకు నల్లునిపై ననురాగ మగ్గలం
బని బుధులందురు

చిలకమర్తి. గయోపాఖ్యానము

## తామసము

తలఁపులు గ్రందుగఁబొడముట
గలఁగను లేమియును భ్రమము గదురుట జాడ్యం
బలసత యను నీ భావం
బులు దామస కోటిఁ యుంద్రు బుధులు నరేంద్రా.

తిక్కన. భారత. శాంతి. IV-352

తామసం బుడిగిన తనకగ్గు జ్ఞానంబు
తామసమునఁ జేయఁదగ దెట్టి కార్యంబు

వేమన

## తారతమ్యము

తలఁపు కొలఁది దైవము
తనవల్లఁగల విరతి కొలఁది ఘన సుఖము
తెలిసిన కొలఁదే తేటల విజ్ఞానము
తపము కొలఁదియె తరువాత ఫలమును
ఉపమ కొలఁది యే యోగమును
ప్రపత్తి కొలఁది యే భాగవత భక్తియును
అంది వొందిన కొలందే యానందము

అన్నమయ్య. అధ్యా. సం

పూర్ణమైన తనదు భుజబల్మి జూడక
భువిని జెడుగు తోడ బోరరాదు

వేమన

తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్
మధ్యముల్

తమకై యన్య హితార్థ ఘాతుకజనుల్ దైత్యుల్ వృథాన్యార్థభం
గముఁ గావించెడు వార లెవ్వరో యెఱుంగన్ శక్యమే

ఏ. ల. కవి. సుభాషిత.

కలిమి గల లోభికన్నను
విలసితమగు పేద మేలు వితరణి యైనన్

గువ్వలచెన్నశతకము. 48

బంధములు తిట్లు దెబ్బలు ప్రజల కెల్ల
రకును గాలవశంబునఁ బ్రాప్తమగును
గాని కర్తను బట్టి యా కష్ట సమితి
ప్రబలమగు తారతమ్యంబు పడయుచుండు

పానుగంటి. చూడామణి–IV

తియ్యనగు మాటలనె ప్రేమఁ దెలుపు నతఁడ
ధముఁడు ధన మిచ్చి తెలుపమధ్యముఁడు కాయ
కష్టము నొనంగి తెలుపు నుత్కృష్టుఁడిట్టి
ప్రాణములనిచ్చు వాఁడెట్టి వాఁడొయహహా.

పానుగంటి. వన. రాఘ. IV

గొప్పవాఁడేయు దెబ్బకుఁగొలఁది బాధ
కొలది వాని ఘాతమునకు గొప్ప బాధ
పట్టెడగు పుట్ట తేలిచ్చు బాధ కొలది
చిమ్మటంతటి తేల్కుట్టి చీల్చివైచు

పానుగంటి. చూడామణి

నోరున్న కరుణకంటె
నోరుమాలిన ప్రేమ గంభీరతరము

పానుగంటి. మాలతి

పుర నివాసముచే మదిముడుచు కొనుచు
నిట్టి యిట్టి దేహము నందు నిమిడి పోవు
నాటవిక వాసమున మదియట్టె యట్టె
పొంగి జగదాత్మతో నైక్యమును లభించు
కృత్రిమ సుఖాళి మనసు మెప్పింప లేదు

పానుగంటి. కల్యా. రాఘ. IV

అనుకొన్నన్ బిక మానెకాకి? శునకంబావానె? యానే గజం
బెనుఁబో? తానోకొప్పిల్లి పెద్దపులి? యాయీజంతు నిష్ఠంబు సు
స్వనమున్ శుద్ధియు ధీరతాగరిమమున్ జండాతి చండత్వమున్
దన కేలాగు ఘటించు? వర్ణసమతన్ దత్తద్గతుల్ గల్గునే?

తిరుపతి వెంకటకవులు. గీరతము

పిఱికి పందలు నీచులు భీతమతులు
గుంపులై వీడి శత్రులగొట్టు చుంద్రు
కాకములు పిండు గట్టుక కావుమనును
శ్యేన మెప్పుడు వేటాడునేకి యగుచు

సురవరము ప్రతాపరెడ్డి. ఉచ్ఛలవిషాదము

## తీర్థము

తీర్థగమన ఫలంబెల్ల
పుణ్యంబులకు విశేషంబు

నన్నయ. భారత. అరణ్య. II-243

క్రతుఫలములు వడయఁగ దు
ర్గతులకు దొరకొనదు తీర్థ గమనంబునఁ ద
త్క్రతు ఫలములందుదురు దుర్గతులును

నన్నయ. భారత. అరణ్య. II-243

విదితముగఁ దీర్థ కీర్తనఁ
జదివిన ధన్యులకు వినిన సజ్జనులకు న
భ్యుదయమగు సర్వ తీర్థస
ముదయస్నాన బహు యాగముల ఫలములగున్

నన్నయ. భారత. అరణ్య. I-283

పదిలంబుగఁ దీర్థసేవభక్తిఁదలచినన్
విదితముగ దురితహరమగు

నన్నయ. భారత. అరణ్య. II-284

తీర్థములు మానసములు యుక్తిప్రదములు
తరుణి యివి మేలు బాహ్య తీర్థముల కంటె
మానవుండివియేమతి మధురవాసి
బాహ్యతీర్థములాడ నిష్ఫలము సూవె
తీర్థంబు సత్యమింద్రియ నిగ్రహముతీర్థ
మనసూయ తీర్థంబు వనరుహాక్షి
తీర్థంబుదానంబు తీర్థంబు సంతోష
మనుకంప తీర్థంబు కనకగౌరి
బహ్మచర్యంబు తీర్థంబు తీర్థముధృతి
యమము తీర్థము విద్రుమాధరోష్ఠి
సమత తీర్థంబు విజ్ఞానంబు తీర్థంబు
పుణ్యంబు తీర్థంబు పువ్వుబోఁడి
తీర్థములు మానసమ్ములు ధీవిశుద్ధి
యతిశయిల్లంగ నివియాడ కాడినట్టి
పంచజనులకుఁ గలహంస పక్షి గమన
బాహ్యతీర్థావలులు తీర్థఫలమునీవు

శ్రీనా. కాశి. III-72

బిసరుహ పత్రలోచన కృపీటములందుమునింగి యాడవే
మొసళులు మీలు కర్కటకముల్ గమఠంబులు వానికబ్బునే
యసదృశమైన తీర్థఫల మట్టివిధంబు సుమీతలంప మా
నసమగు తీర్థమాడని జనంబులకుం బహుబాహ్యతీర్థముల్

శ్రీనా, కాశీ. III-73

రాగదోషమలాపహరక్షమంబు
మానసంబైన తీర్థంబుఁ మందగమన
యవనిఁ బంకరజోవ్యపాయక్షమంబు
బాహ్యతీర్థంబు మేచకోత్పలదళాక్షి

శ్రీనా. కాశీ. III-75

## తెలివి

......అధికముగా
నేవానికిఁ దెలియువాని హృదయము సందే
హావృతమై వర్తించును

విక్రమదేవ.

తెలివి హెచ్చిన కొలఁది శోధించుకొలఁది
కష్టసంకోచ హేతువుల్ ఘనములగును

పానుగంటి. కోకిల. III

## తెలుఁగు

దేశభాషలందుఁ దెలుఁగులెస్స

రాయలు. అము. పీఠిక

తెలుఁగు మాట లనంగ వలదు వేదముల
కొలఁదియకాఁజూడుఁడిల నెట్టు లనినఁ

బాటి తూఁగునఁగను బాటియౌనేనిఁ
బాలింప సోలయుఁ బాటి య కాదె

పాల్కురికి సోమన. బసవ

జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు

పండితా. దీక్షా. 268

తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును
దాని వలనఁ గొంత గానఁబడియెఁ
గొంత తాన కలిగె నంతయు నేకమై
తెనుఁగు బాస నాఁగ వినుతి కెక్కె

కేతన. ఆంధ్ర భాషాభూషణము

కందువ మాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్పునది తెలుఁగు నకుం
బొందై రుచియై వీనుల
విందై మఱి కానిపించు విబుధుల మదికిన్

మొల్ల. రామా

జనని సమస్త భాషలకు సంస్కృత భాషధరాతలంబునన్
ఘనలలితార్థ గౌరవ వికాసి తెనుంగభిరమ్యమంతకున్

నాగలూట శివనారాధ్యుడు. పర్వత పురాణము

ప్రాస మంత్యంబ యౌ మహారాష్ట్ర భాష
నాద్య మౌనది గన్నడమందు నరవ
మందు ననయతి యును గలదిం దనిననో
యతులు ప్రాసంబు లధికములాదినినవి

కొక్కొండ. విశ్వే

తల్లి బాసఁజేసి తనరితి మార్యుల
నాంధ్ర మెంత యనుచు నందు లతు

నైకదృక్కులగుచు నేఁపు మీఱెడువారు
గోఁతఁగూలునట్టి కుంజరములు

కొక్కొండ. విశ్వే

తెలుఁగు తెలుఁగని యద్దాన దిగులె కాని
సంస్కృతమునకన్నఁ గష్టమ్ము హెచ్చు

తిరు. వెం. కవులు. నానా. రా. వం

జిలిబిలి పలుకుల బలు ము
ద్దులు గులికెడు తెలుఁగు బాసతో సరియగునే
తెలిసియుఁదెలియక పీనుల
నలయించెడు వెఱ్ఱిమొఱ్ఱి యఱ మొఱ బాసల్

వేటూరి ప్రభాకరశాస్త్రి. చాటువు

తేట వెన్నెల వెలుగులు తెలుఁగు నుడులు.

నాళం కృష్ణారావు. వెన్నెల వెలుఁగులు

## తేజము – తేజస్వి

అస్తగిరిఁబొందె రాజుదయాద్రి నెక్కె
నినుఁడు తేజస్వులగు వారి కెల్లప్రొద్దు
మానితంబగు నిల నొక్క మాట పొందు
హాని వృద్ధులు సూచించు నట్ల పోలె

వన్నెచోడ కు. సం. VIII-190

## త్యాగము - త్యాగి

గలదె పరిత్యాగ శీలునకు
నసాధ్య సిద్ధి యెందు

ఎఱ్ఱన. భారత అరణ్య. V-38

ఈవి లేకుండిన నెవరు వచ్చెదరు
వచ్చిన నారలు వశ్యులవుదురె

శ్రీనా. వల. వి. చ

పెట్టి పోయ లేని వట్టి నరులు భూమిఁ
బుట్టనేమి? వారు గిట్టనేమి?
పుట్టలోనఁ జెదలు పుట్టవా గిట్టవా?

తా మొరుల కొసంగ దమకదియే కల్గు

త్యాగ బుద్ధి యున్న నమరుఁడౌను

వేమన

రాజ్యంబు గలిగె నేనిం
బూజ్యులకును యాచకులకు భూమి సురులకున్
భాజ్యముగ బ్రదుకఁడేనిం
ద్యాజ్యంబులు వాని జన్మధన గేహంబుల్

పోతన. భాగ. VIII-564

కొలువక యిచ్చుట త్యాగము
కొలిపించుక యిచ్చు టెల్లఁగూలి పనింతే
కొలువునకుఁబసర మీఁదా?

వేటూరి. చాటు. మణి

కలదానిలోనె చాగము
సలుపుచు నిచ్చులును బీదసాదలనరయన్
వలయును

కం. వి. లిం. పం

త్యాగరహితుఁడు

దానకళాకలాప సముదంచిత సారవివేక సంపదన్
మానితయాచమానజన మానసవృత్త్యభి పూర్తిబుద్ధియె

వ్వానికి లేదొకింతయును వాఁడొకరుండు భరంబు ధాత్రికిం
గానలుగావు శైలములు గావు పయోధులుగావు భారముల్

శ్రీనా. శృంగా. నై. III-56

## త్రిగుణము

అరసి చూడసత్త్వంబు సుఖాత్మకంబు
సాంద్ర దుఃఖమయంబు రజస్సు బోధ
మాంద్యమూర్తి తమస్సు సమత్వమూఁది
యీయవస్థలఁ బొరయమి మాయపోక

తిక్కన. భారత. శాంతి. IV-125

కట్టిన చీరయునుం బైఁ
బెట్టిన చీరయునుమాళి బిగియూరంగాఁ
జుట్టిన చీరయుఁబోలెను
నెట్టన పొదివినది దేహిని గుణత్రయమున్

తిక్కన. భారత. శాంతి. IV-331

కర్మములకుఁ గర్తగాఁడాత్మ్యుఁడతని స
త్త్వము రజస్సు దమము వాత పిత్త
కఫములెట్లు మర్త్యకాయ గతములగు
నట్ల పొందుఁగర్త లవియ చూవె

తిక్కన. భారత. అను. V-139

ధర్మార్థకామగోచర
కర్మములకు సాత్త్వికాదిక ప్రకరవికా
రోర్మ్యులు హేతువులగు ని
ష్కర్మత కేతద్విధూతి కారణము సుఁడీ!

తిక్కన. భారత. అశ్వమేధ. I-129

అసుఖా కారత నిద్ర దైన్యము విమోహం బత్యుమత్వంబుఁదా
మసభావంబులు రాగలోభజడతామానంబు లూహింప రా
జసవృత్తంబులు ధైర్యశాంతి కరుణా సంతోషవిద్యాదు లిం
పెసఁగన్ సాత్త్విక చేష్టితంబులు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-97

అతి నిందితము తమోగుణ
మతిమోహమయంబు సత్త్వమనయంబుఁ బ్రకా
శత నొప్పు నుభయగుణ మి
శ్రతఁబరగు రజోగుణంబు సన్నుత చరితా

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-96

కలుగు జ్ఞానంబు సత్త్వగుణంబున్ గలుగున్ లోభము రజస్సునన్
గలుగుఁ బ్రమాదము మోహమజ్ఞానములు తామసగుణంబునన్

సదానంద గీతామాత

త్రిమూర్తులు

కర్మవితతికి నధికారి కంజభవుఁడు
భక్తి కధికారి యిందిరా వల్లభుండు
జ్ఞానమునకధికారి యీశానుఁడగును
వారి కృపలేక పడయరు వానిజనులు

విక్ర. దే. పర్మ

దండనీతి

దండంబు రాజునకుం బరాయణంబు

తిక్కన. భారత. శాంతి. III-3

గురుఁ దల్లిని దండ్రిని సో
దరుని నకారణము ప్రల్లదముఁ బల్కినము
ష్కరుచేత నూఱుపణములు
ధరణీశుఁడు గొనుటనీతి దండువు పేరన్

కేతన. విజ్ఞా. ప్రాయ. 43

చంపిన సరిలేదని చం
పింపందగునే ధరిత్రి బేదలనక తా
జంపెడి చోట విచారము
పెంపేనియు దలఁపవలదె పృథివీ పతికిన్

దశకు. X-95

కొంచెపు ఫణియైన కొట్టెడు కొరకు
ఘనమైన దండమె కావలెఁగాని
కూడదు సన్నని కోలలకొట్టి
తప్పైనా తమకాన దరుముకవచ్చు

శ్రీనా. పల. వీ. చ.

తగువును ధర్మంబుఁ దప్పిన మీఁదఁ
దగఁ జూచి గురునైన దండింప వలయు

రంగ. రామా. అయో. 114

నలి సామభేద దానంబులు సూపఁ
గలిగిన దండంబు గాదు పాటింప

రంగ. రామా యుద్ధ. 433

.. .. శిక్షింపఁ గలవా రుపేక్ష
చేసిన దోషంబు సిద్ధించు

గౌరన. నవనాథ. 246

దండార్హుల దండింపమి
దండానర్హులగు వారి దండించుట యీ
రెండు నకీర్తిదములు భూ
మండలనాయకుల నిరయమగ్నులఁ జేయున్

సూరన. కళా. VII-296

.. ...దండోపాయ నియతిఁ
గాని భూప్రజ రాజుఁ గైకొన రెపుడు

తిమ్మయ. ద్విప. భార. ఆది.

తగిన దండము చాలు ధరణికినైనఁ
దగని దండము చెల్లుఁ దనవారిచోట

తిమ్మయ. ద్విప. భార. ఆది.

కులకంటకులఁ బోని కుటిలవర్తనులఁ
బొలియింపకుండుట భువి ధర్మహాని

తిమ్మయ. ద్విప. భార. ఉద్యోగ.

దక్షుఁడై భూపతి తగ దండనీతి
వీక్షింప కున్న నీ విశ్వంబు లోనఁ
దరమడి యన్యోన్య ధనధాన్య దార
హారణంబు జనులెల్ల నాదరింపుదురు
ఆ పాపజాలంబుల వశంబు నొందు
భూపాలు

......దండ మొప్పాదు హింసయనఁగ
వలదు దుర్వృత్తుల వధియించు ఋదు
జలజాక్షు వాసవు శర్వాజుఁ జూడు

ఒండొండ వారలు సన్మార్గచరుల.
దండింప వినమె

......అధర్మంబు లణఁగు
ధర్మములే వర్ధిల్లు దండంబు నందు
ధర్మంబు వలననే ధరణి వర్ధిలును
తగ దండనీతి యంతటికిని రక్ష

......వేదాది వృత్తములే దండ
నీతిమానినఁ జెడు నిక్క మెంతయును

సోమన. ద్విప. భార. శాంతి

......తప్పుల కొలఁదు
లరసి దండింపు ము

సోమన. ద్విప. భార. ఆశ్రమ.

పాపాత్ముల దండింపని
క్ష్మాపతికా పాపమునను షడ్భాగము సంప్రాపించు
దండింప దగని సుజనుల
దండించిన దండమునకుఁ దగు. దుర్జనులన్
దండింపకున్న ధరణీ.
మండలపతి నరక కూపమగ్నుఁడు గాడే

పావరాజు. ఉ. రా. VII-317

కుమారుఁడంచు నృపశేఖరు లోర్వరు మీర మీఱినన్

పావరాజు. ఉ. రా. VII-325

దాసుని తప్పులు దండముతోఁ దీఱు

రామదాసు చరిత్ర

దండ దాసరి తప్పునకు నొక
దండమనఁగా వినవా

దినవహి అహోబలకవి. గరుడాచలము. 45

పాపముల నొప్పుకొని యీ ప్రపంచమందు
నర్హశిక్షనుగను నరుఁ డచట మరల
శిక్ష నొందఁడు

పానుగంటి. కాల్యా. రాఘ. IV

భువిని పాడు సేసెడు వారు పురుషులైన
నేమి స్త్రీలైన నేమి ? శిక్షింపవలయు

పానుగంటి. కాల్యా. రాఘ. IV

......శిక్ష లేక
యున్న రాష్ట్రంబులన్నియు మన్నుఁగలియు
సృష్టియంత యిట్టెతలక్రిందు పడును

పానుగంటి. వన. రాఘ. IV

ఎప్పట్టున లాలనంబునకు పాత్రులు
శిక్షకు లొంగు వారలే

కాం. కనకమ్మ

## దయ

అమరఁగ దాక్షిణ్యము ధ
ర్మమునకుఁ గుదురంద్రు కీర్తి మహిమ నెలవు దా
నము సత్యము సురపురి మా
ర్గము శీలము సంశ్రయము సుఖంబుల కెల్లన్

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-442

అరయదాపత్రయా హితంబఖిల జగము
నిట్లు పుట్టిన గొఱలిన యెడయు చున్న
జీవులకు నొక్క కీడును జేయఁదగునె
చనదె దుఃఖశీలురదెసఁ గనికరంబు.

ఎఱ్ఱన. నృ. పు. IV-80

పాపి దెసఁ గరుణసేయుట పాపంబు

ఎఱ్ఱన. హ. వం. VIII-176

దయఁబోలవధ్వరంబులు
దయఁబోలవు వివిధ భూరి దాన చయంబు
ల్దయఁ బోలవు జపతపములు
దయతలపోయఁగ విశిష్టతమ ధర్మ మిలన్

మారన. మార్కం. పు. IV-269

కలిమి గల్గనేమి? కరుణ లేకుండిన
గలిమి తగునె? దుష్ట కర్ములకును

వేమన

క్రియ యెరఁగని వారు కీడు సేసితేఁ దాను
దయఁజూచుటే హరి దాస్య ఫలము

అన్నమయ్య. అధ్యా. సం.

దయా విహీనతన్
జేసిన పుణ్యముల్ ఫలము చెందునె

పెద్దన. మను. II-72

కృపఁగల్గియుండు దుఃఖితులయందు

శ్రీధరమల్లె వేంకటరామకవి. బ్రహ్మోత్తరఖండము. IV-91

ఆరయఁ గారుణ్య సమో
దారగుణం బొండు లేదు ధరణీస్థలిలో
గారుణ్యమె భూతలమున
జారుగతిన్ నరుని దేవసన్నిభు జేయున్

కందుకూరి. దక్షిణగో.

దయయే సత్య వ్రతమగు
దయయే దానముల పెద్ద

దా. శ్రీ. దేవీభాగ. II-35

గోదాన శతంబైనన్
భూదానము సాటి యవ్వి నూరైనన్ గ
న్యాదానము సరి యవి నూ
రై దయతో సాటివచ్చు

దా. శ్రీ. దేవీభాగ. V-367

కాలముబట్టి యవకాశ కలనఁబట్టి
యితర కర్షణ శక్తులా నెగుడు దిగుడు
దయయె సర్వదా తదబాధితంబటంద్రు
దయయె నరులోన దైవతత్త్వంబు గాదె

పానుగంటి. కల్యా. రాఘ. III

కృపగల యెడకుఁగాళ్ళు క్రేళ్ళుదాటు
కన్నులుట్టూట లూరుచు గంతులిడును
ధరణి కలరు నాకర్షణ ప్రధిమకంటె
దయకుఁగల దెక్కువగుఁగాదె తాపసేంద్ర

పానుగంటి. కల్యా. రాఘ. III

తానొరునిఁ గావ నొరుఁడును దన్నుఁ గాచుఁ
గానఁ గనికర మెల్లడ నూనవలయు

ఆ. నారాయణదాసు. మారుగంటి.

పరార్తిచాలితంబై నవనీత మార్దవము
నందనిచో నది మానుషాత్మయే?

దువ్వూరి. వనకుమారి

## దయాళువు

దయవాడని తెలిసి మనసు
నొప్పించితే తరుణి దోసము కాదటే

క్షేత్రయ పదములు

## దరిద్రుఁడు

మరణమైనం జాలు మంచిది యంచు
తగ దెంపొనర్తురు దారిద్ర్యయుతులు

శ్రీనా. పల. వీ. చ.

తన యొడలంగల నెత్తురు
ధనహీనుని విడిచి పోవు దారాదిసుహృ
జ్జనములు విడుచుట యరుదే
మను పీనుఁగు నిర్ధనుండు మదిఁ బరికింపన్

జక్కన. విక్రమార్క. II-172

మృతిఁ జెందిన జనునైనను
హితులెల్లను డాయుదురు మహీస్థలిలోనన్
మతిఁ దలఁపఁ బేదఁ జేరరు
బతిమాలిననైన సఖులు బంధులు నెపుడున్

దూ. నా. పంచతంత్ర. II-104

పేదవాని బాధ పెనుభూతమైయుండు
చూడలేనిబాధఁ జూడవశమె
కలుగువానిబాధఁ గనులఁజూడఁగలేమి
కేమిచెప్పవచ్చునింక వేమ

వేమన

పేదఱిక మంతదోషం
బేదోయీజగతిలోన నీశ్వరుఁడెఱుఁగుం
బేదను బొడఁగనువాఁ డది
కాదను శవమనుచుఁ జూచుఁ గదరా వేమా !

వేమన

ధనహీనుఁ డధముఁ డల్పుఁడు
ధనహీనుఁడ మూఢుఁ డప్రధానుఁడు ధర న
ద్ధనహీనుఁడు తలపెట్టిన
పనిగ్రీష్మసరిజ్జలంబు పగిది నడంగున్.

బై. వేం. పంచతంత్ర. III

ఉద్ధతులమధ్యమునఁ బేద కుండఁ దరమె

నృసింహ. కవికర్ణ. III-26

కలితి దుకూల వస్త్రములు గట్టిన నీకును జీర్ణవల్కలం
బులు ధరియించు మాకును బ్రమోదము తుల్యము లేదు వాసి అ
గ్గల మగు తృష్ణ యెవ్వనికి గాఢదరిద్రుఁడు వాఁడు లేమియుం
గలిమియు లేవు సమ్మద వికస్వరమానసులైన వారికిన్

లక్ష్మణకవి. సుభాషితములు

ద్రవ్యమెంతున్న దన చరిత్రంబులేని
యతడె పో పేదయన ధనచ్యుతుఁడుకాడు

తిరుపతి వెంకటకవులు. మృచ్ఛకటికము

పాడువడ్డయిల్లు మోడైన చెట్టు నీ
ళ్లేని నూయి ధనములేని నరుఁడు
విస్మరింతు రాత్మవృత్తము పరిచితు
ల్గూడినపుడు వేడ్క గూలిపోవ

తిరుపతి వెంకటకవులు. మృచ్ఛకటికము

జనులకుఁ బేదవాని యెడ జాలియు గౌరవముండునే

కొప్పరపు సుబ్బారావు. వసంతసేన

## దాంపత్యము

విను సౌభాగ్య సమేతుఁడు
మును నిజదారైక పరుఁడు ముందటి జన్మం
బున భార్యకుఁ బ్రీతి యొన
ర్పని మనుజుఁడు సుభగతా విరహితం బొందున్.

తిక్కన. భారత. అను. V-94

మెలఁతకుఁ బతిపై నైనను
మెలఁతుకపైఁ బతికి నైన మేలగు టెందుం
గలయది మెలఁతకుఁ బతికిన్
వలపు సమం బగుట జన్మవాసన చెలియా

పెద్దన మనుచరిత్ర. VI-36

వనితా వల్లభ జీవితంబులు సఖీ
వాక్య స్థితంబుల్గదే

భట్టుమూర్తి. వసు. IV-107

పతి దన యేడు గడయగాఁ
బతియూనతి మాళ్ళఁబూని పతిచిత్తంబే

గతి నుండునట్లు మెలఁగెడు
సతి గల్గినఁ బుణ్యగతి సుసాధ్యము పతికిన్

అనంత. భోజరాజీయము. IV–278

కులశీల రూప గుణములు
గలిగిన సతి భార్యయగుచుఁ గనుసన్నల ని
చ్చలు మెలఁగ నుండు పురుషుని
చెలువము చెలువమ్ము గంధ సింధురగమనా

శంకర. హరిశ్చంద్ర. IV–49

తలఁపు లొక్కటి గాఁగ నగ్గలపు వలపు
చెలిమి కలిమిని దొలఁకక కలసి మెలసి
భువిని క్షీరోదకన్యాయమునను వెలయు
దంపతులు చేసినట్టిదేతపము తపము

శశాంక విజయము II–135

చిగురాకు బోండ్ల కెల్లను
మగఁడే మారంగ మేటి మక్కువ తోడన్
సగమేన నిల్పుకొన్నను
సిగలో నిడుకొన్న నైన చెల్లు గదమ్మా

కూ. తిమ్మకవి. శివలీలా విలాసము II–170

ఇల బతుల చిత్త వృత్తులు
కలయికలం దెలిసి మెలఁగు కాంతల కెలమిం
జెలు వొనరు జయము చేకురు
నలఘు శ్రీ సౌఖ్యమబ్బు

అయ్యల. నారా. హంసవంశతి

మగువ తుల్యుఁడైన మగని తోఁగూడిన సుఖము గల్గును

దా. శ్రీ. దేవీభాగ. VII–160

తరుణి మానికంబు పురుషుండు కనకంబు
వేఱు వేఱ నేమి వెలయఁగలవు
సముచితముగ నుభయ సంయోగ మొప్పిన
వాని కాంత నపుడు పలుక వశమె

మబ్బరాయకవి. నరసింహ విలాసము

కష్టసమయంబులను సుఖకాలమందు
నండగా నుండవలె గాదె యతివ పతికి

కూచి నరసింహం. రూపవతి

ప్రియ సఖని బోలె శిష్యగా గృహదీపకళిక గాను
దయదొలంకవివిధ భోగ దాతృ కల్పలతగాను
అయముగా నవనవరక్తి నర్థాంగ లక్ష్మి నెప్డు
బ్రియు డఖల జన్మసతి గన్న వేలేంద్రభోగమేలా

వేదము. వేంకటరాయశాస్త్రి. ఉపానాటకము

పతిని కూడి చరించెడు సతికి నరక
మైన స్వర్గంబు కైవడి నలరు గాదె

సెట్టి లక్ష్మీనరసింహం. చిత్రహరిశ్చంద్రీయము

## దాత

అడిగిన నిచ్చు కంటెను నయాచకుగాఁగ నెఱింగి యిచ్చు టె
క్కుడు ఫల మిచ్చు దానవిధ కోవిద! వేడుట చావు, వేడఁగాఁ
బడుటది పెద్దచావుదగు ప్రార్థనఁ బూర్ణము నేయునాతఁ డా
యడిగిన వానిఁ దన్నును దయారతిఁ గావఁగఁ జాలువాఁ డగున్.

తిక్కన. భారత. అను. II-26

చేయు టెంతయు మేలైనఁ జేసి పిదప
వగచినట్టి దానముఁ దనుఁ బొగడికొన్న

దాన విధి నిష్ఫలంబులుగాన రెండు
నుడుగు దాత మహాఫల మొందఁగాంచు

తిక్కన. భారత. అశ్వ. V-180

అడుగకయమున్న యీ విభాగ్యంబు గాదె
వాంఛనెఱిఁగియు నర్థార్థి వచన దైన్య
మాత్మ సహియింపఁజాలు వా డధమదాత

శ్రీనా. శృం. నై. III-53

కటికతనంబు మాన్చి చటుకాకు విడంబముఁగూర్చి లజ్జనం
కట పడఁజేసి యర్థిఁగడుఁగాఱియ పెట్టిన పాతకంబు న
క్కటతలఁగంగఁజాలు నొక కాలవిలంబమునా చరించి పి
మ్మటఁ దదభీప్సితార్థము సమర్పణ సేయు ప్రదాత యెమ్మెయిన్

శ్రీనా. శృం. నై. III-54

పరమ పాతివ్రత్య పరిపాటి పాటించు
తరుణి కంటె మహి ప్రదాత పెద్ద

శ్రీనా. భీమ. V-64

స్వామిహిత మొప్పఁగను సం
గ్రామమునన్ శర పరంపరలు పయిఁగురియం
గామృతిఁబొందిన శూరుఁడు
భూమిాదాతకుఁ బ్రభావమునఁ గట్టు వడున్

శ్రీనా. భీమ. IV-66

తండ్రిసొమ్మదైన దాయాది సొమ్మైన
బరుల సొమ్ములైన బ్రాప్త ధనము
దయను దీనులకును దాన మిచ్చిన వాడె
బహుళ పుణ్య జనుడు

నిరుపేదల రక్షించెడి
(?)రసుడు నెఱదాత

దాన గుణము లేక దాత యగునె ?
దాత యోర్చునట్లధముఁడోరువఁగ లేఁడు

వేమన

ఎలమి బ్రదుకనిచ్చు నెనసిన వారికి
దేహమెల్లభంగిఁదీపు గాదె ?
యచ్యుతుండు వచ్చి యర్థించెనేనియుఁ
దన్ను నిచ్చునట్టి దాత గలఁడె ?

సింగయ. భాగవత VI–354

భ్రాంతినడుగు చోటఁ బ్రాణంబు లేనియు
నిచ్చువాఁడు దాఁపడిచ్చుఁ గాని

సింగయ. భాగవత VI–358

ఏపున సంచితార్థము పరేంగిత భావ మెఱింగి యీఁగి మే
లై పొగడొందనిచ్చి నెఱ యన్మఱచు న్నెఱ దాత యిట్టి చో
దాపయిత్రు ప్రబోధ వశ తంబొనరించి యనంతరంబు సం
తాపము నొందువాఁడధమ దాత వృథాలపితంబు లేటికిన్

బైచరాజు వెంకటనాథకవి. పంచతంత్రము

పాత్ర సయోజన ప్రతిభగల్గినఁగాని
ధన మొసంగినఁవాఁడు దానశాలి

అడిదము సూరకవి. రామలింగేశ శతకము

గాంభీర్య వం

తులు దారిచ్చిన యీవి తమ్ము దొరయన్‌లో నుబ్బగా నేర్తురే

తిమ్మన. సమీర. II–96

తాత్కాలిక దాత కెయ్యెడల శశ్వత్కీర్తి సంధిల్లునే

ధరణి దేవుల రామయమంత్రి. దశావతార చరిత్ర

మబ్బు విడి నేఁడు రేపని
సబ్బిడు లెడ బొంకి బొంకి సడినొందక బల్
గొబ్బున నిచ్చినవాఁడే
యబ్బుర మగు దాత...

యాజ్ఞవల్క్య చరిత్ర II

నెలకొని రణములో నిలవచ్చుఁ గాక
నిలుపవచ్చునె యర్థి నిలిచి వేఁడినను
అడుగ నేటికిఁ దనయడుగు వారైన
నడుగు వారలఁగన్న నవశుఁడౌ దాత

తిమ్మయ. ద్విప. భార. అరణ్య

## దానము

ఇచ్చునది ధనము పాత్రున
కచ్చుగనొరు వేఁడ కుండునది యభిముఖులై
వచ్చిన యాశార్థుల వృథ
పుచ్చక చేయునది సర్వభూత ప్రీతిన్

నన్నయ భారత. అది. III–204

పాడిదప్పకుండఁబడయు సొమ్ములకున
పాత్రములకు నీగి పాత్రములకుఁ
బెట్టకునికి యనఁగ నెట్టన రెండు వి
ధములఁ గీడు దొడరు ధరణినాథ

తిక్కన. భారత. ఉద్యో. II–43

కలయట్టివివిధార్థములు సశేషం బుగఁ
దగ నొసంగుండు సత్పాత్రములకు

తిక్కన. భారత. ఉద్యో. II-127

పునుకఁగుక్కతిత్తిఁబోసిన పాలునీ
ళ్ళధిక నింద బొరయు నట్లు దుష్ట
మై యపాత్ర విషయ మగు నీగి వృథ వోవు
నిచ్చు చోట బాత్ర మెఱుఁగవలయు

తిక్కన. భారత. శాంతి. I-331

అడిగిన నిచ్చుకంటెను నయాచకుఁగాఁగ నెఱింగి యిచ్చుటె
క్కుడు ఫలమిచ్చు దాన విధి కోవిద! వేడుట సావు వేడఁగా
బడుటది పెద్ద సావు దగు ప్రార్థన పూర్ణము సేయునాతఁడా
యడిగిన వానిఁదన్నునుదయారతిఁ గావఁగఁజాలు వాఁడగున్

తిక్కన. భారత. అనుశాసనిక. II-343

తిరిసి యేనియు నన్నంబు దెచ్చి శిథిలు
లైన విప్రుల యాఁకలి యుపహరించు
పురుషుఁడూర్ధ్వలోకంబుల పురుష వరుల
కర్చనీయుఁడై వెలుఁగుచు నందయుండు

తిక్కన. భార. అనుశాసనిక. IV-272

చేయుటెంతయు మేలైనఁజేసి పిదప
వగచినట్టి దానము దనుఁబొగడి కొన్న
దాన విధి నిష్ఫలంబులు గాన రెండు
నుడుగు దాత మహాఫలమొందఁగాంచు

తిక్కన. భార. అనుశాసనిక. V-189

పురుషత్వము లేకంతః
కరణంబున శుద్ధిచాలఁగలిగి ప్రియము పొం

పిరి వోవఁజేతఁదానము
పరమోత్కృష్టంబు

తిక్కన. భార. అనుశాసనిక. V-212

వినుము ప్రభూత దానములు
విశ్రుత యజ్ఞములన్ సధర్మతా
వినుతికి నెక్కఁ జాలవు వి
వేకనిధీ పరిశుద్ధి శోభితా
ర్జనమునఁదెచ్చి కొన్నది ప
రంబగుఁబాత్రము సర్వకాలముం
గని లఘు వస్తువేసి నొసగం
గనుటుజ్వలధర్మమారయన్

తిక్కన.భారత. అశ్వమేధ. IV-246

అన్యాయార్జిత మైన విత్తమునఁ జేయంబూను దానంబు మూ
ర్ఖన్యాయంబది దానఁజేసి ఫలపాకం బేమియున్ లేదు యు
క్త న్యాయార్జిత మించుకంత యయినం గాలంబు దేశంబు స
మ్మాన్యంబై తగఁ బాత్ర యోగమున సౌమ్యంబై
ఫలించుందుదిన్.

ఎఱ్ఱన. భారత. అరణ్య. VI-112

వగచెడి దేహికైన పరవాసికి నైనను నర్థికైనను
దగిన ధనంబు నైన నది దప్పిన నించుక సన్నమైన నుం
దెగువను దక్రమైన మఱి దీనత గల్గిన నంబలైన ని
మ్మగు దయ నివ్వలేని నరమాత్రులు చచ్చిన నున్న నొక్కటే

శరభాంకుడు. శరభాంకలింగ శతకము

దాన కళాకలాప సముదంచిత సార వివేకసంపదన్
మానిత యాచమాన జన మానసవృత్త్యభిపూర్తిబుద్ధియె

వ్వానికి లే దొకింత యును వాఁ డొకరుండు భరంబు ధాత్రికిన్
గానలు కావు శైలములు గావు పయోధులు గావు భారముల్

శ్రీనా. శృంగార నైషధము.

హాటక పీఠికాధవళ హర్మ్యము దావళ శంఖకాహళీ
ఘోటసితాత పత్రములు క్రొత్త మెఱుంగులు వోని భామినుల్
మేటి ధనంబు వస్త్రములు మేటిసి యీఁగికి నెంచి చూచినన్
సాటికి రావు

శ్రీనా. భీమ. V-66

ఆర్తి నిచ్చు దానమ్ము పరిగ్రహింపఁ దగునా

పిల్ల. పిన. జైమిని. VII-227

దాన మీని వాడు ధన్యుండు గాడయా

దాన మడుగు వాడు ధరలోన నధముండు
దాన మడుగనతడు దైవ సముడు

ద్రోహబుద్ధి నింక దొంగరికమునను
నటల నైన సాహసమున నైన
సంపదధికు వలన సాధించి ధనమును
బడుగునకు నొసంగ బాగు వేమ

భిక్ష కాసిని పిలిచి
భిక్ష పెట్టిన వాడె మోక్ష పరుడు

కలిమి జూచి యియ్య కాయమిచ్చిన యట్లు
సమునకియ్యనది యు సరసతనము
పేదకిచ్చు మనుపు పెన వేసినట్లుండు

చెలగిగృహము ధనముక్షేత్రముద్విజులకు
దానమిచ్చునట్టి ధర్మపరులు
బహుళ కాలమిలను పాలన చేయుచు
నింపు భోగములను నందు

వేమన

ఏదానమున నాశమే తెంచు నదియును
దానంబు గాదండ్రు తత్త్వవిదులు
చేటుఁగొఱఁతయు లఘిమయుఁ జెందకుండ
నిచ్చు పురుషుండు సెడకుండు
ధాత్రిని హాలికునకును సు
క్షేత్రము బీజములు నొకటఁ జేకుఱు భంగిం
జిత్రముగ దాత కీవియుఁ
బాత్రము సమకూఁడునట్టి భాగ్యముగలదే ?

పోతన. భాగ. VII-580, 582, 589.

దానమునఁగల్గు పుణ్యము
దానముననె కీర్తి నిలుచు దర్పితులెల్లన్
దానముననె వశు లగుదురు
దానమునకు నధికమైన ధర్మముఁగలదే

హరిభట్టు. మత్స్యపురాణము

న్యాయార్జిత ధన మర్థుల కొసఁగు టొప్పుదానంబనఁగన్

సూరన. కళా. V-152

ఇయ్యఁగనిప్పించఁగల
యయ్యలకే కాని మీసమందఱికే లా

రొయ్యకు లేదా మీసము
కయ్యమునకుఁగుందవరపు కవిచౌడప్పా

కవిచౌడప్ప

పాత్రా పాత్ర మెవ్వరైన వేఁడిన లేదన కీయ్మ దేహాదులైన

శ్రీధరమల్లె వెంకటరామకవి. బ్రహ్మోత్తరఖండము. IV-63

దాతనని యప్పుఁగొనియియ్యఁదగవు గాదు

కం. వీ. నీతి. దీపి.

త్యాగి ప్రాణమునకు సుఖదానమిచ్చు
బలసహితుఁడా పదలబాపి ప్రాణమిచ్చు
సత్యబోద్ధ ప్రాణాధిక జ్ఞానమిచ్చు
నందుచే ధర్మదానంబె యధికతమము

పానుగంటి. బుద్ధ. III

అవని నేదానమున నఘం బవఘళించు
నట్టి దానంబుఁ జేయరా దంద్రు బుధులు
కొదుక కొసఁగిన వాఁడును గొనిన వాఁడు
మేలు జెంద రనెడు సుద్ది మీరు వినరె

పురాణం పిచ్చయశాస్త్రి. విజయాశ్వచరిత్రము

దానంబు చే దరిద్రుం
డైన నరుఁడు తొంటి కంటె నతి తరశోభన్
పూనును కొమ్మలు నఱికిన
పైనే చందనపు మ్రాను పరిమళ మూనున్

సెట్టి లక్ష్మీనరసింహం. చిత్రహరిశ్చంద్రీయము

అర్థులకర్థముఖ్యవివిధార్థములోపిన భంగి జేయకీ
వ్యర్థముగాఁగఁబోఁదలఁచి స్వార్థులు చుండెను మేను బెంచినన్
సార్థకమేమి? దేహిపరమార్థము చూడవలెన్

శ్రీపాద. కనకగిరి. 64

పాత్రదానంబు సుంతైన ఫలముగాంచు
ఫలము లేదెంత యిడిన నపాత్రమునకు
మంచినేల నాటిన గింజ ద్రమానుగట్టు
చవిటినేల నశించు గింజయును నపుడె.

బలిజేపల్లి. సత్య హరి. II-1

## దానయోగ్యుఁడు

దోషకారి యైన గూసరి కాడైన
బగతుడైన వేదబాహ్యుడైన
వట్టి లేని పేదవానికే దగు నీవి
ధనికునకు నొసంగదగదు

వేమన

భోజనార్థులఁ దృప్తి పొందించు నతఁడు
శ్రీజిత చోరుల చేతఁ జేటొంది
ధనము వాంఛించు నాతఁడు వ్రతంబునకు
ననిచిన యుద్యాపనము సేయఁదలఁచి
యర్థించు నాతఁ డత్యంతంబు భక్తి
సార్థత గురువుల జననీ జనకుల
దార పుత్రులఁ బ్రోవఁదలఁచెడి యతఁడు
ధారుణి లోపల దానయోగ్యుండు

సోమన. ద్విప. భార. అను. II

## దారపుత్రులు

ఎట్టి ఘట్టములను నెట్టి యాపదలను
నెట్టి తీఱములను ముట్టఁబడిన
వంత లెల్లఁ బాయు నింతులఁ బ్రజలను
నొనరఁ జూడఁగనిన జనుల కెందు

నన్నయ. భారత. ఆది. IV-85

ఆత్మజుఁడు సువ్వొ పురుషున కాత్మయయ్యె
నాతనికి భార్య దైవికమైన చుట్టము

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-445

ఇందును నందు ననేక సౌఖ్యములు
పొందించు సుతు లెందుఁబుట్టరు గాక
జగమున నిమిషార్ధ సౌఖ్యంబు లొసఁగు
మగుద లెందుఁగలరు మదిఁ దలపోయ

గౌరన. నవనాథ. II-93

పరులఁగొలిచి కొలిచి బహుయత్నముల నైన
ధనముఁదెచ్చి తమకుఁదగిన కొలది
నొసఁగు నంత కాల మొనరంగ నతనికి
భృత్యులగుదు రాండ్రు బిడ్డ లెల్ల

అక్కన ప్రగడ హరిదాసు. కుబ్జాకృష్ణవిలాసము

## దారిద్ర్యము

దారిద్ర్యంబున కంటెఁ గష్టంబొండెద్దియు లేదు

నన్నయ. భారత. ఆది. V-27

లేమి కంటె నరయన్ మృతి మేలగు

కేతన. దశ. కు.

కరముపేదయైన నరునకు నెందు భా
ర్యా పరిగ్రహంబు భరముగాదె

మారన. మార్కం. పు.

బలవద్దైన్యము వక్త్రగహ్వరముగాఁబలోచ్ఛ్వాసముల్ గొన్నట్టి య
ప్పులు మై చాఁఅలు గాఁగ బాలరుదితంబుల్ మ్రోగు
టల్గాఁగదు
ర్నిల యారణ్యములో భయ ప్రకర మూర్తి క్రూరమై
యుండఁగాఁ
దలమే వెల్వడఁజేయ లావు కలిమిన్ దారిద్ర్య శార్దూలమున్

మంచన. కేయూర.

లేమియే నరకంబు లేమియే రుద్ర
భూమియు లేమియే భూరి శోకంబు
లేమియే రోగంబు లేమియే మృతియు
లేమియే రాగంబు లేమియే జ్వరము
లేమియే కష్టంబు లేమియే కఱవు
లేమియే దైన్యంబు లేమియే వగపు
లేమియే సకలమాలిన్యంబుఁదలఁప
లేమియే సర్వంబు లేమి

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ. 524

నిఱుపేదయింటి కేటికిఁ
బఱతెంచు నిధాన మట్లు పఱతెంచినయే
నిఱు పేద యభాగ్యతఁదలు
పెఱియఁగనిడు గాక చొరఁగనిచ్చునెదానిన్

శ్రీనా. శృం. నై. IV-73

ఒడమికల వెడఁగునైనను
బుడమింగల వారలెల్ల భూషింతురు శ్రీ
వెడఁబాసిన దూషింతురు
కడుఁబేదఱికంబు కంటెఁగష్టము గలదే

జక్కన. విక్రమార్క. II-176

కూలినాలి జేసి గుల్లాపు పని చేసి
తెచ్చి పెట్ట నాలు మెచ్చ నేర్చు
లేమిఁజిక్కు విభుని వేమాఱు దిట్టును

లేమి కాల మప్పు డేమేమి చేసినఁ
గలిసి రాదు ఫలము కాసు కూడ
కలిమి వేళ నన్ని తులఁదూగుచుండును

వేమన

దరిద్రుఁ డెత్తువడి శుష్కభూతుఁడై చిక్కి హిం
సింపండన్యుల నాత్మకున్ సములుగాఁ జింతించు

పోతన. భాగవ. X-394

సంపన్నాంధునకంజనంబు వినుమీ దారిద్ర్యమూహింపఁగన్

పోతన. భాగవ. I-394

వఱలు దారిద్ర్యంబు వలన సిగ్గుజనించు
సిగ్గున సత్యంబు శిథిలమవును
సత్యహీనుఁడు తిరస్కారదూషితుఁడగుఁ
బరిభవయుక్తి నన్నరుఁడు బెగడు
బెగడిన వాఁడు నెవ్వగలచే దురటిల్లు
నధిక దుఃఖితు బుద్ధి యుడిగిపోవు
బుద్ధిహీనుండైనఁ బొడవడంగును వేగ
పొడవడంగినఁగీర్తి యుడుఁగు ధాత్రి

నట్లుగావున నిర్ధనుఁడైన వాఁడు
బహువిధంబుల నీచెప్పఁబడిన యట్టి
యాపదలకెల్ల మూలమై యార్తిఁ బొందు
నెవ్విధంబున నతఁడెన్న నీఁడుగాఁడు

దూబగుంట నారాయణకవి. పంచతంత్రము. II-116

కుల నిర్మూలన కారణంబు ప్రతిభాకుట్టాక ముద్వేగ శో
కలతా దోహద మాజవంజవ సుఖప్రత్యూహ, మాత్మవ్యథా
జ్వలన జ్వాలిక కామినీ నయన వీక్షాపాత సంరోధి ని
త్యలఘుత్వాశ్రయ భూమి లేమియది యాహా యేమిఁ
గావింపదే

మాదయగారి మల్లన. రాజశేఖర చరిత్ర

కుల మహీరుహ మహాక్రూరకుఠారంబు
శోకాగ్ని వృద్ధికృద్ఘోర నాడి
సంసార సుఖశైల శతకోటి పతనంబు
దేహ వ్యథాలతా దోహదంబు
శీతముఖద్యుత్ప్రాప్త సంరోధి జంబీర
ఫలరసం బతిధైర్య భర్మకషము
ప్రతిభాంబు హృద్గ్రీష్మ పవనంబు నిజవధూ
రచిత నిందాపార నిచయ ఘనము

సంతతాహారి సంపాది సంభ్రమ ప్ర
యత్న విఘ్నదమ తను క్షుధార్తిదాయి
యమిత లఘుతాశ్రయ స్థానమై కడంగు
భూరి దారిద్ర్య దోషంబు

అయ్యలరాజు నారాయణామాత్యుడు. హంసవింశతి. II-150

రూపింప నిర్మల రూపంబు లెడలించు
రక్తమాంసముల భారములడంచు
నుద్యోగములకునై యూహఁజేరఁగనీదు
మగల కింతులకును బగలుసేయు
బహుళంబులైన లోభంబు లుత్పాదించు
సూనృత వాక్యంబుఁజూఱవుచ్చుఁ
జాల దురాశావిచారంబుఁ గల్పించు
మానంబు చెడ బతిమాలిపించు

నసదృశానందవనమున కగ్నికీల
యతి శయాక్రాంత చింతా విహారణ భూమి
భూరి దుఃఖములకు నెల్లఁ బుట్టినిల్లు
ప్రజలకును లేమికంటెఁ బాపంబుగలదె.

గట్టుప్రభువు. కుచేలోపాఖ్యానము. 1-50

మానిసికి నున్న దేదైన లేని దగును
లేనిదేయుండు దగినది లేని దాని
కేడ్వదగినది యుండిలే కేడ్పులేక
లేక యేడుపె బ్రదుకగులోకమందు
లేని యేడుపుతప్పదెవ్వాని కైన

పానుగంటి. బుద్ధ. I

మరణమందును దారిద్ర్య భరమునందు
మరణమే మేలు దారిద్ర్యభరము కంటె
దత్సమయ మాత్ర దుఃఖ ప్రదంబు చావు
చచ్చినందాక దుఃఖమొసంగు లేమి

లేమి సకలానర్థ ప్రదంబకటా

అలము దరిద్రతా కలుష మాఱవ పాతక మార గేహికిన్
లేమికంటెను లోకువ లేదు జగతి

తిరుపతి వేంకటకవులు. మృచ్ఛకటికము

పెన్నిధి యదృష్టమున నిరుపేదవాని
కబ్బినను దొంగ సొమ్మంట కబ్బురంబె

బిలిజేపలి

పుట్టు నిరుపేద యంతగాఁబొగులఁడు సుమి
ధని దరిద్రతఁగనునేని దద్దఁబొగులు
నెంచ జన్మాంధుఁడు లభింప డెచ్చునంత
నూతనాంధుండు గను వంత నుడువనగునె

విక్ర. దే. వర్మ

## దాస్యము

రాజ్య మెల్లను బరుల కర్పణము చేసి
మగతనము చంపుకొని కీర్తి మాపుకొని, య
హర్నిశలు పొట్టకొఱకు దాస్యమ్మొనర్చు
కంటె మన జాతికి కళంకంబు గలదె?

కాళ్ళకూరి. పద్మవ్యూహము

పరులకుం దాస్య మొనరించి పరువు మాలి
బ్రతుక జూచుట కంటెను బస్తు మేలు

కాళ్ళకూరి. వరవిక్రయము

## దుఃఖము

......అనంత సంతత
వ్రత నియమ ప్రభావులగు వారలఁ బొందునె దేహ దుఃఖముల్

నన్నయ. భారత. ఆది. VII-121

వగబలము దఱుఁగు రూపఱు
వగచిన మతి దప్పు దేవులు వచ్చును దూఱన్
వగచినలంగినఁబ్రియమగుఁ
బగతురకును వగచుటడుగు

తిక్కన. భారత. ఉద్యో. II-80

జగ మెఱుఁగఁగ దుశ్శీలుం
డగు భూనాథుండు వోయినట్టులె పోఁగాఁ
దెగడుం జేటుఁగలిగి వగ
మిగులను మది గలఁగదే యమిత్రధ్వంసీ

తిక్కన. భారత. సౌప్తి. I-39

చేటునకుఁ జావునకు వగఁజెందు జనుల
కినుమడింపదె మానసమున నలంత

తిక్కన. భారత. స్త్రీ. II-66

వలయు వస్తువు వగచిన వచ్చునయ్యె
రామియొక్కటియే శరీరంబు నెదయు
దాపమునఁబొందు వగపున

తిక్కన. భారత. శాంతి. IV-412

వగపునఁదేజోహీనుండగు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-142

వగపు దొఱఁగి యుద్యోగము
దగఁజేయఁగ గలుగు నంచితములగు శుభముల్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-142

శోకముఁబొందిన వానిన్
భీకర రోగములు సెందుఁబృథులార్థంబుల్

నేకుఱవు వానికెప్పుడు
శోకముగని విడుచువాఁడు సుజ్ఞాని నృపా
భాస్కరుఁడు. రామా. అర. II-323

శోకము సుఖముం జెఱచును
శోకము తేజంబునడఁచు శోకము బుద్ధిం
బోకార్చుఁగానఁ దాలిమిఁ
గైకొని శోకంబు విడువఁగా వలయు నృపా
మల్లికార్జునుఁడు. భా. రా. కిష్కింధ. 72

శోక మాత్మలో
జేకొను వానికిం బరఁగఁ జెల్లునె చేయఁ బరోపకారముల్
మల్లికార్జునుఁడు. భా. రా. కిష్కింధ. 768

శోకార్తులకు నుపాయము
లేకరణిం దోఁచు ధైర్య మెవ్విధిఁగలుగున్
రాకడ వో కడలకు జవ
మేకొామరున నోదవు.
బైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము

దిన గండంబులఁబొరలెడు వారు మొగము ముడుచుటయరుదే
కాకమాని మూర్తికవి. రాజవాహన. III-32

ధనవంతుఁడై వెనుక దారిద్ర్యపరుఁడైన
నందుకన్నను దుఃఖమెందు లేదు
పరమ సాధ్వికిఁబతి పరసతీప్రియుఁడైన
నందు కన్నను దుఃఖమెందు లేదు
జ్ఞాన చిత్తునకు నజ్ఞానశిష్యుఁడు గల్గు
టందు కన్నను దుఃఖమెందు లేదు

హరిని జూచిన కన్నులన్య రూపము జూచు
టందు కన్నను దుఃఖమెందు లేదు

త్యాగరాజు. ప్రహ్లాదభక్తవిజయము

మదిం గడింది వెత గల్గిన
రోఁతలుగావె యన్నియున్

కం. వీరే. పం. రసికజన II-53

వచ్చినట్లె పోవువంత తనంత

అ. నారాయణదాసు. వేల్పుమాట. 13

వంత యెటులో వెల్వడఁగ పత్తు లేదు
లో నడఁచి పెట్టుచో మహా హాని యగును

పానుగంటి. విజయ. రాఘ. III

## దురదృష్టము

ఏవాని బంధు మిత్రులు
జీవధనంబులును డప్పిఁజెందును గృశునిం
గావాని నెన్నఁగాఁదగు
గేవలు తను కార్శ్యయుతుఁడు గృశుఁడె

తిక్కన. భారత. శాంతి 1-52

భాగ్యహీనునకును బరుసవేది దొరుక
నదియు నిల్వదపుడె వదలుఁగాక
వానతోడవచ్చు వడగండ్లు నిల్చునా ?

తనకు బ్రాప్తిలేక దానము-చిక్కమి
దైవ నింద వెట్టి తనముగాదె?

తనకు బ్రాప్తిలేదు దాత యిచ్చునె యంచు
నొరులదూరు టెల్ల నోగు బుద్ధి

వేమన

ఎఱుఁగుటనగనేమి? యెఱుఁగమి యన నేమి?
నెత్తిపైన జ్యేష్ఠ నిలుచునపుడు
కనులు పూలు పూచి కాయలు కాచును
బుద్ధి యొక్క పోయి మొండిఁబాఱు

పానుగంటి. కోకిల

దురహంకృతి

......దురహంకృతిని......
వీడి నను గాని దైవంబు తోడుపడునె

పానుగంటి. విజయ. రాఘ

దుర్మానంబు దుర్దశ నాపాదించు

తిక్కన. భారత. ఉద్యో. III-322

దురాశ

దురాశ దుఃఖమునకు చేటు

లోకోక్తి

మది సుఖముఁగోరి దుఃఖం
బొదవంగల కార్యములకు నుత్సాహముసే
యుదు రొప్పనితృష్ణంబడి
చదు రేమియులేని యట్టి జనులాతురులై

తిక్కన. భారత. ఉద్యో. I-306

అందని పంటికి నట్టు సాఁపఁ దగునె
రంగ. రామా. యుద్ధ. 547

అగ్గలమగుఁ దృష్ణయెవ్వనికి
గాఢ దరిద్రుఁడు వాఁడు
ఏనుగు లక్ష్మణకవి. భర్తృహరి. వై. 53

ఆశపూనరాదు ప్రారబ్ధమునఁజేసి
ఈశుడిచ్చినంతనే ప్రతృప్తి
నొందవలయునరుఁడు గ్రిందు మీఁదను బడి
పొరలెనేనిఁ బెచ్చు దొరకబోదు
శ్రీపాద. కనకగిరి.

ఎవ్వఁడు దరిద్రుఁడు? విశాల తృష్ణుఁడు
ప్రశ్నోత్తరీ మణిరత్నమాల

## దుర్జనపద్ధతి

పతియును గుణవతియుఁ బ్రజా
వతియు ననువ్రతయునైన వనితనవజ్ఞా
న్వితదృష్టిఁజూచు నతి దు
ర్మతి కిహముం బరముఁగలదె మతిఁబరికింపన్
నన్నయ. భారత. ఆది. IV-82

పాప వ్యవసాయుల చెయ్వులర్థ వంతములగునే
నన్నయ. భారత. ఆది. V-176

పలుమఱు శపథంబులునం
జలియును నభివాదనమును సామప్రియ భా
షలు మిథ్యా వినయంబులుఁ
గలయవి దుష్ట స్వభావ కాపురుషులకున్
నన్నయ. భారత. ఆది. VI-112

కారణంబు లేక దారుణం బగుసాధు
హింస సేయ కుజనుఁ డెల్ల వారికప్రియుండ

నన్నయ. భారత. సభా. I-189

ఉక్కీని మనంబు గీడు పరికించునె క్రొవ్విననఁజేటు దప్పునే

తిక్కన. భారత. విరాట. III-7

మృదు భాషణముల దుర్జన
హృదయములు ప్రసన్నతా మహిమఁ బొందునె

కోపమునుబ్బును గర్వము
నాపోవక యునికియును దురభి మానము ని
ర్వ్యాపారత్వము నను నివి
కాపురుష గుణంబులండ్రు కౌరవనాథా

ఏలిన వానిని దైవము
నాలిని బంధులను సముచితారాధన సం
శీలతఁ బ్రీతులఁ జేయుని
పాలసుఁడాఫలము లాసపడు మనుజేంద్రా

తిక్కన. భారత. ఉద్యో. II-32,33,34

కీడొనరించిన వారికిఁ
గీడగు టరుదయ్యె

తిక్కన. భారత. భీష్మ. I-68

మాయలు గల్గు దుష్టులకు
మాయపు భంగులె మందుగాన్

తిక్కన. భారత. శల్య. II-572

క్రోధము లోభమున్ భయముఁగూరిన చిత్తము తోడ దుష్క్రియా
సాధన వృత్తి దుర్జనుఁడు సజ్జను లాగఁగఁజేయు కార్యముల్
బాధలఁ బెట్టుకున్న సిరి పాయఁగ జేయక యున్న వానిదీ
వ్రాధిని తాంత దుఃఖ హృదయత్వము దేరక యున్న వానికిన్

తిక్కన. భారత. సౌప్తి. I-36

.........శిశ్నోదర
పరాయణుండగుచు నొందు పరికింపని దు
ర్నరుఁడెలుకఁ బిల్లి వొదివిన
పరుసున జరవొదువ ముక్తిఁబడయక పోలియున్

తిక్కన. శారత. శాంతి. V-534

జడుఁ డైన వాఁడు దుర్జనుఁ డైన వాఁడు
కడుఁ గ్రూరజీవనగతి నున్న వాఁడు
మలఁగక తనలోన మండెడు వాఁడు
కులగోత్రమైనఁ జేకొని మ్రింగు వాఁడు

నెదు రెంత వేఁడిన నెఱుఁగునే? పెద్ద
రొదరుచు నంతంత యుబ్బును గాక?
కదియంగ వచ్చుచోఁ గడిఁదిచిత్తంబు
చెదరంగవిషముపైఁ జిలికించుఁగాక

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ 357

సత్యమును శమంబు శౌచంబు లేక నా
_స్తిక్యమును నిషిద్ధ సేవనంబు
గలిగి తిరుగు దుష్ట కష్ట జన శ్రేణి
పొలియు నుభయ లోకములకుఁగాక

ఎఱ్ఱన. భారత. అరణ్య. IV-179

విను దుర్విన యాత్మకుఁడే
జనుఁ డుజ్జ్వలమైన సిరియు సద్విద్యయుఁగ
ల్గిన నందు మెలఁగ నేరక
చెనఁటి తెఱంగునకుఁ జొచ్చి చెడి పోవుఁదుదిన్

ఎఱ్ఱన. భారత. అరణ్య. VI-19

బుధుల కేవములగు జడుల మాట లెద యెరియించున్

ఎఱ్ఱన. హ. వం. VIII-92

సల్లాపము లాడి సత్కృతి తలంపక బొంకెడు వాఁడు నర్థికిం
జేపడ సంచితోపకృతి చేసిన వానికి వాంఛితంబు సం
క్షేపమనస్కుఁడై తనరఁజేయని వాఁడును బూరుషాధముల్

మల్లికార్జునుఁడు. భా. రా. కిష్కింధ. 422

మొదల విచారింపక చే
యుదు రది తుది నొప్పకున్న నుక్కడఁగి ముదుం
గుదురు విను తులువ లప్పను
లొదవక చెడు బూదినిడిన హుతముల కరణిన్

క్షమ యును ప్రియవాదిత్వము
శమమును నార్జవము దుర్విచారులు గడుఁజా
లమిగా నూహింతురు లో
కము వెఱచుట బెట్టిదంబు గలుగుటఁజుమ్మీ

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 100,215

అలఁతి నవ్వు ప్రగల్భతాహంకరణము
కాదు కాదంటవాచావి గర్హణంబు
పలుక కుంట తిరస్కార కలన ముద్ర

శ్రీనా. శృం. నై. IV-67

దుష్టులు తులువలు దుర్భాషిణులును
తారతమ్యంబుల తగవెరుంగకయె
కచ్చెకు ముందుగ గాలు దువ్వెదరు
భావంబు లిట్టివి పడతుల కెల్ల

శ్రీనా. పల. వీ. చ.

కడు సన్నపుఁగార్యము నె
క్కుడు దోసముతోడఁ బెనఁగి కుమతులు మౌర్ఖ్యం
బుడుగక పెద్దయు సేగిం బడుదురు

మంచెన. కే. బా. చ. II-118

కెలనికి మేలుగఁ దనకుం
    గలిగెడు నింద్రత్వ మైనఁగాదనుఁ దాదిఁదాఁ
బొలసిన మేలనితలఁచును
    ఖలుఁడొకనికిఁ కీడు సేయఁగలిగినఁజాలున్

మంచెన. కే. బా. చ. IV-112

పంచదార నద్దుక తినఁబోతే
ముష్టి గింజ చేఁదేలమాను?
దుష్టునికి కోపమేల మాను?

అన్నమయ్య. అధ్యా. సం

ఖలులు తిట్టి రంచు గలవర పడనేల?
వారి తిట్ల నేమివాసి చెడును?

ఎంత చదువు జదివి యేనీతి విన్నను
హీనుడవగుణంబు మాన డెందు
దాన ధర్మములకు దగు జేపు జే పని
కాలలయము సేయు కష్ట జనుడు

ఎంత జెప్ప జెడుగు పంతంబు మానునా?

కొండ గుహాలనున్న గోవెలలందున్న
మెండుగాను బూది మెత్తియున్న
దుష్ట మానవులకు దుర్బుద్ధిమానునా
దుష్ట నరునకు విషము దేహ మాద్యంతంబు

వేమన

కొని యాడినఁగొలచిన దు
ర్జనుఁడాత్మ ప్రకృతి విడిచి చరియింపఁడు ది
ద్దిన చమురుఁబెట్టి తోమినఁ
దన కుటిలతఁ గుక్కతోఁక దా విడుచునొకో

కొలచిన నవధీరితుఁగాఁ
దలఁచినఁ జేయును బరోపతాపము ఖలుఁడో
దల నిడు కొన్నం ద్రొక్కినఁ
బలితంపుం బాము బడలు పడఁగఱచుఁగదా

తిమిర నివారణక్రియకు దీపము వారికిధిని స్తరింపఁబో
తము చలిఁబాప వహ్ని రవి తాప భరంబడఁగింప నాత ప
త్రము కలుషంబులం జెఱుప ధర్మము బొల్పడి యుండుఁ
గాని య

క్కమలజుఁడున్ సుఖోద్యముఁడు గాఁడు దురాత్ముని జక్కఁ
జేయఁగన్

పర పురుష చింత యంతః
కరణంబునఁగలిగి మగనిఁగరగించు తలో
దరి కరణి హృదయ కలుషము
మఱుఁగిడి ఖలుఁడాడు మధుర మధురత రోక్తుల్

నేరము లొనరించిన నుప
కారము సేయుదుము నొవ్వఁగాఁ బల్కనఁగై
వారము మఱువము మే మను
వారలకున్ ఖలులఖండ వైరులు కారే

గజ మంటి నట్ల యడఁచున్
భుజగము మూర్కొనిన యట్ల పొరిగొను ధరణీ
భుజుఁడు నగినట్ల చంపుం
గుజనుఁడు మన్నించునట్ల కొను ప్రాణంబుల్

బైచరాజు. పంచ. II

ధర్మమే జయ మనుచుఁదలఁప నేరని ఘోర
దుర్మార్గులకు బ్రతుకు దూరమై చనదె

రుద్రకవి. సుగ్రీవ విజయము. 31

భ్రష్టుని గోఘ్నుని పానాభిరతుని
కృష్టుని చోరునిఁ గెడ తేర్పఁ దలఁచి
యిటు సేయుఁడని విధియించిరి గాని
కటకట మేలెఱుఁగని దుష్ట మతికి
నెందుఁ బ్రాయశ్చిత్త మిది యని లేదు

వరద. రామా. కిష్కింధ. 434

......తిన్న నొల్లని వానిఁ జేపట్టి
కడుఁ గూర్చువాని దగ్గఱ నీఁడు ఖలుఁడు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ. I-18

లలిఁ బ్రారంభమునన్ సుఖంబొదవు తాళచ్ఛాయ చందంబునన్
దలఁపన్ దుర్జనమైత్రి యంతమున సంతాపంబు గావించు
సాధులకున్

భవానీశకవి. ధర్మ. II-244

వంచకులకును దుర్మార్గవర్తులకును
గార్య సంసిద్ధిచే మాయగలుగునండ్రు

భవానీశ కవి. ధర్మ. IV-120

ధర దుష్ట జనులశిష్టత
యొరులకు నొప్పమియ సేయనొసరంబులిదా
నిర వొంద నుపవసించుట
స్థిరతర పశుహింసనంబు సేయన కాదే

భవానీశకవి. ధర్మ. IV-121

సత్కులీనతయును ముదుసలితనంబు
సిరియుఁగలిగిన దుష్టుండు శిష్టుఁడగునె

భవానీశకవి. ధర్మ. VII-280

విషమ సంధిఁ గీడొనర్చుట హీనులజాడ గాదె

కనుపర్తి అబ్బయామాత్యుడు. కవిరాజమనోరంజనము. II-93

సమ్మతిం జేరి మదాంధ చిత్తునకుఁ
దెప్పఁగఁ బోయిన హాని వచ్చుఁగా

ధరణిదేవుల రామయమంత్రి. దశావతార చరిత్ర. VIII-109

హీనుఁడగు వాని సత్ప్రభులెన్ని గతుల
నునిచి మనిచినఁ జెడు జాడలుడుగఁ గలడె

తిమ్మకవి. కుక్కుటేశ్వరశతకము. 88

గర్వితుండైన దుర్మార్గగామియైన
దానొకింత కార్యాకార్య దక్షబుద్ధి
కాని వాడైన గురునేని కార్యమొంచి
వసుధలోపల ద్యజియింపవలయుఁ జుమ్మి

కందుకూరి. ప్రబోధ చంద్రోదయము

తనకుఁదొరికి నట్టి దాని మేలెఱుఁగక
పనికి రాని దనుచుఁబలుకు చెనటి

లేని నేరముఁదాఁబన్ని యైనఁజెడ్డ
వాఁడు లోఁకువ వానికి కీడు సేయు

అ. వారాయణదాసు. నూరుగంటి

తననుక మొక్కలేక తల పోయు కూళ

సోమరియై యుబుసుంబుచ్చుతులువ

అ. నారాయణదాసు. వేల్పుమాట

తనకురాని దానిఁదక్కువగాఁజూచి
చెనఁటి వాఁడు డాబు సేయుచుండు

వంతతోడుత నొక గొప్ప వాఁడు తనదు
చెంతఁజేరిన చెనటి బల్రంతు సేయు

తనకుఁగల్గినట్టి తప్పు లే యొరునకుఁ
గలుగఁజూచి చెనఁటి యలుగు చుండు

తనకుఁదగని సాటిఁ దలపోసి చెల్లని
చనువు చూపఁబోవు చెనఁటి చెడును

తనకు పనికి రాని దానినైనఁ జెనఁటి
యొరులు దీయఁజూచి యోర్వలేఁడు

తనకు మేలు కలుగ నని పయి వారికిఁ
జెఱపు చేయుచుండఁ జెనఁటి వాఁడు

ఒరులు తన్నుఁ దెలియ కున్నప్డు పట్టఁబ
గ్గాలు లేక చెనఁటి వ్రేలు చుండు
హెచ్చుఁదగ్గుఁదులువ యెక్కుడు మొత్తము
వలనఁ జూచుఁగాని విలువఁగనఁడు

ఆ. నారాయణదాసు. నూరుగంటి

పరులసౌఖ్యము కంటె నాపదయె యధిక
సుఖకరము నరునికి సొంత సుఖతఁ దనకుఁ
గల ముదముకంటె నితరులకష్ట కలనఁ
గలుగు సుఖ మెన్నొమడుఁగు లై నెలయునకట

పానుగంటి. కోకిల

మృగయునకుఁబెద్దపులి యెంతో మేకము నంతె
దుష్టులకు సాధువులు నసాధువులు నొకటె
చెనటికి హితోపదేశంబు చేయుటరయ
బెద్ద పులికి ధర్మములు చెప్పెడు తెఱంగు

చిలకమర్తి. ప్రసన్నయాదవము

దోష నిరతుల్ గనుచుందురు లేనిదోషముల్

సెట్టి లక్ష్మీనరసింహం. ప్రభానుశాపవిమోచనము. III-170

నీచులనుండియుండగిన నీతులు కొన్ని గ్రహింపవచ్చు

తి. వేంకటకవులు. బుద్ధచరితము. VI-117

అమ్మ చెవులు ద్రెంచు నమలాత్ములకు నెందుఁ
బిన్న తల్లి చెవులు బీఱపూలు
గావు దేవుఁడిట్టు గడుసుమానిసి కుపా
ధ్యాయుఁడిట్టు లెంత తప్పిదంబు ?

తిరుపతి వేంకటకవులు. గీరతము

విసము పుట్టిన తోడనే పొసఁగు చేదు
దుర్గుణపు చిన్నెలట్టులే దుర్జనులకు

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి. సత్యహరిశ్చంద్రీయము

ఎండ్రి జన్మించి నంతనే తండ్రి జంపు
పుత్రి కయు జంపుదనతల్లిఁబుట్టినంత
లంచగొండి, కృతఘ్నుడు లంపటుండు
నయిన యుద్యోగి సర్వుల లయ మొనర్చు

సురవరం ప్రతాపరెడ్డి. ఉ. వి.

కాకి రెట్ట కొఱకు కడలి గలయఁ జూచి
దోస మెంచ వలదు దుష్ట జనుడు

కాం. కస. అమృతసారము. V-305

## దుర్జన స్సాంగత్యము

కడునమర క్తియు నేర్పును
గడఁకయుఁగల వారినుఱక కడవఁగ నెగ్గుల్
నొడివెడు వివేక శూన్యుల
కడనుండెడు నంత కంటెఁగష్టము గలదే

నన్నయ. భారత. ఆది. III-149

దోషుల సంగతి నగుదురు దోషాత్మకులు

నన్నెచోడుఁడు. కు. సం. X-40

క్రూరుఁడు లోభియున్ శఠుఁడు గొండి యుఁడున్ జడుఁడున్ కృతఘ్నుఁడున్

నేరని వాఁడు బొంకరియు నిందకు నోర్చునతండు ఁబందయున్

ధీరత లేమి దుర్నయమతివ్యసనత్వముఁగల్గు వారలున్

జేరువనున్కి భూపతికిఁజెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా

తిక్కన. భారత. శాంతి. III-469

బలవంతుఁడుఁ బగవాఁడును

ఖలుఁడనఁగాఁజాలు వాఁడుఁ గపటోక్తులఁగా

గలయఁగ వచ్చిన బేల్పడి

కలసి కొనిరయేనిఁ గీడు కాకుండదిలన్

మంచన. కే. బా. చ. III-7

చింతాకులత్వంబు చెఱచు దేజోలక్ష్మి

సీధు పాన ప్రీతి సిగ్గుఁజెఱచుఁ

జెఱచు మిథ్యాదృష్టి శీలతాగరిమంబుఁ

బిశునవాచావృత్తి పెంపుఁజెఱచు

జిత్త వైకల్యంబుఁజెఱచు ప్రజ్ఞా ప్రౌఢి

పరవధూ సంసర్గ బైసి చెఱచుఁ

జెఱచుఁగ్రోధము తపస్థిరసమాధి స్థితి

కాముకత్వము వివేకంబు జెఱచుఁ

గుటిల మానవు మైత్రి సద్గుణముఁ జెఱచుఁ

దమక మొప్పను పసికి నెంతటి ఘనునకు

పిల్ల. పిన. శృం. శా. III-30

ఖలులతోడి పొందు కలుషంబు గలిగించు
మాన దెంత మేటి మానికైన
వారి జేర దీయవలవను చెడుదువు

వేమన

కాని వాని చేత గాసువీసము లిచ్చి
వెంట దిరుగు టెల్ల వెఱ్ఱితనము

వేమన

కాని వానితోడ గలిసి మెలగుచున్న
హాని వచ్చు నెంత వానికైన

వేమన

......కుటిలు లగు దు
ర్జనుల గృహంబులకు బంధు సరణిని బోవం
జనదు......

పోతన. భాగ. IV-70

కొంచెపు నరుసంగతిచే నంచితముగఁ గీడువచ్చు

సుమతీశతకము

......పాపాత్మునితో
నేపొందఁజెలిమి చేసిన
యాపురుషుఁడు తత్సమానుఁడగు

భవానీశకవి. ధర్మ. VII-245

జగతి నెటువంటి వస్తువుల్సద్గుణంబు
విడువకుండునె దుర్గుణాన్వితునిఁగూడి

కుమారధూర్జటి. కృష్ణరాయ. IV-9

అన్యాయ మంత్రవాదులు
సన్యాసులు వారితోడ సఖ్యముదగునే
కూ. జ. కవి. సుధ. V-105

దూషించే వారితో పలుమాఱు పొందేల?
రామదాసు చరిత్ర. 243

కులటా వేశ్యా కాముక
ఖల సంగత దేశము లనొకా నొక వేళ
న్నిలువకుము
శ్రీధరమల్లె వెంకటరామకవి. బ్రహ్మోత్తరఖండము. IV-103

చేసేది మర్కట సహవాసము
రాజనీతు లే రీతిగ వచ్చు
శ్రీపాద గోపాలకృష్ణమూర్తి సంపాదితము. కుశలవ కుచ్చులకథ. పుట. 273

చెడ్డవాండ్ర నడుమఁ జేరునప్పుడు దొడ్డ
వాఁడు కూడ వారి తోడఁజెడును
అ. నారాయణదాసు. నూఱుగంటి

వావిరి సమ్మెట వేటులు
పావకునకు లోహసహిత వాసమువలనన్
గావున దామోదర కుజ
నావలి సహవాస మధిక హానిదము

కఠిన హృదయుల మధ్యంబు గలుగనపుడు
సాధువు శమించి నేర్పునజ్జరుగుటొప్పు
కఠిన దంతాళి యుగ మధ్య గతముగాఁగ
మెత్తనగు నాల్క సుళువున మెలగునట్లు

నాలుక కొన నమృతంబును
హాలహాల మొదవి యుదర మందుండుటనా
భీలమగు ఖలుని చేష్టిక
వైశమ శ్రీవాసుదేవ వర్ణింపఁదగున్

విక్ర. దే. వ

విషయ సక్తుల సంగంబు విడుచుటొప్పు
మంచి మాటలు చెప్పి నమ్మంగ జేసి
అవల మోసమొనర్చెడి స్వార్థ పరుల
చెలిమి చేయంగ నలదు

నా. కృ. రావు

## దుర్నీతి

నీతులఁద్రోవఁబడని దు
ర్నీతుని యుద్రేక మెసఁగినిగిడినయెడ లో
కాతిక్రమహేతువగు న
హేతుకభానాశనంబు నెమ్మెయి నసగున్

ఎఱ్ఱన. నృ. పు. II-134

ఆది సంకల్ప మొనరించునట్టి కార్య
మందు మేలైనఁ గీడైనఁ బొందుపఱిచి
నిర్వహింపని నరుఁడు దుర్నీతి పరుఁడు

శివరామకవి. సానందోపాఖ్యానము. III-143

## దుర్బుద్ధి

నిర్బంధము దుర్మానము దుర్బుద్ధికిఁగాక తగునె

తిక్కన. భారత. ఉద్యోగ. III-323

దుర్భావముతో, బ్రదుకుటొక్క బ్రదుకే తలపన్

పోతన. భాగవ. X-81

దుష్ట చింతలఁగలుగును దుర్గుణములు
దుర్గుణంబులఁగలుగును దుష్టచింత
కొండనాలుక వ్రాలి దగ్గుఁగలిగించుఁ
గాసఘనమైన కొండనాల్కయును వ్రాలు.

పానుగంటి. బుద్ధ. III

కాయము దానటంచుఁ గొఱగానిపనుల్ దలపోయుచుంట లో
కాయతబుద్ధి

తనికెళ్ళ ప్రకాశశాస్త్రి. నిశ్శంకవంశము. I–83

## దుర్వ్యయము

వ్యవసాయము కొలఁదియు దే
శవిధము గాలంబుఁ బూర్వ సంచితమగు సొ
మ్మును విచారింపక యుబ్బిన
దివిరి వ్యయము సేయునతఁడు దీనతఁ జెందున్

మంచన. కేయూర. III–163

సంచితార్థంబు నిష్ప్రయోజనముగాఁగ
సలవెఱుంగక వెచ్చించునతఁడు చెడఁడె?

జక్కన. విక్రమార్క. II–169

## దుష్కార్యము

ఒప్పమిసేయఁడేనిఁదగు నుత్తమ వంశజుఁడేని నేరికిం
దప్పొనరింపఁడేని నతిధార్మికుఁడేని దురాత్ములైన వా
రప్పురుషావతంసమున కాఱడి యొగ్గొనరింపఁజూచినం
దప్పనిచేటు వారలకు

మంచన. కేయూర. III–329

తల్లింబిడ్డలఁ బాయఁజేయుటయు నిద్రాభంగమున్ భర్తతో
నిల్లాలిన్ విడదీయఁ బూనుటయు దుష్కృత్యప్రవృత్తింగథా
సల్లాపమ్ములకంతరాయ కృతులన్ సంధించుటల్ తుల్యమై
చెల్లున్

తిరుపతి వెంకటకవులు. ప్రభావతి. II

## దుష్ప్రభువు

జనవిభుండు కరుణదప్పి, తానహరియించువాఁడగునేని
సాధులోక మేమిసేయు

నన్నయ. భారత. ఆది. VII-104

దుష్ట చరిత్రులైన నృపతుల్ ధరయేలుట కంటెఁగల్గునే
కష్టము శిష్టలోకము సుఖస్థితి నుండదు

వ. రా. V-15

తనువుఁబో దలనిఁడు తాపంబుఁ బుట్టించు
బస్తుఁబెట్టు మూలఁ బాఱవైచుఁ
గొలుచు సజ్జనులకుఁ గుత్సితవసుమతీ
వల్లభుండు వేఁకి వంటివాఁడు

నగవులకుం బ్రసాదనచ నంబొకటాడఁడు మ్రోలనిల్చినన్
మొగమటుపెట్టు గేల్మొగిచి మ్రొక్కినఁజే మెదలింపఁడాజిలో
బగఱనడంచి కోల్పడినపాటును గెల్చినగెల్పు నెంతయుం
గగనసుమంబొనర్చు నొసఁగంబిడు నోయని దుష్ప్రభుండిలన్.

మడఁగిపడుండఁ బ్రాణులకమంచపుఁ గుక్కికినిల్పు తెల్లుపు
ల్లుడిసెకు నొండు రెండెనుప గొడ్లను నోరికిబోకవక్కకున్

గుడువఁగఁ గూటికి న్మోలకు గోకకు సీదిర మెంతరోఁతయే
వకువునదుష్ప్రభుం గొలువవచ్చు నిసీయనుజీవకోటికిన్

కైచరాజు వేంకటనాథకవి. పంచతంత్రము. I-433

పావకుండును గపటంపు భూవరుండు
దమ్ముఁ గదుఁజేరి మందెమేలమ్ముతోడ
నున్న వారికిఁ గీడు సేయుదురు వారి
కంచితస్నేహమున మంటలధికమగును

వెన్నెలకంటి సూరన. వి. పు. VII-105

తన పొట్టకై ప్రజఁగలచునరిత
రతుఁడు వాఁడొక రాజా తరాజుగాక

తిమ్మకవి. కుక్కుటేశ్వరశతకము. 61

తా రప్పటి పొంగుచేఁ బ్రజలనాపదఁబెట్టి నిజాధికారముల్
దప్పినఁ జిన్నఁబోయి మరలం జనుచుందురుగాదె దుష్ప్రభుల్

కనుపర్తి అబ్బయామాత్యుఁడు. కవిరాజ మనోరంజనము. IV-23

తనుఁగొల్చుబంట్ల జీతములు తక్కువఁజేసి
ఘోటకంబులు పెక్కుఁగూర్ప నేల ?
న్యాయపద్ధతినడువని యవనిపతికి
నెన్ని చిన్నెలు గలిగిన నెందుకొఱకు
కాదనెడివారు లేకున్న ఖలనృపుండు
కాని పని కెంతకైన నగ్గంబుగాఁడె

సూరకవి. రామలింగేశ శతకము

హర హర ! కఠినాత్ములధిపతులెన్న
తనయునినైన సోదరునైన బంధు

జను నైన దను గన్న జనకునినైన
మానక రాజ్యాభిమానంబు బూని
మానవేశాధముల్ మడియింపుచుండ్రు

సారంగధర చరిత్ర. II

## దుస్సాహసము

తనబలము నెదిరి బలమును
గనుఁగొనక హితోపదేశ కర్తల పలుకున్
వినక కుజనుండు సాహస
మునఁజెడు బలుగాడ్పు దొడరు బూరుగులీలన్

పాపరాజు. ఉ. రా. II-10

## దూత

పతిహితుఁగుల విప్రోత్తముఁ
జతురు పథాశుద్ధుఁగార్య సంవేదిఁ బరేం
గితవిదు ధైర్యాన్వితు ని
ర్గతమలయుతు రాయబారిగాఁబంప నగున్

నన్నెచోడుఁడు. కు. సం. X-123

దూతలెందుఁ దొలితొలి, గుకువంగొనఁగట్టఁ దొడఁగుదురె

తిక్కన. భారత. ఉద్యో. III-218

కులముశీలంబు హితవాక్యములును నేర్పుఁ
గార్యవాదిత్వ సద్యశో గౌరవంబుఁ
దలఁపుగలుగుట దక్షతయు నలఘు గుణము
లంద్రుదూతకు నియ్యేడు నార్యజనులు

తిక్కన. భారత. శాంతి. II-379

వినయ వివేక భూషణుఁ బ్రవీణుఁ గులీనుఁ బరేంగితజ్ఞు స
త్యనిరతు బుద్ధిమంతు నుచితప్రదుఁ గార్యధురంధరున్ గృపా
త్మ్మనతిగుణాకరున్ బలిహితున్ జననాథుఁడు రాయబారిఁ జే
సిన నతఁడెట్టులైన ఫలసిద్ధిగఁ జేయు సమస్త కృత్యముల్

చరిగొండ ధర్మన. చిత్రభారతము. VI-92

దూతవధ

తనకడకువచ్చి మొగమోడనివాఁడగు దూతపల్కుట
కుఁగోపింప
జనదు జననాథునకు దూతుని జంపిన నరకమగుట ధ్రువమని
రార్యుల్

తిక్కన. భారత. శాంతి. II-378

దూతలఁజంపంగఁదగదు దొరలకునెందున్

మొల్ల. రామా. సుందర. 213

## దేశము, దేశభక్తి, దేశసేవ

దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్
దేశాభిమానం నాకు కద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్
పూనియేదైనాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయ్

గురజాడ. ముత్యాలసరాలు

ప్రాదిజన్మ నివాస కారణము దేవ
దేవునునికికి దివ్యమందిరమునగుచు

యుక్తసేవకు ననువుగా నుండునట్టి
దేశసేవయె కాదె సర్వేశుసేవ

విక్ర. దే.

ఎవ్వఁడు స్వరాజ్యము నిమిత్తమెన్ని రక్త
బిందువులు ప్రీతి వసుధ కర్పింపఁ గలుగు
వాఁడు భూలోకమున నన్ని వర్షశతము
లమరుఁడై యుండు కీర్తికాయంబు తోడ

కాళ్ళకూరి. పద్మవ్యూహము. IV-74

## దేహాత్మలు

నిత్యుఁడాత్ముండు దేహ మనిత్యము

తిక్కన భారత. అను. V-125

మేను జీర్ణముగాఁజేయుఁగాని మరణ
మొందఁ జేయదు వినుకాల మెందు నరుని

తిక్కన. భారత. అను. V-128

కర్మవశతఁజూవె కలుగు దేహము దేహ
వర్తనంబు కర్మవశగతంబు
దేహపాతమైన దేహస్థుఁడగు జీవుఁ
డరుగుఁగర్మ విహితమైనయెడకు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-70

అరదము దేహ మింద్రియము లశ్వము లాత్ముఁడు సూతు
డిమ్మహా

తురగచయంబు ధైర్యమను తోరపుఁబగ్గములన్ దృఢంబుగా
నురువడిఁ బోకయుండ వెరవొప్పఁగఁ బట్టినవాఁడు స్వర్గపుం
దెరువున నేగు నప్పరమ ధీరుఁడు సూవె యుదారుఁ డయ్యెడన్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-92

కట్టియందు నిప్పు గానని చందమీ
తనువునందు నాత్మ తగిలియుండు

దేహమందు వెలయు తేజంబు పరమాత్మ
కాయమందె యుండు కార్యమెల్ల
నెంచిచూడ లోక మేది వేరేకాదు

దేహమాత్మలు వేర్వేరు తెలియలేక
మోహమునఁ జిక్కి బద్ధుఁడై మునుఁగుటేల
సాహసంబున గురుభక్తి సలుపవలెను

వేమన

నీవు మారవుగాని నీ నీడమారు
నీవు నిక్కంబు నీ నీడ హుళక్కి

అ. నారాయణదాసు. వేల్పుమాట

## దేహి

ఆదిని సంయోగవియో
గాదిద్వంద్వములు దేహియగు వానికి సంపాదిల్లక తక్కవు

నన్నయ. భారత. ఆది. VI-249

స్నేహార్ణవమగ్నుండయి
దేహిమహాదుఃఖములనధృతిఁ బొందును

నన్నయ. భారత. అరణ్య. I-23

భ్రమవంటిది ప్రాణము
నీరు బుగ్గవంటిది నిచ్చకొత్తలైనది
నారువంటిది మేను నమ్మరాదు దేహికి
తీపువంటిది కాలము తెగదెందు దేహికి

అన్నమయ్య. అధ్యా. ౫౦.

దేహికి దేహమె యిల్లని
మోహముచేతను గుబుద్ధి మురియుచునుండన్
దేహియు దేహమునంటని
పోహణయగు బట్టబయలు పొందుగ వేమా!

వేమన

దేహిమూలమందు దేహిదేవుఁడటంచుఁ
దెలిసియున్న బుధులు తీర్థయాత్ర
లరయఁబోరు జగతినాత్మతామై యునికి

వేమన

దేహధరులకుం, దెగినయెడఁ బగఅమీఁదను బగగొనఁదగదు
పోతన. భాగ. VIII–559

కారేరాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?
వారేరీ? సిరిమూటగట్టికొని పోవంజాలిరే? భూమిపైఁ
బేరైనంగలదే?
పోతన. భాగ. VIII–590

...... ఎంతయు దేహంబుపీడ
ఘనము మనఃపీడకంటె దేహులకు
ఎన్ని తెగుళులున్న నెన్ని దుర్దశలున్న
బ్రతుక జూచు దేహి బహువిధముల
చిలకమర్తి. గయోపాఖ్యానము. II–iii–42

## దైవ పౌరుషములు

దైవమానుషంబులు గర్మఫల ప్రాప్తికి నిమిత్తంబులు
నన్నయ.భారత. అరణ్య. I–233

పురుషుండు మనంబున నర్థసిద్ధి నిశ్చయించి కర్మంబునందు కృతోత్సాహుండు గావలయునట్టివానికి దైవంబు సహాయంబయి కర్మసిద్ధిం గావించు

నన్నయ. భారత. అరణ్య. I-233

విచారపూర్వారబ్ధ కార్యంబునకు దైవంబును ననుకూలంబగు

నన్నయ. భారత. అరణ్య. I-268

తగుపని కుద్యోగించుచుఁ
దగ వెఱిఁగి మహితులకనుమతంబుగఁ జేయన్
జగతీసురవర కార్యము
లగు వారికిఁ గలుగు విధిసహాయత్వంబున్

తిక్కన. భారత. సౌప్త. I-33

సారమతిఁ బరికింపంగఁ బౌరుషంబు
కంటె దైవంబు ముఖ్యంబు గార్యసిద్ధి
కెచట నేనియుఁ బౌరుషమెసక మెసఁగ
నేనినది దైవదత్తంబయింత నిజము

తిక్కన. భారత. శాంతి. IV-42

క్షేత్రంబు పురుషకారము
ధాత్రీశ్వరబీజ మరయ దైవమ రెండున్
సూత్రపడఁ గూడెనేనిం
బాత్రంబగుఁ గర్మకరుఁడు ఫలములకెందున్.

తిక్కన. భారత. అనుశా. I-134

పౌరుషమ్ము దైవంబుఁ తోడ్పాటులేక
ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర

విత్తు సహకారిగాకున్న రిత్తనేల
వంధ్యమగుఁగాక తాఫలవంతమగునె.

భారత. అనుశాసనిక. I-136

మంత్రముల నౌషధములన మానుషంపు
జందములనోపి యుద్యోగ మిందుఁ జేయు
నట్టివారికి ననుకూలమై ఫలంబు
నెఱపఁ జూడఁడు దైవంబు

ఎఱ్ఱన. హ. వం. V-95

తన పౌరుషంబు వదలక
మనుజుఁడు కార్యంబొనర్ప మానుగ దైవం
బున యందుఁ బౌరుషమునం
దునుదత్ఫలసిద్ధిదోఁచుఁదుల్య స్థితిఁగోన్

మారన. మార్కం. పు. III-48

బలమెంత గల్గినఁ బరికించిచూడ
నలవెంత గల్గిన నదియేమి సేయు
పురుషుని వెరవుసఁ బోనీక పేర్చి
పరికించి దైవము ప్రతికూలమైన

గోనబుద్ధారెడ్డి. రం. రామా. యుద్ధ. పుట. 343

తనకు దైవంబులేకున్నఁ దానుజేయు
పౌరుషంబపకారమై పరిభవించు

మల్లికార్జునుఁడు. భా. రామా. బాల. 616

తా మొకటి దలచిన దైవ మొకటి దలంచు

వేమన

ధరణిఁ గర్మము కొంతతగిన జ్ఞానముకొంత
సరికిసరే కాని నిశ్చయములేదు

దైవికమొక కొంత తగు మానుషము కొంత
చేవలు చిగురువలెఁ జేసేను

అన్నమయ్య. అధ్యా. సం.

అలతులకు దైవయత్నము
బలవంతంబైననెల్ల పనులొందవు మహా
బలులకది లేక యుండినఁ
బలుకులు వేయేల కడమవడు సర్వంబున్

బైచరాజు. పంచతంత్రము. III-81

చావుఁదలపోసి మానవుఁ
డేవగదుష్కీర్తి వొరయకే దినములు పొం
దైవెడలునట్లు నడవఁగ
దైవంబట మీఁద మేలు తానఘటించున్

పెద్దన. మను. IV-107

ప్రారంభముల కెల్ల పౌరుషదైవ
సారముల్గలయట్టి సాధనంబులగు
లోలత వినువానిలోన నెంతయును
జాలంగ ఫలసిద్ధి జరుగదొక్కటను

సోమన. ద్విప. భార. సాప్తిక. 1. 6

అరయదైవాధీనుఁ డస్వతంత్రుండు
నరునకుఁ గార్యనిర్ణయశక్తిగలదె?

వరద... 638

స్వప్రయత్నవరహితులౌ జనులకెల్ల
దైవసహాకార సంపదల్ దనరగలవు?

గ. ప్ర. కుచేలోపాఖ్యానము. I-46



పురుషయత్నంబు కర్తవ్యమరయనెందు
జయ పరాజయములు దైవశక్తి జములు

దా. శ్రీ. దేవీభాగ. V-84

దైవమే యెక్కుడగు నెందుఁదలఁచి చూడఁ
బురుషకారంబునకు ఫలస్ఫూర్తి లేదు

దా. శ్రీ. దేవీభాగ. V-141

పౌరుషము చెల్లునావిధి ప్రతిఘటింప

అ. నారాయణదాసు. సావిత్రీచరిత్ర.

యత్నమొనరించు పురుషులకగును సిరులు
ధరనశక్తులు దైవము దైవమంద్రు
దైవమటులుంచి పౌరుషమేవహింపు
మపుడు సిద్ధింపకున్న తప్పందు లేదు

చర్లనారాయణశాస్త్రి. దూతాంగదము.

దైవసంకల్పము చెల్లుఁగాని జరుగం
గలవేమనుజప్రయత్నముల్

ప్ర. శా. వి. IV-7

దైవమనుకూల భావంబుఁ దాల్పకున్నఁ
బురుషయత్నంబు సఫలతఁ బొందఁగలదె

తనికెళ్ళ ప్రకాశశాస్త్రి. ప్రాక్పుర రాజ కుమారాభ్యుదయము. II-4

## దైవబలము

ఎప్పరుసునలెస్స సేసినను బౌరుషముల్ ఫలించుటెల్ల
నాదరణమునం బ్రసన్నమగు దైవముచేతన చూవె

తిక్కన. భారత. ఉద్యో. III-82

తనుఁదానెఱుఁగనివానికిఁ
దనుదాదండించుకొనిన తామసునకు నెం
దును దైవబలములేదు.

ఎఱ్ఱన. నృ. పు. II-143

పెక్కండ్రము గలమని యి
ట్లుక్కునఁ బోరఁబడుట నీతియును పాయముఁగా
దక్కజమగు దైవబలం
బెక్కుడు

ఎఱ్ఱన. హ. వం. I-86

దైవగతి కసాధ్యము కలదే!

కుమారరుద్రదేవుఁడు. భా. రా. అయోధ్య. 390

దైవాధీనము లోకము
దైవము సర్వంబు భూతతతికొడఁ గూర్చున్.

మల్లికార్జునుఁడు. భా. రా. కిష్కింధ. 668

దైవము నమ్మిన నిర్భరుఁడయిన యాతఁడు
ఏమార్గంబుల నెట్టుండిన నేమి?

అన్నమయ్య. అధ్యా. వం.

ఎంతనిపుణులైన నెవ్వారైన
దైవికార్థచయముఁ దప్పింపగాలేరు

పోతన. భాగవ. VII-402

ఎవ్వారికి నేరఁబోలు బలవంతపు దైవమునాక్రమింపగన్?

పోతన. భాగవ. VIII-200

దైవకృతమున కిల నసాధ్యంబుగలదె!

పెద్దన. మను. II-13

దైవములోన రక్షితుఁడె దైవ సురక్షితుఁడు

పాపరాజు. ఉ. రా. I-216

అన్నికార్యములు దైవాధీనబుద్ధి
నెన్న నేరకత్రోయ నెవ్వారితరము

వరద. రామా. అయో. పు. 348

దైవబలము దప్పిన బగవారై యుంద్రు ప్రాణబంధువులైనన్

కూ. జగ్గకవి. సుభద్రా. IV-130

దైవ మనుకూలమగునేని తడవులేక
యభిమతార్థంబుదెచ్చి ద్వీపాంతరంబు
నుండియైన దిగంతంబునుండి యైన
జలధినడుమ నుండియునైన సంఘటించు

కందుకూరి. రత్నావళి. I-9

పౌరుషముకన్న దైవిక బలములెన్న

తనికెళ్ళ ప్రకాశశాస్త్రి. బొబ్బిలిరాజు లండను యాత్రాచరిత్ర.

## దైవము

ఎవ్వరికి నీశ్వర తత్త్వమెఱుంగఁబోలునే

నన్నెచోడుఁడు. కు. సం. V-97

దైవాధీనము సర్వము

తిక్కన. భారత. III-450

ఎల్లయందును దా వసియించు నెల్ల
యదియుఁ దనయందు వసియించుటంద్రు వాసు
దేవుఁడను పేరికర్థంబు తెల్లమింత
యెఱుఁగు జనులందుఁ దగ వసియించు శుభము

తిక్కన. భారత. శాంతి. II-326

అందు నిందు ననక యన్నిటియందును
విష్ణువమరి యుండు —

వేమన

చెడ్డవాని మిగుల జెఱచును దైవంబు
అడ్డుపడడు వానికాపదైన

వేమన

జగమెల్లను శివమయంబ చర్చింపంగన్

కొ. గణపతిదేవ. శివయో. I-60

హరియే సకలాంతరాత్మకుఁడటుగాన
తిరమై యొకరినిందింపఁ దగదు

తా. అన్నమయ్య. అధ్యా. సం

పంచమహాపాతకుల భ్రమ వాప వశమా!
కానని యజ్ఞానులకు కర్మమే దైవము
ఆనిన బుద్ధులకు దేహమే దైవము
మానని కాముకులకు మగువలే దైవము
ఏమి నెఱుఁగని వారి కింద్రియములే దైవము
దోమటిసంసారి కూరవోర దైవము
తామసులకెల్లాను ధనమే దైవము
అహంకారులకుఁ దాఁగానే దైవము
దరిద్రుఁడైనవానికి దాత దైవము

తా. అన్నమయ్య. అధ్యా. సం

గతిలేనివారినిఁ గడతేర్చు దైవము

త్యాగరాజు. కృతులు. విష్ణు. 22

ఏకాలమ్మున కేమివచ్చునో నరుండెవ్వాఁడు దైవేచ్ఛకున్

తిరుపతి వెంకటకవులు. పండితరా.

## దైవయోగము

దైవయోగమున్ దాటగరాదు

పోతన. భాగవ. I-456

ఈశ్వరుండు విష్ణుఁడెవ్వేళ నెవ్వని
కేమి సేయుఁ బురుషుఁడేమి యెఱుఁగు

పోతన. భాగవ. I-177

దైవయోగంబు పెంపున నీజీవుఁడుదాఁ బ్రియాప్రియముల
బొందుం ద్రిలోకంబులన్

పోతన. భాగవ. IV-860

ఇందఱి బుద్ధులు నీశ్వరేచ్ఛకు సరిరావు
తనంతఁ దానూరకున్న దైవమే తోడౌను
కినిసి తాఁబదరి తేఁగిందు మీఁదౌను
దైవిక మెట్టుండునో తలఁచరాదు
చిత్తమేరీతినుండునో ఆవిధ మెవ్వరి కిట్టట్టనఁగరాదు
ఆదినంత మెట్టుండునో అరయరాదు

దైవమే నేరుచుఁగాక తగిలించ విడిపించ
ఈ వల సంసారికి నేమిసేయవచ్చును!

సహజ విహారుఁడు సర్వేశ్వరుఁడు గాన
వహిఁ దానెవచ్చినవి వలదనఁదగదు

కనురెప్పలతుదలఁ గట్టువడేఁగాలము
ఘనమైచేతుల తుదఁగర్మ మున్నది
మనసు కొట్టఁగొననే మరిదైవమున్నాఁడు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

దైవోపహతుఁడు సుకృతపుఁ
ద్రోవ వెదకి పోవనదియె దుర్గతియగు

పావరాజు. ఉ. రా. II-207

ఏపట్టునను గర్త యెద్దానికైన
ననయంబు నీశ్వరుఁడను నిశ్చయంబు
మనమున నిజమైన మఱిచాలు నధిప

సోమన. ద్విప. భారత. శాంతి.

ఊరకయుండిన దైవం
బేరీతి నొసంగునందు రెఱుఁగని మూఢుల్
భారము పైవైచిన సం
సారికి దైవంబు ఫలమొసంగకయున్నే

పు. తిమ్మన. సమీర. II-104

ధరఖర్వాటుఁ డొకండు సూర్యకరసంతప్త ప్రధానాంగుఁడై
త్వరతోఁ డంబరువెత్తి చేరి నిలచెన్ దాళద్రుమచ్ఛాయఁ ద
చ్ఛిరమున్ దత్ఫలపాత వేగమునవిచ్చెన్ శబ్దయోగంబుగాఁ
బొరి దైవోపహతుండు వోవునెడకుం బోవుంగదా యాపదల్

లక్ష్మణకవి. సుభాషితము

ఎందే వజ్రము తృణమగు
నందే తృణలవము వజ్రమగు దైవగతిన్

దా. శ్రీ. దేవీభాగవ. III-399

జతనము జేసియు దైవము
ప్రతికూలంబాయెనేనిఁ బాటిల్లఁ జెడున్

దా. శ్రీ. దేవీభాగవ. V-98

అకటవిపరీత దైవము నడ్డఁదరమె

ఆ. నారాయణదాసు. సారంగధర

ఎవ్వారైన నిను నమ్మిన గల్గవె ముక్తిసంపదల్

శ్రీ వేంకటేశ్వర శతకము. 29

దైవము దాయమైన తఱినేలా లగ్గువాటిల్లెడిన్

వేదము వేంకటరాయశాస్త్రి. ఉషానాటకము. II-39

సాయమొనరించు దైవంబు సత్క్రియలకు

నా. కృ. రావు. యత్నము. వెన్నెల వెలుగులు

## దైవసములు

పరభామపైఁ జూపు పరపనివారు
పరుల మర్మములెత్తి పలుకనివారు
తలపోయఁగా దేవతాసములు

గౌరన. నవనాథ.

ఎవ్వనికైన జన్మమున హృచ్ఛ్రమలేక సుఖాసుఖంబులన్
నవ్వుచు నొవ్వకే చెలువునన్ సతతంబును రాగలబ్ధితో
జవ్వనమూఁడి వార్ధకము సాఁగగ స్నేహము మెందుకొన్నఁదా
మవ్వపుఁగోర్కినట్టి యతిమానుషశాలికి మంగళంబగున్

వావిళాల వాసుదేవశాస్త్రి. ఉత్తరరామచరితము

## దోషము

దోషాచరులకు వెలిలోపుగలదె

నన్నెచోడకవి. కు. సం. IV-18

అడి చెదనవియూఁకించుట
యడుచుట మోయితట్టుగట్ట నడుచుట నెత్తు
ర్వెడలఁగ నడుచుట విఱుగఁగ
నడుచుట యొండొంటికంటె నధికపుఁ దప్పుల్

కేతన—విజ్ఞా. ప్రాయ. 51

ఎప్పుడు దప్పులు వెదకెడు
నప్పురుషునిఁ గొల్వఁగూడ దదియెట్లన్నన్
సప్పంబు పడగనీడను
గప్పలు వసియించు విధము గదరా సుమతీ!

సుమతీశతకము

ఆది గర్భేశ్వరత్వంబు యౌవనంబుఁ
జక్కఁదనమును నతిసాహసంబుఁ జనవు
నొక్కఁడొక్కండు చాలు దోషోత్కరమున

శ్రీనాథ. II-86

తప్పు లెన్నువారు తండోపతండంబు
లుర్వి జనులకెల్లనుండుఁ దప్పు
తప్పు లెన్నువారు తమ తప్పు లెఱుఁగరు

వేమన

పుట్టినదె ఒకతప్పు భువిమీఁదనట మీఁద
నెట్టన సంసారి నౌటె నిజము రెండో తప్పు
రట్టుకెక్కి దొరనౌటే నెట్టన మూఁడోతప్పు

తా. అన్నమయ్య. అధ్యా. ౨౦

దాసునితప్పు దండంబుతోసరి

లోకోక్తి

భాగ్యవంతునియిల్లు పాడుగాఁజేయంగఁ
బరదారగమన పాపంబె చాలు
సొమ్మున్నవానిల్లు చూడపుచ్చంగను
గొప్పవడ్డికినిచ్చు తప్పె చాలు

నుద్యోగియిల్లు సద్యోహానిసేయంగ
విసకుండ దొరసొమ్ముఁ దినుటె చాలు
కోమటియిల్లు సంకుచితంబు సేయఁబ
హ్మస్వముఁ దిన్నద్రోహంబెచాలు

చక్రాతి లక్ష్మీవరుసు. కోదండరామ శతకము. 18

భార్య గయ్యాళైనఁ బ్రాణనాథుని తప్పు
తనయుండు ధూర్తైనఁ దండ్రితప్పు

సూరకవి. రామలింగేశశతకము. 43

వయసు ముదిరిన మనుజుని వడియడంగు
సర్ప విష వేగమును గొంత శాంతినొందు
గాని తప్పెంత ప్రాఁతదియైనఁగాని
తప్పుగనెయుండు నింతైన నొప్పుగాదు

పానుగంటి. బుద్ధ. I

బల్లిదుల దోషములు పొరపాటు లగును
దుర్బలుల పొరపాటులు దోషములగు

చిలకమర్తి. గయోపాఖ్యానము. II-3

దొసఁగేరికైన లజ్జావహంబు

తిరుపతి. వేం. కవులు. బుద్ధ. IV-17

ద్యూతము

పాపవృత్తంబు జూదంబు పార్థివులకు

నన్నయ. భారత. సభా. II-166

మాయాద్యూతంబున జయించుట మహాపాతకంబు
ధర్మద్యూతంబున జయించుట ధర్మయుద్ధంబున
జయించు నంతియ పుణ్యంబు

నన్నయ. భారత. సభా. II-186

జూదంబున నెగ్గు పుట్టుఁ దీనన య్యేడు ఫలంబు
వేణుఫలంబునుంబోలె సహమూల వినాశంబునకు
నిమిత్తంబగు

నన్నయ. భారత. సభా. II-205వ

అనర్థమూలంబయిన ద్యూతంబుఁ బరిహరింపనినాఁడు
పాపంబగు

నన్నయ. భారత. అరణ్య. I-168

జూదపు సిరియాసపడంగాదు

తిక్కన. భారత. ఉద్యో. I-316

## ద్రోహము

ద్రోహాసక్తుల వైరాసల
మూహింపక రాఁజవెట్టియుక్తి రహితులై
స్నేహంబు పిదపఁజనునె య
పోహంబుగనుండుఁగాక పొనుబాటగునే

మంచెన. కే. బా. చ. III-6

ద్రోహియైనవాఁడు సాహసంబున నెట్టి
స్నేహితునికినైన జెఱుపుజేయు
నూహగలిగియుండు నోగుబాగులనక

వేమన

అప్తులవలెనుండి యహితంబదలఁచు
తప్తచిత్తుల నమ్మఁదగవును గలదె

తిమ్మయ. ద్విప. భారత. భీష.

అన్నకుఁ దండ్రికిన్ గురునకాపదయెవ్వఁ డొనర్చువానికిఁ
న్గొన్న మహోగ్రపాతకమగున్

పావరాజు. ఉ. రా. III-46

విటుని సర్వస్వము గ్రహింప వెలవెలంది
స్వచ్ఛకుల సతీ పాత్రంబు నభినయించు
విభుని భూములు హరియించువేడ్క ద్రోహి
భక్తివిశ్వాస గీతముల్పాడు చుండు

పానుగంటి. పద్మిని

## ద్వంద్వ ప్రభుత్వము

ఇద్దరు రాజులై యేర్పడి లేని
అవనిలోపల నాజ్ఞకమరికయౌను

శ్రీనాథ. పల. వీ. చ

బద్ధిగలుగు దొరలైతే
నిద్దఱికొకపారు పత్యమీఁదగదు సుమీ
యిద్దఱిమెడలను నష్టము
కద్దప్పకుందవరపు కవిచౌడప్పా !

క. చౌ. శతకము

## ద్వంద్వములు

పాపము పుణ్యము పరగనొకటనదె
ఓపిన వారలు ఒడిఁగట్టిడిది
నాలుకతుదనే నానారుచులును
పోలింప నొక్కటె.భోగ మూలము
పనివడియొక్కటె ప్రపంచమార్గము
వెలుఁగుఁ జీఁకటియు వెసనొకనాఁడే !

అన్నమయ్య. అధ్యా. సం

పూవువంటి చిత్తమింతే! పొల్లువంటికాయమింతే!
భావించనిందులఁ బసయున్నదా?
గంతివంటి గుణమింతే! గాలివంటి ప్రాణమింతే!
ఇంతరట్టు సేయనిందు నెడమున్నదా?
గచ్చువంటియిహమింతే గనివంటిపరమింతే
ముచ్చటికెందుకుఁ దుది మొదలున్నదా?

అన్నమయ్య. అధ్యా. సం

జయము లపజయములు సంపదలాపద
లనిలచలిత దీపికాంచలములు

పోతన. భాగవ. VIII-355

మూఢతానష్టిచేఁగదాబుద్ధి ప్రబలు
ధరణిలో ద్వంద్వములు తుల్య భరముగలవి
యొకటి లఘుతనొందనఁగాని యొకటి బరువు
చేఁ బ్రకాశమొందదు త్రాసు చిప్పలట్లు

పానుగంటి. వన. రాఘ. IV

## ద్విజత్వము

జననీ జనకుల చేనగు
జననం బాగమము తను విషయమని చెప్పన్
విను మాచార్యు వలన నొం
దిన పుట్ట జరామరంబు దివ్యంబునగున్

తిక్కన. భారత.అనుశా. IV-140

సముచితాచారంబు సంగ్రహించినఁగాని
చదువమాత్రమె కాఁడు సద్ద్విజుండు

అడిదము సూరకవి. రామలింగేశశతకము

## ద్వేషము

పగయ కలిగెనేని బాము న్న యింటిలో నున్నయట్ల

తిక్కన. భారత. ఉద్యో. III-20

ఏమిగతిఁ దలంచినం బగకు మేలిమిలేదు ధ్రువంబు

తిక్కన. భారత. ఉద్యో. III-21

పగ యెట్టివారి మనముల
వగఁబుట్టింపంగఁ జాలు

భాస్కరుఁడు. రామా. అరణ్య. I-54

పాడౌను దేశంబు పగమించెనేని

శ్రీనా. పల. వీ. చ

పగవృద్ధిఁ బొందించు భ్రష్టులెకాని
అడగించు నేర్పరు లవనిలో లేరు

శ్రీనా. పల. వీ. చ

పగయుడుగఁ గోపముడుగును
పగయుడుగం గోర్కెలుడుగుఁ బరజన్మంబుల్
తగులుడుగు భేదముడిగినఁ
ద్రిగుణంబులు నుడుగు ముక్తి స్థిరముగు వేమా ?

వేమన

పలు తెఱంగులఁ బగ వెలయుచుండెడి చోటఁ
జిటుకుమనని ప్రియము జెప్పవలయు

వేమన

వైరినొచ్చినమీఁదం బగ చెల్లునే

ధరణిదేవుల రామయమంత్రి. దశా. చరిత్ర. IV-115

భూతద్వేషము లేకయుండుటె సదాపుణ్యంబగున్
దా. శ్రీ. దేవీభాగవ. IX-667

ధనమదము

ధనమెట్టివారికిన్
గడుకొని చేయకుండునె జగన్నుత గర్వముదుర్వివమోహమున్
నన్నయ. భారత. సభా. I-31

తమ్మమానుష కాలోచితంబులైన
కీర్తనంబులమై పులకించు కొండ్రు
తా రమర్త్యులుగా మదిఁ దలఁతురహహా
విత్త మద మత్తచిత్తులై వెఱ్ఱిజనులు
శ్రీనాథుఁడు. శివరా. II-96

దైవ కంట కుండు ధనముచే గర్వించి
సకల సంపదలను చాల దనిసి
కడకు తాను మేలు గానక చెడిపోవు
వేమన

కనియుఁ గానలేడు కదిలింప డానోరు
వినియు వినగలేడు విస్మయమున
సంపదగలవాడు సన్నిపాతకమది
వేమన

కడు లచ్చి గలిగె నేనిం
గుడుతురు గట్టుదురుగాక కొడుకులనగుచున్
బడుగుల వాడలపైఁ బడ
విడుతురె
పోతన. భాగవ. X-328

శ్రీమదాంధులు సామంతంబుచేతఁ జిక్క-
బడుదు రే యెందు

పోతన. భాగవ. X-580

............మీఁదు గానక
శ్రీమదమున మానధనులు చెనకుదు రొరులన్

పోతన. భాగ. X-176

ఖలుని హృదయంబు సిరిగల్గ కఠిన మగును

శేషాద్రి రమణకవులు. బాలనీతి శతకము. 28

## ధనము

అర్థమ యనర్థ మూలం
బర్థమ మాయావిమోహనావహము

నన్నయ. భారత. అరణ్య. I-28

అర్థంబు వలన దర్ప కార్పణ్యా మాన
భ యోద్వేగంబులు వుట్టుఁ గావున
నర్థోపార్జన చింత సేయ వలదు

నన్నయ. భారత. అరణ్య. I-29

కలుములెదరైన నేమియు నిలువవు

నన్నెచోడ.కు. సం. II-74

ప్రాణంబుల కంటెను రూపింప నర్థంబు తీపు

ఎఱ్ఱన. భారత. అరణ్య. VI-111

అవనీశ నిర్ధనులగు వారు సేయు
వివిధ యత్నంబులు వెస నిదాఘమున
నడరెడు సెలయేఱులడఁగెడు భంగిఁ
జెడిపోవునని బుధుల్ సెప్పఁగా వినమె

అర్థంబె విద్యయు నర్థంబె నేర్పు
నర్థంబె కీర్తియు నర్థంబె పెంపు
నర్థంబె కులమును నర్థంబె గుణము
నర్థంబె శీలంబు నర్థంబె బలము
నర్థంబె పుణ్యంబు నర్థంబె భూమి
యర్థంబె ప్రాణంబు నర్థంబె రూపు
నర్థంబె ఖ్యాతియు నర్థంబె నీతి
యర్థంబె భూతియు నర్థంబె మతియు
నర్థంబె యెఱుకయు నర్థంబె సుఖము
నర్థంబె శుచియును

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

ద్రవ్యంబు వచ్చునా తవిలి వెన్వెంట

శ్రీనాథుఁడు. పల. వీ. చ

ధనమూలము జగమంతయు
ధనవంతునికిష్ట మగు పదార్థములెల్లం
దనచేతిలోని వగుటను
నధనమార్జింపంగ నెవ్విధంబున వలయున్

జక్కన. విక్రమార్క. 174

నేలం బాఁతిన నన్యుల
పాలవు ధన మొండె ముచ్చు పాలవు ధరణీ
పాలుని పాలవుఁ గావున
వాలాయముఁగుడుచు విడువవలయున్ ధనమున్

జక్కన.విక్రమార్క. 178

ఏలాదాఁచెద రర్థము
లేలాయర్థులకుఁ బెట్టరేలా కుడువం
జాలరు నిలువరు సిరిపెను
గాలికిఁ గంపించు దీపకళికయుఁ బోలెన్

ఆక్కన. విక్రమార్క. 184

కలిమిదాఁపక పైతృకంబుఁ జేసినవాఁడు
పుణ్యతీర్థము లాడఁ బోవువాఁడు
వితరణ శీలుండు వినయము గలవాఁడు
పరకాంతలకు నాశ పడనివాఁడు
శూరత మెఱసి ప్రస్తుతికి నోర్వని వాఁడు
సత్య శౌచంబుల సల్పువాఁడు
బాంధవ పితృ మాతృ భక్తిఁ జెందినవాఁడు
కిల్బిషంబులకు శంకించు వాఁడు

సప్త సంతాన విఖ్యాతి జరగువాఁడు
నిఖిలభూత దయాసక్తి నెగడువాఁడు
మేలు మరువని వాఁడు లక్ష్మికి బ్రియుండు
వానియొద్దనె హరియును వదలకుండు

జూదరి దుష్టు దుర్వ్యసనుఁ జోరుని సజ్జనదూషకున్ మృషా
వాదిఁ గృపావిహీను గృహవప్రవిఘాతకు లోభి సంతత
స్వోదర పూరకున్ బలితునుద్ధతు నిం జెడఁబాయు లక్ష్మి వే
దాది సమస్తవిద్యలు పరాన్న పరాయణుఁ బాయుకైవడిన్

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు. జైమిని. III-40,1

కల్లలాడినఁ జేరునే ధనము

గౌరన. హరిశ్చంద్ర

పసిఁడికై నిరసించి బంధువులైన
నసువులు గొనఁజూతు రన్యాయమునను

గౌరన. నవనాథ

ధనము ధైర్యమరయదగు భూమిపతులకు

విత్తహీనమైన వేళయందును దల్లి
దనయు లాలు సుహృదులనెడు లోకు
లెల్ల శత్రువులగుదురు

కులము లేనివాడు కలిమిచే వెలయును

తల్లి బిడ్డలకును దగవుపుట్టించెడు
ధనము సుఖము గూర్పదని వచింత్రు

ధర్మకంటకుండు ధనముచే గర్వించి
సకలసంపదలను-జాలదనిసి
కడకుదాను మేలుగానక చెడిపోవు

ధనమూ మూలము జగమున
ధనమూ మూలంబు సకల ధర్మంబులకున్

విత్తహీనుడైన నుత్త సన్యాసిరా

విత్తహీనుడంత రిత్తమైపోవును

వేమన

పరదేశమె నిజదేశము
పరులే బాంధవులు ద్రవ్య పరిపాలునకున్

ధరణి నసాధ్యం బెయ్యది
పరమార్థము ధనము సూవె ప్రజలకునెల్లన్

దూబగుంట నారాయణకవి. పంచతంత్రము

అర్థమునఁ బండితుండగు
నర్థమునన్ బలసమగ్రుఁడగు నర్థమునన్
బార్థివుఁడును బుణ్యుండగు
నర్థమునను భువన పూజ్యుఁడగు నరుఁ డెందున్

ధనహీనుఁ డధముఁ డల్పుఁడు
ధనహీనుఁడు మూఢుఁ డప్రధానుఁడు ధర న
ద్ధనహీనుఁడు తలపెట్టిన
పని గ్రీష్మ సరిజ్జలంబు పగిదినడంగున్

సతతోత్సాహపరుం గ్రియానిపుణు భాస్వద్దీర్ఘ సూత్రుం గృత
జ్ఞతమున్ సత్యధురంధరున్ మధుర భాషా వేది సౌహార్ద భా
సితు నారంభ విజృంభ మాణు గరుణాసింధున్ శుచిన్ శాంతు ని
ర్జిత కాముం దనుఁదా వరించు సిరి నిర్నిద్రానురాగంబునన్

బైచరాజు. పంచ. II-121, 127, 163

అర్థ మార్జించునపుడును నది సురక్షి
తంబు గావించునపుడునుఁ దద్వియోగ
మైన యప్పుడు దుఃఖంబె కాని యెందుఁ
గలిమి సుఖమని చెప్పుట కాసిపలుకు

వెన్నెలకంటి సూరన. వి. పు. VIII-374

ధని యెవ్వాఁడగు వాఁడె సత్కులుఁడు మేధాశాలి సర్వార్థద
ర్శనుఁ డత్యుజ్జ్వల మూర్తి యప్రతిమ వాగ్జాలుండు సర్వజ్ఞుఁడౌ
ననఁగా శోభిలు నెల్ల సద్గుణములర్థైకాశ్రయంబుల్ సుమీ

ఎల. బాల. సుభాషితములు అర్థ. 32

అర్థవంతుని విద్యయే అతిశయించు
నర్థమూలంబు జగమెల్ల ననఁగ వినవె

రఘునాథరాయలు. వాల్మీకి చరిత్ర. III-96

ధనము చుట్టరికంబు ధనము ధర్మంబు
ధనమె రూపంబును ధనమే కులంబు

కులమును విద్యయుఁ గోటిగల్గినను
నలవున శూరత నధికుఁడై యున్న
వెరవు మిక్కిలియైన విత్తహీనుంఁడు
పురణింప జనులచేఁ బూజ్యుడుగాఁడు

.........ధనహీనుఁడైన
తలి దండ్రులు లొల్లరు తనయునినైన
ధనవంతుఁడైన నాతరివాని నైన
వినయంబుఁ బ్రియముఁ గావింతురు ప్రజలు
పాత్రదానంబు నపాత్ర వర్జనము
ధాత్రి విత్తము గల దానికి ఫలము

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ. I

కరమొప్ప ధర్మార్థ కామమోక్షములు
గరిమతో నర్థంబుగలవాని కమరు

సోమన. ద్విప. భారత. శాంతి I

ఏనరునకు విత్తముగల
దానరుఁడె కులీనుఁడధికుఁ డార్యుఁ డతండే

ధీనిధి ధన్యుఁడు నేర్పరి
నానాగుణగణము కాంచనంబున నిలుచున్

ఏ. ల. కవి. సుభాషిత త్రిశతి

దానము భోగము నాశము
పూనికతో మూఁడు గతులు భువి ధనమునకున్
దానము భోగము నెఱుఁగని
దీనుని ధనమునకుఁ గతిత్రృతీయమె పొసగున్

ఏ. ల కవి. సుభా. నీతి.

ధనమదమున నిను మఱతును
ధనరహితత్త్వమున నిష్ట దగ్ధమగు విర
క్తినిఁ బొంద వింద్రియంబులు
తను ధర్మము దరుము గోప తనయా కృష్ణా

కృష్ణదాసు. కృష్ణశతకము

ధనము లేకున్న దుఃఖమురా (చాల)
ధనము గల్గినేసి దాచ దుఃఖమురా

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి సంపాదితము. పల్లెపదాలు పు. 249

ఆస్తి వేరెట్లుర్వీకన్న నయమ్ము

అ. నారాయణదాసు. రుబాయత్

జనుఁడు మితిలేని బంగారు తన గృహమున
గూర్చ సర్వదా చింతతోఁ గుందుచుండు
గాని మృతి నొందు తఱిఁ జిల్లి గవ్వనైనఁ
బాళిఁ దన వెంటఁగొనిపోవఁ జాలఁడకట

సిరి విడనాడు వాడవని జెందును దుఃఖపరంపరల్గమున్

విశ్వ. దే.

త్యాగికి యాచకున కెందు ధనము నిలుచునే

ధర్మవరం. చిత్రనళీయము. II- 30

ధనముబాసిన నరు జీవితంబుకంటె
ధనము లేకున్న నరు జీవితంబు మేలు

తిరుపతి వేంకటకవులు. మృచ్ఛకటికము. . V-71

పురుషుం డర్థమునకు గిం
కరు డర్థము పురుషదాసి గాదెన్నడు

తిరుపతి వేంకటకవులు. పాండవోద్యోగము. VI-166

మూల విధిచేత ధనియైన మనుజుఁడకట
భాగ్యహీనుఁడుఁగా జేయఁబడిననాడు
ప్రాణ మిత్రులు శత్రువులౌదు రెంత
భక్తిగలపరి జనము విరక్తిజెందు

తి. వేం. కవులు. మృచ్ఛకటికము. I-19

బలమర్థమూల మర్థము
ఫలియింపఁగఁ గొంత విఘవ వలయును దానిన్

శ్రీపాద. శ్రీకృష్ణ భారతము. అరణ్య. II-116

కలవారల మన్నింతురు
తలపరు యోగ్యత్వ మకట ధన మెట్టిదియో

తనికెళ్ళ ప్రకాశశాస్త్రి. ప్రాక్పుర రాజకుమారాభ్యుదయము

కలుష భూయిష్టమగు కలికాలమందు
జనవశీకరణైక సాధనము ధనము

కూచి నరసింహం. వనవాసి. V-44

## ధనవంతుడు

అర్థవంతులకు రాజచోర స్వజన
జలానలంబుల వలన భయంబు
నియతంబు

నన్నయ. భారత. అరణ్య. I-26

జలములందు మత్స్యంబులు చదలఁ బక్షు
లామిషంబెట్లు భక్షించునట్లు దివిరి
యెల్లవారును జేరి యనేక విధుల
ననుదినంబును భక్షింతు రర్థవంతు

నన్నయ. భారత. అరణ్య. I-27

శ్రీ ప్రాప్తించిన నరుఁడొండొక చూపున వర్తించు

తిక్కన. భారత. సౌప్తిక. I-46

ఎలమి గల లక్ష్మి యొకనికిఁ
గలిగిననది పంచి కుడువఁగా గూడి యనే
కులు పెక్కు భంగులం గలి
బిలినేయుదురతనిమనసు భేదించి తగన్

కేతన. దశకుమార. II-89

అధికులు వేదవేదాంగ పారగులు
బుధులు దూర్వంబులఁ బూతాక్షతలను
నర్థంబు గలవాని నమరఁ బూజింతు
రర్థి మోక్షార్థులై యడవుల నుండు
మునిపుంగవులు కందమూలంబులిచ్చి
ధనవంతుఁడగువాని దర్శింతురెలమిఁ

ఛాయక మంగళ పాఠకానేక
గాయక కులములు గలవానిఁబొగడు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ. పు. 524

పండితుఁడాతఁడాతఁడు ప్రభావ సమగ్రుఁడతండు శూరుఁడా
తండు వివేకి యాతఁడు వదాన్యుఁడతండు మహాకులీనుఁడా
తండు కళావిదుండతఁడు ధన్యుడతండు మనోజ్ఞమూర్తియై
వ్వండు భవత్కృపా కలనవైభవలక్ష్మికిఁ బాత్రుఁడిందిరా

ఎవ్వనినేని నీవుదయనించుకఁ జూచిన వానిఁ జూతు ర
ప్పువ్విలు కానిఁగా సతులు భూపతిగాఁ ప్రజ కల్పకంబుగా
న వ్విబుధాశ్రిత ప్రతతి యంబుధిగాఁ గులగోత్ర గోత్రముల్
కవ్వడిగాఁ బరద్విషులు గర్ణునిగాఁ గవులెల్ల శ్రీసతీ

శ్రీనాథుఁడు. కాశీ. III-45, 46

వరసతులఁ గవయుకీర్తియు
సరసాహారములు గుడుచుకీర్తియు సిరికిం
దిరమైన దానకీర్తియు
నొరులకు లేవధిక భాగ్యయుతులకుఁ దక్కన్

శ్రీమంతుఁడె కులవంతుఁడు
శ్రీమంతుఁడె సుభగరూప జితకంతుఁడు సూ
శ్రీమంతుఁడె గుణవంతుఁడు
శ్రీమంతుఁడె సిద్ధ శేముషీ మంతుండున్

జక్కన. విక్రమార్క. II-175, 181

ఏ నాటన్ మిన్కులు గల్గు వారికగు
జన్మస్థాన సౌఖ్యోన్నతుల్

భట్టుమూర్తి. వసు. I-111

ఎలమిని ధనవంతుఁ డెదిరి దన్నెఱుఁగక
కన్ను గానకిలను గర్వపడును

వేమన.

కలిగిన మనుజుండు కాముఁడై సోముఁడై
మిగుల దేజములను మెఱయుచుండు

వేమన.

అన్వవాయ వృద్ధు లాచార వృద్ధులు
శౌర్యవృద్ధులిద్ధ సత్య వృద్ధు
లాగ మార్థ వృద్ధు లఖిలార్థ వృద్ధులు
కొలుతురర్థ వృద్ధుఁగోరి వేడి

కనకముఁగూర్చి యెన్నఁబడుఁ గాదె సమస్త గుణంబులర్థమె
వ్వనికి వసుంధరం గలదు వాఁడె కులీనుఁడు వాఁడె పండితుం
డనఘుఁడు వాఁడె వాఁడు సకలార్థ విధిజ్ఞుఁడు వాఁ డవక్త వాఁ
డ నయపరుండు వాఁడ ప్రకట ప్రియ భాషణుఁడుం బ్రసిద్ధుఁడున్

బైచరాజు. పంచ. II-122,124

కలవానికిఁ జుట్టంబులు
గలరు హితుల్గలరు భటులు గల రఖిలంబున్
గలదు మఱి లేనియట్టిది
కలవానికి నీడు జోడు గలదా జగతిన్

బైచరాజు. పంచ. II-125

కులజుఁడు పూజ్యుండు గుణనిధి ఘనుఁడు
చెలువుం డుదారుండు శిష్టవర్తనుఁడు
కర్తయు భోక్తయు ఘన తత్త్వ నిధియు
గీర్తనీయుఁడు మంత్రి కేవల ప్రభుఁడు
ననఁ జాలు జగమునం దర్థవంతుండు

తిమ్మయ. ద్విపద భారత. ఆది.

భూరి ధనాఢ్యుల చొప్పనేకమై
గౌరవమున్ లఘుత్వమును గైకొను వస్తువులందు నెల్లెడన్

ఏ. ల. కవి. సుభా. నీతి. 37

ధనము గలవాఁడె ఘనతను గనెడు చోట్లు
రెండె కలవందు మొదటిది 'రెయిలు' బండి
రెండవది పణ్య సుందరీ గృహము దలఁప
మూఁడవది వేఱొకటి లేదు ముజ్జగముల

విశ్వ. దేవ

ధనాశ

అర్థాసక్తుండయినవాఁడు శుభంబులు వడయనోపండు

నన్నయ. భారత. అరణ్య. I-26

పసిఁడి మీఁద నాస పాటిన మనుజుండు
తనకు వచ్చుకీడు తలఁపఁ గలఁడె

మంచన. కేయూర. IV-78

ఎదిరిఁ దనవలెనె తానెఱుఁగ నేర్చిన ఫలము
అదిగదా ద్రవ్యమోహంబు గడ చనుట

అన్నమయ్య

కాంచనంబుమీఁది కాంక్ష మోహము గప్ప
విడువలేరు ప్రజలు విశ్వమునను

వేమన

తరగల్ పిప్పల పత్రముల్ మెఱుఁగుటద్దంబుల్ మరుద్దీపముల్
కరి కర్ణాంతము లెండమావులతతుల్ ఖద్యోత కీట ప్రభల్
సురవీధి న్లిఖితాక్షరంబు లసువుల్ జ్యోత్స్నా పయః

పిండముల్

సిరులందేల మదాంధు లౌదురు జనుల్ శ్రీకాళహస్తీశ్వరా

ధూర్జటి. కాళహస్తీశ్వర శతకము. 23

ధనము మీఁది వాంఛఁ దల్లిని దండ్రిని
భ్రాతృ వృద్ధ జనులఁ బరిభవించు

భవానీశకవి. ధర్మ. VII-23

ధన్యుఁడు

ఎవ్వనింటికి బ్రహ్మజ్ఞుఁ డేగుదెంచుఁ
బ్రియముఁ గారుణ్యమును గల్గి భిక్షగొనఁగ
వానిఁ బితృదేవతలు హర్షవైభవమునఁ
బొగడుదురు కేలివర్తనా భోగకముగ

శ్రీనాథుఁడు. భీమ. V-194

కన్ను లెదుటిదే ఘనవైకుంఠము
వెన్నుని గొలిచిన విజ్ఞానికిని
తలఁచినదెల్లా తత్త్వరహస్యమె
తెలిసిన యోగికి దిన దినము

పలికినదెల్లా పరమ మంత్రములై
ఫలియించిన హరిభక్తునికి
పట్టినదెల్లా బ్రహ్మాత్మకమే
పుట్టుకు గెలిచిన పుణ్యునికి

అన్నమయ్య

కపటముడిగి గురుని కై దండ యొనరించి
యుపముతోడ భక్తి యునికిఁ జేసి
తప మెఱింగినంత ధన్యతి వాడమును

వేమన

ఒక్క భార్యను సేవించు చుండు నాతఁ
డొక్క విభు నాశ్రయించుచు నుండు నాతఁ
డొక్క దేవుని ధ్యానించు చుండు నాతఁ
డిహ పరానంద జలనిధి నీఁదు వాఁడు

పానుగంటి. సరోజిని. II

ధన్యుండాత్మాభిముఖతఁ దా రమియించున్

కాంచనపల్లి కనకాంబ. ఆనందసారము. 842

నిర్మలాంతరంగంబుచే నెగడి యుండి
కామలోభాది రిక్తుఁడై క్రాలి యుండి
బాలు రీతిని నెవ్వాఁడు భవ్యుఁడగును
వాఁడెపో ధన్యుఁడును బూజ్యుఁడీడితుండు

సురవరం ప్రతాపరెడ్డి. ఉచ్ఛలవిషాదము. IV-68

ధనము కోప మహాతాశనేంధనము మాత్సర్యాది దౌర్గుణ్య వ
ర్ధన మౌదార్య గుణావరోధనము మిత్రభ్రాతృ సౌహార్ద శో

ధనము త్సేక మదాప్తి సాధనము పుత్రజ్ఞాతి సంప్రీతి బం
ధనమా దీనిఁ దృణీకరించు నరుఁడే ధన్యుండు మాన్యుండగున్

క్రాలేటి లక్ష్మీనృసింహకవి. పంక్తిరథోపాఖ్యానము. I-189

## ధర్మ నిర్ణయము

తన యెఱిఁగిన యర్థం బొరుఁ
డనఘా యిది యెట్లు సెప్పుమని యడిగినఁ జె
ప్పని వాఁడును సత్యము సె
ప్పని వాఁడును ఘోర నరక పంకమునఁ బడున్

నన్నయ. భారత. ఆది. I-137

ఎల్ల యందును ధర్మ సద్భావ మొక్కని కేర్పరింపఁగ
బ్రహ్మకైనను బోలునే

నన్నయ, భారత. సభా. II-236

సభకు వచ్చి ధర్మసందేహ మడిగిన
నెఱిఁగి చెప్పకుండిరేని సభ్యు
లనృతదోష ఫలమునం దర్థ మొందుదు
రనిరిధర్మ వేదులయిన మునులు

నన్నయ. భారత. సభా. II-237

ధర్మ వెఱిఁగి దానిఁ దానొండుగాలాభ
లోభ పక్షపాత లోలబుద్ధి
సభలనెవ్వఁడేని సభ్యుఁడై పలుకు వాఁ
డనృత దోష ఫలము ననుభవించు

నన్నయ. భారత. సభా. II-238

ధర్మం బధర్మ విద్ధంబయి సభకు వచ్చిన దానిం దీర్పని
సభ్యులధర్మ విద్ధులగుదురు మఱి సభ్యులు కామ క్రోధములు
విడిచి యధర్మంబు నాపని నాఁడయ్యధర్మంబు నందొక్క-

పాదంబు సభ్యుల నొక్క-పాదంబు భూపతిఁ దక్కిన
యది కర్తనుం బొందు; సమంజసులైన సభ్యులచేత
విధ్యుక్తంబయ్యెనేని నధర్మంబు కర్తనుం బొందుఁగావున
ధర్మంబు తప్పక చెప్ప వలయు

నన్నయ భారత. సభా. II-243

ఆగమోక్తవిధంబుఁ బ్రత్యక్షమును స
మాచరణముఁ బృథగ్విధ వ్యాకులములు
ధర్మసూక్ష్మత యిమ్మూఁటఁ దథ్య మిట్టి
దనఁగరాని యట్లున్నది యనఘచరిత

ఇవి మూఁడు తెఱంగులు ధ
ర్మవు సూక్ష్మత నిశ్చయింప ముఖ్యపదంబుల్
దివిరికొని యివియ చూచుట
యవనీశ్వర పూర్వమునుల యందుఁగలుగుటన్

తిక్కన. భారత అను. V-417,418

తగవు తీర్చువేళ ధర్మంబు దప్పిన
మానవుండు ముక్తి మాని యుండు

వేమన

దాక్షిణ్యంబును బక్షాపక్షంబులు దలఁప కుభయ పక్షము
లెనఁగా
నీక్షించి తగవు దీర్పు విచక్షణులకు నిహపరముల సౌఖ్యము
గల్గున్

పాపరాజు. ఉత్తర. రామా. VII-236

ధర్మంబు సభ్యులు దప్పకుండంగ
నిర్మలమతి నెందు నెఱిఁ జెప్పవలయు

బాలసరస్వతి. ద్విపద. భారత. సభా

ధర్మపరులు

ధర్మువు నుచితంబుఁ దప్పనివారల
సదమలాచారుల నుదిత సత్య
రతుల నఖల లోకహిత మహారంభుల
భూరిగుణుల నిర్జితారి వర్గు
లై వెలుంగువారి దైవంబ రక్షించు

నన్నయ. భారత. ఆది. II-14

అలిగిన నలుగక యొగ్గులు
పలికిన మఱి విననియట్లు ప్రతివచనంబుల్
పలుకక బన్నమువడి యెడఁ
దలఁపక యున్నతఁడు చూవె ధర్మజ్ఞుఁడిలన్

నన్నయ. భారత. ఆది. III-147

తప్పఁ బలుక నగునె ధార్మికులను

నన్నయ. భారత. ఆది. IV-79

ఆత్మరక్షణకు నగ్గలంబు ధర్మరక్షయ యుత్తమ ధార్మికునకు

నన్నయ. భారత. ఆది. VI-220

తనరుచు దైవయుక్తి మెయి ధర్మువు సత్యముఁ దప్పకున్నయ
య్యనఘుల పైతృకంబయిన యంశము మిన్నక వజ్రపాణికై
నను గొనఁబోలు నయ్య

నన్నయ. భారత. ఆది. VIII-36

ధర్మవర్తులై పూతగుణాభిరాములగు
పుణ్యులకున్ సులభంబు లెవ్వియున్

తిక్కన. నిర్వచనోత్తర III-75

ధాత్రిలో విను పదివేవురందొకఁడు
విశ్రుత ధర్మ పరాయణుండు గల్గునో కలుగండో

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-127

ఆత్మధర్మ నిరతులైన పుణ్యాత్ములు
దుర్లభులుసమస్త దురితములును
శాంతిఁ బొందువారి సంసర్గమున

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-243

తానును జనులేదను కొన
బూనుదురో దాని నరసి పొందిక చెడనీ
రాని పథంబున నడచిన
దానన ధర్మాత్ముఁడండ్రు

వేమన

ధర్మాత్ములైన వారి
కాత్మ గురు బంధు రక్షనాయంబకాదె

పుష్పగిరి తిమ్మన. సమీర. III-6

తనూజునైనఁ గృపఁగాంతురె క్రూరుని ధర్మవర్తనుల్

భవానీశకవి. ధర్మ. VII-83

తమ సౌఖ్యములైన మాని ధర్మము నిలఁబెట్టువారి
విమల చరిత్రం బెప్పుడు వినవలయుంగోరి కోరి

నారాయణదాసు, యదార్థరామా. పు. 104

## ధర్మము

ఆలును దాసియున్ సుతుఁడు
నన్నవి వాయని ధర్మముల్ మహిన్

నన్నయ. భారత. ఆది. III-174

ఎల్లలోకంబులు ధర్మువు నందనిలుచు

నన్నయ భారతము. ఆది. V-92

ఆపదయయినను ధర్మువ
ప్రాపున రక్షింప వలయు

నన్నయ భారత. ఆది. VI-221

కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్యము

నన్నయ. భారత. సభా. II-9

రాజ్యంబును త్రివర్గంబును ధర్మమూలంబులు

నన్నయ. భారత. అరణ్య. I-48

ధీరమతియుక్తిఁ జేసి వి
చారింపఁగ నిక్కువంబు సర్వజన స్వ
ర్గారోహణ సోపానం
బారఁగ ధర్మంబుచూవె

నన్నయ. భారత. అరణ్య. I-229

సాక్షియును ధర్మదర్శియు
సాక్ష్యవిధులు దప్పఁగాదు

నన్నయ భారతము. సభా. II-242

ధర్మువు సర్వంబునకు
హితంబుగ వలయున్
ధర్మజ్ఞులైన పురుషులు
ధర్మమునకు బాధసేయు ధర్మువునైనన్
ధర్మముగా మదిఁదలఁపరు

నన్నయ. భారత. అరణ్య. III-230,31

.........ధర్మువుల కెల్లియుండి బో
ధనులరయంగ వచ్చిన నధర్మములై చెడుఁగొన్ని ధర్మవ
ర్తనములు గాక తోఁచి తుదిధర్మములై చనుగొన్ని కర్మముల్

తిక్కన భారతము. ఉద్యో. I-334

సకలపుణ్య కర్మచయమును నొకదెస
వినుము పాడిఁదప్ప కునికియొక్క-
దిక్కు-దీని శ్రుతులు తెలిపెడునెడఁబాడి
కలిమియెందుఁ బెద్దగా నుతించె

తిక్కన. భారత. ఉద్యో. II-66

పాడిగలిగిన నిహలోక ఫలము లెల్లఁ
జేరుటయకాదు కీర్తియుఁ జెందుఁ బురుషు

తిక్కన. భారత. ఉద్యో. II-67

ఎవ్వాలన ధర్మంబు గలుగు
నవ్వాలనికి జయంబు గలుగుట దప్పదు

తిక్కన. భారత. కర్ణ. II-126

అర్థసిద్ధికంటె నరయ నెక్కు-డు ధర్మ
సిద్ధిదాన సకలసిద్ధులును బ్ర
శస్తభంగిఁ జేరు శాశ్వతకీర్తియు
సంభవించుఁ గలుగు సద్గతియును

తిక్కన. భారత. శాంతి. II-408

బ్రహ్మచర్యాదులగు నాల్గుఁ బాదమహిమ
గానఁబరగెడు ధర్మమొక్క-టియ చూవె
యెవ్వఁడెందు వర్తించిననేమి సకల
కర్మ ఫలరూపకత్వ మొక్క-టియ కాదె

తిక్కన. భారత. శాంతి. V-336

అరయఁగ ధర్మతంత్రములయందు నిరర్థము లేదొకండు నె
న్నెవ్వరిమదియెందు వ్రాలెఁదగ వారలు దానినపూని యాచరిం
తురదియ వారి కిష్టఫలదోహద కార్యమొనర్చు ...

తిక్కన. భారత. శాంతి. VI–545

తప్పక కాన్పఁగ లేమిం
జెప్పెడు వారలును దద్విశేషము దప్పం
జెప్పఁగ ధర్మంబు తెరువు
దప్పనది క్రియాపరులకు దైన్యము దెచ్చున్

తిక్కన. భారత. అనుశా. V–410

ధర్మంబు బహుమార్గ దృష్టంబయి
సూక్ష్మంబయి యుండు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V–25

వేద విహితంబులును శాస్త్రవిహితములును
శిష్ట చరితంబులును ననఁజెప్ప నొప్పి
ధర్మములు మూఁడు విధములఁ దనరుచుండుఁ
గడఁగి యిన్నియు సద్గతికారణములు

ఎఱ్ఱన భారత. అరణ్య. V–49

నీతి పథమునఁగార్యంబు నిశ్చయించి
తగవు దప్పక సేయు నతండు మీఁద
నిడుమ పొందఁడు ధర్మంబు విడిచి చొప్పు
దప్పి కావించు నతఁడు సంతాప మొందు

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 99

ధర్మమునె పలికిన దైవంబుతోడయా

వేమన

బొంది యెవరి సొమ్ము పోషింప బలుమారు
ప్రాణ మెవరి సొమ్ము భక్తిసేయ ?
ధనము నెవరి సొమ్ము? ధర్మమే తన సొమ్ము

వేమన

ధర్మమే నృపులకు దారక యోగంబు

వేమన

కర్తయొనరించు ధర్మము
కీర్తికి నాస్పదము ధర్మకీర్తులు ఘనవి
స్ఫూర్తికిఁ గారణము

అనంత. భోజరాజీయము. II–208

తత్త్వ జిజ్ఞాస యనునది ధర్మజిజ్ఞాస
యగుటఁగొందఱు ధర్మంబె తత్త్వంబని పలుకుదురు

పోతన. భాగవ. 1-25

ధర్మంబు తన్నుఁ బెనుచును
ధర్మంబభి వృద్ధి పొంది తను బ్రదికించున్
ధర్మము కర్మ కరంబని
ధర్మం బేమఱరు సంతతము దత్త్వజ్ఞుల్

బైచరాజు. పంచ. III-126

.........ధర్మము చేతఁగాదె యీ
సమధిక సంపదల్ దొరసి సంతత మందఱమున్ సుఖించుటల్

పాపరాజు. ఉ. రా. II–306

తనువుఁగృశింపఁజేయునది ధర్మముగాదు

ధరణి దేవుల. దశావ. V-38

ధర్మమునకుఁ దగినట్టు దైవము బ్రోచును

త్యాగరాజు

ధర్మంబు సమయ మపేక్షించునదికాదు

తిరుపతి. వేం. కవులు. బుద్ధ. చ. IV-79

కల్లె మింద్రియములను కంఖాణములకు
వాగరజ్జు తపంబను సంగరమున
కంకుశము నియమంబను హాస్తికింక ధర్మరథము

వేటూరి ప్రభాకరశాస్త్రి. ప్రతిమానాటకము. 1-27

## ధర్మాచరణ

చేయంగవలయువానిం
జేయుట యట్టివియె కొన్ని చేయకునికి ధ
ర్మాయత్త చిత్తుఁడైన న
నాయోగ్య స్థలము లెఱిఁగి నడవఁగ వలదే

తిక్కన. భారత. కర్ణ. III-72

ఉత్తమ పథంబు ధర్మా
యత్తము ధర్మంబు మృతులకధిప సహాయం
బిత్తెఱఁగున ధర్మక్రియఁ
జిత్తంబునఁ జేర్పవలయు జీవించు తఱిన్

తిక్కన. భారత. అను. IV-251

ధర్మాను పాలనం బతి
నిర్మలమతిఁ జేయుచుండు నిత్యోన్నత స
త్కర్మ ఫలసిద్ధి సేకుఱు
ధర్మ మెచటనుండు నచట దైవము నుండున్

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ 945

సంపద వేలన్ సకల భోగములు
పొందంగ వలె ధర్మములు చేయవలయు

శ్రీనా. పం

సాటివారు నిన్ను సాధింపగాలేరు
ధర్మమెపుడు నీవు తప్పకున్న

వేమన

సిరియును నాయువుఁగదు న
స్థిరములు జముఁడదయుఁడిది మదిందెలిసియుఁ జే
యరు ధర్మము 'ధర్మస్య
త్వరితాగతి' యను పురాణ వచనము వినరే

జక్కన. విక్రమార్క. II-185

అధిక ధర్మార్థమై యల్ప దోషంబు
బుధుఁ డాచరించిన భువి నిందపడఁడు

తిమ్మయ. ద్విప. భార.

జీవయాత్ర నరుఁడు సేయుచో నొక ధర్మ
మొక్క ధర్మమునకు నొఱవయగుచు
నడ్డు వచ్చు గాననన్ని సద్ధర్మము
లెన్నరపు వాఁడెవండు లేఁడు సుమ్మి

పానుగంటి విజయ. రామ. నాంది

## ధర్మాధర్మములు

సర్వభూత దయకు సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మ మొండెఱుంగ
నొరులనొప్పికొడ కుపతాప మొనరించు
నదియ కడునధర్మ మనిరి బుధులు

నన్నయ భారత. ఆది. III-219

ధర్మ మధర్మము వోలె న
ధర్మము దాధర్మవిధి విధంబునఁ దోఁచుం

గర్మసమితి నొక్కొక యెడ
ధర్మగతి యెఱుంగవలయుఁ దచ్ఛాస్త్రములన్
తిక్కన. భారత. శాంతి. V-88

ధర్మంబువలె నుండు ధరనధర్మంబు
ధర్మేతరముఁబోలు ధరను ధర్మంబు
తిమ్మయ. ద్విప. భారత

## ధర్మవిశేషము

జనులకుఁ గీడుపోయక యజస్రము ధర్మరతిం జరించి స
జ్జన గురుపూజనంబులును సత్యహితోక్తులు దీనపోషణం
బును నతిథిప్రియత్వమును భూరిదయార్ద్రితయుం గలట్టి దా
రనిమిషలోకగాములని యాత్మనెఱుంగుము

పరుసని పల్కుబొంకులగు పల్కులు నన్యధనాభిలాషముం
బరవనితా విలోలతయు బాంధవసజ్జనవిప్రియంబు దు
శ్చరితులతోడి మైత్రియును సంతతధర్మరతాభ్యసూయయుం
గరినిభయాన! ఘోరనరకంబునకేగెడి వారిచిహ్నముల్
తిక్కన. భారత. అను. V-219,20

## ధర్మసూక్ష్మము

విమలాత్మ యహింసయు దా
నము సత్యముఁ గ్రోధవర్జనంబును వినుము
త్తమ ధర్మరాశియిది ధ
ర్మమునకు పరసీమ దీనిమరపుము మదికిన్
తిక్కన. అను. V-221

వినుము ప్రభూతదానములు విశ్రుతయజ్ఞములున్. సధర్మతా
వినుతికినెక్కుడాలవు వివేకనిధీ పరిశుద్ధశోభితా
ర్జనమునఁదెచ్చికొన్న దివరంబగుఁ బాత్రముసర్వకాలముం
గని లఘువస్తువేని నొసగ గనుఁనుజ్వలధర్మ మారయన్

తిక్కన. అశ్వ. IV–246

## ధీరుడు

చెఱకునఁ బుచ్చుకరిమ్ముల
దఱచిన రసమాననిగతిఁ దరుణలనెఱుచేఁ
వెఱవాపక సంగతికే
డ్తెఱసేసి మనోరథములు ధీరుఁడు వడయున్

నన్నె చోడకవిరాజు. కు. సం VIII–159

ధీరులు దెగినవారలకు వగవరు

తిక్కన. భారత. ద్రోణ. II–179

ఉచితంబు తెలుఁగు ధీర జనులకెఱుఁగరాదె

తిక్కన. భారత. శల్య. I–69

కలఁగిన పెద్దమడువు విను
తెలివిఁబొరయు నెట్లు దానధీరుండ ట్ల
గ్గలము లయిన దురితంబులఁ
గలఁగియుఁ దనయంతఁదేఱు గౌరవమొప్పన్

తిక్కన. భారత. శాంతి. III–34

కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్

పెద్దన. మను. II–68

పురుషయత్నముచేతఁ బొలుచు ధీరుండు
తఱిమి తాఁద్రోయును దైవయత్నంబు

వరద. రామా. అయో. 351

మగటిమి వాటించి మరణాదులందుఁ
దెగువగల్గిన వాఁడు దృఢబుద్ధియుతుఁడు

సోమన. ద్విప. భారత. సౌప్తిక. 1–7

మండల మాత్రంబగు బ్ర
హ్మాండము లోభకరమగునె యతిధీరునకున్

సుభాషితములు. లక్ష్మణకవి

సాధుజనులకు నాపదల్సంభవిల్లు
కాలమునను ధైర్యంబు ప్రకాశమొందు
అఱుగ రాచిన సమయంబునందు గాదె
వసుధపయి గంధసారంబు పరిమళించు

కందుకూరి. దక్షిణగోగ్రహణము

కల్మిలేముల రెంటఁ గలగనిదిట్ట
చెడని సిరిఁదన్విఁ జెందునెప్పటికి

అ. నారాయణదాసు. వేయుమాట. 4

జననమొందుట బాధలంగనుట తుదను
నీల్గుట సమస్తదేహులనియతి గాన
వానికై ధీరుఁడడలఁడు భయపడండు
చేయఁదగుచేఁతలను బూని చేయుచుండు

విక్ర. దే

దారు ల్పెక్కులు ధీర చిత్తులకు
శ్రద్ధంబూనుచోఁ ధారుణిన్
ధీరుల్ ధీరు మన్నింప
లెక్కకువచ్చున్ గుణగౌరవంబటన్

కాం. కనకాంబ.

## ధీరులు-భీరులు

సిరిగల యప్పుడె దుఃఖముఁ
బొరయక సంతత సుఖంబుఁబొందు విమూఢే
తరుఁడటు చేయక బేల కు
పురుషుండాదినము లవధిఁబుచ్చుచు నుండున్

కేతన. దశకు. II-101

పిఱికి పందలు చచ్చుచునుందు రెన్నియో
సారులు ధైర్య శాలురకు జూణక యప్పుడు మాత్రమే సుడీ

కాళ్ళకూరి. పద్మవ్యూహము

## ధైర్యము

ఆపద యను వార్ధి కాత్మ ధైర్యంబుఁ
దేప సేయునతండు తెలివిమై నుండు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామాయ. కిష్కిం. 233

ధైర్యంబు వదలకుమమ్మ యెందుఁ
గత్తలము గల్గు మేనికిఁగలదె బాధ

చిమ్మపూడి అమరేశ్వరుఁడు. విక్రమసేనము

బుద్ధీంద్రియక్షోభములకుఁ బెట్టనికోట
విపదంబురాశి దుర్వ్యాకృతి కోడ
ఖలదురాలాపమార్గణ వజ్రకవచంబు
రణమహీస్థలికి శ్రీరామరక్ష
శాత్రవదుర్గర్వ సంస్తంభ నౌషధి
మొనయు చింతా శ్రేణిమూఁక విప్పు
యోగాది సంసిద్ధులొనఁగూర్చు పెన్నిధి
తూలు నేకాకులతోడునీడ

సకల సుగుణ ప్రధానంబు సకల కార్య
జాలసాఫల్య కరణైక సాధనంబు
ధైర్య గుణమట్టి ధైర్యంబు దక్కి పోరఁ
దత్తరింతురె యకట మీతరము వారు

పెద్దన. మను. IV-108

ధన బంధు వియోగాదుల
ఁను హృదయము కలఁగనీకనిగొలుపు ధృతియనన్

సూరన. కళా. V-145

ధైర్యంబె యెల్లయర్థముల సాధించు

సోమచ. ద్విప. భారత. అరణ్య

ఆపదలఁ బండితుఁడు భీతియపనయించి
విధినిషేధాది తర్కముల్ విడువ వలయు

భవానీశకవి. ధర్మ. IV-63

దేహ పుష్టిఁబట్టి ధీరత్వముండదు
మనసుఁబట్టి యట్టి మహిత గుణము లుండు

పానుగంటి. చూడామణి. నాంది

ఎడఁదలజ్జా భయద్వయ హీనమైన
తలకదురు వోలెఁదివ్వ గానిలవబడును

విక్ర. ద్వి

## ధ్యానము

ధ్యాన యోగ నిశ్చల మగు నంతరంగ
మొకల వికుచు గుణంబుల నిద్ధ శాంత
మైన నిర్గుణ వస్తువు నందుఁ గలయుఁ
బరమ పదమది దానికిఁబరము లేదు

తిక్కన. భారత. శాంతి. IV-188

కదియ బట్టి హంస గళలంటగమకించు
పదయ హృదయమందు సంచరించి
విదిత మైన బయల వెన్నంటి చూడరా

వేమన

కదల కుండగ మది నిల్పి కదిసి పట్టి
నిదురలో నిద్ర జూచుచు నేర్పుమిగిలి
పదరకుండెడు వాడె బ్రహ్మవిభుడు

వేమన

తనలోనే ధ్యానించి తన్మయమే కావలెరా

త్యాగరాజు

ధ్యానమే వరమైన గంగాస్నానమే

త్యాగరాజు

పంక్తిబాహ్యులు నటులని ప్రజలు తలఁతు
రిలను నటకుఁడు గానివాఁడెవఁడు గలఁడు
జగతియే నాటకము సర్వజనులు నటకు
లవసరముఁబట్టి యాడుదురాటలన్ని

పానుగంటి. పద్మిని

## నడమంతరపు సిరి

నిక్కడు నీల్గెడు విఱ్ఱవీఁగెడున్
క్షితి నటుగాదె యొక్కనికి నీనడుమంత్రపు కల్మిగల్గినన్

చామకూర. విజ

నడుమ సిరి వచ్చి కలిసిన వెడగు బుద్ధి
యర్ధరాత్రంబు గొడుగు తెమ్మనక యున్నె

బలిజేపల్లి. సత్యహరిశ్చంద్రీయము

## నరపశువు

సరస కవితరుచి యెఱుఁగని
పురుషులఁ బశువులని నిక్కముగ నెఱుఁగుఁడు వా
రురువడిఁ దృణంబు మేయమి
పరికింపఁగ ధరణిఁ బసులభాగ్యం బెందున్

భోజరాజు. నీతిభూషణము

శ్రుతి శాస్త్ర ప్రకర బహి
ష్కృతము నయానయ వివేకరిక్తము కుక్షి
స్థితి జాగరూక మేయు
న్నతిఁ జెప్పుమా మనుజ పశువునకుఁ బశువునకున్

బై. వేం. పంచ. V-138

కసవుఁ దినఁ గూడు దెమ్మని
కసరదు బరువిడిన మోయు గర్జనమునకున్
విసువదు మారొడ్డాడదు
పసరమునకు సరియె మనుజ పశు వెప్పటికిన్

బై. వేం. పంచతంత్రము V-139

హరిఁ బుట్టించిన దేహి హరినే కొలువక
నరులఁ గొల్చుట అన్యాయ మయ్యా

తా. అన్నమయ్య. అధ్యా. సం.

విద్దెల నేమెఱుఁగని నరు
డెద్దే గా గడ్డితినెడి దెద్దా పశులం
దెద్దుకుఁ గొంత వివేకము
గద్దప్పా కుందవరపు కవిచౌడప్పా

కవిచౌడప్ప శతకము

కార్యాద్వైతము భావింపనివానిఁ
బురుష పశువంద్రు

శివరామకవి. సానందోపాఖ్యానము. IV-111

మనుజుండై పశువౌట కంటెఁ బశుజన్మంబెచ్చు నీవెట్లు దా
నిని బుట్టించితి వట్లచేయునది హా! నిర్భాగ్యతన్ జ్ఞానమె
ల్లను వ్యత్యస్తముఁజేసి నీవిధుల నుల్లంఘించెదన్ నేను దం
డన కర్హుండను బ్రోవవే నను దయన్ సద్భక్త చింతామణీ

వడ్డాది సుబ్బారాయకవి. భక్తచింతామణి

## నవోఢ

విభుని నూతన సంగమ వేళఁ గరము
వక్రములు నవోఢ పడంతుల వర్తనములు

సూరన. ప్రభా. V-28

లేఁ బ్రాయపు టాలి సేవలఁగరంగరె యెంతటి వారు

కంకంటి. ఉత్తరరామాయణము. I-149

గాఢాలింగన విముఖము
రూఢాంగ స్వేద భరము రుంద్రవ్రీడా
గూఢా పాంగము నగుచు న
వోఢా సంగమము వేడు కొసఁగుం బతికిన్

చేమకూర. విజయ. III-223

## నవ్వు

సరసమగు నవ్వుజగతికి సౌఖ్య మొసఁగు
విరసమగు నెడ జగతికిఁబీడనిచ్చు
బాకు పోటుననౌ పుండు బాగుపడును
నవ్వుచేఁ బుట్టుగాయంబు నయముగాదు

నవ్వుచే గొన్ని రోగముల్ నాశమొందు
నవ్వుచేత దీర్ఘాయువు నివ్వటిల్లు
నవ్వుచేతనే పూర్వ జన్మంబు గలద
టంచు మనవారు వెనుక సాధించినారు

పానుగంటి. మాతీలమాం. 2

## నాయకుఁడు

కళలఁ బ్రవీణుఁడై మిగులఁ గావ్యములందుఁ బ్రియంబు గల్గి కో
వ్కలు సకలార్థికోటులకుఁ గూర్చి యొసంగుచు దానశూరుఁడై
పొలిచి సుకీర్తియై వినయభూషణుఁడై మహిమాను భావుఁడై
నిలిచిన వాని నాయకుఁడని న్వచియింతురు సత్కవీశ్వరుల్

చిత్రకవి పెద్దన. లక్షణసార సంగహము

## నాస్తికత

సమర్థన:

వేద విరుద్ధమై వెలయు చార్వాక
వాది! నీ తర్క సంపాదన వినుము
దేహంబ యాత్మగా నూహింప నేల
దేహంబులో నాత్మ దెల్లమున్నదియె,
మేను నల్లని వాఁడ నెఱ్ఱని వాఁడ
నే నిద్రవాఁడను నేఁ గుర్చవాఁడ
ననునెడ నొడలికి నాత్మకొక్కింత
యును భేద మారయ నున్నదె చూడ?
నొగి భూజలాగ్ని వాయు ప్రభూతంబు
లగు చతుర్విధ పర మాణువు లొడలు

నయ్యొడల్మఱి భస్మమైనను బుట్ట
దెయ్యెడ, నటుగాన నిలఁజావు ముక్తి
గానవచ్చిన యవి గలవు దథ్యంబు
గానంగ రానివి గలుగ వెయ్యెడల
గరము సుఖంబు స్వర్గంబుదుఃఖంబు
నరకంబు మఱిలేదు పరలోకమనఁగ
బ్రాపించు మఱి పుణ్యలోకముల్లేవు
నేపారనిజ్జగం బిరితయు మిథ్య
గావున నుత్పత్తి కర్తయు లేఁడు

పాల్కుఱికి. పాదప్రకరణము

ప్రబల భూత చతుష్టయ బంధురాను
బంధమే బంధమౌజుమ్ము ప్రాణభక్ష
మేయగును మోక్షసామ్రాజ్య మింతకంటె
బలుకులోఁ దక్క బరమను పదములేదు

పానుగంటి. పాదుక. 7

నరుఁడొకఁడె పుట్టు నొక్కండె యరుగునతని
కెవఁడు లేఁడెవ్వనికి నెవ్వఁడేమికాఁడు
తల్లిదండ్రి కొడుకును బంధతతియెల్ల
వస్తుతత్త్వ జ్ఞతాభావ ఫలము

పానుగంటి. పాదుక. 7

అందఱి యనుభూతిని నున్న యంశమిది యె
చెప్ప నొక్కఁడువలెనె? యోజింప వలెనె?
మనకుఁ బత్యక్షమే నిదర్శనము కాన
సర్వలోక సమ్మతమశ సరణి యిదియె

పానుగంటి. పాదుక. 7

## నాస్తికత

### నిరసన :

వేదశాస్త్రములును విధి విధానములును
నప్రమాణమను దురాత్మకులకుఁ బుణ్యగతులు లేవు

నన్నయ భారతము. అరణ్య. I-232

మనలమన తల్లి గనుచుండ మనముచూడ
లేదు చూడలేదని తల్లిగాదటంచు
ననుటలేదెందుఁ జేత? ప్రత్యక్ష మొకఁడె
గాదు శబ్దాను మానముల్గలవు మనకు
నాస్తికుండు ప్రత్యక్షమేయనుసరించి
వంధ్య తనతల్లి యంచన వలసివచ్చు
నేమొ? ప్రత్యక్ష మొక్కఁడే యెపుడు పనికి
రాదు చార్వాకునంతటి ప్రాజ్ఞునకును
శిశుహాసనకుచపానాది చేష్టలెటులు
గలిగెఁ బూర్వాను భూతిలేక యెటుగలుగు
రాగమును ద్వేషమును? తను ప్రాప్తిలేక
యను భవంబెట్లు? కాన బ్రాక్తనువు నిజము

పానుగంటి. పాదుక. 7

## నింద

పడికంటెఁజావు మేలని
యెడి పలుకుఁదలంప వలదె యిలఁ బురుషులకున్

తిక్కన. వి.రా. VIII-116

నిందల్ రా వచ్చిన చోఁదనువులె
పో విడుతురు తొంటి భూమి భుజులు

పిల్ల. పిన. జైవి. VI-41

ఎట్టి కృతుల కైన నెవ్వారి కేనియు
నియతి మహిమ కతన నిందవచ్చు

రామపరాజు రంగపరాజు. సాంబూపాఖ్యానము

వసుమతి నెంతవారలకు వచ్చు నొకానొకనింద

ధరణిదేవుల. దశ. VIII-258

## నింద స్తుతి

అన్య కీర్తనంబు నన్య నిందయుఁదన్నుఁ
బరఁగఁ బొగడి కోలుఁ బ్రబ్బికోలు
నాపగాత నూజ యార్య వృత్తములుగా
వనిరి వీని నాద్యులయన మునులు

నన్నయ భారతము. సభా. II-46

కత్తిపోటులు తనువును గాయపఱచు
దిట్ల పోటులు జీవంబుఁ దెగఁగఁ జేయు
స్తుతుల వ్రేటులు చిత్తంబుతుఱుము సేయు
మెత్తనైన పదనునకె మిగులఁగోఁత

పానుగంటి. కల్యా. రాఘ

## నిగ్రహము

ఇనుమును గనకము నిందయు
వినుతియు సమములుగఁగొనుచు వివిధాంగకముల్
దనలోన నడచు కమఠము
దనువున నింద్రియములడఁచునతఁడు గను శివున్

తిక్కన. భారత. శాంతి. VI-983

అఖిల కరణ నిగ్రహమునఁ జేయఁగఁ
బడు నాత్మ సంయమము అతుల ముక్తిహేతువు

మారన. మార్కం. పు. VII-15

అంగములు కూర్మ మెట్లు ప్రత్యాహరించు
నట్లు కామముఁ దమ యంద యడఁపజాలు
ధన్య చిత్తులానంద తత్త్వంబునొందు
టితరులెల్లఁగాల గ్రస్తులు

ఎఱ్ఱన. హ. వం. III-61

## నిద్ర

బలవంతుఁడు పైనెత్తిన
బలహీనుఁడు ధను గోలు పడిన యతఁడు ప్రము
చ్చిల వేచు వాఁడుఁ గాముఁ
కల చిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా

తిక్కన. భారత. ఉద్యో. II-21

గెలుపు నూఱట నొదవు నగ్గలపు నిద్ర

తిక్కన. భారత. సౌప్తి. I-50

అలుక యెత్తిన వానికి నర్థ చింత
కునకు నాతురునకుఁ గామ గోచరాత్మ
నికిని వచ్చు నే విను నిద్ర

తిక్కన. భారత. సౌప్తి. I-65

సవితృనుదయాస్తమయముల శయన మెగ్గు

మారన. మార్కం. III-236

శిరమున నగస్త్యుఁడొండెను సురనాథుండొండె నుండ సుప్తిఁ గనదగు
న్నరుఁడుత్తర పశ్చిమముల శిరముగ నిద్రించు టెగ్గు సేయుఁగు మారా

మారన. మర్కం. పు. III-235

అనవ బోధనిద్రయవమానముద్రకు ప్రథమకారణంబు

శ్రీనా. శృంనై. II-83

చిరనిద్రయొందు చోటుల
నరయంగా దుఃఖహేతువనఁగాఁ బరగున్

జక్కన. విక్రమార్క. II-190

.........సుప్తిఁ బోలంగ
సుఖ మొందుఁగలదు

తిమ్మయ. ద్విప. భార. అది. II-97

బాహ్య గేహ సుషుప్తిఁ బరగ వలదు

శ్రీధరమల్లె వెంకటరామకవి. బ్రహ్మోత్తర ఖండము. IV-102

## నియమము

నియతియ చేతన మఖిలము
నియతి పరాధీనమిట్టి నిజమెఱిఁగినచో
నియతి వశున్నియమించుట
నియతి గుఱిచి గర్హ సేత నిష్ఫలమరయన్

శ్రీనా. శృంనై. III-138

నేమముననె యుండ నిల్చును జిత్తంబు

వేమన

నెమ్మది జాతంతే నియమము
సమ్మతించి నంతే సంతోషము

అన్నమయ్య. అధ్యా. సం.

.........నియమంబులు దు
ష్కర్మలకు గాక సద మల
ధర్మ విచారులకు నేల తత్త్వజ్ఞ నిధీ

కూ. జగ్గకవి. సుభద్రాపరిణయము. II–59

నేమము కలవాఁడు నెమ్మదినుండు

ఆ. నారాయణదాసు. వేల్పుమాం. 23

## నియోగము

శిరమున మకుటము రశనా
భరణముకటి నూపురమ్ము పదమునఁబోలెన్
గురుబంధు భటుల నిల్పన
మరు నుత్తమమధ్య మాధమస్థానములన్

బైచరాజు. పంచ. I-123

అతిశయ స్థాన యోగ్యు నీచాసనమున
నునుచు విశ్వంభరా వల్లభునకు నింద
మస్త కోచిత కోటీరమండనములఁ
గాళ్లి దొడివిన యమ్మర్త్యుఁగఱటి యనరె

బైచరాజు. పంచ. I–171

మత్తుని జడుని నున్మత్తునిఁ బతితుఁ
జిత్తవిభ్రమము వైద్యుఁజెలఁగి రోగస్థు
నంగవిహీనుని నపగత నియము
నంగినిఁ గ్లీబుని నటుని గాయకుని

ప్రాణివిక్రయమున బ్రదికెడు నతని
రాణించిసోమ విక్రయుని నామ్నాయ
విక్రయుఁ గన్యకా విక్రయు, ధర్మ
విక్రయు సంధ్యతా విడిచినవాని
నలిమీఱి నౌపాసనములేని వానిఁ
గొలఁది నడ్డికినిచ్చి కుడిచెడివాని
దైవపిత్రర్థమై తగదు పెట్టఁగను

సోమన. ద్విప. భార. అను. II-25

నిర్దయులు

తలకొని జాలకు దయగల్గు మన్నఁ
గలుగునే గుణశూన్యకఠినమూర్తులకు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ. 574

ఆతురబాలవృద్ధ వనితాదుల యార్తులు సూచియోరకిన్
రాతి క్రియన్మనంబుకఠినంబగు వారు మనుష్యులే దయా
ఘాతకులైన రాక్షసులు గాక

మారన. మార్కం. II-130

దయయున్ ధర్మము సత్యమున్ గుణములున్ దాక్షిణ్యముం గల్గవా
రయ నెందుం గఠినాత్ములందు

అయ్యలా. భా. రా. యుద్ధ. 172

ఉరుకృపాహీనులై యోపిక లేక
ధరఁజేయు తపసుల తప మెట్టితపము

గౌరన. నవనాథ. IV-166

కఠినులకు గృపగలిగింప గడగు టెల్ల
రాతినేలల నూతులు ద్రవ్వుట

చిలకమర్తి. ప్రసన్న యాదవము

## నిర్మలత

.........ఆత్మ నకల్మషునందుఁ గల్మషం
బెనయ నొనర్చుకంటెఁ గల
దే భువిఁ బాతక మెవ్విధంబునన్

ఎఱ్ఱన. హ. వం. VII-67

మయిలకోకతోడ మాసిన తలతోడ
నొడలి ముఱికితోడ నుండెనేని
అధికకులజుడైన నట్టెట్టు పిలువరు

వేమన

దేవతార్చన జపతప తీర్థయాత్ర
దానధర్మ క్రతువులను దలఁచిచూడ
బుణ్య సాధనవృత్తులు పుడమిలోన
గల్మషములేని హృదయము కలుగ

వేమన

నిలుకడతో నిర్మలుండైతె
వలసినచోటనె వానికె సుఖము

అన్నమయ్య. అధ్యా. వం

.........అధిక నిర్మలు లాత్మ
స్తుతి పరనిందల దోషము
లతి హేయములని తలంతురాత్మల నెపుడున్

పోతన. భాగ. IV-442

ఇంతకు ముందట నేకిల్బిషంబు
చెంతలఁ జేరని చిరపుణ్యానిధికిఁ
గలిత దుష్కర్మంబు కర్తవ్య మగునె
మలిన మేమియులేని మడుగుఁ జీరకును
మసి దాఁకినట్లగు

సోమన. ద్విప. భార. సౌప్తిక. I-9

అనయము నిష్కపటవచన మది నమ్మఁదగున్

శ్రీధరమల్లె వెంకటరామకవి. బ్రహ్మోత్తరఖండము. IV-91

కాదు భంగపాటు కల్యాణమగుఁగాని
నిష్కళంక రూప నిధులకెందు
రాహువక్త్రి గోచరంబౌనె శశిరేఖ?
పరమశివుని మౌళి బరగుఁగాక

వేదము వెంకరాయశాస్త్రి. ఉషానాటకము

## నిష్కామకర్మ

ఫలములయెడ బ్రహ్మార్పణ
కలన పరుండగుచుఁగార్య కర్మము నడుపన్
వలయున్ దత్త్వజ్ఞానము
దలకొనినన్ కర్మశమము తానై కలుగున్

తిక్కన. భారతము. భీష్మ. I-202

తనదియనక యేమిధనమునఁ బ్రియమందు
నెద్దిగుఱువకుండ నెసఁగుఁ దృష్టి
యిచ్చఁబొందు లేక యెయ్యది బలమిచ్చు
దానఁగనుట శ్రుతులతలపు గనుట

తిక్కన. భారత. శాంతి. V-163

.........అహంకృతి యుక్తముఁగామ సంశ్రితం
బును నగునేని నట్టితపమున్ ఫలకాంక్ష యొనర్చు యజ్ఞమున్
ఘనతర లోభవృత్తియును కాన్పున మెచ్చదు దేవకోటి వా
ననగు గతాగతంపు భ్రమణంబులు గీళ్ళులుగాక మేలుతే

తిక్కన. భారత. శాంతి. V-232

సక్తుండుగాక విహితకర్మంబు లాచరించిన బంధంబు రాదు

మారన. మార్కం. VII-10

చింతింపఁబనిలేదు చేయు పూజాఫలము

క్షేత్రయ

## నిస్సంగుడు

దొరకొనని దానిఁ గోరక
దొరకొని నందును మమత్వతుష్ట హృదయతం
బొరయక విగత స్పృహలగు
పురుషులు శుచులేల తీర్థములు వారలకున్

తిక్కన. భారత. అను. IV-244

విను దేహియు దేహము వే
అను నిశ్చయదృష్టిగల్గు నాతఁడు సాలున్
మనసు మగిడింప నదిని
ర్మనస్కతఁ బొనర్చి మోక్ష మార్గముఁ జొప్పన్

తిక్కన. భారతము. అను. V-252

కలవంటిది బతుకు ఘనునికిని
సుఖమేడ దవలదుఃఖమేడది?
తనువుపై నాసలేని తత్త్వమతికి

పాపమేది? పుణ్యమేది? కర్మమందు
నొనర ఫలమొల్లని యోగికిని
వేవేలు విధులందు వెఱపేది? మఱపేది?
దైవము నమ్మినయట్టి ధన్యునికిన్

అన్నమయ్య అధ్యా. సం.

సంతతకర్మము లెల్ల సంసార మూలములు
నిస్సంగుడై తే నధికుఁడు

అన్నమయ్య. అధ్యా. సం.

## నీచులు

నీచులకు బలంబు నెట్టన
పరుసని కాఱు లఱచుచునిఁ

తిక్కన భారత. కర్ణ. II-67

ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ

బద్దెన. సుమతి. 55

.........నీచు మృదూక్తిఁ
జక్కనే లగు దండ సాధ్యుండు గాక?

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ. 368

ఎంత చదువు చదివియెన్ని నీతులు విన్న
హీనుడవగుణంబు మానలేదు
బొగ్గు పాలఁగడుగఁ బోవునా మలినంబు

వేమన

పాటిలదేరజో మాలిన్య పల్లవత్వ
చాపలంబులకాధారమై పరఁగెడు
వారికిని మేలొనర్చిన వారికెగ్గు

సూరన. ప్రభా. III-34

.. ......భీతులంద్రుంచు వానికిం
జెప్పెడి దేమి కీర్తియును సేమము స్వర్గముఁగల్గనేర్చునే

పాపరాజు. ఉ. రా. II-93

తారతమ్య మెఱుంగని వారివద్ద
నుండు కంటెను నడవులఁగొండలందు
నాకు నలములు దిని యల్ల హరునినైన
మురహరుని నైనఁ గొల్చుట ముఖ్యవృత్తి

రఘునాథరాయలు. వాల్మీకి చరిత్ర III-88

గుణవిహీనుని మాట గుఱిసేయఁగా నేల
గొడ్డు గోవుల పాలు కొసరినట్లు
అల్పున కొక వేళ నర్థంబు గలిగిన
దెలివితో నిచ్చునా తెగువతోడ

రామతారక శతకము

లోకములోన దుర్జనులలోతునెఱుంగక చేరరాదు సుశ్లోకుడు

భాస్కర శతకము 88

క్షుద్రగుణునకు సజ్జన గోష్ఠియేల
మోటకొయ్యకు మృదువైన మాట లేల

వెంకటకవి. మదనగోపాలశతకము 6

పతిమెచ్చని సతి, వసుధా
పతిమెచ్చని కింకరుండు వడిదలిదండ్రుల్
మతి మెచ్చని తనయుడుఁ బం
డిత నాథులు మెచ్చనికవి నీచులు గారే

విక్ర. దే.

నీచుఁడల్ప సంపద గల్గ నిక్కు రీతిఁ
గురిసి నంతనె సెలయేళ్ళుగరము పొంగు

విక్ర. దే.

లోకమునందు దుష్టులు విలుప్త మతుల్ మఱి నీచులెల్లచోఁ
బ్రాకృత రీతులన్ శపథ పద్ధతి బూనుదురు

సురవరము ప్రతాపరెడ్డి. ఉచ్ఛలవిషాదము

## నీతి

నీతి పథంబునన్ బ్రదుక నేర్చుట యుత్తమభంగి శౌర్య సం
జాతములై కరంబలరు సంపద లొందుటమధ్య వృత్తియు
స్ఫీతములైన భారవహజీవనముల్ దలఁపం గనిష్ఠముల్
నీతికి బాహ్యులైన ధరణీ వర మెత్తురె వారి నుత్తముల్

తిక్కన. భారత. ఉద్యో. II-71

దుష్పథంబులఁ జొరనీక తొలఁగఁ దివుతు
రాప్త జనములు దగ వశ్యులయిన వార
లందుఁ బుణ్యంబు దొలఁగని యతఁడు దొలఁగు
దొలఁగ నేరఁడు భాగ్యంబు దొలఁగు వాఁడు

తిక్కన. భారత. సౌప్తి. I-78

నీతి శూన్యులకుఁగార్యము లేటికిఁ దోచు

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 154

కరిహయ శిక్షలందు నృపకార్యములందును సంధియాన సం
గరముల యందు వర్తకముఖంబునఁగర్షక లీల మోక్షత
త్పరుఁడగుచోట నీతి యను దర్పణముంబరికించి చూడకే
వెరవునఁగార్య నిశ్చయ వివేకము దోఁచునె బ్రహ్మకేనియున్

నీతి యెఱింగిన మనుజుఁడు
రాతుల భంజింప నోపు రాజుల చేతన్
ఖ్యాతియు లాభముఁబొందు స
మాతతముగ ముక్తి కాత డధికారియగున్

మడికి సింగన. సకలనీతి

నీతి జ్యోతి లేక నిర్మలంబగు నేది?
యెట్లు కల్గును దమదెంతయైన
ధనము గలిగి యున్న దైవంబు రాదయా॥
జ్ఞాత యైన వాని నేతగా భావించి
నీతు లెఱుగఁ వలయు నియతి గలిగి
జ్ఞాను లున్నలాభ మూనునే తెలియుమి॥
నీతి లేనివాఁడు కోతి కంటెను బాడు
నీతి దెలిసిన వాఁడు నిర్మలాత్మ
నీతి ప్రఖ్యాతిగా నిండి యుండగవలయు॥

వేమన

ఘనబాణ నిహతి యొక్కనిఁగూల్చుఁగాని
విను నీతిఁ దెగటార్చు విమతి కోటులను
నీతి లావునఁగాదె నృపులు భూవలయ
మాతంకములు లేక యరయుచున్నారు

తిమ్మయ. ద్వి. భారత. ఉద్యో. I-18

బలిమి కంటె నీతి బలిమి లెస్స

సూరన. కళా. VII-258

పదియుఁబదియునుగా నీతి పదని నరసి
తెలియఁదగు

సూరన. కళా. VII-240

గురులఘు వ్యవస్థ యరయని చతు రుపా
య ప్రయోగకరణమనుచితంబు

సూరన. కళా. VII-261

నీతి లేని వాని నిందింత్రు లోకులు
లేదు నేగి లాతి లేక యున్నఁ
గాన మానవుండు పూనిక నయ విద్య
గడన సేయ మొదలఁగడఁగ వలయు

చిన్నయసూరి. నీతిచంద్రిక.

నీతికి హేతు భూషణమణి ప్రకరంబుల వన్నె రాదిలన్
నీతికి వన్నె పోదు ధరణిన్ వెలమాలిన చింపిగుడ్డలన్
నీతికి గౌరవంబెపుడు నిల్చుఁజుమీ సహజంబుగానె వి
ఖ్యాతికి నీతివర్తనము నందఱు మానకయుండఁగా వలెన్

కం. వీరేశలింగము. సత్యహరిశ్చంద్ర

నీతిగల్గిన సర్వభూత హితంబగు

అ. నారాయణదాసు. భీష్మ చరిత్ర. 18

దేశకాలంబులనుబట్టి స్థితులఁబట్టి
పురుషులొనరించు వ్యాపారములను బట్టి
మంచి చెడ్డలు ధర్మముల్ మాఱుఁగాన
నీతులెప్పుడు స్థిరములై నెగడ లేవు

పానుగంటి. విజయ. రాఘ.

జ్ఞానమునకు నీతియె ముఖ్యసాధనంబు
కాని నీతిచేతనె ముక్తి కలుగదెపుడు
నీతి విజ్ఞానమునకుఁ గ్రిందిదగు మెట్టు
నీతిజ్ఞానదూరంబైన నీతిగాదు

పానుగంటి. బుద్ధ

తబ్బిబ్బయినం బని చెడు
నబ్బురపాటయిననీతి యందదుకులగున్

వేదము వెంకటరాయశాస్త్రి. ప్రతాపరుద్రీయము

## నీతిపరులు

అరిది విలుకాని యుజ్జ్వలశర మొక్కనినొంచుఁ దప్పిచనినం జను
నేర్పరియైనవాని నీతి స్ఫురణము పగ రాజునతని భూమిం
జెఱుచున్

తిక్కన. భారత. ఉద్యో. II-36

నీతిసార పరమనస్కుఁడైన నృపు
రాజ్యము సుస్థితి బొందునారయన్

కేతన. దశకుమార చరిత్ర

అపగత వివేకులకు హిత
ముపదేశించుటయు వారినొంచుటయును నీ
తిపరుల కొప్పదు

మంచెన. కేయూర. III-264

నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ గాఢంబుగా సాగనీ
ఘాతఁబప్పుడపొందనీ నియతిమైగానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపథంబుఁ దప్పరుగదా నిత్యంబుధీరోత్తముల్

ఏ. ల. కవి. సుభాషితము

పరువు మాలిన పని బ్రహ్మ చెప్పినఁగాని
నీతిమంతుఁడు సేయ నెట్టుకొనునె

అ. నారాయణదాసు. భీష్మచరిత్ర 19

## నేరము—శిక్ష

తప్పులేకయ శిక్షింపఁ దగవు గాదు

శ్రీనా. కాశీ. V-319

తప్పులేని వాని దండింతుననువాఁడు
నీతిమాలినట్టి నీచుఁడు

దా. శ్రీ. దేవీభాగ. III-494

## నైజగుణము

కనకపు సింహాసనమున
శునకముఁ గూర్చుండబెట్టి శుభలగ్నమునం
దొనరఁగ బట్టము గట్టిన
వెనుకటి గుణమేలమాను వినురా సుమతీ

సుమతీశతకము

విత్తొకటి వెట్టితేను వేరొకటి మొలచునా?
పాపపుణ్యా దేహికి బంధములే సహజము
పూపవంటి మనసుకు భోగములే సహజము
కాయవంటి గుణానకు కర్మము సహజము
మాయలజన్మమునకు మమతలే సహజము
తప్పని జ్ఞానమునకు దైవమే సహజము
పుట్టుట సహజమిది పోదలే జీవులకెల్ల
పాపమే సహజము బద్ధ సంసారులకెల్ల
లంపటమే సహజములవి దేహధారులకు
కలిమిలేములెల్లా కాలము స్వభావము
పుట్టుగులు వునికి పూచిన స్వభావము

పుట్టినానాఁటి బ్రదుకు ప్రపంచము స్వభావము
మక్కువ సంసారము మాయల స్వభావము
తక్కక రక్షించేది దైవము స్వభావము
కప్పిన భోగములెల్లా కర్మము స్వభావము

అన్నమయ్య అధ్యా. సం

ప్రకృతి మధురంబులకు వేష రచనలేల

తెనాలి. పాండు

ఆపదలందు ధైర్యగుణమంచిత సంపదలందుఁ దాల్మియున్
భూపసభాంత రాళమునఁ బుష్కలవాక్చతురత్వమాజి బా
హాపటు శక్తియున్ యశమునందనురక్తియు విద్యయందు వాం
ఛా పరివృద్ధియున్ బ్రకృతి జన్యగుణంబులు సజ్జనాళికిన్
ఏ. ల. కవి. సుత

పుట్టుట గల్గిన వారికి
గిట్టుట లేకుండు టెట్టు

దా. శ్రీ. దేవీభాగ. V-33

పొట్టివానికి హేళన స్ఫూర్తి మెండు
పొట్టవానికి మితిలేని పొలఁతివాంఛ
కాలుపొడుగు వానికిఁ దెగనీలుగెంతొ
తలబరువు వానికీ మూఁడు చెలఁగు మిగుల

పానుగంటి. విజయ రాఘ

జను నహంభావ మెంతొ యజ్ఞానమంత
జను నతుష్టియెంతొ యిహవాంఛయును నంత
కవి కసహన మెంతయొ యశక్తతయు నంత
సతికసూయ యెంతయొ రాగ గతియునంత

పానుగంటి. కోకిల

పరమ లోభికి భయమెంతో భాగ్యమంత
రమణికి నసూయ యెంతయో రాగమంత

పానుగంటి. రాధాకృష్ణ

ప్రాయకంబుగ రాజు దుర్మతినె పెంచు
సుగుణ తుంటరినే తనమది వరించు
అంబుదంబులు కొండల యందె కురియు
లచ్చి పెనులోభి యింటికే వచ్చి తనియు

శాళ్వకూరి. పరవిక్రయము.

## పండితమ్మన్యులు

బోధమల్పంబు గర్వమభ్యున్నతంబు
శాంతి నిష్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములుఁబోలె గొంచెమెఱిగి
పండితమ్మన్యులైన వైతండికులకు

శ్రీనా. భీమఖండము. I-13

పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచునను భవమ్ములు
తత్త్వమెఱుగక శుకములగుదురు
వొట్టి శాస్త్రజ్ఞుల్

గురజాడ - ముత్యాలసరాలు

## పండితుఁడు

బిసరుహాగర్భు వ్రాఁతయును విష్ణుని చక్రము వజ్రివజ్రమున్
బెసలను రాము బాణము యుధిష్ఠిరు కోపముఁగాలు దండమున్

మసకపుఁబాము కాటును గుమారుని శక్తియు మాని కోపమున్
బసవని రాతు శూలమునుబండిత వాక్యము చిత్తవోవునే
వేములవాడ భీమకవి. చాటువు

పండితుల్ వగతురెయున్న వారికి
నవశ్యవిధేయతఁ జన్న వారికిన్
తిక్కన. భారత. భీష్మ. I-195

పండితులు ప్రియా ప్రియవస్తు
వియోగ సంయోగంబులవలన
జనించు మానస దుఃఖంబుల
నేమిటం జేసి పొరయకుండుదురు
తిక్కన. భారత. స్త్రీ. I-31

శోకభయకారణంబులు లోకమున న
నేకములు దానఁదలసూపు శోకములకు
భయములకు బుద్ధి నెడయీఁడు పండితుఁడు
తిక్కన. భారత. శాంతి. I-188

వినయము విద్యయుం గలుగు
విప్రునియందును గోవునందు నొ
ప్పు నెఱయు హస్తియందు నొక
పోఁకకు బోవని కుక్కయందు దా
ని నడచి తెచ్చి వండి తిను
నీచవు మాలనియందుఁ దుల్యద
ర్శనులు తదంతరాత్ముని ని
రంజనునిం గనువట్టి పండితుల్
తిక్కన. భారత. శాంతి. V-109

భగవత్స్వరూపంబెఱింగును
వాఁడు విద్వాంసుండు

పోతన. భాగవ. IV–878

జననాథాగ్రణి యాత్మ రాజ్యమున నిచ్చల్ పూజ్యుఁడా సీమఁబా
సినఁదాఁ గవ్వియుఁ జేయఁడన్నికడలన్ శ్రేష్ఠుండు విద్వాంసుఁడు

అప్పకవీయము. I–[illegible]

పరగు సమదర్శన స్థితిఁ బండితుండు

భవానీశకవి. ధర్మ.

.......బ్రహ్మ విచార యత్నము
వ్వాంగుచుఁ జేయుఁగావలయు భూరి జగద్ధిత బుద్ధిఁ బండితుల్

ఏ. ల. కవి. సుభాషిత. III–34

విద్యావంతులు వందనీయు లఖిలోర్వీ రాడ్సభా భూములన్

శివరామకవి. సానందో. V–26

ఎల్లరకుఁ బండితరీతు లెఱుంగరావు

తి. వేం. కవులు. 127

అఖిల శాస్త్ర పురాణ తత్త్వాబ్ధులీఁది
పరమ విజ్ఞాన దీపమౌ పండితుండు
కాళరాత్రిని మార్గంబు గానలేక
యల్లమావనాలుకథఁ జెప్పియంతరించు

దువ్వూరి. పావళాల

పక్షపాతము

పక్షపాతబుద్ధిఁ బరఁగుచునుండెడు
నట్టివాని నాప్తుఁడనఁగ నగునె

నన్నయ భారత. సభా. II–150

పరిగణింప విశద పక్షపాతుల ప్రవ
ర్తనము లెట్లునమ్మఁ దగకయున్నె ?

సూరవ. ప్రశ. II-10

పక్షపాత మెడలించినఁ
జేతిలోఁ బరుసవేది లేదా ?

రామదాసు చరిత్ర

## పట్టుదల

వలమరికగునా సంతత సుఖము

అన్నమయ్య. అధ్యా. సం

మొదట తనమతము వదలక
తుదనెవ్వరి మతమునైన దూషింపకయున్
పదిలుడయి కోర్కె గోరక
ముదమున జరియించువాడె ముఖ్యుడు॥
పట్టుపట్టరాదు పట్టివిడువ రాదు
పట్టెనేని బిగియ బట్టవలయు
బట్టువిడుచుకన్న బడిచచ్చుటయె మేలు॥
పట్టరాని పట్టు పట్టియుండినవాడు
పుడమిలోనగీర్తి బొందలేడు॥
చిక్కియున్న వేళ సింహంబునైనను
బక్కకుక్కచేరి బాధసేయు
బలిమిలేనివేళ పంతంబు చెల్లదు॥
మొదలపట్టు పట్టువదలరాదు

వేమన

పట్టుబట్టరాదు పట్టి విడువరాదు

క్షేత్రయ

ఎట్టిమృదులహృదయమేని పట్టురాఁగఁ
బరమ కఠినతఁజెందు

పానుగంటి. వన.రామ. IV

చచ్చుదాక బిగియింపుల్ గూడదెవ్వారికిన్

బలిజేపల్లి. సత్యహరి 51

పట్టుదలబూని చేయుమా పనులనెల్ల
కాలమేనీకు సమకూర్పఁగలదు ఫలము

నా. కృరావు. వెన్నెల వెలుగులు

## పతనము

కుండ పగిలెనేని క్రొత్తదిగొనవచ్చు
భూతలంబునందు బొందుగాను
గూలబడిన నరుడు కుదురుట యరుదయా

వేమన

ధనమధికార మెవ్వరిని దా
బడఁదోయదు సర్వభంగులన్

తిరు. వెం. కవులు. నానా. రా. వం.

## పతివ్రత

చేకొని పతిపంపు సేయుపత్నులకుఁ
గైకొను నుభయలోకములందు సుఖము

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. అయో. పు. 127

కలచి పతివ్రతలఁ జేరఁగాఁ దరమగునే

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 2421

పతిదైవతమైన సతియుబహుమతి నొందున్

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 2256

మగవాఁడు చేసెనని తోయ్యాలియున్ దురితంబు సేసినన్
బరమపతివ్రతాచరణభంగము గాదె.

జక్కన. విక్రమార్క. VII-174

తండ్రివంశంబునం దేడుతరములకును
దల్లివంశంబునం దేడు తరములకును
ధవుని వంశంబునం దేడు తరములకును
శాశ్వత స్వర్గ సౌఖ్య మీఁజాలు సాధ్వి

శ్రీనా.కాశీ. II-92

మగని మీదభక్తి మానకుండిన కాంత
మూఁడు లోకములను ముక్తిఁ గనును

వల్లభునికి నిష్ట వస్తువులందించి
యతని మానసమునకతికి యున్న
నట్టి వనితమంచి కట్టడి కలదగు
పరమసాధ్వి చూడ బరుల నంటదు సుమీ

వేమన

ఒప్పుగాదె? యుత్తమ సతులకు
బతులు పూని నట్టి వ్రతముఁదాల్ప

తెనాలి. పాండు. మహా. III-189

పతికొట్టిన పతి తిట్టినఁ
ఒతి నిర్దయుఁడగుచు నెట్టి పాటు పఱిచినన్
మఱి నన్యధాత్వ మొందరు
పతివ్రత......

తెనాలి పాండు. మహా. IV-201

... ... ... ... ... ... ... ఈ
శ్వరుఁడును వేదముంగురుఁడు సర్వము భర్తయ...

సూరన. కళా. IV-141

......ప్రకటీకృత భక్తియె సామ్ముసాధ్వికిన్

సూరన. కళా. VI-89

...పతివ్రతా రత్నంబు నిపురు
గమలిన నిప్పు లొంగక యుంట వశమె

తిమ్మయ. ద్విత. భార. అరణ్య.

తనపాలి పెనిమిటి తన దైవమనుచు
మనసులో మగఁడైన మానవాధముని
మేరువుగా నెంచి మేదిని గీర్తి
స్వారాజు నగరిలో సకలభోగములు
ననుభవింతురు......

వరద. రామా. అయో. పు.

వగలంబొందియు సాధ్వులన్యులను నొప్పం జూడ రెప్పట్టునన్

ధరణి. రామయ. దశావతార

పతి హిత భక్తిచే వెలయు పద్మదళ ప్రతిమాన నేత్రకున్
వ్రతముల సోదు లేటికి ధ్రువంబుగఁ బుణ్యములబ్బు

అయ్యల. నారాయణా. హంస. I-128

చాన యాబాల్య సౌశీల్య శమదమాది
సుగుణలతలకుపఘ్నమై జగమువొగడు
భర్తఁబాయక తద్భక్తిఁబరగెనేని
సాధ్వి యని యంద్రు......

పెద్దాద నాగరాజామాత్య. శకుంతలా. III-138

పతినెడ బాసిన సతులను జాచితే
పతివ్రత గాదందురు జనులు

కుశలవుల యుద్ధము 74వ పుట

అరయన్ పుణ్యవధూమణుల్ ధరణి నత్యంతోగ్ర దోషాత్మునిన్
సరవిన్ గన్గొన నొల్లకుందురుగదా చర్చింపనెంతే నియున్.

భల్లాణచరిత్ర. I-128

త్రాడుగట్టిన యాతని తఱి నొకింత
సీగ్గమైన తఱిని దానిచేఁ తల్లైన
జూచి సైరించునింతియె చూడగాను
నిందునందున సిరులందు నీడులేక

కం. వీరే.

కాంతుపై నాశలు నిరాశ గాకయుండఁ
పరవిభుని జేర దెప్పుడు పరమసాధ్వి
మానస సరస్సు తుహిన పాషాణవృతము
గాక క్రౌంచాద్రిఁజేరదుగాదె హంసి

పానుగంటి. విజయ రాఘ. II-

ఎంత పరిశుద్ధుఁడౌ జనుఁడంతదైవ
శక్తిదరిఁజేరువాడౌను సర్వజీవ
పాళిలోఁ బతివ్రత బహుస్వచ్ఛ యగును
ధరణియందు ద్వితీయ మహా దైవమదియె

పానుగంటి. వన. రాఘ. V

బహుళ జీవభూయిష్ట ప్రపంచమందు
సచ్చిదానందమయ సుప్రశస్తమైన

యట్టి బ్రహ్మము తరువాత నధికపూజ్య
భవ్యమగు వస్తువొక పతివ్రతయె కాదె

పానుగంటి. కోకిం. IV

.........సాధ్వియైన
యింతిగల్గు వానికిహలోకమందును
బరమునందు సుఖము బరగుఁగాదె

దా. శ్రీ. దేవీ భాగ. IX-160

ధర్మార్థ కామములయందు
భర్తకనుకూలురాలుగా
నుండినదియేకదా పతివ్రత
యనిపించుకొనును

తిరు. వెం. సుకన్య

మనమునను వాక్కునను కాయముననుఁబతికి
హితముగావించునది పతివ్రతయు కాని
కేవలము మానమొండు రక్షించుకొనుచుఁ
బతిని నిందించునది పతివ్రతయుకాదు

శ్రీపాద. కనకగిరి. 163

పదవి

కులముని పట్టి చిత్తమునఁ గూరిన కడరయంగ లెక య
గ్గలపు విభూతి దుష్టునకుఁ గల్గఁగఁ జేయుట గర్జమెట్లుభృ
త్యులమదియున్న రూపగసియుత్తమ మధ్యమ హీన రూపమా
త్రలకుఁ దగంగ నయ్యుయిపదంబులనిల్పుట నీతి భర్తకున్

తిక్కన. భారత. శాంతి. III-98

పదవిన నీ సద్భక్తియుఁ గల్గుటే
చదివిన శాస్త్రోపనిషత్తుల
సత్తఁదెలియు లేనిది పదవియా?
ధనదారసుతాగార సంపదలు
ధరణీశుల చెలిమి యొక పదవియా
జపతపాది అణిమాది సిద్ధులచే
జగములనేఁచుటయది పదవియా?
రాగలోభయుత యజ్ఞాదులచే
భోగములబ్బుటయది పదవియా!
త్యాగరాజనుతుఁడా శ్రీరాముని
తత్త్వము దెలియని దొక పదవియా?

త్యాగరాజు

## పదార్థస్వభావము

పెరుఁగుట తగ్గఁగఁజవులం
బొరయుట యవశంబు గాఁగఁబుట్టుట చావన్
బెరయుట పాయఁబదార్థో
త్కరముల నైజమిది యెట్లు దప్పింప నగున్

తిక్కన. ని. రా. IX-75

పోలయ దొక్కటి విను బొత్తిగా నెపుడు
పుట్టదు క్రొత్తది భూమిలోపలను

శ్రీనాథ. పలనాటి

## పరంజ్యోతి

అఖిలమునకు నడి నాభమందున్న
వేగుచుక్కవంటి వెలుగు దిక్కు

వేమన

జంటం దరఁగి యలంగెడి
కంటి నలుసుకన్న దేవకర్తలు గలరా
మింటికి మంటికి నొక్కటై
యంటియు నంటకయె వెలుగు నాత్మారామా

తిమ్మరాజు పేరకవి. ఆత్మారామ శతకము

## పరచింత

పరతత్త్వోపాసనత
త్పరుఁడై సంక్షీణకామభావత నున్నం
బురుషు సుఖమొందు వృద్ధిం
బొరయుచు వపువమృత కిరణుఁబొందిన మాడ్కిన్

తిక్కన. భారత. శాంతి. V-191

ఎంతలోకానుభవము అంతయు వృథానష్టి
కొంతైనా బ్రహ్మచింతకోటిలాభము

అన్నమయ్య. అధ్యా. సం

ఆత్మవత్సర్వభూతాని యను పురాణ
వచన మూని బహుప్రాణి వత్సలుఁడయి
సుఖము దుఃఖము సమముగాఁజూచికొనుచు
దేహి పరలోక చింత వర్తింప వలయు

భైరవరాజు. పంచతంత్రము. III-129

## పరధనము

ఇమ్మెడపున నిజసర్వ
స్వమ్ముఁగళత్రంబునైనఁ జనునీగఁబర
స్వమ్ముఁగళత్రముఁ బరులకుఁ
గ్రమ్మఱ నొప్పించి మనుటకార్యము

నన్నెచోడుఁడు. కు. సం. X-192

పరుల ధనము నిష్కృతిమైఁగొనుటది ధర్మువగునె

నన్నయ. భార. సభా. II-22

ఒరుసొమ్ములు పుస్తకములు
హరియించిన వానిఁబట్టి యఱవగ సంధుల్
తరతరమనఱకి వైతురు
సురగంగానీక యముని సుభటులు కడఁకన్

దగ్గు. దుగ్గ. నాసి. III-104

పరుల మోస పుచ్చి పరధనమార్జించి
కడుపునించుకొనుటకానిపద్దు

వేమన

పరుల విత్తమందు భ్రాంతి మానినయట్టి
పురుషుడవనిలోన బుణ్యమూర్తి

వేమన

దొరకొని పరులధనము
దోచకున్నా వంటేచాలు
గుఱుతుగాను గోపురములు
గూర్పనేటికీ

రామదాసు చరిత్ర.

పరధనాపహారణమరయపాపంబులఁబెద్ద

శ్రీపాద. శ్రీకృష్ణభారతము. అరణ్య. VII-47

## పరనింద

పలుసదువులు సదివి పండితమానియై
తనదువిద్య నొరులఘనయశంబు

దూలపుచ్చునట్టి దుష్టాత్మకుని బ్రహ్మ
హత్య వొందు సందియంబు లేదు

తిక్కన. భారత. అను. II-42

దోషరహిత కన్యకపై
దోషంబులగట్టి రి_త్త దూషించినయా
దూషకుని నూఱుమాఁడుగులు
దోషాను గుణముగ భూపతులు గొనవలయున్

కేతన. విజ్ఞా. అచా. 108

మొడ చెయ్యి కన్ను పాదము
తొడ నాలుక ముక్కు చెవులు తునియలుగాఁ దా
నడిచెదనని యొరుఁబరుసము
నొడివి నతఁడు దండుగచ్చు నూఱు పణంబుల్

కేతన. విజ్ఞా. ప్రాయ. 53

దేశ భాషలను గులంబును
దిట్టునతఁడు దండుగిచ్చు శతపణములు

కేతన. విజ్ఞా. ప్రాయ. 56

తన్ను గొట్టిన వార్ల తలమరుగుగానిల్చి
గూషించగలవాడె దొడ్డ పాపి
పరుల దిట్టినంత బాప కర్మంబబ్బు

వేమన

పరనింద చేసి పాపముఁ బొందనేల

తిమ్మయ ద్విప. భార. విరాట.

ఉన్నత దశనుండి మనుజుఁడూడి పడఁగ
వానిఁబరిహాసించుటనరు ప్రకృతి సుమ్ము

పానుగంటి. వన. రాఘు. III

స్వపరతయె జీవ స్వభావంబుగానఁ
బరునిఁబల్లెత్తు మాటయుఁ బలుకఁదగదు

పానుగంటి. విజయ. రాఘ. III

## పరమాత్ముఁడు

భక్తికొలఁది వాఁడే పరమాత్ముఁడు
భుక్తిముక్తిఁదానే యిచ్చుభువి
పట్టినవారిచేబిడ్డ పరమాత్ముఁడు
బట్టబయటి ధనము పరమాత్ముఁడు
పట్టపగటి వెలుఁగు పరమాత్ముఁడు
పచ్చిపాలలోని వెన్న పరమాత్ముఁడు
బచ్చనవ్రాసిన రూపు పరమాత్ముఁడు
బచ్చుచేతి యొరగల్లు పరమాత్ముఁడు
ఇచ్చకొలఁదివాడు వోయీ పరమాత్ముఁడు
పలుకులలోని తేట పరమాత్ముఁడు
నీవనుచుఁగనుఁగొన్న నిజమెట్లనీవే
తనయాత్మవలెనె భూతములయతుమ లెల్ల
ననయంబుఁ గనుఁగొన్న యతండే నీవు
పుట్టించిన హరి పూఁచిమేపునా ?
గట్టిగా రక్షించుగాకతఁడు
అంతరాత్మను నష్టేమఱచేనా ?
చింతలో బెరకేఁచీఁగాకా

తా. అన్నమయ్య

ఎందేడెందము కందలించు రహిచేనేకాగ్రతన్ నిర్వృతిన్
జెందున్గుంభగత ప్రదీపకళికా శ్రీదోఁప నెందెందుఁబో
కెందే నింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మము

పెద్దన. మను. II-820

## పరమార్థము

విరహమున కంటె దుఃఖము
గరమిష్టము గవయ కాన్పుకంటె సుఖంబున్
పరికింప వొండు లేదిది
పరమార్థమమర్త్య మర్త్య ఫణిలోకములన్

పన్నెచోర. కు. సం. VIII-164

ఏకబ్రహ్మమె నిత్యము
వైకల్పికమైన యట్టివస్తువులెల్లన్
ఏకత్వంబని యెఱిగిన
శోకము లేకుండ ముక్తిసుఖవగు వేమా

వేమన

కరణద_త వస్తుజ్ఞాన కలనఁగావి
వస్తు పరమార్థ తత్వమెవ్వరికి లేదు
లేదనుట తద్గ్రహణశక్తి లేదనుటయె
వస్తువేలేకపోవుట వలనఁగాదు

పానుగంటి. విజయరాఘ III

అనుభవించి తెలియనర్హుఁడా శ్రీ జ్ఞాన
లలితమూర్తిఁ దెలియఁబలుకు టెట్లు ?
పరమయోగ విదిత పరతత్త్వ విభవము
పొడిపొడి నుడువులను బోధమగునె

పానుగంటి. వవ. రాఘ. V

## పరము

ఇవ్వసుంధరఁ బుణ్యమెంతయుఁ జేసి
యెవ్వరు బొందితోనేఁగిరి దివికి

గౌరన. హరిశ్చంద్ర. II

తన జన్మముఁ గర్మముఁదన
పనియు నెఱుఁగుటె పరము

తా. అన్నమయ్య. అధ్యా. సం

నెమ్మిఁబరలోక సౌఖ్యయు నమ్మినేఁడు
దొరకు లాభంబు విడుచు వేఁదులును గలరె

శంకరకవి. హరిశ్చంద్ర. II-179

పరలోక చింత నీభావంబులోన
మరవక సౌఖ్యంబు మరిగి వర్తిలుము

వరద. రామాయ. అయో

పరలోక భయము లేక భవ
పాశబద్ధులయ్యేదరు

త్యాగరాజు. కృతులు

## పరవిషయము

పరధనంబులకును బరకాంతలకును
బరితాపమునఁ బొందుపాపకర్ములకుఁ
దగవేలఁ మేలేల ధర్మంబు లేల
జగదేక హితమైన చరితంబు లేల ?

పరధన పరదార పరిచిత్తుఁ డెవ్వఁ
డరయ నాతఁడు కులమంతయుఁ జెఱచు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ

పెరచోటి కుంతమైన
ప్రియమై యుండు

తా. అన్నమయ్య. అధ్యా

పరధన పరదార పరనింద లెపుడు
నరసి చూచిన దోష మాయుష్యహాని

తిమ్మయ. ద్వి. భారత. విరాట

పరధనంబులపరస్త్రీలను నపేక్షించు
నరులకబ్బునె? మోక్షమరయ.

రామదాసు చరిత్ర

పరధన పర వధూ పరమనస్కులకు
పరికింప నిహమును పరమును గలదె.

సారంగధర చరిత్ర

పరులు పెట్టు నెట్టిదైన పరమార్థముకాదు

క్షేత్రయ

ఇతరులకు మందు దెలుపగ
ప్రతివాడును వైద్యశాస్త్ర పరిపూర్ణుండే
ఇతరులకు నీతి గఱపఁగ
ప్రతి వాడును నీతి శాస్త్ర పారంగతుఁడే

కాళ్ళకూరి. చింతామణి

బాహ్యరూపంబుఁగని భ్రమ పడక లోని
సారము నెఱింగి మనుజులఁ జేరఁదగును

మిసిమిగల్గు ముసిఁడి పండు మోసవారెవరు
దినెదరింపుగ ముండ్లున్న పనసపండు

షి.శి. వే

పరులదూషణవాక్యముల్ పలికితేని
వారు దూషణవాక్యముల్ పలుకు చంద్రు
మంచి మాటలు నీవు వచించి తేని
మంచి మాటలె వారు వచించు చంద్రు

నా. కృ. రావు

## పరసతి

ఆయురైశ్వర్య కీర్తుల నపహరించు
పరసతీ సంగమము

తిక్కన. భారత. విరాట. II-66

......సుకృతి
పరసతిఁ దల్లిగా భావింప వలదె?

...పతివ్రతల నాశించుట తగదు

పరవధూజనుల సంస్పర్శంబు సేయు
పురుషు లధోగతిఁ బొంది కూలుదురు
అట్టివారల ముట్ట నర్హంబు గాదు
గట్టిగాఁ గనుగొనఁ గాదు.........
పరవధూరతిఁగోరు పాపాత్మకులము
సిరియును నాయువుఁ జెడు......

గోనబుద్ధా రెడ్డి. రంగ. రామాయ.

పర దారాగమనంబునం గలుగు పాపం బెక్కుడత్యంత దు
స్తర మాయుః క్షయ మాచరించు

మారన. మార్కం. III-297

పరభామలను చెయ్యిపట్ట కీడు

వేమన

పరసతి గమనంబు ప్రత్యక్ష నాశంబు

వేమన

తన్ను గన్నయట్టి తల్లివంటిదిసుమ్ము
అన్యకాంత న్యాయమరసి చూడ

వేమన

పరకాంత నెవ్వడేనిం
బురుషుండుండంగ మొఱగిపొందిన యమకిం
కరు లతనిఁబట్టి వడిఁ ద
త్తరమునఁబడవైతు రంధతామిస్రమునన్

గంగన. భాగవ. V-139

ప్రాణహారణశస్త్రి పరస్త్రీ

రామభ. రామా. VII-224

పరులకు నవ్వుపట్టు తన బంధుజనంబులకెల్లనింద య
స్థిరములకాలయంబు కడు సిగ్గులచేటున కాస్పదంబు స
త్పరమము త్రోవగాక కడు భాసుర కీర్తికి మూలహాని యె
వ్వరికిఁ బరాంగనం గలియ వర్తనయే బలమెంతఁగల్గినన్

మాడయకవి. మైరావణ చరిత్ర

పుణ్యాంగనలన్ బతివ్రతల నార్యుల భార్యలఁ దెచ్చి గాసిసే
యంగ నఘంబు వాటిలు......
అంటిన మండుచుండుట మహానలకీలలు సేరఁ బోగనన్
గంటువహించి యూరుపు సెగల్ నిగిడించుటఁ గాలభోగినుల్
జంటవహింప నాయువు వెసన్ గొనుటన్ గనిపించు మృత్యువుల్
గంటికి లెస్సయున్నఁ బరకాంతలు మేలని కోరవచ్చునే

కంకంటి. ఉత్తరరామాయణము. IV-1121,22

అరయఁగ మాన హాని ధన హాని సమంచిత కీర్తి హానియున్
బరమ వివేక హానియును బాంధవహానియుఁ బ్రాణహానియున్
సురుచిరపుణ్య హానియును జొప్పడునెప్పుడుఁ దప్పకుండఁగా
బరసతి గోరువారలకుఁ బల్కులు నెంతటి వారికేనియున్

ఎడపాటి యెఱ్ఱన. శృంగారమల్హణ చరిత్ర.

వ్రతము చెడిన సుఖము లేదాయె

క్షేత్రయ

.........పరకాంత యధిక పాతకము
పొందించుఁ దుదిఁ గోరి పొందువారలకు
పతిగన్నఁ దెగఁజూచు, బ్రజగన్న దూఱు
సతిగన్నఁ గోపించు సభ్యులాడుదురు

తిమ్మయ. ద్విప. భారత. విరాట

.........అన్యదార పరిగ్రహంబు
సూవె పాపములకెచ్చో నాలయంబు

వరద. రామా. అరణ్య

మగనాలి నాశింప మర్యాద గాదు

వరద. రామా. అరణ్య

పరభామినులఁ గోర భంగము వేల్పు
దొరకైన వచ్చు......

వరద. రామా. సుందర.

పరకాంతఁ దల్లిగాఁ భావింప వలదె

వరద. రామా. సుందర.

పరసతి గమనంబు పాపకరంబు

సోమన. ద్విప. భారత.

పరసతుల మెల్లన పొందేటి
వానికి మోసమూ చాల
దోసము

రామదాసు చరిత్ర.

పరభామాసక్తులకిల, నరయఁగ నిష్కృతులు గలవె...

శ్రీధరమల్లె. బ్రహ్మోత్తర. IV-288

.........పెఱ తెరవలగై
కొనఁగోరెడివాని బ్రతుకు కొంచెముగాదే

అచ్చ రామా. అరణ్యకాండ 38

తనభార్య నొక్కఁడంటినఁ
తన కేగతిఁ దోచునట్లితరు భార్యనుఁదాఁ
గొనుటప్పు డారయవలయున్

దా. శ్రీదేవి భాగ.

వృద్ధ సతియైనఁ దల్లిగా నెన్నవలయుఁ
దరుణియైన సోదరిగాఁగఁ దలఁపవలయు

బాలయైనతన బిడ్డగా జూడనలయుఁ
బరవనితఁగూర్చి నాల్గవ వరుసలేదు

పామగంటి. బుద్ధ

ఒకరిభామను నీవు ఒనగోరితె స్త్రీ
గాత్రవలె నీగొంతు గోయుతా యముదు

సితచెర-స్త్రీల రామా

వెలుఁగుఁగని దీపశిఖఁబడు
శలభమువలె నామిషంబు చవిఁగాలమునన్
మెలిపడు మీనమువలెఁ బర
లలనలఁగామించి చెడఁదలంచుటలగ్గే

వేంకట పార్వతీశ్వరకవులు. బృందావనము

పరమ కులనాశనంబును
పరధర్మవిరుద్ధము నతి పాపావహామా
పరదారాపహారణము......

తిరుమల వింజమూరు పార్థసారథి అయ్యంగారు
నిర్వచన సుందరకాండము

## పరాజయము

పరాజయము మరణంబు కంటె
హృదయపుట భేదనము సేయు

తిక్క. భారత ఉద్యో. III-18

....... ..గర్వంబడంగన్ రణం
బున మున్నోడియుఁ బూర్వనామమునఁ జెంపున్ గర్వముం
గాల్చు వాఁ
డన ఘూ సత్సభలందు మెచ్చఁబడునే

నన్నయ. భార. ఆది. VII-50

## పరాధీనత

ఎప్పుడు నుచితమె యొరుల
యిండ్లపొత్తున నుండన్ ?

నన్నయ. భారత ఆది. VII-29

...పరాధీనుల కేలిక మనసు
కొలఁది నేపవిత్రైనఁ గోరి కావింప
వలయునుగాని కేవలపాపములకు
దలఁగెద మనరాదు .....

గౌరన. నవనాథ.

ఎపుడు నీయాతుమ యీశ్వరాధీనము
అపుడాతఁ డెట్టునిచె నట్టె అంయ్యాని
కర్మాన కధీనము కలిమిలేములు
చిత్తమునకధీనము చిల్లర యింద్రియములు

తా. అన్నమయ్య

పరబుద్ధి వినువారి బ్రతుకేమి బ్రతుకు

తిమ్మయ. ద్వి. భారత. ఆది

ప్రియులు ప్రియులటంచును వదరెదరుగాని
వారియసువులు తత్ప్రభు వశ్యములగు
రాజకృపయటంచు శ్రితులు సంభ్రమపడెదరు
గాని వారు తత్సేవకాధీనులహహ

పానుగంటి. కోకిల

ఒరుని మాటలేరు నరయక నమ్మిన
వాఁడు మోసపోయి కీడుఁబొందు

తనకుజేతనైన తనపని యొరులపై
మోపువాఁడు తుదకు మోసపోవు

ఉన్న సొమ్మెల్లనొరునకు నొప్పగించి
నమ్మి కొనువాఁడు తుదకు మోసమ్ముఁగనును

ఆ. నారాయణదాసు. నూరుగంటి

పరులసాయమపేక్షించి బ్రతుకుటరయ, ఎండమావుల జల
మాన నెంచినట్లు

నా. కృ. రావు.

## పరాయణము

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము దనమనంబునకగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్

తిక్కన. భారత. శాంతి. V-220

పరులనీకు నెట్లు వాంఛింతువో చేయఁ
బరులకట్ల చేయవలయు నీవు
సర్వశాస్త్రములను జర్చింపఁ దేలెడు
సారమైన ధర్మ సరణి యిదియె

కం. వీరేశలింగము. నీతిదీపిక

## పరిగ్రహము

అతి దుఃఖము నఘము నధోగతియుఁ
బరిగ్రహామువలనఁ గరము గలుగు

మారన. మార్కండేయ. VII-14

## పరిచయము

మొదట భరియింపరాని యాపదలన్నైన
క్రమముగాఁగొంత సహ్యతకానిపించుఁ
బ్రబల దర్శగాఢాంధకారమునన్నైన
నడుగు వెట్టిన కొలఁదిఁ దెన్నానునట్టు

పానుగంటి. కోకిల

## పరిణామము

స్నేహంబున రాగంబును రాగంబునం
గామంబును గామంబునం గ్రోధం
బును గ్రోధంబునం దృష్ణయు వర్తిల్లు

నన్నయ. భారత. అరణ్య. I–24

తనువు వేసరినాను తలంపు వేసరదు
ప్రాయము ముదిసినను భావము ముదియదు

తా. అన్నమయ్య. అధ్యా

నెలకొని సంగమంబున జనించును గామము కామవృద్ధిచే
దలకొనుఁ గ్రోధ మట్టి కెడిదంబగు క్రోధమునందనర్చుమో
హలతిక మోహవృత్తి నుదయంబగు విస్మృతి విస్మృతింజనున్
దలపఁగ బుద్ధి బుద్ధి చనినన్ మఱి తాఁ జెడుమానవుండిలన్

కొడిచెర్ల శ్రీనివాస కవి. శేష ధర్మరత్నాకరము 17

మార్పు గోరని మనుజుడీ మహిని లేడు

కూచి నరసింహం. వనవాసి. 22

## పరిశీలనము

నానా విహారశైలో
ద్యాన సభాతీర్థ దేవతా గృహ మృగయా

స్థానములకరుగు నాడమును
మానుగశోధింపవలయు మానవతతికిన్

నన్నయ. భారత. ఆది. -IV109

## పరిహార్యములు

అత్యున్న తాతినీచంబులగు శయనాసనంబులు వర్జించుటయాచా
రంబు

మారవ. మార్కం III-242

అడియాస కొలుపు గొలువకు.

బద్దెన. సుమతి. 4

విడువ వలయు రాజు వితరణి గాకున్న
విడువవలయునూరు విశ్రాంతిగాకున్న
విడువవలయు నాలివిధము చెడిన

ఇంగలంబు తోడ నిలనల్పుతోడను
బరుని యాలితోడ బతితుతోడ
సరస మాడు టెల్లజావుకు మూలంబు

వేమన

శకుని బోధ దురాగ్రహాబు
బుద్ధిని విడుచుట మేలొ కులము దెగుటయు మేలో ?

నూరన. రా. పా. IV-107

............తల్లితోడనైన
తోడబుట్టువుతోc గూతుతోడనైన
నెనసి యేకాంతమున వసియింపcదగదు

భవాని కవి. ధర్మ. IV-215

పరకాంతా ద్రవ్యంబులు
కొఱగాదని తలఁప వలయు గుణవంతులకున్
పరికించి విడువ నేరని
పురుషుఁడనాచార కర్మమును బొందునిలన్

చిత్రవతీ పరిణయము

కోపము విద్వేషంబును
దాపమునాక్రోశవృత్తి దంభమును దురా
లాపంబులు పైశున్యముఁ
బాప విచారములు విడువు ......

అత్యాహారమతిశ్రమ
మత్యాలాపములు మఱియు నతిశయగోపం
బత్యుత్కటమగు నిద్రయు
నత్యాకాంక్షయును విడువు ...

శ్రీధరమల్లె వేంకటరామకవి. బ్రహ్మోత్తర ఖండము. IV-90

పరధనాపహరణమును బరగు హత్య
భంజనావాహమును బర భాసురాంగి
శోభనము పరోన్నతి కీర్ష్య గూడ

పానుగంటి. వనవాస.

మందుపని చేయనప్పుడు మానఁదగదె
చెవికి బెట్టి రానప్పుడు త్యజింపఁదగదె!
చట్టము విరుద్ధమైనపుడు నెట్టఁదగదె
బాట తప్పైనయప్పుడు వదలఁదగదె

పానుగంటి. బుద్ధ

## పరోపకారము

కారణము లేకయును నుప
కారపరత్వమున నొరుల కార్యంబులకున్
వారని యల జడిఁబడి యెడు
వారల చూయేడుగడయు వారికి నధిపా

తిక్కన. భారత. ఉద్యో. II-76

పరోపకార మ్మృతి యొప్పఁగదా

తిక్కన. భారత. ద్రోణ. I-83

పరహితము సేయఁ బూనిన
పురుషుడు పాపంబు సేసి పొందడు కీడున్
బరమముని యగు నగస్త్యుఁడు
పరోపకారార్థకృతి నభవ్యుండగునే

తిక్కన. భారత. శాంతి. III 266

మనమున భీతగో ద్విజ సమాజముఁ గావఁగఁబూని యాజిన
ప్రనిచయ దారితాంగులయి చచ్చువి నిర్మల ధర్మ కర్మఠుల్
మనుజులు గాక రోగముల(మంది గృహంబులయందు బంధుకే
ద్వనిలుగు కష్టులున్నరులె వారలతల్లులు తల్లులే మహిన్

మారన. మార్కం. III-32

పరహితకారి కెందున నపాయశుభంబులు వొందుఁజాల ము
ష్కరులగు క్రూరకర్ము లపకారము సేయఁ దలంచి రేని న
ప్పురుషవరేణ్యుఁ గీడొకటివొందునె? తేజముదక్క దక్కరుల్
పొరయునె లోకబాంధవు నపూర్వమనోభవు నప్తసైంధవున్

జక్కన. విక్రమార్క. III-98

పరార్థమైతనూధనము వ్యయింపఁగల్గుటకదా
జననైక ఫలంబు

శ్రీనా. హర. II-78

దిక్కులేని రోగి దీనతబాపిన
పురుషుడిహము నందు పూజ్యుడగును
పరమునందువాని ఫలమేమి యనవచ్చు

పరుల కుపకరింప బాపక్షయంబగు

పరుల కుపకరించి పరుసొమ్ము పరునకు
బరగనిచ్చెనేని బరము కల్గు

పరులకుపకరింప పాపక్షయంబగు
పరులకుపకరింప పట్టుకొమ్మ
పరులకుపకరింప పరలోకహితమగు
పరులకుపకరింప బలిమి వేమ

వేమన

ఉత్తమకీర్తులైన మనుజోత్తము లాత్మహితంబు లెన్న డుం
జిత్తములందు గోరరు హసించియు లోకులకెల్లనర్థసం
పత్తియు భూతియున్ సుఖము భద్రము గోరుదురు

పోతన. భాగ. I-147

పరహితమె పరమధర్మము
పరహితునకు నెదురులేదు

పోతన. భాగ. VIII-235

హరుడు గళమునందు హాలాహలము పెట్టఁ
గప్పుగలిగి తొడవు కరణినొప్పె;
సాధురక్షణంబు సజ్జనులకు నెన్న
భూషణంబుగాదె? భూవరేంద్ర

పోతన. భాగ. VIII-247

పరహిత రతిమతి యుతులగు
దొరలకు నడుగుటయు నొడలి తొడవగుఁ బుడమిన్

పోతన. భాగ. VIII-526

తన్ను మాలిచేతఁ దగవుగాదు

పోతన. భాగ. VIII-580

శరీర ధారులకు నాపద వచ్చిన వారి యాపదల్
గన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న నొండు
మేలున్నదె?

పోతన. భాగ. IX-647

## పరోపకారము

కుటిలగతికిఁ బుట్టుగ్రుడ్డికి ననుదిన
శ్రుతివిహీనునకును గ్రూరమతికిఁ
బాపజాతికేల పాటించుఁ బరహితా
చరణ విద్య?

వైజయంతీవిలాసము. III-354

పరవిపత్ప్రతికార తత్పరులు ఘనులు

పరార్థమై పురుషవరులు విక్రుతి బొరయుటొప్పు

తెనాలి రామకృష్ణుఁడు. పాండు. III-176, 354

ఒరునిఁ బ్రోచుట కొఱకుగా నరుగుదెంచి
చెనఁటినైనను వేడఁగాఁ జెల్లుఁ బుడమి

పొన్నికంటి తెలగన్న. యయాతి చరిత్ర. III–111

సమతఁ బరోపకారకృతి సల్పుటయే సుకృతంబు

పాపరాజు. ఉ. రా. II–306

పరహిత మాచరించుటయె భవ్యతపంబని రాదిసంయముల్

పాపరాజు. ఉ. రా. VII–317

పరహితంబునకునై పాపంబుచేసి
పురుషుఁడు కీడునఁ బొందఁడు నిజము
ఒగి నగస్త్యుండు పరోపకారార్థ
మగు పాడిచేసి కృతార్థుఁడై మించె

సోమన. ద్విప. భారత. శాంతి

............ ఆత్మార్థమైన విడిచి
పరులకార్యంబు లొనరించుఁ బండితుండు

భవానీశ కవి. ధర్మ. III-25

పరుల బాధలడంపు కరుణ వెలయ
పరులనెవ్వరిని బాధింపకుండుము

శ్రీధరమల్లె. బ్రహ్మోత్తర. IV-102

పరులఁ బీడించుకంటెఁ బాపముఁ బరోప
కృతి యొనర్చుటకంటె సుకృతములేదు
పరుల కుపకృతిఁ జేసిన భాగ్యశాలి
యిహమును బరమును జెందు ...

ధరణిదేవుల. దశా. చరిత్ర. II–224

జపతపంబులకన్న చదువుసాములకన్న
ఉపకారమే మిన్న ఓకూనలమ్మ
కూనలమ్మ పదాలు. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి. సంపాదితము

పరులునీకు నెట్లు వాంఛింతురో చేయఁ
బరులకట్ల చేయవలయు నీవు

తనచేతనయిన కొలదిని నొరులకును మేలుగూర్పఁగ వలయున్
కం. వీరే. వం

మేలుసేయువారి ధనంబు మెండుకొనెడు
రీతిఁ బొలములపైరు సమృద్ధిగాంచు
విక్ర. దే

ధూపము గాలుచు న్మనుజతుష్టిఁబొగం దగఁజేయుచుండగా
దీపము గాలుచుం దనదుదీప్తిని లోకులకిచ్చుచుండఁగా
శ్రీపతిభక్తుఁడై జనుల సేమము సేయఁగడంగు పూరుషుం
డాపదకింక మిత్తికి రవంతయు జంకునె పూనికమానునే!
విక్ర. దే. వ

ఒరుల మంచికిఁ దనయొడ లొప్పగించు
నతనికే నిజము తనంతటన్దోచు
ఒరుల సాయముకోర కొరుల కెల్లపుడు
దొడ్డవాఁడు తనంత దోడ్పడుచుండు
అ. నారాయణదాసు. వేల్పుమాట

స్వపరతఁ బరాపకృతి సేయు బ్రహ్మబంధు
డైన దుర్మాంస భోజియౌ స్వాపదలను

దలఁపక పరోపకార కృత్యమునకుఁ దలఁ
పడు కుణభుక్కయిన బ్రహ్మబంధుఁడుగను

పానుగంటి. వన. రాఘ. III

పరోపకృతికన్న సుకృత మొండులేదు
పరాపకృతికన్న లేదు పాపము

తిరుపతి వేంకట. నానారాజ

ఉపకారులైన మిత్రుల
కుపకారము చేయకుండు నొగినెవ్వఁడు వాఁ
డపకీర్తికిఁ దానకము ఋ
ణపరీతుఁడు వాని జీవనము విఫలమగున్

తిరుపతి వేంకట. సుకన్య.

తన దేహము తన గేహము
తన కాలము తనధనంబు తనవిద్య జగ
జ్జనములకై వినియోగిం
చిన నరుడేనరుఁడు వాడె చెందును దివమున్

విలకమర్తి. గయోపాఖ్యానము. III-70

ఎప్పుడేరీతి నెవ్వని కేది హితమొ
అప్పు డారీతి నవ్వానికది యొనర్చు
నఖిల బ్రహ్మాండనాయకు డతనికంటె
అల్పమతియగు మానవుం డధికుడగునె

నా. కృ. రావు. అముదపుచెట్టు

పరోపకారపరతన్ జన్మంబు సార్థక్య మిుం
బొరయంగా నొనరించుకోవలయు

శ్రీపాద. కనకగిరి. 99

## పశ్చాత్తాపము

తనమేలుఁ గీడుఁ దామదిఁ
గనుచు హితులుసెప్పఁ బుద్ధిఁ గైకొని శుభముం
గొనకొని నడపు పతికి వ
చ్చునె పశ్చాత్తాప మెట్టిచోట నరేంద్రా

తిక్కన. భారత, స్త్రీ. I-144

వినుమ చిరవృత్తిఁ జేసిన
పనికర్తకు నావహించుఁ బశ్చాత్తాపం
బనఘా చిరభావిత శు
ద్ధి నిరూపణ కృతము శుభముఁ దేజముఁ దెచ్చున్

తిక్కన. భారత. శాంతి. V-29

ఘనతరమగు హ్రీ గౌరవ
మున మునిఁగినఁ బాప మఖిలమును రూపు సెడుం
బెనుపునయగ్గలికఁ బొగడు
గనిన పయోరాశిఁబడ్డ గడ్డయుఁ బోలెన్

తిక్కన. భారత. అను. II-40

మది మఱుపునఁ బాపము దన
కొదవుటయును బిదప వగచియొక సగమును నే
నిది సేయనింక ననియెడు
మదిఁ బెఱ సగమైన నరుఁడు మలుగు నఘంబున్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-41

పాతకము చేసియైనను బరితపించి
ధరణి దానంబు చేసిన ధన్యుఁడడఁచు

నయ్యఘముఁ దథ్యమిది నిర్జరాధినాథ
కుబుసమూడ్చెడి మేటినాగువునుబోలె

శ్రీనా. భీమ. V-71

పాపచయంబులు పశ్చాత్తాపంబున శుద్ధిఁబొందు

శ్రీధరమల్లె. బ్రహ్మోత్తర. V-309

## పాతివ్రత్యము

అనపహార్యంబు తేజోమయంబు సర్వ
గుణములకు నలంకారము గురుతరంబు
భామలకుఁ బతిభక్తియ పరమమైన
భూషణం బిట్టినే పెరభూషణములు

నన్నయ. భారత. అరణ్య. II-142

పాతివ్రత్యము గలిగిన
నాతియుఁగ దైవమన జనస్తుత వేతే
యాతత ధర్మార్థ సుఖ
ఖ్యాతులు సద్భార్యవలనఁగాదే కలుగున్

తిక్కన. భారత. అను. II-219

గతి పతియచువ్వొ భార్యకు
నతనిఁ గడచినట్టి సత్పరాయణము గృపా
యుత కలదే కావునఁ దా
నతనికి భక్తయగుటిచ్చు నఖిలశుభంబుల్

తిక్కన. భారత. అను. V-297

పతిఁగడవంగ దైవతము భామల
కెందును గల్గనేర్చునే

[illegible]. III-28



...పుణ్యభామినీ
లోకము నాథుఁదప్పనవలోకన
మొండొకమర్త్యుఁ జేయునే ?

మంచెన. కే. బా. చ. III-219

అతివల మాయలు పెక్కులు
పతుల మొఱఁగఁదలచిరేని పట్టఁగ వశమే
పతిభక్తి నిరతలగు న
య్యతివలు గైకొనరుగాక యాదుర్గుణముల్

అనంత. భోజరాజీ. IV-277

ఔర్వశిఖక ముకంటె నరుకకంటెఁ
బిడుగుకంటెను దీవ్రమై బిరుసు చూపు
నాత్మఁ దప్పఁగఁదలఁచు దురాత్మకులకు
నెహహా ! పతిదేవత పతివ్రతాతిశయము

శ్రీనాథుఁడు. కాశీఖండము. II-89

ఉపవాసంబులు వ్రతములుఁ
దపములు వేయేల ? భర్తదైవతమని ని
ష్కపటతఁగొల్చిన సాధ్వికి
నృపవర ! దుర్లభములేదు నిఖిల జగములన్

పోతన. భాగవ. VII - 418

పతిభక్తి నిఖిల శోభన కారణంబు
పతిభక్తి సతులకు పరమ భూషణము
పతిభక్తి సతులకుఁ బరమ శీలంబు
పతిభక్తి సతులకు భయనివారణము

పతిభక్తి సతులకు భాగ్యపోషణము
పతిభక్తి సతులకు భాగ్యమూలంబు
పతిభక్తి నింతికిఁ బడయంగరాని
యతులితపుణ్యంబు లవియెందుఁగలవు

..... భక్తిమైఁ బతిపాదసేవ
సేయుటఁగాదె ప్రసిద్ధికినెక్కి
రాయరుంధతియును నాయహల్యయును
నాయన సూయయు ......

గౌరన. హరిశ్చంద్ర.

అతివలేమేమి పుణ్యములు చేసినను
పతిసేవ సేయు శోభనములీ లేవు

వరద. రామా. అయో.

వల్లభుఁడెటువంటివాఁడైన నతఁడె
తల్లియుఁ దండ్రియు దైవంబుసుమ్ము

వరద. రామా. అయో.

అభీష్టమొందుటకు సాధ్వులకుం బతిభక్తి సాలదే

ధరణిదేవుల. దశా. చరిత్ర. V-38

సతికిఁ బతిభక్తివలన మోక్షంబుగల్గు

ధరణిదేవుల. దశా. చరిత్ర. X-16

క్షితినాథ! ఇంచుకేనియుఁ
బతిభక్తికి సాటియగునె భామామణికిన్

పో. వీర. భల్లాణ చరిత్ర. III - 103

కోటివ్రతములుచేసి కోమరొందనాగాని
పతిభక్తితో సాటి భామలకు లేదు

తల్లిదండ్రులు అన్నదమ్ములకంటెను
ఆడుదానికి ప్రాణమధిపుడే సుమ్మి

ఎల్లచుట్టాలు తనకెందరున్ననుగాని
పతిసాటిరారెవరు పద్మగంధులకు

సౌభాగ్యములు కోటిసంపదలున్న
ప్రాణనాథునివంటి భాగ్యంబులేదు

పసగాడ తన్యాసి. గంగావివాహము.

కనఁబడని దేవుఁ బురుషులు కష్టమునను
గానవలెఁగాని కనులందుఁ గట్టబడిన
యీశునిల్లాలు గొల్చి యిట్టె తరించు
సులభ తారక ధన్యంబు సుదతి బ్రతుకు

పానుగంటి. పాదుకా. V

సతులు పతినిగాక శంకరునేనియుఁ
దలఁపఁజనదు జపము తపము తీర్థ
యాత్ర మంత్ర సాధనాదిక మెల్లను
సతికిఁ బతియెపూవె జగమునందు

శ్రీపాద. నైషధీయ చరితము. IV-109

## పాత్రదానము

ధనమించుకేని ధర్మం
బునఁ బడసినయట్టి ద్రైనభూవర పాత్రం
బున నిడిన నది మహాఫల
జనకంబగునండ్రు వేదసంవేదిజనుల్

తిక్కన. భారత. శాంతి. V-48

పాత్రదానంబు సుంతైన ఫలముగాంచు
ఫలములేదెంతయిడినఁ నపాత్రమునకు
మంచినేల నాటిన గింజ వ్రూనుగట్టు
చవిటినేల నశించు గింజయును నపుడె

బిలిజేపల్లి. సత్య. II - 18

అనఘుల్ పాత్రమెఱింగియిచ్చు తృణమే యౌ కోటి

జ్ఞానప్రకాశ శతకము.

## పాప పరిహారము

చెప్పినఁ బాయును జేసిన పాపము

అన్నమయ్య. అధ్యా. సం.

పోయి సేవింపలేకున్నఁ బుణ్యతీర్థ
మహిమ వినుటయు నఖిలకల్మష హారంబ

పెద్దన మను. I-69

## పాపపుణ్యములు

దొరకొని పుణ్యముఁ బాపము
నరుఁ డర్థింజేయుచుండ నడుమనొకటన
వ్వొర వెడలి తప్పినను ద
త్పరిణతిఫల మొందునండ్రు ధర్మవిధిజ్ఞుల్

తిక్కన. భారత. ఉద్యో. III-240

తలఁపఁగ భాగ్యవంతుల కుదాత్త శుభంబగుఁగాక పుణ్యహీ
నులకది గల్గనేర్చునె

తిక్కన. భారత. శల్య. I-31

పాపమించుక దొడరిన పనియు నెట్టి
ఫలము గలిగిన వలదల్ప ఫలవిధాయి
యైన పుణ్యమిశ్రిత కార్య మాచరించు
నది శివంబగు దాన నిహాముత్రఁబరము

తిక్కన. భారత. శాంతి V 490

ఎంతెంత సేసెఁబుణ్యం
బంతంతయె సుఖమునిచ్చునదినరునకుఁదా
నెంతెంత సేసెఁ బాపం,
బంతంతయు దుఃఖమిచ్చునది తథ్యతీరన్

మారన. మార్కం. II-88

ఎలమిఁ బుణ్యములల్ల నింద్రలోకమై తోఁచు
నలుగడ పాపములే నరకలోకమై తోఁచు
తొలసి రెండు సరియైతే భూలోకమైతోఁచు
కలవాఁడొక్కండే గురి కమలవిభుండు

అచ్యుత ! నిన్నుఁగొలిచిన వారిది పుణ్యము
చలమున మానుట పాపము

పరపీడసేయుకంటే పాపము మఱెందు లేదు
పరోపకారముకంటె బహుపుణ్యము లేదు

తప్పులు ఒప్పులు దేహి తనమూలమే
తనలోని పాపములే తగిలియెదిటివారి
నినుపు నేరములై నిందింపించు
మనసులో పుణ్యములే మహిఁగన్న వారి మీఁద
ఘనుఁగని నేరుపులై పొగడింపించును
ఎవ్వఁడు పుణ్యుండుగాఁడు ఎవ్వఁడు పాతకిగాఁడు ?

ఇవ్వలఁదొంటి జన్మములెంచి చూచితే!
గుట్టు తెలిసితిమిందు కొంచెమేది దొడ్డయేది?
ఎఱింగిచేయు టేది ఎఱుంగక మాను టేది?
తఱిఁ బ్రపంచమునందుఁ దలపోసితే!

వేసరక పుణ్యాలు గావించే దే యరుదుగాని
సేసినంటే పాపములు చేతిలోనివే

అన్నమయ్య అధ్యా. సం. సం.

దోషంబున వచ్చు నల్పసుఖములుగని
పుణ్యము పార లౌకికము లుడుగుదురే;

వెన్నెలకంటి సూరన. వి. పు. VIII 407

పాపికిఁ బాపంబు పథ్యమైయుండు
నేపార సుకృతికి హితము పుణ్యంబు

తిమ్మయ. ద్వి. భారత. ఉద్యో.

తొలి జన్మంబునఁజేసిన
కొలయును బుణ్యంబు కట్టికుడుపక యున్నే

చేమకూర. సారంగ. II-33

చెలఁగి సేయువాఁడు సేయించువాఁడు ప్రే
రించువాఁడు సమ్మతించు వాఁడు
పాపపుణ్యములకు భాగార్హులగుదురు
నలువురును ధరిత్రిఁ జెలువుమిగుల

భవానీశకవి. ధర్మ. I-126

ఓపితే పుణ్యములు సేయుము
ఓపకుంటే ఊరకుండుము
పాపము సేయకుమంతే పదివేలుజీవుడా

ఏగంటివారి వచనాలు. బి. రామరాజు. సం

తన పుణ్యమె తన చెలియగు
తన పాపమె తనకువైరి

డా. శ్రీ. దేవీభాగవ. VI-III

మనసుతో లంకెలేని సామాన్యకృతుల
పాపపుణ్యచింతన సేయ వలనుపడదు

పానుగంటి. కల్యా.

సౌఖ్యమొందఁగఁ దలఁచిన జనుఁడు సతము
చిత్తశుద్ధిని సుకృతి నే చేయవలయుఁ
బాపకర్మములను జేయువానికెప్పు
డాత్మసౌఖ్యము సేకూరదయ్య నిజము

పానుగంటి. బుద్ధ.

కాయ వాఙ్మానసంబు లొక్కటిగ వరుఁడు
పుణ్యపాపంబు లొనరింపఁ బూననేని
కాలవశమున నడుమ విఘ్నమగుఁగాక
తనకుఁ దత్తత్ఫలంబులు దప్పవు

తనికెళ్ళ ప్రకాశశాస్త్రి. శ్రీకృష్ణరాయబారము

## పాపములు

క్రూరపుఁ బాపపు ఫలంబు గుడుపక యున్నే

తిక్కన. భారత. ద్రోణ. V-30

అంగహీను దరిద్రు విద్యావిహీను
రూపహీనునిఁ దెగడుట పాపమండ్రు
వేద దేవతానిందలు వేతనార్థ
కముగ జోస్యంబు నడుపుటకల్మషములు

తిక్కన. భారత. అను. IV-410

అఘమొకింత యొనర్చిననది యొకప్పుడు
గాలములు గొట్టునాటి దుఃఖములు దెచ్చు
నొదుగఁ జేసినఁ దలయేరు మొదలుగాఁగఁ
గలుగు తెప్పుళుల వేదన సడలుగొలఁపు

మారన. మార్కం. II–87

మనసుఁ బలుకును జేతయునననఁగ నిట్టి
మూఁడు దెఱఁగుల పాపంబు ముదిరెనేని
నదియు సంసార వారిధి నదిమియుండు
మనుజుఁ డెన్నఁడుఁ దలయెత్తి కొనఁగఁ లేఁడు

ఎఱ్ఱన. నృ.పు. IV–128

తమ చేసిన దుష్కృతములు తముఁ జెఱచును

నాచన సోమన. ఉ. హ. వం. V–46

రాష్ట్రమునకైన పాపంబు రాజుఁ బొందు
క్షితిపు పాపంబు మఱి పురోహితునిఁ బొందు
మగువ చేసిన పాపంబు మగనిఁబొందు
శిష్యు పాపంబు గురుబొందు సృష్టియందు

అనంత. భోజరాజీయము. V–303

మిక్కిలిఁ జేసీ పాపమే మీఁద నరకమై తోఁచు
నిక్కి తానే అద్దములో నీడైనట్లు
ఒక్కట మొదలు లేకయుంటేఁ గొనాలేదు
గుక్క కిహపరములు కోరినం తేసుంటి !
ధరఁ గర్మపుఁ జేఁతలలో నెల్లా
సారిదిఁ బాపమే సులభము

నానారుచులు అనంతము గలిగిన
కానీఁ పదార్థ మొకఁడుఁ దీఁపు

అన్నమయ్య. అధ్యా.

పట్టపు రాజును జంపుట
గట్టలుకన్విప్రుఁ జంపుకంటెను బాపంబు

పోతన. భాగవ. IX-464

మేనిలో జీవము వెల్గుచుండఁ దన చెల్వము దప్పకమున్న పన్నుగా
బావన చిత్తుఁడై యఘముఁ బాయు తెఱం గొనరింపఁగా దగున్

సింగయ. భాగవ. VI-44

తల్లి కెదురుకొనుట తండ్రి కెదురుకొంట
యన్న కెదురుకొనుట యరయమూఁడు
పాతకము లటంచు వర్తించు మెరుకతో
తప్పని తెలియకయె తా జేయు పాపంబు
తప్పదెపుడు భువినిదగులు

వేమన

పాతక విముఖత పరమార్థ నీతి

తిమ్మయ. ద్వి. భారత. ఉద్యో.

వేదోక్త కర్మంబు వెసఁ జేయకుండుట
ఆదట నింద్యమైనది సేయుటయును
మఱి రవియుదయాస్తమయ కాలములను
నెఱిమీఱ నెంతయు నిద్రించుటయును
ధరఁ బాత్రభూతుండు తన గృహంబునకు

నరుగు దెంచినఁ బూజ యాచరింపమియుఁ
బరదార గమనంబు ప్రజ్ఞ దీపించి
గురువున కెదురుగ్రక్కునఁ బల్కుటయును
గ్రామంబు నెఱుచుట రసవిక్రయంబు
వేమఱు నెంతయు వేద విక్రయము
రూఢిగాఁ దల్లిదండ్రులఁ బ్రోవమియును
ఓడక మఱి యసత్యోపచారంబు
గహన దాహము నన్యకర్మ కృతియును
మహిలోనఁ దనదు కర్మము విడుచుటయుఁ
బరఁగ వృథా పశు ప్రహరణంబులును
ధరణి దేవతల విత్తము హరించుటయు
దొరకొని శరణాగతులఁ బ్రోవమియును
బరఁగఁ బాపము లండ్రు...

సోమన. ద్విప భారత.

అతివల గోసమూహంబు బ్రాహ్మణుల
నతులితాన్నము లిడినట్టి వారలను
విశ్వసించిన వారి వేగఁ ద్రుంచినను
విశ్వధారుణియందు వేపాపమండ్రు

తాలనర. ద్విప. భారత. సభా.

అజ్ఞాన కృతములైన న
ను జ్ఞాకృతములయిన సుతను ద్విజగురు గో
విజ్ఞానాన్యాకృతుల న
భిజ్ఞులు ఘనపాపమనరు విగ్రహము గతిన్

వీరరాఘవకవి. యాదవ. రా. పాం

పాపము చేసినవాఁడును
పాపముఁ జేయించువాఁడుఁ బాయక నొకటే
పాపము నొందుదురు

దా. శ్రీ దేవీభాగవ. IV-481

తెలిసియు పాతకంబులను దీపని చేయగ నెన్వడోపు
గన్నులగని యెట్టివాడయిన నూతిఁ బడన్ మది గోరునేధరన్ ?

కో. శ్రీనివాసరావు. మైసూరు రాజ్యము

పాపంబు పండనందాఁకఁ
బాపియున్ సౌఖ్యముల్ గనున్
పాపంబు పండినప్పుడె
పాపి కష్టంబులన్ గనున్

చ. గ. శాస్త్రి

## పాపాత్ములు

...వంచనఁ బరార్థ పరిగ్రహాబుద్ధిఁజేసి పా
పమ్మగుఁ బాపకారులకుఁ బాయ నవశ్యము నర్థ ధర్మముల్

నన్నయ. భారత. సభా. II-136

పాప నిరూఢుఁడు నీతిఁగాంచునే

తిక్కన. భారత. సౌప్తి. I-106

పాపపరులకుఁ బైపయినాపదలు మ
హా భయంబులు చావులు నడరుచుండు

మారన. మార్కం. II-85

వినురాజఘ్నుఁడు నన్నకు
మును పెండిలి యైనవాఁడు (ముచ్చును గోహింc
ననకరుఁడు విప్రహరుఁడు
జ్ఞన హంతయు నాస్తికుండు నరక ప్రాప్తుల్

మల్లికార్జునుఁడు. భా.రా. కిష్కింధ. 293

మిత్రద్రోహి కృతఘ్నుఁడు
ధాత్రీ సురహంత హేమ తస్కరుఁడు సురా
పాత్రీభూతుఁడు నిందా
పాత్రులు వీరెల్ల నరకభవనావాసుల్

జక్కన. విక్రమార్క. III-117

విశ్వనాథునందు విప్రులయందును
వినయమందు వేదవిధులయందు
భక్తిలేనివాఁడు పాపాత్ము డిలలోన

వేమన

విపరీతకాంతు పొత్తునc జనుపాపజాతికిని
దుశ్శకునంబులు గాకయుండునే

పాలరాజు. ఉ. రా. VI-238

ఒరునకునైన యభ్యుదయంబు చూచి
పరితాపమును బొందుc బాపాత్ముc డెందు

తిమ్మయ. ద్వి. భారత. ఉద్యో.

దీన జనముల యాశగుందించు నతఁడు
మార్గ రోధనకారియై మలయునతఁడు
తెలిసి పతితుని యన్నంబు దిను నతండు
నిరయమున కేఁగు వారలు నిక్కవంబు

భవానీశకవి. ధర్మ. I-302

...సురుల కప్రియములు సేయు
మనుజులు కడు పాపమతులు

సోమన. భారత. అరణ్య. అను.

పథ్యంబుగాఁ గొనరు పాప మానసులు
తథ్యంబుగా సభ్యతతులు పల్కినను

భాలవర. ద్వి. భారత. సభా.

పాపికెటుల తెలియుఁ బరుల బాధ ?

కోలాచలం. రామరాజు చరిత్రము. II-23

## పారతంత్ర్యము

పరతంత్ర జనముల పాలికష్టములు
చెప్పంగనలవియే శివునకునైన

పారతంత్ర్యంబు కటకటా పగవారికైనను వలదు

శ్రీనాథ. పల. వీ.

తటుకున స్వతంత్ర ముడిగిన యాత్మకు
తగు నిశ్చింతమె పరసుఖము
కోరిక లుడిగిన యోగికి నీశ్వరుఁడే రక్షకుఁడు
స్వయత్న దేహుల కీశ్వరుఁడును వాత్సల్యము వదలు

అన్నయ్య - అధ్యా. సం.

## పితాపుత్రసంబంధము

కొడుకునకుఁ దండ్రి తండ్రికిఁ
గొడుకు వేఱుగామి యది పరమార్థంబు

మారన మార్కం. పు. VIII-218

జనకుఁడే పుత్త్రుఁడై జనియించునంచు
గొల్లున వేదముల్ ఘోషించుచుండు

శ్రీనాథ. పల. వీ.

తండ్రికి నోర్వక పోదుబిడ్డఁడే
యొప్పమిఁ జేసెనేనియు —

తనయుఁడు చాపలప్రకృతిఁ దప్పి యొకానొక తప్పు చేసినన్
గనికరుణింపఁ గావలయుఁగాని చలంబున విగ్రహింపఁగాఁ
జనదటులుండఁ బుత్రులనిశంబును జూపెడు శౌర్య తేజముల్
జనకున కెయ్యెడం బరమసౌఖ్య విశేషము లెన్నిచూచినన్

పిల్ల. పిన. జైమిని

తనయుని నెగ్గంబు తండ్రిదిగాదె

తాళ్ళపాక. తిరువేం. పరమయోగి

జనకాచార మవశ్యము
తనయుం బ్రాపించుననుట తథ్యము ధరలో
ఘనకాంతక కంటకములు
దనరందత్ఫల కులంబు దాల్చుట లేదో!

బైచరాజు. పంచ.-I 673

కోరికతోఁ బెద్దకొడుకుల మీఁద
కూరిమి తండ్రులకును గల్గియుండు
ధారుణిఁ గడగొట్టు తనయుల మీఁద
కూరిమి తల్లులకును గల్గియుండు
తలిదండ్రు లొల్లని తనయులుం గలరె?

వరద. రామా. బాల.

ఎంత ప్రాయంబు సనిన, బాలుఁడె తండ్రికిఁ బరికింప సుతుఁడు

సోమన. ద్విప. భారత. అశ్వ.

చిత్రంబెన్నఁగఁ జిన్ననాఁడె తనయుల్ శిక్షానుగుణ్యుల్ తుదన్
బాత్రుల్గారటి దండకార్యములకున్ బ్రాయంపు వారైన ని

ధ్ధాత్రిం జుట్టములట్లు చూడవలదా తండ్రు ల్తనూజాతులున్
బుత్రిం మిత్రవదాచ రేత్తనుచు నేప్రొద్దున్ శ్రుతుల్చాటఁగన్

ఘుట్టుప్రభువు. కుచేలోపాఖ్యానము

తండ్రి బిడ్డలఁ బుణ్యావర్తనులఁ బాప
రహితులుగఁ జేయవలయు శాస్త్రప్రవీణు
లయిన పిమ్మటఁ దగుచోటు లరసి పెండ్లి
సేసి తనసొత్తు వారికిఁ జేర్పవలయు
పిల్లలు పితను భక్తిసేవించి గృహకృ
తుల బరుతామెపూని మృతులగు తల్లి
దండ్రులను జ్ఞప్తి మన్నించి తగిన పుత్రుఁ
డితఁడనుచు జనులనఁగ వర్తింపవలయు

పానుగంటి. బుద్ధ.

తనయు లుత్తములైనచోఁ దండ్రికీర్తి
యధములైనప్పు డాతని కప్రతిష్ఠ

పానుగంటి. చూడామణి.

తండ్రిమోహము కొడుకు శ్రద్ధను సడల్చు;
శ్రద్ధ సడలిన శిష్యుఁడు జడతగాంచు;
జడుని చదువెల్ల నీటిపైఁ జమురుచుక్క;
తండ్రి సుతు నోజ్జయౌ టనర్థంబుగాదె!

కొప్పరపు సుబ్బారావు. తారాశశాంకము. I- 56

## పితృభక్తి

తల్లి దండ్రి పూజదారిగనక కొంత
పాపకూపమందు బడుటయేల!

వేమ.

తండ్రియనంగఁ గేవలము దైవము పుత్రులకున్

లక్ష్మి. ప్ర. శా. వి. II-72

వ్రతములుఁ దపములు జపములు
పితృ సేవకులొచ్చు తనదు పెంపున కెల్లన్
గతి తండ్రియె కావుననే
"పితృదేవోభవ" యటంచు వేదము పలుకున్

తిరుపతి వేంకటకవులు. పాండవజననము.

## పితృవాక్యము

అరిమలిఁ దండ్రి వాక్యము సేయుకంటె
ధర్మంబుఁ గలదె? యా తండ్రి వాక్యంబు
సేయమికంటె దుష్కృతమును గలదె?
పితృవాక్యకరణంబె ప్రియధర్మ మెందు
సుతునకు; నటు సేయుసుతుఁడె విశ్రుతుఁడు
తల్లిదండ్రుల మాట దాటక చేయు
బల్లిదులకును సంపదలుఁ గీర్తియును
నాకలోకాది నానావిధ పుణ్య
లోకంబు లరచేతిలో నుండు......

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. అయో

పితృ నియుక్తిఁ గడవఁ జనదు

కుమార రుద్రదేవుఁడు. భా. రా. అయో. 128

పితృవాక్య మలంఘ్యముగాదె యేటికిన్

ధరణిదేవుల రామయమంత్రి. దశా. చరిత్ర. II-456

తండ్రి మాటలు సుతునకుఁ దప్పకుండ
వినఁదగినవంచుఁ బండితులనుచు నుండఁ

దండ్రి యవసాన వాక్యాళి తనయునకు న
వశ్య కర్తవ్యమని చెప్పవలెనె వత్స !

పానుగంటి. పూర్ణిమ

జగమున నెట్టిదైనఁ బితృశాసనమూనుట ధర్మమే

శ్రీపాద. కనకగిరి. 51

## పితృవాత్సల్యము

సూను జనకుండు సూచి మ
హానందముఁ బొందు నతిశయ ప్రీతిమెయిన్

నన్నయ. భారత. ఆది. IV-88

......శతపుత్త్రులుగల ధ
న్యులకైన ననిష్టుఁడగు తనూజుఁడు గలఁడే

నన్నయ. భారత. ఆది. VI-277

ఎల్ల నెయ్యములకుఁ దల్లిదండ్రులయందు
సుతుల వలని నెయ్య మతిశయంబు

నన్నయ. భారత. అరణ్య. I-81

.........ఉన్నయప్పుడ
చిత్తమ్మున మోహావేశము తండ్రులకు
స్వభావము సుమ్మిట్లు సుతులపై

మారన. మార్కం. I-255

తగని కుమారుఁడైన మమతా రహితస్థితి యొప్పఁ దండ్రికిన్

పాపరాజు. ఉ. రా. II-249

కడుపునఁ బుట్టిన తనయుఁడు ఎంతో
దుడుకుతనము. చేసేటప్పుడు

కొడుకా రమ్మని చేకొనుగాని నూతిలోఁ
బడఁ ద్రోయునా యెంత పాపాత్ముఁడైనాను ?
ఏమి యొనర్చినన్ సుతుని యెగ్గులఁ దండ్రికిఁ గిన్కపుట్టునే

రామదాసు చరిత్ర

పితపయినిఁ గలుగు సుతుదయ కంటె
దండ్రికి సుతి రాగము వేయి తడవలెచ్చు

పానుగంటి. పాదు.

పుణ్యము

ఇందుఁ జేసిన పుణ్యంబ యిందుఁగుడుచు
మీఁది జన్మంబునకు నది మేలుఁ జేయు

ఇందుఁ జేసిన పుణ్యంబులెల్ల నందుఁ
గుడుచుఁగాని మర్త్యునకందుఁ గడఁగి పుణ్య
మాచరింపంగఁ గాదు

పుణ్యలోక పరిభ్రష్టుండ
మర్త్యలోకంబున సుఖశీలుండయి పుట్టు

ఎఱ్ఱన. భారత. అరణ్య. VI–109, 135, 138

పెద్దవారికి స్త్రీ పుంవి భేద మేల
మాననీయంబు పుణ్యకర్మంబుగాక

శ్రీనాథ. హర. VI-42

తనకు విధి నిషేధములుఁ
బుణ్యముల ఘనత
యెఱుఁగు టే కలిమి
ఇసుక లెక్కవెట్టితే నెంతైనాఁ గలదు

అసము దించని పుణ్యా లటువంటివే
దేహాధీనము తిరిగేటి జీవులు
దేహము అర్థాధీనము
మోహాధీనము ముంచినయర్థము
ఆహా! ఇది పుణ్యాధీనము

అన్నమయ్య. అధ్యా. సం.

ధర్మము సత్యముఁ గీర్తియు
నిర్మలదయ, విష్ణుభక్తి నిరుపమ ఘన స
త్కర్మ మహింసావ్రతమును
నర్మిలిగలవారె పుణ్యులవనీనాథా!

నారయ. భాగవ. XII-16

పుణ్యవాసన లూరకపోవు సూవె.

సూరన. కళా. V-162

కడువడి నెవ్వఁడేని శుచిగాకయు నూరక బ్రహ్మకుండిలో
నడుగులు దోఁచినంతనెవియన్నది పాదమునందుఁ గల్గుమేన్
దడుపుచు రామచంద్రునకుఁ దండము పెట్టినవాని పుణ్యముల్
నుడువఁగ శక్యమానె పధినూఱు దలల్ గల పాపతేనికిన్

లింగమకుంట రామకవి. ఆవందకానన మాహాత్మ్యము

సమయముఁ దెలిసి పుణ్యము లార్జించని
కుమతి యుండియేమి పోయియేమి?

త్యాగరాజు

ఆపదలయందు దోడ్పడునట్టి హితుఁడు
సత్సభారంజనము జేయజాలు విద్య

మతి వరించిన మానినీమణియు బుణ్యా
వంతులకుగాక యబ్బునే వసుధలోన

కాళ్లకూరి నారాయణరావు. చిత్రాభ్యుదయము. III-29

పుణ్యాత్ములు

కులపాంసనులై యహితం
బులు సేయుచు నుండు చుట్టములఁ బొందక యి
మ్ములఁ నుండువాఁడ పుణ్యుఁడు
వెలయఁగ గ్రామస్థితైక వృక్షము పోలెన్

నన్నయ. భారత. ఆది. VI-182

చెల్లియుండియు సైరణసేయు నతఁడు
పేదవడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁగల భంగినిచ్చు నతండుఁ బుణ్య
పురుషులని చెప్పి రార్యులు బుధవరేణ్య

తిక్కన. భారత. ఉద్యో. II-42

ఉత్సవంబుల మీఁదనె యుత్సవములు
పొందుచుండుదు రెప్పుడు పుణ్యనరులు

మారన. మార్కం. II-85

పొదుకొన్న సంసార బంధము నోరూరించితే
ఆదిగొని మత్తుఁడు గానట్టివాఁడే పుణ్యుఁడు

అన్నమయ్య. అధ్యా. సం.

అల్లునికగు మృతికి నాత్మఁ జింతించును
తనయు మృతికిఁ దానె తల్లడిల్లు
పుణ్య పురుషు మృతికి భూమిలో జనులకు
యుగము గ్రుంగినట్లు లుండు వేమ

యోగమమరిన చిత్తంబు బాగుపఱచి
రాగవైరాదులనుబట్టి రంగరించి
భోగమందినవాడెపో పుణ్యుడగును
ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు
చూడఁ జూడ రుచులజాడ వేఱు
పురుషులందుఁ బుణ్యపురుషులు వేఱయా
విశ్వదాభిరామ వినుర వేమ

వేమన

అజన్మము దుర్విషయ రహితునికి
గతాగత మికనేల?

త్యాగరాజ

జనకుని పూజలంగదుఁ బ్రసన్నునిసేయు నతండు పుత్త్రుఁడే
వనిత మెలంగు భర్తృవశవర్తినియై యది సత్కళత్ర భా
జనుఁడు విపత్తి సౌఖ్య సదృశక్రియుఁడాతఁడు మిత్రుఁడీ త్రయం
బును జగతిన్ లభించుఁ గదు పుణ్యము సేసినయట్టి వారికిన్

లక్ష్మణకవి. సుభాషితము

## పుత్రధర్మము

…కవి. ఆనందకానన మాహాత్మ్యము

పితృ సంకల్పము సేయఁగ
సుతుల కవశ్యమును వలయు

నన్నయ. భారత. వభా. I-94

తండ్రి కష్టంబును దప్పింపలేని
పుత్రుడుండిన నేమి పోయిన నేమి

శ్రీనాథ. పలనాటి

తల్లిదండ్రులయాజ్ఞ యథాకరింప
కుండుటయచూవె! ధర్మమత్యుత్తమంబు
దైవమనఁగ గురుండును ధర్మమనఁగ
నర్థమనఁ దలిదండ్రులె యాత్మజునకు

శ్రీనాథ. కాశీ. IV- 16

జననీ జనకులఁ గొల్చుటకంటెను
దనయునకత్యధికమైన ధర్మము గలదే?

శ్రీనాథ. కాశీ. IV-17

పనుపకచేయుదు రధికులు
పనిచిన మధ్యములువొందు పఱతురు తండ్రుల్
పని చెప్పి కోరి పనిచిన
ననిశము మాఱాడు పుత్రులధములు దండ్రీ

పోతన. భాగ. IX-55

చేయవలెఁ దల్లిదండ్రులు చెప్పుపనిని
మాఱువల్కక పుత్రుఁడు మనిన దనుక

కం. వీరే. పం. నీతి.

బ్రతికియున్న పుమాటను బాటిచేసి
పాడుకొన్న సంసార బండియా కృతు లొనర్చి
ఆదిగొని మతు... మర్యాద మీఱఁగఁజేయు
వాఁడె పుత్రుండు సఫలంబు వాని బ్రతుకు

తన తనువెవ్వరి వలనన్
జనియించెనో యట్టి జనని జనకుండును జె
ప్పినపనిచేసి తనూజుఁడు
తన జననమునకుఁ గృతార్థతన్ గలిగించున్

తిరుపతి వేంకటకవులు, పాండవజననము

## పుత్త్రప్రణయము

........ముక్తాహార కర్పూర సాం
ద్ర పరాగ ప్రసరంబుఁ జందనముఁ జంద్ర జ్యోత్స్నయుం
బుత్త్రగా
త్ర పరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడున్ శీతమే

నన్నయ. భారత. ఆది. IV-91

పుత్త్రోత్సాహము తండ్రికిఁ
బుత్త్రుఁడు జన్మించు నపుడె పుట్టదు జనులా
పుత్త్రుని గనుఁగొని పొగడఁగఁ
బుత్త్రోత్సాహంబునాడు పొందును సుమతీ

సుమతీశతకము

బాలుం డాడెడు ముద్దుపల్కు లుపమింపం దండ్రికిం బ్రౌఢభా
షాలాపంబులకంటె నింపయిన యట్లు

యథా. అన్నమయ్య.

పుత్త్రమోహంబ ప్రత్యుపకారార్థంబు గాదు లక్ష్మణకవి. సుభాషితము

...ఘకవి. అవందకావన మాహాత్మ్యము
పుత్త్ర మోహమువంటి మోహము

అనుదిన సంతోషణములు
జనితశ్రమ తాప దుఃఖ సంశోషణముల్
తనయుల సంభాషణములు
జనకులకుం గర్ణయుగళ సద్భూషణముల్

పోతన. భాగ. VII-140

సుతులనను ముద్దుఁ బలుకులు
శ్రుతులకుఁ జవియైన యట్లు చూడఁగఁ జవిగా
వితరులు వేడుక నెంతే
చతురతమైఁ బలుకనంత చవి భువిఁగలదే

రఘునాథరాయలు, రామాయణము, II-55

తన సుతులం బరాత్మజులఁ దద్దయుఁ బ్రేమఁ దగన్సమంబుగా
గనుఁగొను పుణ్యమూర్తులకుఁ గల్గదు నందనశోకము

ధరణిదేవుల రామయమంత్రి. దశా. చరిత్ర. V-56

తనయుఁ డాడుమాట తల్లి
దండ్రుల కది యాటగాదా!

త్యాగరాజు

సుఖములలో నుత్తమమగు
సుఖమెన్నఁగఁ గన్నకొడుకు శుభ దేహమును
స్సుఖుఁడై కౌఁగిటఁ జేర్చుట

దా. శ్రీ. దేవిభాగ. I-81

పురుషధర్మము [illegible]య సంభూత తాప
అతివ [illegible]తుల యాశ్లేషణములు
[illegible]మోదాద సుఖకరా విరతకర్ణ
భూషణములౌర తనయుల భాషణములు

ధర్మవరం. చిత్రనళీయము. V-101

పుత్రుని తోడిదె లోకము

సెట్టి లక్ష్మీనరసింహం. ప్ర. కా. వి. II-78



ఎంత మనసు చింతయేనియు నశియించు
సుతునినుడులు చెవిని చొచ్చెనేని

సెట్టి లక్ష్మీనరసింహం. చిత్రహరిశ్చంద్రీయము. IV-110

కన్నబిడ్డల యాశ్లేష ఘనసుఖంబు
కంటె సుఖమింక నరునకుఁ గలదె ధాత్రి

## పుత్రిక

పుత్త్రి చేసిన విధులు తత్పురుషుఁగాని
తల్లిదండ్రులఁ బొందవు ధర్మయుక్తి

నన్నయ. భారత. ఆది. VI-261

జనకుని స్వామిత్వము
తనయోద్దేశమునఁ గలిమి తథ్యము

నన్నయ. భారత. ఆది. IV-242

## పుత్రుఁడు

కొడుకులు సమర్థులయినం
దల్లితండ్రుల యిడుములు వాయుట
యెందునుం గలయది

ఘట్టకవి. అవందకానన మాహాత్మ్యము

నన్న

కులదీపకుఁడు పుట్ట కులము వర్థిల్లు
కులనాశకుఁడు పుట్టఁ గులమెల్లఁ ద్రుంగు

నా. సోమన. బసవ.

తనయుండు తల్లి దండ్రుల
కనుపమ సద్గుణ సమృద్ధి నానంద కరుం

డును రిపులకు హృదయజ్వర
మును నైచను టొప్పు జన్మమునకు ఫలముగాన్

మారన. మార్కం. III–72

పున్నామ నరకంబు పొంద కుండంగ
తల్లి దండ్రులఁ గావ తనయుఁడె కర్త

శ్రీనా. పల. వీ. చ.

తన ధర్మ పత్ని వలనను
మును కొని తాఁ బుత్రరూపమున నుదయించున్

పోతన. భాగ. III-455

మగని కాలమందు మగువ కష్టించిన
సుతుల కాలమందు సుఖము బొందు
కలిమి లేమి రెండు గల వెంత వారికి
బలిమి పుత్ర బలిమి బలిమి వేమ

నందనుడు పెఱిగి పెద్దల
కందఱికి విధేయుడైన నానందమగుం
బొందిక చెడి సత్పురుషుల
... కలుగు నిక్కము

## పురుషధర్మము

వేమన

అతివ రోఁడు చేసిన పుణ్యాం
బున నరక నివాసులైనఁ బొందుదురు మహో
ఘను లై పితృ వర్గంబులు
జననుత సురలోక దివ్య సౌధచయంబుల్

హరిభట్టు. మత్స్య. IV-124

జనకుఁడు సుఖియై యుండఁగ
జనయిత్రియు జీవనంబు సకలము నరయన్
మనుచున్న పుత్రకుని ధ్యా
జననము సఫలంబు గాదె

తెనాలి అన్నయ. సుదక్షిణా. II-142

ఉత్తమాంగము లేని యొడలును బోలె
సత్తనయుఁడు లేని సంసార మేల!
తనయులు గల్గుట తల్లిదండ్రులకు
మును దారొనర్చిన పుణ్య ఫలంబు
......పుత్తులతిబలశౌర్య
సుగుణ గాంభీర్య విస్ఫురణ రంజిల్ల
పితృమాతృభక్తిచేఁ బెంపొంది లేని
సుతులని కొని యాడఁ జొప్పడు...

తిమ్మయ. ద్వి. భారత. ఆది

తనయులు గల్గుట తల్లి దండ్రులకుఁ
బరలోక హిత మొనర్పఁగఁ గదా...

వరద. రామా. బాల

సతియుఁ బతియుఁ బ్రేమ సముముఁగా ... బృందావన మాహాత్మ్యము
తఱిఁ బరస్పరఁబు దలఁచి రేని
తల్లి యాకృతియును దండ్రి గుణంబును
బూనుఁ దత్సుతుండు పువ్వుఁ బోడి

భవానీశకవి. ధర్మ. III-185

కొడుకులు గల్గుదాఁక నొక కొన్ని దినంబులు చింత నందనుల్
వొడమిన నాయువున్ బలము బుద్ధియు విద్యయుఁ జాలఁగల్గగాఁ

నుడుగని చింతఁ గల్గి తను నోలి భజింపని చింత తండ్రికె
ప్పుడుగడు చింత సేయుదురు పుత్రులు శత్రులు గాక మిత్రులే
కమవర్తి అప్పయా. కవిరాజ. I-137

క్షమ సుతుకన్న నెక్కుడగు సాధనమెద్ది సుఖోపలబ్ధికిన్
దా. శ్రీ. దేవీభాగ. I-84

భవ మహాంధకార భానుండు సూనుండు
ధర్మవరం. చిత్రనళీయము

## పునర్జన్మ

చచ్చిన జీవుఁడు గ్రమ్మఱ వచ్చున్ బుట్టువున కనుటుపాయము
గాదు
ఎఱ్ఱన. నృ. పు. IV-62

సురనర వృక్షాది సుభగ దేహములు
పురుషున కెవు డెన్ని పో వెన్ని రావు
తిమ్మయ. ద్వి. భారత. భీష్మ.

పోయిన ప్రొద్దు లేమరల పొల్చెడునట్టులు కాలధర్మమై
పోయినవారె వెండియును బుట్టెదరు
శ్రీపాద. కనకగిరి. 144

## పురుషధర్మము

అతివ యపాయముం బొరయు నప్పుడు గావక తక్కనేని నా
పతి పతియే తలంప మగ పాడియె లోకము పాడియే
తిక్కన. భారత. విరాట. III-42

మాన్యులఁ జంపుట మగ పాడి గాదు
తిక్కన. భారత. భీష్మ. I-19!

అబల లస్వతంత్రలగుటచే నంగనల్
వారిఁ బ్రోచుచుండ వలయుఁ బురుషు
లెచట స్త్రీ జనంబు లెలమి మైవర్తింతు
రచట నిల్చు లక్ష్మి యనవరతము

తిరుపతి వేంకట. పాండవజననము

పురుష ప్రకృతి

పురుషహీన యయిన యువతిఁ
జూచి యెల్లవారుఁ జులుక నపేక్షింతురు

నన్నయ. భారత. ఆది. IV-257

భోగైక పరాయణుల్ పురుషులు

తిక్కన. భారత. విరాట. III-33

వనిత తనంతఁ దావలచి వచ్చినఁ జుల్కన గాదె యేరికిన్

పెద్దన. మను. II-66

పరికింపరు తమ జాడలు
తరుణుల తగులములు నమ్మఁదగ దంద్రు మదిన్
శఠ దంబుదచలచిత్తులు
పురుషులువో వారినమ్మఁ బోలునె

నందితిమ్మన. పారిజాతాపహరణము

మన సొక్కడనుండ మఱి వేఱె చక్కఁ
దనము లాసింప రెంతటి మగవారు

వరద. రామా. అరణ్య

మును మును పెందులేని ప్రియముల్ సవరించి యొకింతలోఁగినన్
వెనుకదిసించి చూడరవశిన్ మగవారల నమ్మరాదు

రఘునాథరాయలు. శృంగారసావిత్రి

కలలోనైనను బాయక
కల కాలము నున్న విభుడె కసుగాయకునై
పలచన చేసె నటన్నం
జెలి యీ మగవారివలపు చెడ్డది సుమ్మీ

ముద్దు పళని. రాధికా. III-36

నరనాథ వెన్న కన్నను మెత్తనైన
పురుషుల డెంద మప్పుడె జాలు గొనదె

వాణాలు. సారంగ

## పురుష వృత్తము

విమల యశోనిధీ పురుషవృత్తి మెఱుంగుచునుండుఁ జూవె వే
దములును బంచభూతములు ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్
యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా
ర్థములివి యుండఁగా నరుఁడు దక్కొఁనేర్చునె తన్ను మ్రుచ్చిలన్

నన్నయ భారత. ఆది. IV-80

......మగ తన మెల్లన్
మగువల కౌఁగిటఁ జూపెడు
మగవాఁడగు కంటె మగఁడు మగువగుటొప్పున్

పోతన. భాగ. IX-406

ప్రాయ మనుభవింపగలేని
పురుషుడేటి పురుషుఁడు

క్షేత్రయ

న్యాయ మెప్పుడును విడువక నడచువాఁడు
పిరికితనమును మదినుండి పెరకువాఁడు
పుట్టు వారిలో నిక్కంపుఁ బూరుషుండు
ఇడుమ గలుగంగ ధైర్యంబు నిడనివాఁడు
కడఁగు పనిముగింపుఁ బట్టుగలుగు వాఁడు
దైన్యమెప్పుడు నొందక తనరువాఁడు
పుట్టువారిలో. నిక్కంపుఁ బూరుషుండు

విక్ర. దే.

## పురుషార్థములు

ధర్మకామంబులు దఱుఁగంగ
నర్థార్థి యగు వాఁడు పతితుఁడౌ

నన్నయ. భారత. అరణ్య. I-245

అర్థ ధర్మములు మహాబ్ధి మేఘములట్టు
లుభయమును బరస్పరోదయమ్ములు

నన్నయ. భారత. అరణ్య. I-246

ఓపి ధర్మార్థ కామంబులొకరి నొకటి
నాశమొందింప కుండంగ నడపవలయు

తిక్కన. భారత. శల్య. II-302

ధర్మంబునెడ నర్థ కామములను
గోరు పురుషుండు నిందకుఁ గుదురు గాఁదె

తిక్కన. భారత. శల్య. II-303

తన చేసిన పురుషార్థము
తన సొమ్ముగ నెఱిఁగి నరుఁడు దానపరుండై

యనుభవి యై మన వలదా
దినములచే మోస పోక తిస్థిర బుద్ధిన్

జక్కన. విక్రమార్క. II-186

పరులకు నైన యాపద మాన్పఁజాలు
పురుషార్థమే తపమున కంటె ఘనము

తిమ్మయ. ద్వి. భారత. అరణ్య.

సకల జనద్వేష జనక మర్థంబు
ప్రకటమౌ నింద కాస్పదము కామంబు
అటుగాన నేయే ప్రయత్నంబులందుఁ
బటు మతి ధర్మతత్పరుఁడు గావలయు

వరద. రామా. అయో.

......ధర్మార్థ కామంబులందు
నన్నిట సమవర్తి యై యుండ కున్న
సన్నుతింతురె వాని సర్వజనంబు

సోమన. ద్వి. భారత. శల్య.

## పురుషోత్తముఁడు

......హరి గాఁడు విష్ణు
తనయుఁడు గాఁడు, చంద్రధరుండు గాఁడు
పలికి బొంకక యెల్లప్రాణుల మీఁద
తలఁ పొక్కటై శాంతి దాంతియుఁ గలిగి
కలిగి లేదనక, భోగములఁ దన్మయతఁ
బొలయక, సుఖదుఃఖములు సమంబుగను
బుద్ధినెంచిన వాఁడె పురుషోత్తముండు

తిమ్మయ. ద్వి. భారత. అరణ్య.

## పూజ్యులు

స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును నిష్టుఁడున్
భూతలేశుఁడు సంయుజుండును బూజనీయులు

నన్నయ. భారత. సభా. II-4

ఉత్తమజ్ఞాన వృద్ధు నా నుండె నేని
బాలుఁడ య్యును బూజ్యుండు బ్రాహ్మణుండు
క్షత్రియుఁడు పూజ్యుఁడమిత విక్రమ సమృద్ధి
నుర్వీపతులలో నధికుఁడై యుండె నేని

నన్నయ. భారత. సభా. II-25

ఋత్విగాదుల నార్వుర నెఱిఁగి పూజసేయునది

మారన. మార్కం. III-243

మాట విన్న నరుడు మాన్యుడౌను

వేమన

జ్ఞాని యైనవాని మానక పూజించు
మనుజుడెపుడు బరముననుముదమ్ము
సుఖము నందు చుండు

వేమన

మగుడ నాడుదురయ్య మాన్యులే మనిన

తిమ్మయ. ద్వి. భారత. విరాట.

......తల్లిదండ్రులు గురుఁడు
జగతిపై నొకరూపె జనుల కందఱికి

వరద. రామా. అయోధ్య.

చదివిన సద్గతి నడవడి
మదినెగడిన వాఁడె సర్వమాన్యుఁడు......

యోగిశుద్ధానంద భారతి

మనకు స్వాధీనమై మరి మంచిచేయు
నట్టి వానిని గొల్చుట సార్థకంబు

ఆ. నారాయణదాసు. అంబరీష.

సద్వినియోగ బుద్ధి గలిగిన
మనుజుని భాగ్యంబె లోకమాన్యతగాంచున్

దువ్వూరి నలజారమ్మ. పీఠిక

పరులఁ బూజించువాఁడె పో యొరుల చేత
నతి విశేషముగాఁ బూజలందు వాఁడు

తిరుపతి వేంకట. మృచ్ఛకటికము

పెద్దతికము

బీద వాక్యమ్ములు పెదవుల పైకి
తేరాదు పెద్దల తీరుకు వెలితి

శ్రీనాథ. పల. వీ. చ.

ఒడ్లఁ జెడ నాడినఁ బెద్దతికంబు వచ్చునే

అనంతా. భోజ. III-99

పెద్దలు

పెద్దలకుఁ బెద్దలు లేరె

సన్నెచోడ. కు. సం. X-187

ఒక్కరి మెచ్చి వారికోర్కెదీర్చుట పెద్దల గుణముకాదె

తిక్కన భారత. ఉద్యో. I-109

చులుకని కార్యము సేయం
దలఁచుట పెద్దలకుఁ దగునె

తిక్కన. భారత. ఉద్యోగ I-294

అనుగ్రహము సేయు టర్హమని పెద్దలకున్

తిక్కన. భారత. ద్రోణ. IV-10

పెక్కుమతంబుల పెద్దలు నడచిరి
ఒక్క సమ్మతై యొడఁబడరు
పెక్కు దేవతలు పేరు వాడెదరు
తక్కక ఘనులము తామేయనుచు
పలికెటి చదువులు బహు మార్గంబులు
కలసి యేక వాక్యత గాదు

అన్నమయ్య. అధ్యా. సం

పెద్దలుసురు మన్న కెనుమంటలెగయవా ?

వేమన

పెద్దల దూషించుటది పెద్ద కీడు

వేమన

కర్తవ్యమున వివేకంబు గల్గినఁగాని గడ్డంబు నెరసినఁ గాఁడు పెద్ద

అడిదము సూరకవి. రామలింగేశ

దైవసములుగ పెద్దలఁ దలపవలయు

మట్టు. కుచేలో. III-40

మనుజుని జీవితంపు బరిమాణము నేడులచేత గాక చే
సిన ఘనకార్య సంచయము చేత గణింపగ జెల్లునెప్పుడున్

కందుకూరి. దక్షిణ. IV-458

చెనఁటి తను నెకసక్కెంబుఁ చేయఁదగిన
పెద్దయలుగఁక వానికి బుద్ధి సెప్ప

అ. నారాయణదాసు. మారుగంటి.

పెద్దవారిమాటలె పిన్నలబోధించు

అ. నారాయణదాసు. రుక్మిణీ.

పెద్దల మాటల పెడచెవిఁ బెట్టకు

అ. నారాయణదాసు. జానకి.

పూర్ణతంబట్టి పిన్నగాఁ బోలు పెద్ద

అ. నారాయణదాసు. పారంగధర

పెద్దలు నీకుఁజెప్పిన జాడఁ బొమ్ము
నిన్గూర్మిఁ గనువాఁడు నీకన్నఁబెద్ద

అ. నారాయణదాసు. వేల్పుమాట

## పెద్దలు - పిన్నలు

జ్ఞానము గలఁడేనిన్ బాలుఁడయినఁ గడు వృద్ధుమహిన్

నన్నయ. భారత. వన. III-248

అంకి లెఱిగి మాటలాడ నేర్చినపుడె
పిన్న పెద్ద తనము లెన్న నేల ?
పిన్న చేతి దివ్వె పెద్దగా వెలుగదా ?

వేమన

పెద్దవార లెటులాచరింతురో పిన్నవారలట్లె

దేవకొండ వెంకయ్య. జంగంకథ

పెద్దల ఋణంబుఁ దీర్పకున్నచో బిన్న యెట్టులఁ దరించు

అ. నారాయణదాసు. యథార్థ రామా.

## పౌరుషము

ఎవ్విధినైన నుంబగలి యే పడగించుట పౌరుషంబు

తిక్కన. భారత. సౌప్తి. I-72

అంతరంగంబున నడలుచు నునికి
మగపాడి గాదు......

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. కిష్కిం.

తనయింతి నొకనిచేఁ దాఁ గోలు పోయి
మన నిచ్చసేయుట మగ పాడి గాదు

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. సుందర.

ఉరుతర బలదర్పంబును
బరి పంథి రణంబు సేయఁ బైకొని పిలువన్
బరుదటి తొలఁగుట కంటెను
మరణంబెంతయును మేలు మగవారలకున్

మల్లికార్జునుడు. భా. రా. కిష్కింధ 215

పౌరుషాధికత చే బ్రతుకుట లెస్స
పగ యీఁగలే నట్టి పౌరుష మేమి

శ్రీనాథ. పలనాటి.

మగఁటిమి గలిగిన పురుషులె
మగతనమును విడిచినడువ మగువలు నగరా

మొల్ల. రామా. యుద్ధ. 8

ఎఱిఁగి యుండిన ఫలమేమి? యెఱుఁగకున్న
నష్టమే మగు? మన ప్రయత్నములు సున్న
ప్రతిభ లెండ మావులగు ప్రారబ్ధ కర్మ
గతిని బట్టి తుదకుఁ గార్య కలనజరుగు

పానుగంటి. వనవాస. రాఘ. 2

## ప్రకృతి ధర్మము

ఎంతటి మహాత్మునకు నైన నిలను బ్రకృతి
బద్ధుఁడై యుండ నేదో యాపదగలుగక
పోదు మబ్బు రీతిగ విడిపోక తీఱదయ్య

పానుగంటి. విజయరాఘ.

## ప్రకృతి పురుషులు

తాను బ్రకృతిఁ బ్రకృతి దనయందు నిల్చి ని
ల్చినను దాన వికృతిఁ జెంద కుంకుఁ
బురుషుఁడుదక మత్స్యముల యుదుంబరమశ
కముల సంగమంబు కరణి గలుగ

తిక్కన. భారత. VI-107

ప్రకృతి తోడుతఁ బరమాత్మ పరిఢవిల్లు

పానుగంటి. వన. రాఘ

## ప్రజ

ఊరు వారు వీధి వారు ఒక జాతి వారు కారు

త్యాగరాజు

సంచలించెడి మేఘంపు ఛాయ యనగ
పారు చుండెడి సెలయేరి వారి విధము
మండు వేసవి జలతృష్ణ మహిమ నొప్పి
ప్రతిని మేషము మారును బ్రజల మనసు

మరవరం. ఉచ్చుల

## ప్రజాపాలనము

లేదు పెట్ట వేయనుచును లేబరంపు బలుకు దన ప్రజలో విన బడియెనేని
నింత కంటె మిక్కిలి ధరణీశ్వరులకు నెద్దియవమానము

ఎఱ్ఱన. హ. వం. II-175

ప్రజానురాగంబున ధనంబును ధనంబున
ధర్మంబును ధర్మంబునఁ గీర్తియుం జేరుగావున
భూవల్లభునకుఁ బ్రజాపాలనంబవశ్య కర్తవ్యంబు

పిల్ల. పిన. జైమి. III-34

## ప్రజ్ఞ

హీన ప్రజ్ఞుఁడకార్యము
లైనవి సేసి తుదివగచు నతుల ప్రజ్ఞా
సాను మదారూఢుఁడు వగ
నూనఁడు దురితమను వఱితి కోడక యునికిన్

తిక్కన. భారత. శాంతి III-352

ప్రజ్ఞయ ప్రతిష్ఠ లాభము
ప్రజ్ఞయ నాకంబనంగఁ బ్రజ్ఞయ చువ్వే
ప్రజ్ఞయ కైవల్యంబును
బ్రజ్ఞా సాధ్యములు గాని పనులుంగలవే

తిక్కన. భారత. శాంతి. IV-68

ఘన తర ప్రజ్ఞయను తెప్ప గలుఁగు వాఁడు
సంసరణనదిఁ గడవంగ జాలు

తిక్కన. భారత. శాంతి V-86

కందుకము వోలె సుజనుఁడు
గ్రిందంబడి మగుడ మీఁది కిన్నగయుఁ జుమీ
మందుఁడు మృత్పిండము వలెఁ
గ్రిందం బడి యడఁగి యుండుఁ గృపణత్వమునన్

ఏ. ఎ. కవి. సుభాషితములు

కార్య కారణ సంబంధ గరిమ కాయ
నై జగతి చిత్త వేదనా నైజములును
వస్తు సముదయాన్యోన్య సంబంధ గరిమ
బాగుగా గ్రహియించు లే ప్రజ్ఞసుండి

పానుగంటి. బుద్ధ. III

## ప్రతిజ్ఞ

పలుక వచ్చుఁగాక పలికిన యట్టుల చేయ వచ్చు నెట్లు

తిక్కన. భారత. విరాట. V-90

పరికించి భూపతి పట్టిన ప్రతిన
అరయ శిలాక్షరమై యుండ వలదె

నాదెండ్ల గోపమంత్రి. కృష్ణార్జున సంవాదము

పంతంబు లాడినఁ బగ సిల్ప నగునె

తిమ్మయ. ద్విప. భారత. అరణ్య

తొలుతఁ గార్యము చెప్పి తుదముట్ట దానిఁ
దలకొను టెల్లఁ బెద్దల రీతి గాదె

తిమ్మయ. ద్వి. భారత. భీష్మ.

పలుకు ప్రతిజ్ఞ యేర్పడి యున్న చోట
వెలయంగ మఱచుట వీరధర్మంబె
బలియురతో బంటు పంతంబు గాదె

సోమన. ద్వి. భారత. శల్య.

## ప్రతిజ్ఞా పాలన

ధరణిని గృత ప్రతిజ్ఞా
పరిపాలనదక్షుఁ డెందుఁబర మోత్కృష్టుఁ
డరయంగ నిదియ ధర్మువు
పురుషునకుం బరిగణింప భూరి ప్రౌఢిన్

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 1824

పురుషునకుఁ బ్రతిజ్ఞాపరిపాలనంబ పరమ ధర్మంబు

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 2351

చేసెదనని పల్కి చేయలే నసిన
వాసియుఁ జెడిపోవు వన్నెయు దఱఁగు

సోమన. ద్వి. భారత. అరణ్య.

## ప్రపంచము

అగణిత దుఃఖాత్మక మిజ్జగము

తిక్కన. భారత. ద్రోణ. II-178

హరి నిర్మితములే అఖిల ప్రపంచము
ముంచిన జగమిది మోహినీ గజము
ఎఱిఁగి కనుఁ గొంటెను ఈజగమెల్ల నిజము
ఎఱుఁగక మఱచితె ఇంతా మిథ్యా

తా. అన్నమయ్య. అధ్యా. సం.

......నిఖిల జగము
ప్రకృతి వశమునఁ గలిగిన భాతిఁ దోచు

పు. తిమ్మన. సమీర. IV-110

అంతము లేని యీ భువన మంత పురాతన పాంథశాల వి
శ్రాంతి గృహంబు నందు నిరు సంజలు రంగుల వాకిళుల్ ధరా
క్రాంతులు పాదుషాలు బహారాంజముషీదులు వేన వేలుగా
గొంత సుఖించి పోయి రెటకో పెలవారికిఁ జోటొసంగుచున్

దువ్వూరి. పానశాల

## ప్రపత్తి

భూమెల్ల మేసినా నాఁబోతుకు బందె లేదు
నేమపుఁ బ్రపన్నునికి నింద లేదు
బహుమహిమల వారు ప్రపన్నులు
పండినమనసు వారు ప్రపన్నులు
పాపమెంత పుణ్యమెంత ప్రపన్నాధికారులకు?
దాఁపనవి నిమిషమాత్రములే కాక

తా. అన్నమయ్య. అధ్యా. సం.

ఎండైనామంచిదేయెంత నీడైనా మంచిదే
పండిన జ్ఞాన భక్తుల ప్రపన్నులకు
రయమునఁ దామసము రాజసము గలిగితే
భయపడి తొలఁగుటే ప్రపన్నగుణము

తా. అన్నమయ్య అధ్యా. సం.

కర్మశూన్యత్వము ప్రపత్తిఁగలుగ వచ్చు
గర్మశూన్యతను బ్రపత్తి కలుగఁబోదు
కలిత ధీశక్తి భాగ్యంబు గలుగ వచ్చు
గాని సంపదచే బుద్ధి గలుగఁ గలదె?

పానుగంటి విప్ర.

ప్రబోధము:

సారిది నిర్మోహమను జోడు దొడగినఁగాని
వెఱపుడిగి మమతచే వెళ్లఁబడ రాదు
ఇరవైన విజ్ఞాన పింట నుండినఁగాని
అరసి జగమెల్లఁదానై యేల రాదు
కలిమే చిత్తవికార హేతువది
అలర లేమి దైన్య హేతువు
పలు లంపటములు బంధ హేతువులు
మదవికారమిదె మహిత యౌవనము
తుద వార్ధకమే దురంతము
ఇదె యర్థార్జన యాతాయాతన

తా. అన్నమయ్య. అధ్యా. సం.

ధర్మంబుగలచోటఁ దలకొను జయమెల్ల దయగలచో సుకృ
తంబు నిలుచు
సత్యంబు గలచోట సమకూరు శుభములు నేమంబు గలచోట
నిలుచు సిరులు
పాడి గల్గినచోటఁ బంతంబు లీడేఱు దాక్షిణ్యమున్నచోఁ
దగులు మైత్రి
భక్తి చేసిన చోట ఫలమిచ్చు దైవంబు మనసు నిల్పిన చోట
మలయు సుఖము
లితర మగుచోట వెదకిన నేల యుండు
సారిది నీదైన కృప గలచోట కాక
కలిత లక్ష్మీశ సర్వజగన్నివేశ
విమల రవికోటి సంకాశ వేంకటేశ

తాళ్లపాక పెద తిరుమలయ్య. వేంకటేశ శతకము

గుణిలేని సంసార ఘోరజలనిధి నుండి
యెఱుక దెలుపంగఁబో దితరులకు
వరదఁబోయెడు వాఁడు వరద నుండెడి వాని
వెలికు వెలివకు మన్న విధమునా

ఏగంటివారి వచనము

కడు నేర్పు మై వానకాలంబు కొఱకుఁ
గడమ యెన్మిది నెల ల్గడియింప వలయు
నగపకు రాత్రికై యాత్మఁ జింతించి
పగలె వస్తువుల సంపాదింప వలయు
మును వచ్చు వార్ధకమునకునై నరుఁడు
తన యౌవనమున యత్నము సేయవలయు
భాజనీయంబైన పరకారణంబు
నీజననమునందె యెఱుఁగంగ వలయు

తాళ్లపాక. తిరువెం. పరమయోగి

## ప్రభుచిత్తము

......నమ్మియుండఁగా
వలవదుబుద్ధి మంతులు నవప్రియులైన ధరాధి నాథులన్

నన్నయ. భారత. ఆది. IV-70

మన్నన యెడనైన రాజుల మనంబులు ద్రిప్పఁగ బల్మిగల్గునే

తిక్కన. వి. రా. VI-27

పుత్త్రులు పౌత్రులు భ్రాతలు
మిత్రులనరు రాజులాజ్ఞ మిగిలిన చోటన్

తిక్కన. భారత. విరాట. I-124

ఉర్వీవిభుచిత్త మొక్కలాగుండ దెప్పుడు

పానుగంటి. కల్యా.

## ప్రభుత్వము

నానావిధ దేహదుఃఖము మనంబున నోర్చినఁగాక రాజ్యల
క్ష్మీనిభవంబు సొప్పడునె కేవలమే నృపతిత్వమారయన్

తిక్కన. ని. రా. X-50

భండారమును మంత్రిబలము చారులును
మండలాధీశ్వరు మనసు వెంబడిని
నడవకుండిన వారినరపతిత్వంబు
లడవిఁ గాసిన వెన్నెలై పోల్ల వోవు

వరద. రామా. అరణ్య.

రాచరికమనఁగ జందెపు
పోచామతి రిపుల గెలిచి భూనుత కీర్తిన్
యాచకుల కియ్యఁగలుగుటె
రాచరికము

వంపా. వేటూరి. చాటు.

ఎల్లరకు కావలసినంత స్వేచ్ఛయుండ
నవనిధవునకుఁ గాసంత యైన లేదు
అందఱును జేయు మంచు కొండంత తప్పు
కరఁగి యావిరి యై పోవు క్షణములోన
భూపుఁడు ప్రమాదమున జేయు ముత్తె మంత
నెఱసు శత శతాబ్దములైన నిల్చు కాలి

పానుగంటి. కల్యా.

## ప్రభుధర్మము

గుఱుకొని కార్యాకార్యము
లెఱుఁగక దుశ్చరితుఁడై యహితుఁడగు నేనిన్
మఱువక గురునైనను జను
లెఱుఁగఁగ శాసించునది మహీశుడు బుద్ధిన్

నన్నయ. భారత. ఆది. VI-103

జన పాలుఁడు మృదు కర్మం
బున నైనను క్రూరకర్మమున నైనను నే
ర్పున నుద్ధరించునది ద
న్నన పాయతఁ బొంది చేయునది ధర్మంబుల్

నన్నయ. భారత. ఆది. VI-105

అలయక పరాత్మ కృత్యంబులఁ బతి యెఱుఁగునది

నన్నయ. భారత. ఆది VI-108

వీరునమ్మంగఁదగుదురు వీరునమ్మఁ
దగరు నాకు నావలవదు తత్త్వ బుద్ధి
నెవ్వరిని విశ్వసింపక యెల్ల ప్రొద్దు
నాత్మరక్షాపరుండగునది విభుండు

నన్నయ. భారత. ఆది. VI-110

పరుల వలన బాధ కొరయ కూడఁగ సాధు
జనుల ధనముగాచు జనవిభుండు

నన్నయ. భారత. ఆది. VII-104

క్షత్త్రనీతి క్రమంబులు గావు సూవె
నిక్రృతియును జూదమును

నన్నయ. భారత. సభా. II-166

ప్రజా పరిపాలనంబు కంటెను
ధరణీశ విశేష మొండుధర్మము గలదే

నన్నయ. భారత. అరణ్య. I-255

సంగ్రామంబు రా[illegible] ధర్మంబు

తిక్కన. భారత. ఉద్యోగ. I-335

తముఁదా రెఱుఁగు టనేగప
డమి దాలిమి విడవు గలుఁగు టయు లేని ప్రభు
త్వము గలదె

తిక్కన. భారత. ఉద్యో. II-27

క్రూరత కోర్చి యించుకయు రోయక పై కొని యెల్ల భంగులన్
వైరులఁ జంపి భూప్రజకు వర్ధనముం గలిగించి పాడిమైఁ
గోరరి గొంచుసద్వ్యయము గోరియొనర్చుట రాజధర్మ వి
స్తారముగాబలారికి వచస్పతి సెప్పుటయప్రసిద్ధమే

తిక్కన. బారత. భీష్మ. III-309

రాజ కోటికిఁ బ్రతి గ్రహము సనునె

తిక్కన. బారత. శల్య. II-74

ప్రతిన నెఱపుట నృపులకుఁ బరమధర్మము

తిక్కన. భారత. శల్య. II-300

పఱచినవారికిఁ బగమాఱుపఱుపంగ
నుత్సహించుట కడునొప్పుగాదె

తిక్కన. భారత. సౌప్తి. I-61

దండార్హులైనవారల
దండింపకయున్న జువ్వొ ధాత్రీవిభు నా

ఖండల సన్నిభుఁడైనఁ బ్ర
చండపుఁ గిల్బిషముఁ బొందు

తిక్కన. భారత. శాంతి. I-96

న్యాయశాస్త్రవేదియై యింగితాకార
చేష్టలెఱిఁగి జనుల శిష్టదుష్ట
తా విశేషమరసి దండనీతియొనర్చు
పతికి నెల్ల మేలుఁ బడయవచ్చు

తిక్కన. భారత. శాంతి. I-175

తనయులనై నను నమ్మిన
జనపతి సిరిగోలుపోవుఁ జతురతమైన
మ్మినవాఁడ పోలెనమ్మక
యునికి సకల జనులయెడల నురవై యుండున్

తిక్కన. భారత. శాంతి. II-381

చాల ప్రజఁ బ్రోవక యె మరి
గోలాసంబాడి తప్పుకొనుచుండెడి భూ
పాలకుఁడు కుప్పఁజిచ్చిడి
ప్రేలల వెదకికొని తినెడు బేలతలంపన్

శివదేవయ్య. పురుషార్థసారము

తూలెడు తనప్రాణమ్ములఁ
దాలిమితోఁ గాచెనేని దాసుని దాస్యం
బేలిన పతివిడువక తనిఁ
బోలన్ రక్షింపవలయుఁ బుత్తుని సరిగన్

కేతన. విజ్ఞా. ఆచా. 32

మునుపు వరించిన భ్రష్టుఁ
దన తనయునియట్ల యున్నతని దాసునిఁ గా
జనపతి బలిమిం గైకొని
పనిగొనఁదగు వాని ప్రాణ పర్యంతంబున్

పెక్కండ్రుగూడి సమయం
బొక్కటి కల్పించి నడుపుచుండుదు రేనిన్
నిక్కముగా నాసమయము
దక్కొని చెల్లించుటయును ధర్మముపతికిన్

ఒక్కనిఁ బెక్కండ్రడఁచినఁ దక్కక
వేర్వేఱ రెట్టి దండువుగొని తా
నక్కజముగ దండించుట నిక్కపు
ధర్మంబు మేదినీనాథునకున్

కేతన. విజ్ఞా. ప్రాయ. 33, 38, 54

పట్టభద్రుండైన పార్థివేంద్రునకుఁ గ
ర్తవ్యంబమును ప్రజారంజనంబు;
సప్తవ్యసనములఁ జనదు సక్తుండుగా;
నేమరవలదు తన్నెపుడు; రిపుల
వలన మంత్రము వెలిఁజిలుక నిచ్చుట చెట్ట
తనవారు దానును దానఁ జెడుదు;
రహితులు హితులునునగుట యెఱుంగఁగ
వలయు; మంత్రుల బుద్ధిబలము మెఱసి

చరులఁబనిచి వైరిచరుల రోయించుట,
నెమ్మనమున నెఱిఁగి నమ్మకునికి

కార్యయోగమునకుఁగా శత్రువైనను
నమ్మినట్లయునికినయ విధంబు

ధైర్య ధురంధరుండైన ధరణీశ్వరుండు
కామాది షడ్దోషంబులఁ బరిహరింపవలయు

నరనాయకుండు మధుకర
పరభృతకలహంస బర్హిపన్నగ బకసూ
కరచరణాయుధ భాసుర
చరితమ్ములు గఱవవలయుఁ

ఉనుగకెప్పుడు నొనరింపు చుండవలయు
నృపతి కీటకక్రియఁ బ్రతినృపతియందుఁ
దతియెటెంగి పిపీలికోత్కరము చేష్టఁ
జూపునది నీతి కోవిదుల్ చోద్యపడఁగ

వర్ణాశ్రమ ధర్మంబులు
పూర్ణములై యుండునే నృపుని రాష్ట్రమునన్
స్వర్ణది నిజసంగమ సౌ
ఖ్యార్ణవమునఁ దేలగాంచునా నృపుఁడనఘా!

మహిత వర్ష దాన మహిమ నాలుగు నెల
లిలకుఁ దను పౌనర్భు నింద్రు కరణి
నెసఁగనకుగువారి కొసఁగి మన్ననఁ బ్రజ
ముదముఁ బొందఁజేయునది విభుండు

విమతులఁ బ్రియులం గాల
క్రమమునఁ దెగఁజూచు యముని కరణిందాదో

షములరసి ప్రియాప్రియులను
సముఁడై దండింప వలయు జనపతి...

తమ తమ వర్ణ ధర్మములు తప్పికుమార్గమునన్జరించు దు
ష్టమనుజ వర్గముం దగిన శాంతి నొనర్చుచు నైజధర్మమా
ర్గమునఁ జరింపఁజేయు మహికాంతుఁడు వారల పుణ్యసంపదన్
సమధికలీలనొంది దివిసౌఖ్యముఁ బొందఁగఁగాంచు ..

నరుల నిజకర్మములఁ ద
త్పరులంగావించు ధరణిపాలుఁడు తాన
న్నరుల సుకృతములలోన
న్బరువడిఁ గొనుచుండు షష్ఠభాగము

తమ తమ ధర్మములఁదప్పి దుర్మార్గులై
దురితంబు లొనరించు నరుల ధారు
ణీశుండు దండించునెడ నుపేక్షించినఁ
బొలియునిష్టాపూర్త పుణ్యఫలము
లతనికిఁ గావున నతుల ప్రయత్నప
రుండయి సర్వవర్ణులను రాజు
విహిత ధర్మం బొనర్చుచు విమలధర్మ
కర్మపరులుగ సతతంబుఁ గావవలయు

తగవేది వేఁడికొను నే నృపసూతి ?

మహివల్లభునకు దేహ
గ్రహణము భోగముల కొఱకుఁగాదు ధరిత్రీ
వహన నిజధర్మపాలన
బహుదుఃఖ నిరంతరానుభవమునకు...

ఇహలోకమున మహీపతి
బహుదుఃఖములనుభవించి పరలోకమునన్
బహుకాలమప్సరోవర
మహిళాసంభోగసౌఖ్య మహనీయుఁ డగున్

తన బాంధవుండు మిత్రుఁడు
జనకుఁడు గురుఁడనక కడఁగి చంపవలయు భూ
జన పరిరక్షావిఘ్నం
బొనరించిన వానినిట్టిబ యుర్వీశునకున్

మారన. మార్కం.

సత్యంబు ధర్మంబు శమమును దమము
నిత్య భూతియు దయయు నీతి విక్రమముఁ
బ్రియ వాక్యమును దేవ పితృవిప్రపూజ
రయ మొప్ప స్వర్గమార్గములంద్రు బుధులు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. అయో.

...... ఉత్తమ జరాధర్మైక పరులు
శరచాపములుపూని చరియింతు రెల్ల
శరణాగతులఁ గావఁ జర్చించి కాదె

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. అర.

పూనియే పురుషుఁ డెప్పుడు నామభేద
దాన దండము లుచితము దప్పఁ జేయు
నెఱయ వానికిఁగల నీతి శాస్త్రములు
కొఱమాలియుండు నిక్కువ మివ్విధంబు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

పతి దేశకాల విభాగంబు లెఱింగి
చతురజన ద్రవ్యసంపదగల్గి
కార్యంబునకు మఱి కార్యమూహించి
కార్యవిఘ్న ప్రతీకారంబు సేసి
ఫలసిద్ధిగైకొని బహురాజ్యభోగ
ముల నిత్యుఁడై యుర్వి మోదింపవలయు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

శిష్టహితంబు దుష్టజన శిక్షయుఁ జేయని రాజురాజె ?

భాస్కరుఁడు. రామా. అరణ్య. I-587

...... భూమిపతులు దుర్జనతా భం
జనముననగునది దోష
మ్మనక ప్రజారక్షచేఁత యది ధర్మమగున్

మల్లికా. భా. రామా. బాల. 255

దుష్టజన నిగ్రహంబును శిష్టవ్రతపాలనంబుఁ జేయుచు ధర్మా
విష్టుఁడగురాజు చెడఁడు నికృష్టుండగు రాజధర్మకృతిఁ జెడి
పోవున్

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 30[illegible]

పిఱికితనము నేమఱుటయు నోఱువతనము
మెత్తఁ బాటునఁ గార్యంబునత్తెఱంగు
నేరమియు విషయంబులఁ గూరుటయును
గలుగుపతికి నుండదు సిరిదొలఁగిపోవు

ఎఱ్ఱన. భార. అరణ్య. VI-34

జనపతులకుఁ బాపాత్ముల
ధనమెమ్మెయినైనఁ గొనుట ధర్మంబు

జక్కన. విక్రమార్క. II-10

నిర్మలమతిఁ బూని నీతిమార్గమున
ధర్మంబు పెంపొంద ధరనేలు రాజు
తప్పువిచారించి దానికిఁ దగిన
చొప్పున దండించి శుభమునుఁ బొందు
...పతికతివ్యసనంబు తగదు

గౌరన. నవనాథ.

తప్పులు గలిగిన దండింపగాక
తప్పునాడుట రాజధర్మమా

గౌరన. హరిశ్చంద్ర.

పరుగెలువ వలయునొండెను
సరిపోరఁగ వలయునొండెఁ జావలెనొండెన్
సరిగెలుపు ప్రాప్తియు దొరకమి
సరసంబుగమున్న తొలఁగి చనవలెనొండెన్

పోతన. భాగ. VIII-457

రాచబిడ్డఁడైన అవ్వమేలె?

పోతన. భాగ. X-322

చతురోపాయ సమర్థత
వితరణ గాంభీర్య ధైర్య విభవస్ఫురణన్
జతగూడి యుండినప్పుడె
అతులితుఁడౌనతడె రాజునగు

దాన ధర్మములును దయయు సత్యమునీతి
వినయ ధైర్యధుర్య వితరణములు
రాజుపాలిటికిని రాజయోగంబులు

వేమన

ధరణీ నాయకులకు నార్తరక్షణంబులె క్రతువుల్

పెద్దన. మను. IV-74

క్షితిపుల కరిజయముధనోన్నతియుఁ
బ్రజానీతి రక్షణము ధర్మంబుల్

రాయలు. ఆము. III-35

కొలిచిన వారల జీతం
బులు వేళలు దప్పకుండఁ బూర్ణముగానీ
వలయును వారలప్రేమము
బలము నృపాలునకు నెల్లపట్లను మిగులున్

సూరన. కళా. VII-294

వంచకులం బడల్పుటచినై చుట సత్పురుష ప్రజంబు ర
క్షించుట విత్తమాశ్రితులఁ జేర్చుట భూప్రజపై దయాగుణం
బుంచుట రాజ చిహ్నములు వోయభిషేకముఁ బట్టబంధముం
గొంచెము మంత్రతంత్ర బలగుప్తియుఁ బుంటికిలేకపోయెనే!

బైచరాజు. పంచతంత్రము. I-792

కనవలయుఁ బరుల హృదయము
దనమది యొరులెఱుఁగలేక దాఁపఁగదగు దం
డనమునఁ గ్రోధములాలన
మునఁ బ్రమదముఁ జూపు టొప్పుభూపాలునకున్

రామపరాజు రంగపరాజు. సాంబోపాఖ్యానము

నృపతికి సాధు రక్షణవహించుట ధర్మవు.

పాపరాజు, ఉ. రా. VII-17

కోపింపక ప్రజవెఱవదు
కోపంబే పూనెనేనిఁ గ్రూరత్వమగున్

గోప ప్రసాదములందగు
రూపున నెఱుపంగవలయు రూఢవివేకీ

తెనాలి అన్నయ. సుదక్షిణాపరిణయము II-151

తోడరి భూపతియొద్ది దోమతోనైన
విడువని పగమోచి విహరింపరాదు.

పాడిదప్పినరాజుఁ బాయదే లక్ష్మి

తిమ్మయ. ద్విప. భార. విరాట.

అళులు పూవుల దేనియల లీలఁ గ్రోలు
మెలపు కార్యములందు మేలు రాజులకు

తిమ్మయ. ద్విప. భార. ఉద్యోగ.

ఆజిఁ గూలుట సహస్రాశ్వమేధంబు
లోజసేయుటగాదె యుర్వీశ్వరులకు

తిమ్మయ. ద్విప. భార. భీష్మ.

త్రాణతో మూల భృత్యశ్రేణి మనుపఁ
బ్రాణంబులిత్తురు భండనంబునను

బాలసర. ద్విప. భార. సభా.

సత్యంబు ధర్మంబు శమమును దమము
భృత్యరక్షణము మహీపాలనంబు
మొదలైన సత్కర్మములు సునాశీర
సదనంబునకు మెట్లు చందములండ్రు

వరద. రామా. అయో.

తగునట్టి కార్యంబుఁ దగినట్టివేళ
తగఁ దీర్పఁడేని యాధరణిపాలకుఁడు

కార్యహానియొకఁడెకాక తానందు
నార్యులు నిందింప నల్పుఁడై సమయు

వరద. రామా. అరణ్య.

మత్తులు పాపకర్మంబులుసేయ
నుత్తములగు రాజులోర్తురే చూచి?

వరద. రామా. కిష్కింధ.

ఉచితదండనవృత్తి నుర్విరక్షణము
ప్రచురత రాజధర్మముగాక భూమి
దేవార్హమైనట్టి ధృతిశమదమము
భావింపఁబాడియే పార్థివులకును

ధారుణీవిభుఁడట్టి దండార్హులైన
వారిఁజంపకయున్న వచ్చుఁ బాపములు

...ద్విజుల కధ్యయ నాదులట్లు
రాజవర్యులకు సంరంభంబుతోడ
నాజిలోఁబుత్రమిత్రాదులనైనఁ
గలుమవర్తనులైన ఖండింపవలయు,
పలుకులేటికి నిది పరమధర్మంబు

సమయంబు విడిచి సిచ్చలును లోభమున
నమిత వైఖరుల నన్యాయమార్గమున
వర్తించు వారినెవ్వరినైనఁ జంపి
మూర్తి భావించి సత్పుణ్యుఁడౌనతఁడు

...పృథ్వీశ్వరుండు
జగతివసంతంబు పవిత్రనిరీతిఁ

దగిమెడు పాటితో ధరణిలోఁ బ్రజల
విగతకల్మషవృత్తి వెలయింపవలయు

నయమార వర్ణముల్ నాల్గింటిమీఁద
దయ గలుగఁగవలె ధరణీశులకును

...అలవర్ణములు నాశ్రమములు
నరపతి తగురీతి నడుపుటఁజేసి
నరవినింద్రుఁడు వానిసరిగాఁడు

సోమన. ద్విప. భార. శాంతి.

రాజ్యవిఘాతంబు సేయు
జనముల నెఱిఁగినఁ జంపింపుపట్టి

సోమన. ద్విప. భార. అశ్రమ.

ధీమంతులయిన ప్రభువులు
సామంతుల బలముకన్న స్వాంతముబలముల్
తామెంతయుఁ గూర్చినచో
శ్రీమంతులటన్న నీతిఁ జెప్పఁగవినవే

కుమార ధూర్జటి. కృష్ణరాయ. II-97

కొండెగాండ్రను జేర్చిన కువలయేశు
రాజ్యమెల్లను శీఘ్రకాలంబునందు
నష్టమైపోవు......

శివరామకవి. సానందోపాఖ్యానము IV-32

వచ్చినవారికి నాపద
వచ్చిన నది పరిహరించువాని ప్రభుత్వం

బెచ్చానుగాని మఱిపౌర
పొచ్చెముగావించినం ప్రభుత్వముగలదే
ధరణిదేవుల. దశా. చరిత్ర. II-223

తానెంత యధికుఁడైనం
గానీమనుజేశ్వరుండు కార్యాకార్య
జ్ఞానము నిజప్రధానుల
తో నాలోచించి యుక్తితో నెఱుఁగదగున్

సప్తాంగ రక్షణంబును
సప్తోపాయము లొనర్చు సామర్థ్యంబున్
సప్తవ్యసన విరక్తియు
...... రాజసద్ధర్మ బుల్
కనుపర్తి అబ్బయామాత్యుఁడు. కవిరాజ మనోరంజనము. I-119,120

అరుఁడొక్క మొగినె యశ్వంబులను గట్టు
రేయిబవలు దిరుగు వాయుదేవు
డవని భరముదాల్చు ననయంబు శేషుఁడు
ధరణిపాలురకును ధర్మమిదియ
కందుకూరి. అభి. శా. అను. V-564

పలికినది బొంకకిచ్చుట
కలనన్దుర్జనుల నెల్లఖండించుటయున్
బలమున నార్తులఁగాచుట
దలపన్రాజులకు ముఖ్యధర్మములనవే
మంద చిట్టికామశాస్త్రి. మార్కండేయ పురాణానువాదం

తాను కష్టంబు పడియైనధర్మపథము
వలదు దప్పింప ప్రజకు భూపాలకుండు
ఆ. నారాయణదాసు. జానకీశపథము.

వేదశాస్త్రానుసారియైవివిధజనుల
నేలవలయు సుంతయు ధర్మమెడయఁబోక

అ. నారాయణదాసు. యథార్థరామాయణము.

............ పరసతీ ప
రాఙ్ముఖత సత్య మాశ్రితరక్షణంబు
సర్వభూత సమత్వంబు శాంతతపర
మాత్మచింతయు రాజచిహ్నంబులగును

విసరు నాల్కను వాగ్దానవితతిఁ జేయు
పృథ్విపతియిచ్చి కీర్తి దక్కించుకొనఁడు
ఒసఁగు వఱకు బాసను జేయకుండు విభుఁడు
గడుసరియు రక్షితుఁడు కీర్తిఁ బడయువాఁడు

పానుగంటి.

రాజు నిజదేశమునకును బ్రజలకుదొర
నను చుఁదలఁపకతన్ను శ్రీహరి జనులకు
సేవఁజేయుట కొఱకే సృజించెనంచు
నెంచి విఱ్ఱవీఁగక సంచరించుటొప్పు

ప్రజల సుఖదుఃఖములు ధరావరుఁడు దనవి
గాఁదలంచుచు నీతిమార్గముసఁజనుచు
సజ్జనుల గారవించుచు స్వాయముపడక
పరమపురుషునిభక్తిచేఁ బరఁగవలయు

ఒడయఁడెంచుపనుల సత్వరంబె చేయవలయు

వి.క. దే. వ.

ఋణశేషమగ్నిశేషము
రణశేషము కూడదనుచు రాజులధర్మం
బణుమాత్రమైనదానిం
గణియింపమిఁ గీడువచ్చు...

శ్రీపాద. బొబ్బిలియుద్ధము V-91

పుడమిగల తనదుప్రజలను
గొడుకుల బలెనెమ్మి నేలుకొని నేర్పలరన్
గడుసరివారలఁ బగడల
నిడికొనఁదగుఁ దనదుచెంత నెకి మీఁనికొగిన్

శ్రీపాద. ఏకావళీపరిణయము. III

## ప్రభుసేవ

వసుమతీశుపాల వర్తించు నేనుంగు
తోడనైన దోమతోడనైన
వైరమగు తెలుంగువలవదు తారెంత
పూజ్యులైన జనుల పొందుతెస్స

తిక్కన. భారత. విరాట I-136

అర్థమగుపనిఁ గల్పించి యర్థవేత
నంబులిచ్చికో గాది కష్టంబులందు
నాదరించి వారల క్షేమమరయుచుండి
సెలవు లపుడప్పుడీయంగవలయుఁ బ్రభుఁడు

ప్రభునిఁగని లేవంగవలయుఁ బ్రత్పభుఁడునిద్ర
బడయు పిమ్మట నిద్రింపవలయునతనిఁ

గూర్చి చెడ్డగాఁ బలుకఁగఁ గూడదాఁత
డొసఁగుదానితో సంతుష్టినొందవలయు

పానుగంటి. బుద్ధ.

ఎదుటఁ బడనిచ్చెఁ జాలునింకేమి యనుచు
దుడుకుదుడుకున నెల్లవస్తువులముక్కు-
దూర్చి విభుకర్ణమున మూఁతి జేర్చిమిగుల
దడబడలు సేయవలదు.........

ప్రభుడు తనయెడదయఁ గలవాడటంచు
బడిబడిగ నాతనిని జేరవలను పడదు
ప్రక్కఁగూర్చుండు మన్నను ప్రభుని కెదుట
వాసియగు దూరమున నిల్వఁబడఁగవలయు

పానుగంటి. కల్యా. రాఘు.

రా మోదంబు భూపాలుసేవ

గౌరన. నవనాథ

భువి నొకరాజునుఁ బొందుగఁ గొలిచిన
ఇవలనచ్చికంబెరఁగఁడట

తా. అన్నమయ్య. అధ్యా.

ఎరుకలేని దొరలనెన్నాళ్ళు కొలిచిన
బ్రతుకులేదు వట్టి భ్రాంతిగాని

వేమన

ఒలసి భూపతినొద్ద నూరకుండుటలు
బలుమాటలునుగావు పరిపాటిగాని

తిమ్మయ. ద్విప. భార. విరాట.

గంగిరెద్దుకు మూర్ఖభూకాంతునకును
భేదమించుకయునుఁ గానిపించదట్టి
ప్రభువు వేడిన సత్కవి పదముచెడదె

నూరకవి. రామలింగేశ శతకము. 15

## ప్రమాదము

అపాయము సేసిన నింద పుట్టదే

తిక్కన. భార. విరాట. II-95

అమరించినట్టి మిథ్యాభ్రాంతిగానఁ
దమసామ్మనుచుఁ జిచ్ఛేదతఁ బట్టరాదు

గౌరన. నవనాథ.

చెలరేఁగి కీడుచేసిన దురాచారి
బాలియింప నొల్లక భూషించుటెల్ల
నొగిఁ దన్నుఁ గఱచిన యురగంబునోరు
మగుడఁ దాఁదుడిచిన మార్గంబుగాదె

తిమ్మయ. ద్విప. భార. ఉద్యో

అరిశేష మగ్నిశేషము
గురుతర ఋణశేష మునుచగూడదు సుమ్మీ

కందుకూరి. ప్రబోధ చం. V-86.

## ప్రయత్నము

ఆరంభరహితుఁ బొందునె
యారయ సంపదలు

నన్నయ. భార. సభా. I-123

అల్పీయంబైన కార్యంబు సాహసారబ్ధంబైనను
దోషంబులేదు

నన్నయ. భార. అరణ్య. I-268

ఉచితకాల భావ్యమైన యత్నవిధిగదా సమగ్ర
ఫలత్వంబునొందు.........

తిక్కన. భార. శాంతి. III-217

జనులు మున్నకైపెక్కు యశక్యమని మ
నంబులోపల స్రుక్కి కార్యంబునందుఁ
బూని యుద్యోగ మొనరింపరేని నెట్లు
దాని సఫలతా ఫలతలు దారు గంద్రు

మారన. మార్కం. III-47

ఉద్యోగివగుము; సముద్యోగికెందు
సద్యః ఫలంబులు సకలకార్యములు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

ఇంటిలోని చీఁకటే యిట్టే తప్పక చూచితే
వెంటనే కొంతవడికి వెలుఁగిచ్చును
మించి కఠినపురాతి మీఁదఁ గడవవెట్టితే
అంచెలఁ దానే కుదురైనయట్టు
ఒక్కొక్క యడుగడుగె ఒగి ముందుఁ బెట్టితే
నెక్కువౌ కొండైనా నెక్కుఁగొనకు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

కదలనినీటికి మీనము
నెదురెక్కెనె యుటిదిఁబాఱు నేటికిఁ బోలెం

బదవి నిరుద్యోగులఁ బొం
దదు సోద్యోగులన కాని ధార్మికముఖ్యా !

వైచరాజు. పంచతంత్రము. 160

ఏచినయాపద నెరియక తన్నుఁ
గాచుకోఁదగు దైవగతియట మీఁద

గౌరన. హరిశ్చంద్ర.

......తపంబేల యల్పంపుఁ బనికి

తిమ్మయ. ద్విప. భార. ఆది.

గోరఁబో యెదుపనికి గొడ్డలేమిటికి

తిమ్మయ. ద్విప. భార. విరాట.

ఉద్యోగహీనునకుర్విలోపలను
సద్యః ఫలములు సమకూరవెందు

బాలసర. ద్విప. భార నల.

యత్నవంతున కసాధ్యములెందుఁగలవు

వరద. రామా. కిష్కింధ

...తగుపనికి నుద్యోగంబుచేసి
యదనుగాఁ దద్జ్ఞులయనుమతి వడసి
తరమిడి ధర్మంబుతప్పకనీతి
వెరవున నడచిన వృద్ధిపెంపొందు

సోమన. ద్విప. భార. సౌప్తిక.

ఘనతయంచును దుష్కర కార్యములకుఁ
బూనఁగాఁ జెల్లునే యెట్టిపురుషులకును

ధరణిదేవుల. దశా. చరిత్రము. II-212

మనుజుయత్నంబు లేక యేపనియుఁగాదు

దా. శ్రీ. దేవిభాగ. 260

వరహాలవానఁ గురిసినఁ
గరములచేఁ బట్టకున్నఁ గలుగునె ఫలముల్

కార్యసిద్ధియైనఁ గాకున్న యత్నంబు
సేయనందు నేమి సీగిగలుగు

దా. శ్రీ. దేవీభాగ. V-95

మంచికార్యమునకు మానక యెప్పుడు
యత్నమాచరించు టర్హమగును

కం. వీ. పం. నీతి. దీపి. 84

యత్నవంతులకెటనగమ్యమును గమ్యమనఁగ గలదె

మండపాటి రామశాస్త్రిగారు. మార్కండేయ. III 133

తనదులావుకొలఁది పని సేయకుండిన
వాని మొఱ్ఱనెవ్వ రైనవినరు

అ. నారాయణదాసు. నూరుగంటి.

శ్రమములేకయె ఫలములు దుముకఁబోవు
ఉత్తయాసలకన్న మే లుద్యమంబు

దువ్వూరి. కృషీవలుఁడు. 42

జతనము ఫలించు జీవశేషంబెయున్న

చ. గణపతిశాస్త్రి. అజవిలాపము 10

పెక్కుభిన్నంబులొదవిన లెక్కగొనక
కార్యసాఫల్యమగుదాక గడగవలయు

వా. కృ. రావు. బ్రూను. సాలీడు.

ప్రయోజనము

సాము సేసిన ఫలము జయశీలుఁడౌట
మేను గలిగిన ఫలము మేలెల్లఁ గనుటా
మానుషముగల ఫలము మంచివాఁడౌట
తనుఁదానె తెలిసిన ఫలము తత్త్వపరుఁడౌట

అన్నమయ్య. అధ్యా. సం.

ప్రాభవమునకు శస్త్రాస్త్ర పాండితికిని
ప్రబలతను దార్ఢ్యమునకు గొప్పతనమునకు
జతుపఁడగినది వధయానె శక్తిసార
హీనవరత్న దోషత్రమయానుగాక

పడిన బల్లి ప్రాకిన తొండపొడము మొుండి
చేయి కూయుతీతువువంటి హేయవస్తు
వులె మొదట దేవుచిత్తంబు తెలిసి తెలుపు
ధరణిపుల చిత్తగతి క్షుద్రదాసులట్లు

పానుగంటి. వన. రాష.

దాసి పరిచర్యకును జేటితనియసాగసు
దిద్దుటకును దూతి పొలియల్కఁ దీర్చుటకును
సకియ సద్వర్తనము బోధ సల్పుటకును
గాదెయుండుట రాచనగళ్ళయందు

కాళ్ళకూరి నారాయణరావు. చిత్రాభ్యుదయము. V-50

ప్రవర్తన :-

విత్తరత్నకుఁ గడుమేలు వృత్తరత్న

నన్నయ. భారత. అరణ్య. IV-130.

ఆవులింతతుమ్ము హాసంబు నిష్ఠీవ
నంబు గుప్త వర్తనములుగాఁగఁ
జెలుప వలయు......

తిక్కన. భారత. విరాట. I-13.

సావిఁ దననడకలే స్వర్గనరకములై
జీవులకు మాయగప్పి చిక్కించు
నడచేది నడవక మానరాదు

అన్నమయ్య. అధ్యా. సం

మాటొకటి సేతొకటి గాద దేటికింత
నాటి నాటికిఁ దెలియుఁగా నడతలోన

కాకమాని మూర్తికవి. రాజవాహన. V-42

ఆచారమునఁదోఁచు నతనికులంబు
వాచాలతనుఁదోఁచు వాని మనీష
తనువు చూచినఁదోఁచు ధనికునిజాడ
కనిపించునడకలఁ గలుగు నెయ్యములు

వరద. రామా. అయో.

ధీర చరిత్ర సంపదల సంఖ్యాత ప్రభావోన్నతుల్

ఏమగు లక్ష్మణకవి. భ. సు. 28

నడువుమీ విశ్వవిఘ్నులను గడవకుండ

విక్ర. దే. వ

ధీగరిమకుఁ బెంకితనము త్యాగమునకుఁ
గఱకుఁదనము కవితకు వాక్స్ఫురతయు
వీర్యమునకు మాయయు వన్నెఁబెట్టు బండ
బలము తలగొట్టుకొనుటకే పనికివచ్చు

పానుగంటి. విజయ. రాఘ.

## ప్రాజ్ఞలక్షణము

తనకధికుల కతిభక్తియు
మనమున నెయ్యంబుఁ దనసమానులకునుహీ
నునియందుఁ గృపయుఁ జేకొను
మనుజనకును వగయుఁగలదె మదిఁబరికింపన్

నన్నెచోడుఁడు. కు. సం. X-187

ఇది నాకయ్యెంగాఁగల
యదియైె యను గాఢనిశ్చయంబెవ్వని నె
మ్మదిఁ గలుగునుబ్బు వగసం
పదయాపద గలుగవట్టి భవ్యున కింద్రా

తిక్కన. భారత. శాంతి. IV-414

## ప్రాజ్ఞులు

ప్రాజ్ఞులు వివేకంబున సంసారంబు దుఃఖబహు
ళంబని యెఱింగి తద్రూపగహనంబు గడచి శాశ్వత
సుఖంబుఁ బడయుదురు

తిక్కన. భారత. స్త్రీ. 1, 35

నిజగుణదోషకర్మముల నెట్టన మేలును గీడువచ్చుఁద
త్ప్రజనితసౌఖ్య దుఃఖములఁ బ్రాజ్ఞులు తుల్యమనస్కులైమనో
రుజలును దేహజంబులగు రోగములున్ హితధర్మకర్మభే
షజములఁజేసి పాపుదురు సర్వము సాత్త్వికదృష్టిఁజూచుచున్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-139

తడవినమాటకుఁ దగినయుత్తరము
నుడువక ప్రాజ్ఞుండు నోరొత్తుకొనునె

గౌరన, హరిశ్చంద్ర.

ఒకటి ఆయెను రెండుమూడులు
ఒకటి ఆయెను కోటి సంఖ్యలు
పెక్కులోకట్టిగ జూచువాడే ప్రాజ్ఞుడనవినమే

గురుజాడ, ముత్యాలసరాలు

ప్రకృతి శాస్త్రజ్ఞులకుఁ గవివరులకు మత
బోద్ధలకు వారితిట్లును బొట్లుతప్ప
నట్టివారి యజ్ఞానంబు నపహరింపఁ
బాటుపడుటలు తప్పవు ప్రాజ్ఞనకును

పానుగంటి. బుద్ధ.

ప్రాజ్ఞులౌ ప్రాణులెఱింగి వర్తిలియిహంబుఁ బరంబును
జూఱగొంద్రొగిన్

తిరు. వెం. కవులు, నానా. రా. 660

దుర్విషయాంధులతో మైత్రిఁజేయు ప్రాజ్ఞుఁడుగలఁడే?

తిరు. వెం. కవులు, బుద్ధచరిత్రము, IV-79

ప్రాణులచావు పుట్టుకలు ప్రాజ్ఞలబుద్ధిఁ గలంకజాలవు

సె. ల. కవి. ప్రభా. శా. వి- 1-175

నూతనము శ్రేయమనియుఁ బు
రాతనమతి హేయమనియుఁ బ్రాజ్ఞుఁడు నరసిం
హా తలపకుండ నెఱపును
బ్రీతిని దత్త్వంబెఱింగి విమలమదముచేన్

విక్ర. దే. ష.

## ప్రాణదానము

సర్వతీర్థసేవనంబును సర్వవ్రతంబులు సలుపుటయును
సర్వదానధర్మక్రియలును బ్రాణదానంబుతో
సమానంబులుగావు

నన్నయ. భారత. ఆది. VIII-134

ధర్మమేదియు ప్రాణదానముతోను తులతూఁగదు...

తాళ్ళపాక తిమ్మక్క. సుభద్రాకళ్యాణము

ప్రాణదానముసేయ బహుపుణ్యమిచ్చు

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

ప్రాణదానంబుకంటెను వ్రతముఁగలదె?

చేమకూర. విజ

## ప్రాణభయము

నరుఁడు ప్రాణభయంబుఁ బొరయుట యరుదయ్య

తిక్కన. భారత. II-64

ప్రాణభయ మెట్టివారిఁ గీడ్పఱుపకున్నె

తిక్కన. భారత. భీష్మ. III-58

## ప్రాణము

ప్రాణంబులు దేహంబులంబాసి దేవాది భావంబులం
బొందుచు మగుడ మనుష్యత్వంబు నొందుచుండు

తిక్కన. భార. ద్రోణ. II-175

ప్రాణంబుగలిగినను
బలుసాకు దినినైన బ్రదుకంగవచ్చు

పా. సోమన. ఐస.

తీపికెల్ల దీప్తి తెలియంగ ప్రాణంబు

వేమన

అనఁజనదు తగులు తగులని
తనువుం బ్రాణంబుకంటెఁ దగువెద్దియొకో
చనుతనువు విడిచి ప్రాణము
చనఁబోలని వారుగలరె సమయంబైనన్

కైచరాజు. పంచతంత్రము. I- 517

... అనిత్య మధ్రువము ప్రాణ
మను మానమా చందమున మున్నవినరే

తిమ్మయ. ద్విప. భార.

తిరమొప్ప ప్రాణము తీపన వినవె ?

తిమ్మయ. ద్విప. భార. విరాట.

పోవు ప్రాణములున్నఁ బోయిన నేమి

వరద రామా. అయో.

ప్రాణఁబు నిత్యంబుగాదు

సోమన. ద్విప. భారత. శల్య.

ప్రాణంబు గలిగిన బలుసాకులైన
పోణినేరుకదిని భువినుండవచ్చు

సారంగధర చరిత్ర.

పరువుపోయిన మరల రావచ్చుగాని
నాశమొందిన మరల ప్రాణములురావు

తిరుపతి వేంకట. పాండవ. VI-110

ప్రాణము తీపుగాదె యెటువంటి
పరాక్రమశాలికైన

శ్రీపాద. బొబ్బిలియుద్ధము. V-69

## ప్రాణరక్ష

ప్రాణరక్షకయి యేమేఁ బాపముల్ చేసినన్
...చెల్లుఁబురాణ సంహితలఁ జెప్పనవిందుమే కాదె వి
శ్వామిత్రుండెడరైనచో శునకమాసంబున్ భుజింపఁడె
శ్రీనాథ. శివరా. III-87

తనప్రాణము నిలుపుకన్న ధర్మము కలదే
తెనాలి. పాండు. మహా. IV-161

నిత్యసత్యవ్రత నిష్ఠమైనను మాని
ప్రాణంబురక్షించు టర్థసరణి
భవానీశకవి. ధర్మ. IV-93

## ప్రాణాయామము

తామ్రమాదిగఁ గలయట్టిధాతుచయముఁ
గాలిమినిడి యూఁదఁగీడెల్లఁబాలియునట్లు
ప్రాణపవన నిగ్రహమునఁగ్రాఁగిపోవు
ననఘ యింద్రియజనితదోషాదులెల్ల

మరగిన సింహము మృగములఁ
బొరిగొనుచును నరులఁగాచు పోలిక నంతః
పరిచితపవనుఁడు నఘములఁ
బొరిగొనుచును నరుల దేహములు రక్షించున్
మారన. మార్కం. III-319

## ప్రాత క్రొత్తలు

సర్వమును బ్రాఁతదనియెందు సాదుగాదు
క్రొత్తదనియె కావ్యమునకుఁ గొఱఁతరాదు

యోగ్యులు గ్రహింతురారసి యుత్తమంబు
మూఢుఁడన్యులనే నమ్ము బుద్ధిలేక

కం. వీరేశలింగము. మాళవికా.

కని సకారణముగ దోషమని వచింప
మంచిదే! యట్లుకాక యోజించకుండఁ
దప్పనఁగనట్టితప్పు క్రొత్తదగుచాట
తప్పుగాదు; మూఢులనోట తప్పుగాని
ప్రాఁతక్రొత్తయు వస్తువిభాగమగునె?
కాలగతి భేదకలనమ్ము గాని క్రొత్త
దైనయది ప్రాఁతకాకుండ నగ్గెయున్నె
ప్రాఁతయది క్రొత్తగాకెట్లు ప్రాఁతదయ్యె

పానుగంటి. బుద్ధ

పాప్తి

సకలభూతంబులకును శాసకుఁడు గలఁడు
గాదెయొక్కరుఁడాతని కల్పనమునఁ
బ్రాప్తమైనదినీళ్ళులు పల్లమునకు
వచ్చుక్రియఁదానవచ్చు

తిక్కన. భారత. శాంతి. IV-413

నోచినవారి సొమ్ములవి
నోమనివారికి వచ్చునే ?

నాచన సోమన. ఉ. హ. I-168

పన్నిన దైవమియ్యనిది పరులిచ్చేరా!
బడలితానెందైనాఁ బడ్డపాటే దక్కెఁగాక
కడఁగి రానిదిదే నొక్కరివశమా!

తా. అన్నమయ్య. ఆధ్యా. సం.

వేమింటి దాఁకఁ బెరిఁగిన
దీమసమున నతలమునకు దిగఁబడిచనినన్
భూమిగలయంత దిరిగినఁ
దామును బెట్టనిది రిత్తదన కేలబ్బుదిన్?

జక్కన. విక్రమార్క. II-182

ఇడనివానిచేత నిప్పించుఁదన ప్రాప్తి
యిచ్చువానిచేత నీయనీదు
ప్రాప్తిగల్గుచోట ఫలమిచ్చు దైవంబు
ప్రాప్తిలేనిచోట ఫలములేదు

వేమన

ఎనసి సుఖమె యనుభవించునే నరుండు దుఃఖమే
యనుభవించువాఁడు గలడె యవని కేది వచ్చినన్
మనసులోన బ్రాప్తమనియు మఱియు దైవకృతమటం
చును దలంచి శాంతిబొంద జూడవలయు

ధర్మవరం. చిత్రనళీయము. IV-vii. 79

ఎప్పటికి అనుభూతి మెద్దియొ
అప్పటికి అది నిక్కువంబే;
ఎప్పుడో లోకంబు కల్లగు
ననుటయిపుడెట్లో ?

గురజాడ. ముత్యాలసరాలు

ఎద్ది యెవనికిఁ బ్రాప్తమోయద్దివాని
నెనయుననుమాట నిజమైన నిచ్చునొకఁడు
కిమ్మనక సన్న సన్నగ నమ్మవెట్టు
నాలుగైన పిమ్మట నిచ్చునరుఁడొకండు

పానుగంటి. కల్యా. రాఘ.

ప్రియనిరాకరముణ

ఎట్టివారికిఁ బ్రియునిరాకరులఁగాంచి యొడలు గాలకున్నె

నన్నెచోడుఁడు. కు. సం. II-44

మున్నెంతో చనవొప్పఁగ
మన్నించిన విభుఁడు వెనుక మార్మొగమైనన్
గన్నియ బలిమిని వేడుక
విన్నదనంబదియకాదె విధుబింబాస్యా

ముద్దుపళని. రాధికా. III-32

ప్రియము : అప్రియము

ప్రియము పలికెడు వారిన పెద్దమెత్తు
రప్రియంబు నబధ్యంబునైన పలుకు
వినఁగ నొల్లరు

నన్నయ. భారత. సభా. II-191

ప్రియాప్రియత్వములకజ్ఞానంబె మూలంబగున్

చ. నా. శాస్త్రిగారు. భర్తృహరి నిర్వేదము.

ప్రియవస్తువు

ఎంత ప్రియవస్తువులపై
నంతఃకరణంబు గలుగునది మీఁదట న
త్యంతంబగు సంతాపం
బంతయుఁ గూర్పఁగ నిమిత్తమగుఁ బురుషునకున్

ఎఱ్ఱన. నృ. పు. IV-71

ప్రియవాది

లేదు తగవరి యొంటను మూఁడి చొచ్చి
వాత వెళ్ళెడు వాఁడెయెవ్వాఁడు......

సూరన. కళా. 2 II-85

## ప్రియుఁడు

అనుకూలుఁడైనట్టి మగవాఁడు గలిగితే
సంభ్రమమున్నదా ? అంతకన్నను

క్షేత్రయ

తన్నెడుకాల ముద్దుగొను తద్జ్ఞులు పోలితాంగి పూరుషుల్

ముత్తరాజు సుబ్బారావు. శ్రీకృష్ణతులాభారము II-25

## ప్రియురాలు

తన వలచుకాంత యేపని
మనమునఁదలఁచినను జేయు మగవానికి న
వ్వనిత బిగియారు కౌగిలి
దినదినమును మదనకామధేనువుగా దే

నాచన సోమన. ఉ. హ. వం. II-80

...చెలికిఁ బ్రాణములిచ్చిన నప్పుడీఱునే

సూరన. ప్రభా. III-88

ప్రాణములకుఁ బ్రాణంబగు
ప్రాణ సఖికిఁ జెప్పరాని పనులుం గలవే ?

సూరన. కళా. VI-258

తాను వలవనిసతి మహాదరముకంటె
తాను వలచినసతి కాలితన్నె మేలు

ముత్తరాజు సుబ్బారావు. శ్రీకృష్ణ తులాభారము II-25

## ప్రేమ

కన్న మోహమ్మునకంటె నగ్గలము
ఎన్నఁబెంచిన మోహ మెందు

పా. సోమన. బస. 60

తేజము నూవలపు దెలుపఁ దెఱవలకెందున్

నాచన సోమన. ఉ. హ. వం. I-78

పాపమెఱుఁగదు వలపు భయ మెఱుంగదు వలపు
రూపెఱుంగదు మతికి రుచిసేయువలపు
సిగ్గెఱుఁగదు వలపు శిరసుకెక్కును వలపు
ఒగ్గించు నన్నిటికి ఒడిగట్టు వలపు
తెగువదెచ్చును వలపు తేలించు నీవలపు
ఇగిరించి కలిమిలే మెఱుఁగదీ వలపు

తోడఁ బుట్టిన మమత తోడఁగి కొన్నాళ్ళకు
వాడిక పుత్తులమీఁదవలె నుండదు
తల్లిమీఁదఁగలభక్తి తనకే కొన్నాళ్ళకు
ఇల్లాలుమీఁదవలె నింతయుండదు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

రారపోరయందు రమణులు కాంతుల
బొందు గూడునట్టి సందడులను
అట్టులనుట ప్రేమనగుట దోసముకాదు

కాంతపైని ప్రేమ స్వాంతము రంజించు
చింతదీఱు దరుణిచిక్కునపుడె

వలపుగలిగెనేని వనజాక్షియధరంబు
పంచదారకుప్ప పాలకోవ
చూతఫలరసంబు జుంటిసమానమా

చనుమనుచుఁ ద్రోయవిస్తరి
చినిగెడు నన్నట్లు వలపుచెడ్డదిసుమ్మా

కదిరీపతి. శుక. II-476

ఏటికిమాటలు నాఁటికి
నేఁటికి మగవాఁడు వలచునేకదవినుమా
బోటి తటాలునఁ జూచిన
నాఁటది వలచున్మనోంబు జాగ్రమునందున్

చిననారాయణ. కువల. III-69

చిత్తాన నెనరుంటెచేరి యుండగవచ్చు
క్రొత్తవలపదిరెణ్ణాళ్ళు
వలచేది యొకరికోసమా !
ప్రేమఁగూడినవానిచే మించేదేజాతో ?

వనితకైన మగవానికైన
నెనరుబోతే నా తరువాత నెనయ రోతే!

దొరలవలపు లేటిశతములే?
అవిదొరికేది తొలినోముఫలములే

క్షేత్రయ.

వలచిపాయుట పగవారికైనను గాదు

చెలువుఁడు వేఱొక చెలియను
దలఁపునఁ దలఁపోసినపుడె తనకుం దానే
తలనొచ్చుఁగనక వినక యె
కలికిరో యేమందువలపుకానిదిసుమ్మీ

ముద్దుపళని. రాధికా

వెలకుఁదీసినవలపురాదు

త్యాగరాజు.

ప్రేమ హెచ్చిన భువింజెఱుతప్పును దుస్సహాంబగున్

కందుకూరి. రత్నావళి.

ప్రీతితోడ బెంచిన విషవృక్షమైన
స్వయముగా నాశనము సేయ జనదు నరుడు

చిలకమర్తి. గయోపాఖ్యానము IV 88

కులము వలపునకుందవ్వు

అ. నారాయణదాసు. హరిశ్చంద్ర.

తెలివితప్పి పిచ్చి వలపుతో నుండెడు
వాడు మోసపోయి కీడుబొందు

అ. నారాయణదాసు. నూరుగంటి.

మరులు ప్రేమని మదిదలంచకు
మరులు మరలును వయసుతోడనె
మాయమర్మములేని నేస్తము
మగువలకు మగవారికొక్కటె
బ్రతుకు సుకముకు రాజమార్గము
ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును
ప్రేమనిలిపిన ప్రేమనిలుచును
పతులప్రేమయె వేవెలుగు
ప్రేమకలుగక బ్రతుకు చీకటి

గురజాడ. ముత్యాలసరాలు

లలనలందలి వలపాపదలకు మొదలు
అఖిలనాశనకరమదేయగును దుదకు

పానుగంటి. విజయరాఘు.

తండ్రి కొడుకును లాలించుఁ దనదుకొఱకె
సుతుఁడు ప్రేమించుఁ దండ్రి స్వసుఖము కొఱకె
కాంతపతిఁ గూడుఁ దనదు సౌఖ్యంబు కొఱకె
స్వసుఖమునకే మగండును వలచు సతిని

పానుగంటి. వనవాసరాఘ.

మొదటి చూపునందె మోహాధికతఁజెంది
మరగువలపె యుత్తమంబఁటండ్రు
కాని చూడకుండ గాఢరాగాంబుధిఁ
గ్రాలు వలపు దానికంటె ఘనము

అమల విజ్ఞాన పేటిక కఱలు రెండు
మొదటియది యింద్రియ జ్ఞాన సదనమగు ద్వి
తీయము స్వయంభవంబైన తెలివి కిరవు
దానఁబుట్టిన ప్రేమంబె దైవికంబు

పానుగంటి. మాలతీమా.

భూపలు ప్రణయానుబంధ సదృశమ్ముల్లు గావు కులాంగ
నాళికిన్

దువ్వూరి. కృషీ. 53

•

ప్రణయ పాశంబులెట్టివో బలిమిబట్టి
లాగినను ద్రెవ్విపోవక సాగుచుండు
లలిత బిసనాళ ఖండంబులను దెమల్ప
నడుమసాగెడు సూత్రకాండములువోలె

దువ్వూరి సీతావనవాసము IV-49

కట్టుగట్టకు గట్టిన గజముదొరకు
గళ్ళెము బిగించుచో దురగంబు దొరకు
హృదయమున బ్రీతిగల్గిన సుదతి దొరకు

తిరుపతి వేంకట. మృచ్ఛకటికము. I–17

లలన నిరాకరించిన కొలందిగ నూనియలేని వత్తినా
వెలుగు దొరంగు భీరువుల ప్రేముడి

కొప్పవరపు సుబ్బారావు. వసంతసేన. III–53

లోకము నవ్వనంచు దనలోజనియించిన ప్రేమనాపంగా
నే కమలాక్షికైన దరమే? పరిఘూర్ణతరంగ మాలికా
నీకముతోడ గట్లొరసినిండుగ బారు నఖండవాహినీ
ధారల నాపబూనిన తటంబులు ద్రెంచి జగంబు ముంపదే!

కొప్పవరపు సుబ్బారావు. తారాశశాంకము III–50

వనితాప్రేమకు గారణంబిదని చెప్పం జాలకష్టంబగున్

కూచి నరసింహం. రూపలత. III–63

వలపెరుంగక బ్రతికి కులికిమురిసేకంటె
వలచి విఫలమ్మొంది విలపింపమేలురా!

బసవరాజు అప్పారావు.

వలపుగలచోట ప్రాణంబు చులుకగాదె

నా. కృ. రావు. తేనెచినుకులు.

ప్రేమయను వస్తువొకటి లోపించెనేని
లోకమంతయు నల్లకల్లోలమగును

ప్రేమచొరరాని తావులు పృథివిలేవు

నా. కృ. రావు. వెన్నెలవెలుగులు.

ప్రేమగలట్టి వస్తువగుపింపక పోయిననెంత బాధరా

ప్రేమకు లేదురా విలువ

కూడుగుడ్డకులేక అల్లాడుచుండు
బానిసల కేల ప్రేయసీప్రణయ కేళి

మహత్తర ప్రణయలీలకు
సత్యము గోచరించునే

......వ్యాజములేక నిసర్గమైనచో
ప్రేమగలట్టివస్తువగుపింపక
దూరమునందునుండుచో
క్షేమమహర్నిశంబుపరికింతురు ప్రేమికులాపదార్థమున్

పురా జనుమ్కృతప్రణయానుబంధ
మదిత్రెంపగరానిది జీవకోటికిన్

ప్రేమయనంగ నెల్లర ద్రవింపగజేయుచొ

కొమరవోలు వెంకటసుబ్బారావు అమరశ్రీ

ప్రేమ - కామము

మనసుచేఁ జూచు రాగము కనులచేతఁ
జూచుఁ గామమాలస్య మోర్చుకొనునద్ది
యోర్చుకొనదిది మృదులమౌ నుష్ణముగల
దది; బుసబుసపొంగి పొగగలయది యిదిగద!

ఆశను భుజించు నది లలనాస్థిమాంస
భోజియిది, రాత్రి నిశ్చల తేజము గల

దది పగలు రాత్రి మండెడునిది బిడియము
గౌరవముగలదద్ది తద్ధారమిద్ది
ఆపదలనైనఁ జల్లాఱనట్టి తేజ
మద్ది వర్షార్ద్రి ఖద్యోత జాగ్నిఁబోలె
నాపదలు రాఁగఁ ఱాయిమం చాఱునిద్ది
మబ్బుపైఁ బడఁ ద్రాటాకు మంటఁబోలె

పానుగంటి. కోకిల

## ప్రేమ : ధనము

ధనమిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వ్వఁగ వచ్చు మగఁడింతుఁకున్
జనవిచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె యింక నేటిమాటలు చెప్పుమా

నందితిమ్మన. పారిజాతాపహరణము

వినుము ధనములు రెండు తెరగులు
ఒకటి మట్టిని పుట్టినది; వే
రొకటి హృత్కమలంపు సౌరభ
మదియునిది యొక్కెడను కలుగుటయరుదు

గురుజాడ. ముత్యాలసరాలు

## ప్రేమ : వివాహము

మనసొకనికిచ్చి మఱియొ
వ్వానినేనియు నొరునిఁబెట్టవట్టుటకంటెన్
వనితలకు బ్రహ్మచర్యం
బున నుంపుట పరమధర్మము...

పి. చిదంబరశాస్త్రి. హైమవతీ విలాసము I 99

## ప్రేమపాత్రుఁడు

ఏవిధిఁ బ్రేమపాత్రుఁ గినియించిన వారికి శత్రువాత్మయున్

మూరన. ప్రభా. V-136

## ప్రేమబంధము

ఎల్లలోకము వొక్క యిల్లై వర్ణభేదములెల్లకల్లై
వేల నెరుగని ప్రేమబంధము వేడుకలు గురియ
మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలిచివెలుగున
నంతస్వర్గ సుఖంబులన్నవి యవని విలసిల్లున్

గురజాడ. ముత్యాలసరాలు

## ప్రౌఢము

ఎత్తటినైనవాఁడికిఁ పలుకదలపరుప్రోడన్

అచ్చ. రామా. అయోధ్యా.

## ఫలము

గురువున కిష్టదైవమునకుం బతికిం గృతిఁ జెప్పిపుణ్యమున్
వరమును దేజమున్ బడయవచ్చు

నన్నెచోడ. కు. సం. I-50

గుమ్మడిపువ్వుఁ దేనియయు
గూపము నైందవరేఖకొంతయున్
జుమ్మరయంగఁ గర్మఫల శోభనసంపద

తిక్కన. భారత. శాంతి. V-128

కోపురమై వెంటవెంటఁగొలిచిన బంట్లకు
తావులఁగొంతవడైనాదప్పి దీర్చవలదా!

ఇతవై పనిసేసేటియింటిపసరమునకు
వెతదీరఁ బాలార్చి వెడ్డువెట్టఁదగదా!

తా. అన్నమయ్య. అధ్యా. సం.

మనుజుఁడై ఫలమేది? మఱి జ్ఞానియౌదాఁకా!
తనువెత్తి ఫలమేది? దయకలుగుదాఁకా! –
ధనికుఁడై ఫలమేది? ధర్మముసేయుదాఁకా!
చదివియు ఫలమేది? శాంతము గలుగుదాఁకా!
పావనుఁడై ఫలమేది? భక్తిగలిగినదాఁకా

పక్కన జన్మాలనెల్లాఁ బాటువడేదెల్లాను
ఎక్కడో సంసారాన కిందుకింతేకా?
గారవాన ధనములు గడియించేదెల్లాను
ఆరయ నాదని వేఁగేయందు కింతేకా?

కలిగి (న?) మతి వృథగాకుండా
అలరుటె పుణ్యంబగు ఫలము
ఒనరిన యీభవముసురనకుండ
ఘనుఁడీ జీవుఁడు గల ఫలము
తనువుమోచి చైతన్యాత్మునిమతిఁ
గనుటె వివేకముగల ఫలము
చేసిన పుణ్యము చెడిపోకుండ
శ్రీసంపద మెరసిన ఫలము

ఈసుల రేసుల నితరదూషణలఁ
బాసుటె అపురూపపు ఫలము

వారిఁ గొలిచియు మిథ్యగాకుండ
విరసముఁడిగి చదివినఫలము

తా. అన్నమయ్య. అధ్యా. సం.

పూర్ణవిజ్ఞానమే తపమునకు ఫలము
విద్యకు ఫలంబు వినయంబు వితరణంబు
సిరికిఫలము, తేజోరూప గురుగుణాఢ్య
సుతపరిష్వంగ సుఖమె సంసృతికి ఫలము

పానుగంటి. కల్యా. రాఘ.

## బంధము

కర్మబంధనములు గ్రక్కునఁ బాయుదుఁ
బుణ్యగతికినేగు పురుషునట్లు

నన్నయ. భారత. అది. V-173

బంధుమిత్ర ధనసంచయంబు.
వలని స్నేహంబు విడుచునది

నన్నయ. భారత. అరణ్య. I-24

తెగని కర్మమునకు దేహము దగులు
తగిన దేహమునకుఁ దరుణితోఁదగులు
కనకము అన్నిటితోఁ దగులు సంసారికి

బంధమూలమైనట్టి ప్రపంచమందునుండి
బంధముఁజూసేనంటేఁ బాసునా? అది
అంధకారమున వెలుగరసితేఁ గలదా !

కట్టుకుంటే బంధము మోక్షమునకు దూరము
ఒకరి రక్షించఁ బోతే నొకరికపకారము
ఘనవిరక్తుండైతే లోకము మెచ్చదు

తా. అన్నమయ్య

ఆలును బిడ్డలు నర్థంబు నెపుడుఁ
గాలి సంకెల లెల్లకడలును బతికి
మఱచియు వీనిపై మక్కువసేయ
రెఱుక గల్గిన ధీరులెల్లకాలంబు

గౌరన. హరిశ్చంద్ర.

ఎవ్వడింక వదలింపఁగ నోపెడు పాశబంధముల్

పిల్ల. పిన. శృం. శా. IV–85

ఆలు బిడ్డలుఁదానుఁ జట్టాలనంగ
నెవ్వారెవ్వార లేయూరికేదిత్రోవ

రఘునాథరాయలు. వాల్మీకి చరిత్ర. I–67

తగులు చెందినవాఁడు తగవెన్న లేదు

అ. నాయయణదాసు. వేల్పుమాట. 37

## బంధుద్రోహి

జీవమేటికి రాజ్యమేటికిఁ జెల్లుఁజుట్టల బిడ్డలం
జావఁ జూచినయట్టిద్రోహికి సర్వభోగము లేటికిన్

తిక్కన. భారత. స్త్రీ. II–175

## బంధువియోగము

యోగికైనను బంధువియోగదుఃఖ
జనితతాపంబు కోపంబు జెనుచుగాదె

తిరుపతి వేంకటకవులు. పాండవవిజయము. VI–105

బంధువులు

ఎడరు దోఁచినప్పుడొదవి తోలఁగించువానిఁగా
కన్యునేలబంధుఁ డండ్రుజనులు

తిక్కన. భారత. కర్ణ. III-64

కదియుంగాష్ఠముఁ గాష్ఠము
నదిలోమఱికొంత సేపునకుఁ బాయును నె
మ్మది నట్లుగఁ దలపఁగ వల
వదె పితృపుత్రాది బంధువర్గమును

తిక్కన. భారత. శాంతి. VI-10

తమలో నన్యోన్య వశ
త్వముకలిగిన బంధులాపదల నెల్ల నుపా
యములమైఁ జూతురు

మంచెన. కే. బా. చ. III-52

పొసఁగఁ జేపట్టిన భుజగంబు భంగి
వెసఁగ్రూరుఁడగు బంధు విడువంగవలయు

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

కలవైనను బంధుజనుల కడ కేగకుమీ

బద్దెన. సుమతి. 96

ఎప్పుడు సంపదకలిగిన
నప్పుడు బంధువులువత్తురు

బద్దెన. సుమతి. 20

ఐనవారలంచు నాప్తులటంచును
బందుగులను నమ్మబాడిగాదు.

వేమన

ఒడఁడొరుల కొక్కొకచోనన్నవైనతావులం
గూడుట యిష్టబంధులకుఁ గ్రొత్తయె

సూరన. ప్రభా. I-94

ఒంటి ప్రమాను రాయిడి నొందినట్లు
బలిమి నాపద నొందు బంధుశూన్యుండు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

.....తనకును దానెర వనిన
బనివడి యెంతయు బంధులు సతమె

సోమన. ద్విప. భారత. శాంతి.

చుట్టములనెల్లఁ బేమతోఁజూడ వలయుఁ
జేతనైనంత సాయంబుఁ జేయుచెపుడు

కం. వీ. వం. నీతి

బలగర్వము

బలవంతుఁడ నాకేమని
పలువురతో నిగ్రహించి పలుకుట మేలా
బలవంతమైన సర్పము
చలిచీమలచేతఁజిక్కి చావదె సుమతీ

బద్దెన. సుమతీ

తనకుఁ గ్రిందివానిఁదా గొట్టఁబోయినఁ
దనకు మీఁదివాఁడు తన్నుఁగొట్టు

అ. నారాయణదాసు. నూరుగంటి. 52

బలవంతులు

ఉత్తమ సత్త్వాలు వంశధర్మముల్
పూజిత భంగిఁ జేయుదురు

తిక్కన. భారత. ఉద్యో. IV-14

ఘన బలవంతుల కసాధ్య కార్యముగలదే

మల్లికార్జునుఁడు. భాస్కర

అలఁతులఁ బోరిఁగొనరు మహా
బలులాహా ఘనులగాని పవమానుఁడిలం
బిలువెఱకునె బహుశాఖా
కుల గగన స్పంది వృక్షకోటులు దక్కన్

బైచరాజు. పంచతంత్రము. I-204

ఒరుల పాలైన తమసొమ్ము మరలఁగొనుట
యార్తిఁ జెందిన చుట్టాల నరసి కొనుట
నిజకులోచిత ధర్మంబు నిలిపికొనుట
బలియుఁడగుటకు ఫలమంద్రు

పాపరాజు. ఉ. రా. II-223

చేవగలవాని పంతమే చెల్లుగాని
బలవిహీనుని మాటలు పాటియగునె

చింతమర్తి. గయోపాఖ్యానము. II-44

బలవిహీనుని కన్యని భార్యయంచు
దనకళత్రం బటంచు భేదమ్ముగాని
సొగసుగలదెల్ల దనచేతిసొమ్ముకాక
బలము గలిగినవాని కేర్పాటుగలదె

తిరుపతి వేంకటకవులు. పండిత.

## బలవదాశ్రయము

అల్పులు నతిసత్త్వులఁగూడి బలియులగుదు రదియరుదే

నన్నెచోడ కవిరాజు కు. సం. X-69

బలవంతుఁడు మన్నించిన
బలహీనుఁడు బలియుఁడనఁగఁ బరుధారుణిలో
వలరాయఁడు చేపట్టిన యలరులు బాణములుగావె యాభళి
కందా
కందనామాత్యుఁడు. నీతి తారావళి

పన్ని పగసేసివచ్చి బలవంతుని నుఱుంగు
దన్నుఁదానె చొచ్చితే దక్కిపోవుఁబనులు
తా. అన్నమయ్య. అధ్యా. సం.

చెలిమియ యుచితం బెంతయు
బలవంతునితోడ నతడు పగవాఁడైనం
జలియింపవంత కంటెను
బలవంతుని చెలిమి వడసి పగయీఁగదగున్
కనుపర్తి. కవిరాజ. I-124

బలవద్విరోధము

......ప్రబలుడైన యతనితో
వెరవునసంధి యొనర్చియుఁ
గరంబు నమ్మమియనీతిగాఁ గొంద్రుబుధుల్
తిక్కన. భారత. శాంతి. III-214

బలవద్రిపులు ప్రయోజన
ములకై లోఁబడుటగల్గుఁ బోలముల నేనుం
గులు దీమంబులపజ్జఁ ద
గిలి నెట్టన పట్టువడిన క్రియన్
తిక్కన. భారత. శాంతి. III-229

బలవంతుఁడైన శత్రుని
వలనఁ బ్రయోజనము గలిగి వలను కలిమిఁదాఁ

గలసియునది గడచనఁగాఁ
దొలఁగవలయు నమ్మె నేనిఁ దుదిఁ గీడొలయున్.

తిక్కన. భారత. శాంతి. III-238

వారని యల్కఁజేసి కడవన్ బలవంతుఁడు నిగ్రహించినన్
దూరము పోవుటొండె వినతుండయి వానిన నొచ్చుటొండెఁగా
కిరసమెత్తి కోల్ నుతివిహీనత నేనుఁగు తోడ లావునన్
బోరెడు నెన్మ చంద మది బుద్ధియె

బద్దెన. నీతి శాస్త్రముక్తావళి

బలియుండగు పగతునకెడ
గలిగిచనన్వలయు వాఁడు కార్యము కొఱకై
కలయఁగ వచ్చిన బేల్వడి
కలిపి కొనఁగ వలదు బుద్ధిగలిగిన మనుజుల్

మంచెన. కే. బా. చ. III-24

బలహీనులగుచు ధీమం
తుల కెగ్గులు సేసి పొందుదురు కీడుమహా
బలులయ్యు

మంచెన. కే. బా. చ. III-136

బలవద్విరోధము పాడిగాదు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా.

బలవద్విరోధము శుభం బొనరించునె యెంత వారికిన్

పాపరాజు. ఉ. రా. II-7

బలియునితోడుతఁ బగపూని యొరుల
చెలిమిఁదాఁ నెఱుఁగక సేయుటల్ దగునె?

వరద. రామా. కిష్కింధ.

బాహుబలాఢ్యుతోఁ బ్రతినదలిర్ప
నాహవం బొనరింప నతికీర్తి గలుగు

బాలసర. ద్విప. భార. సభా.

...మిగుల నెంతయు బలుఁడైన
కలితాత్ముతో సంధి కడు నొనర్చియును
ఒప్పు మీఱఁగ నమ్మకుండు టేనీతి

సోమన. ద్విప. భార. పభా.

బలవంతులతోఁ బగయును
బలవద్బాంధవులతోడి పగయును ధరలోఁ
బలువురతోఁ బగయునుమఱి
బలభేదికినైనఁ దెచ్చు భంగము

కనుపర్తి. I-123

కండక్రొవ్వుతోడఁగానక నేర్చిన
వానినెదురు కొనెడువాఁడు చెడును

అ. నారాయణదాసు. సూరుగంటి.

బహుభార్యాత్వము

ఒక్క పురుషునకు భార్యలు పెక్కండ్రగుటెందు గలదు

నన్నయ. భారత. ఆది. VII-244

ఒకకాంతన్గొనువాఁడు యోగ్యుఁడనఁగా నర్వేన్ వెలుంగొం
దు వే
ఱొకకాంతన్గొనువాడు మధ్యముఁడు నానూహింపఁజెన్నొందు
నిం

కొక కాంతన్ గొనువాఁడు దాసధమఁడై న్యాసస్థితిన్ గాంచునిం
కొకరీతిన్ బహుకాంతలన్ గొనినవాఁడస్మత్రుఁడై ద్రిమ్మరున్

కుప్పిలిసీతారామకవి. చిత్రవతీ పరిణయము. I-39

ఉవిద లెందరున్నను సౌఖ్యమొకటెకాని
కడచు కష్టఁబులెన్నియో నుడువఁగునె

పానుగంటి. కల్యా. రాఘ.

సతత నూతన కాంతానుషక్తి క్రొత్త
వేడుకయని యెంచుటకంటె వేరుపామ
రతయు నప్రాజ్ఞతయు ధీజడతయు నన్య
భావమును పశుత్వంబు పాపఁబు లేదు

పానుగంటి. వనవాస. రాఘ

ధరణిలోనఁ గొంచెము హెచ్చుతగ్గుగాఁగ
స్త్రీపురుష సృష్టి సమముగాఁ జెలగుఁగాన
నొక్కపురుషునకొక సతియుంటకంటెఁ
దగదనుచు జీవసృష్టి కర్థంబుగాదె

పానుగంటి. వనవాస. రాఘ.

ఇద్దరాండ్రఁ గల్గు నెంతటి వాఁడైన
నవ్వఁ బడును తుదకు రవ్వఁబొంది

• నారాయణదాసు. నూరుగంటి.

## బాధ

దిన దినముఁ బ్రాణులకు దీపనముచే బాధ
మనసు శాంతికి సదామమకారముల బాధ
తనివోని కోర్కులకు దైవగతి బాధ
వెడయాస చూపులకు వేడుకలచే బాధ

కడు వేడ్కలకు వియోగములు బాధ;
తొడవైన మెఱు కలకు దురిత బుద్ధులు బాధ
అరిది నిశ్చయమతికి ననుమానముల బాధ

అన్నమయ్య. అధ్యా. సం.

క్షుద్రబాధలచే నుపద్రవంపడు వేళ
నిద్రకంటికి వచ్చునా

రామదాసు. రామదాసు. చరిత్ర

చెప్పులోని ఱాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు నింతింతగాదయా

వేమన

బాధలభ్యాసమున సుఖప్రాయములుగ
నరులు భావింతు విపక్రిమి న్యాయమునను

చిలకమర్తి. గయోపాఖ్యానము. III–52

బాధమేనికే కూర్చు విరోధియైన
నదిస్వజనమైన హృదయంబు నదరజేయు

వేటూరి ప్రభాకరశాస్త్రి. ప్రతిమా.

## బాల్యము

తలుసంటి తను నెదరిని నెఱుఁగఁడు

నన్నెచోడ. కు. సం. VII–49

జన్మంబు మొదలుగాఁ బదునాలుగువత్సరంబులు
దాఁటునంతకుఁ బురుషుండు బాలుండు
వాఁడెద్దిసేసినఁ బాపంబుపెద్దపొరయదు

నన్నయ. భారత. ఆది. IV–272

చిన్ననాఁటి బలంబు సెప్పవచ్చినను
గ్రన్నన హాస్య కారణములై యుండు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. కిష్కిం.

బాలత్వమెల్ల కేళ్ళకు నాలయము

ఎఱ్ఱన. నృ. పు. IV-55

బాలురకును దాడనంబ పథ్యంబరయన్

పోతన. భాగ. X-366

డింభకులను దిద్దిదేవగా గైసేయ
బట్టరాని గర్వపటిమగంద్రు

వేమన

ఆట ప్రాయము నాటి ముక్కువ
అదివరకు ఉండేదే యెక్కువ

క్షేత్రయ

ఇలఁ బుట్టి పదునాలుఁగేడులదాఁక
తలఁపంగ నేరఁడు ధర్మంబు నరుఁడు
ఆలోని కర్మంబు లతని బ్రాపింపఁజాలవు

తిమ్మయ, ద్విప. భారత ఆది.

అతిశయ సౌఖ్య ప్రదమై
సతతము క్రొత్తయి యశోకసంవర్ధనమై
ఋతువులలోన వసంతము
గతి బ్రాయములందు బాల్యకాలము మెఱయున్

చిలకమర్తి. గయోపాఖ్యానము I-17

బుధులు

నిజమ్మెఱింగి కృతవస్తు సమితికి
వఱలఁగ మదినెఱుఁగు విబుధవర్గము

నన్నెచోడుఁడు. కు. సం. VII-26

బుధ జనంబులు శోకంబుఁ బొరయరధిప

తిక్కన. భారత. స్త్రీ. I-33

జలములోన మత్స్యంబులు మెలఁగుజాడ
లెఱుఁగరాని చందమ బుధులిచ్చ నడచు
తెరువు లన్యుల కెఱుఁగుటయరిది వానిఁ
దాను శాంతుఁడై దాంతుఁడై తడవవలదె

ఎఱ్ఱన. హ. వం. VIII-91

దుర్మతుల తెఱఁగు గైకొని
ధర్మమునెడ బ్రీతి వదలదగదు బుధనకున్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-41

తమవిద్య నెవ్వరేమా
త్రముగనఁ జాలుదురు వారి దండను దన్మా
త్రమ ప్రకటింతురు బుధు లు
త్తముల మహిమ నీరుకొలది తామర సుమ్మా!

సూరన. కళా. II-95

విమల మధుర మనోహర వృత్తివెలయు
వారిఁ గొనియాడ బుధులెంత దూరమైనఁ బోవుదురు

రామరాజు. వసు. II-129

గురు శాస్త్రార్థ గరిష్ఠులైన బుధుల న్గోపింపగారాదు

బాల సరస్వతి. మల్లభూపా. I-13

బుధుఁడైన గర్వంబుఁ బొరయఁడు విద్య

తిమ్మయి. ద్విప. భార. ఆది

బుధుల్ క్షమ సేయరెతప్పు గల్గినన్

పోచి. వీ. భల్లాణ చరిత్ర. III-30.

అరయ బరోపకార విమలాత్ములు గారెబుధేంద్రు లెప్పుడున్

కూచి. తిమ్మయ. రుక్మిణీపరిణయము. II-54

వాఙ్నియమంబుగల్గు బుధవర్యు లసత్యముఁ బల్క నేర్తురే

హీనుకాఱుల బుధుఁడు సహించుకరణి

రాలు చినుకులఁ బర్వతరాజిసైఁచు

విక్ర. దేవ.

బుద్ధి

జలము పృథివికంటె జలము కంటెను దేజ

మంతకంటె వాయు వాకసంబు

దానికంటెఁ బెద్దవాని కెల్లనుబెద్ద

మనసు బుద్ధిపెద్దమనసుకంటె

తిక్కన. భారత. శాంతి. IV-196

మతియకదా కృషిబీజము

మంచెన. కే. బా. చ II-34

పెక్కలు బుద్ధులు గఱచిన నెక్కుడు భయము

మంచెన. కే. బా. చ. III-45

దేవుఁడిచ్చినట్టి బుద్ధి దేవునిపయిఁ బెట్టక

అన్నమయ్య. అధ

భావమింద్రియాలకియ్యఁ బాపమయ్యా!

అన్నమయ్య. అధ్యా. సం.

అచ్చపుబుద్ధికి లేవగమ్యముల్

సూరన. ప్రభా. II-110

ఆపదవచ్చిన యపుడు సద్బుద్ధి
రూపింప నతఁడు విశ్రుతసిరిఁబొందు

సోమన. ద్విప. భారత. సాప్తిక.

తెలివి యొకరి సొమ్మా!

క్షేత్రయ

పూర్వ కర్మాను సారణి బుద్ధినడువ
ద్రిప్పు వారలు లేరని తెలియవాక్క
కాలచక్ర భ్రమణ మహాలీలఁ దిరుగు
దేహికి స్వతంత్రతయును బ్రోత్సాహమేది

పానుగంటి. సారంగధర. I

ఇష్టమొక్కటి జరిగెడు కృతి మఱొకటి
ధరణి నెల్లరకీగతి తప్ప దెపుడు
మనుజ బుద్ధికి స్వాతంత్ర్య మహిమ యున్న
సృష్టిలోనింత వ్యత్యాస మేలకలుగు

పానుగంటి. సరోజవి. I

ఒడలు చెడమడ దశదిక్కు లోహాటించి
లావగు కొలంది బుద్ధి విలాస మడఁగుఁ
గాదె? దయ్యపు గొబ్బరికాయ యెనుగు
కొలఁది నాంతర పల నీరములను బోలి

పానుగంటి. విజయరాఘవ. IV



బుద్ధి కెనయగు బలిమి యీభువినిలేదు

కోలాచలం. సునందినీ. V-77

బుద్ధి కర్మము ననుసరించుఁగాదె యెందు

తిరు. వేం. కవులు. పాణిగృ. II-116

## బుద్ధి ; కర్మ

మతి కర్మము వెనుకఁ జనకమానునె యెందున్

తిక్కన. భారత. భీష్మ. II-363

ఏకరస మయక్షేత్రమ
నేకౌషధి రసమయంబయినయట్లు సుమీ
యేకవిధమైన బుద్ధియ
నేకములగు కర్మముల మెయింబోక...

తిక్కన. భారత. శాంతి. IV-195

గతిని బట్టి మనుజమతియు నొప్పు

వేమన

## బుద్ధిబలము

బుద్ధిం గార్యము దలఁపని
బుద్ధివిహీనులను భూతములె శాసించున్
సిద్ధింప దారయ నస
ద్బుద్ధులకును రాజకార్య భూతులు గలుగన్

ఉరుతర దుస్తర వ్యసన మొందినఁ బ్రాగిభయంబుఁ బొందినన్
సురుచిర బుద్ధి సంయుతుఁడు శోకముఁబొందఁడు

మల్లికార్జునుడు. భా. రా. కిష్కింధ. 10, 71

ఎరికి బుద్ధిబలంబులు
కారణములుగావు సువ్వొ కలరె ధరిత్రిన్
నేరిచి బ్రతికిన వారలు
నేరక చెడ్డట్టివారు నీరజనేత్రా

మాదయగారి మల్లన, రాజశేఖర చరిత్ర

## బుద్ధిమంతులు

బుద్ధిగల వారికిఁ గ్రోధంబు గొనియాడం దగదు

నన్నయ, భారత, ఆది, III-148

కార్యసిద్ధి పొంటెఁగాలంబు దేశంబు
నెఱిఁగి బుద్ధిమంతులెల్ల ప్రొద్దు
సాహసంబు విడిచి సామాద్యుపాయపు
యుక్తి చేయుదురు యథోచితముగ

నన్నయ, భారత, అరణ్య. III-348

పామెఱుఁగుఁ బాముకాళులు
ధీమంతుండెఱుఁగ నేర్చుధీసాక్షిత్వ
శ్రీమంతుఁ బరమపురుషుని
ధీమల నిర్మోచనంబు తెలుగు నెఱిఁగినన్

తిక్కన, భారత, శాంతి. IV-182

అనలమునఁ గాఁచిలోహము
నెనయించిన కరణివేఁడి నేనియుఁ బ్రజ్ఞా
ధనులఁ దనుగూర్చి కొమ్మను
మనువచనము వినవె యదియ మతమెవ్వరికిన్

బైచరాజు. పంచతంత్ర. II-63

.........వైరులఁబిల్చి విందుచేసినను
మనసు నమ్మకయుండు మతిమంతులకును

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

మనుజులలో సామర్థ్యం
బెనసిన సద్బుద్ధిమంతు నెన్నఁగవలయున్

కుమార ధూర్జటి. కృష్ణరాయ. II-106

వైరిభయములేని వైపుల నుందురు
బుద్ధిమంతులయిన పురుషులెపుడు

దా. శ్రీ. దేవీభాగ IV-556

వెనుకముందు చూచుకొని తొందఱపడక
తెలివిఁగలుగువారు తిరుగుచుంద్రు
కలిగినంతలోనఁ గడపు కొనుంగాని
తెలివిఁ గలుగువాఁడు కొలువఁబోఁడు
తెరిపిసెప్పువాని తెన్నును పరికించి
తెలిఁవిగలుగువాడు తిరుగుచుండు

అ. నారాయణదాసు. నూరుగంటి.

కరములరుగునంత సరణి రవి వెలుంగు
మెఱయునెల్లకడల కరిగి బుద్ధి
కానబుద్ధిమంతుఁడైనచో నెల్లెడ
వెలయఁ గలుగువాఁడు వెలయువాఁడు

వెంకటపార్వతీశ్వరకవులు. చిత్రకథాసుధాలహరి

ప్రతిభగలవాడు సామాన్య పంచజనుని
సారమును గోరడెపుడును సత్యమిద్ది

తీక్ష్ణకర భాసమానుఁడౌ దినకరుండు
కాంతిసేయునే దీపంపుఁగాంతినెందు

విక్ర. దే.

బ్రతుకు

కుచ్ఛితంపు బ్రదుకు గోరఁదగునె
తిక్కన. భారత. విరాట. I-282

కాని తెరువునఁ బోయినఁ గలుగునయ్య బ్రదుకు
తిక్కన. భారత. విరాట. II-73

జీవితమున్నఁ గీర్తిమఱి చేరదె
ఎఱ్ఱన. భారత అరణ్య. VII-2991

నానాటి బ్రదుకు నాటకము
పుట్టుటయు నిజము పోవుటయు నిజము
నట్టనడిమిపని నాటకము
తెరమఱుఁగు మొకమువలె దిరుగు
నీబ్రదుకు చద్ది సంసారమున వరుస సుఖదుఃఖములు
అన్నమయ్య. అధ్యా. సం.

మనుటలెల్ల కల్లమనసెల్ల దొంగ
బ్రతుకు నిత్యమనుచు బదరుచు వగమీఱి
విఱ్ఱవీగువాడు వెఱ్ఱివాడు
సకల సంపదలను సారస్యమెఱుగని
వంచనగల మనువు వాడిపోవు

వేమన

తను లోకులభినుతింపగ
మనఁగలిగిన మనికి నిమిషమాత్రమె చాలున్

బైచరాజు. పంచ. I-135

బ్రతికియుండినఁగల్గు భద్రంబులెల్ల

వరద. రామా. సుందర.

బ్రదుకు కన్నను బుణ్యఫలములుగలవె

సోమన. ద్విప. భారత. శల్య.

బ్రదికిన శుభములు బడయంగవచ్చు

సోమన. ద్విప. భారత. కర్ణ.

మహానిల పరిఘట్టితాబ్జదళ నీరతుషారము జీవితంబు

ఏ. ల. కవి. సుభాషి. III-35

బ్రతికియుంటేను బహునాళ్ళకైన అరయగ
సుఖములు పొందగవచ్చు

శ్రీ. గోపాల. సంపా. కుశల.

అడవిగని పాఱవైచిన నైన బ్రతుకు
తల్లికడుపు చల్వయొకింత తగ్గదేని

కం. పీ.

హాయిగానుండు ముందగు లెస్సబ్రతుకు

అ. నా. దాసు. రుబాయత్

బ్రతుకెల్ల నన్నాయుత్తరిత్త

అ. నా. దాసు. వేల్పుమాట

తనదు బ్రతుకున తీపిలేదనెడు వాఁడు
చావు చేరంగ వచ్చినఁ జావలేఁడు

అ. నా. దాసు. నూరుగంటి.

వస్తువెద్దాని కొం బ్రదుకు వాఁడెకాని
బ్రదుకు కొఱకునె బ్రదికెడు వాఁడులేఁడు

పానుగంటి. బుద్ధ. II

ప్రాణులెంత యజ్ఞులో కట్టా! బ్రదుకనంగ
నిం తెకద యిట్టి మిఱుమిట్టి యిరులుగాదె

పానుగంటి. కల్యా. రాఘ. IV

## బ్రహ్మచర్యము

పెక్కండ్ల భిక్షగుడుచుట
చక్కని ధర్మంబు బ్రహ్మచారికి

కేతన. విజ్ఞా. ఆచా. 64

ఉపనీతుండయి బ్రహ్మచారి వినయం బొప్పన్గురుంజేరి భ
క్తిపరుండై పనులెల్లఁ జేయుచు సకృద్భిక్షాశియున్
శాంతుమున్
విపుల ప్రీతియుతుండునై సతతమున్ వేదత్రయాభ్యాస వా
క్య పటుత్వంబు భజించిసల్పదగు నయ్యాద్యాశ్రమా
చారమున్

మారన. మార్కం. III-143

అకారణబ్రహ్మ చర్యంబు పాపహేతువు

మారన. మార్కం. VII-154

నిర్మల బ్రహ్మచర్యైక విష్ఠఁదగిలి
యాత్మఁదలపోయఁ డొండొక్క యాశ్రమమును
గోరి వెన్నెలగ్రోలు చకోరమునకు
రుచులు కలుగునె తక్కిన రుచులయందు

పుత్రపౌత్ర కళత్రాది పోషణార్థ
సంతతోదిత చింతాతి సంకులంబు
చాలగార్హస్థ్య ధర్మంబు సంయమీంద్ర
హర్ష కరమైన బ్రహ్మచర్యంబు సరియె?

బ్రహ్మచర్యంబు వేదసంభాషితంబు
బ్రహ్మచర్యంబు మౌనిసంభావితంబు
బ్రహ్మచర్యంబు మోక్షసంపాదకంబు
బ్రహ్మచర్యంబు విడువఁగారాదు

దుగ్గన. నాసికేతు.

ఋతుకాల భార్యాభిగమనంబు దక్కఁ
దక్కిన-చోట్లఁ దద్విహారమును మానుటయ
గృహస్థునకు బ్రహ్మచర్యంబు

సన్యాసికిని బ్రహ్మచారికి నైష్ఠికుం
డగువనస్థునకు నోయనఘ చరిత
స్త్రీసంగమంబును త్రికరణంబులయందు
నొకయప్పుడును జేయకునికి బహ్మచర్యంబు

సూరన. కళా V-148

బ్రహ్మచర్య మొనరఁ జేయవలె

విక్ర. దే.

## బ్రహ్మజ్ఞానము

తన్నుఁ గేవలమాత్మగాఁ దలఁచియిష్ట
తుతిశయము దృఢముగ జూచునదుపుగాని

జన్మదుఃఖజరావ్యాధి శాంతికరము
బ్రహ్మవిజ్ఞాన మూరక పట్టుపడదు

వహ్ని సందీప్తమై వహావనమునందు
సరస నీరసతరుల భస్మంబు సేయు
బ్రహ్మవిజ్ఞానమును నట్లు ప్రజ్వరిల్లి
శుభమునశుభము నొకటిగా సుడిచికొల్చు

జలజ పత్రంబు తనమీఁదఁజల్లియున్న
యుదకబిందులతోఁ గూడకున్న యట్లు
బ్రహ్మవిజ్ఞాని తనమీఁద బడినయట్టి
విషయ మలమునఁ బడకుండు విమలచరిత

బ్రహ్మవిజ్ఞాన నయశాలి భాగ్యశాలి

శ్రీనాథుడు. భీమ. V-135, 188, 189, 193

రేచకములోన సూక్ష్మంబు జూచిమిగిలి
పూరకంబున గమనించి పుడమిసొచ్చి
కుంభకంబున శివునంటి కూడుకొనర
సుస్థిరత బ్రహ్మమును గాంతుసారిది
అమగ కర్థమిచ్చు నతడు బ్రహ్మజ్ఞాని

వేమన

బ్రహ్మము నెఱుంగ నరుఁడెన్ని పాట్లు బడిన
నన్ని వెత్తిపోక లసంధు లతిశయించు
తెలియలేని దెఱుఁగుబెట్టు తెలియకుంట
మతియెలేని తెలివికంటె మంచిగాదె

పానుగంటి. విప్ర. -I

మనసు గాకున్న దొకటైన మాయలేదు
మాయగాకున్న దొకటైన మనసులేదు
అఖిల జగము మనోమాయలగుటఁ దెలిసి
బ్రదుక నేర్చిన వారలు బ్రహ్మవిదులు

పరశురామ పరితుల లింగమూర్తి. సీతారామాంజనేయ సంవాదము

## బ్రహ్మము

పట్టినదెల్లా బ్రహ్మము దట్టవు జడునికి దైవంబేలా ?
యాచకునకు కనకమే బ్రహ్మము తనువే బ్రహ్మముతరువలికి
కాముకున కింతులే బ్రహ్మము ఆకటి వానికి నన్నమేబ్రహ్మము
లోకమే బ్రహ్మము లోలునికి
కర్మికి కాలమే బ్రహ్మము సంసారికి పుత్రులే బ్రహ్మము
పట్టినదే బ్రహ్మము పరమార్థ వేత్తలకు
తిట్టులో నా దైవము దివ్యులకును
ఊపిరిలో దేవుఁడున్నాఁడు యోగీంద్రులకు

అన్నమయ్య. అధ్యా. సం.

సకలాకారు డనంతుడు
సకలాత్మల యందు సర్వసాక్షియు దానౌ
సకలగత నిర్వికారుం
డకలంకస్థితిని బ్రహ్మమనబడు

పరకాంతా సోదరుడై
పరధనములపైన భ్రాంతిపడకుండి తనుం
బొరిగొను కోపముతోడను
బరులలిగిన నవ్వువాడె బ్రహ్మము

వేమన

నభంబుగతి బ్రహ్మము దాఁజెడకుండు నెప్పుడున్
పోతన. భాగ. II-210

కర్మసాక్షికిం బరువడిఁ బొందవెన్నటికిఁ
బ్రాకృత దోషము లంగనామణీ
పోతన. భాగ. III-916

అద్వయము సచ్చిదానందమ ప్రతర్క్య
ముపనిషద్గతమగు బ్రహ్మ మొకటి సూవె
చెడదు పుట్టదు పెరుగదు జీర్ణభావ
మందదు స్వయంప్రకాశమై యమరుచుండు
లక్ష్మణకవి. రామేశ్వర. V-100

ఎందును సంచరింప కఖిలేంద్రియముల్ సుఖమొంద డెందమున్
బొందుగఁ గన్నుఁ దాఁగుఅవ బుద్ధికగోచరమైనయట్టియా
నందము బ్రహ్మమందురు
సముఖము. అహల్యా. III-27

బ్రహ్మవిద్య

విద్యల లోపల నీతియు
వాద్యంబులలోన వీణ వరరసికులకున్
హృద్యంబై విలసిల్లిన
విద్యలలో బ్రహ్మవిద్య విద్యర

చదివి చదివి చదివి చావంగ నేటికి
చావులేని చదువు చదువవలయు

అతినిద్రావంతున కు
న్నతి పానికినిరశనునకు నతికోపునకున్

ధృతిహీనవ కపకృతునకు
జతపడదీ బ్రహ్మవిద్య

వేమన

నేరఁగలదొక్కటే నిశ్చల బ్రహ్మవిద్య

అన్నమయ్య. అధ్యా. సం.

చిరకాలమైయున్న జీవభావంబు
పరగ నాహుతిగొను బ్రహ్మది విద్య

తిమ్మయ. ద్విప. భార. ఉద్యో

## బ్రహ్మానందము

మలసి దేహానందమే మరగిన యాత్మకు
తొలుత బ్రహ్మానందము దొరకదు
ఏటి విజ్ఞానమేటి చదువు
గుంటఁబడి వెడలుగతి గుఱుతుగనలేదు

తిరువేంకటేశుంగని జీవుండా
సదమలా నందంబు చవిగానలేదు

అన్నమయ్య. అధ్యా. సం.

కలుషములనెల్ల ఖండించు గతినెఱింగి
చిన్మయానంద పట్టాభిషిక్తుడైన
వాని నెన్నంగదరమె? యీ వసుధయందు
బరమ శివుడను వర్ణింపబడును

వేమన

బ్రహ్మానంద సాగర మీఁదని దేహము భూమిభారము

త్యాగరాజు.

## బ్రహ్మక్షత్రములు

నిండుమనంబు నవ్య నవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుతవిప్రులయందు నిక్కమీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁడోపునో
పండతి శాంతుఁడయ్యు నరపాలుఁడు శాపముగ్రమ్మునిలింపఁగన్

నన్నయ. భారత. ఆది. I–101

బ్రహ్మక్షత్రంబులు పరస్పర సంశ్రయంబులు

ఎఱ్ఱన. భారత. అరణ్య. IV-205

## బ్రాహ్మణ్యము

పాప వర్తనుండు బ్రాహ్మణుండయ్యును
నిజము శూద్రుకంటె నీచతముఁడు
సత్య శౌచధర్మశాలి శూద్రుండయ్యు
నతఁడు సద్ద్విజుండ యనిరి మునులు.

ఎఱ్ఱన. భారత. అరణ్య. V–137

దయయు సత్యంబు శౌచంబు దైవభక్తి
యింద్రియ నిరోధ మెవనికి నెసఁగు నతఁడు
ద్విజుఁడె వేదము తలక్రిందుగఁ జదివినను
పితద్విజుండైన మాత్రాన విప్రుడగునె

పానుగంటి. విజయ. రాఘ.

## భక్తి

తలఁచి పిలిచిన భక్తవత్సలుఁడు రాఁడె

వన్నెబోర. కు. సం. II–19

శివుఁడను నేవనశ యునికి శివభక్తియగున్

మలహారు భక్తులఁ బెద్దలు
కులజులు కులహీనులనఁగఁ గూడదు

క్రియలు సాలఁగ శివభక్తిలేక సహజములగునే

పండిత. శివ. సా. 316

అయ్యోడి నోకాదోకా
దయ్యోడినో యనుచు సంశయంబుడిగి శివున్
నెయ్యం బెలర్పఁగొలిచిన
యయ్యకవశ్యమును భక్తియగు త్రిపురారీ

భూతియు రుద్రాక్షలు న
త్యాతత బహువేషరచనలవి తోడవులె ? సం
ప్రీతిగ భక్తునకుం బ్ర
ఖ్యాతిగ సద్భక్తి తొడవుగాక మహాత్మా

ఈకులమాకులమనక ని
రాకులమతి వారికొంటఁ దలరయక భక్తా
నీకము శివుఁడని కొలిచినఁ
జేకొనఁడే వాంఛితార్థ సిద్ధి మహాత్మా

భావింపఁగ సద్భక్తుని
భావం బెట్లట్లతోచుఁ బరమేశుఁడు "య
ద్భావం తద్భవతి" యని క
దా వినబఁడు శ్రుతులలో నుదార చరిత్రా

నయమును బ్రియమును నధిక వి
నయమును బాయని భయంబు నమ్మికయును ని

ర్ణయము నిర్ణించకతయుఁ
గ్రియకొనఁగా సహజ భక్తికిని హేతులగున్

నిత్యంబుగాని యొడలికిఁ
బ్రత్యహము పెద్దదుఃఖపడవలెనన్నన్
నిత్యపదంబగు భక్తికి
నత్యంతము దుఃఖపడకయగునె మహాత్మా.

పిలిచిన పని యేమనకయు
తలఁచిన తలఁపెఱిఁగి వారి తలఁపమగమియున్
గెలుపిచ్చి కీడు వడుటయుఁ
గలుగుట యది శుద్ధభక్తిగతి త్రిపురారీ

ఉపజీవికత్వమతియును
జపలత్వమునాస్తికతయు సందేహంబున్
గపటంబుఁ గంటకంబును
నుపమింపఁగ సహజభక్తి యుక్తికిఁ గలదే

అడుగమి నిచ్చుట యుత్తమ
మడిగినయెడ నీఁగి యెన్నసగు మధ్యమ మ
ట్లడిగిన యెయ్యోఱపులఁ దా
నికుటయె యధమంబు భక్తియెడ త్రిపురారీ

పా. సోమన

కల్పవృక్షంబదేటికిఁ గామధేను
సముదయంబేల యిష్టార్థ సంపదలకు
నిశ్చయంబుగ మనసులో నిల్చెనేని
చాలదామర్త్య రక్షింప శంభుభక్తి

శ్రీనా. భీమ. V-143

మరవఁగ మరవఁగ మాయలెయింతా
మురహరుఁ దలఁచితె మోక్షము

దైవము నమ్మిన దాసులకు
కావింపగ మరి కర్మయు లేదు
దావతి జలనిధి దాటినవారికి
ఓవలమరియును ఓడేలయ్యా

పరిపరి విధముల భవరోగములకు
హరిపాద జలమె యౌషధము

అన్నమయ్య. అధ్యా. సం.

ఏమహాత్మునందు నీజగంబులుపుట్టె
నామహాత్మ్మ భజన యనువుమీఱ
నీమనిష్ఠ నెఱపి నెమ్మది గనవలె

కాలాకాలము నందును
మేలుగ శివునంట ముక్తిమెలగు

హాని గలుగబోదు హరిమదినెంచెడు వానికి

శివయను రెండక్షరములు
భువిలో నెవడైనగాని పొలుపు దలిర్పం
దవిలియొక నూఱుమాఱులు
ప్రవిమలముగ వల్లెవేయబరముడు

భక్తిగల్గు పూజ బహుకాలముండు

భక్తిగలుగువాడె పరమార్థ పరుడయా

భక్తిదగుల ముక్తి బడయుట సులభంబు

భక్తిలేక పాడ ఫలముగలదె?
భక్తిలేనిపూజ ఫలములేదు
భక్తిగలుగుకూడు పట్టెడైననుజాలు
నిక్కమైనభక్తి మ్రొక్కిననేజాలు

వేమన

నానా హోమములెల్ల బూడిదల లోన వ్రేల్చు నెయ్యై చను
న్నీ నామోక్తియు నీపదాబ్జ రతియున్ లేకున్న నారాయణా

పోతన. నారాయణ శతకము. 62

అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు

పోతన. భాగ. VII-150

ఎందుఁగలఁడు విష్ణుఁడందు జయశ్రీలు
పొందుగాఁగ వచ్చి పొందుచుండు

పద్మనయను మీఁది భక్తి యోగంబెల్ల
ముక్తి యోగమనుచు మొదలెఱుంగు

సింగయ. భాగ. VI-191, 973

మాధవార్పితముగా మనని మానవుసిరి
వన దుర్గ చంద్రికా వైభవంబు

చక్రికి మ్రొక్కని జడుని యౌదల నున్న
కనక కిరీటంబు గట్టిమోపు

నారాయణుని దివ్య నామాక్షరములపైఁ
గరగని మనములు గఠిన శిలలు

పోతన. భాగ. II-51

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సుర రక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము

అంధేందూదయముల్, మహాబధిర శంఖారావముల్, మూక స
ద్గ్రంథాధ్యాపనముల్, నపుంసక వధూకాంక్షల్, కృతఘ్నావలీ
బంధుత్వంబులు, భస్మహవ్యములు, లుబ్ధద్రవ్యముల్, క్రోడ స
ద్గంధంబుల్, హరిభక్తి వర్జితుల రిక్త వ్యర్థ సంసారముల్

చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు

విష్ణు భక్తిలేని విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి పశువు గాక

చక్రి చింతలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబు గాక

పోతన. భాగ. VII- 168, 169, 170

భక్తి సులభక్రమంబున ముక్తి నిచ్చు

దా. శ్రీ. దేవి. భాగ. VII-829

శ్రీనాథ పరాఙ్ముఖులగు
హీనులు వొందంగజాలరిష్టార్థంబుల్
పోతన. భాగ. VIII-326

పస చెడ కేలయుండు హరిపాద పరిష్కృతి సేయనాపదల్
పోతన. భాగ. VIII-343

శ్రేయములు కురియు భక్తిని
జేయక కేవలము బోధసిద్ధికిఁ దపముం
జేయుట విఫలము ; పొల్లున
నాయము సేకుఱునె తలఁప నధికంబైనన్
పోతన. భాగ. X-551

శ్రీపతి యదుగుల గొడుగుల
ప్రాపొదవినవారి దావభరమేలంటున్

......ఏ తెఱగులఁ దిరిగినఁ
గలుగదు గతి విష్ణుసేవఁ గావింపకయున్
తెనాలి రామకృష్ణుడు. పాండు. మహా. IV-17, 276

భద్రగిరీశుని భక్తిలేని
నరుడుపరమును గననేర్చునా ?
రామదాసు. రామదాసు చరిత్ర

ఎదను శ్రీరామభక్తియులేని నరజన్మ
మెత్తియేమి యెత్తకుండిన నేమి ?

సద్భక్తి సంగీత విజ్ఞాన విహీనులకు
మోక్షము గలదా ?
త్యాగరాజు

అమృతమును బొందు నరునకు నన్న మేల
భక్తి గలుగంగ నైహిక వాంఛయేల ?

భక్తిలేని జ్ఞాన పరిపాకమే లేదు
భక్తిలేక యున్న ముక్తిలేదు

రాగ పరిణామమే భక్తి రమణులార !

పానుగంటి. రాధాకృష్ణ.

కర్మయుక్తంబుగనొ జ్ఞాన కలితముగనొ
భక్తి వెలయును మనుజ హృత్పంకజమున

వ్ర. దే.

## భక్తి : రక్తి

అప్పుడే గోవిందునికి ఆహివెట్టితిఁ జిత్తము
ఇప్పుడు ఎమ్మెలను ఏమి సేసేరింకను ?
చెంగలించి వేంకటేశు సేవకుం జొచ్చితిమి
ఎంగిలి మోవులును మీరేడఁ బడేరింకను ?

అన్నమయ్య. అధ్యా. సం.

భక్తి యెదురెత్తు గాన నింపాది నడక
రక్తి పల్లపు వాల్గానఁ బ్రబలవేగ
యుతము మార్పడి చేత నా సతత భక్తి
మఱలి తలక్రిందుగా నట్టె దొరలు నపుడె

అడచిపెట్టిన భక్తి హృత్స్వాంతరమున
వెలిఁ బడిన యుష్ణ శీకర చలనమొందు
నట్టె బిగువుగ దట్టించినట్టి మందు
రంజకం బంట ధామ్మని ప్రబలినట్లు

సంగయుతులకు భూషలౌ స్వర్ణకాంత
లగును దూష్యము లధిక భక్త్యం చితునకు
వారి కతి దూష్య హేయమౌ భక్తిమార్గ
మగును పరమ భూషణము భక్తాధికునకు

భక్తి రక్తులు వేఱుతత్త్వములు కావు
భక్తి దైవానురాగము వనితపైని
రాగ మగురక్తి యది యిది రాగమొకటె
తత్త్వవాహాది గతులె భేదములు సుమ్ము

పానుగంటి. విప్ర.

## భక్తుడు - భగవంతుడు

తను నెబ్భంగిఁ దలంతురు
జనులా భంగిన తలంచు సరసీ రుహాలో
చనుడును వారల

ఎఱ్ఱన. నృ. పు. II-32

కొంత నా కర్మఫలము కొంత నీరక్షకత్వము
అంతర్యామివినీవు ఆడేటి బొమ్మను నేను
చెంతగాచుట నీపని సేవించుట నాపని
నేనపరాధినయ్యేది నీవు వహించుకొనేది
పదివేలు నా నేరాలు పట్టకుమీ యింకను

అన్నమయ్య. అధ్యా. సం.

భక్తుఁడెందు జనిన బఱతెంతు వెనువెంట
గోవు వెంట దగులు కోడె భంగి

పోతన. భాగ. IX-120

జ్ఞానులచే మౌనులచే
దానులచే యోగ సంవిధానుల చేతన్
బూని నిబద్ధుండగునే
శ్రీనాథుఁడు భక్తియుతుల చేతంబోలెన్

పోతన భాగ. X-390

ప్రియురాలి వలని వార్తలు
ప్రియ జనులకు నెల్లప్రొద్దు బ్రియమగు భంగిం
బ్రియుడగు వారి చరితంబులు
ప్రియభక్తులకెల్లయెడల బ్రియములుగావే

పోతన. భాగ. X-489

తనువే నిత్యముగా నొనర్ప మది లేదా చచ్చి జన్మింపకుం
డనుపాయంబు ఘటింపు మీగతుల రెంటన్నేర్పు లేకున్న లే
దని నాకిప్పుడె చెప్పు చేయఁగల కార్యంబున్న సంసేవఁజే
సి నినుం గాంచెద.

ధూర్జటి. కాళ. 37

భక్తులు

అనీహ మానుండయి దైవపరుండయిన వాఁడు
నీరిలోని యాన పాత్రంబునుంబోలె నవపన్నుండగు

నన్నయ. భారత. అరణ్య. I-236

......దృఢభక్తులకును
సురనర విభవంబులెంత చోద్యములు

......దృఢ భక్తుడు
చలియింపఁడపార ఘోర సంసారమునన్

పండిత. శివ పా.

కన్నిడునే పరసతులకుఁ
దన్నిడునే భక్తుడన్య దైవంబులకున్
వెన్నిడునే భవములకును
మున్నిడునే మనము విషయములకు మహాత్మా

చేరునె మానవ సంగతిఁ
గోరునె దుర్వ్యసన సుఖముఁ గుటిలాత్ముండై
పారునె సుఖగోష్ఠి యెడల
గోరునె పరధన నిషక్తి గురురత్ననిధీ

ఎన్ని ముఖంబుల నర్థముఁ
బన్నుగఁ బడసియును దారుపడసితి మనర
త్న్యున్నతిఁ గుడువరు ముడువరు
చెన్నటి పనులకు వ్యయంబుసేయరు భక్తుల్

క్రియఁగొన భక్తుండై బం
టయి భానిసయై నిజాప్తుడై యొక్కటఁబెం
టయి తుడువగఁ జీపురుదా
నయి జంగమ భక్తి సేయునతఁడీశుఁడగున్

పా. సోమన

భక్తి మత్పురుష శ్రేష్ఠులఁ బూజసేయుట మహా పుణ్యంబు

పలు తీర్థంబుల గుంకుకంటె మహిలో భక్తాంఘ్రి పానీయముల్
తలమీఁదన్ చికిలించుకోఁదగును

......సాక్షాద్భక్తులం జూచినం
బరమార్థంబుగఁ బాయదే నరుల పాపంబెల్ల

తీర్థములందెల్లను దివ్య తీర్థమన సద్భక్తుండు

యథా. అన్నమయ్య. సర్వే. ४४.

శ్రీ వేంకటేశు దాసాను దాసుండైతే
మక్కువ నవ్వంగాములు మఱియేల ?
దిక్కుల నేనుఁగు నెక్కిదిడ్డి దూరఁ బోతేను
వెక్కసమౌఁగాక యిది విన సంగతౌనా ?

నీదాసుల పంచ నీడ నుండితేఁ జాలు
ఆదినారాయణ నాకు నిదియె వ్రోవ్రతిము

ఎలమి హరిదాసులు ఏజాతియైననేమి ?

హితవు నీకు నైతే నే పనియైన నౌను
ఇల నీకు వలసితే నేపని యైన నౌను

ఎన్ని నేరాలైనఁ జేసి యేమిటందరని తప్పు
ఉన్నతి నీ లెంకనైతే నూరకే పోవు

భక్తుండేమి చేసినను చేకొని లోకములోన చెల్లుబడులే

హరిఁ గొలిచినవారి కమరు నన్ని సుఖాలు
భాగవతులైన వారు పట్టిన దెల్లా నీడేరు

హరిదాసున కంటునా ? పాపములు
హరిదాసులఁ జేరునా ? బంధములు
హరిదాసుల నందునా ? అజ్ఞానము

పాపమైన మంచిదే బలు పుణ్యమైన మంచిదే
శ్రీపతిని శరణన్న జీవునికిని

హరిదాసు లిత్తురు బ్రహ్మానంద సుఖము

ఎక్కడి పాపము ఎక్కడి పుణ్యము
దక్కిన శ్రీపతి దాసునికి
పక్కన లోహము పరుసము దాకిన
ఎక్కువ నంతా హేమమె కాదా?

అన్నమయ్య. అధ్యా. పం

పరమ పదవిగోరు భక్తుండు నిత్యము

తేనెపెరల జాడ తేనెటీగ యెఱుంగు
సమరసంబు జాడ భ్రమర మెఱుగు
పరమ యోగిజాడ భక్తుం డెఱుంగును

శ్రీకరు బ్రహ్మకారుని
ప్రాకటముగ మదిని జేర్చి ప్రణవాకృతిలో
సోకి నటించెడు జ్ఞప్తిని
బాకము గని దాటువాడె భక్తుడు

వేమన

.........స్వర్గమేనియు నపవర్గమేని
భాగవత సంగలవ భాగ్యఫలము కీడె?

పోతన. భాగ. I-412

భగవద్భక్తులు సుజనులు
దగవెఱిగి పరోపకార తాత్పర్య వివే
క గరిష్ఠులై చరింతురు

పోతన. భాగ. III-164

అవ్వనరుహ నాభు దాస జన వర్యుల కుం
గలవే యసాధ్యముల్

పోతన. భాగ. X-814

హరి భక్తులతో మాటలు
ధర నెన్నడుఁ జెడని పుణ్యధనముల మూటల్

సింగయ. భాగ. VI-153

సిరులు దనరంగ నెన్నడుఁ జేటులేని
పదవి నొప్పారు వారువో భాగవతులు

సింగయ. భాగ. VI-153

పరవధూ పరధన పరనింద లొల్ల
రరయంగఁ గలలోననైన వైష్ణవులు
హరికన్న హరిభక్తు లధికులే యనుట

తాళ్ళపాక. తిరు. వెం.

హరిభక్తి యుక్తులకు నాపద రాదు గదన్న యెన్నడున్

తెనాలి. పాండు. మాహా. V-261

హరిదాసులకు పూజ లాచరించిన చాలు
హరిని పూజ సేతున నే యహామ దేటికే

భాగవతుల పాదజలము పైని జల్లుకొన్న జాలు
బాగుమీరిన యట్టి యమృతపాన మేటికి

రామదాసు చరిత్ర

హరిభక్తుల నర్చించని
నరజన్మంబులకు మోపు నాలుగు దేసలున్

కరముల నర్చించి కనులార సేవించు
వర ధీరులందు శ్రీవరదుఁ డుండు

త్యాగరాజు. ప్రహ్లాద

గంధ గజ మెక్కు భూపతి ఘనుఁడు కాఁడు
ప్రాణ వాయువులను బిగ్గ బట్టి మింట
నుండు వాఁడు ఘనుండు కాఁడొడలు తెలియ
కిలను బొరలు చుండెడు భక్తుఁడే ఘనుండు

పానుగంటి. విప్ర. VI

వర్ణ లింగ నామాకృతి ప్రముఖ భేద
ములు బహిస్తనువునకె తజ్జడ సుఖముల
విడుచు భక్తున కవిలేవు వివిధ భేద
ములు సుమములకె మకరందమునకు లేవు

పానుగంటి రాధాకృష్ణ

హరి శరణమంది వర్తిల్లు నరుడు పోలె
లోఁతు నీట నుండెడు చేపలు సుఖయించు

విక్ర. దే.

భగవంతుఁడు

సర్వేశ్వరుఁ డెప్పుడు భక్తులకుఁ బ్రసన్నుఁడ కాఁడే

నన్నయ. భారత. ఆది. VIII-167

......అచ్యుతుండు పూజితుఁ డగుడుం
దేజమున జగత్త్రితయము
పూజితమయి తృప్తిఁ బొందు

నన్నయ. భారత. సభా. II-28

తలపునకు వాసుదేవుఁడు
గలిగింపను నిలుప నడఁపఁగా నోపు జగంబుల

తిక్కన. భారత. ఉద్యోగ. II.316

స్థావరముల జంగమముల
నా విభుఁడు వసించునతని యందునవి నిస
ర్గావాసత నుండును ద
ద్భావన మెఱుఁగుట తదైక్య పదముం జేర్చున్.

తిక్కన. భారత. శాంతి. V-110

హితవగు బందుగు డీశ్వరు డొకడే

దైవమొక్కఁడే సంతత భజనీయుఁడు
తలచినంతటిలోనె దైవ మెదుట గలఁడు
కొలువ నేరనియట్టి కొరతే కాని
అంచెల జగములకు హరియే ఆధారము
పొంచిన వేదార్థముల పురుషార్థమతఁడు
పుట్టించిన దేవుఁడే ప్రోవగలడు

హరి యవతారములే యఖిల దేవతలు
విష్ణుడొక్కడే విశ్వాంతరాత్ముడు

గోవిందుని పాదములె కోరి యిహాపరములు

కలడు సర్వేశ్వరుడొక్కడు దిక్కందరికిని
ఉన్నాడు మనసులోనే ఒక్కచో వెదకవద్దు

ఉన్నతి నిష్టార్థసిద్ధి కొక్కడే దేవుడు
కల దేవత లిందరు కర్మఫల దాతలే.

అన్నమయ్య. అధ్యా. సం.

కమలభవుడు సేయు గడు సృష్టియందురు
హరిభరించు జంపు హరుడటంచ్రు
మూర్తులిందరైన మూలమొక్కండె రా

వేమన

హరి మయముగాని ద్రవ్యము
పరమాణువు లేదు

రక్షకులు లేనివారల
రక్షించెద ననుచుఁ జక్రి రాజై యుండన్
రక్షింపుమనుచు నొక నరు
నక్షముఁ బ్రార్థింపనేల యాత్మజ్ఞులకున్

పోతన. భాగ. II-17, 22

సర్వ శరీర ధర్మముల్
గలిగి రహించు నీశునకుఁ గల్గనేరవు కర్మ బంధముల్

పోతన. భాగ. III-240

మరులుపెట్టిన వారి మాయలు గాక
పరికింప దైవమే పట్టునఁగలడు

గౌరన. నవనాథ

సతులెవ్వరు సుతులెవ్వరు
పతులెవ్వరు మిత్రశత్రు బంధుప్రియ సం
గతులెవ్వరు సర్వాత్మక
గతుఁడై గుణసాక్షియైన ఘనుడొక్కనికిన్

సింగన. భాగ. VI

ఈశ్వరుఁడొకకర్త యేనియు నేలసేయు
నొకనిఁ బాపాత్ముఁనొక్కని సుకృతమతిగఁ
బక్షపాతంబుగలదె యాప్రభుని కెందు
జనకునకుఁ బుత్రులందఱు సములుగారె

భవానీశకవి. ధర్మ. III-63

అఖిలాండకోటి బ్రహ్మాండనాథుఁ డంతరంగమున
నెలకొనియుండఁగ నిఁకఁ గావలసినదేమి ?

త్యాగరాజు

శివమై చిన్మయమై యఖండమయి యచ్ఛిన్నమ్మంతమై నిత్యమై
భవపాథోనిధి నావమై మునిజనప్రాణంబునై యద్భుతా
ర్ణవమై నామవికారరూప రహిత ప్రాశస్త్యమై వెల్గువి
ష్ణు విరించీశ్వర నాథ తత్త్వము మమున్ శోభిల్లఁగాఁజేయుతన్

కట్టమంచి రామలింగారెడ్డి. ముసలమ్మ మరణము

## భగవంతుఁడు - జగత్తు

ఇన్నిటిమూలం బీశ్వరుఁ డాతని
మన్ననకోలఁది మలయుట
మాయమయమై మనియెడి జగమిది
కాయము సుఖదుఃఖములకుఁ బొత్తిది

దైవాధీనము తగిన జగమిది
దేవుఁడు మోక్షాధీనము

అన్నమయ్య. అధ్యా. సం.

## భగవంతుఁడు - మానవుఁడు

అంతయుఁ జూచిన హరిసంకల్పము
చింతలు సిలుగులు జీవులవి

సిరులందించఁగ శ్రీ వేంకటేశుఁడు
పరగుభోగములై ప్రాణులవి

దేహమునకు నీడతిరిగిన యటువలెనే
శ్రీ హరికిని కళావిధమై జీవుఁడటుతిరుగు
దేహమునకుఁగల చైతన్యము తెగి నీడకులేదు
శ్రీహరికినిగల స్వతంత్రము జీవునికిలేదు.

అన్నమయ్య. అధ్యా. సం

మనిషి చేసిన రాయిరప్పకి
మహిమకలదని సాగి మొక్కుతు
మనుషులుంటే రాయిరప్పల
కన్న కనిష్టం

గురజాడ. ముత్యాలసరాలు

## భగవత్కీర్తన

జాలెల్ల నడఁగించు సంకీర్తనం
సంతాప మణఁగించు సంకీర్తనం
జంతువుల రక్షించు సంకీర్తనం
సామమున కెక్కుడీ సంకీర్తనం
జముబారి విడిపించు సంకీర్తనం
సమబుద్ధి పొడమించు సంకీర్తనం
జమళిసౌఖ్యములిచ్చు సంకీర్తనం
శమదమాదులఁజేయు సంకీర్తనం
సరళి సంపదలిచ్చు సంకీర్తనం
సరిలేనిదిదియపో సంకీర్తనం.

అన్నమయ్య. అధ్యా. సం

శివుని యనుభవంబు సృష్టిలోపల లేక
సంశయంబుడుగదు సాధకులకు

వేమన

యోగిసంఘమునకు నుత్తమ వ్రతములు
వాసుదేవనామ వర్ణనములు

పోతన. భాగ. II-7

హరినామాంకిత సత్కథామృత రస వ్యాలోలుఁడై నట్టి స
త్పురుషశ్రేష్ఠుఁడ సత్కథాలవణ వాఃపూరంబుఁదాఁ గ్రోలునే!

పోతన. భాగ. III-23

సరసిజనేత్రు కీర్తనమె చాలు విపద్దశలన్ జయింపఁగన్

పోతన. భాగ. III-242

ఏకథలయందుఁ బుణ్య
శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే
నాకథలు పుణ్యకథలని
యాకర్ణింపుదురు పెద్దలతిహర్షమునన్

పోతన. భాగ. VIII-21

విష్ణుకథారతుఁడగునరు
విష్ణుకథల్ సెప్పునరుని వినుచుండునరున్
విష్ణు కథాసంప్రశ్నము
విష్ణు పదీజలముభంగి విమలులఁ జేయున్

పోతన. భాగ. -X 13

గురుతల్ప కల్మష క్రూర సర్పములకుఁ
గేకులు హరినామ కీర్తనములు

మధుపాన కిల్బిష మదనాగ సమితికిఁ
గేసరుల్ హరినామ కీర్తనములు
తపనీయ చౌర్య సంతమసంబునకు సూర్య
కిరణముల్ హరినామ కీర్తనములు

సింగయ. భాగ. IV-118

బిడ్డపేరు వెట్టి పిలుచుట విశ్రామ
కేలినైన మిగులఁ గేలినయినఁ
బద్య గద్య గీత భావార్థములనైనఁ
గమలనయనుఁ దలఁపఁగలుమహారము

సింగయ. భాగ. VI-122

రామకథాసుధారసపాన మొక
రాజ్యము జేసునే?

త్యాగరాజు

## భగవత్కృప

శివ వరంబులేక శృతివాదములచేత
సంశయంబు చెడదు సాధులకును
దైవకృపలు లేక తలపులు చెల్లవు

వేమన

కొసరక దైవానుకూల్య మెవ్వరికిఁ
బసగలుగునువాఁడె పార్థివేశ్వరుఁడు
ధరణి నిర్భాగ్యుండు తత్పదబుద్ధి
పరుఁడు కానేర్చునే పరికింపనెందు?

సోమన. ద్విప. భారత. శల్య.

ధరనేనోములు నోచినన్ వరుసనే దానంబు లీఁజాలినన్
హరిసేవారతిలేనివానికకటా యాభాగ్య మేలబ్బెడిన్

పైడిమఱ్ఱి వెంకటపతి, చంద్రాంగద చరిత్రము

దేవుఁడెన్నడు దీనుల దెసనెనిల్చు

నా. కృ. రావు, పాంతరగలు

అఘటనఘట నాధికారైనమైన
దేవు కృపగల్గ వెలయని వేవిగలవు ?

వోలేటి పార్వతీశము. శ్రీసత్యదేవ విలాసము

భగవత్తత్పరత

కాలధర్మ మెఱిగి కపట వృత్తులుమాని
యాలు పిల్లలందు నాశవదలి
మేలుగాను శివుని మేల్కొని పూజించు

వేమన

మందారమకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబువోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాల పల్లవఖాదియై చొక్కు
కోయిలచేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక
మరుగునే సాంద్రనీహారములకు

అంబుజోదర దివ్యపాదారవింద
చింత నామృతపాన విశేషమత్త
చిత్తమేరీతినితరంబుఁజేర నేర్చు

పోతన. భాగ. VII 150

బాంధవముననైనఁ బగనైన వగనైనఁ
బ్రీతినైనఁ బ్రాణభీతినయిన
భక్తినైన హరికిఁ బరతంత్రులైయుండు
జనులు మోక్షమునకుఁ జనుదురధిప!

పోతన. భాగ. X-973

నియత సువిచారమతియు శాంతమునఁగాక
స్వీయలింగ భావనిర్ణయము గలిగెడు నా
త్మయమాత్మ దృష్టి నిరవయవలింగ రతిగాక
క్రియలనే గంటి శివమయము దానగునా

ఏగంటివారి వచనములు. 17

భగవదర్పణము

పరమేశ్వరార్పణంబుగఁ
బరజనులకు భిక్షయిడినఁ బరమపదమునం
బరగెదరఁట తుది; సాక్షా
త్పరమేశుఁడు భిక్షగొన్న ఫలమెట్టిదియో?

పోతన. భాగ. X-870

నరుఁడే కర్మంబు సేయు నయ్యెవేళన్
'హరి కర్పణ' మని పలుకుట
పరువడి సుజ్ఞానమంత్రము పరమ మునీంద్రుల్

సింగయ. భాగ. XI-42

ఇంచుకంతబోన మీశ్వరార్పణమన్న
పుణ్యలోకమునకు బోవు నతడు

వేమన

అన్ని నీవనుచు నెంచిన వానికి
నాశ్రమ భేదము లేల ?

త్యాగరాజు

## భగవద్జ్ఞానము

అందరి వశమా హరి నెఱుఁగ ?
కందువఁగ నొకఁడు గాని యెఱఁగఁడు
హరిఁ దలఁచిన వారిది నేరుపు
తలఁచని వారిది నేరిమి

కలుష మెడలి సూర్యోదయమైనా
కానవు కొన్ని జంతువులు
హరియే యెఱుఁగును అందరి బ్రతుకులు
ఇరవై యీతని ఎరుఁగుటే మేలు

తా. అన్నమయ్య అధ్యా. సం.

## భగవద్ధ్యానము

శుభావహు శివుఁ దలఁప
మృత్యుహారమగు డది దే

వన్నెచోడ కు. సం. V-111

కలనాఁడె ధనము ప్రాయము
గలనాడె జవంబు బలము గలనాఁడె విని
శ్చల మతియు గతియు డనకుం
గలనాఁడె భజింపవలయుఁ గరుణా నిలయున్

పా. సోమన అను. 139

హరినామ కీర్తనంబును
హరినామ జపంబు నెవ్వఁడా వర్తించున్
నరక మహావేదన యు
న్నరునకుఁ బ్రాపింపకుండు

శ్రీనాథ. కాశీ. III-157

ఉత్తముఁ డయిన హరి యుండేటి యాతుమలోనఁ
దత్తరపుఁ గాంతలను దలపోసేదా!
నారాయణ నామ ముచ్చరించే నోరను
రుత్తయధరపుఁ దోలు రుచిగొనేదా!

ఆతఁడే సకలము అని భావింపుచు
నీతితో నడవక నిలుకడ యేది?
౬౭ ఎందును జూచిన నీశ్వరుఁ డుండఁగ
విందుల మనసుకు వెలి లేది?
అంతరాత్ముఁడై హరి పొడసూపఁగ
పంతపు కర్మపు భయమేది?

అంతరంగమునఁ దాను హరిఁ దలఁచినఁ జాలు
అంతటి మీఁదటి పను లాతఁ డెఱుఁగు

తా. అన్నమయ్య. అధ్యా. నం.

బహుళ పాపియైన బ్రహ్మఘ్నుఁడైనను
నిర్దయాత్ముఁడైన నీచుఁడైన
మరణకాలమందు మమతలన్నియు మాని
హరుని దలప ముక్తుడౌను

ధ్యానములను శివుని ధ్యానమే శ్రేష్ఠంబు
భువనాకారుని మదిలోఁ

ప్రవిమల శుభమూర్తిగాను బరికించినచో
భవనాశమగును

వేమన

పరుల కతంబున నేనియు
హరి నొకమరి దలఁప భద్రమగు ఖలులకు

తెనాలి. పాండు. మహా. V-46

## భగవన్నామము

హరినామము కడు నానందకరము
నలినాక్షుని శ్రీనామము
కలిదోషహరము కైవల్యము
నగధరునామము నరకహరణము

అరిది వేదశాస్త్రార్థ సంగ్రహము
అరయఁగ నొకటే హరినామం
దురిత హరము భవ దుఃఖ నాశనము
అరి భయంకరము హరినామం

సకల పుణ్య ఫలసార విహారము
అకలంకము శ్రీహరినామం
ప్రకటము సులభము పరమ పావనము
అకుటిల మిది శ్రీహరి నామం

వెన్నుని నామమె విమలౌషధము
చిత్త శాంతికిని శ్రీపతి నామమె
హత్తిన నిజ దివ్యౌషధము

మొత్తపు బంధ విమోచనంబునకు
చిత్తజగురుఁడే సిద్ధౌషధము

తా. అన్నమయ్య. అధ్యా. సం.

అష్టాక్షరీ జపం బురు
శిష్టతఁ గావించు పుణ్యశీలురకు మనో
భీష్టార్థఫలములన్నియు
ముష్టిగ్రాహ్యంబులగుచు ముందటనిల్చున్

చెంగల్వ. రాజ. V-63

హరియను రెండక్షరములు
హరియించును పాతకములు

నృసింహకవి. కృష్ణశతకము

భగవన్మహిమ

పట్టరాదు జవ్వనము పాయరాదు సంసారము
ఇట్టివెల్ల నీమాయ
ఉడిగిపోవు కోరికలు ఒదుగదు కోపము
కడదాఁకా నీమహిమ కాదనరాదు
దేవుఁడవు నీమర్మము తెలియఁగరాదు

దేవా ! నీమహిమ తెలియనలవికాదు !
జననంబొక టే జంతుకులమొక టే
తనువికారము లేతగఁబెక్కు
దినములునివియే తివిరిలోకమిదే
పనులే వేరయి పరగీని !

తా. అన్నమయ్య. అధ్యా. సం.

బ్రతుకు ఘటించు నోషధికరాశి విషంబున నుక్కుతీవలం
దతి మృదునాదమునే దహనునందుఁ బ్రకాశము నుప్పునీటిలో
రతనము లాణిముత్తెములు రాళ్ళను కప్పకు జీవనంబులున్
చతురత గూర్తు వెయ్యది యసాధ్యమునీకిక దీనబాంధవా!

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి. వారకాంత.

## భగవన్మాయ

నేరకుంటే సంసారము నేరుపును నీమాయ
చేరకుంటేఁ గడులోను చేసుకొను నీమాయ

జగములో చదువులును సంశయంబే కాని
తెగనీదు నీమాయ తెలియవశమా!
ముసుగువెట్టినవాదు ముగియదెంతైనా
అణుమాత్రపు దేహినంతేనేను

మణిగెద లేచెదముందరగాను
తగు సంసారపు తరఁగలు నీమాయ.
నిగమముల యడవి నీమాయ
పగలు నిద్రలువుచ్చే భవములు నీమాయ

తలలేదు తోఁకలేదు దైవమా! నీమాయలకు
ఆదికినాది హరిమాయ
సాధించి సుజ్ఞానినైతె
యీదెస వెదకిన నిహమె పరము

తా. అన్నమయ్య. అధ్యా. సం

భువన మోహనుఁడైన పురుషోత్తమునిమాయ
నువిదగా జగము భ్రమయుట సహజమయ్యెన్

కంకంటి. విష్ణుమాయ.

...... ..లీల నా జగన్మయుఁడు
తను విశేషంబులు ధరియించు విడుచు

తిమ్మయ. ద్విప. భారత. భీష్మ

## భయము

......అడలుటకన్న
మరణమైనను నొక్కమాటైన లెస్స

గౌరన. హరిశ్చంద్ర

ఆపదలందును శత్రు
వ్యాపారములందు భీతి వలవదు...

శ్రీధరమల్లె. బ్రహ్మోత్తర IV-101

సకలవేదాంత సచ్ఛాస్త్రసారబోధ
నంబుకంటెను దుష్టగుణంబు మార్చి
ప్రథితబుద్ధి నొసంగఁగ భయమెమిగులఁ
ప్రబలతరమగుఁగాదె యీ వసుధలోన

భయము నింద్యంబనెకు మాటపాడిగాదు
భయమె లోకలాభకరము భక్తికంటె
భయముచేతఁ గ్రమంబుగా భక్తియొదవుఁ
గర్మమున జ్ఞాన మొదవెడు కరణిఁదుదకు

భీతిచేత నున్మత్తుని బూతులడఁగు
భయముచేతఁ గామోద్రేక భరముమాయు
భయముచేఁ బాపకృత్యముల్ భంగమగును
భయముచే బ్రహ్మరాక్షసుఁ డయినలొంగు

నయగతిని ద్రిప్పునదియొక్క భయమె సుమ్ము
భక్తినైజగుణముగాదు పరగనద్ది
భయముతోఁ గూడిననుగాని పనికిరాదు
కాన భయమొక్కటియె యెంతకైనఁజాలు

పానుగంటి. వన. రాష. IV

## భర్తృధర్మము

భార్య నవమానించుట యధర్మంబు

నన్నయ. భారత. ఆది. IV6-8

చాలం బుత్రులు గల్గిన
యాలిపయిం బెండ్లియాడు నప్పుడు తాఁబె
ద్దాలికిని ధనము మూఁడవ
పాలిచ్చుట ధర్మమండ్రు భర్తల కెల్లన్

పంచిన పని వెరవునఁ గా
వించుట సత్పుత్రుఁ గనుట వినయముతో భా
షించుట గలిగిన సతి వ
ర్జించి పయిం బెండ్లియాడఁ జెల్లదు పతికిన్

కేతన. విజ్ఞా. ఆచార.

భర్తకు భార్య రక్షణీయ

భార్యఁ బ్రీతినరసి రక్షించునది

మారన. మార్కం.

## భక్తి

పతిఁ గడవంగ దైవతము భామలకెందును లేదు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-314

మనమునఁ గైకొన్న భర్త మానందగునే

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-183

ప్రాణనాథుని సరియె యే బంధువులును?

శ్రీనాథ. కాశీ. II-82

నాతికిఁ జాడ భర్తయ ధనంబులు సొమ్ములు వేయు నేటికిన్

అనంత. భోజ. VII-119

పాటులేని మగడు కూటి చేటు

కావవలయు మగఁడు కాంత నెల్లప్పుడు
కావలేనివాడు చావవలయు

మగువ లందఱికిని మగలె దేవతలయా!

కావవలయు ధనము గాంత నెల్లప్పుడు

బలములేని మగడు పనికిరాడు

వేమన

పతిలేని సుతులేల బంధువు లేల
పతిలేని హితులేల ప్రాణంబులేల
పతిలేని రాజ్యసంపద లవియేల?

గౌరన. హరిశ్చంద్ర

పతిలేని సుతులేల? ప్రాణంబులేల?
పతిలేని సకల సంపదలును నేల?

గౌరన. నవనాథ.

పతిప్రాణ సదృశ బంధువు
పతి దైవంబేమగడయుఁ బతి సతులకు న
ప్పతియ కడుమేర దప్పిన
గతి కుల కాంతలకు వేఱుగలదే చెప్పుమా

కలకాల మొక్కగతిఁ బూ
సలలో దారంబు మాడ్కి సతి మదిలోనన్
మెలఁగెడు పురుషులు గలుగుట
తొలి జన్మము నోముఫలము తోయజనేత్రా

నంది తిమ్మన. పారి.

వనితలకున్ దోడు నీడ వల్లభుఁడె కదా

రామభ. రామా. V-35

అధిపుల్ సతులందును సత్యసంధులే

సూరన. ప్రభా. V-160

వాలుంగంటికి నింటి యాతఁడు మనోవాంఛా ప్రదాన క్రియా
హేలాలోలుఁడు నీలవేణికిఁ బ్రియుం డేప్రొద్దు నొప్పారు ర
త్నాలంకారము కాంతకున్ మగఁడు నిత్యానంద సంపాదియిం
కేలా వేయును జెప్ప నేర్గడయుఁ బ్రాణేశుండ తన్వంగికిన్

శంకరకవి

మేడలు మిద్దెలు మెండుగలిగిన నేమి
ఈడైన విభునితో నెనసి యుండకపోతే

క్షేత్రయ

భ్రాతయును దండ్రి సుతుఁడు నల్పంబు నిత్తు
రమితముగ నిచ్చు భర్త నెయ్యమున సతికి

భవానీశకవి. ధర్మ. VIII-380

చపలనేత్రను నొక్క సంకటంబైన
యపుడు తాఁదక్క వేచి యచట సంధించి
మగఁటిమిఁ జూపని మగఁడేటి మగఁడు
జగతి వారికినేల సత్కీర్తి గలుగు

తిమ్మయ. ద్విప. భారత. విరాట.

తల్లిదండ్రులు సుతుల్ తన వారలైన
నెల్లరు మితముగా నిత్తురు ఫలము
నపరిమితంబైన యఖిల సౌఖ్యములు
కృప నిచ్చుఁ బతిగాన నితరంబు లేల!
ప్రాణవల్లభుఁ డిహ పరసౌఖ్యదాత
యోగాత్ములకుఁ గాన నితరంబు లేల?

వరద. రామా. అయో

అంగనకు నిజాధినాయకుఁడ కల్పక భూరుహము

పెద్దాతనాగ. శకుంతలా. III-133

పెనిమిటి కన్నందేఱవలకు వేరె కలరే వేల్పుల్

మగడేకద తోడవులెల్ల మగువలకెందుక్

తిమ్మయ. అచ్చ. రామా. అయో. 52, 53

వినయంబుగలకాంత విడచి వర్తించునా
విభుఁడుగాడతఁడు రాసభుఁడుగాని

యోగానందకవి. రాజగో. 72

చుట్టాలెందరున్న పెనిమిటి
బోలుదురే యెందునేని పూఁబోఁడులకున్

దా. శ్రీ. దేవీభాగ. IX-1336

పురుషుఁడులేని యిల్లేటికి
కాపురమిక నేమిటికి?

జంగం సుబ్బయ్య. దేసింగురాజుకథ

మగలు మగువలకెందును నగలుగూర్చి
రంజన మొనర్చుటే సధర్మంబుగాని

ఉన్న వానిని యాడిచి తిన్న మగడు
భర్తృలోకంబునకు దలవంపుగాదె:

కొప్పవరపు సుబ్బారావు. వసంతసేన. I-Vj.31

మ్రొక్కెడు వారిచే విడిచి మొట్టెడువారినె ప్రాణవల్లభుల్
మక్కువతోడ జూతురు

ముత్తరాజు సుబ్బారావు. శ్రీకృష్ణతులాభారము. II-28

## భవిష్యత్తు

గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్

నన్నయ. భారత. ఆది.

మీఁదటఁగాఁగల మేలుగీళ్ళెరికిఁ
దప్పింపరామియెంతయు ధ్రువంబు

సూరన. కళా. III-110

భావియెఱిఁగి సెప్ప బ్రహ్మాతరముగాదు

దా. శ్రీ. దేవీ. V-112

## భాగవతము

భాగవతము దేటపఱుప నెవ్వఁడు సాలు
శుకుఁడు దక్క, నరుని సఖుఁడు దక్క ?

పోతన. భాగ. VI-23

లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై

పోతన. భాగవ. I-21

ఎయ్యది కర్మబంధములనెల్ల హరించు విభూతికారణం
బెయ్యది సన్మునీంద్రులకు నెల్లఁ గవిత్వ సమాశ్రయంబు ము
న్నెయ్యది సర్వమంత్రముల నేలినదెయ్యది మోక్షలక్ష్మి రూ
పెయ్యది దానిఁ బల్కెద సుహృద్యము భాగవతాఖ్య
మంత్రమున్

ఏర్చూరి సింగన. భాగవతము. VI-14

పంచమవేదమై పరగు భాగవతం బనయంబు వేడ్కతో
నించుకయైన భక్తిపఠియించినవారలు దివ్యదేహులై
పంచశిలీముఖాదిగురుభాసురరూపముదాల్చి ముక్తులై
సంచరణంబు సేయుదురు సర్వజగంబుల నాప్తకాములై

హరిభట్టు. భాగవతము. XII

ఏవాఁడు భాగవతమున్
భావగతము సేయఁడట్టి పామరుఁడు విధి
వ్యావంచితుండు నమ్మెడు
కేవల పశువట్టివాఁడు కీర్త్యుండగునే ?

దా. శ్రీ. దేవీభాగ. I-70

భాగ్యము

భాగ్యమునె నమ్మికొన్నయ
భాగ్యుఁడెవఁ డభీష్టసిద్ధి పడయంగలుగున్ ?

కందుకూరి. దక్షిణగో. V-497

వలదు వలదను వానికే కలుగుచుండు
వలయునను వానికేదుపే ఫలము తుదకు
కవితగానము చిత్రలేఖనము సుఖము

యశము భక్తదర్శనము భాగ్యంబువంటి
వప్రయత్నములై నచో నలరు మిగుల
నటకుఁడేడ్చిన యేడ్పులో నాడె మేమి?

పానుగంటి. చూడాణి. III

భాగ్యవంతుఁడు ధనమున్న వాఁడు కాఁడు
ధనములేనట్టివాఁడు బీదయునుగాఁడు
భాగ్యమున భాగ్యమును సొమ్ముఁబట్టి కాదు
మనసుబట్టియె యవియుండు వనజవదన
తుష్టిఁగలవాఁడు భాగ్యవంతుండు నిజము
పరమ సుగుణాల వాలుండు భాగ్యశాలి
స్వార్థరహితుండు పరమభాగ్యాన్వితుండు
భక్తిఁగలవాఁడు సంతత భాగ్యయుతుఁడు
విద్యఁగలవాఁడు భాగ్యానవద్యుఁడగును
యోగ్యయగు భార్యఁగలవాఁడు భాగ్యయుతుఁడు

పానుగంటి. మాలతీమా. III

జనుని భాగ్యంబువీడిన సమయమందుఁ
దత్ప్రభావంబులెల్ల నంతంబుఁజెందు
ముదిత సౌభాగ్యమేగినప్పుడు తదంగ
సౌష్ఠవ శ్రీలు సడలెడు చందమునను

పానుగంటి. విజయ. రాఘ. VII

దీపసప్తకముండి పై దీపమునకు
వాంఛగనురాజు నిత్య నిర్భాగ్యయుక్తుఁ
డింతగోచి నాకేలని కొంతచింపి
పరుని కొసఁగు నతఁడు నిత్యభాగ్యయుతుఁడు

పానుగంటి. బుద్ధ. III

... భాగ్యంబులేనియప్పు
డబలయొవ్వతె సుబలాఢ్యుఁడనఁగ నెవఁడు

పానుగంటి. కోకిల. I

భాగ్యమో భాగ్యమోయంచుఁ బ్రాకులాఁడు
నంతకాలము సిద్ధింపదది యథార్థ
మూరక తటస్థతగ జనుఁడున్నయపుడె
భాగ్యదేవత నుదుటిపై ప్రజ్వలించు
అడుగనట్టివానికె దాత యధికమిచ్చు
వేడుకొనువానికి విదుర్చు విసుగుకొనుచు

పానుగంటి. చూడామణి II

## భారతము

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మ విదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁజేసె భారతంబు

నన్నయ. భారత. ఆది. I–31

అమితాఖ్యానకశాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గచతుష్క పుష్పవితతిన్ శోభిల్లికృష్ణార్జు నో
త్తమనానాగుణకీర్తనార్త ఫలమైద్వైపాయనోద్యానజా
త మహాభారత పారిజాత మమరున్ధాత్రీసురప్రార్థ్యమై

నన్నయ. భారత. ఆది. I-65

వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైనచోటులను దా
మూదల ధర్మార్థకామ మోక్ష స్థితికిన్

తిక్కన. భారత. విరాట. I-4

భారతమున పలుకు పలుధర్మములయందు
సత్యనిష్ఠ మేటిసత్యమె కద
వసుధదానఁగలుగు వన్నియ మిన్నయా

వేమన

తారలెన్నవచ్చు వారధి నవలీల
దాటవచ్చు గిరులమీటవచ్చు
భారతార్థమెఱిఁగి పలుకంగ వచ్చునె
చిలువఱేనికైన నలువకైన

రామరాజీయము I-23

వింటే భారతం వినవలె
తింటే గారెలు దినవలె

— లోకోక్తి

## భార్య

ధర్మార్థ కామసాధన కుపకరణంబు
గృహనీతివిద్యకు గృహము విమల
చారిత్రశిక్షకాచార్యకం బన్వయ
స్థితికి మూలంబు సద్గతికినూఁత
గౌరవంబున కేక కారణం బున్నత
స్థిరగుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లుగావు ప్రియములు
భార్య పురుషునందర్థంబగు

నన్నయ. భారత. ఆది. IV-84, 85

అధికదుఃఖరోగార్తున కౌషధంబు
సురుచిరంబుగ భార్యయచూవెయెందు
నొనర భార్యాసమేతుఁడై యున్నవాని
కెంతలయ్యును నాపద లెఱుక పడవు
పురుషునకు నిమ్మల భార్యయ పాచుఁ జిత్తమునదుఃఖంబుల్

నన్నయ. భారత. అరణ్య. II-74, 75

ఆలుసుఖార్థంబొ వేదనార్థమొ?
సతికి రూపెంతగలిగినఁజాలు...
...శీలంబయెక్కుడు వలయుఁగలుగఁ
గానరూపును శీలంబులేనియట్టి
వెలఁది వేయి విధంబుల విడువవలయు

కారణముపత్ని ధర్మార్థకామములకు

పత్నిలేనివాఁ డెంతయు హీనుఁడు
ఆలులేని పురుషుఁ డధ్వరాది క్రియా బాహ్యుఁడు
ఆలుపోయిన మనవచ్చునయ్య

మారన. మార్కం. V-199

పుత్త్రుల కలిమియె శుద్ధ కళత్రమునకు లక్షణంబు

నాచన సోమన. ఉ. హ. వం. 11-2-81

సతి గుణవతియగు నేనియుఁ
బతికది రత్నంబ; ప్రాణబంధువ; యమృతం;
బతివయ దుర్గుణి యగునేఁ
బతికెడపని చిచ్చు కాలుపక యది కాల్చున్

రావిపాటి త్రిపురాంతకుఁడు, మదనవిజయము

వేద పఠనాగ్ని హోత్రాది విధుల నడుపు
సుతుని కరమునఁ దండ్రికి సుగతి గలుగు
నట్టి తనయుండు గలుగుట కరసి చూడ
మూల మిల్లాలు కాదె

దగ్గుపల్లి. నాసి. I-114

...గృహికి నవశ్యము
సూవె యతిథిపూజ యట్టి సుకృత క్రియకుం
దావలము భార్య యది స
ద్భావసరణి మెలఁగకున్నఁ దప్పు నఖిలమున్

అనంత. భోజరాజీయము. III

ఆలు మగనిమాట కడ్డమాడిన దేని
ఆలుగాదు దనుజురాలు గాని
అట్టి యాలి విడిచి అడవికేగుట మేలు

శీలముగల సుందరి తన
యాలైనను స్వర్గమేల నైహిక సుఖమే
వీలగు సతి దుశ్శీలగ
గాలుని పటుదూత యగును

కూలినాలి జేసి గుల్లాపు బనిచేసి
తెచ్చిపెట్ట నాలు మెచ్చుచుండు
చిక్కు పడ్డవేళఁ జీకాకు పఱచురా

మాట వినని యాలు మగనికి మఱగాలు
దానిజేర బ్రాణ మానహాని
అట్టి యాలి విడిచి యడవి నుండుట మేలు

మాట కేడ్చునాలు మగనికి యమదూత
ఒప్పులేని భార్య యున్న ఫలంబేమి ?

వేమన

అధముఁడైన వాని కాలగుకంటె న
త్యధికునింట దాసి యగుట మేలు

పోతన. భాగ. X-407

నాథుండు ప్రసన్నుండైన స్త్రీలకుం
గోరిక సంభవించుట కేమి కొఱంత ?

సింగయ. భాగ. VI-514

...ప్రతికూల యగు భార్య విడుచు
టెర వొందఁగా శాస్త్ర హితమే తలంప

తాళ్ళపాక. తిరువేం. పరమయోగి

మగని చిత్తమురాని మగువ లెట్లోర్తురో !

క్షేత్రయ్య

అధమాధమునికైన నాలన్న మాట విధిగతి ...

పెనిమిటిఁ గొల్వక పెక్కు ధర్మంబు
లొనరింపఁ బాపంబు లొందు నింతులకు

ప్రారబ్ధ నిజకర్మ ఫలము లన్నియునుఁ
బంచుకొందురు సరిపాలుగా భార్య
లంచు నాగమవేత్త లాడుచుండుదురు

వరద. రామా. అయో.

......ఐహికాముష్మికంబులకు
సతియెపో మూలంబు చర్చింపఁ బతికి
సతిలేని సుఖమేల! సర్వంబు నేల?

సోమన. ద్విప. భారత. శాంతి

భార్య యుండిన వనమైన బట్టనంబు
పత్ని లేకున్న గృహమైన బహుళగహన
మగుచుఁ గాన్పించు నరులకు నంతయేల
యాలు లేకున్న విధినైన నధముఁ డండ్రు

యాగముల నయోగ్యుండగు
భోగములకు బాహ్యుఁడౌ సుపుత్రోదయ లీ
లాగణ్యమైన భార్యా
యోగము లేకుండ దరులకుచితిమె చెపుమా

ఎంత దుఃఖమైన నింటికి వచ్చి యి
ల్లాలి మొగముఁ జూచినపుడె తలఁగు
నిది యెఱింగి కాదె ఋషులు వశిష్ఠాదు
లును సభార్యులగుచు వినుతిఁ గనిరి

ఒడలంటఁ గాళ్ళు పిసుకం
గడవేఁడు వేన్నీళ్ళు నీయఁ గంచము వెట్టన్
బడక యమర్పఁగఁ జేతికి
విడె మీయఁగ భార్యకాక వేఱొకతగునే

తిథులయందైన మఱి యపత్నీకుఁ డనుచు
బ్రాహ్మణార్థంబు చెప్ప రేపాటివారు
నొకతె రూపసి గాకున్న నోసియన్న
నోయనెడి మాత్రమునకైన నుండవలయు

కదిరీపతి. శుకసప్తతి

ఎన్నికడగండ్లు తోడరియు నెల్లరకును
నన్నిఁటిని దోలికాచెడి దాలుగాదె

పుట్టినింటనె పతిగల పొలతియున్న
జనులు శంకింతురన్యథా సాధ్వినైన;
గావునను తదప్రియనైన గాంతనెపుడు
బంధుజనులుంచ దలతురు భర్తకడనె

కందుకూరి.

స్త్రీరత్న మేకులంబుదైనఁ గొనవచ్చు

ఆ. నారాయణదాసు

సతము సుఖదుఃఖములయందు సములు సఖులు

నా. కృ. రావు. విరిదండ

ఆర్తుఁడై యున్న వానికి నాలుబోలు మిత్రమౌషధమునులేవు

శ్రీపాద. శ్రీకృష్ణభారత. అరణ్య. III-156

మగఁడెంత మంచివాఁడై
మగువం బోషించుచున్న మది మెచ్చదు, యా
మగనాలు తల్లిదండ్రుల
కగు నన్నియు నిచ్చి మెచ్చు ననురక్తయగున్
శ్రీపాద. ఏకావళి. II-46

భార్యాభర్తలు

సతుల కేడుగడయుఁ బతులనూవె
నన్నయ. భారత. ఆది. IV-66

పతియు భరియించుఁగావున భర్తయయ్యె
భామ భరియింపఁబడుఁగాన భార్యయయ్యె
నన్నయ. భారత. ఆది. IV-228

ప్రతికూలయు దుశ్శీలయు
సతతంబును నైనఁ బత్నిఁ జనదు విడువఁగా
బతికిఁదగు దానిఁ బ్రోవ ను
చితమగు చందమునఁ గూడుఁ జీరయు నిడుచున్

మగఁడుగలసె నేని మగువదాఁ గలయదు
వగువగలసె నేని మగఁడుగలయుఁ
డెలమి నొండొరువుల నిరువుర మనములఁ
గలుపుఁ బూర్వ సుకృతకర్మ ఫలము

దంపతులు పరస్పరవశతా ప్రమోద
మగ్న మానసులై కూడి మనుటయొప్పు

పత్నికిన్ బతినవశ్యముఁ బాయఁగరానియట్లు...
సతిఁ బాయఁగరాదు తదీయ భర్తకున్
మారన. మార్కం. V-

పతికలుగుకంటె సౌఖ్యము
సతులకు నొండొకటిగలదె చర్చింపంగా
బతిలేమి సర్వశూన్యము
పతిగలిగిన సతికి నింద్రపదమదియేలా?

ఐక్కన. విక్రమార్క. VI-117

క్షితిని సతికి దగిన శృంగారములు గల్గి
విభుని కరుణలేక వెలయదెందు

సతియొనర్చు చెడుగు పతికవశ్యము వచ్చు
బతియొనర్చు మంచి సతికిసగము.

పురుషుభాగ్యముననె పుణ్యవతి లభించు
బుణ్యవతికినట్లె పురుషుడబ్బు
మగని బలిమి కలిమి మగువకును బలము

వేమన

సతి కేడుగడయును జర్చింపఁబతియె
పతియ చూడ్దైవ మెబ్బంగుల సతికి

మగఁడు నాలును నభిమానంబు విడిచి
మొగములు వగులంగ మొత్తులాడుదురె!

గౌరన. హరిశ్చంద్ర.

పతిసమ్మానము వడసిన
సతులకు నభిమత ఫలార్థ సంసిద్ధియు నూ
ర్జితయశముఁ గలిగి లోక
స్తుతమై చెలువారుచుండుఁజువ్వె మహాత్మా

పోతన. భాగ. III-454

.........కులశీలవర్త
నములుగల భార్యమనమున నమరుకోర్కిఁ
దవిలి తీర్చుట పతికిఁ గర్తవ్యమరయ

పోతన. భాగ. III-460

ఉల్లములు నొవ్వనాడినఁ
గల్లలు సేసినను నగిఁ గలచిన నైనన్
వల్లభులుసేయు కృత్యము
వల్లభలకు నెగ్గుగాదు

పోతన. భాగ. X-846

పతుల భ్రమియింపనేరని సతులుగలరె ?

సింగయ. భాగ. VI-512

కాంతుఁ డుచితజ్ఞుఁడైనను
గాంతకు సిగ్గువడఁ జెల్లుఁగాక కటకటా
కాంతుఁడు సిబ్బితికాఁడై
కాంతయు నట్లైన నెట్లు కాపురమింకన్

సూరన. కళా. IV-67

మెలఁతకుఁ బతిప్రైనను
మెలఁతుకపైఁ బతికినైన మేలగుచెందున్
గలయది మెలఁతకుఁ బతికిన్
వలపు సమంబగుట జన్మవాసన చెలియా

పెద్దన. మను. VI-66

భామా సమేతుఁడై పరగినవాని
కేమియి నాపద లెఱుఁగగరావు

సతి భర్తయందు దోషంబు గల్గినను
వ్రతమతి సహించింపవలయు...

సోమన. ద్విప. భారత. అరణ్య.

.. ...కులకాంతలు గో
రిన కోరికేఁ జిన్నవుత్తురే గృహాలు

అనవరత సౌఖ్య సంధాతమైన నేత
కంటె దైవంబు గల్గునె కామినులకు

ధరణిదేవుల. దశా. చరిత్ర

భర్తచేసిన ముద్దు ఖేచర వీధుల బారు
భర్తచేయని ముద్దు పంచలా పాలౌను

దక్షుని యజ్ఞము

ప్రాణనాథుఁడు భార్యపక్షమై యుంటేను
మిన్నువిరిగినగాని మీఁదఁ బడబోదు

వసగాడ సన్యాసి. గంగావివాహము

పతి నెడబాసి బ్రతుకుటకంటె
సతులకు ప్రాణంబు విడుచుట మేలు

శ్రీ. గో. కృ. మూర్తి. సంపా. కుశలవుల యుద్ధము

ఆలిమాటల నమ్మబోవని మగఁడుఁ గలడె

అ. నారాయణదాసు. సారంగధర

సతి కుచిత గౌరవం బిచ్చి సతత కృపను
గాంచి యేక పత్నీవ్రత కలన నిల్పి
యన్యు లామెను మన్నించునట్లు చేసి
తగిన నగలిచ్చి పోషింపఁదగును మగఁడు

మగనియెడ భక్తిగృహ కృత్య మార్గమందు
శ్రద్ధ భర్తృబాంధవ మిత్రరాజి యెడల
దయయు సొమ్ము వాడుకను బాదపతితనము
గలిగి మగనాలిగా నుండవలయుఁ గాంత

పానుగంటి. బుద్ధ.

ఆలుమగలయందు నన్యోన్య మున్నచో
దప్పులేల గలుగు ధరణియందు

కొప్పరపు సుబ్బారావు. తారాశశాంకము. IV-61

## భీరుత్వము

పిఱికియైన మానిసికి వెండి వివేకము కల్గనేర్చునే

తిక్కన. భారత. ఉద్యో. III-107

తన సరివారి కిన్వెఱచి ధామముఁ బీడఱఁజేసి దాఁగఁ బో
యిన సరియిండ్లవారు నగరే ?

శ్రీనా. కాశీ. VI-295

పందనధికుఁజేసి బవరంబునకు బంప
బాఱిపోవు గార్యభంగ మవును
పాఱునట్టిబంటు పనికిరా డెన్నడు

వేమన

ధీరత ననిలోనఁ దెగి పాఱువాఁడు
ఆరయ యమపురి నరిగాఁపుగాఁడె

సోమన. ద్విప. భారత. శల్య.

తెలివిమాలి పిరికి దేబెతో నేస్తంబు
చేసికొనెడువాఁడు మోసపోవు

అ. నారాయణదాసు. సూరుగంటి

అమిత ధైర్యచలీకృతుండైన వీరు
నకుఁ బిఱికితనమే కారణమున నైన
యుదయమందిన నది వాని మొదలు చెఱచు
నధిక భోజనప్రియుని మందాగ్ని యట్లు

పాలుగంటి. విజయ.

## భూతదయ

జంతు పదములెల్ల దంతి పదంబులో
నడఁగుక్రియ నహింసయందు సకల
ధర్మములు నడంగుఁ గర్మ సంత్యాగికి
నైన భూతదయ సమర్థగుణము

తిక్కన. భారత. శాంతి. V-145

అర్థిగోరిన వస్తువు లర్థితోడ
నీగి యెల్ల దానములకు నెక్కుడరయ
నఖిల భూతమ్ములకు నభయంబునిచ్చు
టంతకంటెను మేలందు రార్యజనము

తిక్కన. భారత. అను. II-335

ఇన్ని యాచారములలోన నెక్కుడండ్రు
సకల భూతంబులందును సదయుఁడగుట
యాదిమునులట్లు గావున నఖిల వర్ణ
ములకు దయ కల్మి పెద్దయు వలయుగుణము

భూతముల కలుగు నతనికి
భూతములఖిలములు నలుగుభూతహితార్థి

భూతముల కభయమిచ్చిన
పూతాత్మునకభయమిచ్చు భూతావళియున్

తిక్కన. భారత. అను. IV-128, 309

తనకరయంగ వేఱొకటి తక్కువజంతువుగల్గనేనిఁ ద
త్తనువునకెగ్గుసేయమిగదా తగు నన్య శరీరమెక్కుడై
యనయము దానహీనుఁడగునట్టిదె యైననుమేలె వైరమే
యనువున భూతమైత్రియ యపాయములేని యుపాయమాత్మ
కున్.

వైరంబున భూతంబులఁ
గారించు దురాత్మమాఱుగావించుఁ గడున్
వైరంబున భూతంబులు

ఎఱ్ఱన. నృ. పు. IV-81, 82.

......... పుణ్యము లెన్నియేనియున్
జేసినవాని సద్గతియె చేకురు భూతదయార్ద్రబుద్ధికిన్

పెద్దన. మను. II-72

భూతదయకంటె ధర్మంబు భూమిలేదు

దా. శ్రీ. దేవీభాగ. IV-190

ప్రాణికోటియందు మాయనిదయగల్గు
వారియందుదైవ మారయంగఁ
గరమనుగ్రహంబు గలిగియుండును గాన
హింససేయఁగూడ దించుకైన

కం. వీ. నీతి. 39

ఉరునిష్ఠలు తపములు న
ధ్వరములు తుల్యములె భూతదయకు ?

చిలకమర్తి. గయో. II-44

జంతువులపైఁ గరుణమనుజులు పూనకున్న
వారలపైఁ గరుణ దేవతలకు రాదు

తిరు. వెం. కవులు. బుద్ధ. IV-53

## భూదానము

భూమిదానము పరమము దానములయందు

రజతము కాంచనంబు నవరత్నములున్ వనముల్ తటాకముల్
గజతురగాది జంతువు లగంధము పువ్వులుఁబండ్లు దేనియల్
ద్విజునకు వేయునేల యనువేకుకరి న్నుటకంటెఁ బ్రీతిఁ ద
త్ప్రజనన కారణంబగు ధరాస్థల మిచ్చుట యిచ్చుటన్నియున్

కృతదక్షిణంబు లగ్నిష్టోమములు పెక్కు
యొజనించునట్టి పుణ్యాత్ములకును
జ్ఞానదయాసత్య సంతతవిజితేంద్రి
యత్వముల్ గురుదేవతార్చనములు
మొదలుగాఁగల పుణ్యములు సేయు ధన్యుల
కధికుండు భూప్రదుండండ్రు బుధులు

అయిదు తరములపూర్వుల నవుల మీఁద
నందఱనుగాచు నూర్ధ్వలోకాలయములఁ
గమియఁబండిన వివిధసస్యములతోడి
యవనిదానంబుచేయు పుణ్యాత్మకుండు

ఒకఁడు హయమేధ మొనరించు నొక్కరుండు
భూమిదానంబొనర్చు నీ పురుషులందుఁ

దారతమ్యంబులేదండ్రు తత్త్వవిదులు
ధర్మములు రెండు నొక్కవిధంబు కాన

శ్రీనాథ. భీమ. V-60,62,64,67,72

క్షితిదాన మిచ్చునతఁడును
నతి కాంక్షఁబరిగ్రహించునతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు
శతమఖలోకమునఁ గ్రీడసలుపుదు రెలమిన్
ఏదానంబును భూదానంబునకు సదృశంబుగానేరదు

పోతన. భాగ. VIII-615, 616

నానాదానముల్ పాదమాత్ర మహీదానముఁబోలవు

ధరణిదేవుల. దశా. V-100

## భూమి

పృథ్వి సకలమునకుఁ బరాయణ స్థానమరయ.

మహాభూతంబులేనింటిలోనం బృథివి యెక్కుడు

తిక్కన. భారత. భీష్మ. I-17, 18

భూమికి సరియగు వస్తువు
భూమికి సరియైనవిధము భూమీదేవ
స్వామికి సరియగుపుణ్యుఁడు
లేమికి సందియ మొకింత లేదు మహేంద్రా!

శ్రీనాథ. భీమ. V-74

## భేదము

బ్రహ్మ సృష్టిలో భేదమే ప్రాతిపదిక
వర్ణభేదాదులు మఱొక ప్రబలభేద

మెంచి యొకనిపై నొకఁడేచి యెగయు చంద్రు
భేద శూన్యముగ బ్రదుకలేదుగాదె?

తన కుడియెడమ చేతులఁ దనరు నట్టి
భేదమేతీర్చుకోలేని వెఱ్ఱినరుఁడు
లింగవర్ణభేదములు మార్పంగగలఁడె?
పొల్లు కేకలసృష్టి నిర్మూలమగునె?

పానుగంటి. విప్ర. II

## భోగము

కలవారు పేదవారనఁ
గలదేభోగముల సరియుకాక తలఁప దే
హుల కెల్ల

మారన. మార్కం. VII-209

భోగధర్మంబులు పుట్టినయపుడె
సరవి విరాగిత సంసారమెడలు
సద్గురుపదసేవ చయ్యనగలుగు
అందుచే నిర్వాణమందిక యగును
కావునభోగముల్ గైకొనవలయు
శాస్త్రంబులీలాగు చాటిచెప్పెడిని

శ్రీనాథ. పల. వీ.

తను భోగములు మాయావిలాసములు
ఎఱిఁగినట్లనుండు మఱపించుఁ దలఁపు

పెద్ద దొరనని మీఱిందగదు
పేదనని తాఁదాగందగదు

కోరి మనసునం బాలుద్రాగిన
రీతులే భోగంబు లెల్లను

సమ్మతించ భోగములే సకల బంధములు

వెలుపల లోపల వెలయు భోగములు
కలలోపలివలెఁ గనినది తెలివి
పూచిన చోటుల పుత్త్రమిత్రులై

కాఁచి కరఁచినాఁగరఁగనివి
రూపులేని భోగమెల్ల ఋణము సుండీ!

తా. అన్నమయ్య. అధ్యా. సం.

కొలఁదికి మీఱిన లక్ష్మికి
నలరెడు భోగంబె రక్ష యారసి చూడన్
జలపూర్ణ తటాకమునకు
నలవడగా వాటమైన యలుఁగుంబోలెన్

జక్క-న. విక్రమార్క. II-180

తుచ్ఛ సుఖముల్ మీసాలపై దేనియల్

పెద్దన, మను. III-1[illegible]

జలధరచ్ఛాయయు ఖలమైత్రియును నవ
సస్యంబు యువతియు జవ్వనంబు
సంచితార్థంబు నీవత్కాల భోగ్యములు

వైచరాజు. పంచ. II-168

జలదములోని క్రొమ్మెఱుఁగుఁ జాయలు భోగపరంపరల్

లక్ష్మణకవి. సుభాషితములు

## భోగాసక్తి

భోగైక సక్తులగు వార లర్థ బంధు పుత్ర మిత్ర కళత్ర
ములయందు సక్తులై విపుల భవాంబుధి కెడలేక
బహుల పంకపతిత వనగజములువోలెఁ గదలనేరక
పొలియుదురు

భోగము లెప్పుడు వలయును
భోగాత్మక మిజ్జగంబు భూదేవవరుల్
భోగార్థముగాఁ దపములు
యాగంబులు సేయుచునికి యాత్మ నెఱుఁగవే
భోగైకసక్తులు సంతత సంగపరులు
నగువారి మతి పరమార్థ దర్శిని యెన్నఁడగు ?

మారన. మార్కం. V-100, 101

భోగులు కపటోపాయ
ప్రాగల్భ్యంబు నిధాన వనసిద్ధులకై
యేగతులనైనఁ దిరుగుదురు

శ్రీనాథ. హర. II-98

వడిఁ గాఁచి కాఁచి యుండన్
గడవల నీరినుము ద్రావుకై వడిఁ బై పై
బొడమెడు కోర్కులచేఁ బె
ల్లుడికిన మది భోగముక్తి కూఁటట గనునే

పెద్దన. మను. III-133

భోగవాంఛ వివేకమున బోవుఁగాని
భోగింప భోగేచ్ఛ పోనేర దెపుడు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

ఉదయాస్త సమయంబు లూరకె చూచి
మదిలోన భోగేచ్ఛ మానఁ నరుఁడు
ఉష్ణంగుఁగాని యాయువు పోవునెడు
చొప్ప వివేకించి చూడఁ డేమియును

వరద. రామా. అయోధ్య

ఆయువు కొంచెము సిరు లన
పాయంబులుగావు హృదయ భయభావంబుల్
వాయువు భోగాసక్తుల
కాయాసమె కాని కలుగవందు ఫలంబుల్

హరిభట్టు. మత్స్య. II-51

వర్తమాన సుఖము వాంఛించు చిత్తంబు
దృష్ట భోగరతిఁ బరిత్యజించి
తెలియఁ జూచికాక దేహి లోకాంతర
ప్రాప్తసౌఖ్యములకుఁ బరపుకెట్లు

హరిభట్టు. మత్స్య. III-118

## భ్రమ

ఒకఁడు వధియించువాఁడగు నొకఁడు వధ్యుఁ
డొకఁడు రక్షించువాఁడగు నొకఁడు రక్ష్యుఁ
డనఁగ నిదియంతయును భ్రాంతి ......

ఎఱ్ఱన. నృ. పు. V-111

చేతఁ జిక్కినట్లుండు చెప్పినదాఁక జ్ఞానము
నిక్కమువలెనెయుండు నిద్రించుదాఁకఁగల
సులభమువలెనుండు చూచేటి యాలోకము

ఏదియిందులో సుఖమెవ్వరు మంచివారలు ?
పాదుదెలియని ప్రాణి భ్రమ యింతేకాక !

ఆఱడిఁబాముగరచినట్టివాఁడు దినఁబోతే
జాఱని వేఁపచేఁదైనాఁ జప్పనైతోఁచు
పీఱిదై సంసారపు విషమెక్కినవానికి
చూఱలై హేయకాంతలు సుఖములైతోఁచును

తా. అన్నమయ్య. అధ్యా. సం.

కల్లయైన జగముగనుటెల్ల నిజమని
నమ్మి భ్రమనుజిక్కి నాతిగూడి
యెల్లజనులు మరతు రేకాంతుడగు హరి

భ్రమలడంచిన బ్రహ్మంబు బట్టబయలు

వేమన

వస్తు యాథార్థ్య మెఱుఁగక వస్తువునకు
నేదొ సంజ్ఞను మనముంచి యెఱిగినట్టు
లల్లనాడుదు మిదియంత యైంద్ర జాల
మందు దుముకులాడెదు బొమ్మలాటగాదె ?

పానుగంటి. వన, రాఘ.

చదువువారికి వెఱ్ఱిభ్రాంతులు
మెదడుకెక్కిన పాయవందురు

గురజాడ. ముత్యాలసరాలు

## భ్రష్టుఁడు

తనగుణముతాను దెలియక
వనరి యొరుని ననెడువాఁడు భ్రష్టుఁడు

వేమన

పడుచును గనకంబుఁ బ్రాయంబు నమ్మి
యడిగిన లేదని యర్థివర్గంబు
నెడపిన పాపాత్ము లిందును నందుఁ
జెడిపోవుదురు......

సింగన. ద్విప. భాగ.

## మంచిచెడ్డలు

చెడ్డ పోగొట్టి మంచి న్పెంచవలయు

మంచికి మించిన మనుగడలేదు
నిజముగ చెడ్డకంటెం జావులేదు

అ. నారాయణదాసు. వేల్పుమాట

మంచిచెడ్డలఁ గొంత యోజించి యేదొ
పద్ధతిని బూని భాగ్యదేవతకుఁ దుదకు
వదలవలెఁగాని యెప్పు డదేపనిగ మెదడు
చింపుకొని త్రొక్కులాటలఁ జెందఁ దగునె

మంచిచెడ్డ లెపుడు మనములో నుండును
గాని వస్తుచయములోన లేవు
ప్రకృతి భేదములను బట్టి యీభేదంబు
లన్ని సంభవించు

మేటిగుణమున కెపుడు తాఁ బేటి నడక
దుర్గుణమునకు మిడినాగు దుముకులాట

పాపుగంటి.

అజ్ఞలనునట్లు కాలంబునందు బాగు
నోగు నుండవు పనులంద యుండు నవ్వి

యొక్క సమయంబున నె పెండ్లి యొక్క చోటఁ
జావు వేఱొండు చోటునం జరుగుఁగాదె

విక్ర. దే. వ.

## మంత్రము

సర్వ కార్యంబులు మంత్ర మూలంబులు

నన్నయ. భారత. అరణ్య. III-348.

ప్రణవమను ప్రేకపుతోఁగూడి పాఁడి బిదుకు
నవనిసురులకు గాయత్రి యనెడు సురభి

శ్రీనాథ. కాశీ. III-181

పంచాక్షరి జపమందిన
సంచిత కర్మములు వాయు సాకల్యముగా
మించును బరమ జ్ఞానము
ద్రుంచును దుర్భ్రమలమదిని రూఢిగ

వేమన

అనఘ ! శ్రుతి చక్షుష్ట యైకాధిగమ్యమై
నిపుణ మంత్రి స ప్రణీత మగుచుఁ
గడు నపూర్వఫలము గావించు మంత్రంబు
యజ్ఞశీలునకు ధారాధిపతికి

సూరన. కళా. VII·241

జలజాసను లిఖితము బలె
ఫల కాలమునంద కానఁబడఁజేయఁ దగున్
దలఁచిన తలఁపంతకుమున
వెలివడకుండంగ మనుజవిభుఁడు

తెనాలి అన్నయ్య. సుదక్షిణా. II-155

## మంత్రి

విద్వాంసులై ప్రబుద్ధులైన వారలతో
మంత్రంబుఁ జేయునది ;

నన్నయ. భారత. అరణ్య. III-349

మంత్రి యేలికచిత్తమార్గంబు విడిచి
మంత్రంబుఁ జెప్పునే మనసెల్ల విఱుగ ?

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

పతికిఁగడు మంత్రికంటెను హితుఁడు గలఁడె ?

ధృతిమంతుఁడు ధీమంతుఁడు
మతిమంతుఁడునైన మంత్రి మహనీత్తతి నే
నతి సంపదగోరెడుఁ బతి
కతఁ డబ్బుట పెన్నిధాన మబ్బుట గాదే !

పతి మతిమాలి కానిపనిఁ బంచినఁ జేయఁగ నుత్సహించినన్
హితమతియై యమాత్యుఁడు సహింపఁగుదించియు నడ్డగించియుం

బతి యపకీర్తి దోషములు పాపి చరించుట నీతి

వర రథాశ్వ సుభటవర్గ మెల్లను గల్గి
చాలినంత భూమి యేలఁగల్గి
తగిన మంత్రిలేని ధరణీశు రాజ్యంబు
గాలిఁదూలు దీపకళికఁబోలు

జక్కన. విక్రమార్క. III-33, 132, 133

అంగవిహీను నిల్లటపుటల్లునిఁ బ్రల్లదు నీచభామినీ
సంగతు వామనున్ బధిరుసాధ్వసమానసునీచుఁ గాముకున్

వెంగలి నంగనాజితుని నిర్దయుఁ గ్రోధి ప్రమత్తు మంత్రిఁ జే
యం గొఱగామికెల్లఁ గుదురంచు గణింతురు నీతికోవిదుల్

పిల్ల. పిన. జైమి. IV-121

చెవి కిచ్చకపు మాటచవిచూపి కార్యంబు
మఱుగువెట్టెడువాఁడు మంత్రి గాఁడు

రామభద్రుఁడు. రామా. II-72

ధరణి శరీరము జీవుఁడు
నరపతి జను లంగములును నయనయుగము మం
త్రిరమణుఁడు గావున సచి
వరహితుఁ డరయంగఁ జీకువనువున మెలఁగున్

చరిగొండ ధర్మన. చిత్రభారతము. V-54

ఉపధాశుద్ధుఁ ద్రివర్గశోభితు శుభోద్యోగిన్ నియోగిన్ గృపా
విపులస్వాంతు నితాంతశాంతు స్వమనో విశ్రాంతు శ్రాంతు జ్ఞా
నపరున్ దానగురున్ బ్రసిద్ధగుణసంతానున్ సమానున్ గళా
నిపుణున్ మంత్రిఁగఁ జేసి భూపతిగనున్ నిర్ణిద్రసౌఖ్యోన్నతిన్

తెనాలి అన్నయ్య. సుదక్షిణా. II-160

పరమ స్వతంత్రులయి భూ
వరు సన్నిధి మంత్రులుండవలె నమ్మంత్రుల్
పరతంత్రులయినఁ గలవే
పురుషార్థము గౌరవము ప్రభుత్వము యశమున్

పతికి నభివృద్ధి దనకు శోభనము నైన
బుద్ధి బోధించునాతఁడువో సుమంత్రి !
పతికిఁ గెట్టయు దనకు నాపదయుఁ జేయు
బుద్ధి బోధించునాతఁడువో కుమంత్రి !

వైచరాజు. పంచతంత్రము. I-142,669

నృపతియగు వాఁడు విద్యా
నిపుణున్ బహుకార్యభార నిర్వాహకు శాం
తు పరజనమర్మ భేదన
కపటమతి న్మంత్రిఁ జేయఁగానగు

కదిరీపతి. శుక. I-468

చేతికి గంటమువస్తే
కోతికి సివమెత్తినట్లు కొందఱుమంత్రుల్
నీతిమెఱుఁగక బిగుతురు.

చాటు. మణి. సంపా. వేటూరి.

## మందమతి

జడమతికి సహజమే సంసారయాతన
తొడరిగాలప్పుడు తూర్పెత్తక తాను
విడిచి మఱచినవెనుక వెదకితేఁగలదా ?

తా. అన్నమయ్య. అధ్యా.

మందబుద్ధులకొక నియమంబు గలదె

నృసింహ. కవికర్ణ. II-108

జడమతులైనవారలకుఁ జక్కఁగఁ జిక్కునె సద్విచారముల్

అహోబలపతి. కాళింది. I-28

సఫలమగునె కోర్కె జడమతులకు

అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి. భద్రాపరిణయము

ఊబసోమరిబ్రతుకు కుత్తుకదంపు

అ. నారాయణదాసు. వేల్పుమాట

మీఁదుతలఁపుమాని మిగుల సోమరియయి
తిరుగు నట్టివాఁడు తిన్నఁబడఁడు

అ. నారాయణదాసు. సూరుగంటి.

మాయను బొందు ధీరులును మందమతుల్ గద!

విక్ర. దే. శ్రీని. II–59

## మతము

మతము మూలమెఱుఁగ మర్మంబు లేదయా

వేమన

మతికి సమ్మతమైనదే మతము సుమ్ము

నా. కృ. రావు. వెన్నెల వెలుగులు

ఇలను సోదరభావంబు వెలయఁజేయు
నామతంబంచుఁ గొందఱు మనుజులఁద్రు
దానిని విశుద్ధచిత్తంబుదక్క నొక మ
తంబ నెలకొల్పునే నిశ్చలంబుగాను

శశికి జ్యోత్స్నకు, మఱియును సవితకాత
పమునకెటువంటి భేదమో బ్రహ్మమునకు
జీవునకు నట్టిదేయని చెప్పఁజూమ్మ
మనుజ వితతికిఁ జైతన్య మతవరంబు

విక్ర. దే.

## మదము

గర్విమై కార్యమిట్టి దకార్యమిట్టి
దని యెఱుంగక లోకంబుచను పథమునఁ

దిరుగకున్నదవృత్తి వర్తించునట్టి
వాని గురునైన దండింపవలయునండ్రు

తిక్కన. భారత. ఉద్యో. IV-309

అవసరంబిచ్చుట యనుగ్రహంబు గాఁగ
మోముఁజూచుట యుపకారముగను బలుకు
మైత్రి గానప్పు డధికతరార్థముగఁ ద
లంతు రైశ్వర్యమదబలవంతులుబ్బి

శ్రీనాథ. శివరా. II-97

పాపము వాయదుప్పైఁ బైమనసున
యవ్వనమదమున నెడయదుకోరిక
కొవ్వును నణఁగదు కొంతైనా

ధనమదమిదేనన్ను దైవము గననీదు
తనుమద మెంతయిన తపముఁ జేయనీదు
ఘనసంసారమదము కలుషముఁ బాయనీదు
పొంచికామాంధకారము పుణ్యముఁగానఁగనీదు
పెంచియజ్ఞానతమము పెద్దల నెరుఁగనీదు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

మదముచేతఁ దత్త్వమహిమ గనదు

వేమన

మత్తు లుపకర్తల కేనియుఁ గీడు సేయరే

నృసింహ. కవికర్ణ. II-78

ధనమును రూపంబును నన
మనుజులకివి మదకరములు

హరిభట్టు. మత్స్య. IV-51

ఘనదుర్మదుఁడై తామునిఁగితే
కావేరి మందాకిని యెట్లు పోచును ?

త్యాగరాజు

శక్తిహీనుని కబలపై నందియంబు
కుటిలవిభునకుఁ బ్రజలపై గొండెములును
మహితబలునకుఁ గిన్వసామగ్రి వత్తు
త్వరగఁదలకెక్క మఱియు నెంతటికి దిగవు

పానుగంటి. చూడామణి

## మద్యపానము

మధుసంగతి జనులు రాగమయులగు డరుదే

వన్నెచోళ కు. సం. IV-109

మొదలి పెక్కుజన్మములఁ బుణ్యకర్మముల్
పరగఁ బెక్కుజేసి పడయఁబడిన
యట్టి యెఱుక జనుల కాక్షణమాత్రన
చెఱుచు మద్యసేవ సేయనగునె

నన్నయ. భారత. ఆది III-120

సారాయి త్రాగుట సభకుయోగ్యత కాదు

వేమన

మిన్నకుండక కొని తెచ్చుకొన్న పన్ని
పాతమాంతర పై త్యప్రబలత లేక
పుట్టునున్మాదమాత్మాంగముల దహించు
గరళపానము మధుసేవగాదె

పానుగంటి. వన రాఘ. IV

## మనశ్శరీరములు

నానావిధ భూతమయము
మే నతిచంచలము మనము

తిక్కన. భారత. విరాట. I-193

తను వికారములు తెరవులువెట్టిన
కొనయోర్చుకైనా కోలంతవచ్చు
మనసు వికారము మమతలందగిలిన
ఎనసియెదురువడ నెవ్వరితరము?

కంతువికారము కన్నులఁ గప్పిన
పంతపువిరతియు బయలౌను
చింతాలహరులు చీఁదర రేఁగిన
ఇంతయు వీడ్కొన నెవ్వరి తరము?

తా. అన్నమయ్య. అధ్యా. సం.

మనసునకు దేహమునకు సంబంధమున్న
యంతదాఁకనె తనుబాధలంటు నరుని
భక్తిభరితాత్మ తనువును బాసియెపుడు
వేఱగునొ తను బాధలుసోఁకు నపుడె

పానుగంటి. కల్యా. రాఘ.

## మనస్సు

ఆలుబిడ్డలిండ్లు నర్థంబుఁ జెలులును
బ్రోపుగూడఁబెట్టి పొదలు కుమతి
యదియ పిదపఁజెడఁగ నన్నింటిఁ దగిలిన
మనసు నుడుపలేక మడిసిపోవు

ఎఱ్ఱన. నృ. పు. IV-72

............హృదయంబ నేరుచు
నెదిరి ప్రాభవంబు నేర్పరింప

శ్రీనాథ. భీమ. II-112

ఈప్సితార్థంబునకుఁ జాలు హృదయరుచియు
నిమ్నమున కోడిగిలు నీరు నిలుపరాదు

శ్రీనాథ. హర. IV-7

తలఁపులోని వెలితే దైవము వలితౌ

ఎండలోనినీడ యీ మనసు
గడకుఁగట్టిన పాతగతి దోఁచె మనసు
అడుసులోపలి కంబమైతోఁచె మనసు
వానచేతకముంవలె నాయె మనసు
గోనెంబట్టిన బందక గుణమాయె మనసు
మరుఁగు జేసినచోట మరుఁగు నీమనసు
సిరిగలిగినచోటఁ జేరు నీమనసు

చిత్తమే పాపము చిత్తమే పుణ్యము
చిత్తమే మోక్షసిద్ధియును
చిత్తమువలెనే శ్రీహరి నిలుచును
చిత్తశాంతిలేక చేరదు పరము
అన్నిటిపై నున్నట్లు హరిపై నుండదు మతి !

చింతించఁ జింతించఁ జేతికివచ్చె మనసు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

ఒక్క మనసుతోడ నూరకున్న, సర్వసిద్ధుడగును

తననీడ తనకు శత్రువు
తననీడే తనకుసాక్షి తన దేహములో
తనవారె తనకు శత్రులు
తన మనసే తనకుతోడు తథ్యము

మనసు దిద్దరాదు మహి నెంత వారికి

ఇనుము విఱిగెనేని యినుమారు ముమ్మారు
కాచి యతుకవచ్చు కమ్మరీడు
మనసు విఱిగెనేని మఱి యంటనేర్చునా

వేమన

వైరులెవ్వరు? చిత్తంబు వైరిగాక

పోతన. భాగ. VII-266

మనో భావమొక్కటియే ప్రమాణ మభావ్య భావ్యపరీక్షకున్

పోతన. భాగ. IX-532

చిరకాల తపమునైనను
హరియింపఁగ నోపుఁ జిత్తమని పెద్దలు న
మ్మరు; జారులకున్ జారిణి
కరణిని నడరించుమనసు కామాదులకున్

గంగనామాత్యుఁడు. భాగ. V-86

ఊరు దూరమైతే మనసు దూరమా?

చిన్నెలు మెరయించి చిరునవ్వు నవ్వని
చిత్తమేటి చిత్తము

క్షేత్రయ్య

కష్టములు పైకిరాఁబోవఁ గను భయంబు
హృదయ మొందును; వచ్చినపిదప నట్టె
యడఁగి యలవాటుపడి కుదుర్పడును జుమ్మి
యట్లు కాకున్న బ్రదు కసాధ్యంబుగాదె!

పానుగంటి. వనవాస.

పరధనముల్ హరించి పరభామలనంటి పరాన్నమబ్బినన్
మురిపము కాని మీదనగు మోసమెఱుంగదు మానసంబు

కంచర్ల గోపన్న. దాశరథీ శతకము. 48

మనసు గోరెడి కోరికల్ మట్టులేవు

ముద్దుపళని. రాధికా. II–64

వనితయుఁ గాదిఁక మందిర
మునుగాదు మనంబె బంధమునకున్ మోక్షం
బునకుం గారణము

మనంబు దొంగగొడ్డువంటిది
మనసే బంధము సుమ్మా
మనసే మోక్షంబునకును మార్గము తెలఁపన్

దా. శ్రీ. దేవీభాగ. –520, 673, 676

మనసు చల్లఁబడక మాటలెన్నాడిన
ముక్తి కాదు వాదశక్తిగాని
మనసె కారణంబు మఱి బంధమునకు మో
క్షమున కనుచు దెలుపు చదువు వినమె

కనుపర్తి. కవిరాజ I–157

ప్రకృతిచేతనె చంచలంబకట మనసు

కందుకూరి. రత్నావళి III–52

తలపునణఁచిపెట్టఁ దరము కాకుండు

ఆది. నారాయణదాసు. వేల్పుమాట

పిన్నవారికైన పెద్దలకైనను
మంచిచెడ్డఁ దెలుప మనసె సాక్షి

ఆది. నారాయణదాసు. భీష్మ చరిత్ర

మనసు ధైర్య మొందినకొలందిని సమస్త
చిత్తశక్తి ప్రపూర్ణమై చెలఁగుచుండు
నది నిరుత్సాహ మందుకొలఁదిని శక్తు
లెడసినీచమై ధ్వంసమై చెడునుగాదె!
రోగమే లేనివాఁడైన రోగసంశ
యంబు మదిలోనఁ బొందిన యంతలోన
వ్యాధిపీడచేఁ బరలోకవాసి యగును

పానుగంటి. హాస్యవల్లరి

సుఖపుముదము; కష్టపుభీతి సుఖముదుఃఖ
ము మదిఁజేరనంతవఱకె; మోదదుఃఖ
ములకు మనసు మొదటనింత యులుకుఁజెంది
వెంటనే తటస్థతనొందు వింతగాఁగ

పానుగంటి. వనవాస.

పదుగుఱకు సర్వమాగాత్ర బలముకలదు
ప్రాణికోట్లనురక్షించు ప్రాణముండు
నేది యెటులుండినను లాభమేమికలుగు
నుండనలసిన మతి చెడియుండినపుడు

ఎన్నికోర్కులు తంత్రంబు లెన్నియెన్ని
యెన్ని పన్నాగములు మనసున్నవేళ

నది రవంత స్తంభింపఁగ నన్ని బందు
అఖిల సృష్టికిఁ గారణమగును మనసె

పానుగంటి. చూడామణి.

స్వర్గ నరకములనుగూర్చి చర్చయేల ?
నరునిమనసె స్వర్గంబును నరకమునగు

సెట్టి లక్ష్మీనరసింహం. చిత్రహరిశ్చంద్రీయము. II-35

ఘనతర దుఃఖంబులకును
మనముగదా కారణంబు

కోలాచలం. సుఖమంజరి I-23

## మనోనిగ్రహము

అతివల యందేలతగులు నత్యంత దృఢ
వ్రతుల మనంబులు వారల
మతులఁ దృణస్త్రైణములు సమంబులు కావే !

నన్నయ భారత. ఆది. VIII-157

మదికిఁ దిన్నఁదనమునీ
వాపాదింపుము చలమును
గోపముఁ గ్రౌర్యంబువిడువు గుణరత్ననిధీ

తిక్కన భారత. సౌప్తి. I-80

విను పశుయజ్ఞము హింసన
మనంతఫలదంబుగా దహంకృతిసహితం
బనఘా వాఙ్మనస నియమ
మను యాగంబిచ్చు నవ్యయానందంబున్

తిక్కన. భారత. శాంతి. IV-28

నెమ్మనము గెల్చినసిద్ధికి వేఱయత్నము
న్వలవదు సేయ నెవ్వరికి

మారన. మార్కం. III-371

ఏకచిత్తమున నుంటే యెక్కుడు

తా. అన్నమయ్య. అధ్యా. సం

మనసు నిలిపినతఁడు మహనీయమూర్తి

మనసు నిలపకున్న మరిముక్తి లేదయా

వేమన

చపలములేక యేవేళఁ జింతించే మహాత్ములకు
జపతపోనుష్ఠానములు సేయ నేటికే

రామదాసు చరిత్ర

భావము నిశ్చలంబయిన బ్రహ్మముదానగు నిర్విశేషతన్

కనుపర్తి. కవిరాజ. I-141

మనసు నిల్పశక్తి లేకపోతే మధుర
ఘంట విరులపూజ యేమిజేయును ?

మనసు నిల్పనివారు మాయాజాలముఁజేసి
మఱిముక్తి గొందనానే ?

మనసు స్వాధీనమైన యా
ఘనునికి మఱి మంత్రతంత్రము లేల ?

త్యాగరాజు

దళము శివునిమీద, తలపు సానులమీద
నైన ఫలముగలదె యవనినాథ !

దా. శ్రీ. దేవీభాగ. VI-251

## మన్మథుఁడు

కాముమాయల నెవ్వారు నేమిగారు ?

వన్నెచోర. కు. సం. I-104

......పంచాస్త్రుఁ డత్యంత దు
ర్జనుఁ డెల్లప్పుడుఁ బొంచి యౌవనవయఃప్రారంభ శుంభద్వధూ
జనులన్ హేతువొకింత గల్గిన నవశ్యంబుం గలంచుం గడున్

సిద్ధరాజు తిమ్మరాజు. పరమయోగి విలాసము

కోపమగువారి బెదరించి కూర్చ నేర్చుఁ
గూడి మనువారిఁ దమిగొల్పి కూర్చ నేర్చుఁ
గొమ్మలకు మగలకుఁ బెండ్లి గూర్చ నేర్చు
జగతి నెంతటి యుపకారి శంబరారి

చేమకూర. విజయవిలాసము. II-203

కృపణుదీను వ్రతస్థునిఁ గృశునినైన
మరుఁడు బాధించుఁబో యింకమాటలేల

భవానీశకవి. ధర్మ. IV-214

......ఘటింపలేఁడె ఘటనా ఘటనాకృతి మారుఁడెంతయున్

అహోబలపతి. కాళింది. II-41

ఉవిద పురుషుఁడెంతయు గూడియున్ననైనఁ
గంతు కోటికంచు తగుల కైక్యంబుగారు

పానుగంటి. కోకిల.

## మమకారము

మమత విడువవలయుట సరి ని
స్సారపు సంసారమునకుఁ
గారణము మమత్వమగుటన్

ఇది నాయదియను నూఁత
న్నది నెయ్యది పట్టుకొల్పినను వాసితమై
తుదిఁ జేటు నొంది వానికి
నది శోకము నావహించు నత్యంతంబున్

......మమకార వర్జిత
మనస్కులకుఁ బుణ్య పాప మార్గంబులు లే
మిని లోకంబులఁ ద్రిమ్మర
రన ఘా! పొందుదురు శాశ్వతానందంబున్

తిక్కన. భారత. శాంతి. VI-13, 98, 114

ఘన బిడాలంబుచేఁ బడికాటు వడిన
యపుడు తన కుక్కుటంబున యందుఁగలుగు
వంత గలుగునెమది మమత్వంబులేని
యెలుకయందుఁ బిచ్చుకయందు నించుకైన

ఎందెందుఁ గరము మమతం
బొంది పరఁగుచుండునెపుడు పురుషునిమది దా
నందంద తెచ్చియిచ్చు న
మందములగు వగలనది క్రమక్రమ యుక్తిన్

మారన. మార్కం. III-300, 301

పరిలేని మమకారజలధి దాఁటినఁగాని
అరుదైన నిజసౌఖ్య మది వొందరాదు

దురితంబునకు నెల్ల దొడవు మమకారంబు

అన్నమయ్య. అధ్యా. ౩౦.

......జనించు ననురాగంబుల్ మమత్వంబుచేన్

సూరన. కళా. III-266

అనూన మమతా మహిం జేసెనే నం దోంచున్
లేని కొమరుందనము లేని చెలువంబు

సూరన. కళా. IV-50

ఉపగతులై భజించు తనయుల్ సహజన్ములుగూర్మి చుట్టముల్
విపులతరైక దుఃఖముల వ్రేగుదు రింతియ రారు వెంబడిన్
నిపుణుల కేల తన్మమత నెట్టన దేహిశరీరమూడ్చి చ
న్నపుడును ధర్మమొక్కడసహాయము దానిం ద్యజింపవచ్చునే

పైచరాజు. పంచతంత్రము. III-127

శీతలజలములు దహనము
చేతం గదునుష్ణమైన చెలువున మమకా
రాతిశయంబగు ప్రకృతి ప
రీతంబై కుందుం బో శరీరి

వెన్నెలకంటి సూరన. వి. పు. VIII-432

బంధు సంకల్పంబు పరమ మూఢులకు
నంధ పరంపరై యరుదెంచుచుండు
ఇతఁడు బంధుఁడునాకు నితఁడన్యుఁ డనుట
మతిలోన నెలకొన్న మమత సత్త్వంబు

తిమ్మయ. ద్విప. భారత. భీష్మ.

ప్రణయ బంధంబు వేత్తైనపట్ల నిబుడు
మఱచు టే వింత తొల్లింటి మమతలెల్ల

చెంగల్వ కాళకవి. రాజగోపాల I-106

మనసు దెలిసి మెలఁగు సతిపై !
మమతయే వలదా ?

తిరుమలకవి. చిత్రకూట మాహాత్మ్యము. య. గా.

మాయలోపల నెంత మహిమ యున్నదియో
మమత లోపల నెంత మహిమ యున్నదియో

వేంకట పార్వతీశ్వర కవులు. ఏకాంతసేవ

చిర భుక్తమైన నేలన
చిరాను భూతయగు ప్రేయసింబలె బలవ
త్తరమగు విధిచే గాకె
వ్వరు విడువం జూతురు

తిరు. వేం. పాండవోద్యోగము. II-30

## మర్యాద

మరియాద దప్ప మెలఁగిన
బురుషార్థంబునకు హాని పుట్టకయున్నే

తిక్కన. భారత. విరాట. I-122

మనము గావించిన మర్యాద లన్ని
మనమె చేయుటకన్న మఱి ధర్మమేది?

సుభద్రాకల్యాణము. ద్విపద

ఎదుటివారిని మర్యాద నెలమిజేసి
తాను మర్యాద బడయుంగఁ దగునునరుఁడు

కం. వీ. పం. నీతి

మరియాదనకుపని మానిసికన్న
బ్రతుకు చాలించిన పసరము నయము
పరువుమాలినవాని బ్రతుకెల్ల ఱోఁత
పరువుమాలిన వాఁడు పనిలేక బ్రతుకు
మత్తిల్లి తిరుగుట మరియాద కాదు

మరియాదకలవాని మదిసొమ్ము తనివి
తనవారి మర్యాదఁ దప్పినవాఁడు
మనుటకంటెన్నిల్లు మారుటనయము
జగమునకున్మేలు సలిపెడు కోర్కెఁ
తెలుఁగుటతగు మానిసికి మరియాద

అ. నారాయణదాసు. వేల్పుమాట

## మహాత్ముఁడు

వ్యాజమున ధర్మలోపం
బాజిజయా! పరిహరింతురయ్య మహాత్ముల్

నన్నయ. భారత. ఆది. VIII-123

అరులగుణములైన నగ్గింతురెప్పుడుఁ
గలయ బెరసినపుడు గలితనంబు
మెఱయుదురు మహాత్ములు

తిక్కన. భారత. విరాట. IV-228

అలఘుతపంబులం బ్రకటయాగములన్ మునిచోదితవ్రతం
బుల మహనీయదానములఁ బుణ్యచరిత్రములన్ మహాత్ములెం
తలు రమణీయ విశ్రుతపదంబుల కేఁగుదురు

తిక్కన. భారత. ద్రోణ. II-338

అనుభవ పర్యంతం బె
వ్వని చిత్తముతత్త్వవీథి వర్తించు మహా
త్ముని నాతనిఁ బొడఁగను వ
జ్జనులకు నాక్షణమ కిల్బిషంబు లడంగున్

శ్రీనాథ. మ. V-195

చిత్తమందునుండు శివుని సంభావించి
భక్తితో హృదయము పదిలపరచి
నిత్యమెఱుఁగువాఁడు నిశ్చలచిత్తుండు

రామరామయనుచు రంజిలమదివేడి
రహితపడక మదిని రవళివినుచు
మనసునంటియున్న మహనీయుఁ డపుడగు

వేమన

............ మహాత్ములైన
వారి మాహాత్మ్య మాత్మగర్వమునఁ జేసి
జడులు పొడగానఁ జాలరు జలజనేత్ర

పోతన. భాగ. IV–69

ఊరక రారు మహాత్ము
వా రధముల యిండ్లకడకు వచ్చుటలెల్లం
గారణము మంగళములకు

పోతన. భాగ. X–284

మహానుభావులం గొంతమేరయైనం
గొలిచి వచ్చుటభాగ్యంబు గాదె

సూరన. కళా. I–54

అఖిలలోకోపకారార్థమై మహాత్ము
లెంత తగ్గినఁ దగ్గుగాదెంచిచూడ
దేవకార్యార్థమై పొట్టిదిట్టయైన
హరికి నగుబాటువచ్చెనే ?

పు. తిమ్మన. సమీర. II–197

.. ఘనప్రభావులకుఁ జిత్రమెయుల్లము చల్లసేయుటల్

పు. తిమ్మన. సమీర. IV-166

........ ... దృఢవ్రతులగు మహాత్ము
లాడఁబడినమాట వోఁద్రోవనోర్వఁగలరె

భవానీశకవి. ధర్మ. VIII-294

ఎందరో మహానుభావు లందరికి వందనము

త్యాగరాజు.

కంధికంటె నగాధ మాకాశవీధి
కంటె నెత్తు పిడుగుకంటెఁగట్టి, సుమము
కంటె మార్దవ మమృతంబుకంటెఁదీపి
ముసిడికంటెఁ జేదగు మహాత్ముల మనంబు

పానుగంటి. విజయ.

మహితులకు సృష్టి పరతత్త్వమయముగాదె!

పానుగంటి. రాధాకృష్ణ

పండిన చేనువిధాన మహాత్ముఁడు వంగియుండు దానెపుడు

ఆ. నారాయణదాసు. యథార్థరామా.

అవును మహాత్ముల హృదయము
లెవరు తెలిసికొన సమర్థులీ విశ్వములో
అవి వజ్రముకంటెఁ గఠిన
మవి మెత్తనిపువ్వుకంటె నతికోమలముల్

చ. గ. శా. ఉత్తరరామ చరిత్ర. I-17

మహాత్ముల కసాధ్యములుం గలుగంగ నేర్చునే

తిరు. వేం. కవులు. బుద్ధ. VI-10

మానహానికి సమ్మతింపరు మహాత్ము
లసువులైనను విడుచుట కనుమతింత్రు

తిరు. వేం. కవులు. పాండవోద్యోగము. II-20

మాంసాహారము

జనవర! మాంసము చవిగఁడ
చిన చవులరయంగ లేమిఁజేసి చవి యెఱిం
గినవాఁడది యుడిగిననా
తని దేవసమానుఁడండ్రు ధర్మవిధిజ్ఞుల్

మానను జాతనుంగలదె మాంసము ప్రాణుల మేనఁగాకయ
మ్మానుల నొంచునప్డు తమ మేనులు సోకినమాత్ర నెట్లగున్
దానిఁ దలంపఁగా వలదె తానది మానిన హింసలన్నియున్
మానవెయంచు నుత్తముఁడు మాంసము మానుదయార్ద్ర
చిత్తుఁడై

అన్య మాంసమున నిజాంగ మాంసంబుఁబో
షింతుననుట కంటెఁ జెట్టలేదు
మాంసభక్షణంబు మానుటకంటెను
మేలులేదు కర్మజాలకమున

ఆత్మ సదృశత ప్రాణ భయంబునందుఁ
బ్రాణములకు నెల్లఁగని మాంస భక్షణంబు
మానుదయ నార్ద్రమానసుండైన పురుషుఁ
డాతనికి బ్రహ్మలోకాదు లాటపట్టు

తిక్కన. భారత. అను. IV-293, 294, 306, 308

శవముఁ బూడ్చెడుచోటు శ్మశానమొకద
దానిఁ గడుపునఁ బూడిచి తనదు కడుపు
వల్లకాఁడుగాఁ జేయుట భవ్యమగునె
తెలివియేపాటి యైనను గలుగునేని

తృణముఁదిని మాంసమునుబెంచు మృగము వ్రేలఁ
జేసి మేని చర్మంబును జీరుచుండ
మాంసమునుదిని మాంసంబు మానుగాను
బెంచు నరుగతి యేమౌనొ ! పెఱభవమున

విక్ర. దే. వ.

## మాతృప్రేమ

తల్లిప్రేమ గరముఁ దనరారు ముంగిట
ముత్తెమగుచుఁ గ్రొత్తక్రొత్త సిరుల

నూరన. కళా. VI-197

కాలువనీళ్ళన్ని కడు సంద్రమాయె
కడలేని మోహామే కన్నతల్లికిని

పాతపాటలు - తె. కా. సం.

పితదయకుఁ బార్థివపుటంటు వెలయుఁగొంత
సుతదయకునైహికపుసొక్కు సుంతకలదు
సతిదయకు మట్టిరంగు కానంతయుండుఁ
దల్లిదయ శుద్ధ దివ్యతత్త్వంబొకండె

పానుగంటి. కల్యా. రాఘ.

## మానధనుఁడు

బ్రదుకవచ్చుఁగాక బహు బంధనములైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక

జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు మానధనులు

పోతన. భాగ. VIII-599

మాన మంతయును బొందు గౌరవవంతునకిలఁ
బ్రాణమన్నఁ దృణప్రాయ మానుగాదె!

పానుగంటి. నర్మదా.

## మానము

......................మాన ధనాఢ్యుఁడైన భూ
పతి సహించింప నోపునె సపత్నుల వృద్ధియు నాత్మ హానియున్

నన్నయ. భారత. సభా. II-98

మానము ప్రాణముకంటెఁ జాల
నెక్కుడగుట సెప్పఁగా వినవొ

తిక్కన. భారత. శల్య. II-57

మానంబె ప్రాణంబు మహితవృత్తులకు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

మానంబరయఁగఁ బ్రాణస
మానము మానంబు సఖుఁడు మానమె ధనమున్
మానము విడుచుటకంటెను
మానుగఁ బ్రాణములు విడువమంచిది తలఁపన్

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 2349

మానముకంటెఁ బ్రాణములు మంచివియే తలపంగ?

నాచన సోమన. ఉ. హ. వం. VI-137

సమరమున నుండి తిరుగక చచ్చుటకంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరఁగుటకంటె
మానధనులకు భద్రంబు మరియుఁగలదె?

పోతన. భాగ. VIII-88

మానహీనంబైన మనికి యేమనికి?

సోమన. ద్విప. భార. కర్ణ

మానంబె తోడవుసతులకు
మానమె ప్రాణాధికంబు మానమఖిల స
మ్మానములకు మూలంబగు
మాన రహితమయినబ్రదుకుమానినికేలా

తిమ్మన. పారి.

మాన మెడలిన వెనుక ప్రాణమేటికి?

మానమే భూషణము మానవతులకెల్ల

క్షేత్రయ

అభిమానవంతు డెందయిన శత్రు
కృతతిరస్కార మెట్లు సహింప నేర్చు?

ఏ. ల. కవి. సుధా. నీతి. 30

మానమె ధనముం గేహము
మానము సర్వంబుచూడ మానవతులకున్
మానము పోయిన వెనుకం
బ్రాణముతో నుండవలెనె పద్మదళాక్షా

ముద్దుపళని. రాధికా. IV-90

ప్రభుఁడొసఁగు నీవియెంతని పలుకవచ్చు
నతఁడొసఁగు తన్నులెన్నని యరయనేల

జనుని బహుమానమున మానసరణికాని
పరిభవమునందుఁ బరిమాణకరణమేల

పానుగంటి. చూడామణి

ప్రాణమిదియేల మానంబు పాయనున్న

శ్రీపాద. బొబ్బిలియుద్ధము. I¡-41

## మానవసేవ

పరగ దీనజనులయందు పక్షముంచి తేచాలు
పరమాత్మునియందు ప్రీతిపెట్టనేటికే

రామదాసు

మనతోటి పాటివారలకు నై పాటుపడుడు

అ. నారాయణదాసు. భీష్మ.

హరియె లోకంబు లోకంబె హరియటంచు
శ్రుతివచించుట వలన విశ్రుతముగాను
దృశ్యమును బరిచర్యకు నిమ్మనగుట
లోకసేవయె యుత్తమ లోకపథము

విశ్వ దే. ప

## మానవుఁడు

సర్వభూతదయా స్వరూపంబైన
ధర్మ వెఱింగెడువారు మనుష్యులుకారె

నన్నయ. భారత, అరణ్య. III-322

నానాభేదములు నరుల గుణంబులు
తెగని కర్మములు దేహధర్మములు

అన్నమయ్య. అధ్యా. సం.

నీళ్ళలోన చేప నెఱిమాంసమాశకు
గాలమందుఁజిక్కి కూలినట్లు
ఆశపుట్టిమనుజుఁడారీతి జెడిపోవు

చేటువచ్చువేళ జెడనాడు దైవంబు
మేలువచ్చునేని మెచ్చుకొనును

వేమన

మానుష దేహము గలుగుట
భూనాయక! దుర్లభంబు; పుట్టినమీఁదన్
దానముఁ బరోపకారము
భూనుతకీర్తియును వలదెపురుషున కెందున్

పోతన. భాగ. IX–243

మనుజులెల్లను జరామరణాదికముల
ననుదినంబు లయించునది నిక్కువంబు

వరద. రామా. అయో.

పెరుగుట (సగ్గుట పిదపఁ బుట్టుటయుఁ
దరమిడి నైజంబు; తప్పింపదగునె!

సోమన. ద్విప. భార. స్త్రీ.

చిదుకులు కదల్చుటనునగ్ని చెలఁగిమండు
చెడుగుఁ జేయుటచేఁ బాము పడగవిప్పు
మఱియు క్షోభంబువలననె మానవుఁడును
దనదు మహిమంబు చూపును దథ్యముగను

కం. వి. అభి.

ధనమునందును బ్రతుకునందును నరుండు
తనివి గనఁ డెంత ధనముఁ బొందినను మఱియుఁ

బొందఁగోరును; శతవర్షము లిల మనిన
మఱియు మని యుండఁగోరును మమతవలన

విక్ర. దే.

ఒరుల గొప్పంజూచి యోర్వలేకుంట
ఆకసంబున మిద్దె లల్లుకొంచుంట
తప్పని ముప్పుకై తలడిల్లుచుంట
ఉన్నదానన్దన్వి నొందక యుంట
అరమరతోడుత నల్లాడుచుంట
ఎల్లవారలకు కీడే యెంచుచుంట
తగవరి వలెఁ బైకి తల ద్రిప్పుచుంట
కయ్యమునకు ముందు కాల్దువ్వుచుంట
తెలిసి నల్లిల్లయు న్దగ నీల్గుచుంట
ఎల్లరికన్న దా నెక్కువ నొకంట
తనమేటి నేరమెంతయుఁ గొంచెమనుట
ఒరుల తప్పొక్కింత యున్నె న్నచకుంట
తన సుకమునకునై తంటాలుపడుట
పుట్టు తెవుళ్లివెప్పుడు మానిసులకు

అ. నారాయణదాసు. వేల్పుమాట

తాను దనపండు దినఁబోదు తేనె యరఁటి
తాను దనపాలఁ గ్రోలదు ధన్య సురభి
తాను దనతావిఁ గ్రోలదు తమ్మిపూవు
జగతిలో నరుఁ డొక్కఁడే స్వార్థపరుఁడు

వేం. పార్వ. కవులు. కావ్యకుసుమావళి. III

ఒకటి యొకదాని యాశ్రయ మొంది తిరుగు
గ్రహము లట్టులు మనుజు లొక్కనిని నొక్క

రంటి తిరుగుదు రడియాస లావరింప ;
ఇంట బంగారు బొమ్మయా నింతియుండ
సొట్టదానికై నరుఁ డట్టె గొట్టవేయుఁ
దనదు సుఖమేదొ తనలోనఁ దనరియుండఁ
బరుని పాదాలపైఁ బడి ప్రాకులాడు

మానిసికినున్న దే దైన లేనిదగును
లేని దే యుండఁదగినది లేనివాని
కేడ్వఁదగినది యుండి లేకేడ్పు లేక
లేక యేడుపే బ్రదుకగు లోకమందు
అన్నమున్న యాతనికి మందాగ్ని బాధ
అశన శూన్యున కాకలి యపరిమితము

పానుగంటి. చూడామణి

జనుఁడు బుద్ధిపూర్వకముగఁ జలుపు తప్పు
నొప్పుకొనఁ డందులో నేదొ యొప్పుఁ జెప్పుఁ
దనదు తప్పెంత గొప్పదై తనరునంత
పెద్ద తలతిక్కలోఁ బడి వెట్టినొందు
తప్పు వదలెడు నాతఁడే గొప్పవాఁడు

పానుగంటి. బుద్ధ.

## మాయ

సతతముఁ బురుషుఁడు సతుల యధీనము
అతివలు వయసుకు నధీనము
గతియగు వయసులు కాలాధీనము
అతిశయ మిది ! మాయాధీనము

కాయపు మదములు కప్పఁగఁ గప్పఁగ
ఆయములంటీ నదె మాయ

కలలోపలి సంభోగము ఘనమగు సంపద లిన్నియు
వలలోపల నిడి పరువులు వన్నెల విభవములు
దెలిసినఁ దెలియదు ఇదివో దేవ రహస్యంబు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

మాయనుఁ దలఁగించి మన నేర్చువాఁడు
నేయెడ సిద్ధుల కెల్లను రాజు

గౌరన. నవనాథ.

హరియుం దన మాయాగతిఁ
బరికించియుఁ గానఁ డయ్యెఁ బరిమితి లేమిన్

పోతన. భాగ. III- 226

తనదు మనసటు నిల్వక దానికొంట
నరుగు నాతండు పో యధమాధముండు
సొరిది మాయా మహాలతల్ చుట్టుకొన్న
సంతతంబును మిగులఁ గ్లేశమునఁ బొరలు

పిడుపర్తి బసవన. ప్రభులింగలీల

మాయలో నుండియు మాయావిదూర
మైయున్న తత్త్వంబు నరిదియె యెఱుఁగ

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

మాయలని తెలిసి రజ్జుపై నురగ బుద్ధి చెంద నేల ?

త్యాగరాజు

మాయలోఁ జిక్కి సొక్కని మనుజుఁడెవఁడు ?

దా. శ్రీ. దేవిభాగ. I-553

మాయ గెల్చినట్టి మగఁడెవండు ?

దా. శ్రీ. దేవీభాగ. VI-480

ప్రజలు గతినిబడు సర్వ బాధలకుఁ గ
తంబుశుద్ధ నిష్క్రియమగు బ్రహ్మంబుగాదు
గుట్టు తెలియంగ నీయక పట్టువడక
మహిని మిుప్పోకలను బోవు మాయగాని

పానుగంటి. సరోజిని

## మార్గదర్శి

మెఱుఁగగలుగు నాతఁడేది యొనర్చిన
నది యొనర్తు రితరులైన వార
లతఁడు సత్యమిట్టి దనినేని లోకంబుఁ
దత్ప్రవర్తననునఁ దగిలియుండు

సింగయ. భాగ. VI-113

యోచనలు సేయువాఁ డొక్కఁ, డాచరించు
వారనేకులు ; పొరపాటు వాఁడు పడినఁ
గోట్లు కొలఁదిఁ గుజనులగుదు రొకని ప్ర
మాదమఖిల జీవనగతి భేదకంబు

పానుగంటి. ...

............ తగఁదామువచించు ధర్మముల్
చేతలనిల్పరింతురు విశిష్టులువారుగదా జగద్గురుల్

వేటూరి, కపోత కథ



## మితభాషణము :

మితములు సద్భాషణములు
హితములుగా బలుకువానినెల్లజనులుస
న్నుతు లొనరించుచు మ్రొక్కుదురు

వేమన

ఎనయఁగ నెవ్వరెంతమనసిచ్చి వచించిరితాను వారితోఁ
బనువడనంతమాత్ర ప్రతిభాషణమాడుట యుక్తమండ్రు

సూరన. ప్రభా. III-63

ప్రాజ్ఞుఁడగువాఁడు సత్యంబుపల్కువాఁడు
పలుకుపొందిక నేర్పు జొప్పడనివాఁడు
దొరుకుటదలంప ......... దుర్లభంబు
వదరుఁబోతులు వందలు వందలుండ్రు

దా. శ్రీ. దేవీభాగ. V-255

## మిత్రుఁడు :

గుణవంతుఁడైనను గుణహీనుఁడైన
గణియింప సఖుఁడు సద్గతియండ్రు బుధులు

ఆపదలకు సఖుఁడైనట్లు చుట్ట
మాపాటి గానేరఁడారసి చూడ

గోనబుద్ధారెడ్డి, రంగ. రామా. కిష్కిం.

మనమున మిత్రుని మఱవక
తన మిత్రహితంబుసేయుతద్‌జ్ఞుఁడురాజ్యం
బును యశముఁ బ్రతాపముఁ గని

జన శేఖరుఁడై చరించు సర్వశ్రీలన్

అరయఁగ సముఁడు సదోపాకరుఁడునునగు సఖుఁడు పరమగతి
చెలికొలఁకై
సిరివిడుతురు దేశమువిడుతురు బంధులవిడుతు రెలమితోనార్య
జనుల్

మల్లికార్జునుఁడు. భా. రా. కిష్కింధ. 83, 401

ఏడు మాటలాడినయంత నెట్టివారు
నార్యజనులకుఁ జుట్టంబు లగుదురు

తెరువునడుచువానికి రోగార్తునకు
గృహస్థునకు మృతిబొందినవానికిఁ
గ్రమంబున సార్థంబును వైద్యుండును సద్భార్యయుఁ
గృతంబగు ధర్మంబును బరమ మిత్రంబులు

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-246, 439

ఎడమడుగులేని నెచ్చెలిఁ
బొడగాంచుట చచ్చి మరలఁబుట్టుటగాదే ?

పోతన. భాగ. X-202

చిత్తమెల్లనిచ్చి చెలితనంబున వచ్చి
నచ్చి కలయమెచ్చి నమ్మువానిఁ
గరుణ గలుగువాఁడు కడుసౌమ్యుఁ డగువాఁడు
చింతసేయకెట్లు సెఱుపనేర్చు ?

సింగయ. భాగ. VI-116

అరివలె నుండుట క్రియలం
బరమాప్త స్ఫూర్తిఁ దేటపఱుచుట యదివో
యరయ సుహృల్లక్షణము

భైచరాజు. పంచతంత్రము. II-66

సహవాసుల దుఃఖము నెయ్యు రోర్తురే

తిమ్మన. పారి. II-31

మిత్రునభ్యుదయంబు మిత్రునకొసఁగఁ
బాత్రంబు......

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

చనునె సంగడికాని చపలోక్తులాడ

తిమ్మయ ద్విప భారత. విరాట

చెలిమితో గుణులు డాసిన మేలువిడిచి
యొలసి దోషంబు సేయుదురె!......

సోమన. ద్విప. భారత, శాంతి.

సరసజేరి నిన్ను సంస్తవ మొనరించు
వారలెల్ల సఖులుగారు నీకు
కష్టకాలమందుఁగాచువాఁ డొక్కండె
నిక్కమైన సఖుఁడు నీకుఁదలఁప

కం. వీ. నీతి. 70

మంచిచెడ్డ లొక్కమాడ్కిని చెలికాండ్రు
వంతు పంచుకొనక బాగుపడరు

ఆ. నారాయణదాసు, నూరుగంటి

వింతవస్తువుల్ సఖునకర్పింపవలయు
నాదరార్ద్రంబులగు మాటలాడవలయుఁ
దనకు సములుగఁ గనఁదగుఁ దానువారి
సుస్థిరయశోభివృద్ధికై చూడవలయు
ఆతఁడశ్రద్ధగానుఁడ నతనియాస్తి
రక్షణము సేయఁదగుఁ గష్టరాజినుండఁ

దోడుపడఁదగు దుష్టులఁ గూడియుండ
వదలిచి కుటుంబమునఁ జేర్పవలయుఁ దిరుగ

పానుగంటి. బుద్ధ.

ఆత్మలాభ పరాయణులగుచు నరులు
ప్రాణమిత్రులవలెనె గన్పట్టుచుందు
రవసరముదీఱ నందఱు నడుగుచుంద్రు
నిజహితుండు లేడవనిలో నిశ్చితంబు

చిలకమర్తి. గయో. IV-82

మిత్రుఁడెపుడును వారిజమిత్రులీల
దనదువంక కాకర్షించు కొనుచునుండు

కాళ్ళకూరి. చింతామణి. IV-37

ముక్తులు

చదువులందును రాజ్యపదవులందును పాడి
మొదవులందు స్త్రీల పెదవులందు
నాశలుడుగునట్టి యయ్యలు ముక్తులు

వేమన

విష్ణుభక్తులై వివేకులై తృష్ణావి
దూరులై స్వకుక్షి పూరణంబు
సమయ సంభృతార్థ సంతృప్తి గాఁగోరి
పడచువారు భవము గడచువారు

తెనాలి. పాండు. మాహా. V-319

ఆత్మను గ్రసించు ప్రబల మాయాశుభాంగి
నంత మొందిచు శూరుఁడే యద్వితీయుఁ
డతఁడెస్థిరుఁడు; లోకాతీతుఁ డతఁడెముక్తుఁడు

పానుగంటి. కల్యా. రాఘ.

## ముముక్షువు

శ్రేయంబు పురుషునకు ముముక్షుంబోలి యొండుగలుగదు

మారన. మార్కం. III-289

తపముసేయువాఁడు దత్త్వజ్ఞుఁడగువాఁడు
నెలమి మోక్షమిచ్ఛగించువాఁడు
నేకతంబు విడిచి యేర్పడ నేరఁడు

... ముక్తిఁ గాంక్షించు నతం
డంగనలతోడ విడువని
సంగడములు వదలవలయు జలజాతముఖీ

పోతన. భాగ. IX-188, 583

సాంసారికులతోడి సావాసము
ముముక్షు జనులకుఁదగదు

తిరు. వేం. కవులు. బుద్ధ. III-12

## మూర్ఖపద్ధతి

మఱచినఁ దలఁపింపఁగనగు
నెఱుఁగని నాఁడెల్ల పాటినెఱిగింపనగున్
మఱిమెఱిఁగి యెఱుఁగ నొల్లని
కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే

నన్నయ. భారత. ఆది. IV-72

నెమ్మిగలవారి నొల్లరు
తమ్మొల్లని వారివెనుకఁ దగులుదు రధిక
త్వమ్మెఱిఁగి యెఱిఁగితోడరుదు
రెమ్మెఱుఁగని యట్టి వారలు

తిక్కన. భారత. ఉద్యో. II-34

తొలుత వినినదానినపట్టి మూర్ఖుండు
పెద్దలనడిగి తెలిసికొనక వర్తించి దుర్గతిం బొందు

తిక్కన. భారత. కర్ణ. III-78

తన గృహమున నభ్యాసం
బున మెలఁగెడు నంధుచందనమున సంసారం
బునఁ దిరుగు మూర్ఖుఁడొల్లఁగడు
వినుతఁ బగు మోక్షపదము

తిక్కన. భారత. శాంతి. V-532

ఎవ్వఁడైన లక్ష్మీవనితా సమాగమము
సేకొనవొల్లక బుద్ధిహీనుఁడై పోవఁగఁ ద్రోచునే

కేతన. దశకుమార. VII-116

మేల్వడసియు బుద్ధిచాలని యభాగ్యులు తత్ఫలమందనేర్తురే

మతిలేనివాఁడు విద్యా
న్వితుఁడయ్యును మేలువడయనేరఁడు

మతిధృతిలేని వెడంగుల
మతిగఱపిన సుమతికిం బ్రమాదము వచ్చున్

మతిహీనులు చూడ మొఱడు ప్రమాఁకులు ధాత్రిన్

మంచెన. కే. బా. చ. II- 26, 33, 34, 75.

మూర్ఖుఁడు దన కాపదయైనచోట దైవము దూఱున్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-65

ఎఱుకలేక చపలుఁడేవంకఁ దిగిచిన
నల్పమతులు వానిననుసరింతు

రొక్క కొంగ పాఱ నున్న కొంగలు గూడ
నెగసి పాఱుచునికి తగవుగాదె

అయ్యలార్యుడు. భా. రా. యుద్ధ. 101

ఎడ్డెదెలుపవచ్చు నేడాదికైనను
మానిదెలుపవచ్చు మాసమందు
మొప్పెదెలుపరాదు ముప్పదేండ్లకునైన

ఓగునోగుమెచ్చు నొనరంగనజ్ఞాని
భావమిచ్చిమెచ్చు పరమలుబ్ధు

పంది బురదమెచ్చు పన్నీరుమెచ్చునా?

ఎఱుఁగువానిఁ దెలుప నెవ్వడైననుఁజాలు
నొరుల వశముగాదు ఓగుదెల్ప
ఏటివంకఁ దీర్ప నెవ్వారితరమయా

ఎఱుక మాలువాఁడు ఏమేమిచదివినఁ
జదివినంత సేపు సద్గుణియగు
కదిసి తామరందుఁ గప్ప కూర్చున్నట్లు

గుడ్డువచ్చి పిల్లగోరటాలాడిన
విధముగా నెఱుగక వెఱ్ఱిజనులు
జ్ఞానులైనవారి గర్వింతురూరక

తగదు తగదటంచు దగువారుచెప్పిన
విననివాడు చెడును

తామగడనసేయు ధనమెల్లఁ దమదని
నమ్మియుందురు వెఱ్ఱినరులు భువిని
మాటచెప్పవినని మనుజుండు మూర్ఖుడు

వేమన

... ఈకపట సంసారంబు నిక్కంబుగా
దలచున్ మూఢుఁడు సత్యదానకరుణాధర్మాది నిర్ముక్తుఁడై

పోతన. భాగ. VIII-647

సద్గుణంబు లెందుఁజూచిన మూఢునకేల కలుగు

తాళ్ళపాక. నీతి.

మొఱకులు స్థానమువ్విడిచి నూఱుముఖంబుల గాసిఁజెందరే

పుష్పగిరి తిమ్మన. సుభాషితము

తెలియని మనుజుని సుఖముగ
దెలుపందగు సుఖతరముగఁ దెలుపఁగవచ్చుం
దెలిసినవానిం; దెలిసియుఁ
దెలియని నరుఁదెల్ప బ్రహ్మదేవునివశమే

మూర్ఖజన చిత్తముఁదెల్ప నసాధ్యమేరికిన్

ఏ. ల. కవి. సుభా. నీతి. 3, 4

సదయామర తరువునుగని
ముదమువఁ బొల్లడుగఁ బోవు మూఢుఁడుగలఁడా?

త్యాగరాజు, ప్రహ్లాద.

తనది యేదైననసరె ప్రశస్తంబునిజము
నాదియనుకొంటఁ బుట్టు నున్మాదమిదియె

తనమతమె మంచి పరునిది తప్పటంట
వెట్టులన్నిటిలో రాచవెట్టి సుమ్ము

పానుగంటి. బుద. III

...మూఢుఁడు బహు
విధముల గౌరవమునొంది వెలయుచు నుండున్
బుధశూన్యములగు పట్టుల
సుధదొరకని చోటులందు సుద్దవిధముగన్

పై మెఱుంగును గనినంత భ్రమయువారు బుద్ధిహీనులౌదురు
నెమ్మి వెలయాలి పలుకులు నమ్మువారు బుద్ధిహీనులౌదురు
ఋణముచేసి నేలను గొననెంచువారు బుద్ధిహీనులౌదురు
జూదమున సొమ్ముగడియింపఁ జూచువారు బుద్ధిహీనులౌదురు
విత్తమును బొందలోభుల వేడువారు బుద్ధిహీనులౌదురు
కుడువకయు నీయకయు సొమ్ముఁగూర్చువారు బుద్ధిహీనులౌదురు
కులటఁబెండిలియై యాసుగొనెడువారు బుద్ధిహీనులౌదురు
మిసిమిగలబాలఁబెండ్లియా ముసలివారు బుద్ధిహీనులౌదురు

విక్ర. దే. వ.

మూర్ఖభూపతి సేవయు మూర్ఖభార్య
పొత్తుపగవాని కేనియుఁ బొసగరాదు

కాళ్ళకూరి. మదుసేవ. IV-35

నోటికడ్డుమాఁటయులేక మాటలాడి
సత్యము నసత్యమెఱుఁగరు జడహృదయులు

దువ్వూరి. సీతావన. VII-101

## మృత్యువు

వెరవును లావునుఁ గలిగి విక్రమ సంపద నొప్పి ధీరులై
పరఁగిర కాని తమ్ము మృత భావ వికారము వొందకుండ సు
స్థిరముగఁ బ్రాణరక్షణముసేయఁగ రాజులు సాలరైర
మృత్యువు ప్రభువని విందుము లోకమునకు

తిక్కన. భారత. ద్రోణ. II-152, 159, 327

కాలంబైనం బోవక
యీ లోకమునందు నిలువ నెవ్వరివశము

నేర్పులావును మర్త్యుని చావు మాన్పఁగలేవు

తిక్కన. భారత. స్త్రీ. I-25

అవనిపై బుట్టినయప్పుడె చావు ధ్రువము జీవునకు

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. అయోధ్య.

మృతుఁడైన నరుఁడు వెస భ
స్మితుఁడై చనుఁగాక కీర్తి మేలిమిగనునే

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-300

ఎన్ని తనువులైన మృతికి నెడము గావు

కత్తి చేతఁబట్టి ఘన సాధకముఁ జేసి
విత్తు వీగుచుండు వీరుఁడైన
కాలమైన యపుడు కాలుని చేతను
కష్టపడుచు చచ్చు కడకు

వేమన

చావు లతిరిక్తతము లుగ్రసంగ్రామములన్

శ్రీనాథ. భీమ. IV-52

జన్మించు వానికి చావు నిక్కంబు

శ్రీనాథ. ఫల. ౨.

చచ్చిన వాని కేడ్చెదరు చావున కొల్లక డాగవచ్చునే?
యెచ్చటఁబుట్టె నచ్చటికి నేఁగుట నైజము ప్రాణి కోటికిన్

పోతన. భాగ. VII-46

మేనితోడనపుట్టు మృత్యువు జనులకు

పోతన. భాగ. X-29

ఆత్మకున్ బేద తనంబు మేలెమఱి
మృత్యువు డాఁగెడి చోటు లేదొకో

నీడఁ గడవబాఱ నేలకు వెలిగాఁగ
నడుగువెట్టి తిరుగ నాత్మ మొఱఁగి
యొకటిఁ దలఁప నరుల కొదవిన నొదవ దే
కరణి మృత్యుదేవి గన్నుఁబ్రామి

పెద్దన. మను. IV-105, 106

పోయ్యేటప్పుడు వెంటరాదు ఒక పుచ్చిన వక్కైన

రామదాసు

దేహికిఁ జావు తథ్యంబు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ

తలపోయ మోక్ష ప్రదంబైన చావు
కలుగుట యల్పమే కర్మజీవులకు

తిమ్మయ. ద్విప. భారత. భీష్మ.

బలవంతుఁడీల్గు దుర్బలుఁడు చావకుండు

తిమ్మయ. ద్విప. భారత. ద్రోణ.

ఒక్కనిచావు తనమీఁదఁ దెచ్చుకోఁదలఁచునె యొకఁడు

వరద. రామా. బాల.

చావుకు వెఱచినఁ జావకుండెదవె
చనువారిఁ జూచితాఁ జావనియట్లు
మనువార లేడ్చుచు మరుగుచుందుదురు

నీడ కైవడి వెంటనే కాచియుండి
వీడదు మృత్యువే వెంట మానవుల

నిన్నటి రాతిరి నేటికిరాదు
చన్నట్టివార లెచ్చట మళ్ళిరారు

వరద. రామా. అయోధ్య.

.. చచ్చిన వారికేడ్చినను
ఉరుమతి వత్తురే యో వెఱ్ఱులార

సోమన. ద్విప. భారత. శాంతి.

నేర్పుతోడఁ దిరుగ నేర్చిన వాఁడైన
దనదు చావుఁ దప్పుకొనఁగ లేఁడు

అ. నారాయణదాసు. నూఱుగంటి.

చావుపేరు దలప జలియించు ధైర్యంబు
జ్ఞానికైన మేటి మానికైన

చిలకమర్తి. గయో. II-42

ప్రమందుటన్నది బొంది మార్చుట
ముందుభవమున కల్గు విభవము
నంద ప్రాజ్ఞుఁడు వగవఁజెల్లునె

గురజాడ. ముత్యాల సరాలు

చావు వలెనన్న వచ్చునే రావలదన
విడుచునే కాలగతిఁ జేసి పొడముచుండు

ధర్మవరం. చిత్ర నళీయము. IV-72

జంతువులకెల్ల మృత్యువు సహజము

వ.సు. రాయకవి. వేణీ. III-30

మరణంబు సర్వసామాన్యంబు

తిరు. వేం. కవులు. బుద్ధ.

అఖిల జనులకు చావెప్పుడైన నుండ
మాటి మాటికి చావుకై క్రుంద నేల

నా. కృ. రావు. వెన్నెల వెలుగులు

## మేలు

......చంద్ర తారాబలం
బుల మేలైన దినంబు లెవ్వరికి సమ్మోదంబు సంధింపవే!

జక్కన. విక్రమార్క. IV-38

గుణ యుతునకు మేలు గోరంత చేసిన
కొండ యగును వాని గుణముచేత
కొండ కొద్ది మేలు గుణహీను డెఱుగునా?

ద్రోహబుద్ధినింక దొంగతికమునను
సటలనైన సాహసముననైన
సంపదధికు వలన సాధించి ధనమును
బడుగునకు నొసంగ బాగు

వేమన

ఒరులతో చాడి చెప్పి యుడుగరలందుకంటె
గరిమతో గోచైన కట్టేది మేలూ

వరుసలో గల్లలాడి వాచాలుఁడగుకంటె
నరయంగ మూగవాఁడయ్యేది మేలు
పరులచే నప్పుచేసి పప్పుకూడు దినుకంటె
దొరకు నంబలియొక్క దోసెడే చాలు

ఏగంటివారి వచనములు

## మేలు-కీళ్ళు

మేలుఁ గీడును నరుఁబొందుఁ గాలముల న
వశ్యమును వానిఁగోరిన వచ్చుటయును
వినుము త్రోచినఁబోవుటయును.........
కలదె వానికిఁ గావున వలదుచింత

తిక్కన. భారత. శాంతి. IV-416

మేలు రెండు లోకంబుల మేల తెచ్చుఁ
గీడునేసినఁ దప్పదు కీడ యగుట
గాన పురుష వర్తనమునకానుకూల్య
శీలమగు దైవమది ఫలసిద్ధిఁజేయు

తిక్కన. భారత. అను. I-134

నిజ గుణదోషకర్మముల నెట్టన మేలును గీడువచ్చు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-139

చేటు వచ్చెనేని చెడనాడు దైవంబు
మేలువచ్చెనేని మెచ్చుఁదన్ను
చేటుమేలుఁ దలఁపచేసిన కర్మముల్
మేలుకీళ్ళు కావటి కుండలు

వేమన

మేలుసెప్పినేని మేలంద్రులోకులు చెట్టయండ్రు కీడుసెప్పినేని

పోతన. భాగ. I-273

మొదల నప్రియములై మునుకొని తోఁచి
తుదిఁ బ్రియంబులగు హితుల భాషణములు

బాలసర. ద్విప. భారత. సభా. II

మేలుం గీడును రెండునుఁ
బోలకసరియట్లు దలఁప బొందకయున్నన్
జాలింబడు నమ్మనుజుఁడు

శివరామకవి. సానందోపాఖ్యానము. III-42

మైత్రి :

మైత్రీ సౌఖ్యముఁబోలునె శాత్రవ మెమ్మెయిఁదలంప

తిక్కన. భారత. ఉద్యోగ. I-134

మైత్రి సప్తపద కృతోద్భూతి

తిక్కన. భారత. కర్ణ. II-102

మిత్రునకుంగీడు వాటిల్లునెడు నేర్పుగలుగునేని
మైత్రిపరుండయిన పౌరుషశాలి యదిశమింపంజేయు

తిక్కన. భారత. శల్య. II-299

మిత్రునికోరిన యదియిచ్చుచుండి దానికి మాఱుగా
నొకటి పుచ్చుకొనుట పురుషార్థంబు తెరువే ?

తిక్కన. భారత. సౌప్తి. II-46

మైత్రిం బోలెడు ధర్మము
ధాత్రీ దివిజులకులేదు దానినడపినం
బుత్రా యేకర్మంబు ప
విత్రతయును వలవదది వివేకముఁ జేర్చున్

తిక్కన. భారత. శాంతి. V-102

అకుటిలాత్మకుండ వైన వయస్యుని
కెఱుఁగఁ జెప్పరాని దేమిగలదు

కేతన. దశ. కు. చ. IV-42

ఎట్టి కుబుద్ధియైనఁ దనయిష్టసహాయుని కగ్గుచేయునే

నాచన సోమన. ఉ. హ. వం. V-305

దాసితోటిచెలిమి ధర కొఱగాదయా

వేమన

ప్రాణసముఁడైన సఖునకు ప్రాణములీఁగనుట చెలిమిఫలము

పిల్లల. పిన. జైమిని. II-97

నిజకార్యమ్ము లెంతురె మిత్రతత్పరుల్

రామరాజు. వసు. IV-8

విద్వజ్జనంబు సఖ్యంబు నెంచును సాప్తపదీనంబుగాఁగ

సూరన. ప్రభా. III-89

ఏడడుగులు మాటాడుచుఁ
గూడన్నడచినను దెలిసికొన నేస్తము

రఘునాథ. శృంగార సావిత్రి. II-106

ఇద్దరి హృదయము లేకహృదయమైతే వద్దనేవారెవ్వరు

క్షేత్రయ్య

పనివడి యెగ్గులు పట్టకుండినను
మునుకొని యెంతయుఁ బొందనఁగూడు

సోమన, ద్విప. భారత. కర్ణ. II

కార్యార్థమై నీచదశల నొదవును సన్మైత్రి
యొక్కొక్కయెడల భూపాలురకు నల్పపురుషులందైన
దీపించు శుభవేళఁ దిరమౌను యదియు

తిమ్మయ. ద్విప, భారత. ఆది.

అఘమువలన మరల్చు హితార్థకలితుఁ
జేయు గోప్యంబు దాఁచుఁ బోషించుగుణము
విడువఁడాపన్ను లేవడివేళ నిచ్చు
మిత్రుఁ డీలక్షణమ్ములఁ జెలఁగుచుండు

ఏ. ల. కవి. సుధా. I-65

పొందున లాభ మొందుదురు
పోరున నాశము వచ్చునందురు

దా. శ్రీ. దేవీభాగ. V-220

చెలిమిమైఁ జేదు మేపింపఁ జెల్లుఁగాని
బలిమిమైఁ బాలు ద్రావింపఁ బాటుగాదు

కం. వీ. పం నీతి. 74

మహితమైనట్టి బాంధవమైత్రికంటె దేహమైత్రి దుర్బలము

చిలకమర్తి. మద్యమవ్యాయోగము. I-9

మనసునకుఁ బ్రీతి యెవ్వనిపై ఘనతరమౌ య
తని కెపుడు కీడుశంకించు మనసె మగని
యెడల నెంతో ప్రేమంబుండి యెప్పుడతని
దిట్టు గయ్యాళియా భార్యతీరుఁ గాఁగ

పానుగంటి. పాదుక I

మహిని బల్మిచేతఁ బ్రాలైన ద్రావరు
స్నేహరీతిఁచేత విషమైన ద్రాపుట సిద్ధమకద

తిరు. వేం. కవులు. శ్రవణానందము. I-110

## మైథునము

కామకలితులైన భామినీ పురుషుల
సంగమంబు పొలుచు సగుణమగుచు

మారన. మార్కం. VIII-186

గుణాన్వితుండుగాని సుతుఁడు ప్ర
సూతుండగునఁట యకాలసురతక్రియలన్

సూరన. కళా. IV-137

దశమి హరివాసరమున ద్వాదశినిఁబర్వ
తిథుల సంక్రమణంబుల తిథులనన్య
తిథులయందైనఁ బగలు సంధ్యలను ప్రేమ
నంటగారాదు సతుల గృహస్థులకును

ధరణిదేవుల. దశావతార. III-65

సరివలపులైన కూటమి
సరసంబై సుఖమొసంగు జవ్వనికైనం
బురుషునికైనను

కనుపర్తి. కవిరాజ. V-7

## మోక్షము

మోక్షమొండు కర్మమార్గంబునఁ
బడయఁ గఁడఁగుటెల్ల భ్రాంతి

నన్నెచోడ. కు. సం. VI-72

ఆత్మ నాత్మైక దృష్టి సర్వాత్ముఁ బరమ
పరు శివునిఁ గాంచుటది పరపదవిసుమ్ము.

నన్నెచోడ. కు. సం. XII-220

జీవత్యాగము చేసిన
భూవినుతుఁడు మోక్షపదవిఁ బొందు

పండిత. శివ. సా. 280

కొలుచుటయె భక్తి భక్తికిఁ
దలకమియ వ్రతంబు వ్రతముఁ దవులుటయే ని

శ్చలకృప శివునిశ్చల కృప
గలుగుట యది ముక్తి పథము కరుణాభరణా

పా. సోమన. అను. 136

రాగ వైషమ్యములు లేక ప్రజ్ఞ కలిగి
మనములోన విరక్తి యెవ్వనికిఁ గలుగు
వాఁడె యధికారి బ్రహ్మకైవల్యమునకు
వీఁడు వాఁడని కులశుద్ధి వెదుకవలదు

శమము దమము తపంబును శ్రద్ధ తాల్మి
మఱి సమాధాన మనఁగ నిర్మల వివేక
సాధనము లాఱుదెరువులు సంఘటిల్లు
మోక్షమున కండ్రు నిగమార్థ మూలవిదులు

శ్రీనాథ. భీమ. V-150, 163

కామిగాక మోక్షగామి గాడు

వేమన

## మోక్షమార్గములు

వ్యక్తమవ్యక్తమును రెండు నవగతములు
గాక మోక్షంబు మార్గంబు గానరాదు
వ్యక్తమది మృత్యు వవ్యక్త మమృత మనియె
నతుల విజ్ఞానఘనుఁడు నారాయణుండు

తిక్కన. భారత. శాంతి. IV-32

త్యాగ మొక నెలవు శమసం
యోగం బుత్తరము దాని కూర్ధ్వము సంతో

షాగమము మోక్షలాభో
ద్యోగికి నివి గమ్య భూములు

తిక్క-న. భారత. శాంతి. V-343

ధనములును దానములుఁ దపోధనము వాజి
పేయరాజసూయంబులు వేయు నోపి
చేయుటలుగావు మోక్ష దర్శిత్వ మొకఁడ
మందు జరకు మృత్యువునకు

తిక్కన. భారత. అను. V-237

ముక్తియగునది విషయ నిర్ముక్తమైన

కా. గణపతిదేవ. శివయో. IV-260

మోహము విడుచుటే మోక్షము

పొరిఁ గర్మపు బుద్ధిపుట్టువుపై నునిచి
వెరవునఁ బాపముఁ బుణ్యము విడుచుట
వివేకమగు తుదిపదము

మతి చంచలమే మానుట పరము

బొందిలోన నొకటియు భూమిలోన నొకటియు
బెందు వందు చిత్తమైతే చేరునావైకుంఠము ?

హరిభక్తి గలిగిన యతనికి మోక్షము.
పొరుగుననున్నట్టు పొసఁగినది దరిశన భక్తిచేఁ
దన వారికి ఇరవైన మోక్షము ఎదిటిది

మక్కు-వ భాగవతాభిమానము గలవారి
కక్కు-రలేని మోక్షమరచేతి లోనిది

జగములోపలను శాంతిగలుగుటే
అగణిత మోక్షమునందుఁ బొందుట

కోపము విడిచితేనె పాపము దానే పోవు
లోపల మలినుఁడై లోకము మెచ్చుకొఱకు
పైపై గడిగితేను పావనుఁడౌనా

తిరిగి మోక్షమార్గము తెరువైన దేహికి
మగిడి లోకము చింత మఱియేల?

చేచేత నందుకొంటె చేరువనేయుండు ముక్తి
తగిలిసాము సేసితె తనలో నున్నది ముక్తి
అరసితె గురుస్మరణ యందుండు ముక్తి
పగలేకుండితె భూమిపైదె ముక్తి

అన్నమయ్య. అధ్యా.సం

శతమాత్రము పంచాక్షరి
మితమెట్లనొ తెలిసినట్టి మేదిని ప్రజకున్
సతతము జేకురు మోక్షము

పగలుడుగ నాశ లుడుగును
వగపుడుగం గోర్కెలుడుగు వడిజన్మంబు
ల్తగులుడుగు భోగముడిగిన
త్రిగుణంబులు నుడుగు ముక్తి తెరవుగ

నిర్వికారమునను నిశ్చలత్వమున దా
నుండెనేని ముక్తి యొనరు

మోహ భవబంధములనెల్ల మూలఁద్రొక్కి
సాహసంబున గురుభక్తి సలిపిలోన
జపము చేయుట ముక్తికి సక్తియగును

మోక్షమార్గంబు నెఱుఁగక మూర్ఖజనులు
కుక్షి నింపెదు వేషముల్ గోరివేసి
నిర్గుణాత్ములమని చెప్పనీతిగాదు

రెప్పలు మూసియు మూయక
తప్పక తన మనమునందు దత్త్వమొనరగా
నెప్పుడు జూచెదు వానికి
చొప్పడు నచ్చటనె ముక్తిసులభము

జాతిభేదమెంచి జన్మము దెలియక
ముక్తిగానలేరు మూర్ఖజనులు

వేమన

...పుట్టని చావని
త్రోవ వెదకి కొనుట దొడ్డబుద్ధి

పోతన. భాగ. VII-214

నిగమాంత విదులచే నిశ్చితంబైన
నిగమార్థమాత్మలో నిలిపినమ్మినను
గానంగవచ్చు మోక్షము త్రోవయెల్ల

తాళ్ళపాక. తిరు. వేం. పరమయోగి.

అలర నింద్రియ నిగ్రహమున యోగమునఁ
బొలుచు లోభ త్యాగమున ముక్తిగలుగు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

సంశయాత్మని కెందు మోక్షంబులేదు

శివరామకవి. సావంద్ IV-83

శరీరమెత్తి ముక్తిమార్గము
దెలియని వాద తర్కమేల ?

త్యాగరాజు

## మోహము

మోహంబువలనఁ బైముసురులోభంబు

ఎఱ్ఱన భారత. అరణ్య. IV-288

మోహమే దాహముసుండి
సాహస సంసారమే నిస్సారముసుండి

అన్నమయ్య. అధ్యా. సం.

ఎట్టినాడుదాన్ని నేపారజూచిన
వేకిమట్టి చాలవెఱ్ఱిబుట్టు
రక్తినెఱుగువాడు రమణులవాంఛను
దగిలి దిరుగుచుండు ధరణిలోన

వేమన

ఉన్నచోట నిమిషమైనా ఉండనీయదు మోహము

క్షేత్రయ

తాను బ్రహ్మమగుట తత్వంబెఱుంగమి
బ్రబలమగుచు మోహభరము గ్రమ్మఁ
బొసగదానియందుఁ బొసఁగె శుభాశుభ
భ్రాంతి నిజముపోలె.

లక్ష్మణకవి. రామేశ్వర. III-19

అక్కటా మోహమన్నిటి కక్కజంబు
తెల్విదివ్వెచూపి తెలిపినఁగానరు
మోహ తిమిరమందు మునుగువారు

అ. నారాయదాసు సారంగధర

మోహితులు కన్నుగానక
సాహసకృత్యములు చేయుసమయంబున ని
ర్వాహకములగునె వలదని
బాహిరముగఁజేయు ధర్మవచనము లెందున్

తిరు. వేం. కవులు. పాండవోద్యోగము. III-45

## మౌనము

మౌనవృత్తినరుడు మసలుచు నుండెనా
మమత విడిచిపోవు మానవులకు
...తర్కవాదములాడి దారితప్పి
మాటలాడుట కంటె మౌనంబు బహుమేలు

వేమన

ఎదిరికి దనకుహితమైనమాట
యొదవకుండిన నూఱకుండుట మేలు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ

మౌనము వారిజాననల మానధనంబగుగాని వాలుచేఁ
బూనినవానికిన్ దగునె?

కోలాచలం. ప్రతాపాగ్నరీయము. III. i-23

## యజ్ఞము

మంత్రయజ్ఞులు విప్రులు మహితసీర
యజ్ఞులరయఁ గృషీవలులద్రియజ్ఞు
లనఘ గోపాలురు

ఎఱ్ఱన. హరివం. పూ. భా. VII-136

పరులునుతింపఁజాలునని పల్మఱుఁ జిత్తములందలంచి సు
స్థిరమగుబుద్ధిలేక ఫలసిద్ధిని గాంక్షయొనర్చిదంభులై
యిరవగునట్టి జ్ఞానమునకెంతొ విరోధముచేయునట్టి యా
నరు లొనరించుయజ్ఞము ఘనంబుగ రాజసయజ్ఞమర్జునా

మాధవమంత్రి. భగవద్గీత

## యతి

.........యతులతో నతులమతుల్
గలుషించుట చిత్తమునోఁ
బలుకుట బాంధవులు దారుబ్రతుకుతలంపే

నాచన సోమన. ఉ. హ. IV-57

త్రావునుదకంబు వస్త్రపూతంబు నడుగు
వెట్టునెడ దృష్టిపూతంబు ప్రీతితోడఁ
బలుకు సత్యపూతంబును బరమమైన
తలఁపుబుద్ధి పూతంబుగావలయు యతికి

మారన. మార్కం. III-337

యతుల కాగ్రహాములు దగునె

సోమన. ద్విప. భారత. అరణ్య.

ఏక భుక్తి యధశ్శయ్య స్త్రీ కటాక్ష
దూరతయుఁ గల్గి దుర్గత క్రూరజనుల
యజ్ఞతకు నేడ్చి జ్ఞాన మీయంగ యతులు
వసుధఁదిరుగరె దెబ్బలు బడుచు

పానుగంటి. వన రామ. V

## యాచకుఁడు

కోరెడి వారికిఁ గోఱఁత లెందుండు

గౌరవ. హరి.

చరణములు వడఁకు భీతిం
బరవశమౌ నోడలు రాలుపడు నెలుఁ గాహా
మరణమున నెట్టి చిహ్నము
లరయన్ యాచకుఁడు దాల్చునచ్చిహ్నములన్

వైచదాజు. పంచతంత్ర

భిక్షుకుండు సుఖమందును నిస్పృహఁజేసి ధీనిధీ

దా. శ్రీ. దేవీభాగ. I-531

## యాచన

వేఁడుటెంతయుఁ గష్టమైనను వేఱులేని సుహృజ్జనున్
వేఁడుకోలుచితంబు

నన్నయ. భారత. ఆది. V-218

పొందెఱుఁగక వేఁడఁ బోలునే
పలుగూడు గాక మేపట్టున నైనఁ
గలదె పాయసము భిక్షాందేహి యనిన

గౌరవ. హరి.

నీచగతి యెల్ల భంగుల
యాచన యని తెలిసి తగని దడుగుదు రేనిన్
యాచకవర్గము లోపల
నీచకు లనఁబడరె యెంత నేర్పరులైనన్

పింగయ. భాగ. VI-350

దీపమునఁ దమము రోఁగ
వ్యాపృతిఁ జెలువంబు హరిహరా ఖ్యానముచేఁ
బాపమువలె యాచ్ఞా విధి
వేపాయు గురుత్వ మతుల విజ్ఞాననిధీ

బైచరాజు. పంచతంత్రము. II-145

ధనవంతులకునైన దాతలఁ గనిన
మనసు యాచక వృత్తి మరగును

తిమ్మయ. ద్విప. భారత. అరణ్య.

తముఁ దాము వత్తురర్థులు
క్రమ మెఱిఁగిన దాతకడకుఁ

క్షేత్రయ

యాచనా దుఃఖమనునది యవని నెన్న
చావు కన్నను నెక్కుడు

దా. శ్రీ. దేవీ. భాగ. I-535

అన్యులను వేఁడుట నైచ్యమగును

విక్ర. చే.

అధికునెడ యాచ్ఞ మేలది వ్యర్థమయ్యు
స్వల్పునెడ మేలుకాదది సఫలమయ్యు

చ. గ. శా. మొయిలు రాయబారము

## యుద్ధ ధర్మము

కైదువు వడినం దొలంగినను దోర్బలమేది భయంబుబొందినన్
గవియక బీఱువోయినను గాదు వధింపఁగ నెట్టి శత్రువున్

తిక్కన. భారత. భీష్మ. I-148

విరిదల వానిని విరథుని నాయుధం
బిడిన వానిని శూరు లేయ రెందు

తిక్కన. భారత. కర్ణ. III-351

చేరక యడఁగి ముచ్చిలి పోటు వోడుచు
టే రణంబున పాడి యేమగతనము ?

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

రజ్జులాడరాదు రణభూమి లోపల

వేమన

తక్కువవానితో ద్వంద్వ యుద్ధంబు
ప్రుక్కక సేయనిచ్చుట దోషము

తిమ్మయ. భారత. ఆది.

ఒకనితోఁ బోరాడ నొకఁడేయరాదు
విరథు నిర్గత చాపు విరిదల వాని
గిరి ప్రూను పుట్ట నెక్కినవాని మఱియుఁ
బడినఁ గైదువు జాఱి పడిన వెఱంగు
పడిన నాజికి వెలువడిన లోఁబడిన
బంటుఁ జంపగ రాదు

తిమ్మయ. భారత. భీష్మ.

పదివేల విధములఁ బగ ద్రుంపఁజాలు
టదియు పో రాజుల కాహవనీతి

సోమన. భారత. శల్య.

ఎట్టివాఁడైనను గడఁగి
తన మీఁదఁ గవియక తాఁజంపరాగు

సోమన. భారత. శాంతి.

## యుద్ధము

సంతాపకారులకాక పెనఁకువలు సుఖంబులగునె

తిక్కన. భారత. ఉద్యో. I-307

రుధిరాభీలాన్నంబున కంటెను మేలగు భిక్షాన్నమైన

తిక్కన. భారత. ఉద్యో. I-329

కలహమగుట లక్ష్మిఁ గావిం (రిం ?) చుఁ బ్రాణహా
నియును జేయునింత నిక్కువంబు

తిక్కన. భారత. ఉద్యో. III-17

సమరంబు రాజులకు నుత్తమ కర్మంబది
యపావృత స్వర్గద్వారము

తిక్కన. భారత. భీష్మ. I-201

విగత భయత్వంబు సమరవిధి కొప్పుఁ గదా

తిక్కన. భారత. ద్రోణ. I-237

అని మొన శత్రులం బొగడు టారయ మూర్ఖతగాదె

తిక్కన. భారత. కర్ణ. II-100

అనికిఁ జాలకున్న వానికి దాల్మి యొప్పుగు

తిక్కన. భారత. కర్ణ. III-89

ధర్మ సంగరమున నరిది జయము గొనుట

తిక్కన. భారత. శల్య. II-270

అన్యజనముల శోణితమైన ద్రావు
టధిక పాతకమని విందు

తిక్కన. భారత. స్త్రీ. I-168

పోరు మంచిదికాదు భూమి నెక్కడను

శ్రీనాథ. పల ఏ. చ

పైదువు పసలేని కయ్యంబు గలదె

తిమ్మయ, ద్విప. భారత. విరాట

సమర సన్నాహంబు చాలింపవలయు
సమరంబు భూజన క్షయ కారణంబు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

......నిల్చిన నాజిఁ జచ్చినను
దటుకున నింద్రపదంబు సిద్ధించు
గెలిచిన సత్కీర్తి గీల్కొను నిందు

సోమన. భారత. శల్య.

యుద్ధము చూడఁ గేవలము ద్యూతము వంటిది

కందుకూరి. దక్షిణగో. IV-452

ఒడలు విఱుచుచుఁ జఱచుచుఁ దొడలఁ గయ్య
మునకు బిలిలేక కాల్దువ్వఁ జనదుగాని
యన్ని విధముల పోరాట మాగనప్పు
డాత్మరక్షకై తగునంతె యర్థ్వామయ్యొ

పానుగంటి. చూడామణి. II

సంగరముకంటె ధాత్రిలోపల మఱి యనర్థంబుగలదె

కాళ్ళకూరి. పద్మవ్యూహము. I-11

## యోగము

యోగ ధర్మంబు కంటెను నుత్తమంబు
గలుగనేరదు ధర్మమొక్కటియు నపున
రాగమంబగు పదమున కరయ నిదియ
మేటినిచ్చిన సంయమి కోటికెల్ల

తిక్కన. భారత. అను. IV-216

విషయాధీన దురాచారికి యోగానందము గలుగనేర్చునయ్యా

పండిత. శివ. సా. 266

యోగ సుఖమునకంటె లేదొండు సుఖము

మారన. మార్కం. III-388

యోగంబు మేలందురాత్మ విదులు

దుగ్గన. నాచి. III-15

సకలక్రియలును యోగమునకు సాటియె యెవ్విధంబునం
దలంపగన్

కొ. గణపతిదేవ. శివయో. I-141

జ్ఞానము జ్ఞేయము జ్ఞానగమ్యమును
బూని తెలియుటే యోగము
పొరలి జగమనేబుద్ధి మాయపై నునిచి
పరగిన యింద్రియముల గెలిచినదె పరము యోగము

అన్నమయ్య. అధ్యా. సం.

కరతలంబునెత్తి కాలి నదిమిపట్టి
యూర్ధ్వదృష్టిచేత నొనరనిల్పి
సర్వమై తనరుట జాలనాయువు కల్గు

రాగలోభ గుణంబుల బాగుపఱచి
యోగమందున నిల్చిన నొనరుముక్తి

వేమన.

భోగసరణిమీఁద బుద్ధిరోసినఁ గాని
పాదుకొనదుహృదయ పంకజంబు
స్వాంతవనరుహంబు చాంచల్యముడిగిన
యప్పుడె యోగసిద్ధియగు

హరిభట్టు. మత్స్య. IV-107

యోగము గల్గినచోటను భోగంబులు లేవు
భోగములు గల్గినచో యోగంబు లేదు

వెన్నెలగంటి సూరన. వి. పు. V-193

జీవాత్మ పరమాత్మ సంయోగము యోగము

సూరన. కళా. V-142

యోగాభ్యాసము వలన స
దాగతి చిత్తేంద్రియముల దర్పములడఁగున్
రాగ ద్వేషాదులు చను
బాగుగ నాత్మకు సుఖానుభవముం గలుగున్

వర. లింగమూర్తి. సీతారామాంజనేయ. I-97

## యోగి

...దివసము రాత్రియు
ననునివి భానునకు లేనియట్టులు సతతం
బును బరమ యోగయుతుఁడగు
మునికి వివేకావివేకములు లేకుంకున్

తిక్కన. భారత శాంతి. V-197

తనకున్నయదియె యిల్లుగ
దనయాకలి కొదవినదియ తగు భోజ్యముగాఁ
దనకుఁ గలయదియ ధనముగ
మనమున ముదమందుయోగి మమతఁ బొరయునే

మారన. మార్కం. III–360

అన్వయము పావనంబుకృతార్థుఁడతఁడు
పుణ్యవతి వార్థివేష్టితభూత ధాత్రిఁ
జెలఁగి యోలాడు నెవ్వనిచిత్తవృత్తి
సచ్చిదానందమయ సుధాసాగరమున

శ్రీనాథ. భీమ. V–196

ఆత్మఁదప్పించి యెఱుఁగఁడన్యంబు నెవ్వఁ
డాత్మసంతుష్టుఁ డెవ్వఁడహర్నిశంబు
నాత్మనాత్మని కనునెవ్వఁ డాత్మమిథునుఁ
డెవ్వఁ డాతండు యోగ లక్ష్మీశ్వరుండు

శ్రీనాథ. కాశీ. V–233

కరచరణాద్యవయవయుత
శరీరధారియని మనుజ సామాన్యునిఁగా
బరికింపఁ జనదు యోగిం
బరతత్త్వముగాఁదలంచి ప్రార్థింపఁ దగున్

అనంత. భోజ. III–59

వాసివంతు విడిచినవాఁడేయోగి ఈ
యాసలెల్లా విడిచిన యాతఁడే యోగి
మనసువద్దని మరలించిన వాఁడేయోగి
శాంతుఁడై వగలుడిగిన వాడేయోగి

అన్నమయ్య. అధ్యా. సం.

యోగపురుషుడేల యొడలు బాటించు
కాంతవిడుచువాడు ఘనతర యోగిరా
నిష్ప్రపంచికుడె యోగి నిజముగ

నాదబిందు కళలనయమొంది యాత్మయం
దంటి చపలచిత్తమమర నిల్పి
బ్రహ్మరంధ్రమునకు బ్రబలిన యోగియా
ఒడలు బడలజేసి యోగులమనువారు
మనసు కల్మషమును మాన్ప లేరు

వేమన

ఒంటిగా రహస్యంబుగానుండి మనసు
నాత్మయును గట్టువడఁజేసి యాశను విడ
నాడి యపరిగ్రహుఁడయి నిరంతరమును
యోగి యాత్మను యోగమందుంచ వలయు

సె. లక్ష్మి. భగవద్గీత

## యోగ్యత

ఉరువడికిఁ దెలివి భక్తికిఁ
బరిచర్య కృతార్థమతికి భయమను వ్రత త
త్పరతకుఁ జలమును దగు స
చ్చరితకు నిస్పృహయు నొప్పు సద్భక్తనిధీ

జ్ఞానికి శాంతంబును నవ
ధానికి లింగార్పితముల తాత్పర్యంబున్
దానికి నుచితంబును సభి
మానికి నడగమియు నొప్పు మహిత గుణాఢ్యా

వలపునకుఁ దలఁపు చేతకు
నలయమి పలుకులకు వినయమారాధన క
గ్గలమగు సేమమ్మను మతి
కలిమికి వినతియును నొప్పుఁ గరుణాంబునిధీ

పా. సోమన. అను. 71, 73, 79

కులసతికి వన్నె మానము
కలిమికి వితరణము వన్నె కదనంబునకున్
దలకమియె వన్నె భటునకు
బలుకునకు నిజంబు వన్నె పార్థివముఖ్యా

ప్రౌఢకవి మల్లన. రుక్మాంగ. V-102

అధికారి కానివానికి
నధిక పదవి దెలుపఁ బ్రాప్తమయ్యెడు పాపం
బధికారియైనవానికి
నధికపదవి దెలుపకున్న నగు నిక్కముగన్

నూరన. కళా. II-112

యోగ్యసమర్థున మానుటెంతయు దప్పు గదయ్య

మానర. ప్రభా. II-45

తజ్జ్ఞులువీక్షించి తగుననన్నదాఁక
విజ్ఞాని ననరాదు విద్యనెవ్వరికి

తిమ్మయ. భారత. ఆది.

యతులకెఱుక భూషణమగు
మతితుష్టియ భూషణంబు మహనీయుండా
క్షితిసురునకు శుభ కామికిఁ
బ్రతిపక్షచ్ఛేదనోద్యమమె భూషణమౌ

దా. శ్రీ. దేవి. భాగ. V-106

పాపజాల విముక్తుండె బ్రాహ్మణుండు
శాంతగుణభూషణుండెపో శ్రమణకుండు
ఆసఁ బాసినవాఁడె సన్న్యాసిసుమ్ము
సత్యభూషణనిరతుండె సాధుజనుఁడు

విక్ర. దే.

## యౌవనము

యౌవనమున విషయ పర
త్వావేశము దుఃఖకారియై యలఁపఁగ నా
నావిధ దుర్వినయములకుఁ
దావలమై మెలఁగు నిందితప్రక్రియలన్

తిక్కన. భారత. స్త్రీ. I-40

యౌవనము భోగములకెల్ల నాస్పదంబు

కేతన. దశ. X-144

కరికర్ణాంతవిలోల మాయువు శరత్కాదంబినీ చంచలా
తరళంబాత్మ పయస్తరంగచలముల్ తారుణ్యముల్

శ్రీనా. కాశీ. III-86

మృగయామద్య పైశున్య వేశ్యాచౌర్యదురోదర
పరదారాభిలాషంబులను దోషంబులు
నవయౌవనారంభంబున సంభవించెనేని
వానిం బరావర్తింప నెవ్వరు నేర్తురు?

శ్రీనాథ. కాశీ. IV-98

యౌవనము దోషములకెల్ల నాస్పదంబు

శ్రీనా. శివరా. II-93

ప్రాయంబులంబు కతిపయ దివసములు

తిమ్మయ. భారత. ఆది.

అక్కర దెలియని యరవిరి ప్రాయము

క్షేత్రయ.

భోగాశాయుక్తము జవ్వనంబు గళితంబైనన్ ధనంబేల

ఏ. ల. కవి. సుభాషి. II-28

కోడెతనమునందు గొప్పనందినవాఁడు
ముదిమియందు మిగుల గదుమబడును

అ. నారాయణదాసు. సూరుగంటి.

కండనెత్తురు ప్రాయంపు గారవంబు
కనులకెగదట్టఁ దత్త్వంబు గానబడదు

దువ్వూరి. కుంభరాణా I-137

యౌవనంబు సమస్త పాపాలయంబు

వా. కృ. రావు. అస్థిరత

## రసము

తగ రసాశ్రయ వాక్యసంతతులు గూర్చి
కావ్యములొనర్పువారె పో కవులనంగ
నట్లుగావున నేభాషనైనఁ గవిత
పలుకువారికి సాధింపవలయు రసము

రమణమనోవికారము బహిర్వ్యాప్తమై
భాసిల్లునది సుమీ భావ మనగ
నదియవిజ్ఞాన సమాఖ్యచేనగువాని
కైదింటికిని విషయముల వలన

గలుగునా విజ్ఞానకలితమా భావంబు
తరుణుల యందును బురుషులందు
నాత్మసముద్భూతమై నవరసముల
నమరఁజేయుచు విభవానుభావ
సాత్త్విక వ్యభిచారి సంజ్ఞలచే నాల్గు
చందంబులగు...... ..

వెన్నముద్దకుఁ బాకవిధిచే ఘృతత్వంబు
దనరుభంగిని వనస్థాయి భావ
ములకు విభావ ప్రముఖ్యభావంబుల
వలవ రసత్వంబు గలుగుచుండు

అప్పకవీయము. I-36, 37, 38 /

## రసికత

సలలిత కావ్యబృందముల జాణలు కావ్యరసానుబంధ రీ
తులు గొనియాడదుష్కవులు దోసములెన్నఁగఁజూతురట్టియా
వెలఁదుల మేన నేర్పరులు విభ్రమ లీలలు చూచి మెచ్చ నీఁ
గలు వ్రణ మర్మముల్ వెదకుఁగాక యెఱుంగునె తద్విలాసముల్

దుగ్గన. నాసికేతూ. I-9

సంత బసివి పొందు జలి పందిరి జలంబు
ద్రోవనమ్మ తోడు దొత్తు నంట
రచ్చసభల నిద్ర రసికులు మెత్తురా

వేమన

......................పద్మగంధము
మరగిన తేటులన్య కుసుమంబుల చెంతను జేరనేర్చునే

పోతన. భాగ. X-990

ఖలుఁ డిలఁ దప్పులే వెదకుఁ గావ్యరసానుభవంబు సేయలేఁడు

నృసింహ. కవికర్ణ. I-120

సరవి నొనర్చు సత్కవుల చక్కని కావ్యకలాప మర్మముల్
నిరుపమ కోవిదుల్ దెలియనేర్తురుగాని యెఱుంగఁజాల రొం
డొరులు చకోరకప్రకర ముజ్జ్వల పూర్ణసుధాంశు చంద్రికో
త్కరము చవానునట్టులుగఁ దక్కిన పక్షికులం బెఱుంగునే

చింతలపూడి యెల్లనార్యుడు. రామా. I-15

చదువది యెంతకల్గిన రసజ్ఞత యించుక చాలకున్న యా
చదువు నిరర్థకంబు

భాస్కరశతకము. 42

రసమునకు నాశ్రయంబై
యసదృశమగు నెద్ది యది గదా శబ్దము రా
తిసదమన రసికులనఁగా
వసుమతిఁ దద్విధ మెఱుంగువారలు సుమిత్రా

అప్పకవీయము. I-35

సరసుని మానసంబు సరసజ్ఞుఁ డెఱుంగును ముష్కరాధముం
డెఱిఁగి గ్రహించువాఁడె కొలనేక నివాసముగాఁగ దర్దురం
బరయఁగ నేర్చునెల్లు వికచాబ్జ మరంద రసైకసౌరభో
త్కరము మిళింద మొందుక్రియ

కంచెర్ల గోపన్న. దాశరథీ శతకము

సరసుని రసజ్ఞతా వృత్తి సరసుఁడెఱుఁగు
గొడ్డురాలికిఁ దెలియునె బిడ్డకుట్లు

శేషగిరిరాయుడు. వసుశ్రీవాయ శతకము. 53

పస ముత్యమొకటి చాలును
గస వూడ్చిన చింపిరాలు గంపెండేలా
రసికుం డొక్కఁడె చాలును
రసహీనులు పల్వురేల ?

చాటువు. వే. ప్ర. శాస్త్రి. సంపా.

రాగము

స్నేహ మూలములు రాగాదుల్

నన్నయ. భారత. అరణ్య. I-2

రాగ నిమగ్నుల కేడ ధర్మముల్

రామరాజు. వసు. IV-32

కలయఁగ రాగసంపదలు కన్నులఁగ్రమ్మఁగఁ దెల్వి కల్గునే

చెంగల్వ కాళకవి. రాజగోపాల. III-39

మనసు రక్తిచేనిండ రసన గదలదు
ప్రమిద నూనెచేఁనిండ దీపంబుఁ బోలె
మనసటులు నిండకున్న రసన గదలును
గడుపు నిండని కుక్కతోఁకవలె మిగుల

పానుగంటి. కోకిల. II

అడఁపఁ బడుచు హఠాత్తుగా నతిశయిల్లు
నట్టి రక్తికి దయ్యంబు పట్టినట్టి
మనుజునకు గల్గునంత సామర్థ్యముండు
పిచ్చివానికిఁ గలయంత వేగమమరు

పానుగంటి. విప్ర. V

ఘనుల యందలి యనురాగ కలన భక్తి
యదియె యితరులపై గల్గనగును దయఁగ

క్రింది మీఁది పోకడలను జెంది యుంట
బట్టి రాగము భేదతత్త్వంబుఁ గనునె

పామగంటి. కల్యా. రాఘ. III

## రాగము - విరాగము

రాగము గల్గినవేళ వి
రాగము సమకూడ దెపుడు రయమున మదిలో
రాగము విడిచిన యపుడే
యోగము సిద్ధించు మోక్షయుక్తిగ

వేమన

అరయఁగఁ బ్రపంచమలవడి నటువలె
అరుదగు వైరాగ్య మలవడదు
తరుణుల రతి మతిఁదలచి నటువలె
ధర నీ సాకారము దలఁచదు మనసు

అన్నమయ్య. అధ్యా. సం.

## రాజదోషములు

నాస్తిక్యం, బనృతంబు, ప్రమాదం, బాలస్యం,
బనర్థజ్ఞుల తోడి చింతనంబు, క్రోధంబు, దీర్ఘచింత, దీర్ఘసూత్రత
యెఱుక గలవారి నెఱుంగమి, యర్థంబులయం దనర్థక
చింత, నిశ్చిత కార్యంబులు సేయమి, మంత్రంబుల
రక్షింపమి, శుభంబులఁ బ్రయోగింపమి, విషయంబు
లందగులుట, యనంబరగిన పదునాలుగు రాజదోషంబులు

నన్నయ. భారత. సభా. I-56

## రాజనీతి

ఆయతమతి నత సప్తో
పాయంబులు నెఱుఁగవలయుఁ బలిసామము భే
దాయతి దానము దండము
మాయోపేక్షేంద్ర జాల మార్గము లోలిన్

చనవెఱిఁగి నడప వలయును
వినయోచిత వృద్ధి సంధి విగ్రహ యానా
సన సంశ్రయణ ద్వైధులు
నను నీ షాడ్గుణ్యములు నిజామాత్యులతోన్

నన్నెచోడుఁడు. కు. సం. X-181, 182

అలయక పరాత్మ కృత్యం
బుల మదినెఱుఁగునది దూతముఖమునఁ బర భూ
ముల వృత్తాంతము లెఱుఁగఁగ
బలుమఱుఁ బుచ్చునది వివిధపాషండతతిన్

......మంత్రరక్ష య
త్నమ్మునఁ జేయఁగావలయుఁ దత్పరి రక్షణశక్తి నెల్ల కా
ర్యమ్ములు సిద్ధిఁబొందు......
ఎట్టులుం గడుకొని శత్రులం జెఱుపఁ గాంచుట
కార్యము రాజనీతిమైన్

నన్నయ. భారత. ఆది. VI-107, 111, 119

ద్వారంబున మిత్ర నివాసంబును
నద్వారంబున నమిత్రనివాసంబును జొచ్చుట
యిది బాహువీర్య సంపన్నులయిన క్షత్రియులకుం గర్తవ్యంబు

నన్నయ. భారత. సభా. I-185

పరమ సుఖోపాయంబునఁ
బరసంపద చేకొనంగఁబడునేని నరే
శ్వర యంతకంటె మిక్కిలి
పురుషార్థం బెద్దియొండు భూనాథులకున్

నన్నయ. భారత. సభా. II-142

అర్థార్థంబుగాని ధర్మువు క్షత్రియుల కయుక్తంబు

...దోర్బలముఁ జలము
గలిగి దేశబలంబును గాలబలముఁ
గలుగువాని కసాధ్యంబుగలదె యొందు

నన్నయ. భారత. అరణ్య I-246, 250

అల్పుఁడైనను బగతుని దెసఁ
దలఁపు గలుగ వలయు

తిక్కన. భారత. విరాట. III-108

అలఘు బలవిక్రమోదా
త్తులకైనను బలము లేక దోర్గర్వముమై
గెలుఁవగ వశమె సహాయము
కలిమి ననంతంబులగు బగఱ సైన్యములన్

తిక్కన. భారత. ఉద్యోగ. I-15

దీర్ఘక్రోధుఁడైన పతి కీడొందున్

తిక్కన. భారత. శల్య. I-55

పోర నొడలస్త్రపరిపూతముగ ధీరో
దారత బిఱిందికిఁ బదంబిడక దృప్య
ద్వైరి తతి నొంచి తెగు వారగుట మేలు
ర్వీరమణకోటి కని వేదములు సెప్పున్

తిక్కన. భారత. స్త్రీ. I-110

...మాతలు నేరక యూడి నప్పుడుం
గాతురు తప్పు విశ్వసనయు కార్యధురంధరులైన భూపతుల్
శ్రీనా. కాశీ. VI 223

సిరిపొత్తు చేయుట చెల్లును గాని
ఆజ్ఞ పొత్తిచ్చుట అది నీతిగాదు

శ్రీనాథ. పం. వీ. చ.

కాపురుషులమీఁద నిడకు కార్యభరంబున్

బ్రాహ్మణుని బ్రభువుఁ జేయుటపతికి హితము

భోగమనుభవించు నెడను బహిరంతరరులపై దృష్టివలయు

వారత్రయు విజ్ఞాపన కోర్యుము వధ్యకోటిపట్టున

ప్రతినవలదు వైరిపట్టున నృపతికి
రాయలు. ఆముక్త. IV–204, 217 241, 243, 263
బలియుఁడగు మిత్రుసంగతి గల రాజభ్యుదయమొందు

కొలిచినవారి నేరమునకుం బతి దండ్యుఁడు
నృసింహ. కవికర్ణ. II–28, 129

సారమతిఁ గీడు మేలును
జారులచేఁ దెలియవలయు జగతీశులకున్
జారులు రాజులకెల్లను
దూరము గనిపించు కన్నుదోయి తలంపన్

చరిగొండ ధర్మన. చిత్రభారతము. II–39

...భక్తి స్నేహములుగల యట్టి
విదితవిక్రము సైన్యవిభునిఁగాఁ జేయు

నిర్మల రాజనీతి యేమఱకు

సోమన. రత. ఆశ్రమ.

...సప్తాంగముల విరోధంబు
వెనుకొన్న వారిని విడువంగ వలయు

సోమన. భారత. శాంతి.

సత్యమనృతంబు పరుషోక్తి సరసభాష
ప్రాణిహింసయు దయయు లోభంబునీఁగి
కనక సంగ్రహ వ్యయములు గలుగు వార
రమణికైవడి బహురీతి రాజనీతి

ఏ. ల. కవి. సుధా. I-39

కీలెఱుఁగని రాచరికం
బేలా సమయంబెఱింగి యెయ్యది సేయం
బోలునది సేయఁడే భూ
పాలకుఁడా కాడు ధేనుపాలకుఁడు జుమీ

దా. శ్రీ. దేవీ. భాగ. II-333

రాజనీతి గనని రాజురాజె రాళ్ళ
బరువుగను తరాజైనమేలు సూవె

దా. శ్రీ. దేవీ. భాగ. IV-485

పొరుగు రాజులకెప్పుడు పోరు తగదు

కూచి నరసింహం. రూపలత. II-31

రాజయోగి

క్షితిని బ్రోదిచేసి శ్రితమును రక్షించి
గతమునడచిశుద్ధ గతి వహించి

మృతిని మించి సకలమతముల మదినుంచి
యొప్పుచుండు రాజయోగి

మత్సరంబు మదము మమకార మనియెడి
వ్యసనములను దగిలి మసలబోక
పరులకుపకరించి పరమునమ్మిక నుండి
యొనరుచుండు రాజయోగి

వేమన

తలఁపు శృంగాటకమునందు నిలుపఁ జేసి
సోమరవులతోఁ ద్రికూటగామియగుచు
లోను వెలివాయు దృష్టులఁ బూననేర్చు
నట్టి యెడ రాజయోఁగి యష్టావధాని

చెఱచి మఱచినట్లు చేష్టలు చెడియెద్ది
యైన గుడిచి యెద్దియైనఁ గట్టి
యెచట నైన దిరిగి యెచ్చోట నైనను
నుండు నతఁడు రాజయోగివరుఁడు

కొ. గణపతిదేవ. శివయో. IV-204, 294

## రాజశాసనము

జనవిభుని శాసనము దైవశాసనంబు
కంటె నెక్కుడదెట్లన గాన బడక
యెపుడో బాధించు నయ్యది, యిద్దికాన
బడుచు నిప్పుడు బాధిఁచు భయదలీల

కాశ్మకూరి నారాయణరావు. చిత్రాభ్యుదయము

## రాజసము

పరితాప మనభితోషము
నరేశ్వరా శోచనము జన వ్యాపారా
దర మక్షమ యనియెడు నివి
యరయంగా రాజసంబులగు భావంబుల్

తిక్కనభారత. భారత. శాంతి. IV-351

రాజసగుణములక్షంగల
నైజమెఱుఁగు వారు తజ్జనక వైకృతముల్
ధీజితములు గావింపఁగ
నోజగలిగి శుభదవృత్తి నొందుదు రెందున్

తిక్కన. అశ్వమేధ. II-121

గర్వంబు క్రోధంబు గరిమ సహంకార
మూర్వీ ప్రతాపంబు ముదితరంగంబు
రవణింప నక్రమము డంబమచ్ఛరము
అవని రాజస గుణములవియెన్ని చూడ

పోశెట్టి లింగకవి. వచనోళ.

## రాజాశ్రయము

......అక్షయ కాండలబ్ధిను
ప్పొంగరె రాజరత్న పరిపూర్ణబలంబున నెట్టివారలన్

రామరాజు. వసు. III-160

పలువురితోఁ గీడుపడసి రాజుకడ
మెలఁగు వారికి నేలమేలు సిద్ధించు

తిమ్మయ. ద్విప. భారత. విరాట.

కరుణగల్గినరాజును బాయఁగూడునే

పాపరాజు. ఉ. రా. V-308

దొరవద్ద నెవఁడు చనవరి
నరులతనికిఁ బ్రియము సేయ న్యాయము ధరలో
హరి వాహనమని మ్రొక్కరె
గరుడుని మఱి

కవిచౌడప్ప శతకము

ప్రభువులు పరిగ్రహించిన ప్రజలు ఘనులు

కుమారధూర్జటి. కృష్ణరాయ. II-91

......చిత్తమురా నడచినవారె హితులురాజులకెల్లన్

ధరణిదేవుల. దశా. II-132

విభుని యాశ్రితతతికిని వారసతికి భేదంబుగలదె?

పానుగంటి. విజయ.

రాజు

ముగ్ధులధిపులు మఱవలె బహుకార్యభార మగ్నులు

నన్నయ. భారత. ఆది. IV-69

రాజులకు గార్యవశంబునంజేసి మిత్రామిత్ర సంబంధంబులు సంభవించు

నన్నయ. భారత. ఆది. V-206

కులముగలవాఁడు శౌర్యము
గలవాఁడును నధికసేన గలవాఁడును భూ
తలమున రాజునామము
విలసిల్లఁగఁ దాల్చు మూఁడువిధముల పేర్మిన్

మొససియపకారిఁ గడనిడి
కొనియుండెడు నృపతి దీర్ఘ కుజశాఖాగ్రం
బుననుండి నిద్ర వోయెడు
మనుజునకు సమానుఁడగు బ్రమత్తత్వమునన్

నన్నయ. భారత. ఆది VI-87, 118

కృతమెఱిఁగెడు పతియె జగజ్జనులనెల్లఁ బరిపాలించున్

నన్నయ్య. భారత. సభా. I-46

క్షమయఁదాల్చియుండఁ జనదెల్లప్రొద్దుఁ దే
జంబుతాల్చియుండఁ జనదుపతికి
సంతతక్షముండు సంతతతేజుండు
నగుట దోషమందు రనఘమతులు

నన్నయ. భారత. అరణ్య. I-217

జనులు నిగ్రహానుగ్రహ శక్తుఁడైన
రాజు శాసనమునఁజేసి రమణతోడ
నోలిఁ దమతమ మర్యాదలొక్కనాఁడు
దప్పనోడుదురు

నన్నయ భారత. అరణ్య. III-35

రాజులిచ్చువారుగాని వేఁడుకొనువారు గారు

తిక్కన. భారత. ఉద్యో. I-343

రాజులకెందునారయఁ బరాక్రమజీవనవృత్తిదక్క నొం
డొజనిషిద్ధ మంద్రు

తిక్కన. భారత. ఉద్యో. IV-14

భూమికిఁగాఁగఁ బ్రాణములపోక దలంపక రౌద్ర ఘోర సం
గ్రామము సేయు చుందుదురు రాజులు

వెరవులావుగలుగు నరనాథులింత దే
శంబుగలమ తమకుఁజాలు ననరు
దంౘడిబిడ్డ యన్నదమ్ముఁడు నాకె త్తి
పోలుపోటులాడి పుడమిఁ గొంౘు

తిక్కన. భారత. భీష్మ. I-41, 42

విపినభూభాగ సంచరణ రతులుగారె ధరణిపతులు

కేతన. దశకు. IV-9

...అవనీపాలన కర్మనియుక్తుండైన రాజు
సంౘందన భాస్కర యమ చంౘ
పవనరూపము లైదుదాల్చవలయు

మారన. మార్కం. III-134

బుద్ధి శౘ్రంబు సప్తాంగములును మేను
గార్యయత్న రహస్యరక్షణము జోడు
చారులే దృష్టులును సూతజనము ముఖము
ధర్మవర్తనౘాణ మా ధరణిపతికి

మంచెన. కే. బా. చ. IV-207

రాజులేకున్నఁ బురంబు రాష్ట్రంబు రాజిల్లదు

పరులసొమ్ముల కాసపడక వర్తించు
నరనాథుఁ డిలఁ యెల్లనాఁడును నేలు ?

ఉర్వీశిలేకున్నఁ గార్యములు నిర్వహింపఁగరాదు...

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. అయో.

శమమును దానము ధర్మము
క్షమయును బటువిౘమంబు సత్యంబును శ్రీ

లము దుర్జనశిక్షయు భూ
రమణునకుం గలుగవలయు రాజితగుణముల్

సతతము ధర్మార్థార్జన
రతుఁడయ్యును విహిత సమయ రక్తిం గామో
చితములు సల్పెడు జన పతి
యతులిత రాజ్యంబు నొంద నర్హుండెందున్

కుల బల లలితుఁడు సూనృత
కలితుండు జితేంద్రి యుండుఁ గరుణాన్వితుఁడున్
విలసిత ధర్ముఁడునగు రా
జిలలో నతి పూజ్యుఁడగుచు నేపారు సిరిన్

మల్లికార్జునుడు. భా. రా. కిష్కింధ. 309, 472, 532

ప్రతినయు నాజ్ఞయుండగవుఁ బంతము రాజులు దప్ప రెప్పుడున్

నాచన సోమన. ఉ. హ. వం. V-272

రాజు నడపింప కెట్లు ధర్మంబు నడచు

శ్రీనా. కాశి. VII-31

పరిభవ మావహిల్లు నెడఁ బాయక కార్యముఁ జక్కఁ బెట్టు స
త్పురుషులు గల్గు రాజులకు దోసము చెందునె కీర్తి డిందునే

దగ్గుపల్లి దుగ్గన. నాసికే. I-186

బహుకార్య మగ్నమతులు ధారుణీ నాయకులు

పిల్ల. పిన. శృం. శా. IV-103

గతదోషుఁడు గుణవంతుఁడు
కృత విద్యుఁడు శక్తియుతుఁడు గీర్వాణసమో

న్నత చరితుఁడాత్మరక్షా
రతుఁడగు పతి యనుభవించు రాజ్యసుఖంబుల్

మడికిసింగన. రామ.

ఔఁగాదని వంకలొత్తఁ దిలకంబులెరాజుల చిత్తవృత్తముల్ ?

తనబుద్ధి యొక్క కన్నును
నొనరిన హితమంత్రి బుద్ధి యొక కన్నునుగాఁ
గని సంచరింప నేరని
జననాథుని జగము దెగడు జాత్యంధునిగాన్

జక్కన. విక్రమార్క. III–32, 43

భూపాలకులకు విప్రులఁ
గోపింపం జేయఁదగదు కోపించినఁద
త్కోపానలంబు మొదలికి
భూపాలాటువులఁ గాల్చు భూకంపముగాన్

నెయ్యంబులు లేవు సుమ్మి నృపులకు

పోతన. భాగ. I–133, 442

......ప్రభువై
యుంటకు నార్తుల యాపద
గెంటింపఁగ ఫలముగాదె కీర్తి ?

పోతన. భాగ VIII–233

పృథివి నధిపులు నూతన ప్రియులుగారె ?

పోతన. భాగ. X–1454

చంపదలుచు రాజు చను వగ్గలం బిచ్చు

సత్యము నృపులకు సర్వదాయోగ్యంబు

వేమన

మత్తులై వర్తిల్లు మానవేశ్వరులు
సత్తుగా బొంకుట సత్యమెయ్యెడను
......మానవేశులకు
దారుణ నరక బాధలు వింతగావు
రాచయీవుల నమ్మరాదు

గౌరన. హరి.

సంతతవ్యసన ప్రసక్తులై కుటిల
చింతాపరాయణ చిత్తులై రాజ్య
మత్తులై వర్తించు మండలాధీశు
లెత్తెఱంగున రోయ రేపాపమునకు
......మదిలోన రాజుల నమ్మి
పోకుంట మహిలోన బుద్ధి యూహింప
......మహీధవుల చిత్తంబు
తెలిసి యొక్కర్వణి వర్తింపంగ వచ్చు ?

గౌరన. నవనాథ.

ఎఱుక లేని దొరల నెన్నాళ్లు కొలిచిన
బ్రతుకు లేదు వట్టి భ్రాంతిగాని
ఎంత చేసి చేసి యేపాటు పడినను
రాచమూక నమ్మరాదు సుమ్ము

నేరములెంచెడు ప్రభువును జేరగ రాదు

ప్రజయొనర్చు చెఱుగు ప్రభునకు వచ్చును
ప్రభువు మంచియుందు ప్రజకు సగము
ప్రభువొనర్చు చెడుగు ప్రజలకు రాదయా

వేమ.

పతి నయమూరుఁడైన భట పంక్తియు నీతికి బాయుఁదత్ప్రధా
నత బుధులుండరాబుధ జనంబులులేమి నధర్మ మూర్జిత
స్థితిఁగను నయ్యధర్మమునఁ జేసియఘంబులు పుట్టు వానిచే
నతుల విపద్దశ ల్వొడము నవ్విపదాయతి రాజ్యము న్జెడున్

తాలిమియు ధృతియుఁ బ్రజ్ఞా
శీలతయుఁ బరాత్మగుణ విశేషజ్ఞతయుం
గాలోచిత శౌర్యము గల
వాలు మగండేలు వార్ధివలయిత ధాత్రిన్

భైరవరాజు. పంచతంత్రము. II-36, 178

......ఎందున్ నృపులుత్తరోత్తర పదానూనస్పృహాచంచలుల్

రామరాజు. వసు. II-64

రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే రాజౌట దోషార్థమే
......దొరల కెందు
మఱపు గలిగిన ననదల మరతురయ్య

రామరాజు. వసు. IV-27, 108

రాజులను మదిలోన నమ్మకుము వారి మన్నన లస్థిరములు

రుద్రకవి. సుగ్రీ. విజ

...మదోన్మత్తులౌ భూమి
పతులకు సత్య మెప్పట్టునం గలదె ?

తాళ్లపాక. తిరువెం. పరమయోగి

పుడమి యీశులను నమ్మఁబోల దేభంగిఁ
గడు పాపముల మూల కందంబు లౌట

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

పాము చందంబునఁ బగపట్టి యున్న
భూమీశునకు భీతిఁబొందరు నృపులు
కల కాలమును శత్రుగణములఁ జెఱుచు
కుచ్ఛితంబులు నేర్చు కువలయాధిపులు
నచ్చుగా సత్యంబు లాడెడి వారె
పరికించి క్రౌర్యరు బహుధనాపేక్ష
సారహీనులు వోలె సన్మార్గపథము
రాజులనటు గానరాదు నమ్మఁగను

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

ప్రాజ్ఞుఁడు హితుఁడు తీర్పరి యతఁడనక
యాజ్ఞమీఱిన వారి నణఁచు భూవిభుఁడు

తిమ్మయ. ద్విప. భారత. విరాట.

పోఁడిగా నొకటి నొప్పను రెంటి దెలిసి
మూఁడు నాల్గు నవశ్యములుగా నొనర్చి
క్రీడైన యేనింటి గెలిచి యాఱెఱిఁగి
యేడొల్లకుండు రాజుల యేలనేర్చు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

జగతి నెక్కటినేలి చవిగొన్న వారు
దగిలిప్రార్థించిన దగవుసేయుదురె.
అతుల విక్రమ శాలియగా మహీవిభుఁడు
నుతికిఁ బాత్రుం డౌను నూతన శ్రీల
పరుల సంపద సుఖోపాయంబునందు
వెరవారఁ గొనుట భూవిభులకు నెల్ల
నైజంబు గాదె నానా ప్రకారమున

పగగొని తమతోడ బలములఁగూర్చి
తెగి తేజమునఁ బోరి ధీరుల సిరులు
రాజులు జయమున రప్పింతు రెందుఁ
దేజంబుఁ గీర్తియు ధృతియును మిగుల

పాలసర. ద్విప. భారత. సభా.

రాజుల చిత్తంబు రాసేవ జేసి
తేజంబుగాంచుట తెల్ల మెల్లరకు

అనుకూలురై యుండు నన్యులనైన
మనసిచ్చి చనవిచ్చి మన్నింతు రెపుడు

వరద. రామా. అయోధ్య.

దూరపు కార్యముల్ తోఁచుట నృపులు
చారులచే దీర్ఘచక్షువులైరి
అట్టి యోజనలేని యధముఁడు ధరణి
యెట్లు బోషించు ? వాఁడేమిటి రాజు
అనలుని వేడిమి యమ రేంద్రు శౌర్య
మును జంద్రుని ప్రసాదమును బాశపాణి
దండశక్తియు భాను తనయుని సమత
నిండార విభుని కిన్నిగుణంబు లునికి
రాజులు మహి నెల్లరకుఁ బూజ్యులు...

......అధిపతి నేర
మవనీ జనులకెల్ల నాపదల్ సేయు

వరద. రామా. అరణ్య

ఇలఁ దేఁడు సుకృతి ననుచును
బలుమఱు లోపలనెయుండి ప్రజవిన్నపముల్
దెలియ వినఁడేని గీడగు

పావరాజు. ఉ. రా. VI-354

మదమును రాగమున్ మాత్సర్య వృత్తి
మొదలగు పాపముల్ పొందు భూపతికి

క్రూరుఁడు లోభియుఁ గొండీఁడు శఠుఁడు
నోరువలేనివాఁ డుగ్రుండు ఖలుఁడు
జడుఁడు కృతఘ్నుండు సత్యహీనుండు
నుడుగక నిందల కోర్చిన వాఁడు
కారుణ్య వర్జితుల్ కలుషాత్మకులును
జేరువ నుండినఁ జెడును భూవిభుఁడు

......ధనము దారాదికముల
వరుస రక్షింప నెవ్వరికైన వశమె
యలరి రక్షాఘనుండైనట్టి రాజు
గలిగినఁ గాక

సోమన. ద్విప. భారత. శాంతి.

...దుష్ట నిగ్రహము గావించు
భూవల్లభుల నేల పొరయుఁబాపములు

భద్ర. లింగకవి. పానసందో. 40

దొరలకు నెల్లఁ దలఁప దూరమున నున్నవారలె దొడ్డవారలు

రఘునాథ. రామా. II-124

చక్రపాలన విముఖుఁడై సంచరించు
రాజునకు ధాత్రి నాపద రాకయున్నె

పెద్దాద నాగ. శకుంతలా. II-212

న్యాయమార్గంబున నడవనేర్చినఁగాని పదుగురు సేవింపఁ
ప్రభువుగాఁడు

సూరకవి. రామలింగేశ.

ప్రభువులని పెద్దలోకపు వాదముండు
వారికంటెను బద్ధులు వసుధ గలరె
నవ్వువచ్చిన నోరారనవ్వరాదు
ఏడ్వవచ్చినగన్నార నేడ్వరాదు

పానుగంటి. కోకిల.

మహితధీమంతులైనట్టి మంత్రులుండ
వారిమాటల వినక యప్రాజ్ఞుఁడైన
బంధు దుర్బోధనలు విను పార్థివునకు
కాలుచేఁ గోఁతయే కాదె కట్ట కడకు

పానుగంటి. సారంగధర

కీడు సేయనట్టివాఁడు రాజయి యుండ
వాని మార్పుఁగోరఁవచ్చుచేటు

అ. నారాయణదాసు సూరుగంటి.

సతతానంద సుఖైక భాగులుగదా సర్వంసహాధీశులు
కోలాచలం. మైసూరురాజ్యము

తనకు సేపని యున్నను జనవిభుండు
జనుల సేమంబులే కనుంగొనగ వలయు

దిన దినంబును దప్పక యినుఁడు లోక
ములను గాపాడకుండునే వెలుఁగునిచ్చి

బలిజేపల్లి. సత్యహరి.

ఎంత దనుక ధర్మ మెదనిల్చు ధరణీశు
డంత దనుక నతని యాజ్ఞ చెల్లు

కాళ్లకూరి. చిత్రాభ్యుదయము

సుజనుఁడై భృత్యులను దయఁజూచె నేనిఁ
బేద వడియును శోభించుగాదె నృపతి

తిరు. వేం. కవులు. మృచ్ఛకటికము

ఆప్తవర్గంబు నంతయు నవలఁద్రోసి
స్త్రీయశక్తినె నమ్ము పృథ్వీధవుండు
త్రోవచూపెడి వారల ద్రోసిపుచ్చి
చేతికఱ్ఱనె నమ్మెడు చీకుకరణి

మరవరం. ఉచ్ఛృం.

గోపకుల కాపులేకున్న గోగణంబు
ప్రోపు మాలి నాశనమును బొందునట్లు
భూపతుల ప్రాపు లేకున్న భూమి ప్రజలు
ప్రోపు మాలి వినాశంబుఁ బొందఁ గలరు

వేటూరి. ప్రతిమా.

జనులకు స్వస్వవృత్తులు ఘాసంగ మహీతల మేలువాఁడె
రాజనఁబడు

శ్రీపాద. శ్రీకృష్ణభారత. అరణ్య. VII-27

ప్రజలు శ్రమపడి యార్జించి భక్తిఁ దనకు
నిచ్చినధనంబు వారికై వెచ్చపెట్ట

కాత్మ్యభోగాళి కొఱకును ఖ్యాతి కొఱకు
వమ్ముసేయుట దగునె నృపాలకులకు

విక్ర. దే.

రాజు : ప్రజ

రాజునకుఁ బ్రజశరీరము
రాజు ప్రజకు నాత్మగాన రాజుంబ్రజయున్
రాజోత్తమ యన్యోన్య వి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్

తిక్కన. భారత. శాంతి. II-274

ఎనిమిది నెలలును నల్లనఁ
దనకరముల భూరసంబు దఱుగం గొను భా
నుని క్రియసూక్ష్మో పాయం
బున దరి గొనవలయు నృపతి భూప్రజచేతన్

మారన. మార్కం. III-136

క్షత్రియుఁడు మందుఁడైన ధరిత్రీప్రజలోటచెడి చరింతురు

అయ్యలార్యుడు. భా. రా. యుద్ధ. 10

ప్రజలఁ బ్రోవని రాజు ప్రజలచేత
నపహృతసత్పుణ్యుఁడై, వారు గావించు
ఘన పాపఫలముఁదా ననుభవించు

పోతన. భాగ. IV-542

జనములు నేర్చిన విద్యలు
జననాథుని కొఱకుఁగాదె ?

పోతన. భాగ. X-1332

కుజనుల శిక్షింపమియును
సుజనుల గ్రోధించి చంపఁజొచ్చుటయును భూ
భుజునకుఁ బాతకమూలము
ప్రజచే నాతనికి భంగపాటౌనగూడున్

ప్రౌఢకవి మల్లన. రుక్మాంగద. III-55

విరితేనియ యళిగ్రోలిన
వెరవునఁ బ్రజ నొవ్వకుండ విభవము గొఱకై
యరి గొంచుఁ బోర నిదిరిన
యరి నొంచిన రాచవారి కబ్బుశుభంబుల్

తెనాలి అన్నయ. సుదక్షిణా. II-146

అరిఁ గోరుకొనెడు తఱి భూ
వరుఁడు ప్రజలమనసు నలపవలవదు తలఁపన్
ధరణి గుసుమములఁ గలిగిన
పరిమళములు గొనెడు తేఁటి బాగున నధిపా

చరిగొండ ధర్మన. చిత్రభారతము. V-52

రాజెట్లు నడచె ధరాజను లట్లు
యోజించి నడచుట యుక్తమైయుండు
జననాయకుఁడు సత్యసంధుఁ డౌనేని
జనులెల్ల సత్యంబు సడలకుండుదురు
రాజైన యతఁడె మర్యాదఁ దప్పినను
భూజను లెట్లు కాపురము సేయుదురు

వరద. రామా. అయో.

......ప్రజ పట్టు గలుగని రాజు
తృణమాత్రుఁడు......

వరద. రామా. అరణ్య.

మేదినీ నాథుండు మెత్తన యైన
నాదట మూవంతఁ డాయేన్గు నెట్టు
లెక్కఁజూచునో యట్టులిలఁ బ్రజ తన్ను
దక్కక చూచు, నెంతయుఁ గ్రూరుఁడైన
బెగ డొందు...

సోమన. ద్విప. భారత. శాంతి.

రాజేపోకలఁ బోయిన
భూజనసంచయము లట్టిపోకల బోవున్

వావిల కొలను. ఆంధ్రవాల్మీకి రామా.

ఉత్తమ శ్లోకుఁడై ప్రజాయత్త చిత్తుఁ
డైనవాఁడు రాజైనచో నఖిల ప్రజలు
సిరియు సంపదయుంగల్గి వెలఁగుచుంద్రు
కానినాఁ డెల్ల జగమును గాలిపోవు

శ్రీపాద. మధుకర విజయము.

## రాజు : మంత్రి

హితవు చెప్పెడి మంత్రు లెందుఁ బుట్టుదురు
హిత వని వినురాజు లెందుఁ గల్గుదురు

మహిగల మంత్రుల మంత్రాను మతులఁ
గృత కార్యములు పచరించు నేవిభుఁడు
నొగిఁ బ్రభుమంత్ర సముత్సాహశక్తు
లగణితఫలదంబులై వాని కమరు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

## రాజు : సత్యము

జనపతు లేయూరు సత్య మే యూరు ?

గౌరన. హరిశ్చంద్ర.

తానెంత కార్యపారగుఁ
డైన రహస్యమున మంత్రి నడుగక ధరణీ
జానికి నే కార్యంబుం
బూనందగ దుద్ధత ప్రభుత్వ ప్రజ్ఞన్

బైచరాజు. పంచతంత్రము. III-339

అధిపులాత్మశక్తి ని మంత్రులందు నిల్పి
యవనిఁ బాలింతురనుట నియనుభవంబె
కాచగోళంబు గుండఁ బ్రకాశమొందు
దీపమునకుఁ దేజంబెంతొ తెలియవాకొ

పానుగంటి. కల్యా.

## రాజు : సేవకుఁడు

... భృత్యులొప్పని పని సేసినన్ విభులు
బంధుర చారు యశంబుఁ బేరుఁ బెంపునుఁ జెడిపోయి
దుర్యశముఁ బొందుచునుందురు విష్టపంబులన్

పోతన. భాగ. III-555

పరిజన గౌరవము ధరా
వరునకు నత్యంత గౌరవము వొండియు న
ప్పరి జన లాఘవము ధరా
వరునకు నత్యంత లాఘవము సుమ్మొందున్

బైచరాజు. పంచతంత్రము, I-360

భటులయోగ్యతచేఁ గీర్తి ప్రభునిదగును
భటులదుష్టత నపకీర్తి ప్రభునిదగును

పానుగంటి. చూడామణి.

## రాజ్యకాంక్ష

తనయుఁడు తండ్రియగ్రజుఁడు తమ్ముఁడనంజనునయ్యరాజ్యముల్
గొనునెడ శౌర్యలంపటులకున్ మఱి చుట్టఱికంబు గల్గునే

తిక్కన. వి. రా. III-95

రాజ్యకాములకు నన్నతమ్ముఁడను వావి గలదె?

మారన. మార్కం. VIII-25

తల్లిఁదండ్రినైనఁదమ్ముల నన్నల
సఖులనైన బంధు జనులనైన
రాజ్యకాంక్షచేసి రాజులు చంపుదు
రవనిఁ దఱచు జీవితార్థులగుచు

పోతన. భాగ. X-55

ధారుణి రాజ్యలక్ష్మిని ముదంబున జేకొనువారు నిశ్చయం
బారయబంధులన్ మఱియునాప్తుల మిత్రుల లెక్కసేతురే.

సురవరం, ఉచ్ఛం.

## రాజ్యపాలన

భూరిప్రజానిరంతరభారము దాల్చుటిది కరముభారము

నన్నయ. భారత. ఆది. III-53

రాజయ్యెడువాఁడు దనరాజ్యభారంబు దానచూచి యరయ
వలయు

నన్నయ. భారత. ఆది. V-126

ఎఱిఁగియు ధారుణినేల దుర్బలులు
మఱి వాంఛ సేతురే...

సోమన. ద్విప. భారత. కర్ణ.

తనదు ప్రజలు వెతలుగనుచుండ వారిని
దలఁప కన్యదేశములకు నేఁగి
సామి యలరఁదగునె? జనుల రంజింపని
వాని నృపుఁడనంగఁ బాడియగునె

విక్ర. దే

## రాజ్యము

రాలచ్చికినై పెనంగిన బలంబులురెండును గెల్వనేర్చునే?
తిక్కన. భారత. విరాట. IV-234

పరుల యొత్తులేని రాజ్యంబు పూజ్యమహిమం బరఁగు
తిక్కన భారత. ఉద్యో. II-89

ఒక్కని దయంగను రాజ్యసుఖంబు లేటికిన్
తిక్కన, భారత. శల్య I-62

తనవారుఁ దానుఁగూడఁగ
ననుభవ సుఖమందఁడేని యదిరాజ్యమె?
తిక్కన. భారత. శల్య. II-702

అవని యరాజకమైయుండఁ దగదు
గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. అయో

రాజ్యంబు పాపమూలము
రాజ్యముతో నొడలెఱుంగరాదు సుమతియున్
రాజ్యమునఁ బూజ్యనెఱుఁగఁడు
రాజ్యము గీజ్యమ్ము ముక్తిరతునకు నేలా?
పోతన. భాగ. IX-507

......రాజ్యమను మహాభూతంబు
సోఁకినప్పు డెట్టి సుజనులకును
లేని చీకుఁదనము లేని మూగఁదనంబువచ్చు

సూరన. కలా. V-198

## రామాయణము

ఎత్తటి నైనను ధీరో
దాత్తనృపోత్తముని రామధరణీశుని స
ద్వృత్తము సంభావ్యము

తిక్కన. నిర్వ. అవతా.

రాఘువేశ్వరు చారిత్రము నెందఱెన్ని గతులన్ వర్ణించినం
గాలదే?
జానకీజానికథల్ రచింపకయ సత్కథ లెన్ని రచించె నేనియున్
వాని వివేక మేమిటికి వానికవిత్వ మహత్వమేటికిన్

పాపరాజ. ఉ. రా. పీ. 14. 15

తోయధులన్నియు నొక్కటఁ
జేయొంతగ నీదఁ దలఁపుసేయుటగద రా
మాయణకథ యంతయుఁ గృతి
సేయఁగఁ బూనుట

రఘునాథ. రామా. I-36

శ్రీరామాయణ మాది కావ్య మగజాసేవ్యంబు వాల్మీకి చే
నారూఢంబుగ నిర్మితంబు నిగమాంతార్థ ప్రబోధంబు మం
దార ప్రాయము ముక్తిదంబు విబుధ స్తవ్యంబు దీనిన్ వినన్
ఘోరాఘౌఘ హరంబగున్ జదువ వైకుంఠంబు ప్రాప్తం బగున్

చేకూరి సిద్దయ్య. శ్రీరామకర్ణామృతము.

## లక్షణజ్ఞత

రత్నములకు విలసత్కృతి
రత్నములకు మఱి తురంగ రత్నములకు స్త్రీ
రత్నములకు లక్షణములె
యత్నంబునఁ జూడవలయునంద్రు మనీషుల్

ఉత్తముఁడు లక్ష్య లక్షణవృత్తవేది
పరఁగు మధ్యముఁడన లక్ష్యపద్య వేది
పొరిది నధముఁడు లక్షణ శ్లోకవేది
లక్షణజ్ఞులకివియపో లక్షణములు

అప్పకవీయము.

వితయగుఁగాదె లక్షణవివేకము లక్ష్యమెఱుంగకుండినన్
తిరుపతి. వేం. కవులు. శ్రవణా. II-84

## లాభము

పన్నిన తపముచేత బడయుటే లాభము
ఎనయధర్మ దేహమిదెన్ని పాట్లు వచ్చినా
ననుభవించి తీరుచుటది లాభము

అన్నమయ్య. అధ్యా. సం.

## లోకరీతి

సకల దేశములను సన్మార్గవర్తులుఁ
గలరు దుష్టతతియుఁ గలిగి యుండు

తిక్కన. భారత. కర్ణ. II-114

బాలత్వంబున నవివే
కాలోలత శుచియు నశుచియైనదియు సమం

బైలీల జుగుప్సిత విధి
శీలత నొందంగ దుర్విచేష్టలఁ దిరుగున్

తిక్కన. భారత. స్త్రీ. I-39

పెరుఁగుట విఱుగుట కొఱకే
ధర తగ్గుట హెచ్చుకొఱకె తథ్యము సుమతీ

బద్దెన. సుమతి. 104

ఔనటంచు నొక్క డాడిన మాటకు
గాదటంచు బలుక ఋణము పట్టు
దాని విలువ దీయఁ దాతలు దిగవలె

వేమన

భూషింప మెచ్చు లోకము

దూషింపం జంపఁ జూచు

బైచరాజు. పంచతంత్రము. I-150

ఉరివి తొల్లిఁటి యధికారి యోసరిలిన
వెనుక యధికారి యవికావె విభవకళలు

తెనాలి. పాండు. మా. IV-42

ఒకమెట్టు తరణి డిగ్గిన
నొక మెట్టు శశాంకుఁ డెక్కునుర్వీస్థలిలో
నొకరాజు సన్నగిల్లిన
నొకరాజంతంతకున్ మహోన్నతిఁ గనఁడే

చేమకూర. విజయ. I-144

రహిఁ విరక్తునకును రాజ్యంబు తృణమగు
దాతయగు నతనికి ధనము తృణము

జూదగాని కధికసుఖము తృణంబగు
సారె నిస్పృహునకు జగము తృణము
భవానీశకవి. ధర్మ. II-132

లోవిమూయ మూకుళ్ళు లో గలవు గాని
లోకంబు మూయగా మూకుళ్ళుగలవె ?
శ్రీపా. గోపా. సంపా. స్త్రీలరామా.

## లోభము

తమ్ముదమ లోభమనుచిచ్చు దరికొనంగఁ
దెగినవారయి పోదు రంతియ తలంపు
తిక్కన. భారత. ఉద్యో. I-353

విను లోభము నజ్ఞానం
బును సదృశఫలప్రదముల పుట్టును లోభం
బున నజ్ఞానము గావున
జననాయక లోభముడుఁగ సౌఖ్యములొందున్
తిక్కన. భారత. శాంతి. III-402

లోభావేశమునఁ గామ మగ్గలించు
ఎఱ్ఱన. భారత. అరణ్య. IV-288

అతి లోభం బొప్పదు
మంచెన. కే. బా. చ. III166

విభవము కొలంది నొసఁగక వితతలోభ
కలితుఁడగు మానవుండు దుర్గతులఁ జెందు
భవానీశకవి. ధర్మ. VIII-227

అర్థలోభులు చేయని యఘము గలదె ?
దా. శ్రీ. దేవీభాగ. VII-318

అర్జితార్థము(గుడువక యర్థికీక
దాచుకొన( దేనెపెరవోలె( దరలు సర్వ
మింత విడుచుచుండెనేని పో దెస(గెడు మరు
గొమ్ము(గల తటాకమ్ము(జలమ్ము(వోలె

శ్రీపాద. కనకగిరి. 136

పాపములకెల్ల లోభంబు పట్టుగొమ్మ

శ్రీపాద. శ్రీకృష్ణభారత. అరణ్య. VII-290

## లోభి

నెఱవగు సంపదగలిగిన
నెఱిదానింగుడువ(గట్ట నేరని మనుజుం
డఱిముఱి(జేనికి(గట్టిన
వెఱబొమ్మయె కాడె యెన్ని విధముల(జూడన్

జక్కన. విక్రమార్క. II-17

సరఘల్ గూర్చిన తేనె మానవులకున్ సంప్రాప్తమైనట్లు లో
భరతుల్ గూర్చిన విత్తముల్ పరులకుం బ్రాపించు

పోతన. భాగ. VII-436

అడుగ నీయలేని యాతడు పెనులోభి

తానుగుడువ లేక తగవేది యాప్తుల(
జేరనీయడట్టి చెనటి పశువు

కండలెల్లగోయ( గాసీయ( జాలని
బండ లోభికాస పడిన గలదె ?
కొండ క్రింద బసిడి( గోరిన చందంబు

ఒకని కీనివాఁడె యోచింపఁ జెనులోభి

కలిగి ధర్మమీయ గానని వారును
కలిగి తినక చాల క్రాఁగువారు
కలిమి నెచట జూడగానక చెదుదురు

లోభివానిజంప లోకంబు లోపల
మందువలదు వేఱుమతము గలదు
పైకమడుగఁజాలు భగ్గున బడిచచ్చు

లోభివాని నడుగ లాభంబు కలుగునా ?

లోభిదాతగాడు లోకంబు లోపల

పిసినివాని యింట పీనుఁగు వెడలిన
కట్ట కోకలకును కాసులిచ్చి
వెచ్చమాయె నంచు వెక్కివెక్కేడ్చురా

ధనము కూడబెట్టి ధర్మంబు సేయక
తాను దినక లెస్స దాచుగాక
తేనెనీగకూర్చి తెరువరికీయదా

గొడ్డుటావు బిదుకఁ గుండ గొంపోయిన
బండ్ల నూడఁదన్ను పాలనీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా

వేమన

వైభవము గలిగెనేనియు
లోభికి సౌఖ్యంబుసున్న

భవానీశ. ధర్మ. VII-51

పిసినిగొట్టును విత్తగర్వితుడు నేని
పరమదారుణుఁ డతఁడు దుష్కరుఁ డతండు

తిరు. వేం. కవులు. మృచ్ఛకటికము

## వంచన

వంచించుటది బంటుతనమె?

గోనబుద్ధారెడ్డి. రంగరామా. యుద్ధ

ఏగతి మోసంబు లేదె యెవ్వరికైనన్

మారన. మార్కం. VII–203

చెలితనమునఁ దనుఁ జెఱచిన
తులువంగని తొలఁగి పోక తోరపుఁబ్రియముల్
పలుకులతీపులఁ జూపుచుఁ
జెలిమై వర్తించి గాక చెఱుపఁగనగునే

మంచెన. కే. బా. చ. III–187

మోస మెవ్వరియందు మొలవదు?

గౌరన. హరిశ్చంద్ర.

మోసమునను దనదు మోక్షముదప్పు
మోసమునను దనకు మొదటిముఖ్యతహాని
మోసమునను దనదు మురువుదప్పు

వేమన

తనకుచ్చితంబేల తనుఁగాల్పకుండు?

తిమ్మయ. ద్విప భారత. ఆది.

మాయకానికి భూమిమాయలె తగును;
మాయకానికి శౌర్యమహిమలు తగవు

సోమన. ద్విప. భారత. కల్యా.

వద్దనుంటె యొకమాట
వాకిట నొకమాట

క్షేత్రయ

భువిలోన ధూర్తమానవు
లెవ్వరైననుగాని పరులయెడలను నతికై
తవ మొనరించిన మాత్రన
న వితథముగ ధాత్రినశ్యులగుదురు వారల్

శ్రీధరమల్లె. బ్రహ్మోత్తర. III-267

తనువొకచో మనసొకచోఁదగిన వేషమొకచో
నిడి జనులనేఁచువారికి జయమౌనే ?

త్యాగరాజు

తన్నొకఁడు కొంటెతనమునఁ బొగడినఁ
బొంగునట్టివాఁడు మోసఁపోవు

తానె టక్కరినని తెగులూనియొరుని
మోసపుచ్చఁగ జనువాఁడు మోసపోవు

అ. నారా. నూరుగంటి.

జనులధనము గొల్లగదోఁచుకొనగ దొంగ
పరమ దేశభక్తునిరంగు బ్రాముకొనును
ముద్దరాంగ్రడను గౌఁగిటఁ బాదువబొజఁగు
కల్లజడలను దాల్చి భాగవతమాడు

పానుగంటి. పద్మిని

ధ్యాననిర్మగ్నమై నిల్చి యా బకంబు
కాలుదవిలిన చేపల గఱచితినును

కపట వైరాగ్యనటనల ఘనతచూపి
గ్రుడ్డిలోకులవంచించు గురునిపగిది

దువ్వూరి. కుంభరాణా, I. iii 134

## వయస్సు

వయసునం గడియింపవలయుఁగా కరుగ
వయసు రమ్మనినను వచ్చునే మగుడి

తాళ్ళపాక. తిరువేం. వరమయోగి.

...చంచల తరముల్ వయోభిమత సౌఖ్యములు

ఏ. ల. కవి. సుధా.

ఎవ్వరికిని లేఁత ప్రాయమును
వార్థకమున్ గురిగాదె మేదినిన్

భల్లాణ. I-86

కాంచుటకు రెండు కన్నులేగలిగినట్టి
పూర్వవయసునఁ గాన్పించు పోల్కిఁ బ్రకృతి
కానిపింపదు నాలుగు కనులతోడ
వర్తనముసేయు నుత్తరవయసునందు

పానుగంటి. పూర్ణిమ

## వాక్కు

మాటలయట్టివి యగునే పోటులు

వన్నెచోడ. కు. సం. II-39

మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం

బును బరిమితమును నగు బలు
కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్

నన్నయ. భారత. ఆది. III–205

అన్యోన్య విరుద్ధభాషణములాడినఁ దత్ఫల మాతఁడందెమున్

తిక్కన. భారత. ఉద్యో. I–32

ఉమ్మడిఁ బరుసమంటే దొక్కమాటే కాదా?

తా. అన్నమయ్య. అధ్యా. సం.

వాక్కుశుద్ధిలేనివాడు చండాలుండు
మంచిమాటచేత మనసురంజిల్లును
ఫక్కిదెలిసి పలుకు నొక్కవాక్యమెచాలు
అంకి లెఱిఁగి మాటలాడ నేర్చినపుడె
పిన్న పెద్దతనము లెన్ననేల?
హీననరులతోడ నింతుల తోడను
బడుచువాండ్రతోడ బ్రభువుతోడ
బ్రాజ్ఞజనులతోడ బ్రహ్మఘ్నుతోడను
వైపు దెలిసిపలుకవలయు
చందమెఱిగి మాట చక్కగా జెప్పిన
నెవ్వడైన మారి కేలపలుకు?

వేమన

ఇరవుఁ దప్పినమాట నేటికాడెదవు

సింగన. ద్విప. వాగ.

మంచిమాటకు ననుమానింపనేల?

వరద. రామా. సుందర.

వాగ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్ని
యున్

ఏ. ల. కవి. మహా. నీతి. 16

దాక్షిణ్య సమేతంబ
ల్పాక్షరమధికార్థమశరమతి హృద్యతరం
బక్షీణ మసందిగ్ధము
దక్షంబగు పలుకు వలుకఁదగు...

శ్రీధరమల్లె. బ్రహ్మోత్తర IV-400

తలపరువు నోరెచెప్పును

గువ్వల చెన్నశతకము. 66

వరుసతో కల్లలాడి వాచాలుడగుకంటె
అరయంగ మూకవాడయ్యేది మేలు

గా. లక్ష్మయ్య. ఏగంటి. (వి. రా. రాజు. తె. జా. సా)

చిత్తనైజమును స్పష్టపఱచునది జిహ్వ కాని రూపంబుగాదు

పానుగంటి. వవ. రాఘ.

...కూడునే! తిండిపట్ల
మఱియు వ్యవహారపుంబట్ల మాటకుఱుచ

తిరు. వేం. కవులు. పా. గృ. III-96

తనువులు చెల్లును మాటయెనిల్చును

అ. నా. దాసు. గజేంద్ర

## వాక్కు - క్రియ

...పల్కొకకటిసేఁత యొకటి
యగుట చాలదోషము...

తిక్క.న. భారత. మహాప్ర. I-41

చెప్పుడు మాటలు చెప్పుకొనుటగాక
చెప్పినట్లుఁ దాముసేయరెవ్వరును

వృద్ధభావంబు వచ్చిన వెనుకజనున
కేమి సౌఖ్యంబుగలదు......

ధరణిదేవుల. దశా. చరిత్ర. II-141

ముదిమి రెండవబాల్యమన్పదము నిజము

చింతమర్తి. ప్రసన్న. III-45

రెండవబాల్యము సుమ్ము ముదిమి

తిరు. వెం. కవులు. బుద్ధ. II-149

వార్ధకంబది దుర్వ్యాధావర్ధకంబు

వా. కృ. రావు. అస్థిరత.

## వాసయోగ్యములు

ఎందలి జను లవినీతిం
బొందక మత్సరము పొంతపోవక పరమా
నందమునఁ గూడియుండుదు
రందుండుట పరమసుఖము నాపాదించున్

ఎందెల్ల మందులునుగల
వెందుఁ గృషీవలులు ధనికులెందు ధరణి చె
న్నొందు బహుసస్యదాయిని
యంతున్నివసింపఁదగు సుఖార్థులు......

మారన. మార్కం. III-250,251

అప్పిచ్చువాఁడు వైద్యుఁడు
నెప్పుడు నెడతెగక పాఱు నేఱును ద్విజుఁడున్
జొప్పడిన యూరనుండుము
చొప్పడకున్నట్టి యూరఁ జొరకుము

బద్దెన. సుమతి.

## విగ్రహారాధన

లింగంబునందుఁ బూజించుట
యర్చ్యయందారాధించుకంటె ననేకగుణంబులెక్కువ

తిక్కన. భారత. ద్రోణ. V-418

మందాధికారులకుఁ బ్రతిమార్చనంబు
పురుషార్థ ప్రదంబగు

పోతన. భాగ. VII-453

శిలలజూచి నరులు శివుడని భావింత్రు
శిలలు శిలలెకాని శివుడు కాడు.
శిలను బ్రతిమజేసి చీకటింటనుబెట్టి
మ్రొక్కవలదు

వేమన

చిల్లరరాళ్ళకు మ్రొక్కుచునుంటే
చిత్తము చెడునుర ఒరే ఒరే
చిత్తమునందున చిన్మయరూపుని
చూచుచునుండుట సరే సరే

పల్లెపదాలు. శ్రీపా. గోపా. సంపా.

వర్ణతతిఁ జూచి వ్రాసియుఁ బలికి మఱి గు
ణించిననుగాని పాండిత్య మెటులరాదొ
మొదట నట్టులు విగ్రహపూజ లేక
ముక్తిసాధనమగు భక్తి పుట్టదెపుడు

విగ్రహామె దేవుఁడని భక్తి విశ్వసింప
దైవసాన్నిధ్య సౌఖ్యమందంగ నరుదె

పానుగంటి. రాధాకృష్ణ.

జాతి బొమ్మఁజూచి తాయియేయని యొప్ప
రికముసేసి పోవరిత్త ఫలము
దానిదైవమంచుఁ దలపోసి పూజింపఁ
బుణ్యదాయకంబు ముక్తిదంబు

పానుగంటి. వనవాస

## విడాకులు

సేసవెట్టి పెండ్లాడిన చెలియేరూపుదియైనా
వాసితోఁ బతికి విడువంగ వచ్చునా ?
పెంచిన చిలుకయెంత పేరుకుచ్చి తిట్టినను
ముంచి ముద్దాడుటగాక మొత్తవచ్చునా ?

అన్నమయ్య. అధ్యా. సం.

అగ్ని సాక్షిఁగ నుద్వాహమైన వెనుక
విడువవచ్చునె సతులెంత వెట్టులైన

పిల్ల. పిన. జైమి. IV-90

... గుణవతియుఁ బుత్రవతియు
నైన భామను విడుచు నన్యాయకారి
కిహ పరంబులులేవు

పిల్ల. పిన. శృం. శా. IV-123

కులస్త్రీల విడువంగఁ దగునె !

సోమన. ద్విప. భార. అరణ్య.

అగ్ని హోత్రంబు సాక్ష్యముగ పెండ్లాడిన
భార్య నెన్నఁడు నెడబాయఁ జనదు

ఆ. నా. దాసు. యథార్థ.

పరిణయము వేళ భరణమేర్పరుపఁదగునె

తనికెళ్ళ ప్రకాశశాస్త్రి. శ్రీకృష్ణరాయబారము

## విడుపు

విడుపు వలయు సకలవిషయ వాంఛలయందు
విడుపుఁబోలు గుణము వెదకి యెందుఁ
గానరైరి బుధులు గలదు పరిత్యాగ
శీలునకు నసాధ్యసిద్ధి యెందు

ఎఱ్ఱన. భారత. అర. V-38

## విదగ్ధులు

వినుమెవ్వాఁడే కార్యం
బున నిపుణుఁడు దానియందుఁ బూజ్యుఁడు హీనుం
డనవలదు సూదినయ్యెడు
పని చిక్కని కఱుతచేత బాగై యున్నే

మంచెన. కే. బా. చ. IV-104

చూచుసంతలోన జుట్టరికముఁజూపు
వాని నెఱుఁగునేరుపైన వాఁడు

దారికడ్డమైన దానిని నేర్పరి
మిగులఁ దొలఁగద్రోసిఁ పొగడఁబడును

నేర్పుఁగలుగువాఁడు నెఱవేఱునందాకఁ
బనికిఁ జొచ్చి కోర్కిఁ బడయుచుండు

ఈడుకానివానితోడ నేస్తమునకు
నేరుపుగలవాఁడు చేరఁబోడు

తనకుఁ జెఱుపుసేయు చెనఁటికి నేర్చిన
వాఁడు మాఱుచేసి కీడుదాటు

అ. నారాయణదాసు. మాఱుగంటి.

తమప్రజ్ఞచే నౌరుల మించదలంతురు కాదెనేర్పరుల్ !

కాళ్ళకూరి. చిత్రా. I-4

## విద్య

ఎల్లవారు నెఱుఁగరెల్ల వానిని భిన్న
విషయులెల్లవారు విద్యలందు

గురుముఖమునఁ బడయక దు
ష్కరతపమునఁజేసి పడయఁగాఁబడు విద్యల్
పరమార్థము మదమును మ
త్సరమును గావించు నెట్టిసాధులకైనన్

గురుశుశ్రూష యొనర్చుచుఁ
బరమ క్లేశమునఁ జేసి పడసినవిద్యల్
స్ఫురియించుఁగాక గురుముఖ
విరహితముగఁ బడసి నవియువెలయునె యొందున్

నన్నయ. భారత. అరణ్య. III-173, 256, 282

ఆయువు దఱిఁగిన నల్పంబులగు విద్య
లల్పవిద్యల విమోహంబు మిగులు

ఎఱ్ఱన. భారత. అరణ్య. IV-288

ఏభయంబుల నెచ్చోట నెనయలేదు
నరునకెప్పాట విద్యాధనంబ ధనము
చోర బాధాదికము చేతఁ జూఱవోవు
ధనము ధనమానెయెన్ని చందములఁదలఁప ?

శ్రీనా. కాశీ. IV-112

గురునకు సేవసేయుట తగుందగు విద్య పరిగ్రహింపఁగా
నరుమగనర్థమిచ్చి పడయుందగు నొండెసువిద్య యిచ్చివి
స్తరముగ విద్యఁ గైకొనుట దానొక పక్షము మూఁడురీతులం
బరగుట దక్కనాలవ యుపాయములేదని చెప్పుశాస్త్రముల్

అనంతా. భోజరాజీ. II-92

కోటివిద్యలునుఁ గూటికొఱకె

పలు చదువులవంకఁ బరముగ నేనంటే
అల సంశయమేకాని యగపడదు

పెక్కులు చదివినఁ బెనఁగుఁదోడనే
తెక్కుల పలు సందేహములు

అన్నమయ్య. అధ్యా. సం.

చదువనివాఁ డజ్ఞుండగుఁ
జదివిన సదసద్వివేక చతురతగలుగుం
జదువఁగ వలయును జనులకు

పోతన. భాగ. VII-130

సన్నుతంబగువిద్య చాలు నొక్కటియె

గౌరన. నవనాథ

చదువు చదివెనేని సరసుడౌను

విద్యలేనివాఁడు విద్వాంసులకడల
నుండగానె పండితుండు గాడు

కష్టమైనవిద్య ఖలులకు నబ్బునా!

ఎంతనేర్పుతోడ నేమేమి చదివిన
జింతలేనివిద్య చిక్కబోదు

చదివిచదివిచదివి చావంగ నేటికి
చావులేనిచదువు చదువవలయు

వేమన

......వీరు వారనంగ వలవ
దనఘసద్విద్య యెందున్నఁగొనఁగవలయు

పెద్దన. మను. IV–93

మదిన్ దీండ్రల్ గల్గినవారికే కరణి
నేనిన్ విద్య రాకుండునే

పెద్దన. మను. V–478

తానెఱింగిన విద్యానృపా
స్థానములో నెరపఁగీర్తి సమకూరుంగా
కే నరునకుఁ బరవిద్యా
ధీనత భూపాలసభలఁ దేజముగలదే?

ధూర్జటి. శ్రీకాళ. మహా. III–162

విద్యయెఱింగించు విష్ణునేఁప్రొద్దు
విద్యదా మొదల వివేకింపవలయు

మాయతోఁపించిన మహితభేదములఁ
పాయఁదోఁయు నుపాయపద్ధతి విద్య
భవుఁడు మధ్యమదృష్టిఁ బరికించుతత్త్వ
మవధాననియతిఁ దానతి విద్యయగును
గురుకృపనదియుఁ గల్గుచునుండు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

కోటివిద్యలు ధాత్రిఁ గూటికిరావు

సోమన. ద్విప. భారత. శల్య.

బిరుదులేటికి విద్యయే బిరుదుగాదొ

రఘునాథ. వాల్మీకి. III

విద్య నిగూఢగుప్తమగు విత్తమురూపము పూరుషాళికిన్
విద్య యశస్సుభోగకరి విద్యగురుండు విదేశబంధుమున్
విద్య విశిష్టదైవతము విద్యకుసాటిధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము విద్యనెఱుంగనివాఁడు మర్త్యుడే

హార్తకుఁగాదు గోచరమహర్నిశమున్ సుఖపుష్టి సేయు స
త్కీర్తిఘటించు విద్యయను దివ్యధనంబఖిలార్థి కోటికిం
బూర్తిగనిచ్చినం బెరుఁగుఁబోదుయుగాంతపువేళనైన భూ
భర్తలు తద్ధనాధికులపట్టున గర్వముమానుటొప్పగున్

ఏ. ల. కవి. సుభా. నీతి, 13, 17

......చదివినఁగాని వివేకంబు రాదు

ధరణీదేవుల. దశా. చరిత్ర IV–148

విద్యయొసఁగును వినయంబు వినయమునను
బడయుపాత్రత పాత్రతవలన ధనము
ధనమువలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మిక సుఖంబు లందు నరుఁడు

చిన్నయసూరి. నీతిచంద్రిక

బ్రతికినన్నాళ్ళు విద్యను బడయవలయు
ధనముతఱిగిపోవు దానంబుచేసిన
విద్యదానమునను వృద్ధినొందు
విద్య లేనివాఁడు వింతపశువు

కం. వి. నీతిది.

విత్తకరిగాని విద్యను వెఱ్ఱియైన సంగ్రహింపఁడు

తిరు. వేం. కవులు. నావా. 312

మంచిచెడ్డలు దేనిచే మనకుఁదెలియు
నయ్యదియెవిద్య దానినే యభ్యసింప
వలయు, నితరంబవిద్య యభ్యాసమునకుఁ
దగదదిసదా సదాచార తత్పరులకు

తిరు. వేం. కవులు. సుకవ్య, III-25

తనదువిద్య నొకనికిచ్చి తాగ్రహింప
వలె నొకనివిద్య యుందురు

పానుగంటి. కోకిం

లేశమేనియు సద్విద్య లేనివాఁడు
శోభగాంచడు నిర్గంధ సుమమువోలె

తివిరి మనుజుఁడు విద్య సాధింపవలయు

రమ్యమగు విద్య సమకూర్పరాని దేది

మేటి విద్యాధనమునకు చేటులేదు

విద్య ధనమిచ్చు సత్కీర్తి వెలయఁజేయు

విద్దెయను దివ్వె యారక వెలుగు జూపు

నా. కృ. రావు. గ్రం. మా. విద్య

## విద్యావిద్యలు

విద్యయు నవిద్యయు ననఁగా రెండు గలవు;
అ విద్యా దూషితుండై తమోగ్రస్తుండై నవాఁడు

విద్య నెఱుంగఁడు ;
విద్యాసంపన్నుం డెఱుంగు

సాత్త్విక రాజస తామస వికారంబుల త్రిప్పులంబడక
ధర్మం బాచరించుచు భావశుద్ధి గలిగి యుండుటచే
నచ్యుతు నెఱుంగుట విద్య, ఇట్టిది గానివిధంబవిద్య

తిక్కన. భారత. ఉద్యో. II–320

## విధి

తగిలి జరయు రుజయు దైవవశంబున
నయ్యె నేని వాని ననుభవింత్రు

నన్నయ. భారత. ఆది. III–193

మనుజులకు నెవ్విధంబున
ననతి క్రమణీయమైన యాపద్విషయం
బున సంతాపింపంగాఁ జనదు

నన్నయ. భారత. ఆది. IV–254

......దైవము చెయిదిన్
నిర్మితమయిన శుభాశుభ
కర్మఫలం బెల్లు దేహి గడవఁగ నేర్చున్

నన్నయ. భారత. సభా. II–279

విధాతృ నను(గహంబునన కాదె పుణ్యకర్మంబులు ప్రవర్తించి
మర్త్యులమర్త్యత్వంబును బొందుదురు
విధాతృ నియోగంబునం బుణ్యాపాప ఫలంబు సంప్రాప్తంబగు
కర్మఫలము లేదు కర్మ ఫలాప్తికిఁ
గారణంబు విధియ

నన్నయ. భారత. అరణ్య. I–230, 31

విధియోపదె యెవ్వరి నెట్లు సేయఁగన్

తిక్కన. భారత. విరాట. I-98

విధికృతం బెవ్వరికి నుడుపవచ్చు

తిక్కన. భారత. భీష్మ. II-354

......విధాత నిర్దయుఁ డొడంబడునే కడు మేలి వస్తువుల్

పెక్కు దినంబు లునికి

ఎప్పాట నెవ్వరికి విధి తప్పింప వశంబె

తిక్కన. భారత. ద్రోణ. II-140, 150

విధి కసాధ్యము గలదే

తిక్కన. భారత. శల్య. I-24

......ఉడుపం జాలుదురే నరులు దైవ సంపాదితముల్

తిక్కన. భారత. శల్య. II-368

దేవకృతంబులు ధీరులకైనన్

భూవర మాన్పఁగఁ బోలునె యెల్లున్

నియతిఁ దప్పింపనేరికి నేరనగునె

తిక్కన. భారత. స్త్రీ I-71, 87

విధి మూఁడిన మర్త్యుఁడేల విను నుచితోక్తుల్

వశంబగునె దైవగతిఁ దప్పింపన్ ?

విధికి నెట్టివారి నెట్టె తెఱఁగు సేయరాదు ?

తిక్కన. భారత. స్త్రీ. II-40, 60, 122

ఎవ్వ రెంతఁ జేసిరేనియు విధి యొందు

దలఁపనాఫలంబు దలఁగ కేలయుండు

తిక్కన. భారత. సౌప్తి. I-29

మిత్రుల చెయ్దులన్ సుఖము మే కొను నంటయుఁ జెందు దుఃఖ
ముల్
శత్రులచెయ్ది నంటయును సన్మతిదా ధన మూలమంటయున్
గోత్రవరేణ్య భోగములకున్ ధనముల్ గరణంబు లంటయుం
జిత్ర చరిత్రుఁడైన విధిచేష్టదొలంగిన నీటి వ్రాలగున్

తిక్కన. భారత. శాంతి. I–207

దైవ యత్నములవి దాటంగ వశమె ?
ఏకాల మేత్రోవ నేది గావలయు
నా కాల మాత్రోవ నది కాకపోవ
దయ్యెడు కార్యంబు లగుఁగాక.........

కావలసిన పనుల్ గాకేలమాను ?

గో. బు. రెడ్డి. రంగ. రామా. అయో.

. ...బ్రహ్మ వ్రాసిన
నుదుటి లిపులు దుడువఁగలవె నూల్కొను వెరవుల్

ఎఱ్ఱన. హ. వం. ఉ. భా. IX–33

శుభాశుభంబులు దైవ కృతంబులు

కుమా. రు. దే. భా. రా. అయోధ్య. 132

తప్పింప నేరికి శక్యంబునుగాదు దైవఘటనారిష్టంబు సామాన్యమే
విధిచేత దప్పఁ దిరుగన్ రాదంటదా మిథ్యయే

విధి కృతంబునఁ జెడనున్న వేళలందు
బుద్ధిఁ బరికింప కూరక పొలియుఁగాదె

అయ్యలా. భా. రా. యుద్ధ. 1293, 1393, 1478

వేరంబెత్తిన ధాత చెయ్యియుడుపన్ వెజ్జెవ్వఁడూహింపఁగన్
మనుజుం డెంతటివాఁడు దైవకృతముల్ మానింపలేడు

కేతన. దశ. కు. చ. II-89,106

......ఈశ్వర భాషితమునకుం దర
తరముల యందైన నన్యథాత్వము గలదే

శ్రీనాథ. హర. III-76

దైవగతి దాటవచ్చునే దేవతలకు

శ్రీనాథ. శృం. నై. IV-96

కాలవశంబునగల పదార్థములు
రూప భేదంబుల రూఢిగాఁ బొందు
ధర బ్రహ్మ వ్రాతలు తప్పింపరాదు

శ్రీనాథ. పం. ని.

దైవ దుర్విలసితవృత్తి నెంతటి వివేకులు దప్పరె

దుగ్గన నాసి. I-220

రావలెనన్నవి రాకమానవు
పోవలెనన్నవి పోకుండవు
అయమిందుఁ గాదవుననవెవ్వరు ?

నుదుట వ్రాసిన వ్రాలు నూతేండ్ల పత్రము
పుట్టినప్పుడే తనువు భోగ్యమై నిలిచెను

తన దైవికము గడవ నెంతటివాఁడు దాను ?

తా. అన్నమయ్య. అధ్యా. సం.

ధనము వీధిఁబడిన దైవ వశంబున
నుండుఁబోవు మూలనున్న నైన

నడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు
రక్షితుండు మందిరమునఁ జచ్చు

పోతన. భాగ. VII-49

శివుని యాజ్ఞలేక చీమైనఁ గుట్టదు

వేమన

తప్పదు దైవకృతంబు

గౌరన నవనాథ.

......విధి దాఁట నెవ్వరి వశము
భగవంతుఁ డొనరించు పద్ధతి జరుగు

గౌరన. హరిశ్చంద్ర

దైవిక మెవరికిఁ దప్పింపరాదు

పింగళి. ద్విప. భాగ.

విధాత కృత్యమది యేలా మాను నెప్పట్టునన్

రాయలు. ఆముక్త. V-101

ఎంతవారికిఁ దప్పింప నెట్లు వచ్చు
బ్రహ్మదామున్న వ్రాసిన వ్రాత ఫలము

సూరన. కళా. III-98

తెగునెడ కెంత దవ్వయినఁ దెచ్చుగదా విధి దేహధారులన్

బైచరాజు. పంచతంత్రము. II-31

పొనరఁ బొందెడు సొమ్ము పొందు నెందున్న

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

ఫాలాక్షరంబులు భవుఁడైనఁ దుడువఁ
జాలఁడు నీవేల సంభ్రమించెదవు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

బలమెంత గలిగినఁ బ్రాప్తంబు దప్ప
నిల నెట్టివారికి నేమియు రాదు

తిమ్మయ. ద్విప. భారత. విరాట

కాఁగల యర్థముల్ కాకేలమాను

తప్పింతునని యెన్ని దలఁచితి వేని
తప్పునే కాఁగల దైవయత్నంబు

వరద. రామా. అయో.

దాటవచ్చునే దైవగతుల్ శరీరికి

పాపరాజు. ఉ. రా. VI–347

తప్పదుగా విధికృతము!
తలవ్రా లెవరికి తప్పించ వశమే?

క్షేత్రయ

ధాత వ్రాసిన వ్రాఁతకుఁ దప్పు గలదె?

చే. వేం. సారంగ. II–29

రాకన్యాసవు హాని వృద్ధులు మహారణ్యంబులో డాగినన్

రామదాసు చరిత్రము

దైవగతి యెవ్వరికి దాటఁదరము గాదు
దైవం బనుకూలంబైనఁ గలుగు నన్ని శుభంబుల్
దనకుఁ బ్రతికూలమైవచ్చిన నేకార్యంబుఁ గాదు

ధరణిదేవుల. దశా. చరిత్ర. II–432

ప్రారబ్ధవశత నాపత్సంపదలు వచ్చు
వగపు నుబ్బును మదిఁ దగుల నీకు

శమపర్తి. కవిరాజ. I–174

కాకమానదు కాదగు కార్యమెందు

దా. శ్రీ. దేవీభాగ. IV-324

బలమై యచ్యుతమై యతి ప్రతివిధానంబై యనుల్లంఘ్యమై
వెలయుంగాదె విధిక్రమంబు

ధర్మవరం. చిత్రనళీయము. III-iii-57

తరళ విధిప్రతారణాలు తప్పునె మేదిని నెంతవారికిన్

వేదము. ప్రతాప. III-46

ప్రారబ్ధము ననుభవించక బ్రహ్మకైన వశమాౕనె

అ. నా. దాసు. గజేంద్ర

ఎవ్వరికయినన్ బితామహుఁడు వ్రాసినమార్గము దప్పిపోవునే

తనికెళ్ల వరాళశాస్త్రి. జగన్నాథ రథోత్సవ విలాసము

## వినయము

నతిసేసిన వానికేల నాశము గలుగున్ ?

పోతన. భాగ. VIII-702

తను పోషించినవారిపట్ల మఱి వింతల్ గావు నమ్రత్వముల్

చెంగల్వ కాళకవి. రాజగోపాల. IV-76

అన్ని గుణములుండి యడఁకువ లేకున్న
నిష్ఫలంబులవియు నిశ్చయముగ
ఎంత కలిమి గలుగు నంతయడంకువఁ
గలిగి యుండవలయు గర్వపడక

చదువునకుఁ దోడు వినయంబు గుదిరియుండ
పసిఁడిఁకిని దావి యబ్బిన భాతియగును

కం. వి. నీతి. 20, 21

కలిమియుఁ జదువును జాలం
గలిగినచో మిడిసిపడక కడు నడఁకువతో
మెలఁగంజను నెల్లరకును
దలకూడును బేరుఁబెంపుఁ దద్దయు దానన్
కం. వీ. శుద్ధాంధ్ర. భార. సంగ్ర. III.46

నిర్మల వినీతికిం బ్రాపు నెనరు చేపు
అ. నారాయణదాసు. జానకి.

అడఁకువగలవాని కగపడు న్నిజము
అ. నారాయణదాసు. వేల్పుమాట

## వినాశకాలము

చేటు కాలమైనఁ జెట్ట మాటలు నెఱి
గాని తెరువు వట్టు కర్జములును
దగిన యట్ల తోఁచుఁ దగియెడునవి యవి
నీతులని మనంబు నిశ్చయించు
తిక్కన. భారత. ఉద్యోగ. II-64

చేటు కాలమునకు చెడుబుద్ధి పుట్టును
వేమన

......చెడనున్న తఱి వినఁ
బోలునె దగు బుద్ధు లల్పబుద్ధుల కెందున్

కాలము సేరిన మనుఁజుడు
బాలిశ చిత్తంబుతో నపథ్యముల గొనం
జాలిఁ బడుఁగాని తనకున్
మేలగు పథ్యములు గొనఁగ మెయికొనఁ డార్మాన్
భాస్కరుడు. భా. రా. అర. II-172

......చెడువేళ నిహతమతికిఁ
దవిలి సద్బుద్ధు లెవ్వియుఁ జెవులఁ జొరవు

అయ్యలార్యుడు. భా. రా. యుద్ధ. 1479

చేటు కాలమునకు చెడు బుద్ధి

వరద. రామా. అయో.

కుమతి వినాశకాలమునకున్ విపరీతపు బుద్ధిఁ బూని య
క్రమములె కాంక్షఁ జేసి చెడు

పాపరాజు. ఉ. రా. VI-234

వినాశకాలమునఁ జెడ్డ మంచిగా గానిపించు

తిరు. వేం. కవులు. పాండవో. IV-84

## వినీతుఁడు

దయవంతులు నిజకార్య
ప్రయోజనములకును జేయుపను లన్యులు మా
కయిసేసిరి వీరనుచుం
బ్రియమందఁగఁ జేయుదురు భరిత కౌశలులై

మంచెన. కే. వా. చ. II-40

వినీతుఁడైన పతిచేష్టల్ చేటుఁ దేకుండునే

మంచెన. కే. వా. చ. III-300

అనయము వినయము నయమును
దన సొమ్ముగ మెలఁగు కీర్తి ధనుఁ డెచ్చటి కే
గిన నిష్టార్థముఁ జేకొను

పాపరాజు. ఉ. రా. II-254

విద్యగల సజ్జనుఁడు వంగి వెలయు మాడ్కి-
వనభరితమేఘతతి భూమిపైకి వ్రాలు

విక్ర. దే.

అడఁగి మడఁగియులోంగి మహాశయుండు
కౌశలంబునఁ గడియించుఁ గార్యసిద్ధి

శేషాద్రి రమణకవులు. బాలనీతి శతకము. 7

## విమర్శ ; విమర్శకుఁడు

తన మొగము దనకు నగుపడ
దనువుగ నద్దమున గాక యటులగుట మహా
ఘనుఁడైనను కవి యొరుచే
తను దెలిసికొనంగ దగును తన తప్పొప్పుల్

నెమ్మిమెగను గృతిని గుణమ్ములెల్ల
నగపడుం బగచేనైన నన్ని దోష
ము లటు గావున నారెంటి మొనయ నాత్మఁ
గృతి విమర్శకు లగువారు హితులు కవికి

కాకొండ. బిల్వ. I-167, 168

కవికి న్విమర్శకులె చర్చింపంగ మేల్సేయువారు

శ్రీపాద. ఏకావళి. పీఠిక

## వియ్యము

వియ్యమందఁ బోక కయ్య మొనర్పుట
చెలిమిసేత తమకుఁ జలము గాని
వారితోడఁ దగదు

మంచెవ. శే. బా. వ. IV-120

ఊరి ముందర చేను కాకుల్లపాలు
ఊళ్ళోని వియ్యమ్ము కయ్యాలపాలు

పల్లెపదాలు. శ్రీపాద. గోపాల. సంపా.

వియ్యమందఁగ నోచని విభవమేల

ఆ. నారాయణదాసు. మార్కండేయ.

## విరహము

మనసు లొండఁగూడి కడసనఁ
దనువులు నెఱయంగ వేడ్కదంపతులకు వా
రని సంయోగము గలిగిన
ననిశము నది యర్థవిరహ మనదగు

నన్నెచోడుఁడు. కు. సం. XII-208

ప్రాణముతోడి చావు మగడుండవైవ్వన నిల్లాలికిన్

కేతన. దశకుమార.

ఆపదగాదే ప్రియురాలిఁ బాసిన యెడన్ భావింప నెవ్వారికిన్?

పోతన. భాగ. IX-357

విరిపాన్పుపై పోలి వేగింపలేనట్టి విరహమేటి విరహము

క్షేత్రయ.

విరహమునందైన బర
స్పరమనురాగులకుఁ బొందుభాసిలు మన సె
వ్వరి కెనయదు వారలకును
విరహము హెచ్చుగ నొనర్చు వెనసంగతియున్

ముక్కు. ఏ. ల. కవి. II-65

వియోగమునఁ గాంతియుఁ బ్రేమయు మల్లడింపవే

దువ్వూరి. వనకుమారి. VII-17

## వివాహము

గాంధర్వవిధి వివాహమగుట వినవె యుక్తము
కదుఁ బ్రశస్తములు సత్క్షత్త్ర వంశ్యులకు
గాంధర్వ రాక్షసములు ధర్మయుక్తి

తనకు మఱితాన చుట్టంబు తాన తనకు
గతియుఁ దన్నిచ్చుచోఁ దానకర్త యనఁగ
వనజనేత్ర గాంధర్వ వివాహమతి ర
హస్యమును నమంత్రకమును నగుచు నొప్పు

నన్నయ. భారత. IV-55, 58

కులహీనుఁడు కులజఁ జేసికొనఁ జనదెందున్

కులమున నధికుం డొండెను
కులమున నరిపురుషుఁడొండె గుణయుతు లగు క
న్యలఁ బెండ్లి యాడుటుచితము

ఇచ్చిన కన్యకమగుడం బుచ్చికొనుట చాల తప్పు

చెప్పక చూపక కలిగిన
యొప్పని దోషములు కన్య యొడలఁ గలుగఁగా
జెప్పక యిచ్చుట జనకుని తప్పు

కేతన. విజ్ఞా. అచా. 91, 105.

కన్యఁ గులజనైనను రోగినిఁ
గొనఁటెఁ జెనఁటెఁ బరిణయంబగు టొప్పదు

మారన. మార్కం. III-239

దార పరిగ్రహమే కద
సారపు ధర్మములకెల్లఁ సాధన మరయన్

శ్రీనాథ. హర. IV-43

ఈడుగానిదాని తోడికి బొల్పడి
జోడు గూడరాదు

ఒప్పులేని పెండ్లి నొనర సేయగరాదు

వేమన

యువతి ముదుకఁ గూర్ప నొప్పదెందు

పోతన. భాగ. IX-64

కన్నియ రూపు గోరుఁ, గనకంబులు గోరునుదల్లి, బుద్ధి సం
పన్నతఁ గోరుఁదండ్రి, కులభవ్యతఁ గోరును బంధుకోటి, ప
క్వాన్న ఫలాది భక్షణము లన్యులు గోరుదురు

పెదపాటి సోమయ్య. కేదార ఖండము

అవల వేయు నబద్ధము లాడియైన
నొక్క పెండ్లిచేసిన నది యుచితమండ్రు

రఘునాథ. శృంగార. సావిత్రి. II-79

కలుగుఁ గలావిశేషము జగంబునఁ బెండ్లియటన్న నెట్టి వా
రలకు......

చేమకూర. విజయ. III-119

పిన్ననాటి పెండ్లి పెండ్లిగాదు

విజయ రాఘవుఁడు. కాళియమర్దనము

పెండ్లి యఖిల ప్రమోదంబుఁ బెనుచు జగతి

అహోబలపతి. కాళింది. V-71

## వివాహము

కల్లలు నూరాడి కళ్యాణ కాంతు
నల్లువారు చరింతు రది బాసగాదు

శేషము వెంకటరంగాచార్యులు. [illegible] విలాసము. య.

కులమును శీలము విద్యా
బలమున్ రూపంబుఁ గాంచి ప్రార్థించి తగం
గలకంఠి నట్టివానికి
సలలితముగఁ బెండ్లి సేయఁ జనునంద్రు బుధుల్

కొప్పరపు రాజకవి. జాంబవతీ పరిణయము

మెచ్చి మేనరికంబు ఇచ్చేటికంటె
మెడకోసి నూతిలో వేసితే మేలు
లేకుంటె గంగలో కలిపితే మేలు

తెలుగు పల్లెపాటలు. ప్ర. న. శాస్త్రి. సంకలితము

విర[illegible]త కన్నెలం [illegible]ల్లిపెట్టి పెండ్లి
సల్ప నసురకృత్యం [illegible]గు

అ. నారాయణదాసు. భీష్మచరిత్ర

ఎన్నటికైన నితరునకు
గన్నియ యీఁబడుటె నిజముకావున సుత దా
నెన్నిన వ[illegible]ని కొసంగుట
సన్నుత కార్యంబుగ దె జనులకు

విక్ర. దే. శ్రీనివాస. IV-130

## వివేకము

అహితుల నెల్ల విధంబుల
విహితులఁగాఁ జేయునది వివేకము

నన్నయ. భారత. సభా. II-271

వీతఁడిమైన మానిసికి వెండి
వివేకము గల్గనేర్చునే

తిక్కన. భారత. ఉద్యోగ. III-107

ఇది తప్పగు నీతప్పన
కిది చందంబనుచు బుద్ధినెఱుఁగక కడుఁ బెం
పొదవగ బ్రతికిన బ్రతుకది
తుదిదాఁకం జనదు మీఁద దుర్గతి కలుగున్

కేతన. విజ్ఞా. ప్రాయ. 2

పుట్టు దొకవేళ వివేకము నెట్టివారికిన్

శ్రీనాథ. కాశి. VI–5

వెట్టివారైనను విషముఁ ద్రావుదురే?

పా. సోమన. బసవ.

వినఁదగు నెవ్వరు చెప్పిన
వినినంతన వేగపడక వివరింపఁదగున్

బద్దెన. సుమతి. 99

...... అతులిత సత్యం
బునకుపఘాతికమయ్యెడు
పనికొడఁబడుదురె వివేకపరిణతు లెందున్

అనంత. భోజరాజీ. 191

పదిలమై వివేకించి బ్రదుకఁగ వలయు
ఎఱుకతోడి వివేకమెవ్వరియందున్నది?
పరమును నపరముఁ బ్రకృతికము ననఁగా
వెరవు దెలియుటే వివేకము

తా. అన్నయ్య అధ్యా. సం.

తెలివిసంపద గలవాఁడె దేవసముఁడు
తెలివిలేక మేనిబలమేమి పనిచేయు?
పరఁగునె వివేకమిల జడప్రకృతులకును

తరిగొప్పుల. మల్లన. చంద్ర. I'I–141

...తమకు శక్యముగానిపనికిఁ
జొరక నెమ్మది నున్కి సుమతికి మనికి
క్షితిఁ దాతకట్టిన చెలువైననేమి!
చతురత మునిగిఁ లోఁజావంగఁదగునె

తిమ్మయ్య. ద్విప. భార. ఆది

వృత్తవిహీనుఁడె హీనుఁడు
విత్తవిహీనుండు హీనవృత్తుఁడె తలపన్
విత్తము వోవున్ వచ్చున్
వృత్తము రక్షింపదగు వివేకులు పుడమిన్

భవానీశకవి. ధర్మ. II-73

## వివేకి

శోకభయస్థానంబు ల
నేకంబులుగలిగినను విహీనవివేకుం
డాకులతఁబొందునట్లు వి
వేకముగలవాఁడు బుద్ధివికలుండగునే

నన్నయ. భారత. అరణ్య. 1-20

చవి యెంతయైన నపథ్యములకు
వేడ్కసేయుదు రయ్య వివేకులు

తిక్కన. భారత. విరాట. II-73

ఒకటిఁ గొని రెంటి నిశ్చల యుక్తిఁ జేర్చి
మూఁటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి
యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు
విడిచి వర్తించు వాఁడు వివేకధనుఁడు

తిక్కన. భారత. ఉద్యో. II-37

యౌవనంబును రూపంబు జీవితంబు
ద్రవ్య సంచయములు ననిత్యములు గావె
వీనివానికి వగ పవివేక మగుటఁ
బండితులు వగఁ గూరరు

తిక్కన. భారత. స్త్రీ. I-27

వివేకుల చూపేల వృథ వోపనేర్చు

తిక్కన. భారత. స్త్రీ. II-157

బాగెఱుంగక వేగపడఁ బనిలేదు
బాగెఱింగిన వానిఁ బాయు నాపదలు

గౌరన. నవనాథ.

హింస కెడమైచనఁగాఁజను సద్వివేకికిన్

వైచరాజు. పంచ. III-130

సారవివేకుం డతి తుచ్ఛమౌ సుఖముఁ గోరండెన్ని చందంబులన్

పె. నాగ. శకుంతలా పరిణయము. II-160

వివేకవంతు లెఱుంగని విధులు కలవె!

తిరు. వేం. కవులు. పాణిగృహీత. VI-29

ఎఱుఁగక తప్పొనరించియు
నెఱిఁగించిన యప్పుడెఱిఁగి యేవమిది యటం
చరసి యది దిద్దుకొనుట యె
మరియాద సుమీ! వివేక మహితుల కెందున్

తిరు. వేం. కవులు. పాండవజననము

## విశ్వాసము

నమ్మఁదగనివారి నమ్మక యున్నది
తగినవారినైనఁ దద్దనమ్మి
యుండఁదగదు తన్నునొరులు నమ్మెడు నట్ల
యుండి యొరుల నమ్మకునికి నీతి

తిక్కన. భారత. శాంతి III-240

"......వధూటికల యిచ్ఛకంబులెల్ల
విశ్వసించిన మగవాడు వెఱ్ఱివాఁడు"

కదిరీపతి. శుక. III-517

జనక శ్వశుర సతీ గురు
జననీ బుధ భాషణములు సమ్మద మొప్ప
న్విని విశ్వసింపుము మది...

శ్రీధరమల్లె. బ్రహ్మోత్తర. IV-91

నమ్మికచేఁగాని నడువదేపనియు

అ. నారాయణదాసు. వేల్పుమాట

రోగి విశ్వాసమున నష్టరోగుఁ డగును
శుంఠ విశ్వాసమునఁ గళాస్ఫురణుఁ డగును
దుఃఖి విశ్వాసమున దుఃఖదూరుఁ డగును
భక్తుఁ డుద్గతి నొందు విశ్వాసముననుశంక యాత్మశక్తులను ధ్వంసంబు జేయు
ప్రబల తమమాను విశ్వాసపటిమ నాత్మ
మఖిలము నసాధ్యమగు సంశయాత్మ కన్ని
సులభ సాధ్యముల్ విశ్వాస కలితునకును

పానుగంటి. వన, రాష.

## వీరత్వము

......పగవాఁడు వచ్చి
పెరిగి యుద్ధము సేయఁ బిలిచిన చోట
ధీరత దొఱఁగి సంధికి నియ్యకొనుట
వీర ధర్మము గాదు...

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా.

వీరసింహములకు వినుతిని గాంచు
సమర రంగంబులే సంచారవనులు

జనులకు కష్టంబు సమకూరునపుడు
శ్రీవీర వీర్యంబు చెదరంగఁ జేయు
దేశంబు పర నృపాధీన మానపుడు
శ్రీవీర సత్త్వంబు చిక్కంగ బట్టు
సామ్రాజ్యతరు వెండి చచ్చెడు నపుడు
శ్రీవీర రక్తంబు చిగిరింప జేయు

శ్రీనాథ. పల. వీ.

## వీరమరణము

మంచిగఁ బ్రీతిఁబాయక సమస్తజనంబులుఁ దన్నుఁగొల్వ జీ
వించిన ధన్యుఁడా మహిమవీడిన జీవము మేననిల్పనా
సించి విభుండు దానొకట సేవకుఁడై మనుకంటె ముంద రా
ర్జించిన కీర్తి నిల్వగతి సేకుఱఁగా నని చావు సేగియే

నన్నెచోడ. కుం. సం. X-197

ఒడలోమి పెద్దకాలం
బడవులఁబడి కాయగూర లాహారముగా

నడపిన తపఃఫలం బొక
గడియం గొందరదె యెదిరికదనము లోనన్

నన్నెచోడ. కు. సం. XI-43

యజ్ఞదాన విద్యా తపోబల మాననీయగతులు
సమర నివర్తన మృతుల యరుగునట్టి
గతులకుఁ బాటిగావం(డుబుధులు

దానాద్యుత్తమ కర్మ వి
ధానంబులఁ బడయుగతు లుదాత్తరణమునం
జానేర్చువాని చనియెడు
మానితగతిఁ బోలవండ్రు మహనీయాత్ముల్

తిక్కన. భారత. స్త్రీ. I-25, 111

సమరమున నెత్తెఱంగున
సమసిననుం గీడు తెరువు చనగుత్తమ లో
కముఁ గ పోదురు జనములు
ప్రముదితులై యండ్రు బుధులు

తిక్కన. భారత స్త్రీ. II-170

పాటి లోకనిందఁ బడుకంటె ననిఁ జచ్చి
బ్రహ్మ లోకపదముఁ బడయుటుఱదె

అయ్యలార్యుడు. భా. రా. యుద్ధ. 917

గంగ నాడఁగనేల గయఁ జేరనేల
రంగైన యోగ మార్గమునఁ బోనేల
సన్యసింపఁగ నేల సవన కర్మములు
విన్యసింపఁగ నేల విను మిట్టిచోట

స్వామి కార్యార్థమై వచ్చిన భటుల
కీమార్గమున ముక్తి యెదురుగా వచ్చు

తిమ్మయ. ద్విప. భారత. భీష్మ

వీరుఁడు

తక్కక చనుదెంచి తన ధర్మపత్ని
నొక్క డెత్తుకపోవ నూరక యునికి
మహిలోన వీరధర్మము గాదు......

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. సుంద.

వీరుల జయాపజయములు
నారయ సమవృత్తి నుండవనిరి మహాత్ముల్

అయ్యలార్యుడు. భా. రా. యుద్ధ. 2267

తనవారి రక్షింపఁ దరివచ్చినపుడు
వినియోగపడనట్టి వీరరక్తంబు
రక్తమే కలుష నీరంబగుఁగాక

శ్రీనాథ. పల. వీ. చ.

దురమునఁ గైదువు వదలిన
శరణన్నను వైరిజనులఁ జంపరు వీరుల్

సింగయ. భాగ. VI-413

.........ఖలులున్
దొడరివధింపక యూరక
విడువరు గద యెందు నైన వీరవరేణ్యుల్

రుక్మిణీపరిణయము. VI-74

ఎట్టివారలు శరణన్న నేలవలయు
వీరధర్మంబు గావున...

ధరణిదేవుల. దశావతార. II-117

## వృద్ధులు

ముదుసళులు దమకిమ్ముగాఁ జదివికొండ్రు
గాక పతులకు హితమగు కర్జమేల
రొయిలసి చెప్పుదు రహితులఁ గలిపికొనుట
ధర్మ్మవని రిదినయ విరుద్ధంబుగాదె

నన్నయ. భారత. ఆది. VII–3

వృద్ధుల బుద్ధులు సంచలింపవే

నన్నయ. భారత. సభా. II-9

చేరికఁ దలనెరిసిన యంతలోన
ఘనమైన వృద్ధలక్షణమె చర్చింప
జననుతంబైన సుజ్ఞానంబుఁ జదువుఁ
గలిగినవాఁడెపో కడున్వృద్ధుమహిని

సోమన. ద్విప. భారత. అరణ్య.

వృద్ధునకుఁ బ్రేమ సతిపైన హెచ్చుఁగాదె

పానుగంటి. కల్యా. రాఘ.

## వేఁట

పగలఁ గనిసైతురేనియు మృగ కులంబుఁ
గని సహింపరు రాజులు

నన్నయ. భారత. ఆది. IV–56

పఱవనోపకయున్న మైమఱచిపెంటిఁ
బెనఁగి యున్నను బ్రసవింప మొనసియున్న
దెవులుగొని యున్నమృగములఁ దివిరి యేయ
రెఱచి యాహారముగ మను నెఱుకులయిన

నన్నయ. భారత. ఆది. V-53

వేశ్య

ధనేతరున్ మదనుఁ దానొరుఁ గల్పమి నేర్పు వేశ్యకున్
"రొక్కమిూఁ గలుగు వాఁడె మనోజుఁడు గూలి యాలికిన్"
...... వెలయాలి కూటముం
బూవుల మేలి కంపుఁ దమ పొందునకా కట మిూఁద నిల్చునే

నన్నెచోడుఁడు. కు. సం. VIII–142, 143, 158

తల పొడుగు ధనముఁ బోసిన
వెలయాలికిఁ గూర్మిలేదు వినరా సుమతీ

బద్దెన. సుమతి. 84

పుంశ్చలికి నేటి తగవుం గిగవున్

నాచన సోమన. ఉ. హ. V–302

......అలలకున్ వెలయాండ్రకు మదిని
కలకాలమును నెక్కడివి నిల్కడలు

గౌరన. నవనాథ.

లంజ విటుని గుణము లాలించి పొగడంగ
దాని తల్లి మెపుడు వాని దిట్టు
తల్లి గలుగు లంజ తరము గానిది సుమా

వారకాంత లెట్లు వలతురో యూరక

వారకాంత లెల్ల వలచి యేతెంతురా
పొందు జేసి ధనము పుచ్చుకొనక

వారవనిత ధనికు జేరదీయగ గోరు

వేమన

వెలయాండ్రెక్కడ వారి వేడబములా వేదాంత సూక్తంబులే?

పోతన. భాగ. IX-417

వారకాంతలఁ దడవిన వచ్చు కీడు

దుశ్శీలాగారము వార యౌవతము నిస్సీ! మేటి వాటించునే?

రామకృష్ణుడు. పాండు. మహా, III-42, 43

......లంజ కిలలోనఁ గ్రొత్త మిన్న లిచ్చిన వాఁడె మీన

కేతనుఁడు

ఎలయించి ప్రియులకు నింపు పుట్టించి

కలకాలమును జేతఁగల కాసు లెల్ల

వలపించి వెరఁజు కోవలయును, గాలి

గలనాఁడె తూర్పెత్తఁగాఁ దగుఁగాక

తాళపాక. తిరు. వేం. పరమయోగి

రొక్కము చెల్లుదాక నె సరోరుహాలోచనలందుఁ గూరుముల్

నృసింహ. కవికర్ణ. IV-116

నెటికలు దీసి యిచ్చకము నేర్చి ప్రసంగము దీసి యప్పట

ప్పటికి నుతించి మాటలను బందిరి వెట్టి సటన్ ఘటించి ము

చ్చట లెఱిఁగించి బాస సహజంబుగ నందర కన్నిరూపులై

విటులఁ గలంచి తీయఁదగు విత్తము లుత్తమ వారకాంతకున్

చదలవాడ మల్లన. విప్రనారాయణ. III-23

.........లోకము లోన వేశ్యలుం

గాకుల వంటివార లటుగానఁ బ్రమాదము చేరనిచ్చినన్

వెలపొలంతి కెందు వలపు గలదె ?

సారంగు తిమ్మయ. వైజయంతి. II-98, 78

వారకాంతల కెందైన వావిగలదె?

చేమ, వేం. సారంగ. II–25

డెందం బేరికి నీయక
యందఱిఁ దన యాత్మ లోన నడపుచు నయనా
నందంబుగ మెఱయఁగవలె
నందంబున వారకాంతలద్దము భంగిన్

ఉల్లివలె బెక్కు పొరలై
నల్లివలెన్ నిద్రఁ జెఱిచి నమ్మిన దాకన్
బిల్లివలెఁ గాళ్ళఁ బెనఁగుచు
వెల్లివలెన్ గడవఁ బాఱు వేశ్య ధరిత్రిన్

వయసే ధనమూల మంత్రము వారాంగనకున్

ఎడపాటిఎఱ్ఱన. శృంగారమల్హన.

"......భోగ పురుషులకైన
కనుఁగొనఁగ వేశ్య హేయభాజనము గాదె"

జగ్గకవి. చంద్రరేఖా. II–34

జారతనంబున వార కామినుల్
చెన్నుగ పల్లవ ప్రతతిచేత ధనంబులు దోతు రెప్పుడున్

కాసాసంగునట్టి కడజాతి వాఁడైన
గల్గగోరు వారకాంత మదిని

ఎన్నగల్గిన నీతి విహీనునైన
దవిలి సద్వర్తనుం డంద్రు దమకు నొక్క
పీసమైనను గాసైన పీడమైన
జేతి కొసఁగినచో వెలచిగురుబోండ్లు

వెలపొలంతికి వలపును గనకంబునకును వాసన గలదే?

ఖల్లాణ చరిత్ర. III—62, 63, 64. 68

వంతలకు వింత దొంతర వారకాంత

తిరు. వేం. కవులు. శ్రవణా. IV-51

ధర గణికాంగన లోనరుచు
దురుపాయము లేరికైన దుర్జేయంబుల్

తి. వేం. కవులు. శ్రవణా. V-63

ధనకాంతలు నేర్వనట్టి తప్పులు గలవే?

తి. వెం. కవులు. పాణి. గృ. II-96

మానము దక్కదెందు వెలమానిని నమ్మిన యెమ్మెకాండ్రకున్

తిరు. వెం. కవులు. పాణి, గృ. -V-3

ఆట వెలఁది యనిన యంతనే కవులకు
వలెనె యెల్లరకును జులుకతనము

కాళ్ళకూరి. చింతామణి. III-28

......సానుల జూచి భ్రమించు టెండమా
వులు గని నీరు టెంకులని బుద్ధి దలంచుట వంటిదేగదా!

కాళ్లకూరి. చింతామణి. X-94

సిగ్గు లెన్ని యున్నఁ జెదరి పోవును గద
ఆట వెలఁది పొంత నార్యులార

కూచి నరసింహము. రూప.

## వేషము

వేస మరసిచూడ గ్రాసంబు కొఱకయా!

కట్టుబట్ట జూచి ఘనత చెప్పగరాదు
కానరాదు లోని కలిమి తనము

వేషధారి నెపుడు విశ్వసింపఁగరాదు

వేమన

ప్రకృతి మధురంబులకు వేషరచన లేల ?

రామకృష్ణుఁడు. పాండు. మాహా. V-150

వేషము నమ్మఁగఁ దగదిల
వేషము దోషాస్పదంబు వెలయఁ బరి వ్రా
డ్వేషమున దశగ్రీవుఁడు
భీషణగతిఁ గొనిచనండె పృథ్వీ తనయన్

శతావధానకవి. ధర్మ. II-110

రంగులు మాఱు మాఱఁడు వేసగాఁడు
మైతాల్పు మాఱఁడు మైమాఱుఁగాని

ఆ. నారాయణదాసు. వేల్పుమాట.

## వైరము

'...సమ బలాఢ్యునితోడ
నేపుమైఁ జని నిగ్రహింపంగ వలయు'

వచ్చిన పిమ్మట చనదు వైరంబు

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

'తా నెందుఁ జివ్వకుఁ దగదు చేఁజాప'

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

"......అకారణంబుగా
వలవని వైరముం గొనిన వారికి భోగ్యముగాకయున్న త
త్ఫలమది యెంత వారికిని..."

ధరణిదేవుల. దశావతార. II-383

హృదయ మెఱుఁగక పగులతోఁ బదరి చేయు
సౌహృదమె విరోధమగు

కందుకూరి. అభి. శా. V-575

తన వైరి బాధ నొందుట
గని తనదుఃఖంబు బాసి కడు మోదముతో
దనరుట నైజం బేరికి

విక్ర. దే. శ్రీనివాస. II-60

## వైరాగ్యము

వైరాగ్యంబు ప్రశాంతికిఁ
గారణము ప్రశాంతి ముక్తిఁగను మోక్షా నం
దారాము జరామృత్యువు
లేరూపునఁ జేరనేర విద్ధ చరిత్రా

తిక్కన. భారత. అను. V-242

భోగానుభవముచే పుట్టి సంతృప్తి
వేసట జనియించి వెగటుగాఁ దోచు
అటుమీద వైరాగ్య మమరుచు నుండు

శ్రీనా. పల. పీ

సంకల్ప వికల్పములే
వంకం బొరయంగనీక వైరాగ్య నిరా
తంకమతి జేయు కర్మము
గొంకక సుగతి ప్రదంబగున్ విమలాత్మా!

గణపతి దేవుఁడు. శివయోగ

చిత్తము లోపలి పలుచింతలు మానిన దాఁకా
సత్తుగా వైరాగ్యమునమ కూడదు

ఉమగవు కాంక్షలు మమతలు నుద్యోగంబులు చింతలు
పొడవగు విరక్తి తనలోఁ బొడమిన నందాఁకా

ఆపదలులేని సుఖమదియపో నిరతి
ఓపితేనే కైకొంట ఒల్లకుంటే మానుట

విరతియే లాభము విరతియే సౌఖ్యము
విరతియే పో విజ్ఞానము

వట్టి లంపటాలఁబడి వడిఁబొరలుకంటే
ఒట్టిన విరతి నూరకుండుటే సుఖము

సతత విరక్తుఁడు సంసారి గాఁడు
నిత్యుఁడైనవాఁడు నిఖిలలోకములఁ
బ్రత్యక్ష విభవసంపన్నుఁడు గాఁడు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

తలలు బోడులైనఁ దలఁపులు బోడులా?

వేమన

అనఘ క్షమాగుణంబునకుఁ బెట్టనికోట యీషణత్రయమున
కెదురుజుక్క
చింతామహాంబురాశికిని జెల్లెలికట్ట రాగంబునకుఁ జేరరాని
చోటు
బలవ దంతర్విరోధులకును వేర్విత్తు శ్రేయోవధూటికి జీవగఱ్ఱ
చిత్తనైర్మల్య సంస్థితికిని విడిమట్టు ప్రహ్లాదమునకును బట్టుగొమ్మ
చారుగుణ రత్నములకు విదూరభూమి
శమదమాదికములకును సంశ్రయంబు

దైన్యరసమునకెడ దప్పు హైన్యమునకు
నప్రదేశంబు వైరాగ్య మరసిచూడ

చదలవాడ మల్లన. విప్రనారాయణ. I–54

వస్తుభాగ్య విరక్తి వర్తించు ప్రతికిఁ
బ్రస్తుత ముక్తి మార్గము సులభము

తిమ్మయ. ద్విప. భారత. అరణ్య

వైరాగ్యం బుదయింపని
వారలు కైవల్య ధర్మవర్తను లైనన్
నూతేఁదుల కేనియు నని
వారణఁ దత్కార్య సిద్ధి వఱలంగల దే

భవానీశకవి. ధర్మ. IV–81

......ఎన్ని భంగులను నిర్భయమొక్క విరాగ మేసుమీ

ఏ. ల. కవి. సురా. III–32

ధనమదిలేని యప్పుడును దానిని నాశముచేసినప్పుడున్
వనితల నొందనప్పుడును వారల మిత్తికిఁ బెట్టినప్పుడున్
దనకటు నేదిరానపుడు ప్రదాతయెవండునులేనియప్పుడున్
జనుఁడు విరాగియై పరమసాధువు వైఖరి సన్యసించెడున్

శ్రీపాద. ఏకావళి. II–53

## వ్యత్యాసము

ప్రాలు గలనాఁడు ధాన్యము
వోలె సుసేవ్యుఁడగు నరుఁడు వొలుపుగ మేసం
బ్రాలు దొలంగుఁడు నుముకయుఁ
బోలె ననేవ్యుఁడగు నెట్టి పురుషుండైనన్

వన్నెచోద. కు. వం. I–168

ఈరెండు చేతులే యిన్ని పాపాలకు నోపు
ఊరకే పుణ్యము సేయనోపవుగాని
మారుకొని రెండు కాళ్లే మాపుదాఁకాఁ జుట్టనోపు
ఏరీతి దేవ! నీగుడికేఁగ నలసుఁగాని
కన్నులివి రెండె మిన్నుగలంతాఁ జూడనోపు
ఉన్నతినాసాగ్ర దృష్టి కోపవుగాని
అన్నిటా రెండు పెదవులధరామృతానకోపు
సన్నల మోక్షము త్రోవ జపించవుగాని
ఈవీనులు రెండే విశ్వమంతా నాలించ నోపు
ఓవల శాస్త్రాలకైతే నోపవుగాని

తా. అన్నమయ్య. అధ్యా. సం.

ఉలుకుచు దొంగ దానొకచోట నుండు
నొలయని విశ్వాస మొకచోట నుండు

గౌరన. హరిశ్చంద్ర.

తెరవాట్లు గొట్టి సత్తురువు బెట్టుటకంటె
న్యాయార్జితాన్న మింతైనఁ జాలు

సూరకవి. రామలింగేశ

తమకుఁగల వెట్టిదీఱున ధన్యతముని
వెట్టివానిగ జనులు భావించుచుందు
రట్టి వెట్టి దీఱిన వెట్టి యతఁడు లోకు
లెల్లరును వెట్టివారని యెంచవలయు

పానుగంటి. విప్ర.

బల్లిదుల దోషములు పొరపాటులగును
దుర్బలుల పొరపాటులు దోషములగు

చిలకమర్తి. గయో. II iii-44

బైట మలమూత్ర కఫముల పాటు గనిన
నరులు మనముల నేవగింతురు కడింది
యవ్వి దమలోన యుండినయపుడు దలంచి
యేవగింపరు గద కొంచెమేనివారు

విక్ర. దే.

## వ్యభిచారము

.........జారపొందు
హృదయమున కింపుసేయుమి నెఱుక గలుగు
వారు దీని సుఖంబుగాఁ గోరరెందు

తిక్కన. భారత. విరాట. II-70

అలురంభయైన నతి శీలవతియైన
జారపురుషుడేల జాడమాను ?

వేమన

రంకాడ నేర్చినది బొంకాడ నేరదే ?

క్షేత్రయ

జారసంగతిఁ గాంక్షించు చంద్రముఖికి
నత్తగారిల్లె కారాగృహంబు దలఁప

పమిఖము. అహల్యా. III-46

సర్వ విధంబులన్ సతికి జారసమాగమకాంక్ష చెల్లునే

శేషము వేంకటపతి. శశాంక విజయము

పరపురుష సంగమం బిహ
పర సుఖ దూరంబు

అయ్యలరాజు నారాయణా. హంసవింశతి. V-368

అంకొక్కటి నూఱు నోములను మెక్కంజాలు నిక్కమ్ముగా

తిరు. వేం. శతకం. శ్రవణా. V-9

## వ్యర్థము

.........కర్తృభక్తిమై

దనరని యజ్ఞమైనఁ దుదిఁదా నభిచారము గాకపోవునే

నన్నెచోడ. కు. సం. II-92

ధన మదియేల భోగమును

దానము లేదగు నేని; శత్రు మ

ర్దన మొనరింపఁడేని బల

దర్పము లేల; సధర్మ వృత్తికిన్

గొనకొనఁడేని విక్రముని

కుంజర యేల; జ తేంద్రియుండుగాఁ

డనఁ జనునేని నాత్మవిధ

మారయు నాశ్రమ మేల చెప్పుమా

తిక్కన. భారత. శాంతి. VI-243

అక్కఱ కొదగని యట్టి యర్థము

లెక్క లెన్నియైనా నేమి? లేకున్న నేమి?

తనకుఁగాని ధరణీశు రాజ్యంబు

ఎండనేమి? యది పండనేమి?

కేశవునిఁ బేరుకొనని నాలిక

యుండనేమి? యుండకుండ నేమి?

తలఁపు లుడుగక యొడలటు తాఁగడిగిన నేమి?

వెలుపలి కాంక్షలు ఉడుగక విధు లుడిగిన నేమి?

పొంచిన కోపము విడువక భోగము విడిచిననేమి ?
పంచేంద్రియములు ముదియక పై ముదిసిననేమి ?

తా. అన్నమయ్య. అధ్యా. సం.

మచ్చికంటుల నేఁచు మగఁటిమి యేల ?

గౌరన. హరిశ్చంద్ర.

ప్రియములేని విందు పిండి వంటలచేటు
భక్తిలేనిపూజ పత్రి చేటు
పాత్రమెఱుఁగ నీవి బంగారుచేటురా

పోటుకెడలు బంటు కూటిచేటు

తీర్పనార్పలేని తీర్పరి తనమేల ?

వేమన

మర్యాదలేని రాజ్యము
నార్యజనులు లేని సభయు నదనైన తఱిన్
గార్యముఁ గొనని సచివు చా
తుర్యమ్మును వ్యర్థమండ్రు తొల్లిటి పెద్దల్

అనంతా. భోజరాజీ. V-295

వాసన లేని పువ్వు, బుధవర్గము లేని పురంబు, నిత్య వి
శ్వాసములేని భార్య, గుణవంతుఁడు గాని కుమారుఁడున్ సద
భ్యాసములేని విద్య, పరిహాస ప్రసంగములేని వాక్యమున్
గ్రాసము లేని కొల్వు కొఱగానివి.........

పేరంరాజు జక్కన, పెమ్మయసింగధీమణి శతకము

మించిన పనులకు నేరంబెంచం బనిలేదు

రామభద్రుడు. రామా VII- 63

బాంధవులకును గాని సంపదలు నరుల
కుండనేమి మఱియును లేకుండనేమి

ఘట్టు ప్రభువు. కుచేలో.

రవిలేని దినము సారథిలేని రథము
కవిలేని కీర్తి యంకములేని పోటు
ప్రతిలేని వాదు తీర్పరిలేని సేన
ధృతిలేని తెగువ కూరిమిలేని చెలిమి
దొరలేని సీమ చంద్రుఁడు లేని రాత్రి
తరిలేని సంధ్య మంత్రములేని జపము
సతిలేని గృహము వాసనలేని పువ్వు
భృతిలేని కొలువు కోయిల లేని వనము
శ్రుతిలేని పాట శూరులులేని కోట
కతలేని రచన నిల్కడలేని మాట
యెల్లెడ వృథ......'

వరద. రామా. అయో.

ఉపకారము దలచని కఠినాత్ముడు ఉండి వ్యర్థము మదిలో
చపలత విడువక వ్రతములు తపములు జేసుట వ్యర్థము

సారంగపాణి. వేణుగోపాల కీర్తనలు

......సూడు దీర్పఁగాఁ
గలుగని గెల్పదేల బలగౌరవమేటికి శౌర్యమేటికిన్

ధరణిదేవుల. దశావతార. IV—102

అతివల హృదయము లారసి
రతి కలనన్ దేల్పలేని రట్టడిరూపున్

జతురతయు జవ్వనంబును
వితయచుమీా యడవిఁ గాయు వెన్నెలరీతిన్

శే. వేం. పతి. శశాంక. III-73

సారమౌ కవితలవిని వెఱ్ఱివాఁడు
సంతోషపడి యేమి పడకేమి?

త్యాగరాజు

ప్రాణ రక్షణలేని రాష్ట్రమేల?

దా. శ్రీ. దేవీభాగ. IV-554

అర్థ మెఱుఁగనిచదువు బల్ వ్యర్థమగును

శేషగిరిరాయుడు. నమశ్శివాయ శతకము. 85

మాసిన తలమీాద మడ తేమి సుఖము
పురుషుడు లేక పువ్వు ముడిచేమి సుఖము

అల్లుడికి పెట్టిన పెట్టేమి నయము
తల్లిలేని పుట్టింటికి వెళ్లేమి నయము

సెలయేరు. సేకరణ. నేదు. గంగాధరం

కృపణుని యనుగ్రహము పుంస్త్వహీను వలపు
మొఱకు సోమరి చదువు కాతరుని యాజ్ఞ
జరఠు నాశము కంపవత్కరుని గుఱియు
శక్తిహీనుని పగయు నిష్ఫలములగును

పానుగంటి. పూర్ణిమ.

ఎంత సంగర పాండితీమంతుఁడైన
జనుఁ డధర్ముఁడౌచో నది పనికిరాదు

పానుగంటి. విజయరామ.

జనకుఁడు గని మోదింపని
తనయుల మృదుభాషణములు దైర్యోద్ధతులున్
దనరియు వ్యర్థంబులు ని
ర్జన వనమున బూచియున్న ప్రసవము లటులన్

దువ్వూరి. సీతా. VI-iii-65

తనకు దేవుఁడిచ్చిన శక్తి కనుగుణముగ
నన్నదమ్ములు నాఁదగు నఖిలజనుల
కలఁక నేనాఁడుఁ దీర్పంగఁ దలఁపఁడేని
పుట్టనేల నరుఁడు?

కట్టు. రామలింగా. ము. మరణ. 65

సజ్జన హితోపదేశంబు బలులయెడ వమ్ముగదా

శ్రీ. వేం. సూ. ప్ర. నిర్వ. కు. సం.

## వ్యసనములు

కామజంబులైన స్త్రీద్యూతమృగయాపానంబులను
నాలుగు దుర్వ్యసనంబులం బ్రవర్తిల్లకుండ బ్రతిషేధింపవలయు

నన్నయ. భారత. అరణ్య. I-148

వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు
ప్రల్లదంబును దండంబు పరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత
యనెడు సప్తవ్యసనములఁ జనదుతగుల

తిక్కన. భారత. ఉద్యోగ.II-44

వ్యసనములలోనఁ బ్రథమవ్యసనము సంభోగకాంక్ష

రుద్రకవి. నిరంకు. I-36

కామరోషజంబులై మీఱినట్టి స
ప్తవ్యసనములందుఁ దగులవలదు

సూరన. కళా. VII–293

అల్పాశ్రయమున గల్గు వ్యసనములు
కల్పాంతరమైన బోవు

త్యాగరాజు

తగని యలవాటువడి హద్దుమిగిలినట్టి
వానిమరలింప నెవ్వారి వలనగాదు

ఆ రానారాయణదాసు. సూరుగంటి.

అంటుకొన్న జలగఁ యస్రంబు పీల్చిన
పిదప విడుచు వ్యసనవిసరమట్టి
రక్తమాంసములను బ్రథిత బుద్ధ్యాత్మల
బీల్చి పిప్పిఁజేసి విడువకుండు

పామగంటి. వన. రాఘ.

దూదిబుంగనరుడు దుర్వ్యసనంబులు
నిప్పులేని చింతనిప్పురవలు

కాళ్ళకూరి. మధుసేవ. I-57

## వ్యాజము

చెఱుపఁజూచువాఁడు చెలిమిఁజేయు

వేమన

ఒప్పనిపని కాలస్యము చెప్పుదురు

పిల్ల. పిన. శృం. శా. III–72

దూరముననున్న వారలె దొడ్డవారులు

రఘునాథ. రామా. II–124

## శకునము

కొనకొనంగోడియేత్రెంత గుంటనక్క
నెమిలియీనాలుగిటిదర్శన మదిలెస్స
పీనివలతీరుఁ బలుకు నుర్వీజనులకుఁ
గొంగుబంగారమంద్రు శాకునికవరులు

వల్ల. క్రీడ. 52

ఇలువెడలి మానవుఁడు తన
తలఁచినతావునకుఁ జేరుదాఁకను నే యం
కిలిలేక తెక్కటీరుపు
వలయును శాకునికవరుల వచనవిధమునన్

పిల్ల. పిన. శృంగా. I–131

కలుగఁబోవుశుభాశుభ కర్మములను
నరుల కెఱిఁగించుటకు మున్న నలువుమీఱ
ఘనుఁడు సర్వజ్ఞుఁడగు దేవుఁడనుచునట్టి
దూతలనగను శకునముల్ దోచుచుండు

శ్రీపాద. బొబ్బిలి VI–65

## శత్రువిషయము

బాలుఁడని నమ్మిరిపుతో
నేవిధమునఁ గలిసియునికి యెంతయువల దు
త్కీలానల కణమించుక
చాలదె కాల్పంగ నుగ్రశైలాటవులన్

నన్నయ. భారత. ఆది. VI–117

రిపు పక్షము నెమ్మోయినైనఁ జెఱుపఁగావలయునిలన్

నన్నయ. భారత. సభా. II–143

కేవల ధర్మాచరణంబు శత్రుజయంబునకు సాధనంబుగాదు

నన్నయ భారత. అరణ్య. I-248

తగవు తప్పినవైనఁ దనవారిఁ బాసి
పగవారి సేవించి బ్రతుకు టే బ్రతుకు?

వైరు లసాధ్యులై వాలిన వారి
లో రెండుపుట్ట నాలోచింపవలయు

...బలిమి వివేకించి మీఁద
విడిసి మార్కొర గెల్వ వెరవూఁదవలయు

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

అరాతులు సాధులమెత్తురే

తిక్కన. భారత. ఉద్యో. I-26

వలవదధిక దీర్ఘవైరవృత్తి

పగవారియింటఁ గుడిచిన
నగుఁ దమకవమానము

ఇట్టులముగఁ దమ ప్రాణములకు
నలుగు జనులు పగతురగుట యనుమానంబే

తిక్కన. భారత. ఉద్యో. III-20, 224, 226

ప్రతివీరునిఁ జంపుటేల పాపంబయ్యెన్

తిక్కన. భారత. ద్రోణ. V-362

పగతురఁదెగటార్చునెడ
నన్యాయంబనక యుపాయం బెయ్యది దొరకొనిన
దానసుత్పహింపవలయుట శాస్త్రసిద్ధంబు

తిక్కన. భారత. సౌప్తిక. I-24

అరులను మిత్రులందెలియ
　　నారయు సెంతయు సూక్ష్మకృత్యమ
వ్వారవతి దుర్లభం బరులు
　　వీరన నుండియు మిత్రభావముం
బొరయుట యున్ సుహృజ్జనుల
　　పోలికిగల్గియు శత్రుతాగుణ
స్ఫురణ మొకప్డు నూపుటయుఁ
　　జూతుముగాదె ధరిత్రినెల్లెడన్

అరియెడ మిత్రభావమొక
　　యప్పుడు కార్యము పొంటెఁగల్గిన
న్వారపునఁ బాముఁ బట్టునెడ
　　నిక్కము నమ్మకదానివాతికిం
గరము దొలంగఁజేయు నరు
　　కర్జమువట్టి చరించుటొప్పదే

తిక్కన. భారత. శాంతి. III–227, 230

మతిమంతులు నిజశత్రుల
నితరులఁ గొనియేనిఁ జెఱతురెన్నివిధములన్

తనచే నసాధ్యుఁడగు శ
త్రుని నన్యునిచేతనైన ద్రుంగునటులుగా
నొనరింపవలయు

మంచన. కే. వా. చ. IV–29, 62

పగవాని పక్షమైనవారు పగతెకారె!

ఎఱ్ఱన. నృ. పు. IV–26

పగరకుఁ జోటివ్వ పాదుకొనెదరు
తరువాతఁ బెరుకంగ ధర నసాధ్యంబు

పగవా రలతులని భావింపరాదు

భాండంబు నెగబట్టి బలురాతిమీద
వేసి పగిల్చిన విధమునమించి
తరిచూచి శత్రుని దండింపవలయు

శ్రీనాథ. పల. వీ.

ఎవ్వనితో నెచ్చోటం
జివ్వకుఁ జేసాఁపవలదు జేసాఁచినచో
నివ్వల నవ్వల నెవ్వరు
నవ్వక యుండంగఁ బగసనందీర్ప

కంటికి నిద్రవచ్చునె? సుఖంబిడు నేరతి కేళి? జిహ్వకున్
వంటకమించునే? యితరవైభవముల్ పదివేలు మానసం
బంటునె? మానుషంబుగల యట్టి మనుష్యునకట్టి నానికిన్
గంటకుఁడైన శాత్రవుఁడొకండు దనంతటివాఁడు గల్గినన్

శ్రీనా. కాశీ. I-9, 92

శత్రుఁడు చదువని పుత్త్రుఁడు
శత్రుఁడు ఋణకారియైన జనకుఁడు మిగులన్
శత్రువు రూపసియగు సతి
శత్రువు దుశ్చరితమైన జనని తలంపన్

జక్కన. విక్రమార్క. V-159

చంపవలయు లోక శత్రుగణము

పగతురఁ జెఱచితిననియునుఁ
బగతురచేఁ జెడితిననియు బాలుఁడు దలచుం
బగ చెలుములు లేవాత్మకుఁ
బగ చెలుములకీలు కర్మబంధము సుండీ!

పోతన. భాగ. IX-160

మేలునఁ బగవారి మెఱయించు టెల్ల
బాలుపోయుటగాదె పాముకూనలకు

అరిరాజు శిశువని యాలస్యమొప్పదు

నమ్మించియైనఁ బుణ్యము వైరిఁ జంప

పగవారిఁ జంపనోపని పార్థివులకు
జగతిఁ గీర్తియులేదు సౌఖ్యంబులేదు

పగతునిఁ గుఱువఁ జెప్పక వానియింటఁ
దగిలి తాఁగుదువక తప్పింపవలయు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

ప్రతిభటావళి నెన్ని భంగులనైన
నణఁచుటయే నీతియని దేవమంత్రి
ప్రణుతి కెక్కఁగఁ జెప్పెఁ బర్జన్యునకును

అలరినగతి శత్రులగువారినెల్ల
నిలనాశనము సేయ నెంతయు వలయు

బాలసర. ద్విప. భారత. పఱ.

పగవారి నెటులైనఁ బట్టిసాధింపఁదగు

వరద.రామా. కిష్కింధ.

...పగ నూఁతఁబడ రోఁకలెత్తి
తగఁగ్రుమ్మలేనట్టి ధర్మము దేల?

సోమన. ద్విప భారత. శల్య.

అరివీరులను ఘోరమగు యుద్ధమునను
దొరఁకొని వధియింపదోష మేలగును?

పనిపడి యెంతయుఁ బగవానియెడల
వలనొప్ప మిత్రభావంబు గల్గినను
నలిమీఱ నతనిని నమ్మంగరాదు

సోమన. ద్విపద భారత. శాంతి.

వైరులయందు విశ్వాసంబుగావింపన్యాయంబుగాదు

ధరణిదేవుల. దశావతార. II-115

శత్రుఁడల్పుఁడంచు జనుఁడుపేక్షించిన
రాజయక్ష్మబోలె రానురాను
తుదకు మృత్యుహేతువది కాకయుండునే?

దా. శ్రీ. దేవీ.భాగ. III-378

అరియల్పుఁడయ్యు మర్మము
లరసి మహాబాధఁదెచ్చు

కం. వీరేశ. ప్రబోధ. II-36

పగతుఁడైనవానిఁ బరికింపలేక మేల్
సేయునట్టివారు చేటుఁగొంద్రు

అ. నారాయణదాసు. నూరుగంటి.

అరికినిచ్చిన సీడ రవ్వంతయైన
వంశమున నెల్లరకును శాశ్వతపుఁబీడ

వైరికొసఁగిన యన్నము పట్టెడైన
స్థిరవిపాశనమగు వంశ్యనరులకెల్ల

పానుగంటి. పూర్ణిమ.

శరణాగతి

శరణాగతుఁ జంపఁగ నోడఁబడు
దుర్మతి కిహముం బరముఁ గలదె

నన్నయ. భారత. ఆది. IV-274

కరుణను శరణాగతులగు
పురుషుల రక్షించుకంటెఁ బుణ్యము గలదే

నన్నయ. భారత.. ఆది. VIII-291

ఆశ్రిత త్యాగమది ధర్మువగునె?

నన్నయ. భారత. అరణ్య. III-232

శరణని వచ్చిన శత్రువునైనఁ
బరికింపఁగా రాచపాడి రక్షింప

ఎడరైన బంధుల నెట్టి నీచుండు
విడిచి శత్రులఁ బోయి వేఁడునే శరణు

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

శరణు సొచ్చిన రక్షింపఁ జాలియుండి
కడచి పుచ్చిన నూర్ధ్వలోకములు దప్పు

తిక్కన. భారత. ఉద్యో. I-161

ఆశ్రితమానము పిటఁ బుత్తురే

తిక్కన. భారత, భీష్మ. III-269

ఆశ్రితు గుణశ్రేష్ఠుండు వంచించునే

తిక్కన. భారత. ద్రోణ. I-388

శరణంబని వచ్చిన భీ
కర శత్రువునయినఁ బ్రీతిఁగావఁగ వలయున్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-413

అతిభీతి శరణు జొచ్చిన
ప్రతిపక్షుని నైనఁ గరుణ రక్షింపని దు
ర్మతి బ్రదుకు కాల్పనే ?

మారన. మార్కం. II-129

శరణాగతులం ద్యజిపఁ జన దెవ్వరికిన్

అతిభీతుఁడైన శరణా
గతు నార్తుని శత్రునైనఁ గడుకొని కరుణా
న్వితుఁడై రక్షింపని దు
ర్మతియగు కుత్సితుని బ్రతుకు బ్రతుకే తలఁపన్

మారన. మార్కం. VIII-248. 263

అభయ దానమునకు నశ్వమేధాదులు
వేయు నీడుగావు విశద కీర్తు
లఖిల దిశల నెసఁగునార్తు రక్షించిన

అయ్యలార్యుడు. భా. రా. యుద్ధ. 181

సైరించి తలవంచి శరణని వేడి
నగము క్షీణించిన శత్రుని బట్టి
చంపుట యేనేతి ?

శరణని వచ్చిన శత్రువునైన
కాచి రక్షించుమటే ఖండించుటరయ

శ్రీనాథ. పల. వీ.

అనఘుండు పట్టె మఱివిద్యఁగ నేర్చునె యెట్టివారలన్
శరణు వొందిన రక్షింపఁ జాలి యుండి
మనుపకుండిన కంటెఁ గల్మషము గలదె!

జక్కన. విక్రమార్క. III-92. 93

పట్టినదెల్లా బ్రహ్మానందమె
గట్టిగ శరణాగతునికిని
కైవల్యమునకుఁ గడు తెరువైనది
ఆవల నీ శరణాగతియే

తా. అన్నమయ్య. అధ్యా. సం.

సురుఁగక వంటయిల్ సొచ్చిన శశముఁ
గరుణసేయక కూరగా వండఁదగునె
శరణుఁ జొచ్చిన యట్టి శత్రువు నైనఁ
బరికించి కానంగఁ బంతమెయ్యెడల

గౌరన, హరిశ్చంద్ర

పగవారు శరణు చొచ్చిన
మగతనములు నెఱపఁదగదు మగవారలకున్

పోతన. భాగ. VIII-181

అవిరళం బగు సహస్రాపరాధములు
సవరించి తుదివచ్చి శరణు చొచ్చినను

ఘనులైనవారలాకరటి నేరములు
మనమునఁ బెట్టక మన్నింతు రెపుడు

తాళ్లపాక. తిరు. వేం. వరమయోగి

చేపట్టు శరణని చేరినవారి
నేపట్టునను గాచు టిది ధర్మము

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

శరణు చొచ్చిన వారిఁ జంపఁగరాదు

సోమన. ద్విప. భారత. అరణ్య.

శరణాగతుండైన శత్రువునైనఁ జంపగా వలవదు
శరణాగతుఁ బ్రోవని భూ
వరుఁ డధమాధముఁడు వాఁడు వసుధాస్థలిపైఁ
జిరజీవి యౌట కన్నను
మరణం బొందుటయె మేలు......

శ్రీధరమల్లె. బ్రహ్మోత్తర. VI–93. 276

## శరీరము

శరీరము లాధి వ్యాధి జరా
సమన్వితము లగుటఁ జేటు సహజంబరయన్

తిక్కన. భారత. ఉద్యో. II–92

ఒక యింటనుండి వేఱొక యింటి కరిగిన
విధమును వస్త్రంబు విడిచి యొండు
వస్త్రంబు గట్టిన వడువును నై యుండు
నొడలు దొలంగి యొండొక్క యొడలు గైకొంట

కర్మాను రూపంబగు నాశంబు
శరీరంబునకు ప్రాప్తంబగు

తిక్కన. భారత. స్త్రీ. I-34, 55

...ధర్మసాధనము లందు
నాద్యమగు సాధనంబు దేహంబ కాదె

శ్రీనాథ. హర. VI-18

ఇప్పుడో యెప్పుడో యీ శరీరములు
పడిపోవఁగలవు శాశ్వతములు కావు

శ్రీనాథ. పం. వీ.

పాపపుణ్యా లంపటమైనది మేను
దేహమున నున్నది తెగనిలంపటము
దేహ మఱఁచితేఁ దెగును లంపటము

ఎంగిలిఁ బుట్టిన మేను హేయమే వెదకుఁగాక!
చెంగలించి పావనము సేసుకొనీనా ?

ఒక్క దేహమున నున్న యంగములు
పెక్కు విధములై బెరసినవి
ఎక్కువ యతులకు నిన్నియు సమము

తా. అన్నమయ్య. అధ్యా. సం.

ఎందును నిల్వాక యేగెడు నిట్టి
బొందికై విశ్రాంతిఁ బొరలఁ నేమిటికి ?

గౌరన. నవనాథ.

బొంది నమ్మి మిగులఁ బోషించి పలుమాఱు
ప్రాణి విడచు టెల్ల పాతకంబె

వేమన

పోకన్ మానదు దేహమేవిధమునన్ పోషించి రక్షించినన్

రామదాసు చరిత్రము

కాయంబు విద్యు న్ని కాయంబు తెలుఁగు

తిమ్మయ. ద్విప. భారత. ఆది

......దుఃఖాస్పదమగు దేహంబున నె
మ్మదిసుఖయింపంగ సులభమా యెవ్వరికిన్''

ధరణిదేవుల. దశావతార. II–142

క్షుత్పిపాసాజరావ్యాధి శుష్యమాణ
కాయమున లేదు సౌఖ్యంబు దేహికి....

ధరణిదేవుల, దశావతార. III–136

తనువు శుష్కింపవాఁడును మనసు దాన
బుద్ధిబల మడుగంటుట పొసఁగుఁ గాన
జనుఁడు సుష్టముగా నిజతనువు నుంప
సర్వదా యత్న మొనరింపఁ జనునుగాదె

విక్ర. దే. వ

## శాంతి

నియత తపమును నింద్రియ నిగ్రహంబు
భూరి విద్యయు శాంతికి గారణములు
వాని యన్నింటికంటె మేలైన శాంతి
కారణము లోభ ముడుఁగుట

తిక్కన. భారత. ఉద్యో. II-84

సంగరహితుండైనంగాక శాంతమాత్మ కేలగలుగును ?
సకల ఉద్యోగములు చాలించుటే శాంతి
సుఖ దుఃఖములు విడుచుటే శాంతి

ఒకరేమి యిచ్చినను నొల్లకుండుటే శాంతి
ప్రకటించి రచ్చలకు వాయుటే శాంతి
మహి మీఁది పనులెల్ల మానియుండుటె శాంతి
సహజ బాంధవములు జారుటే శాంతి
బహు కుతర్కములఁ బారకుండుటె శాంతి
అహిత విషయముల విడచుటే శాంతి
ఊరకె నిశ్చింతమున నుండఁగలదె శాంతి
కోరకుండే సాత్త్విక గుణమే శాంతి
ధీరత తోడుత గుణాతీతుండౌటె శాంతి

తా. అన్నమయ్య. అధ్యా. సం.

చాతుర్యంబునకెల్ల మూలముగదా సచ్ఛాంతి;

ములుగు పాపయారాధ్యులు. దేవీభాగవతము. V-404

దాంతునికైన వేదాంతునికైన
శాంతము లేక సౌఖ్యము లేదు

త్యాగరాజు

హార్మ్యమందు శోకమ్మున నడలుకంటె
శాంతిదాయక కానన స్థలమె మేలు

దువ్వూరి. వనకుమారి. VI-26

శాంతమున గెల్వరానిది జగతి గలదె

నా. కృ. రావు. విరిదండ.

## శాంతుఁడు

జనములు దను నవమానిం
చిన నిందించినను మాఱుసేయక సైగిం

చిన శాంతాత్ముఁడు వారల
మును చేసిన యట్టి సుకృతముల నానికొనున్

తిక్కన. భారత. శాంతి. V-547

శాంతిపరులకు నేలరాసత్త్వహింస

శ్రీనాథ. హర. VII-52

చొక్కి చొక్కి యానంద సుఖము వెదక నేల ?
మక్కువఁ దా శాంతుఁడై తే మతిలో నదె

తా. అన్నమయ్య. అధ్యా. సం.

ఎఱుఁగక చేసిన యెడ నెగ్గు వెట్టి
చెఱుప రెవ్వాని సుస్థిరశాంతమతులు

గౌరన. నవనాథ.

## శాశ్వతము

సంగమే భంగము సుండీ !
వెంగలి విషయములే విషము సుండీ !
అంగపు బంధువులెల్ల అంటు బంధములు సుండీ !
సంగతి హరి యొకఁడే సతము

తా. అన్నమయ్య. అధ్యా. సం.

తగవు ధర్మమ్ము సత్యము శాశ్వతంబు
లుగ నెంచి సత్కీర్తులు గడించి కొనుము

వరద రామా. కిష్కింధ.

కల కాల మెవ్వ రుండరు
ఖలులది గానంగ లేక గర్వింతురు ని

ర్మల కీర్తి యొకటి నిలుచును
గలకాలము.. ...

పచ్చ. పాపయకవి.

## శాస్త్రము

బహుధా విప్రతిపత్తి ధీవిషయముల్ పాడైన శాస్త్రార్థముల్

శ్రీనాథ కాశీ. III–100

పలు సందియములఁ దోలఁచును
వెలయించు నగోచరార్థ విజ్ఞానము లో
కుల కక్షి శాస్త్ర మయ్యది
యలవడ దెవ్వనికి వాఁడె యంధుఁడు జగతిన్

చిన్నయసూరి. నీతిచంద్రిక.

శాస్త్ర కథితంబులందు నశ్రద్ధ తగదు

విక్ర. దే.

## శిష్యధర్మము

గురునకు శిష్యుఁడు నిచ్చలుఁ
బరిచర్య యొనర్చి భక్తిపరుఁడై విద్యల్
గఱవఁదగుఁ గఱచి పిదముగ
గురు దక్షిణ యిచ్చి వీడుకొనఁ గావలయున్

కేతన. విజ్ఞా. ప్రాయ. 35

గురువు వచ్చుచున్న కూర్చుండి లేవని
తుంటరులకు నెట్లు దొరుకు ముక్తి?
ఒజ్జతోడ వాదు లొనరంగ కూసరా

వేమన

శ్రద్ధాభక్తి సమృద్ధిఁ బ్ర
సిద్ధుండై చెప్పినట్లు చేయుచు నెందున్
గ్రుద్ధుండు గాక శాంతియు
సిద్ధాంతము సేయువాఁడు శిష్యతకుఁ దగున్

తెనాలి రామ. ఉద్భటా. III-143

గురులతో శాస్త్రచర్చను గోరఁదగును
కలికి గండచందన చర్చఁ దలఁపఁ దగదు
వేదముల వల్లె పలుకులు వినఁగదగును
వెలఁది మట్టెల గిలుకులు వినఁగఁదగదు
ఈశ్వరిని ముక్కుచివర నీక్షింపఁ దగును
కన్నుకెలఁకుల నింతిని గానఁదగదు

జగ మసత్యంబని పలుక జనునుగాని
చాన నడు మసత్యంబన చనదు చనదు
వృద్ధులైనను పతితుల యొద్ద నెపుడు
పరుష శృంగార వాక్యముల్ బలుక దగదు

పానుగంటి. కల్యా. రాఘ

గురు లేమనినను శిష్యులు
త్వరపడఁగా రాదు వారె దయఁ జూతురు కో
పరసము కొండొక మరలిన
తఱి నట్లగుటన్ బ్రశాంతి దగు శిష్యులకున్

తిరు. వేం. కవులు. పాండవజననము. III-30

గురునిందన్ విని శిష్యుఁ డెవ్వఁడును శక్తుండైనచో నాజమున్
దురితాత్మున్ బరిమార్పకుండిన గురుద్రోహంబు వాటిల్లు

తిరు. వేం. కవులు. పాండవోద్యోగము. V-98

## శీలము

సచ్చరితుండై నడవక
యిచ్చునె తనుఁ జేరి కొలువకీల నరపతియున్
సచ్చరితుఁడయి న డవక
యిచ్చునె తనుఁజేరి కొలువకీశుండనఘా !

పా. సోమన. అను. 106

సత్కులంబునఁ బుట్టుట సకల వేద
ములుఁ బురాణంబులును శాస్త్రములును జదువు
టయును సద్గతిఁ జేయఁ బ్రౌఢములు గావు
శీల సామగ్రి లేని దుశ్చేష్టితునకు

తిక్కన. భారత. అను. II-41

ఉత్తమ కులంబుతోడ బ్రయోజనంబు
లేదు సచ్ఛీల మొకటి కల్గినను జాలు
మంచి క్షేత్రంబునందు జన్మించి కంట
కద్రుమంబులు నభివృద్ధి గాంచకున్నె

తిరు. వేం. కవులు. మృచ్ఛకటికము. VIII-99

## శుభము

తన వృద్ధియు మిత్రుని వ
ర్ధనమును దత్సఖ సమృద్ధి ప్రబలుటయును శ
త్రుని దెస నిన్నియుఁ జెడుటయు
ననుషడ్విధములను దన్ను నతిశుభ మొందున్

తిక్కన. భారత. శల్య. II-298

గార్గ్య సిద్ధాంతమత ముమఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు

విప్రజన వాక్య మరయంగ విష్ణుమతము
సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతమగు

శ్రీనాథ. భీమ III-41

...వనజగర్భునకు నైన
ననుభవింపక చనవు శుభాశుభములు

పిల్ల. పిన. జైమి. VI-233

పృథ్వి విఘ్నమ్ము లన్నియు శ్రేయములకె

కూచి నరసింహం. రూపలత. I-i-8

## శూన్యత

సుతులు లేని యిల్లు శూన్యంబు, చిరశూన్య
మనుఁగుకాడు లేని యతని బ్రతుకు
మోఱకునకు శూన్యములు దిక్కులెల్ల, స
ర్వంబు శూన్యమర్థ రహితులకును

తిరు. వేం. కవులు. మృచ్ఛకటికము. I-4

## శూరుఁడు

కుల రూపగుణ ద్రవ్యం
బులు విక్రమవంతు నందు భూవిదితములై
నిలుచు
వెలయ విధి దృష్ట నయమున
వలయుఁ బరాక్రమము సేయ

నన్నయ. భారత. సభా. I-129, 131

ఉత్తమ క్షత్రియుండేల యొరుల నడిగి వేఁడు వాఁడగు

నన్నయ. భారత. అరణ్య. III-365

ఆగ్రహింతురె శూరు లనివేళఁగాక

అనుచిత స్థితి శూరులగువారు డాఁగ
రని లోన......

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

పగఱవారిఁ జెఱలఁ బట్టక ముద్దాడి వత్తురయ్య శౌర్యవంతులు

తిక్కన. ని. రా. VI-5

భీతునట్లాడుఁగఁ బాఱునె శూరుఁడు

తిక్కన. భారత. విరాట. IV-25

విడుతురె శూరులు రణమునఁ
బడునట్టి యవస్థ తమకుఁ బాటిల్లినను౦
బుడమి సమస్త జనంబులు
నడపెడు తెఱఁగు

తిక్కన. భారత. స్త్రీ. I-155

శూరుఁడగు వాఁడు బాహా
ధౌరేయత నాత్మ సంశ్రిత ప్రకృతిఁ గనుం
బోరామిఁ గావకుండినఁ
జేరుగలఁడె దక్కునయ్య ప్రియ జయలక్ష్మిల్

ఎఱ్ఱన. హరి. ఉ. భా. X-178

అరివిదళన పరుషుండగు
పురుషుం డెచ్చోట నయినఁ బూజ్యుఁడు గాఁడే
ఖర నఖర విజితకరి హరి
తిరముగ మృగరాజ్య మేలదే ?

భైచరాజు. పంచ. II-159

...సహజ భ్రాజిష్ణు శౌర్యంబు ని
ల్కడ భావంబుననుండుఁ గయ్యమునకున్ గాల్ద్రివ్వఁ జేపట్టునన్

పాపరాజు. ఉ. రా. II-9

వీరుండై జనియించినప్పుడు రణోర్వినై వైరులన్దోర్బలో
దారత్వంబున గెల్వఁగావలయు లేదా ఆ్రొమ్ము గాయమ్ముల
న్వీరస్వర్గము గాంచఁగావలయు....

ధరణిదేవుల. దశావతార. IV-9

వలచునే చిత్రవధ శూరవరుఁడు జగతి ?

కోలాచలం. రామరాజు చరిత్రము. I-V-22

పట్టిన పని యుడివోవఁగ
నెట్టుట యొటు ధర్మమగును నెఱశూరునకున్ ?

కోలాచలం. మైసూరు రాజ్యము. III-IV-48

పొగరు గలవాని నడచుట పోడిగాక
దీనత నడంగువాని సాధింప నగునె ?
పడగ నెత్తిన పాముఁ జంపఁదగుఁగాని
చచ్చిపోయిన దానినే చంపనేల ?

బలిజేపల్లి. సత్యహరి. III-33

## శృంగారము

శృంగార రసమె రసమని
పొంగారఁగ నింతురు కృతిఁ బొసఁగునె రుచి భు
క్తింగడు నేయి పడంగ నె
సంగున చవి యున్నె యేవసమకొనకున్నే

కాకాండ. బిల్వ. I-203

బ్రహ్మకును బ్రహ్మమైన నారాయణుండు
మొదలుగా సర్వజీవ సమూహమునకుఁ
బ్రప్రధానంబు శృంగార రసముగాదె
సర్వ శాస్త్రంబులకు నుప్పు చందమునను

పానుగంటి. కంఠాభరణము.

ప్రకృతి నెటఁ జూడ శృంగార రసమె సర్వ
సృష్టికిఁ బ్రధాన సూత్రమై చెలఁగు గాదె?
అట్టి శృంగార రసమున కలరి లొంగి
యుడికి మతిచెడి కడఁ ద్రొక్కి వడకి కరగి
తన్మయుండయి రసలీనతను స్వరూప
నాశ మొనయని యాతఁడు నరుఁడు కాఁడు

పానుగంటి. చూడామణి.

......... సర్వరసము
లొక్క శృంగార రసమున నొప్పుచుండు

కోలాచలం. మానా. IV-59

## శౌర్యము

విక్రమము భూరి యశః ప్రియులైన రాజనందనులకు
సర్వసాధనము

నన్నయ. భారత. ఆది. VIII-27

కడు నధికులోడఁ దొడరినఁ
బొడిచిన నొడిచినను బురుష గుణంబే
ర్పడుఁగాక హీను నొడుచుట
కడిఁదియె పౌరుషము దానఁగలుగునె చెపుమా

నన్నయ. భారత. సభా. I-124

మేటి శూరుల పెంపు మెచ్చఁగవలదె

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

పౌరుష గరిష్ఠుఁడు గాక ధరిత్రి యేలునే

మది నీతి గణింపక యు
న్మద చేతో రౌద్రరస సమగ్రతఁ గడు బె
ట్టిదుఁడై సింహముక్రియ రిపు
విదళన ముంజేఁత సువ్వె వీరగుణ మిలన్

మారన. మార్కం. VIII-114, 215

పోలవు సకలకళలు నొక ప్రతాపసంపద తోడన్

సూరన. కళా. VII-246

రాజులేని యట్టి రాష్ట్రంబుపైఁ జని
జయము గొనుట యేమి శౌర్యము ?

సూరన. కళా. VIII-155

ఎదుట నెవ్వఁడులేక యేయుట యొప్పె ?

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

తచ్చన మాటల దైన్య వృత్తికిని
జొచ్చు నాతఁడు భూమి శూరుఁడే తలఁప
అంతకంటెను జచ్చుటది మేలు గాదె
పంతంబు తోడుతఁ బార్థివులకును

సోమన. ద్విప. భారత. శల్య.

పతి సూచి మెచ్చనిబంటు తనమేల
పగతుకు వెన్నిచ్చు ప్రాణంబదేల

గంగుల పినయెల్లయ. కాటమరాజు కథ.

## శ్రద్ధ

......వాగ్వృత్తియు
మనః ప్రవర్తనముఁ గాచు మహిత శ్రద్ధా
ధన సంపద శ్రద్ధయనం
జనునది జీవాత్మ సుప్రసన్నత సుమ్మీ

వినుము శ్రద్ధగలుగు మనుజుండు పాపంబుఁ
దొలఁగ ద్రోవ నేర్చుఁ దోలు డిగ్గ
నూడ్చు వెరవుగలుగు నురగంబు చాడ్పునఁ
గాన మేలు శ్రద్ధధానుఁ డగుట

తిక్కన. భారత. శాంతి. V–245. 251

శ్రద్ధగల చోరుఁ డొసఁగిన
యద్ధనము పరిగ్రహింప ననువగు మఱియు
శ్రద్ధగల ముని యొసంగిన
యద్ధనము పరిత్యజింప నగుననిరి ఘనుల్

భవానీశకవి. ధర్మ. II–143

శ్రద్ధయె లోకహితంబగు
శ్రద్ధయె నిజ జనని పగిది సౌఖ్యము లొసఁగున్
శ్రద్ధాపరుల నభీష్ట స
మృద్ధులుగాఁ జేయుచుండు రెల్ల సుపర్వుల్

రామనామాత్యుఁడు. గయోపాఖ్యానము

## శ్రోత్రియులు

బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్

పెద్దన. మను.

వృత్త విద్యాతపః క్రియా వృత్తి మనిన
వాఁడు శ్రోత్రియుఁ డనఁ జనువాఁడు పుడమి

భవానీశకవి. ధర్మ. II-273

## సంగము

అవగాఢపుఁ బొత్తు మనంగ వచ్చునే

తిక్కన. భారత. విరాట. III-33

పుత్త్ర దారబంధు మిత్త్రసక్తుఁడు రోఁషిఁ
బడిన జగము నట్ల యెడరు నొందు
భోగజాలపరుఁడు వాగురాజాలసం
పతిత మృగరుమములు భంగిఁదలరు

తిక్కన. భారత. శాంతి. VI-318

సంగంబు విడువ వలయును
సంగము విడువంగఁ గడు నశక్యమయినఁ జే
యంగవలయు సత్సంగము
సంగరుజకు నౌషధంబు సద్భజనమిలన్

మారన. మార్కం. III-286

సంగము మానక శాంతియుఁ గలుగదు
కోరిక లుడుగక కోపం బుడుగదు
ఫలములందితే బంధము వీడదు
ఫలముతోఁ దగులుఁ బ్రపంచము

అన్నమయ్య. అధ్యా. సం

కన్ను లేనివాఁడు కాళ్లు పోయినవాఁడు
నుభయు లరయఁగూడి యుండినట్లు
పేద పేదఁగూడి పెనగొని యుండును

వేమన

కూడఁగూడ మోహ మధిక మయ్యేదే

సలలిత నవరత్న సరులు పెట్టిననేమి
ఫలకాలమునాడు పతిని గూడకపోతే

మనసురాని పొందు మాను

క్షేత్రయ

## సంగీతము

విద్యలందెల్ల సంగీతవిద్య మిగుల
నుత్తమముగాదె యది పురుషోత్తమునకు
నర్పితంబగునేని యేమని నుతింతు

సూరన. కళా. II-63

సుతిగూడి నడవని సొగసు పదమేల

గుంగుల పినయెల్లయ, కాటమరాజు కథ

మూర్ఛనా తాన మార్గ సమ్మోదయుతుఁడు
గాని వానిని పశువుగా గాంచుచుంద్రు

దా. శ్రీ. దేవీభాగ. VI-541

కన్నులకుఁ జల్వ చెవులకుఁ గ్రమతయును
శ్వాస సంస్తంభనమున నాసకును బలిమి
గాత్రమున రోమహర్షణ కలన మఱియు
మనసునకుఁ దాండవంబు నాత్మకును శాంతి
సర్వరోగ సంహారణము జనుల కిచ్చు
గానకళ సర్వకళలలో మానితంబు

పానుగంటి, మాలతీ.

చెవులుండియు గాన రసము
చవిగొన లేనట్టి యధమ జన్మునికంటెన్
జెవిలేక యె షడ్రసమును
జవిగొని ముదమొందు పాముసను నుత్తమమై

వి.క. దే.

## సంగీత సాహిత్యములు

సంగీత విద్యకెలమిన్
సంగడి సాహిత్యవిద్య సరిగా రెండున్
మంగళవతి కలిగిన యా
రంగు వచింపంగఁ దరమె లావణ్యా నిధీ!

చిత్రకవి సింగరార్యుఁడు. బిల్హణీయము.

## సంతానము

పలువురఁ గొడుకులఁ బడయఁగవలయు
పతిపత్నిఁ బ్రజార్థముగా
ధృతిఁ బడయుట యెందుఁగలదు

నన్నయ. భారత. అరణ్య. II–275, 336

ఇహాపర సౌఖ్య నిదానము
మహితాపత్యంబ

తిక్కన. వి. రా. X–144

భార్యయందు భర్త ప్రజా రూపంబునం బ్రభవించు

మారన. మార్కం. V–146

సంతానము దేహుల క
త్యంతము దుఃఖములఁ జేయునది నిజమైనన్

సంతానముచే తన ప
్రాంశములగు ఋణములం్రదు కర్మవిధిజ్ఞుల్
మారన. మార్కం. VIII-74

మగబిడ్డండు లేని నిర్భాగ్యు నింట
భోజనంబు సేయఁగూడదు

శ్రీనాథ. హర. II-130

సకలైశ్వర్య సమృద్ధులు
నొకతల సంతానలాభ మొకతల

శ్రీనాథ. కాశి. III-217

పురుషభవంబు నొందుట యపూర్వము జన్మములందు
పోతన. భాగ. II-213

సంతతి హీనునికి సౌఖ్యసంతతి గలదే?
పోతన. భాగ. X-201

కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకుల్జీవన భ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నేగతుల్
వడసెం బుత్రులు లేని యాశుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్
చెడునే మోక్షపదం బపుత్రకునకున్?
ధూర్జటి. కాళహస్తీశ్వర.

సుతుఁడు గల్గినఁ బరలోకసుఖము గల్గు
రుద్రకవి. నిరం. I-70

అన్వయ సౌధ స్తంభము
పెన్వగ యుడిగించునుందు పెద్దవయసునం
గన్వేలుఁగు సుతుఁడు గలుగమి
మన్వాదుల యప్పుదీర్చుమతి మెట్లొదవున్
తెనాలి అన్నయ. సుదక్షిణా. I-112

సంతతియు కారణ మెన్నగ సౌఖ్యపంక్తికిన్

రఘునాథ రామా. III-30

సంతాన రహిత సంసారంబు నాయక
రత్నంబులేని హారంబుగాదె

చేమకూర. సారంగ. I-8

ఎంత సంపద గల్గ నేమి ఫలంబు
సంతానమది లేక ?

బాలసర. ద్విప. భార. సభా.

కొడుకులకుం దండ్రి గుణములు నాఁడు
బడుచులు తల్లికిఁ బాటిల్లు గుణము

వరద. రామా. అయో.

కన్యకను గాంచుటెల్ల దుఃఖంబు కొఱకె

పు. తిమ్మన. సమీర. II-5

తొలుతటి పుణ్యంబున వరసుతుఁ డొదవు

ధరణిదేవుల. దశావతార. IV-134

పురుషునకుఁ బుత్రలాభంబె పరమ హితము

కనుపర్తి. కవిరాజ. II-48

......ఆడుబడుచులన్
జగతిం గనువారికెల్ల సౌఖ్యము గలదే

లక్ష్మణకవి. రామేశ్వర. III-108

రమణికి సోయగంబు నెలప్రాయము సంపదయున్ నిజేశు కూ
రిమియు మణీవిభూషణ సమృద్ధియుఁ గల్గిన దానిచే యశఁ

బమరదు లోకరక్షణకళానుపమానమహాభుజా పరా
క్రమభృతి ధర్మశీలములుగల్గు సుతుం డుదయింపకుండినన్
పెద్దాడ నాగరాజామాత్య. శకుంతలా పరిణయము. III-75

ఆడుంగాన్నును గంటకన్న సతి గొడ్రాలౌటయే మేలు
కాకమాని. పాంచాలి V-51

పిడికెడు విత్తనాలు మడికెల్ల చాలు
ఒక్కడే కొడుకైన వంశాన చాలు

కొడుకుల కననివాళ్ళ కడుపేమి కడుపు
కుల ముద్ధరించని కొడుకేమి కొడుకు

బీరాయి పాదులకు పువ్వులందమ్ము
పణతికి పదినెలల బాలుడందమ్ము
వెలయేరు. సేకరణ. నే. గంగాధరం

బాలలు లేని బ్రతుకు లెందుకేమి
దేవుడు లేని దేవస్థలముబోలు

బాలనాగమ్మకథ

బుడుత లేకున్నచో నాడు పుట్టువేల
అ. నారాయణదాసు. మార్కండేయ. 10.

లేదుగదా సుఖంబు భువి లేమలుగల్గిన కన్నవారికిన్
కోలాచలం. సుఖమంజరీ. I-iii-23

సంతతియందు వత్సలత సర్వమునున్ మఱపింపఁ జేసెడిన్
తిరు. వేం. కవులు. బుద్ధ. I-13

పాదుకొనిన స్నేహాంపుఁ బునాదివలన
దంపతులలోని మానసతత్త్వములకు

పొం దమర ముడివడిన యానందము లిటు
పలుకఁబడును లోకమున నపత్యమనుచు

చ. గ. శాస్త్రి. ఉత్తర రామ.

మంచి గుణములవారికి మంచివారు
చెడ్డ గుణములవారికిఁ జెడ్డవారు
కొరకయ పుట్టి పొల్తురు

శ్రీపాద. కనకగిరి, 81

## సంతృప్తి

ఒకటి గోరి దాని కుల్లంబుగందంగ
జాలి బడమి యేమి సంభవించె
నేని దానఁ దృప్తి నూనుట దప్పిన
పనికి వగవకునికి భవ్యగుణము

తిక్కన. భారత. శాంతి. V-23

పూని సుఖ దుఃఖములు రెంటిలోన నెద్ది
దైవ వశమునఁ జేకుఱు; దానఁ జేసి
డెందమునఁ జాల సంతుష్టి నొందువాఁడు
విమల విజ్ఞాని యని భువి వెలయుచుండు

పోతన. భాగ. IV-240

ప్రాప్తంబగు లేశమైనఁ బదివేలనుచుం
దృప్తిం జెందని మనుజుడు
సప్త ద్వీపముల నయినఁ జక్కంబడునే ?

సంతుష్టుఁడే మూఁడు జగములఁ బూజ్యుండు
సంతోషి కెప్పుడు జరుగు సుఖము

సంతోషి గాకుంట సంసార హేతువు
సంతసంబున ముక్తి సతియు దొరకుఁ
సంతోషిగాఁడేని శక్రుఁడైన నశించు

పోతన. భాగవత. VIII-574, 576

...విద్యలచేత ధనములచేత
ధరచేత సిరిచేతఁ దనియ రెవ్వరును

తిమ్మయ. ద్విప. భారత. ఆది

వరసంతోష నిరంతర ప్రముదితుల్ వర్ణింప నెవ్వారు ని
ర్భరముల్ వారికి మోదముల్

ఏ. ల. కవి. సుధా.

తుష్టి లేదేని సౌఖ్యంబు దొరకదెందు

కం. వీ. నీతి.

అల దిగంతపురేఖ యట్టులను మదికి
జేరువై తోచి సంతుష్టి దూరమగును

అ. నారాయణదాసు. జానకి

ధనమె సుఖదమంచుఁ దలఁతువే ధనులలో
నతి దరిద్రుకంటె నధిక దుఃఖు
లైనవారు గలరు కాన సుఖంబు నొ
సంగఁ దృప్తికిలను సాటిలేదు

పానుగంటి. కల్యాణ

## సంతోషము

సంతోషామృత సుఖిత
స్వాంతుండగునేని నట్టివాఁడు గృహంబుం

గాంధార దేశమును నొ

క్కంతగ నిశ్చింతవృత్తి నక్షోభ్యుఁడగున్

ఎఱ్ఱ. భారత. అరణ్య. VII-448

......సంతోష మనఁగ

నెప్పుడేమి లాభము గల్గె హృదయ వృత్తి

నదియచాలునంచునికి......

సూరన. కళా. V-151

కామాదులచేఁ గలిగెడు

నామోదంబగును గేవలాభాసము సూ

దామోదర సేవా జా

తామోదంబే ప్రమోదమగును దలంపన్

విక్ర. దే. ప.

సంతుష్టి పరమ సుఖమగు

సంతోషము గలుగువాఁడు సద్గతిఁ బడయున్

శ్రీపాద. శ్రీకృష్ణభారతము. అరణ్య. VII-402

## సంధి

తొడరిన బలవంతుతో సంధియగుట

పుడమి రాజులకెల్ల బుద్ధియె సుమ్ము

పగవాని బలశక్తి భావించి సంధి

తగు బుద్ధియై జేయఁ దలపోయవలయు

అతిసత్త్వులై వైరులజితులై రేని

హితబుద్ధియై యాశ్రయింపంగ వలయు

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

సమబలుతోడఁ జేయఁదగు సంధి బలాఢ్యునితోడ సంధియున్
సమరముఁగాదు హీనునెడ సంధికినియ్యకొనంగఁ జెల్లదు

పాపరాజు. ఉ. రా. III-377

తనకన్న బలునితోఁ దగు సంధిసేయ

సోమన. ద్విప. భారత. అశ్రమ.

......సంధి మగపాడి యగునె?"

సోమన. ద్విప. భారత. శల్య.

## సంధి - విగ్రహములు

అధముతో విగ్రహ మధికుతో సంధి
బుధుల మతంబు నెప్పుడు సేయనొప్పు

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

హీనునితోఁ దగు రణము స
మానునితో జేయఁదగు సమాధానముఁ సం
ధాన రణంబులు దగ వస
మానునితోఁ దొలఁగి కొలిచి మనుటయె యొప్పున్

పాపరాజు. ఉ. రా. II-8

## సంపద

సంపత్ప్రతతు లతి క్షణికంబులు

నన్నయ. భారత. ఆది. V-159

గంధ మాల్యంబులయందు లక్ష్మియుండు

నన్నయ. భారత. సభా. I-185

కలిమికి భోగములుకదా ఫలము

తిక్కన. భారత. విరాట. I-140

ఆపదలకోర్చి సంపద లనుభవింపు

తిక్కన. భారత. విరాట. II-234

సంపద సహాయంబు నపేక్షించి యుండు
సహాయంబు సంపద నుద్దేశించి వర్తిల్లు

తిక్కన. భారత. ఉద్యో. II-89

శ్రీయెవ్వరి నచలవృత్తిఁ జెందెదు

తిక్కన. భారత. శల్య. II-404

సిరితా వచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలిలము భంగిన్
సిరిదాఁ బోయినఁ బోవును
కరిమ్రింగిన వెలఁగ పండు కరణిని సుమతీ

బద్దెన. సుమతి. 107

అంభోవాహంబులయట్ల సంపదలొగిన్ బుట్టన్ జెడున్ మాత్రలో

కేతన. దశ. కు. చ. II-54

అనుపమ రత్నకాంచన గృహాసనవాహన వస్త్రమాల్య చం
దన రుచిరాన్నపాన వనితా తనయాది సమస్త సంపదల్
దనరినయట్టి ధర్మము ఫలంబులు

మారన. మార్కం. III-82

సొమ్ముల యెడ నెవ్వారల నమ్మదగదు ;
నమ్మకుండినను జరుగదు

మంచెన. కే. వా. చ. III-196

కార్యముల్ చెడిపోవు కలిమి లేకున్న

కలుములు నిత్యంబుకావు
మెఱపు మెఱయు రీతి మేఘంబులట్లు
బుద్బుదంబుల భంగి పోవును జెదరి

శ్రీనాథ. పం. వీ.

పాసిన యప్పుడు పాయుదు
రాసలఁ జేరుదురు జేరినప్పుడు చుట్టల్
డాసిన చుట్టము సుమ్మీ!
శ్రీసతి యెవ్వారికైన సిద్ధము జగతిన్

సంపదలు తరంగ చంచలంబులు

జక్కన. విక్రమార్క. II-173, 183

నిఱుపేదల కబ్బునె యిష్టసంపదల్

జక్కన. విక్రమార్క. III-10

జగజ్జన విదితంబుగాఁ బడయు సంపద సంపదగాక సందిగోం
దిని సమకూరు శోభనము నిక్కపు శోభనమై తనర్చునే?

దుగ్గన. నాసికే. II-119

ఆసపెట్టు మోసపెట్టు నంతలోన వాసిపెట్టు
గాసిల నీ సిరులకుఁ గలదిది

ఎంత విభవము గలిగె నంతయును నాపదని
చింతించినది గదా చెడని జీవనము

దింపంగరాని మోపులు సుమ్మీ!
తీఁపులు దెచ్చే సంపద లెల్ల

తా. అన్నమయ్య. అధ్యా. సం.

నిత్యంబు లనరాదు నిఖిల సంపదలు

గౌరన. హరిశ్చంద్ర.

కలిగినట్టి యుండు గలుగక యుండును
మఱియు లేకపోవు దిరిగి కలుగు
గలిమి నెచట జూడ గారడి యనవచ్చు

కులముకన్న నెన్న కలిమి ప్రధానంబు

కులము లేనివాఁడు కలిమిచే వెలయును
కలిమి లేనివాని కులము దిగును
కులముకన్న నెన్నఁ గలిమి ప్రధానంబు

కలిమి భోగభాగ్యములకు నెలవు

కలిమి సుఖదుఃఖములకును గారణంబు

కనియు గానకుండు గడు లీవితోడను
వినియు వినకయుండు విస్మయముగ
సంపద గలదేని సన్నిపాతము పూను

ఉన్నయంత మనుజు డుపకారి కాలేక
కన్నుగనక యెల్ల గర్వములను
దీనులయినవారి దిగువాయిగా జూచి
పరముగనకనూత బడును

ఉచితవంతుడైన నుద్యోగ పరుడైన
సంప దమరియున్న సమయముననె
పరుల కుపకరింప పాలింపగల్గును

సంపద కొన్నాళ్లకు వ్రేగు జూపి గొబ్బున వ్రాలున్

కలిమి బలిమి రెండు తెలివికి హానిరా!

కలిమిచేత మగని గలసి యుండును గాంత
కలిమి లేనివేళ గసరుచుండు

వేమన

సంపన్నుం డౌరుఁ గానలేఁడు తనువున్
సంసారమున్ నమ్మి హింసింపజూచు

పోతన. భాగ. X-394

......అకట భాగ్యాయత్తముల్ గా సిరుల్

రామరాజ. వసు. III-114

సంపద చేతఁగాని కొనసాగవు సుప్వోగ్రృహస్థ ధర్మముల్
సంపద పూర్వజన్మ వికస త్సుకృతంబునగాని చేరదు

రామకృష్ణుడు. పాండు. మాహా. V-224

తము దా గుణాలుబ్ధులఁ బొందు సంపదల్

బైచరాజు. పంచ. V-65

కవులకు బహుమాన మియ్యగ లేనట్టి
కలుములేటి కలుములు ?

క్షేత్రయ్య

......ఎండమావుల యట్లు
జలతరంగము లట్లు సంపద లెల్ల

తిమ్మయ. ద్విప. భారత. అది.

......సంపదలు
పుడమి లోపల లేని పురుషవర్యుఁడు నడపీనుఁగు

కలిమియె చుట్టాలు గలుగంగ జేయు
కలిమియె మిత్రులఁ గలుగంగఁ జేయు
కలిమియె ధర్మంబు గలుగంగఁ జేయు

కలిమియె సద్బుద్ధి గలుగంగఁ జేయు
కలిమియె శౌర్యంబు గలుగంగఁ జేయు
కలిమియె సత్కీర్తి కలుగంగఁ జేయు

సోమన. ద్విప. భారత. శాంతి.

సర్వగుణముల్ గనకాశ్రయ భూతముల్గదా

పు. తిమ్మన. మహా.

ప్రభుత్వాంతము సంధిల నేరికి సిరులు నిల్చునే

పెద్దాడ నాగరాజా. శకుంతలా II-210

సంపదలవి వచ్చును బోవును
బదిలముగా నిలువఁబెట్ట బ్రహ్మకు వశమా!

దా. శ్రీ. దేవీభాగ. VI-321

కుదురు కష్టంబులు కలమాడు నింట
కరువు కాటకములు కలికాన లేవు

సెలయేరు. సేకరణ, నేదునూరి.

చంచలకన్నఁ జంచల నిజంబుగ లచ్చి

వేదము. వేం. రా. శా. ప్రతాప. III-ii-3-31

సంపదలు చూడ నెవరికి శాశ్వతములు?

తిరు. వేం, కవులు. మృచ్ఛకటికము II-30

## సంసారము

మతిఁ దలఁపఁగ సంసారం
బతి చంచల మెండమావు లట్టుల

నన్నయ. భారత. ఆది. V-159

నలసారము సంసార మ
ఖల దుఃఖావహము భయనికేతన మతి చం

చలము పరాధీనం బిం
దుల జీవనమేల నమ్ముదురుతత్త్వవిదుల్

నన్నయ. భారత. ఆది. VI-245

అడవి సొచ్చి యంతకంతకు నవులకు
నతి కుతూహలమున నరిగి యరిగి
చూచుచుండునట్లు సూవె సంసార కా
ననము నందుఁ దిరుగు జనుల నడపు

తిక్కన. భారత. శాంతి. IV-528

అరయ గదళీ గర్భా
సారము సంసార మిట్టి చంద మెఱిఁగినం
జేరవు జనన మరణములు
గారించును దీనిభంగి గానక యున్నన్

తిక్కన. భారత. శాంతి. V-530

క్షణభంగురంబైన సంసారమునకుఁగా
ధర్మంబుఁ గీర్తియుఁ దగునె విడువ?

శ్రీనాథ. శృం.నై. III-68

జంతువులకెల్ల పరియ సంసార యాత్ర

శ్రీనాథ. శివరా. III-6

అరయ సంసారమునకు
దారాపత్యములు గావె తగు నంగము లిం
పారనవిలేని పురుషుని
పేరెవ్వఁ డెఱుంగు వాని పెంపేమిటికిన్

అనంత. భోజ. II-202

అలిగించు మలిగించు నంతలోనె భ్రమయించు
కొలఁది సంసారపు గుణమిది

గోడ మఱుఁగువంటిది గుట్టుతోడి సంసారము

పారిది సంసారంబు సుఖమా ?
దేహములు దలఁప సుస్థిరములా ప్రాణులకు ?

జలధి లోపలి యీఁత సంసారము
జము నోరిలో బదుకు సంసారము
చమురు తీసిన దివ్వె సంసారము
సమయించు పెనుఁ దెవులు సంసారము
సమరంబులోనునికి సంసారము

భోగ మూలమైనది యీపొందైన సంసారము
కలవలె నుండినగతి సంసారము
బలువుగ సతమని భ్రమసెదరు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

పోలఁగా నలనీరు బుగ్గలకంటెఁ
జాల నిస్సార మీ సంసార సుఖము

జగతిలో సంసార సౌఖ్య నిర్మగ్ను
డగునేని మఱివాయ నభవుండు నోఁపఁడు

గౌరన. నవనాథ.

సుగుణవంతురాలు సుదతియై యుండిన
బుద్ధిమంతులగుచు బుత్త్రులొప్ప
స్వర్గమేటికయ్య సంసారికింకను ?

వేమన

ఘోరాంధకారము సంసారమే నిస్సారము

రామదాసు. రామదాసు చరిత్ర

......ఈసంసార మతి చంచలంబు

తిమ్మయ. ద్విప. భార. ఆది.

సంసార దుఃఖము బహుళము

సోమన. ద్విప. భారత. స్త్రీ.

## సంస్కృతము

జనని సంస్కృతంబు సకలభాషలకును

వల్లభా. క్రీడాభి. 37

తమతమ భాసల కవితలు
దమ తమ దేశముల కొప్పిదములగుఁ బర దే
శములకుఁ గూడ వాకింతయు
నమరోక్తులు సకల భూములందును వెలయున్

తలఁపఁగ సంస్కృత కావ్యం
బులు దమ యర్థములు సకల భూజనములకున్
దెలిసినను దెలియకున్నను
బొలుపొందఁగ నిచ్చు నాల్గు పురుషార్థంబుల్

అప్పకవీయము. I-61. 62

భాషలందు సంస్కృతం బుత్తమంబు

తిరు. వేం. కవులు. నానారాజ

## సజ్జన దుర్జనులు

ధనమును విద్యయు వంశం
బును దుర్మతులకు మదంబుఁ బొనరించును స

జ్జను లైనవారి కడఁకువ
యును వినయము నివియ తెచ్చు

తిక్కన. భారత. ఉద్యో. II-35

ఇమ్ముగఁ జెలిమి యొనర్చినఁ
గుమ్మరిపుర్వుల విధంబు కుజనులు చూడన్
సొమ్మెత్తురు తుదిముట్టినఁ
దమ్మెత్తురు నీతిపరులు తగు మిత్రులకున్.

మంచెన. కే. చ. III-285

దుర్జనుతోడి పొందునకంటె మేలు
సజ్జన విరోధంబు.........

పా. సోమన. వం.

వినయంబును ఘన విజ్ఞానము
సజ్జనుల కెప్పుడును సహజములు
విడువని యాసలు వేవేలు చింతలు
జడులకు నెందును సహజములు

తా. అన్నమయ్య అధ్యా. సం.

అల్పుడెపుడు బల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను

వేమన

ఖలుఁడు సుఖభేద్యుఁ డతి మృ
త్కలశ గతిన్ సజ్జనుండు గాఢాగ్ని శిఖా
కుల తప్త కనక ఘటముం
బలె దుర్భేద్యుండు చక్కఁబడఁడు మృదూక్తిన్

వైచరాజు. పంచ. II-6

దుర్జనుని కల్మి దురితంపు త్రోవకగును
సజ్జనుని కల్మి పుణ్యంపు సరణికగును
పాము బలసిన గరళంబు ప్రబలమగును
గోవు బలసిన దుగ్ధంబు గురియుచుండు

సోమనామాత్యుఁడు. సీమంతినీ కళ్యాణము

మొదలఁ జూచినఁ గడుగొప్ప పిదపఁ గుఱుచ
నాది కొంచెము తర్వాత నధికమగుచుఁ
దనరు దిన పూర్వ పరభాగ జనితమైన
ఛాయ పోలిక కుజన సజ్జనుల మైత్రి

ఏ. ల. కవి. సుధా.

వెసమూర్ఖుని సహవాసము విసమే ;
సజ్జనుల చెలిమి వెలయంగ సుధారసమే

దా. శ్రీ. దేవీభాగ. I–1197

మంచివాఁడు పుడమి మాటాడు మెల్లఁగ
బలువ యెపుడు గొంతు పగుల నఱచు
ముఱికికాల్వ లెపుడు మ్రోగినలాగున
నదులు సేయుచున్న రొదల నెందు ?

కం. వీ. నీతి.

జలదములనుండి పిడుగులు జారునట్లు
మంచివారికి ఖలులు జనించు చంద్రు

చిలకమర్తి. ప్రసన్నయాద.–9 I

సుజనుకీడు మేలుకొఱకె చుమ్మి ; దుష్ట
జనునిమేలు గీడు కొఱకె జగమున కగు

విశ్వ. దే. వ.

ఎపుడు నీచులు కలహామే యిచ్ఛగింత్రు
సంధియే యిచ్ఛగింతురు సాధులెపుడు

కాశ్లకూరి. పద్యవ్యూహము. II-25

## సజ్జన సాంగత్యము

ఎఱుక గలవారి చరితలు
గఱచుచు సజ్జనుల గోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగిన దానిని
మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్

నన్నయ. భారత, ఆది. III-203

అలయక సత్సంగమమున నగు సద్గుణముల్

సుజనుల సహావాసంబునఁ
గుజనులు సద్ధర్మమతు లగుట నిక్కము

నన్నయ. భారత. అరణ్య. I-6, 88

ధర్మాధర్మ విభాగంబు లెఱుంగు విద్వాంసుల
నుపాసించి శుభాచారుండవు గావలయు

నన్నయ. భారత, అరణ్య. III-347,

పరమజ్ఞానుల యొద్దను
బరగిన నజ్ఞుఁడును బోధభరితుఁడగు నిరం
తరమేరు సమీపస్థితి
హిరణ్య రుచిఁ గాక మెసక మెసఁగిన భంగిన్

తిక్కన. భారత. అను. III-325

సంతత సుజన పూజనము వలయు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-39

సజ్జనులకు నెల్ల సఖ్యమాభాషణపూర్వము

కేతన. దశ. చ. IV-42

సాధుసంగతి విఫలమె?

మారన. మార్కం. III-382

వింతైన జనులతోటి వినోదము నిష్ఫలము
చెంతసజ్జన సంగతి చేరిన నాదాయము

తా. అన్నమయ్య

పాలఁగలియు నీరు పాలైయై రాజిల్లు
నదియు పానయోగ్యమయిన యట్లు
సాధు సజ్జనముల సాంగత్యములచేత
మూఢజనుడు ముక్తి మొనయు

సాధు సాంగత్య మమరిన శాంతమమరు

నీచగుణము లెల్ల నిర్మూలమైపోవు
కొదవలేదు సుజనగోష్ఠి వలన

సజ్జనుల చెలిమియె చాలింపగారాదు

వేమన

సజ్జనుల చరిత్రముల్ వినుట జన్మఫలంబది గాదె

పిల్ల. పిన. జైమి. VIII-35

సమమతి నొప్పు సత్పురుష సఖ్యము సద్గతి కారణంబు

పోతన. భాగ. III-831

సత్పురుషులు దర్శన మాత్రంబునం బావనంబు సేయుదురు

పోతన. భాగ. X-1120

మహాత్సంగంబు మోక్షద్వారంబగు

గంగవ. భాగ. V-69

సాధుజనములతోడి సంసర్గ ముడిగిన
హాని భయము క్లేశ మావహిల్లు
నెంతవారికైన నిది నిక్కము

ఎంతవారికిన్ జిక్కునె ముఖ్య సౌఖ్యము
విశిష్ట జనంబుల సఖ్యమందమిన్

రామకృష్ణుఁడు. పాండు. మాహా. II-184, 202

సజ్జనుల గోష్ఠి యిహాపర సాధనంబు

కూరవ. కళా. IV-171

......ఎంత తామస గుణస్థుండైనచో సద్గుణ
శ్రేణిన్ మించినవారి పొందొలసినన్ జేకూరుఁ దద్భావమున్

పావరాజు. ఉ. రా. II-282

సత్పురుషవరుల సంగతిఁ బాపసంగవలయు

భవానీశకవి. ధర్మ. I-95

బహు జన్మముల సాధుపరిచర్యఁ జేసినఁ
బుణ్య పురాణార్థముల నెఱుంగు

ధరణిదేవుల. దశావతార. I-223

సాధుసంగంబు సకలార్థ సాధనంబు

ఏ. ల. కవి. సుధా. నీతి. 20

క్షితిలో సత్సంగతి సౌఖ్యము

త్యాగరాజు

జనన మేదైన నుక్కి యెచ్చటనునైనఁ
బుణ్యమునఁగాని కలదె సత్పురుష సేవ

పానుగంటి. పాదుక.

ఉన్నతులతోడి సంగడి వన్నెయిడదె?

వేదము. వేం. రా. శా. ఉషానాటకము. V-93

సజ్జనుల మైత్రి సదా సలుపఁదగును
ఒదిగి యుండుము పెద్దలయొద్ద

విక్ర. దే. వ.

సజ్జనారాధనము వృథాచనదు సుమ్ము

తిరు. వేం. కవులు. సుకన్య. III-21

సజ్జనాపరాధము

...మానఘనుండై
నెగడెడియవ లిప్తమార్గ నిష్ఠుఁడగు బుధున్
మొగము సెదరంగఁ బలుకుట
జగతీవర వధముతోడి సరి

ఎఱ్ఱన. హరి. వం. VIII-89

జ్ఞానవైరాగ్య సంపన్నుఁడైన పెద్ద
నెఱుఁగలేక యపహసించు నెవ్వఁడేని
వాఁడు గాల్పంగఁ బడుఁ దీవ్ర వహ్ని శిఖల
రౌరవాదిక ఘోర నారకములందు

శ్రీనా. భీమ. V-192

సజ్జన భావము గల్గు సు
హృజ్జనులను మోసపుచ్చుటిది నేరుపె?

జక్కన. విక్రమార్క. III-111

సాధుజనులనుబట్టి సంతాప మొందింప
కుల వినాశమందుఁ గ్రూరజనుఁడు

వేమన

బందుల వంశవృద్ధుల నృపాలుర నన్యుల దేశికాదులన్
మ్రందఁగఁ జేయు పాపునకు మంచి గతుల్ పరమందుఁగల్గునే!

తిరు. వేం. కవులు. పాండవోద్యోగము. VI-102

## సజ్జనుఁడు

చెల్లియుండియు సైరణ సేయు నతఁడుఁ
బేదవడియును నర్థికిఁ బ్రియము తోడఁ
దనకుఁగల భంగి నిచ్చు నతండుఁ బుణ్య
పురుషులని చెప్పి రార్యులు బుధవరేణ్య

తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు

తిక్కన. భారత. ఉద్యో. II-42. 48

చనునే కులసతుల విడువ సత్పురుషులకున్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-211

సజ్జనులు దిక్కు సూవె యీ సర్వమునకు

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-450

భూరి సత్త్వాఢ్యులు పుణ్య మానసులు
కారణ పురుషులు గారె? ......

పింగళి. ద్విప.భాగ.

సజ్జనుండు తిట్ట శాపంబదౌను

సాధు సజ్జనులను సంతరించినవాడు
ప్రజల సంతసంబు పఱచువాడు
కదిసి శాత్రవులను గరుణ జూచినవాడు
పాదుకొన్న ముక్తిపరుడు

అభిహిత మగునట్లు లాడిన మాటకు
సంతసింతురెల్ల సత్పురుషులు

వాదమాడ డెపుడు వరుస నెవ్వరితోడ
జేర రాడు తాను జేటు లేదు
జ్ఞానియగుచు బుధుడు ఘనత నొందగ జూచు

వేమన

......జనకగురు సుహృ
జ్జననాయక గేహములకుఁ
జనుచుందురు పిలువకున్న సజ్జనులు

పోతన. భాగ. IV-67

సత్పురుషులు దారుదుర్దశలఁ బోవుచు నైననుఁ బ్రోతురాశ్రితున్

నృసింహ. కవికర్ణ. VI-67

......సత్పురుష చిత్తము నొచ్చిన రిత్తపోవునే?

సూరన. ప్ర. భా. I-95

ప్రజ్ఞానిధులు సత్క్రియాలవ
మేనియును బహూకరింపరే మదినెందున్

తరి. మల్లన. చంద్రభాను. III-87

ధరలో సత్పురుషులు స
త్పురుషాపద్ధరణ హేతు భూతులు గారే!

......సుజనుం
డధికాపదార్తులకు హిత
మధురోక్తి నఖండ సౌఖ్య మహిమ ఘటించున్

కైచరాజు. పంచ. II-1 1. 172

సత్పురుషుల కాశ్రితావనంబు సేయుట నైజంబు

రామదాసు. రామదాసు చరిత్ర

వంశగత ధర్మము మానరు సాధు లెయ్యెడన్

పావరాజు. ఉ. రా. II-164

.........సజ్జనులు దుష్కార్యవంతులకు
నేనాఁటఁ జెప్పరు హిత బుద్ధులెల్ల

బాలసర. ద్విప. భార. సభా.

తెరువరులనుఁ గూడి తెరువు గన్నట్లు
పెద్దల నడక లపేక్షించి చూచి
బుద్ధినట్ల మెలంగుఁ బుడమి సజ్జనుఁడు

వరద. రామా. అయో.

......సంతత శుభదాయకంబులు గదా
మహాదాగమనంబు లెయ్యెడన్

ధరణిదేవుల. దశావతార. I-103

సజ్జనులు తారె పర హితాచరణ మతులు

ఏ. ల. కవి. మరా.

తరులు ఫలసమృద్ధిని నమ్రతను వహించు
మేఘములు నవోదకముల మిగుల వంగు

సత్పురుషు లుద్ధతులుగారు సంపదలను
పటు పరోపకారులకు స్వభావ మిదియె

కం. వీ. లిం. అభి. శా. V-568

మంచి మానిసికన్న మరి వేల్పవండు
మొక్కఁ దొరులసొమ్ము మేలైనవాడు
తగువాఁడు బిచ్చమెత్తం డెన్నఁడైన
తగిన మానిసియె పెద్దల పర్వు నిల్పు
తగవు నడ్పుటపని తగిన మానిసికి
మరియాద నడిపించు మంచి మానిసికిఁ
దనయంతఁ గోరిన తన్వి చేకూరు
మంచివాఁ డొరులకై మరిపాటు పడును

అ. నారాయణదాసు. వేల్పుమాట.

ఎగ్గు చేసిన వారలకేని మేలు
సలుపుటే మంచివారల సహజగుణము

కాళ్లకూరి. మధుసేవ. VIII-i-75

## సతీధర్మము

పతులకడన యునికి సతులకు ధర్మువు
ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్దకాలమునికి తద్ద తగదు

నన్నయ. భారత. అది. IV-66

పురుషులచే ధర్మస్థితిఁ
బరిగ్రహింపంగఁ బడిన భార్యలకు నిరం

తరము నిజ పురుష భక్తియుఁ
బరపురుష విసర్జనంబుఁ బరిచితమయ్యెన్

భర్తచేత నియోగింపఁబడక సతికి
నెద్దియును జేయఁగాఁదగ దెద్దియైన
భర్తచేత నియోగింపఁ బడిన దానిఁ
జేయుకునికి దోషంబని చెప్పె మనువు

నన్నయ. భారత. ఆది. V-87, 88

పతి పేదవాఁడైనఁ బాయంగ రాదు
సతులకు నిదియ విచారింపఁ దగవు

గోన బుద్ధారెడ్డి. రంగ. రామ అయో.

పతియ చుట్టంబుఁ బక్కంబుఁ బతియ చెలియుఁ
బతియ తల్లియుఁ దండియుఁ బతియ గురువుఁ
బతియ దైవంబుఁ గావున నతనిపని యొ
నర్చుటయ చూవె ధర్మంబు నాతికరయ

తిక్కన. భారత. అశ్వమేధ. VI-230

పతి పంచిన పని సేయుట
పతి పతితుండైనఁ బాసి ప్రాయశ్చిత్తం
బతఁ డొనరించినఁ గ్రమ్మఱఁ
బతిఁ గూడుట ధర్మమండ్రు పత్నులకెల్లన్

కేతన. విజ్ఞా. ఆచార. 116

వలచిన నోల్లకున్న గుణవంతుఁడయైనను గాక తక్కినం
గులసతి కాత్మవల్లభుఁడె కోరిక వేల్పు

కేతన. దశ. చ. X-118

బంధు గృహంబున సతులకుఁ బెద్దకాలం బున్కి పెంపుగాదు

మగువలు మానుగా మగనియొద్దనె యునికి

బంధుల కెల్లరకుఁ బ్రమోదకరము

మారవ. మార్కం. V-337

పతు లెందుఁ జనిన నచటికి

సతులకుఁ జనవలదె

సతులకు నన్యమెట్టిదియును

ధర్మమె భర్తృ సంశ్రయమకాక

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-222. 241

మగఁడు ప్రియతముఁడని యుంకు మానవతికి

నెల్లలోక సుఖంబులు నెదురువచ్చు

పతి వాక్యాతిక్రమణము సతులకు నెబ్భంగిఁ జేయఁ జనదు

పత్నికిం బతియ నమ్మిన బంధువు నిష్టదైవమున్

పతియెడ రెండులేక కులభామలు తారతఁడెట్టిఁడైన స

న్మతిఁ జరియించుటొప్పు

కు. రు. దే. భాస్కర. అయో. 419. 128. 423. 425

ఖలుఁడైనను నాథుఁడ లోకమింతికిన్

మల్లికా. భా. రా. కిష్కింధ 288

పతిదైవము సతులకుఁ దాఁ

బతియ పరాయణము పతియ పరమహితుండుం

బతి శుశ్రూషా పరయగు

సతివసుమీా పరమ పూజ్య యఖిల జగములన్

అయ్యలా. భా. రా. యుద్ధ. 2444

కాంతుఁడు సంతోషించిన
సంతోషింపంగవలయు సతికతఁ డాత్మన్
సంతాపించిన పట్టున
సంతాపింపంగ వలయు జలజేక్షణకున్

నాగరికత్వము వాచా
ప్రాగల్భ్యము జూపఁదగదు పతిముందట సం
భోగ క్రీడా విభవో
ద్యోగంబులఁ దక్క సతికి

పతి పిల్వఁ బంచినఁ బనియేమియని వచ్చి
చెప్పిన యుడిగంబు సేయవలయు
భర్త యానతి లేక ప్రకృతి బంధునికైన
నే పదార్థంబును నీగిపెట్ట
జీవితేశ్వరుఁడు డించిన యోగిరంబులు
కుత్స సేయక భుక్తిఁ గొనఁగఁ దగవు
సుఖ సుప్తుఁడగు నిజేశునిఁ బ్రబోధ మొనర్పఁ
గా దనుష్ఠాన భంగముల దప్ప

నొంటి నెచ్చోటి కరుగుట యుక్తిగాదు
తడుపుఁ గట్టక నీరాడఁ దగవుగాదు
కడపమీఁదను మఱి సన్నెకంటిమీఁదఁ
జక్కి మీఁదను గూర్చుండ జాడగాదు

పసపుం గుంకుమ కజ్జలంబునను గూర్పాసంబు తాంబూల ముం
గుసుమంబుల్ కబరీభరంబు చెలియాకుల్ మంగళాలంకృతుల్

విసువొక్కింతయు లేక తాల్పవలయున్ వీనిన్ సదాకాలమున్
సని జక్కంగఁ బ్రియుండు వర్థిలుట కై నాళీక ప్రత్రాక్షికిన్
శ్రీనాథ. కాశీ. II-78, 76, 75, 73

తన హృదయాధినాయకునిఁదక్కఁగఁ దక్కొరు సన్నుతింపఁగా
వినుట సతీవ్రతంబునకు విగ్రహము
శ్రీనాథ. శృం. నై. III-144

తగవే కులకన్యలకును
మగవారలతోడ రూప మహనీయులతో
మిగులంగఁ దడవులోపలి
నగళులలో మాటలాడ నయతత్త్వనిధీ
శ్రీనాథ. శృం. నై. IV-61

మగవారి న్మొగమెత్తిచూడఁ గులకన్యా ధర్మముల్ దప్పవే
వరద. రామా. III-129

పతియసుమీ యేడుగడయు భామామణికిన్
జక్కన. విక్రమార్క. IV-192

పతిలేనియెడ నొంటిపడి పూవుఁబోణు
లతను చిత్తంబున నలయు చున్నెడకుఁ
జక్కనివారికిఁ జను టుచితంబె ?
గౌరన. నవనాథ.

పతితోడ సతి మాఱుపడెనేని పుణ్య
గతి కేగునే ? నరకంబునఁ గూలు
గౌరన. హరిశ్చంద్ర.

మగనికాలమందు మగువ కష్టించిన
సుతులకాలమందు సుఖముబొందు

నాథు డున్నయట్టి నడబోడి యాతని
దేవుడనుచు నెంచి సేవచేయఁదగును
పతిని దిట్టరాదు పదివేలకైనను

వేమన

జీవితేశ్వరు బాసి చిరకాల వసతిగాఁ
బుట్టినింటనె యున్కి బుద్ధిగాదు
వ్రతములు నుపవాసంబులు
మతియింప నిరర్థకములు మానవతులకున్
బ్రతివాసరంబుఁ గేవల
పతిభక్తియ చాలు నిహముఁ బరము ఘటింపన్

పిల్ల. పిన. శృంగా. IV-76, 80

విభుఁడు పతితుఁడైన వెలది పాతివ్రత్య
మహిమఁ బుణ్యుఁజేసి మనుపవలయు

పోతన. భాగ. VII-416

పతిమాట తండ్రిమాట కంటెఁ దగును సతికి

పుట్టినయిండ్ల మానినులు పోరచిగా ననిశంబు నుందురే?

పోతన. భాగ. IX-545, 626

నడవడి గొఱగాకున్నను
బడుగైనఁ గురూపియైనఁ బామరుఁడైనన్
జడుఁడైన రోగియైనను
విడుచుట మరియాదగాదు విభు నంగనకున్

సనాతనధర్మము లాఁడువారికిం
బెనిమిటులన్ భజించుటలు

పోతన. భాగ. X-979, 980

పతికిముం దనుభవింపకుమే పదార్థంబు
జవదాటకుము నిజేశ్వరుని మాట
దైవమన్నను గురువన్న ధర్మమన్న
ప్రాణనాథుండు సుమ్ము......

అదిదం సూరకవి. కవిజనరంజనము. III-42

"......విభునికంటెను
దలిరుంబోడులకు వేఱె దైవముగలదే......"

కూ, తిమ్మకవి, శివలీలా. II-72

పున్నియపు నేలలకు నిచ్చంబోవవలవ
దేపుడు పెనిమిటిపై బత్తియొసఁగుఁ జెలికి

కూ. తి. అచ్చ. రామా. అయోధ్య. 54

పెనిమిటిపంపు పెంపునను బ్రేవుడిఁజేయుట పాటి చెల్వకున్

పొన్నికంటి తెలగనార్యుఁడు. యయాతి చరిత్ర. IV-131

అతివ మిక్కిలి రూపవతి యై తేనేమి
పతితోడ హితవుగా పలుకు లేకపోతె!

పుట్టినింటనె యుండుట సతులకు పొసఁగునా?

క్షేత్రయ

పతియేమి చెప్పినఁ బనివడసేయ
కతివల కుండుట యధిక పాతకము
నిరత సంతానంబు నిలుపుటకంటెఁ
బరమ ధర్మము లేదు పతి ధర్మవతికి
కులము నిల్పుటకంటెఁ గువలయాక్షులకుఁ
గలవె ధర్మంబులు......

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

మగఁడె దైవముగాని మఱి దైవమనుచు
మగువలకే యాగమములఁ బేర్కొనరు
అధిపతియే దైవమని యాగమములు
విధియించె......

వరద. రామా. అయోధ్య.

......పతికి హితంబు
చేసిన యదిగదా చిగురాకుఁ బోఁడి

సోమన. ద్విప. భారత. శాంతి.

మానిని భర్తృసేవ నియమవ్రతమంచుఁ జరింపుచుం దదీ
యానుగుణ ప్రవర్తన గృహాగత సూరి జనాప్త బంధు సం
తానములం దదీప్సిత పదార్థ నయప్రియ భాషలన్ముదం
బూనగఁ జేయుచున్వినుతి నొందు యశంబున సద్గుణంబులన్

హృదయ పతిఁబాసి సతి పుట్టినింటఁ బెక్కు
కాలము వసింప నుచితంబుగాదు...

పెద్దాద నాగరాజామాత్య. శకుంతలా పరిణయము. III-134. 165

కులసతి మార్గంబు తప్పినడువఁ బరులు నవ్వరె

ధరణిదేవుల. దశావతార. VIII-134

పతిసేవయె భూషణములు
పతిసేవయె జీవనంబు భామామణికిం
బతిసేవయె సువ్రతములు
పతిసేవయె యిహముఁ బరము భాగ్యము

నారాయణామాత్యుఁడు, హంసవింశతి. I-130

పురుషుండు లేక నేతరుణి కెప్పుడైన తగదు సాహసము

త్యాగరా॥

మన్ననచేయ నుబ్బ నవమానము చేయఁగ స్రుక్కకే పతిం
జెన్నలరంగఁ గొల్చుచు విశిష్టత మాత్మకుల ప్రతిష్ఠ సం
పన్నము చేయుచుం దనదుబంధులచేతఁ బొగడ్తగన్న యా
యన్నులమిన్నచే జగములన్నియు నిల్చునటంచు నెంచెదన్

శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి. స్త్రీ నీతిశాస్త్రము

వనితలు పుట్టినింట బహుపర్గము లుండఁగరాదు భర్తతో
నునికియె యుత్తమంబు

మాడభూషి వెంకటాచార్యులు. భరతాభ్యుదయము

అంతరంగమందు పతియన్నమాట
ఎంతైన హితులకు ఎరిగింపకమ్మ
విభుడు మన్నించెనని విఱ్ఱవీగకుమి
వీధి నొకచోటైన ఒంటిగ నిల్వబోకు
ప్రియుడు భుజంచిన భుక్తశేషమ్ము
అయిదవ తనమంచు అపుడారగించు

అప్పగింతలపాట

బావలయెదుట మరదలు దిరుగుట భావ్యముగా దిలలో
బావలు వినగా ముచ్చటలాడిన భామల కపకీర్తి

దేవు, వెంకయ్య. గయోపాఖ్యానము. జంగంకథ

ముదిసి సంతానవతియగు ముదితయైన
పతియెడ న్గానుపించు లోపములసైచి
కన్నవారి కత్తింటికి న్వాన్నెఁదెచ్చి
మగనితో స్వర్గమేగెడు మగువ మగువ

పొరుగిండ్ల కొంటిగాఁ బోవఁదగదు

అ. నారాయణదాసు. యథార్థ రామా.

పతికంటె సతి కొండుగతియుఁ గలదె

అ. నారాయణదాసు. సావిత్రి.

ప్రాణమిడియైన భర్తకు మానరక్ష
భార్య యొనరించుటయె సుమ్ము పరమనీతి

అ. నారాయణదాసు. హరిశ్చంద్ర.

భర్త మూఢుఁడైనఁ బత్ని కేవలము గ
ర్వమ్ము దాల్ప కవసరమునుబట్టి
మనవిచేయు పగిది మంచిచెడ్డలు బోధ
సేయవచ్చు నఘము చెందదతివ !

తిరు. వేం. కవులు. సుకన్య. III-24

సతికిఁ బతిం భజించుటయె సన్నుత ధర్మము

శ్రీపాద. శ్రీకృష్ణభారతము. అరణ్య. VI-263

సతికి బతిసేవకంటెఁ బ్రశస్త వరము
పుణ్యతరమైన కృత్య మింపుడమి లేదు

పానుగంటి. పాదుక.

## సత్కర్మాచరణ

అనలంబించుకతయైనఁ బ
వనుచేఁ వెలుఁగొందు మాడ్కి వర్ధనముం బొం
దును సత్కర్మాచరణం
బున దైవము నానుకూల్యము...

తిక్కన. భారత. అను. I-138

పుణ్య పురాణార్థముల నెఱింగిన యంత
సత్కర్మ మెప్పుడు సలుపుచుండు

ధరణిదేవుల. దశావతార. I-223

మంచిచెయ్యి యొనర్చిన మంచిఫలము
చెట్టచెయ్యి యొనర్చినఁ జెట్టఫలము

తిరు. వేం. కవులు బుద్ధ. IV-56

మంచికార్యము సేయఁ దానెంచినపుడు
మొదలఁ గష్టమైనను మేల తుదకుఁ గలుగు

శ్రీపాద. కనకగిరి. 138

## సత్ప్రివర్తన

సూక్ష్మముగాఁ దలంచిన విశుద్ధ చరిత్రము దుఃఖహేతువే

తిక్కన. వి. రా. VIII-124

తగిన వేషంబుఁ దనుఁదాన పొగడుకొనమి
నొచ్చియును గీడు వలుకమి యిచ్చివగవ
కునికి దనకెంత నడవకయున్నఁ బథముఁ
దప్పకుండుట నడవడి కొప్పుసేయు

కొంచెమైనను దగఁ బంచి కుడుపుమేలు
పనులయెడ దుఃఖమోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము శత్రునకునైన
నిచ్చుటయు లెస్స యడిగినయెడ

తిక్కన. భారత. ఉద్యో. II.-45 47

మతినెప్పుడుఁదా ధర్మ
స్థితి నూహించుచును హితులు సెప్పెడి వెరవు
ద్ధతి దక్క యాచరించుచు
జితేంద్రియత గలిగి నడవఁ జెందు శుభంబుల్

తిక్కన. భారత. సౌప్తిక. I-77

తెలిసికొనఁబడయ రారు లా
ర్యుల పోయెడి తెరువు లరసియును జదలం బ
క్షులు నీళ్లలోన మీనం
బులు వోయెడు త్రోవ లెఱుఁగ బోలునె

తిక్కన. భారత. శాంతి. IV–78

వేదమాచారములఁ జెప్పు వివిధ గతుల
సకల హితమగునట్టి యాచారమరయ
ననఘ వేఱొండు గలదె మహాత్ములెద్ది
యాచరించిరి దాని జేయంగవలయు

తిక్కన. భారత. శాంతి. V—222

అన్యాయవృత్తి సంగ్రహి
తాన్య పదార్థుండు గాక యతిశయ తృష్ణా
హైన్యమున సకల సజ్జన
మాన్యుండై యుండవలయు మనుజుం డనఘా

మంగళగిరి ఆనందకవి. వేదాంత రసాయనము

ఎతఁ డత్యంత పరోపకారియయి సద్వృత్తంబుఁదాఁ బూనునో
యతఁడే యల్పముగాలమే మనియు దీర్ఘాయుష్కుఁడౌం తేనియున్

కం. వీ. లిం. దక్షిణగోగ్రహణము. IV–i–45

నీపెద్దలేగు తెన్నే పట్టుమీవు

ఆ. నా. దాసు. వేల్పుమాట

వినయంబున పెద్దలగాంచుఁ గనికరమున దీనులఁ బెంచు
ననయంబు నిగర్వితమించు నన్యకాంతఁ దల్లిగ నెంచు

ఆ. నా. దాసు. ప్రహ్లాద.

అన్యోన్య మైత్రికి హేతువైన
ధర్మవర్తన మెపుడైనఁ దప్పఁ జనదు

ఆ. నా. దాను. భీష్మ.

## సత్యము

నుతజల పూరితంబులగు నూతులు నూటికంటె సూనృత
వ్రతయొక బావిమేలు మఱి బావులు నూటికంటె నొక్క స
త్క్రతు వది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు త
త్సుత శతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు సూడఁగన్

వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దులనిడి తూచిన సత్యమ
వలనన ములు సూపు గౌరవంబున పేర్మిన్

సర్వతీర్థాభి గమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావ
యెఱుఁగు మెల్లధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు

నన్నయ. భారత. ఆది. IV–94. 95. 96

రాజ్యంబులుఁ బుత్త్రులును ధనంబును యశంబును
సత్యంబునకు సమంబులుగావు

నన్నయ. భారత. అరణ్య. I–260

సత్యంబుకంటె నెంచఁగ ధర్మమెద్ది ?
సత్యమూలంబులు సకల ధర్మములు

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. అయో.

నడవడియను మున్నీటిం
గడవం బెట్టంగ నోడకరణిం దగి తా
నోడఁగూడు ననిన సత్యముఁ
గడచిన గుణమింక నొండుగలదే యరయన్

తిక్కన. భారత. ఉద్యో. II-39

హింసాకరంబగు సత్యంబు ధర్మంబుగాదు

తిక్కన. భారత. కర్ణ. III-78

సత్యమ బ్రహ్మము దపమును
సత్యమ ప్రజలను సృజించు సత్యమ లోక
స్థిత్యాధీనముఁ జేయును
సత్యం బనృతంబుచేత సంపిహితమగున్

సత్యమ తపమును యజ్ఞము
సత్యమ వేదంబు దాంతి శాంతులు నగుటన్
సత్యముఁ దొఱఁగుట నిర్మల
నిత్యానుష్ఠానములును నిష్ఫలములగున్

తిక్కన. భారత, శాంతి. IV-100, 151

మేటి ధర్మంబు సత్యంబు

సత్యము ధర్మములలోఁ బ్రశస్తము

మారన. మార్కం. I-194, 207

సత్యంబు నరులకు సంశ్లిష్టమగు

ఎఱ్ఱన. భారత. అరణ్య. IV-288

అనఘ శిష్ట చరితలందు సత్యము కడు
నధిక మనిరి శ్రుతుల నరసిబుధులు

భూత హితంబుగాఁ బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-48, 62

సత్యమందె నిలుచు సర్వలోకములు
సత్యవ్రతంబుకంటెఁ దపములేదు

అనంత. భోజ. II-2161

సత్యనిష్ఠతో నెనయఁగరాదుసుమ్ము మఱి
యెన్ని తపంబులు నీజగంబునన్

అనంత. భోజ. IV-273

సత్యంబు దప్పక చరియింపుము...

సత్యంబు గల్గినఁజాలు వేయేల

సత్యమే జయమని చాటు వేదములు

......నిజము నిష్ఠురము

జపములుఁ దపములు సకలదానమ్ము
లుపవాసవిధులు దేవోపచారములుఁ
గ్రతువులు నొనరించి కాంచు పుణ్యంబు
లతులిత సత్య వాక్యమునకు సరియె?

గౌరన. హరిశ్చంద్ర.

పలు ధర్మములయందు సత్యనిష్ఠ మేటి

సత్యమాడువాని సామియెఱుఁగు

సత్యము గలిగిన జగతిలో ద్విజుడయ్యె

మాటసత్యమైతె మరి శతాయుష్యంబు

నిజముం బలికెడు నరులకు
విజయము గలదెందు

నిజములాడకున్న నీతిదప్పు

తన కులగోత్రము లాకృతి
తనసంపద కలిమి బలిమి తనకేలనయా ?
తనవెంట రావు నిజమిది
తనసత్యమె తోడవచ్చుఁ దనతో

వేమన

పురుషార్థపరున కిహముం
బరముం గలదండ్రు సత్యపరతంత్రు సురా
సురు లర్చింతురు గావునఁ
బరహిత సత్యములు విడువఁబడ వెప్పటికిన్

తైరరాజు. పంచ. III-128

సకలమనిత్య మెప్పటికి సత్యము నిత్యము

పాపరాజు. ఉ. రా. VII-224

......సత్యంబు గడచిపోనాడు
భూవిభు గావించు పుణ్యంబులెల్ల
నొనర బూడిదలోని హోమంబుగాదె ?

సకల ధర్మంబులు సరవితో వ్రాసి
యొకవంక నిడి సత్యమొకవంకఁ బెట్టి
త్రాసునఁ దూఁచిన ధర్మంబుకంటె
వాసియయ్యెను సత్యవచనంబు తొల్లి

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

పొలయ దేమిటికంటెఁ బొడవు సత్యంబు

తిమ్మయ. ద్విప. భారత, అరణ్య.

......సూనృత నిరతుండ వగుము

పలికిన పలుకు తప్పక సత్యకీర్తి
నిలుపుము......

వరద, రామా. బాల.

ధర్మంబునందె సత్యము పాదుకొనియె

దానంబు హోమంబు తపమును జపము
ధ్యానంబు నొక్క సత్యమునందె నిలుచు
సత్యంబున వసించు జలజాక్షురాణి
సత్యంబె యిహపర సౌఖ్య సాధనము
సత్యంబు గలిగినఁ జాలునుగాక
సత్యలోకావాస సౌఖ్యమే యరుదు

......సత్యంబె కర్త రాజునకు
భూవరుండగు కర్త పుడమికి నెల్ల

వరద. రామా. అయో.

సత్యహితాలాపసరణి యర్థ్యంబు

సోమన. ద్విప. భారత · అరణ్య.

......హింసాకరంబైన సత్యంబు
తవిలి ధర్మముగాదు తగ వినుము......

సోమన. ద్విప. భారత. కర్ణ.

సత్యమున సర్వశుభములు సంఘటిల్లు

సత్యవాక్యంబు ధర్మంబు జయకరంబు
సత్యంబు జనులకుఁ గలుగవలయు

శ్రీధరమల్లె. బ్రహ్మోత్తర. V-214

నిష్ఠమెయి నిజము బల్కిన నిష్ఠురమగుఁ గొన్ని యెడల

దా. శ్రీ. దేవీభాగ. V-254

సత్యమె ధర్మము దానము
సత్యంబుననుండు నంద్రు సర్వంబు

దా. శ్రీ. దేవీభాగ. VII-446

సత్యమును సడ్డసేసిన జనులకెల్ల
ఘోర నరకంబు నొందక తీరదెందు

దా. శ్రీ. దేవీభాగ. VIII-501

కల్లలాడక యుండుటగాదె లెస్స

కం. పీ. పం. కు. నిరో, నిర్వ. నైష. II-26

సత్యమున సూర్యుఁడు దపించు సత్యముననె
ధరణి దిరమయి నిలచె సత్యంబె పరమ
ధర్మమున నొప్పెఁగాదె సత్యంబునందె
స్వర్గము ప్రతిష్ఠితంబయ్యె

మం. చి. కా. శాస్త్రి. మార్క. అనువాదం. II-66

సువ్రతంబుల ముఖ్యంబు సూనృతంబు

అ. నా. దాసు.

సత్యమును దాఁచి జనుని మోసఁబు సేయఁ
బస్తుపెట్టి తండ్రినిఁ జంపు పగిదిసుమ్ము
మృషల వచియించి యొరుని బాధించుసేఁత
విషము పెట్టి తండ్రినిఁ జంపు విధము సుమ్ము

పానుగంటి. బుద్ధ.

బుద్ధి కేది సత్యముగను దోఁచు
నద్ది సత్యమనుచు నంతఃకరణశుద్ధి
నమ్మి యాచరింప న్యాయఫణితి

పానుగంటి. విజయరాఘ.

సత్యపాలనమ్ము కర్మములలోన నుత్తమకర్మ

పానుగంటి. పాదుక.

సత్యంబునకంటె లేదు శాశ్వతపదమున్

వావికొలను. ఆంధ్రవాల్మీకి రామా. II-2451

తండ్రి మాటకంటె తద్దయు గురువుల
పలుకె పెద్ద; గురుల పలుకుకంటె
నిజమె హెచ్చు; కాన నిజము నిమిత్తము
గురుల పలుకు మీఱఁ గూడుగాదె

కల్లలాడుటఁ గలుగు స్వర్గంబుకంటె
సత్యమునఁ గల్గు నరకమే చాలమేలు

పెట్టి లక్ష్మీనరసింహం. చిత్రహరిశ్చం. II-ii-28. 35

సత్యంబే సకలార్థ సాధకమగున్ సత్యస్థిరుండొందు నా
న్నత్యంబెల్లెడలందు సత్యమునకన్నన్ మిన్నయౌ ధర్మముల్
స్తుత్యంబుల్ మరిలేవు సత్యమె ఫలించున్ నాటికిన్ నేటికిన్
సత్యాలాపి యొకండె నిత్యుఁడు ప్రపంచస్థాయి సత్యంబగున్

తన కళత్ర సుత ప్రాణధనము లడఁగు
సమయమున నిల్చియున్నదె సత్యనిష్ఠ

బలిజేపల్లి. సత్యహరి. I-5, 7

సత్యమ్ము చిత్తశుద్ధిఁ దెలియంగ జేసెడిసూటిగాదె

తిరు. వేం. కవులు. బుద్ధ. VI-86

సత్యమునయందు నిలిచెంబో సకల సుఖము

తిరు. వేం. కవులు. మృచ్ఛకటికము. IX–120

సత్యము చేతనే జగము సర్వము గ్రుంగక నిల్చె సత్యమే
నిత్యము, సత్యమే శుభము

తిరు. వేం. కవులు. పాండవవిజయము. V–78

## సత్యము, ధర్మము

సారపు ధర్మమున్ విమల సత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁ బాలివియైన యవస్థదత్తు లె
వ్వార లుపేక్ష సేసిరది వారలచేటగుఁగాని ధర్మ ని
స్తారకమయ్యు సత్యశుభదాయక మయ్యును దైవముండెడున్

తిక్కన. భారత. ఉద్యో. III-278

సత్యము క్రొనమించి యుండు ధర్మము

తా. అన్నమయ్య. అధ్యా. సం.

## సత్యవర్తనము

సత్యవర్తనమునఁ బొందు మృత్యువైన
శక్ర సామ్రాజ్యమునకంటె శస్తతర మ
సత్యవర్తనమునఁ బొందు శక్రవిభవ
మైన దుర్మశ్రుతికంటె హేయంబు మనకు

పానుగంటి. పాదుక.

## సత్యవాది

......దుర్లభుఁడు విభు
స్వచ్ఛందోక్తులకుం జొర
కచ్ఛలముగ బలుకునతఁడు నది వినునతఁడున్

భాస్కరుఁడు. భా. రా. అరణ్య. III-12

సత్యహితాలాప చతురత యర్థ్యంబు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-39

ఆడినట్ల చేయనివాని నకట పురుషుఁ
డం(డ్రె రజ్జులాడునే శూరుఁడైనవాఁడు

ఎఱ్ఱన. హరి. వం. IV-165

ఆడి తిరిగినఁ జెండాలుఁడం(డ్రుగాని
కులము చండాలుఁడైనను గొఱఁతలేదు
బొంకకున్నఁ జండాలుఁడె పో ధరి(త్రి
బూజ్యుఁడను మాట వినవయ్య !

అనంత. భోజరాజీ. VI-8

తగిన కులజుడైన దనయెత్తు ధనమైన
లెక్కగొనక చెప్పు నిక్కమొకటె

వేమన

సత్యవాదికిఁ గల్గు సద్గతి యనుచు
నిత్యంబు చదువులన్నియుఁ బల్కుచుండు

వరద. రామా. అయో.

నిత్యానిత్య వివేకము
(ప్రత్యేకము దేహమనెడు భావమునంత
స్థిత్యచలత్వము గల్గిన
సత్యాశయుఁడొందు ముక్తిసంపద

పు. తిమ్మన. సమీర. VI-100

సత్యభాషణ మిహపర సాధకంబు

శ్రీధరమల్లె. (బహ్మోత్తర. V-214

నాఁడాడినమాట నేఁడుతప్పవలదు

త్యాగరాజు

ఆడి తప్పఁ దగునె అధికులకు ఎందు
పలికి బొంకుదురయ్యా పార్థివోత్తములు

సంక్షేప రామాయణము. స్త్రీల రామాయణపు పాటలు.
ఆం. సా. ప. ప్రచురణ. శ్రీపా. గోపా. సంపా.

దుష్ట సంపర్కమునఁ దురదృష్టముననుఁ
కల్లనిందను బొంది యిక్కట్లువడియు
సత్యవంతులు తుదకు ప్రశస్తకీర్తిఁ
బరగుదురు

ఆ. నారాయణదాసు. జానకి.

సూనృతవ్రతుఁడిహసౌఖ్యమూన లేదు

ఆ. నారాయణదాసు. యథార్థరామా.

సత్యాసత్యములు

ప్రాణహాని వచ్చు పట్టున సర్వ ధ
నాపహార వేళయందు నడపు
సత్యమనృతమం డ్రసత్యంబు సూనృత
మని పరిగ్రహింతు రార్యజనులు

తిక్కన. భారత. కర్ణ. III-77

కల్లనిజము రెండు కలకలంతఁ దెలుఁగును

వేమన

అనృత భాషణుకంటె దోషాధికుండు
సత్యవాచాన్వితుని కంటె సత్య సుకృతి
వెతకి చూచినఁ బొడమఁడు

శంకరకవి. హరిశ్చంద్ర. IV-53

సత్యంబె తారకంబమల మతుల
కట్లన కృతాత్ములకు బొంకు లధము గతిని
బలుకుటకు మూలములటంచుఁ బలుకబడియె

మంద చిట్టికామశాస్త్రి. మార్కండేయ. II-65

భూతహితమగు నన్నృతంబు సత్యమట్లయగును
సత్యమని భూతహితముగామిఁ బోయెదు నన్నృతమై

శ్రీపాద. శ్రీకృష్ణభారతము. అరణ్య VII-312

## సదాచారము

ఒనరంగ బ్రాహ్మ ముహూర్తంబు నందు మే
    ల్కనుట ధర్మార్థ చింతనము సేత
సంకల్పిత స్నాన సంధ్యా జపాగ్ని హో
    త్రాది నిత్యక్రియ లాచరించు
టాదిత్యు నుదయాస్తమయములఁ జూడ మి
    యన్నృతంబు పల్కమి యలుకలేమి
యపకార పరుష వాక్య ప్రలాపంబుల
    నుడుగుట నగ్నమైయున్న యన్య
వనితనైన నాత్మ వనితనైనను గనుఁ
గొనమి యంటరాని వనిత దర్శ
నంబు తదభి భాషణంబు మానుట సదా
చారమండ్రు బుధులు

మారన. మార్కం. III-225

## సద్గుణము

సద్గుణుని జీవితము జనశ్లాఘనీయ
మనఘ గుణవిహీనుండు సప్రాణశవము

పర దూషణములు సేయక
దరిద్రులగు వారియందు దయగలిగి విప
త్పరిపీడితులకు దిక్కై
పరఁగెడు పురుషుండు సుగుణబంధురుఁ డొందున్

మారన. మార్కం. III-71, 73

సద్గుణంబులేని చదువది యేలరా ?

వేమన

సుగుణులు గాంతు రెచ్చోటనైన ముక్తి

సోమన. ద్విప. భారత. శాంతి.

పూవు పుట్టినతోడనే తావి గొలుపు
సద్గుణపుఁ జిన్నెలట్టులే సజ్జనులకు

బలిజేపల్లి. సత్యహరిశ్చంద్రీయము. I-i-14

సద్గుణంబులు లేని భూజానియేని
సద్గుణంబులుగల యకించనునితోడ
బురుడు కాఁజాలునే ? కాన పురుషుఁ డెపుడు
సద్గుణములకె యత్నంబు సలుపవలయు

తిరు. వేం. కవులు. మృచ్ఛకటికము. VI-51

## సద్బుద్ధి

బీరము లావును మిగులఁగ
వైరులు దఱియైనఁ దొడరవచ్చిన చోటన్
దూరమున వెరవుతోడి వి
చారము గలుగుటిది దగదె సద్బుద్ధులకున్

తిక్కన. భారత. విరాట. IV-222

ఇనరుచిఁ బాషాణము ర
శ్మినిరూఢంబై నయట్ల చిత్తము సద్భా
వనమున సదాత్మకంబగు
ననామయ స్థితికి మూలమది

తిక్కన. భారత. శాంతి. V–529

తొలుత మూఁడేండ్లలేని సద్బుద్ధి ముప్పదేండ్లలేదు

ఎఱ్ఱన. నృ. పు. III-151

## సన్న్యాసి

మతి కాలుష్య మడంచి యింద్రియముల న్మర్దించి కామాది శ
త్రుతతిం ద్రుంచి యసంగుఁడు న్సతత సంతుష్టుండు నారంభ వ
ర్జితుఁడు న్నిర్మలుఁడు న్సమాధి పరుఁడు న్ని స్సంప్రబుద్ధుండునై
యతిశోభిల్లు నిరంతరంబు విమలై కాంత ప్రదేశస్థితిన్

మారన. మార్కం. III-147

సకల కర్మాలు మాని సన్న్యాసియై తేను
ఒకట వెలితిలేని ఉన్నతుఁడు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

ఎవఁడు ప్రాపంచిక సుఖంబు నీసడించు
ముక్తివాఁడౌనొ యాతఁడే భూవిభుండు
పృథ్వినాథు లాతనిముందు బిచ్చగాండ్రు
విడుపుపట్టులలోనంత భేదముండు
భూరమణదాసజనమధ్య తారతమ్య
మిట్టె నశియించు సన్న్యాసి దృష్టిముందు

* పానుగంటి. చూడామణి

## సప్తసంతానములు

తనయుఁడు చెఱువును గావ్యం
బు నిధానము గుడి వనంబు భూదేవస్థా
పనమును నను నియ్యేడును
జనుశాస్త్రములందు సప్తసంతతులనఁగన్

అప్పకవీయము. I-15

## సఫలత

మౌనమున దృఢజ్ఞానము
దానంబున నభ్యుదయము ధర్మనిరత యా
శానిర్వాహణంబున నర
కానీక నివారణ సౌఖ్యమగునండ్రు బుధుల్

తిక్కన. భారత. శాంతి. VI-585

ప్రపన్ను లెదుటను బడిన యాతుమకు
చపలత మఱి నాశము లేదు
ఉపమల గురుకృప నొనరిన మనసుకు
రపముల మఱి నేరములే లేవు

ఊరకే దొరకునా యున్నతోన్నత సుఖము!
సారంబు దెలిసి కాజయము చేకొనుట!
తలఁపు లోపలి చింత దాఁటి నప్పుడు గదా
అలరి దైవంబు ప్రత్యక్షమౌట!
కలుషంపు దుర్మదము గడచినప్పుడు గదా
తలకొన్న మోక్షంబు తనకుఁ జేపడుట!

తా. అన్నమయ్య. అధ్యా. సం

......ఎందుఁ గార్యంబు సఫల
మైన నేటికి బూర్వప్రయాసగణన

ధరణిదేవుల. దశావతార. II-291

## సభ్యధర్మము

పాపము వొందు ధర్మసందేహము
దీర్పనివాఁడు సభ్యులగు సజ్జనులన్

నన్నయ. భారత. సభా. II-235

సభకుఁ బోవరాదు సభవారి దోషంబు
నెఱిఁగి యూరకున్న నెఱుఁగకున్న
నెఱిఁగి యుండియైన నిట్టట్టు పలికినఁ
బ్రాజ్ఞుఁడైనఁ బొందుఁ బాపచయము

పోతన. భాగ. X-1356

## సమకాలిక స్వభావము

ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా

చేమకూర. విజయవిలాసము. I-145

ఉర్వి నెఱువంటిమొద్దైన నుండుఁగాని
యాధునిక కవి కవిత యందన్ని దోష
ములె యటంచుఁ బల్కఁగలేని మొద్దులేఁడు
సర్వదేశంబులను:సర్వ జాతులందు

పానుగంటి. విజయ.

## సమదర్శనము

ధీరుఁడై యభేదదృష్టియ పాటించు
చుండు నట్టి పురుషు నొక్కమాటు

విడువ దర్కనంశు విభవంబు చాద్పున
బోధలక్ష్మి పెంపు......

తిక్కన. భారత. శాంతి. V-538

వినఁ జూడంబడునం దె
ల్లను సమతం బరముఁగనుచు లౌల్యనిరస నం
బున సుఖదుఃఖాది ద్వం
ద్వనిరూఢుఁడు గాక యున్నతఁడు ముక్తిఁగనున్

తిక్కన. భారత. శాంతి. VI-285

ఒరులకుఁ గీడు తలంపమి
హారిభక్తికి రూపమొరుల నాత్మ సమము కాఁ
బరికించువారి నాపద
బొరయునె కారణములేక పొందునె భయముల్

......ముక్తికి యత్నము
గావింపఁగవలయు సమత గల్గుట గోరం
గావలయు నెప్పుడును స
ద్భావంబున

ఎఱ్ఱన. నృ. పు. IV-127, 164

ప్రియము నప్రియంబుఁ బెల్లగు సౌఖ్య దుః
ఖములు భూతభావి కార్యములును
నెవ్వనికి సమంబులిల సర్వధనియనఁ
బరఁగుఁ జువ్వె యట్టి భవ్యుఁడనఘ

ఎఱ్ఱన. భారత. అరణ్య. VII-455

సర్వ భూతములందును సమతబూని
సత్త్వవిదుఁడయి యెవ్వాఁడు సంచరించు
నతఁడు శివభక్తుఁడు

శ్రీనాథ. భీమ. V-168

సర్వ భూతములందును సమత మేలు

శ్రీనాథ. కాశీ. VI-78

భావము సమబుద్ధిఁ బాయఁదగదు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

పురుషులలోనన్ నిష్పక్షపాతి శ్రేష్ఠుఁడు

సమతగలవాఁడు యోగ్యుఁడు

వేమన

తనవాఁడు పెఱవాఁడు తగవు వచ్చినను
జనులకుఁ దగదు పక్షపు మాటలాడ

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

పరవస్తువు నావస్తువు
నరి మిత్రుం డనెడు వికృతియంతయు నంతః
కరణ వశంబునఁ గాయని
పరికించితివేని భేదభావము పాయున్

పు. తిమ్మన. సమీర. IV-106

......లేమియుం గలిమియు లేవు
సమ్మద వికస్వర మానసులైన వారికిన్

ఏ. ల. కవి. సుధా.

## సమయజ్ఞత

తఱియగునంతకు రిపుఁదన
యఱకటఁ బెట్టికొని యుండునది తఱియగుడుం
జెఱుచునది తాఁతిమీఁదను
వఱలఁగ మృద్ఘటము నెత్తివైచిన భంగిన్

నన్నయ. భారత. ఆది. VI-115

కాలోచితంబుగా క్షమా తేజంబులు గల్పించునది;
యథాకాలకల్పిత
క్షమా తేజుండైన వానికి నుభయలోక సిద్ధియగు

నన్నయ. భారత. అరణ్య. I-218

తఱియగునంతకున్ రిపునుదగ్రత సైచుటనీతి

తిక్కన. భారత. ఉద్యో. I-178

మొదలవలయు విధము పిదపఁ గావించుట
తుది నొనర్చు దానిఁ దొలుతఁ జేత
సంధి విగ్రహాది సమయజ్ఞులగు నీతి
శాస్త్రవిదులు నడచు సరణిగాదు

సమయంబు రక్షణీయము
సమయము లంఘింపఁ గీడు సమకూరు నిలన్
సమయంబు దప్పి నడవరు
సమవృత్తిని సత్పురుషులు సన్నుతమతులై

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 888-2321

సమయ మెఱుఁగ నతఁడు సరసుండు గాడయా!
అధిక జనులతోడ నాప్తులతోడను

పరువు గుఱు తెఱింగి పలుకకున్న
వచ్చు చెడ్డదనము హెచ్చుగా గాంభీర్య
హాని జెందు దనకు నపుడు

అనువుదప్పి మాటలాడరాదు

అనువు గానిచోట నధికుల మనరాదు

వేమన

తనకంటె నధిక గుణవం
తుని మతిమంతుని మనోహితుని గని యోజిం
పనగును గాలము దేశము
గనుఁగొని మతిమీఁద వలయుఁ గార్యముఁ బూనన్

కాలము దేశము నెఱుఁగక
బాలిశుఁడై యాత్మబలము ప్రాధాన్యముగా
నాలోకించిన నాపద
పాలుపడున్ వాఁడె పో ద్విపాత్పశువు ధరన్

పు. తిమ్మన. సమీర. VII-96. 97

అదను గనిపెట్టి పనిసేయు నతఁడు శ్రీయు
తుండు లేనిచో మంద భాగ్యుండు నిజము
తగిన కార్తిని గృషిసేయ ధాన్యమొందు
కానిచో గడ్డిఁ గఱచును గర్షకుండు

పానుగంటి. కోకిల

మంచుగడ్డలు మిన్ను వర్షించునపుడు
కాతరుఁడు కాఁడు తలదాపఁ గడఁగువాఁడు

సింధునది పొంగి ప్రళయంబు సేయువేళ
నూరు త్యజియించి చనువాడు భీరుఁడగునె

పానుగంటి. చూడామణి

కాలిదిగఁ గూలనున్నట్టి యాలయమును
వెలివునను వీడిపోవఁగాతరత కాదు
దాని లోపలనే నిల్చిదగ్ధమగుట
పరమ నిశ్చల ధైర్య విస్ఫురణ కాదు

పానుగంటి. పూర్ణిమ.

......బాహు పరాక్రమ జృంభణమున
కవసరజ్ఞత భూషణమగును గాదె?

పానుగంటి. విజయ

## సమాధి

తెలియుటయె యెఱుక కోర్కులు
పొలియుటయే సుఖము సుకృత బుద్ధియెగతి దా
వలచుట పరముం బాయక
తలఁచుటయె సమాధి పరమతత్త్వం బనఘా

పా. సోమన. అ. 133

వెలిఁ దోఁచినబుద్ధి వేగమె లోనునిచి
చలమున చంచల ముడిగియుండుటే సమాధి లక్షణము

తా. అన్నమయ్య. అధ్యా. నం.

కలుగు దోషము లెల్లను గాలఁద్రొక్కి
వెలుగునకు నావలను వెల్గు వెలుగుఁజేరి
నిలిచి నిర్గుణ మందుచే యిల సమాధి

వేమన

## సమానత

సమశీల వ్రతయుతులకు
సమ ధనవంతులకు సమ సుచారిత్రులకున్
దమలో సఖ్యమును వివా
హమునగుఁగా కగునె రెండు నసమానులకున్

నన్నయ. భారత. ఆది. V–205

చెలిమియు సంభాషణమును
బలిమి వివాదంబుఁ ద్రోపుఁ బాడియు దమ యం
తలవారితోన తగునధి
కులహీనుల తోడనైన గొరగాదు

తిక్కన. భారత. ఉద్యో. II–46

అతి భోగములకు నార్జించుటకును
చతురపు సంపద సరికిసరి
అలయు పథ్యమున కౌషధము గొనుట
చలువకు వేఁడికి సరికిసరి
నిలిచిన పుణ్యము నిందుఁ బాపములు
జలువు వెలువులకు సరికిసరి
మహిమరణములకు మరి పుట్టుగులకు
సహజ మందరికి సరికిసరి

ఎంత వెలుఁగునకు నంతే చీఁకటి
ఎంత సంపదకు నంతాపద

చేసేటి పుణ్యములకు చెందేటి పాపములకు
ఈసుల సరికిసరి

తా. అన్నమయ్య. అధ్యా. సం.

సిరియును వంశము రూపును
సరియైన వివాహసఖ్య సంబంధంబుల్
జరగును ; సరిగాకున్నను జరగవు

పోతన. భాగ. X-233

కయ్యమునకు నెయ్యమునకు
వియ్యమునకు సమతవలయు వేఱొకఁడైనన్
గయ్యము గెలువదు నిలువదు
నెయ్యము వియ్యంబు పొసఁగ నేరదు మొదలన్

బైచరాజు. పంచ. II-47

చెలిమి గావింపను జేరి భాషింప
బలిమిఁ బోరాడను బాడిని బెనఁగఁ
గలహింపఁ ద్రోపాడఁ గలసి వర్తింప
సమసత్త్వులైనను సమకూడు . . .
పగయును మైత్రియు బంధుకార్యంబు
దగువానితోడఁ గదా సేయవలయు

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

## సర్వజ్ఞత

త్రివర్గ మెఱిఁగి సామ్యమున
వించువాఁడు సర్వవిత్తముండు

నన్నయ. భారత. అరణ్య. I-245

మనసు మనసునంద మడచి యాత్మని నాత్మ
యుంద కాంచునట్టి యతఁడు సర్వ
దుఁడు సకల భూతవితతి యందును దనుఁ
గనుచునుండు నిర్వికల్పకముగ

తిక్కన. భారత. అశ్వమేధ. II-154

ఎట్టివారికినైన నెఱుఁగంగ నగునె
నెట్టన సర్వంబు......

సోమన. ద్విప. భారత. సాప్తిక.

......సమస్త మెఱింగిన యట్టివారికే
దుది నొకవేళ నేమియును దోఁచదువో

కదిరీపతి. శుక. IV-131

అన్నియుఁ దెలియంగ శక్యమా! యొక్కనికిన్ ?

తిరు. వేం. కవులు. పాణిగృహీత. I-28

సర్వాంతర్యామి

అన్నిటా రక్షించక పోదంతర్యామి
తెలిసినవారికంతా దేవుఁడై యుండు
కలఁడన్నచోట హరి గల్గఁడటుగాన
అందు నిందుఁ బోయి శ్రీహరిని వెదకనేల ?
బొందిలోడి రూపు లెల్లా బొరినతఁడే
వరుస లోకములు సర్వం విష్ణుమయము
అవ్వలివ్వల శ్రీహరిరూపు గానితా
రెవ్వరు లేరని యెఱుకఁ దోఁచినఁజాలు

తా. అన్నమయ్య. అధ్యా. సం.

కాశి కాశి యనుచు గడువేడ్క తోఁబోదు
రందుగలుగు దేవు డిందు లేడె ?
యిందునందు గలదు హృదయంబు లెసైనన

వేమన

ఇందుఁగలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం

ఉండెందు వెదకి చూచిన
నందందే కలఁడు

పోతన. భాగ. VII-275

వనములయందు జీవనములందు
ధనములయందు సాధనములయందు
నగములయందుఁ బన్నగములయందు
జగములయందును శౌరి దాఁగలఁడు

విజయరాఘవుడు. ప్రహ్లాదచరిత్రము

## సాత్త్వికము

విను సాత్త్వికములు మది నెల
కొని రాజస తామసములకును విగతత్వం
బొనరించుఁ బదంపడి న
త్త్వనిరూఢత బోధసంపదకు హేతువగున్

తిక్కన. భారత. శాంతి. VI-290

విను నృప హర్షంబు ప్రియం
బనూన సుఖయుక్తి నిర్భరానందము శాం
తి నిరూఢియనఁగ మనమును
బనిగొనునవి సాత్త్వికాఖ్య భావంబులగున్

తిక్కన. భారత. శాంతి. IV-450

దానము సత్యంబు తపో
జ్ఞానాహింస లనఁ బరఁగు సాత్త్విక గుణసంతానము

ఎఱ్ఱన. భారత. అరణ్య. IV-275

రాతిరేది పగలేది రమించు సాత్త్వికులకు

కదిసిన కాంతలను కనకము వొడగంటే
పదరకుండుటేపో! పరమ సాత్త్వికము

తా. అన్నమయ్య. అధ్యా. సం.

రాజసంబును మదినుంచిరక్తిమీఱఁ
దామసంబును గుర్తించి తగుల బెట్టి
సాత్వికాంశము బూనుటే సమ్మతంబు

వేమన

పరమసాత్త్విక దృష్టి సంపర్కమునను
సాత్త్వికోదయమగుట యాశ్చర్యమగునె

ధరణిదేవుల. దశావతార. II-267

తత్త్వమొుఱఁగఁజేయు సాత్త్వికోక్తి

శ్రీపాద. కల్పభూజము

## సాధనము

అనఁగననఁగ రాగ మతిశయిల్లుచునుండు
తినగఁదినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన

వెమన

జ్ఞానమువకు నొప్పెడు సాధనంబు మొదడు
భక్తికగు సాధనంబు హృత్పంకజంబు
కర్మసాధన మింద్రియ గ్రామమగును
జలనమఱుబుద్ధి వైరాగ్య సాధనంబు

విక్ర. దే. వ.

## సాధువృత్తి

......సాదు రేఁగె నేనిన్
విను తలపోలముననగాని నిలువదు సుమ్మీ

తిక్కన. భారత. ఉద్యోగ. II-13

సంజ్ఞ మదియందు బూనుట సాధువృత్తి

కడుధీరుండై యోగము
తొడబడి తన్నెవ్వరైన దూషించినఁదా
నొడలికి నేపాటోదవిన
జడియక సాధించువాడె సాధువు

వేమన

## సాపత్న్యము

వే సవతులుగల పొలఁతుల కేపాటు వడకపోరాదు

నాచన సోమన. ఉ. హ. వం. III-115

పురుషుఁడు మనలేఁడు సవతిపోరాటమునన్

పోతన. భాగ. X-221

భామలకట్టిచో సవతినామము మారణమంత్రమౌజుమీ

సూరన. ప్రభా. V-111

సొమ్ములు వేఁడి పుచ్చుకొనుచోట్ల సపత్నుల మత్సరంబు లో
కమ్మున నెచ్చటం గలదు

సూరన. కళా. VI-91

పతి సవతిఁ గూడికొని యవ
మతి సేసిన బ్రతుకుకంటె మగువకు మేలా

మఱిఁ దలప జలవిషానల
మృతిఁ జెందుట

పావరాజు. ఉ. రా. VI-400

కాంత సైరింపఁగలదె యేకడ సపత్ని

ధరణిదేవుల. దశావతార. III-107

సొమ్ము లియ్యవచ్చు సొమ్మందమియవచ్చు
నియ్యరాని ప్రాణ మియ్యవచ్చుఁ
దనదు విభుని వేఱు తరుణి చేతికి నిచ్చి
తాళవళమె యెట్టిదానికైన

ముద్దుపళని. రాధికా. I-116

సవతిఁ గనుటకంటె సవతితోఁ జెన్మిటి
గలసి యుండునపుడు గనుటకంటె
సవతితోడఁ బోరు సల్పుచుండుటకంటె
విధవ యగుట సరిగ వెలఁది దలఁచు

దా. శ్రీ. దేవీభాగ. I 167

సవతిమీఁదను బ్రతుకు సతికినెంతైనను
దొంగతనమెగాని దొరతనముగాదు

వన. సన్యాసి, గంగా.

## సామము

విదిత యశస్కుఁడైన పురుషునిఁ
బదిలుండై కూడి నడువఁ బడయఁగ సామం
బొదవఁగ రాయుట యేటికి
నెదిరిందనయట్లకాదె యేకార్యములున్

ఎఱ్ఱన. హ. వం. IX-81

సామమున కేయుపాయంబు సమముగాదు

నృసింహ. కవికర్ణ. II-6

## సామ్యము

జనకుఁడు జ్యేష్ఠభ్రాతయు
ఘనవిద్యాప్రదుఁడు ధర్మకార్యములయెడన్
జనక సమానులు ; తమ్ముఁడుఁ
దనయుఁడుఁ బ్రియశిష్యుఁడును సుతప్రతిమానుల్

మల్లికార్జునుఁడు. భా. రా. కిష్కింధ. 316

కొన్ని జీవులు చిదిపి కూల్గూటికి బ్రతుకుఁ
గొన్ని నునుసోగవెన్నెలఁ గ్రోలి పొదలు
భిన్నరుచులైనవారికిఁ బ్రీతి సరియ

శ్రీనాథ. శృం. నై III-140

అందఱిలో దేవుఁడుండు అందధికులుగొందరు
కొందరు హీనులై కుందుదురింతే
పుట్టుగందరి కొకటే భూమిలో నేలికలును
వెట్టిబంట్లుఁ గొందరై వీఁగుదురింతే

తా. అన్నమయ్య. అధ్యా. సం.

## సాయుజ్యము

అలుకనైనఁ జెలిమినైనఁ గామంబున
నైన బాంధవమునైన భీతి
నైనఁ దగిలితలఁప నఖిలాత్ముఁడగు హరిఁ
జేరవచ్చు ; వేఱు సేయఁడతఁడు

పోతన. భాగ. VII-14

## సారథి

సారథిదక్షుఁడై రథికసారము రథ్యబలంబు నాయుధో
దారత మానమున్ రణవిధంబు నిమిత్త శుభాశుభత్వ ని
ర్ధారణమున్ మదిం గని హితంబెఱిఁగించుట నీతి

తిక్కన. భారత. కర్ణ. II-52

## సార్థకత

ఇచ్చునదె విద్య రణమున
జొచ్చునదే మగతనంబు

బద్దెన. సుమతి. II

కూడువండుట గంజికొఱకా ?
కుప్ప నూర్చుట కసవు కొఱకా ?
తనువు గొప్పయవుటది మదము కొఱకా ?
కొలిచి దంచుట పొట్టుకొఱకా ?
తాఁగులజాండ్రాట మూర్ఖాండ్ర కొఱకా ?
కొండ దవ్వుట యెలుక కొఱకా ?
కొండ యెక్కుట దిగుట కొఱకా ?
కొండల కోనేటిపతిం గొలిచి తనదు
నిండి నాపదలెల్ల నీఁగవలెఁగాక

తా. అన్నమయ్య. అధ్యా. సం.

... జన్మం బెవ్వఁడే నెత్తినన్
దనవంశంబు ప్రకాశమా నతఁడు జన్మంబెత్తినాతండు

ఏల. బాల. సుభా. I-24

అమరుఁ జెవి శాస్త్రమునఁ గుండలమునఁగాదు
వలయమున నొప్ప దీవిచే వెలయుఁబాణి

యురుదయాధ్యులమేను పరోపకార
కలనరాణించు గంధంబు వలనఁగాదు

ఏల. కవి. సుభా. నీతి. I-62

## సాలగ్రామము

మొగిఁ జతుర్దశలోకముల భరించు ఫలంబు
చేరు సాలగ్రామధారణమున
ధారుణీ చక్రమంతయు నిచ్చిన ఫలంబు
దక్కు సాలగ్రామదానమునను
సకల దేవతల నర్చనచేసిన ఫలంబు
పొందు సాలగ్రామ పూజనమునఁ
బరమపావన వేదపారాయణ ఫలంబు
వచ్చు సాలగ్రామవర్ణనమున

పిల్ల. పిన. జైమి. VIII-21

## సాహసము

సాహసమునంగలదే మేలు

తిక్కన. భారత. విరాట. IV-214

సాహసం బొనరింపఁ జనదన్ని పట్ల
సర్వకార్యము లొక్కచాయనరావు

శ్రీనాథ. పల. వీ. చ.

పందనందఱు బాధ పఱుతురుగాని
యెందు సాహసుని దిక్కెవ్వరుఁబోరు

గౌరన. హరిశ్చంద్ర.

## సాహాయ్యము

నృపతులు సొచ్చి పోరునెడ నెయ్యురు బంధులుఁ దోడుపాటునీ
చపుఁ బనియే ?

తిక్కన. భారత. ద్రోణ. IV-270

నొగిలిన వేళ నెంతటి ఘనుండును దన్నొకరొక్క నేర్పుతో
నగపడి ప్రోదిసేయక తనంతట బల్మికి రాఁడు నిక్కమే
జగమున నగ్నియైన కడు సన్నగిలంబడియున్న నింధనం
బెగయఁగఁ ద్రోచియూఁదకమ తెట్లు రవులొ్కన నేర్చు భాస్కరా

భాస్కర శతకము.

తనదు కన్నులు తన మోము గనఁగలేని
యప్పుడద్దంబుతోడ్పడి నట్లుగానె
తాను తనదోషము లెఱుంగలేని యపుడు
పరులుతోడ్పడి వాని జూపంగవలయు

కాళ్లకూరి. చిత్రాభ్యుదయము. V-44

## సాహిత్యము

అమిత ధనధాన్య భాగ్యభోగములకన్న
అమలవాఙ్మయ రామణీయకము ఘనము

నా. కృ. రావు. గ్రంథాలయ సూక్తులు

## సుకవి

......కావ్యము సరసులైన
కవుల చెవులకు నెక్కనఁగాని నమ్మఁ
డెందుఁ బరిణతి గలుగు కవీశ్వరుండు

తిక్కన. వి. రా. -91

సమయజ్ఞుఁడు సమచిత్తుఁడు
సమశబ్దార్థ ప్రయోగ చతురుఁడు భావ
క్రమరసపోషణ రచనా
కమనీయ ప్రతిభుఁడిల సుకవియనఁ బరఁగున్

విన్నకోట పెద్దన. కావ్యాలంకార III-79

అకారణ బంధులుగారె సత్కవుల్

నృసింహ. కవికర్ణ. I-29

......ఎట్టి యర్థమును దగు
లోకనఁ దెలియక వెలివో ని
చ్చునె బుధుఁ డూహించి చేయు సుకవిత్వంబుల్

సూరన. ప్రభా. II-6

సుకవి జనములతోఁ బోరఁ జూచువాఁడు
దుర్గతినిఁ జెందు నిహపరదూరుఁడగుచు

వేంకటకవి. మదనగోపాల. 33

## సుకవి - కుకవి

సలలిత కావ్యబృందముల జాణలు
కావ్యరసానుబంధ రీ
తులు గొనియాడ దుష్కవులు దోసము
లెన్నగఁ జూతురట్టియా
వెలఁదుల మేన నేర్పరులు విభ్రమలీలలు
చూచి మెచ్చ నీఁ
గలు వ్రణమర్మముల్ వెదకుగాక యె
ఱుంగునె తద్విలాసముల్

దుగ్గన. నా. చి. I-9

సుకవులు పలుకఁగ గెళవులు
కుకవులు దా రఱతురౌర! కొలఁకుల భ్రమర
ప్రకరము ఝుంకారింపఁగ
బెక బెక మన కేలమాను భేకము లవలన్

పెదపాటి సోమయ్య. శివజ్ఞానదీపిక

వ్రణముగని నిర్మలాంగంబు వదలునీఁగ
యనఁగుకవి తప్పుఁగని యొప్పునడఁచి పుచ్చు
జలముడిగి పాలుద్రావు హంసంబు కరణిఁ
దప్పు విడనాడి యొప్పు సత్కవి గ్రహించు

తనకుఁ దెలియని వన్నియుఁ దప్పులనుచుఁ
గుకవి హాస్యంబు గావించు; సుకవివరుఁడు
దడవు యోజించి తెలియు నంతటను దెలియ
కున్నఁ దద్దయుఁ బెద్దలయొద్దఁ దెలియు

అప్పకవీయము. I-49. 50

## సుకృతము

విను కుసుమంబులవాసిం
చిన నొప్పనికంపు విడిచి చెందును సౌర
భ్యనిరూఢిం దిలలట్టుల
యనఘా సుకృతముల జీవుఁ డకలంకుఁడగున్

తిక్కన. భారత. శాంతి. V-418

తమచేసిన సుకృతంబులు తముఁగాచును

నాచన సోమన. ఉ. హ. మ. V-46

## సుఖము

వినుమల్లి యదనునఁ దేనియఁ
గొనుగతి నత్యంతసుఖము గొననగుఁ గామం
బున నధిక సుఖములొందని
జను సిరియునుకొల్చు లేని సస్యము కాదే

తిక్కన. భారత. శాంతి. II-460

హరిదాస్యం బదియే సుఖము
వెతలఁ బొరలే ఘనవిభవముకంటే
అతిపేదరికమది సుఖము
గతినెరవుల సింగారముకంటెను
సతమగు తన నిచ్చలమే సుఖము
పలుబాములఁబడు పగలిటికంటే
తెలిసి నిద్రించు రాతిరి సుఖము
అలమటగడించు నమృతముకంటే
కలపాటి తనకు గంజే సుఖము
పరపీడ లొసఁగు భవమునకంటే
ధరఁ బొడమని చందము సుఖము

కందులేని సుఖము కలనైన లేదు
నెరసు లేని సుఖము నిమిషంబు లేదు

అటమటాలు విడిచినాతఁడే సుఖి
తిట్టేటి మాటలును దీవించే మాటలను
అట్టె సరేననితలఁచి నాతఁడే సుఖి
పట్టి చంపేవేళ పట్టము గట్టేవేళ
అట్టునిట్టు చలించని యాతఁడే సుఖి

చంచలము మానితేను సంసారమే సుఖము
పొంచి హరిదాసుఁడైతే భూమెల్లా సుఖము
బరుల వేఁడక యుంటే ఉన్నచో సుఖము
పరనింద విడచితే భావమెల్లా సుఖము
సరవిఁ గోపించకుంటే జన్మమెల్లా సుఖమే
హరిఁ గొలిచినవారి కన్నిటాను సుఖమే

తా. అన్నయ్య. అధ్యా. సం.

......ఒడల్ తిరమే చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్
మీసాలపైఁ దేనియల్

పెద్దన. మనుచరిత్ర. II–65

అడిగి సుఖము లెవ్వరనుభవించిరి ?

త్యాగరాజు

కోరుకొన్నటు హాయి కుడువఁడెవ్వాఁడు

అ. నారాయణదాసు. రుబాయత్

కూలినాలిచేసి కుడుచు పేద సుఖంబు
దక్కదిలను మకుటధారి కెపుడె

వే. వేం. రాయశాస్త్రి III-ii-531

సుఖముతో మాకుఁ బనిలేదు సుండి యనెదు
వారయిన సుఖమునకట్లు పలుకుచుందు
రాపదల మేము గణియింప మనెదువారు
చిత్తసౌఖ్యంబునకె యట్లు చెప్పుచుంద్రు
సుఖముతోడ శరీర సంస్ఫురణగలుగు
కష్టమున దేహసంకోచకలనగలుగు

సర్వసామగ్రి సృష్టిలో సౌఖ్యమీయఁ
జాలియుండఁ బ్రశస్తమశస్తమంచు
వినని భేదముఁజేసి మంచిని వరించి
చిత్తసౌఖ్య మీదారినే చెందుకంటె
జ్ఞానమునఁ జిత్తసుఖమంది సకలవస్తు
కోటి సుఖదముగాఁ జేసికొనుట మంచి
అదిజలుబిదికాకని దేవులాడుకంటె
జనుఁడు జఠరదీప్తినిఁ జేసికొనుట తగదె.

పానుగంటి. పాదుక.

కష్టములనొందు పిమ్మటఁ గల్గు సుఖము
స్వల్పమైనను మదిఁదోఁచు నధికముగను

శేషాద్రి రమణకవులు. బాలనీతి శతకము. 21

## సుఖదుఃఖములు

బ్రదుకుచేటుపొగడు వడుట దూఱొందుట
యీఁగి వేడుకొనుట యిట్లు మఱియుఁ
గలుగు సౌఖ్య దుఃఖములు వచ్చునెడపడి
వానికింత యేల వగవ నధిప

తిక్కన. భారత. ఉద్యో. II-79

......సుఖము దుఃఖముఁ
బరువడిమెయిఁ బొరయుఁగాక పన్నుగ నరునిం
బొరయునె యందొక్కటి యవి
పొరసిన వల దూఁదమోదమును ఖేదంబున్

తిక్కన. భారత. శాంతి. IV-12

పొరిఁబొరి భూతముల గుణో
త్కరమవిశేషాన్వితముగఁ గనుఁగొని నంవి
త్పర దుఃఖంబు సుఖముచే
విరియుఁదరణిచేతఁ దమము విరిసినభంగిన్

తిక్కన. భారత. శాంతి. V-192

మమయనుట దుఃఖమునకు న
మమ యనుటయు నిర్వృతికిని మార్గములు

మారన. మార్కం. III-304

కరము దుఃఖపడినఁగాని యొక్కింత సౌ
ఖ్యంబు ధర్మగతియుఁ గలుగదెందు

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-315

కాలవిపర్యయంబున సుఖంబును దుఃఖము వచ్చుచుండు నె
క్కాలమునేరికిన్ ధ్రువముగాదు సుఖంబును దుఃఖమున్

ఎఱ్ఱన. భారత. అరణ్య. VI-106

పెల్లగు నాఁకటనన్నము
నల్లసి నీరగ్నినెన్న సౌఖ్యదములు నాఁ
జెల్లునవికాక యుండిన
నెల్లపగిది నివియ దుఃఖహేతువులు

సుఖములు దుఃఖంబులుగా
సుఖములుగా దుఃఖములను జూతురు కుమతుల్
సుఖదుఃఖ సమతఁ జూచిన
నఖిల భవాంభోధి గడుతు రంబుజవదనా

శ్రీనాథ. భీమ. V-172

కారణము లేక యూరక కలుగునెట్లు
సుఖము దుఃఖము నరునకు ?

శ్రీనాథ. కాశీ., II-142

సుఖంబ స్వర్గంబు దుఃఖంబ నరకంబు

శ్రీనాథ. కాశీ. VI-80

తూఁచిన నిరుదేస దుఃఖసుఖంబులు
ఊఁచివిడుచు టే ఓపిన తెలివి
అనాదివాసనలంటిన జిగురులు
మనోగుణములై మానవివి

సుఖమును దుఃఖమును జోడుకోడెలు
అఖిలము గన్నవారు అడ్డమాడ రెపుడు
ఎందాఁకా సంసారమెనసి తాఁజేసేను
అందాఁకా లంపటములవిపోవు

సుడిగొన్న తనలోని సుఖదుఃఖాలు
ఎడపుల నివి రెండు ఎండనీడవంటివింతే

వేసరి యుడవినున్నా వెంటనే సుఖదుఃఖాలు
పాసిపోక కొంత యనుభవింపించును

కప్పిన సౌఖ్యదుఃఖకర్మములు సమముగా
నొప్పుట విజ్ఞానమొదవిన ఫలము

తా. అన్నమయ్య. అధ్యా. సం.

హృదయమునకు సంతోషం
బొదవుట స్వర్గంబు దుఃఖమొందుట నరకంబు

వెన్నెలకంటి సూరన. వి. పు. III-131

శకటగత చక్రభంగిన్
సుకరములై తిరుగుచుండు సుఖదుఃఖము లిం
తకు ఖేదమంద నేటికి
నకటా సంతోషయుక్తుఁడగు టొప్పుగదా!

బైచరాజు. పంచ. II-162

శోకింపనేటికి సుఖము దుఃఖంబు
లోకులఁ బ్రాపించు......

తిమ్మయ. ద్విప. భారత. విరాట.

సారిది మేలునుగీడు సుఖముదుఃఖంబు
నరుదేర నెట్లోకోయని చింతవలదు

తిమ్మయ. ద్విప. భారత. ఉద్యోగ.

......సుఖదుఃఖములు పొందు నెపుడు
తడయక దుఃఖము తగ సుఖంబుగను
తలపోయవలయును ధన్యులకెల్ల

సోమన. ద్విప. భారత. శాంతి.

... ...సుఖదుఃఖంబులు
భువిఁజక్రము పొరలినట్లు పొరలుచునుండున్

దా. శ్రీ. దేవీభాగ. 778

అపరిమితము నభావంబు ననెడు రెండు
కష్టదశ లెప్డు సుఖము ప్రక్కలనెయుండు
నడుమను సుఖార్థియూఁగక నడువవలయు
ద్రాఁటిబద్దపై నేటిని దాఁటునట్లు

పామగంటి. వన. రాము.

అమిత విభవమున్న నప్పుడపుడు కష్ట
మొకటఁ గలుగకుండ సుకములేదు
లలితలలితమగు తలాడపైనను జేతి
యడ్డులేక నిదురనందఁగలమె

పానుగంటి. కోకిల

పగటి తరువాత నిశ తరువాతఁ బగలు
వెన్నెలలవెన్క జీకట్లు పిదప జ్యోత్స్న
లీవరుస సుఖదుఃఖంబులెనయు నరుని

కూచి నరసింహం. రూపలత. IV–i–71

కలదు సుఖము దుఃఖంబు సర్వవస్తువులయందు

తిరు. వేం. కవులు. బుద్ధ. IV–74

## సుపుత్రుఁడు

పుణ్యాచారుండయిన పుత్త్రుం
డుభయ పక్షంబులవారి నుద్ధరించు

నన్నయ. భారత. ఆది. IV–89

జననియు జనకుఁడు నెవ్వని
యనువర్తనమునఁ బ్రియంబునందుదురేదఁ ద
త్తనయుఁడు ధర్మముఁ గీర్తియు
ననూనముగఁ బొందఁబడయు నక్షయగతులన్

ఎఱ్ఱన. భారత. అరణ్య. V–6

అనఘులు పరహిత చరితులు
జనసంభావ్యులును బుణ్యచరితులునగు నం

దనులను బడయుదు రెవ్వరు
దనరఁగ వారిందునందు ధన్యులుగారే!

మారన. మార్కం. V-265

పందిపిల్లలీను పదియునైదింటిని
కుంజరంబు గాంచు కొదమ నొకటి
యుత్తముండు పుత్రుఁ డొక్కఁడు చాలఁడా ?

వేమన

కడుపు బదరగాఁగ గొమకులఁ గనుకంటెఁ
దల్లికొకఁడె చాలు బల్లిదుండు

పోతన. భాగ. VIII-685

బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి
మిన్నుముట్టకేల మిన్నకుండు ?

పోతన. భాగ. IX-386

దానధర్మము లెన్ని చందములనైనఁ
దగనొనర్చినఁ గల్గునే సుగతి జగతి
సారలౌకిక వైదికాచార నియమ
కలన గల పుత్రతిలకంబువలనఁగాక

సారంగు తమ్మయ. వైజయంతి. I-64

నోచినతల్లిదండ్రికి దనూభవుఁ డొక్కఁడెచాలు మేటి చే
చాఁచనివాఁడు వేఁడొకఁడు చాచిన లేదనకిచ్చువాఁడు నో
రాచి నిజంబకాని పలుకాడనివాఁడు రణంబులోన మేన్
దాచనివాఁడు.........

కంచెర్ల గోపన్న. దాశరథీ శతకము. 96

## సువిచారము

త్వరితము సేయక కార్యము
చిరంతన విమర్శనముగఁ జేసి యొనర్పన్
ధరణీశ్వర యోటువడఁడు
పురుషుఁడు సిద్ధియునువానిఁబొందు దృఢముగన్

మిత్రత్వము శత్రుత్వముఁ
బాత్రతయు నపాత్రతయును బరికించు సుచా
రిత్రుఁడు చిరతరగణనా
సూత్రితముగ దాననెల్ల శుభములు నొందున్

తిక్కన. భారత. శాంతి. V-262, 289

లాలన సేయక మనసును
జాలములో దగులరాదు చపలత తోడై
కాలుని తోడ్కొని తెచ్చును

వేమన

## సుహృద్విరహము

అంబురాశి పారమైనను గనవచ్చు
నిశ్చయింపవచ్చు నింగిపొడవు
బ్రహ్మ మిట్టిదనుచుఁ బలుకంగనగు సుహృ
ద్విరహ మింతయనుచుఁ దెలియరాదు

బైచరాజు. పంచ. II-228

## సేవకధర్మము

తగఁజొచ్చి తనకు నర్హం
బగునెడఁ గూర్చుండి రూప మవికృతవేషం

బుగ సమయ మెఱిఁగి కొలిచిన
జగతీవల్లభున కతఁడు సమ్మాన్యుఁడగున్

రాజగృహంబుకంటె నభిరామముగా నిలుగట్టఁగూడదు

ఊరకయుండక పలువుర
తోరవమెసఁగంగఁ బలుకఁదొడరుపక మదిం
జేరువగల నాగరికులుఁ
దారుఁగలసి పలుకవలయు ధరణీశుకడన్

వేఱొక తెఱఁగున నొరులకు
మాఱాడక యునికి లెస్స మనుజేంద్రుకడన్

నగళుల లోపలి మాటలు
దగునే వెలినుగ్గడింప

అంతిపురము చుట్టఱికం
బెంతయుఁ గీడంతకంటె నెగ్గు తదీయో
పాంతచర కుబ్జవామన
కాంతాదులతోడి పొందుకలిమి భటునకున్

ఉత్తమాసనములు నుత్కృష్ట వాహనం
బులును గరుణఁదమకు భూమిపాలుఁ
డీక తారయెక్కు టెంతటిమన్నన
గలుగువారికైనఁ గార్యమగునె

జనపతి యెవ్వరినైనను
మనుపఁ జెఱుపఁబూనియునికి మదిఁదెలియ నెఱిం

గినయేనిఁ దాను వెలిపు
చ్చునె మును మున్నెట్టి పాలసుందును దానిన్

ఎండకు వానకోర్చి తనయిల్లు ప్రవాసపుఁ జోటునాకయా
కొండునలంగుదున్ నిదురకుందక దప్పిదు దప్పి వుట్టె నా
కక్కండన యెట్లొకోయనక కార్యము ముట్టినచోటనేలి నా
తండొకచాయ చూపినను దత్పరతం బనిసేయు టొప్పగున్

కలిమికి భోగములకదా
ఫలమని తను మెఱసి బయలుపడఁ బెల్లుగ వి
చ్చలవిడి భోగింపక వే
డ్కలు సలుపఁగవలయు భటుఁడడంకువతోడన్

తిక్కన. భారత. విరాట. I-121, 23, 27, 28, 30, 31,
32, 34, 35, 40

మొగమాట గరిమ మడఁకువ
తగవుచితము మెలపు పెంపు తాలిమి యివి లో
నగు సుగుణంబులువలవదె
నగళ్లలోఁ దిరుగు పరిజనంబుల కెల్లన్

మంచెన. కే. బా. చ. II-84

ఉత్తముఁ డేలుతేనిపని యొక్కరుఁడయ్యును జేయు మధ్యముం
డత్తి యొనర్చుఁ దోడుగలయప్పుడు చాలియు నీచుఁడెప్పుడుం
జిత్తముసేయఁ డత్తెరగు సేయుటకై

అయ్యలార్యుఁడు. భా. రా. యుద్ధ. 4

ఏలికను దైవముఁగా నెంచి కొల్చేవాఁడె బంటు
తాలిమి గలిగిన యాతఁడె బంటు
పాలుమాలక యేపొద్దు పనిసేయువాఁడె బంటు
వేళగాచుక యుండేటి వెరివరే బంటు

తను మనోవంచన లేనివాఁడె బంటు
ధనముపట్టున శుద్ధాత్మకుఁడు బంటు
అనిశము నెదురు మాటాడనివాఁడె బంటు
అని మొనఁ దిరుగని యతఁడె బంటు
చెప్పినట్లనే నడచిన యాతఁడే బంటు
తప్పులేక హితుఁడైనాతఁడె బంటు
మెప్పించుక విశ్వాసాన మెలఁగు నాతఁడె బంటు
ఎప్పుడును ద్రోహిగాని హితుఁడె బంటు
అక్కరగలిగి కడు నాప్తుఁడైనవాఁడె బంటు
ఎక్కడా విడిచిపోని యిష్టుఁడే బంటు
తక్కక రహస్యములు దాచినవాఁడే బంటు

తా. అన్నమయ్య అధ్యా. పం.

విభుని యేకాంతంబు వెలిపుచ్చరాదు
విభునకు నోరుమాట వివరింపవచ్చు
విభునిముందరఁ బోక వెనుకకు రాక
సభలోన నుభయ పార్శ్వముల నిల్వవలె
......భూవిభుఁజేరి వినతుఁడై యచటఁ
దనకు బోలినచోటఁ దానుండవలయు
నిలిచి యవ్విభుమీఁద నిజదృష్టి నిలిపి
మెలపుమై బనులకు మేకొనవలయు
ఆవులింతయుఁ దుమ్ము హాసంబు నుమియు
వేవేగ విభునొద్ద వెలిఁబుచ్చరాదు
ఎండైన వానైన నెంతయునోర్చి
మండలేశ్వరుపంపు మతిఁ జేయవలయు

ఒప్పు వాహనములు నుత్తమాశ్వములు
నెప్పుడు నృపుఁడీక యెక్కఁగరాదు

ఓజతోఁ గరుణించెనుగ్రించెననుచు
రాజు చిత్తము చెప్పరాదు మున్నాడి

భూమీశు సొమ్ము లెప్పుడు నాసపడక
పాము నెమ్ములుగాఁగ భావింపవలయు

తిమ్మయ. ద్విప. భారత. విరాట

దొరసెప్పినటు సేయ దోసంబుగాదు

వరద. రామా. కిష్కింధ.

నయమెఱిఁగిన భృత్యుఁడెపుడు నాథుని మ్రోలన్
బ్రియమని సత్యము చెప్పక రయమునఁ బోవంగరాదు

దా. శ్రీ. దేవీభాగ. V-58

కూలిగొని స్వామికార్యంబు దూలఁజేయు
వాఁడు కల్పంబు నరక సంవాసియగును

దా. శ్రీ. దేవీభాగ. VII-534

రాచనగళ్లకు దీటుగ కట్టగరాదు మందిరములు
రాజుకు సరిగా వేషము వేయగరాదు సేవకుండు

అధికుని సభలోనుండి సేవకుండైన మానవుండు
అధిక ప్రసంగము చేయరాదు మాటాడకుండరాదు

ఉర్వీనాథుని నీచగుణంబులు ఉగ్గడించరాదు
సర్వ స్వాతంత్ర్యము గలిగిన తనమది గర్వించగరాదు

భూపాలుని సముఖంబున బారలుచాపి నడువరాదు
ఏపని నాజ్ఞాపించిన క్షితిపతి కెదురు చెప్పరాదు

దే. వెంకయ్య. విరాటపర్వము. ౨౦౧౪౮

## సేవకవృత్తి

మన్నన కబ్బక యవమతి
దన్నొందిన స్రుక్కఁబడక ధరణీశుకడన్
మున్నున్నయట్ల మెలఁగిన
యన్నరునకు శుభములొదవు నాపదలడఁగున్

తానెంత యాప్తుఁడైన మ
హీనాయకు సొమ్ము పాము నెమ్ములు గాలో
నూనిన భయమునఁ బొరయక
మానినఁగా కేలకలుగు మానము బ్రదుకున్

వైరుల దూతలు నెరవగు
వారు నిరాకృతులుఁ బాపవర్తులు దమకున్
జేరువగా వర్తించుట
నేరమితుదిఁ బోయి చేటు నిందయు వచ్చున్

తిక్కన. భారత. విరాట. I-133, 36, 38

సేవకులైన వారికి విశృంఖలవృత్తిఁ జరింపఁగూడునే ?

జక్కన. విక్రమార్క. V-40

కోపప్రసాద చిత్త
వ్యాపారము లెఱిఁగి కొలిచివర్తిల్లు భటుల్
భూపాల బాహుశాఖా
రోపితులై యుంద్రు చనవురొక్కం బగుటన్

భైచరాజు. పంచ. I-156

నీచతఁ గొంతప్రూనిన మేలుగాని
రాచకట్టడ నుండరాద యెవ్వరికి

నరపతి మన్నించు నాకేమి యనుచు
మరియాద మీఱుట మఱి కార్యహాని

మన్నించుచో నుబ్బ మనుజేంద్రుకినుక
తన్నుఁ జెందినచోట దైన్యంబుఁ దగదు

తిమ్మయ. ద్విప. భారత. విరాట.

సేవకావళికి దుఃఖముతప్ప మఱేమి లేదిలన్

విక్ర. దే. వ. శ్రీని. II-47

ఒడలు దాపక పనిసేయఁ గడఁగునేని
సుఖముదక్కదు కాసింత సుఖముగోరి
యేమఱినమాట దక్కదొకింతయైన
సేవకావృత్తికంటెను జేటుగలదే ?

కాళ్లకూరి. చిత్రాభ్యుదయము. II-16

## సేవ్యసేవకభావము

ఈవలయునర్థ మిచ్చియు
సేవకు మన్నింపవలయు జితమతి విభుఁడా
యీవికి మన్నన కుదిరిగఁ
జావలయు భటుండుపతికి జయముగఁ బోరన్

నన్నెచోడుఁడు. కు. సం. XI-44

దాసుఁడేమైనను దప్పుఁజేసినను
గ్రేసి కారించుట విహితంబుగాదు

గౌరన. హరిశ్చంద్ర.

భటుఁడు వెంటలేక ప్రభుఁడు శోభింపఁడు

వేమన

లోకంబులందు భృత్యులర్థకాములయి రాజుల సేవింతురు
రాజులుం బ్రయోజనంబునర్థించి భృత్యులకు నర్థంబులొసంగె
దరు

పోతన భాగ. VII-371

తొల్లింటి సేవ నొక భూ
వల్లభునకు నెగ్గుసేసి వచ్చిన తులువన్
వెళ్ళింపంగాఁ దగుఁదగ
దుల్లంబున హితుఁడటంచు నూఱడియుండన్

ప్రౌఢకవి మల్లన. రుక్మాంగద III-17

పతికిఁ గీడాటబంట్ల పాపంబుగాదె

రామకృష్ణుడు. పాండు. మాహా. V-98

బలవంతుఁడగు బంటు గల్గు దొరకున్ బ్రఖ్యాతి రాకుండునే

వు. తిమ్మన. సమీర. VI-9

ప్రేమఁ జూడఁబడిన భృత్యుండు నిత్యంబు
స్వామిభక్తిగలిగి సలుపుఁ బనులు

కం. వి .నం. నీతి. 44

భటకృతిఫలింపఁ దత్కీర్తి ప్రభునిదగును
ఫలముగనకున్న నపకీర్తి భటుని దగును

పానుగంటి. విజయ.

## సౌందర్యము

చూడఁదగినదైనఁ జూడంగవలయురా !

వేమన

శోభ యొసఁగదె వికృతియు సుందరులకు

అడిదం సూరకవి. కవిజనరంజనము. II-18

తలఁపఁగ సుందరాంగులకుఁ దాను విభూషణ మేదిగాదిలన్?

కం. వీ. పం. అభి. శా. I-499

ధరణి వెలసిన యెట్టి తత్త్వమునకైన
ఋషులు సూత్రంబులను రచియించినారు
అంద తెలిసియు నెఱుఁగని సుందరతకు
నొక్క-సూత్రమైనను బుట్టి యుండలేదు
జాతిఁబట్టి కాలముఁబట్టి స్థలముఁబట్టి
నాగరకతనుబట్టి జన్మమునుబట్టి
యవసరంబునుబట్టి రాజాజ్ఞఁబట్టి యది వెలయు

పానుగంటి. మాలతి

## సౌభాగ్యము

వల్లభునకుఁగాని వనిత పుణ్యంబు
లెల్ల బొల్లైపోయి యేఁగు దుర్గతికి

వరద. రామా. అయో.

భాసురైశ్వర్య ఖనియునౌ ప్రాణవిభుఁడు
కలుగుటెల్లను చెలి పుణ్యఫలముగాదె

రుక్మిణీ పరిణయము. I-96

## స్త్రీ

పతిఁబడసి సుతులఁ బడయఁగ
సతివలు గోరుదురు

నన్నయ. భారత. ఆది. III-171

నరలుగల కాముసైనను
దరుణులు రోయుదురు డాయ

నన్నయ. భారత. ఆది. III–194

ఉగ్రతంబమ్మిన యట్టికోపపరు
పాలికి భాములు వోవనోడరే

నన్నయ భారత. ఆది. IV–38

పురుషహీనయైనఁ బరమ పతివ్రత
యయ్యు జగముచేతఁ బ్రయ్యఁబడదె

నన్నయ. భారత. ఆది. VI - 256

వ్యసనంబులందు వివాహంబులందు
నెసఁగు కయ్యములందు నిష్టులయందుఁ
దలఁకొని చెల్లు నుత్సవములయందు
వలవదావరణముల్ వారిజాక్షులకు

కాల దేశాంతర క్రమమునఁ జెడని
యీలు వొక్కటి మఱఁగింతియకాక
యెనసిన కోటలు నిండ్లును దెరలు
వనితలకెందు నావరణముల్ గావు

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

బాల్యమునఁ దండ్రి యౌవనప్రాప్తి మగఁడు
వార్ధకంబునఁ దనయుండు వామనయన
సరసి నడపన కాకెందు నంగనలకు
వలసినట్టుల సేయఁగావచ్చు నెట్లు

తిక్కన. భారత. అను. II–22

 

జగమున వనితారత్నంబు
లెల్లవారికి భోగంబున యెడ సాధారణములు

ఎఱ్ఱన. భారత. అరణ్య. VI-172

వనితలు నేఱులున్ మగిడివచ్చుట గల్గునె పాసిపోయినన్

వెన్నెలకంటి అన్నయ. షోడశకుమారచరిత్ర. V-76

మేలై వచ్చిన మెత్తురు
కాలవశతఁ జేసి కీడుగదిరిన నతనిం
గేలి యొనర్చుచుఁ బోదురు
నాలిసతుల మాటలంత నమ్మంగలదే

రమణీజనముల దెసఁ గడుఁ
దమకించుట నీతిగాదు తత్త్వజ్ఞులకున్

అతివలు సాహస కర్మిణు
లతిమాత్రము వారిబుద్ధి యుక్తియునికిం
జతురాననునకు నైనను
సతుల గెలువరాదు సహజసామర్థ్యమునన్

అనంత. భోజరాజీయము. -V-14. 27. 270

ఏకాంతముననున్న యెడ మగవారి
నాకాంత మదిఁగోరు......

గౌరన. నవనాథ.

పెనగపెనగ బుట్టు ప్రేమ సతికి

గడనవిడు పురుషుఁ గనుఁగొని
నడవీనుగు వచ్చెనంద్రు నాతులు

స్త్రీలు లేనిచోట చిన్నవోవు
వీథిలోను దిరుగ వెలది పురుషుఁడౌన ?

వేమన

పురుషులకు సంగవలవలన
ధర్మార్థకామంబులు సిద్ధించు

పోతన. భాగ. III-459

పొగడొందు జననిగానీ
తగవున వర్తించునట్టి దయితయుగాని
తగనుండని గృహమున నుం
టగుఁ జక్రవిహీన రథమునందుం టరయన్

పోతన. భాగ. IV-781

చొక్కపుఁ బ్రాయమున్ మిగులసోయగమున్ గల ప్రాణనాయకుం
డెక్కుడు వశ్యతన్ రతులనేఁకటఁదీర్చి సమేళ మొప్పఁగా
నక్కున గారవించి ప్రియమందఁగ నోచనియింతి దైనయా
చక్కఁదనం బదేమిటికి జవ్వనమేటికిఁ బ్రాణమేటికిన్

పెద్దన. మను. III-7

ఆడుదాని బతుకు సెయుంగఁదగున

రాయలు. ఆము. V-51

తరుణి విభ్రమంబు దలపోయ శక్యమే
ధాతకైనవాని తాతకైన

రుద్రకవి. నిరం. II-33

చివురుఁబోఁడులు తపశ్శీలవృత్తులకు
వివరింపఁగా వేరు విత్తులుగారె ?

......ఇహసౌఖ్య వితతు
లన్నియు నిచ్చువా రన్నులకారె

తాళ్లపాక. తిరు. వేం. పరమ.

సవలాల చూపుఁజలలన్
దవులని వాఁడుంగలాఁడె ధైర్యముతోడన్

రఘునాథరాయలు. వాల్మీకిచరిత్ర. III-113

ఆడుది యుసురుమన్న కొఱగాదుసుమీ !

జవరాండ్ర యెడాటములందు శక్యమే
యెంతటివానికైనఁ జలియింపక బిగ్గమనంబు నిల్పఁగన్

చే. వేం. సారంగ. II-11, 123

భామలెందైన నెంతైన మది ప్రేమలేక యుందురా ?
ఆఁడుదాని జన్మ మయ్యో ! అన్నిటికంటె నధమము

క్షేత్రయ

సత్యంబులెల్ల నసత్యంబు సేయ
నిత్య మనిత్యంబు నిజముగాఁ జేయ
నేరుపు సంధిల్లు నెలఁతలకెల్ల
నారు లెంతకులేరు నరుల బోధింప

తిమ్మయ. ద్విప. భారత. ఆది.

కోరి వచ్చినవారి కోరికల్ దీర్ప
నేరని సతులకు నిష్కృతుల్ లేవు

వరద. రామా. బాల.

......తలిదండ్రు లెందు
తగునని యొకనికి ధారవోసినను

ఆకన్యయేకదా యధిపతి నెల్ల
లోకంబునందు సుశ్లోకుఁగావించు
......తనవిభు మీఱినడచు
నతివపుట్టువు నిరయముల కాస్పదము
తన నాయకునకు హితం బాచరించు
వనిత కోరికలు కై వసము లన్నియును
దయితలు సంకెలల్ ధవులకు నెల్ల
ఆడువారలబుద్ధు లరయంగ రాదు

వరద. రామా. అయో.

అలసిన వేళల నాకొన్న వేళ
నలపోక డస్సిన యట్టి వేళలను
బురుషవర్యులకును బొలఁతియె ప్రాపు
అరయంగ దుఃఖ రోగార్తుల కెల్ల
ధరణిలోపల నౌషధము సతి సువ్వె

సోమన. ద్విప. భారత. అరణ్య.

పృథుల ధర్మార్థమణిగణపేటిబోటి

ధరణిదేవుల. దశా. చరిత్ర. III-35

ఆడపడుచాయటంచు నత్యల్పముగను
మదినెఱుంగక కొందఱాడుదురుగాని
కన్య సామాన్యమే పుత్రుఁ గాంచెనేని
నుభయ కులములఁ దరియింప నోపుఁగాదె

ధరణిదేవుల. దశా. చరిత్ర. VIII-80

చూడంగఁదగిన వస్తువులందు ఘనమెద్ది
తులలేక తగు వెలందుల మొగంబు



తొయ్యలులకన్న రమ్య వస్తువులు లేవు
వారలే కష్టములకెల్లఁ గారణములు

పడఁతి నొక్కదాని విడిచి యించుక యమృ
తంబులేదు భువి విషంబులేదు
యమృతలత లతాంగి యనురాగవతియైనఁ
గాక మెలఁగెనేని గరళవల్లి

ఏ. లం. కవి. సుభా. II-7, 40, 44

ఇంతికై లోకముని విషలెట్టు నిలుచు

గో. కూర్మనాథకవి. మృత్యుం. విలా. II-40

ఎక్కడిశ్రుతి యెక్కడి స్మృతి
యెక్కడి జపమేటి నేమమెక్కడి ధ్యానం
బెక్కడి జ్ఞానము చక్కని
దొక్క చకోరాక్షి యెదుట నుద్దుటై యున్నన్

రేపూరి అనంతయజ్వ. శృంగారగాథేయోపాఖ్యానము. V-12

విరిబోండ్ల డెందముల్ వివరించి తెలియ
హరిహరాదులకు శక్యముగాదు సుమ్ము
పంతంబు బోనాడి పడతి దావలచు
నంతకన్న గొరంత యువనిపై గలదె

బాణాలశంభుదాసుఁడు. సారంగధర.

అరటాకువంటిది ఆడజన్మంబు

అప్పగింతలపాట

ఆడవారి మాటలు అద్దములో తేటలు
బావిలోన మాణిక్యాలు దూరంపుకొండలు

గాంధారికథ

సామము దానము రెండును
గామినియెడఁ జూపవలయు

దా. శ్రీ. దేవీభాగ. V-272

నరుల దయార్ద్రకోమల మనంబులు లోఁగొని వామలోచనల్
సరగున నేమిచేయుటకు జాలరు తారు ధరాతలంబునన్ ?

కం. వీ. పం. ప్రబోధచం. I-21

పడఁతి వెలలేనిదీశు సవ్యస్థయైన
దశగుణాధికుఁగాఁ జేయుఁ దద్విధాన్య
యైన శతగుణాధమునిగా నాచరించు
నొకటిముందు వెనుక సున్నయున్నయట్లు

మగల మనసుల మృదురీతిఁ దగనిపనుల
నుండి మఱలించి సుగుణంబు లొదవఁజేసి
వారి శుభదేవతలు గాఁగ వరలుచుండు
కొమ్మలను నెత్తిపైఁ బెట్టుకొనుట తగదె?

దేశశుభగత మగవాని తెలివిఁబట్టి
నిలువ దబలయోగ్యతఁబట్టి నిలుచుఁగాదె

పానుగంటి. పూర్ణిమ

వ్యాస సూత్రాళిచేఁ బరబ్రహ్మ దెలియు
జైమినీ సూత్రతతిఁ భవిష్యత్ప్రకార
మెఱుఁగనగుఁగాని స్త్రీ చిత్తవృత్తిఁ దెలియ
సూత్ర మొకటియు లేదయ్యె ధాత్రియందు

పానుగంటి. సారంగధర

ఎట్టిబుద్ధియైన నెట్టిపాండితియైన
నెట్టిజ్ఞానమైన నెట్టి సుగుణ
మైన నాడువారి యవలోకనాశుగ
ములను దూసిపోక నిలువఁగలదె ?

పానుగంటి. కోకిం.

ధనము శౌర్యము విద్య యౌవనము రూప
మొక్కటొక్కటియే స్త్రీని గక్కుఱితిని
బడఁగఁజేయఁగ నన్నియుఁ గలియుచోట
సందియమునకు నాస్పదసరణి యెట్లు

పానుగంటి. విజయ.

మగువమీదను బతికెంత మక్కువైన
మగనిమీదను సతికెంత మమతయున్న
నువిదకును గాపురంబెంత యొప్పియున్న
బుట్టినింటికె కడుఁగూర్చుఁ బొలతి యెపుడు

మగనితోడిద లోకంబు మానవతికి

చిలకమర్తి. గయోపాఖ్యానము. III–74, 76

ముదితల్నేర్వఁగరాని విద్యగలదే ముద్దారనేర్పించినన్

చిలకమర్తి. ప్రసన్నయాదవము. IV–68

ఆడువారికిని మానముగాదె సమస్తసంపదల్

కోలాచలం. రామరాజు చరిత్ర. II–IV–39

లీలాపాంగ విలోకనంబులఁ బ్రదపాలీలాస్య సందర్శన
భ్రూలాస్యంబుల మంజువాఙ్మధుధునీపూరాప్లుతిన్ బూరుషున్

లోలుం జేసి మృషాప్రతిజ్ఞల సతుల్ లోభంబుఁ బుట్టించిదు
ర్లీలం బ్రీతిని జూపి చేయరె నిజక్రీడాశకుంతంబుగన్

మేదేపల్లి వేంకట రమణాచార్యులు. దేవవ్రతచరిత్ర

సకల విషయంబులను బోధసలుపు గ్రంథ
ములు మనోవ్యాధి మాన్పెడు మూలికలు వి
చారవారాసి దాటింపజాలు నౌక
లంగనలు

కాళ్లకూరి. పద్మవ్యూహము. V-91

నిక్కమ్ముగ స్త్రీ నిజప్రియునకై దురపిల్లుచు ప్రేమహోమకుం
డమ్మున ధారవోయదె మనమ్ము ధనమ్ము యశమ్ము దేహమున్

కొప్పరపు సుబ్బారావు. వసంతసేన. I-iii-11

ధన ధాన్యాదికములఁ గని
తనిసిన దనియుదురుగాని తరళాక్షులు భ
ర్త్రనురాగామృత రససే
వనమున నెప్పుడైనఁ దనియువారలు గలరే ?

ముత్తరాజు సుబ్బారావు. శ్రీకృష్ణతులాభారము. II-ii-12, 22

ఆడువారలగాలి రవ్వంతసోక
పురుషు లెప్పుడున్ తడఁబడి బొంకుచుంద్రు
వలపు తలకెక్కఁజేయు జవ్వని కనఁబడ
నరకమే స్వర్గమనని యజ్ఞాని కలఁడె ?

సె. ల. నరసింహం. చిత్రహరి. I-16

వరుని చదువును రూపంబు నరసియువతి
వలఁచి వరియించునేకాని వంగడమ్ము

గుణమునరయదు; గావునఁ గొంతకాల
మెడల వారిసంసారంబు సెడఁగవచ్చు

విక్ర. దే. వ.

సతుల కోపంబు సైరింప శక్యమగునె

నా. కృ. రావు. పైడిలేడి

## స్త్రీ పురుషులు

తగవును బంతంబు నిజము ధర్మముఁ గృపయున్
మగవారికె గాకొందును
మగువలకుం గలవె ?

మంచితనంబు లాకువారికి మగవారికి సరియ

శ్రీనాథ. శివరా. III-75. 78

మగవానికంటె మునుపుగ
మగువకెడలుఁ బ్రాయమంద్రు

మారవ. కళా. IV-164

తగులున మగవాఁడు దమకించునపుడు
మగువకుఁ దనపెంపు మానంగ రాదు

తిమ్మయ. ద్విప. భారత. విరాట.

*మగవారికిఁగల గుణముల
మగువల వలపించుదనుక మమకారంబుల్
మగువలు వలచిన పిమ్మటఁ
దగవులు మఱివేఱెకావె

వెంగల్వ కాళకవి. రాజగోపాలవిలాసము. III-12

సెగపొంత వెన్న పురుషుండౌ బో వధూచేష్టకున్

కనుపర్తి. కవిరాజ. IV-40

పిఱికితనమును బిడియంబు పురుషునకును
బనికిరావవ్వి భూషలౌ వనితకెపుడు
దేవుచేతను దరియింపఁ దిపురునాతఁ
డతనిచేతను దరియించు నయ్యి యామె

వంకదాటులలో మగవారు ఘనులు
వంశమర్యాద యెన్నఁడు వదలదబల
ఇంటి పరిశుద్ధి యెల్లప్పుడింతివలన
నిలఁబడునుగాని మగవాని వలనఁగాదు

పానుగంటి. పూర్ణిమ

కుడియెడమ భేదమున్నది పడఁతిఁకి బురు
షునకుఁ గఠినగాత్రుఁ డతఁడు సుమసుమాంగి
యద్ది; భరియింపగల్గువాఁడతఁడు; సేవ
నది భరియింపఁబడుచుండు నద్ది యామె
స్వల్పకఠినాత్ముఁ డతఁడు; పేశలసుధాని
భోన్నత మనస్కయామది;

కర్తికతఁ డర్హుఁడగు; సూదిగరిటెలకు స
మర్హయగు నామె; రాజసేవార్హుఁ డతఁడు
అతిథి కుల దేవతాదుల కర్చసలిపి
యిల్లు స్వర్గతుల్యముఁ జేయఁజెల్లు నామె

సర్వదేశంబు నతని సంచారభూమి
యిల్లె యీమెపాలన సీమ ;

పానుగంటి. కల్యా. రాఘ.

## స్త్రీప్రభావము

కామినులు లేక లోకులఁ
గాముని కెల్లగు మనోవికారులఁ జేయన్

నన్నెచోడుఁడు. కు. సం. V-18

ఇంతుల నిమిత్తమున ధృతి
మంతులుఁ బొందుదురు ఖేదము

నన్నయ. భారత. ఆది. VIII-114

ఎంత జితేంద్రియులైనను
నెంత సదాచారులైన నేకాంతమునం
గాంతల సంగతి నుండినఁ
గంతుని కొంతాలపాలు గాకుండుదురే !

జక్కన. విక్రమార్క. III-60

వెట్టివానికైన వేషధారికినైన
రోగికైన బరమయోగికైన
స్త్రీల జూచినపుడు చిత్తంబు రంజిల్లు

స్త్రీలు కల్గుచోట జెర్లాటములుగల్గు

పడతిముఖము సొగసు పాటించి చూచిన
గోటిపూజలెల్లఁ గొల్లపోవు

స్త్రీలముఖము జూచి చిత్తంబు నిలుకడ
సేయని మనుజుండు చెడు నిజంబు
ఏటిగట్టు మ్రానికెప్పుడు చలనంబు

వేమన

......మహా విద్వాంసుడుం గామినీ
హేలాకృష్టకురంగ శాబకమగున్ హీనస్థితిన్ వింటిరే ?

పోతన. భాగ. VII-215

కాము గెలువవచ్చుఁ గాలారిగావచ్చు
మృత్యుజయము గలిగి మెఱయవచ్చు
నాఁడు వారిచూపు టంపఱ గెలువంగ
వశముగాదు త్రిపురవైరికైన

పోతన. భాగ. VIII-405

పవనపర్ణాంబు భక్షులైనవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను ముని ముచ్చులెల్ల
తామరస నేత్రలిండ్ల బందాలుగారె

పెద్దన. మను. II-73

కాయజుఁడు చేయుమాయల
నాయజుఁడు హరుండు నంబుజాక్షుఁడు లోనై
తోయజ నయనలఁ బాయరు
హేయజనుల్ నరులనంగ నెంత ధరిత్రిన్

సారంగు తమ్మయ. వైజయంతి. II-48

ముదితలయెడనున్న మునివర్యుఁడైన
జడియక యెట్లుండుఁ జర్చింప వహ్ని
కడనున్న యావెన్న కరఁగ కేలుండు

తాళ్లపాక. తిరు. వేం. పరమయోగి.

ఏకాంతనైనఁ బురుషుం
డేకాంతమునందుఁ జేరనేనియు సతినిన్
లోకాపవాద మంటదె
చీకాకుగ ధైర్యమెడలఁ జేయఁడె మరుఁడున్

చే. వేం. సారంగ. II-26

ఎట్టి దుఃఖంబైన నీఁతులఁగన్న
యట్టప్పుడేపాసి యానందమొదవు

తిమ్మయ. ద్విప. భారత. అరణ్య.

......సతుల సమక్షంబునందు
మదగర్వముల్ హెచ్చు మదినెల్ల అకును

వరద. రామా. కిష్కింధ.

మగువలపొత్తు నన్మెలఁగు మానుల కేడఁదపమ్ము లారయన్

పెద్దాద నాగరాజామాత్య. శకుంతలా పరిణయము. II-223

రూకలాసఁగికొన్న సతిరూపము లెట్లున్న
శ్రీకరణమున్న చెలిచెలిమి వీడరన్న

ఎంతనేర్చిన ఎంతజూచిన
ఎంతవారలైన కాంతదాసులె

త్యాగరాజు

తరుణులెంతటి ధీరుల ధైర్యమెల్ల
జారగొందురు కన్నెత్తిచూచిరేని

వేంకటకవి. మదనగోపాల శతకము. 77

పృథివినిండీనరాక్షసుల దృష్టి విశిఖ
సంతతులు పర్వకుండెడు నంతవఱకె

మహిత విద్వాంసులకునైన మనసులందు
శాస్త్రజన్య వివేకంబు సంభవిల్లు

కం. వీ. లిం. ప్రబోధచంద్రో. I-13

సతులఁ గలసి యున్నప్పుడె సత్పురుషులు
మదిఁ బ్రసన్నులై వరదులయ్యెదరు సూవె
మెఱుపుతోఁ గూడుకొనియున్న మేఘమాల
కురియకుండునె చల్లఁగఁ గుంభవృష్టి

చిలకమర్తి. ప్రసన్నయాదవము. III-46

ఇంతులు తారసిల్లువఱకే పురుషాగ్రణులెంతలేసి సా
మంతము లాడినం బిగువుమాటలు పల్కిన

కాళ్లకూరి. చింతామణి. III-33

పడఁతులు చేయింపలేని పనులుంగలవే!

తిరు. వేం. కవులు. బుద్ధ. II-104

స్త్రీప్రేమ

తొలుకారు మెఱుపులు తోఁచిపోవు
పొలఁతుల వలపులు పొలసిపోవు
ఎండమావులు చూడనేఱులై పాఱుగాక
అందకుంబోవ దాహమణంగెనా?

అన్నమయ్య. అధ్యా. సం.

ఆఁటది వలచుట యరుదే
నాఁటన్మఱి వలచెనేని నాథుని బెనుపో
రాట మొనర్చినఁ గోసిన
గాటంబగుఁగాని యెడయఁగా లేదుసుమీ

కదిరీపతి. శుక. III-128

చాపకింద నీళ్ళుపోస్తే ఎంతసేపుందునో
అంతసేపె మీసతుల వలపు

గాంధారికథ

ఎండమావులవంటిది యింతివలపు

నా. కృ. రావు. వెన్నెల వెలుగులు.

## స్త్రీలోలత

ఎట్టికష్టుఁడుఁ దన పురుషగుణంబు సెడఁగఁ
దల్లిని దోఁబుట్టిన వారి విడిచి
రాగంబునఁ జపలస్త్రీ సుఖంబుఁ బొందునె

నన్నయ. భారత. ఆది. VI-197

......ఎట్టి తగులంబైనన్
మగువల యెడలనయడఁగుం
దగవు విడిచియడిచి పడరు ధైర్యము పేర్మిన్

తిక్కన. భారత. విరాట. II-261

వనితల మోహము వలఁబడకుండితేనే
దినముఁ గోటితీర్థాలు దిరిగిన ఫలము

అన్నమయ్య. అధ్యా. సం.

విడువక సతులం దగిలెడు
జడునకు నెక్కడివిబుద్ధి చాతుర్యంబుల్ ?

పోతన. భాగ. IX-569

క్రూరనారాచవితతికి ఘోరకదన
రవములకు జంకనట్టి వీరపురుషుఁడును

గలికి క్రొవ్వాడిచూపుఁ దూపులకుఁ జిలుక
పలుకులకు సోలి దాసుఁడై పడునుగాదె

పానుగంటి. కల్యా. రాఘ.

## స్త్రీసాంగత్యము

ఉత్తమ సతితోడ యోగమానేని
హత్తిన బ్రహ్మచర్యము చెర్గిపోదు

తిమ్మయ. ద్విప. భారత. ఆది

పురుషులు కంటకతుల్యులు
ధరదరుణు లనంటిఁ బోలితనరెదరు గనన్

కోలాచలం. సుభమంజరీ పరిణయము. I-ii-18

సరస సహధర్మచారిణీ సాహచర్య
సంపదయొలేక పురుషుఁడు సత్క్రియాచ
రణ మెటులుకాంచు జ్ఞానసామ్రాజ్య పదవి
యెట్లు లభియించు భవముఁ దరించుటెట్లు

పానుగంటి. కోకిల.

## స్త్రీస్వభావము

సర్వప్రాణులకు సామాన్యంబయ్యును
మనోజరాగంబు వనితల కసహ్యంబయియుండు

నన్నయ. భారత. ఆది. VI-222

......కాంతలర్థంబుగల వృద్ధునైన
మనమూర వలఁతురు మహిత భోగేచ్ఛ;
ధనహీను నొల్లరు తరుణునినైన

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ.

నలిన బిససూత్రమును బురంధ్రుల తలంపు
సమముగ్రె తెయ్యుమలవ చాపలమునన్నైన

శ్రీనా. శృం. నై. IV-68

ఉపలములకంటెఁ గఠినము లొక్కవేళఁ
గుసుమములకంటె నొకవేళఁ గోమలములు
పువ్వుఁబోఁడుల హృదయంబు లెవ్వఁ డెఱుఁగు

శ్రీనా. శృం. నై. VII-162

కొమ్మమనసు తెలియరాదు

అన్నమయ్య

కుసుమ సౌరభములు గుది గ్రుచ్చవచ్చు
నిసుకబొమ్మల నీటనిఁ దింపవచ్చు
వానగండ్లు గుదుల్గ వడిఁ గట్టవచ్చుఁ
గాని యింతుల మనోగతి కానరాదు

గౌరవ. నవనాథ

గడనగల పురుషుఁ గనుగొని
యడుగులకును మడుఁగు లిడుదు రతివలుధరలో

ఓరగంటను సంపద నొక్కమాఱు
కన్నజాలును గామిని కాంతు జెందు

కలిమినాడు మగనిఁ గామించి చూచును
లేమి జిక్కునాడు లేవకుండు
మనిన మగనినైన మడియంగజూచును

ఆడదాని బొంకు గోడబెట్టినరీతి

చక్కనైనవాని మక్కువ గన్నంత
దక్కువగను జూచుఁ దనదు విభుని

వరుఁడు చక్కనైన వజ్రాల గనియైన
దళుకు మెఱుపువంటి తత్త్వమున్న
నన్యపురుష వాంఛ యాఁడుదానికి నుండు

వేమన

ఒక్కొక్క వేళఁ బద్మముఖులొల్లమి సేయుదు రొక్క వేళఁ దె
న్మక్కువ నాదరింతురు క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్
బక్కన వేసటన్ జనదు పాయములన్ దగునిచ్చకంబులన్
జిక్కఁగఁ జేసిడాసి సతి చిత్తముఁబట్టి సుఖింపఁగాదగున్

పెద్దన. మను. III-69

పేరలుకం జెందిన యట్టికాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే

తిమ్మన. పారి. I-121

పురుషుల భాగ్యమున్ జిగురుబోణుల చిత్తము నెట్లు మారునో

రుద్రకవి. నిరం. II-15

......క్షణభంగురములు కాంతల తాల్మిల్

మారన. కళా. III-55

భావనచేసి చూడ క్షణభంగుర మింతుల తాల్మికల్మివా
తావిల పల్లవాంచల హిమాంబుకణంబును నంతకంటె మేల్

మారన. కళా. IV-84

ఒక్కొక్కతఱింబువుఁబోండ్లు కటారి కత్తియల్

మారన. కళా. I-32

పతుల యనురాగలీల లేపగిదినైన
వెలయఁ గోరియు దాఁచుటింతులగుణంబు

నూరన. కళా. V-69

నడవడి పురుషుని భారం
బిడిభూరివ్రుషంబు జాతహేమము నొాఱయం
బడుశుద్ధి శక్తిరుచులకుఁ
బడతుల హృదయంబు లొారయఁబడవే గతులన్

భైరవరాజ. పంచ. IV-66

జవ్వనుల మనోగతుల్ దెలియువారిల నెంతటివారుగావలెన్

అనిశ క్రౌర్యముకల్కి చూపులనెకా దత్యంతకాఠిన్యమం
గన పాలిండ్లనెకాదు చాపలముస్త్రీ కందోయినేగాదు త
గ్గని కౌటిల్యము బోటిముంగురులనే కాదెల్లనుల్లంబునం
దాను వేఁటాడుచునుండు నిక్కమిది యెందున్నమ్మరాదింతులన్

చే. వేం. సారంగ. II-243. 245

భామలచిత్తముల్దెలియ బ్రహ్మకునైన వశంబుగాదు

కదిరిపతి. శుక. I-88

పురుషునింట సర్వభోగాఢ్యయయ్యును
గన్య పుట్టినిల్లుఁ గాంక్ష సేయు

భవానీశకవి. ధర్మ. IX-78

మఱుల్చెక్కిన సంకెలల్ సతుల చేష్టలు

కనుపర్తి. కవిరాజ. I-134

ప్రాణహానిఁ దలఁపరు పాపమనుచు
నెంచ రపకీర్తియని చూడరిందుముఖులు
వలపు గలచోట నెట్టైనఁ గలయఁ జూతురు

కనుపర్తి. కవిరాజ. II-16

నిరంకుశంబులుగదా జవరాండ్ర తలంపు లెయ్యెడన్

కనుపర్తి. కవిరాజ. IV-50

ఆడుదాని మనసు దెలియంగరాదు పద్మజునకైన

తిమ్మకవి. కుక్కుటేశ్వర. 41

భామల చిత్తవృత్తి తెలియ బ్రహ్మకునైనను గొలందికాదు

అయ్యలరాజు నారాయణా. హంస. I-35

ఉవిదమనసొకతీరు పల్కొకతీరు
చేష్టమతియొక తీరిట్లు చెలఁగు

మనుజుఁ డధముఁడైన ధనహీనుఁడైనఁగు
రూపుఁడైన దుష్టరోగుఁడైనఁ
బిఱికిపందయైన వెలఁదికి నచ్చిన
నతఁడె గురుఁడు మరుఁడు నతఁడె వరుఁడు

పానుగంటి. కోకిల.

అగ్గిచెంతను వెన్న ఎంతతడవాగు
ఆడవారికోపమ్ము అట్టిదేయగును

స్త్రీల రామాయణపు పాటలు.
అం. సా. ప. ప్రచురణ. శ్రీపా. గోపా. సంపా.

వనితలకును సహవాసం
బున మనములు భర్తృసదృశముల యయ్యెడు; నె
ట్లన మధురమయ్యె విషకుజ
మున నల్లినవల్లి మూర్ఛ పుచ్చుటలేదే!

వ. సు. రాయకవి. వేణి. I-10

వలపు నిలుపఁగరాదు కోమలులయందుఁ
బరిభవింతురు వలచినవాని స్త్రీలు
తరుణియే తన్ను వలచినఁదాని వలపు
నడపవలయును లేదేని గడపవలయు

తిరు. వేం. కవులు. మృచ్ఛకటిక. IV-49

ప్రమదలఁగూడి యాడఁగనె వారి మనోగతులెల్లఁ దేట తె
ల్లముగ స్ఫురించెనంచును దలంతురు పామరవారలౌరస
త్యముఁ గనుఁగొన్న నెంత రసికాగ్రణికైనను నారికేళ పా
కముగద కామినీహృదయ కావ్యరస గ్రహణంబు మిత్రమా!

ము. సుబ్బారావు. శ్రీకృష్ణతులాభారము. II-iv-27

తమ హితము తామెఱుంగరు తమ హితంబు
గోరి యొరులాడు పల్కుల చీరిగొనరు
తాము చెప్పిన మాటలే తథ్యమనుచు
పెనఁగెదరు చానలెంతటి వెడఁగులౌర!

నా. కృ. రావు. పైడిలేడి.

స్వాంతము విప్పి చెప్పుదురె చానలు?

తవికెళ్ల లక్ష్మీనారాయణశాస్త్రి. జానకీ శపథము

## స్త్రీహత్య

......పొలఁతిఁ జంపుట పాపము

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. మంద

తగను త్తమ స్త్రీలఁదగిలి వధింప
నగణితంబగు దోషము......

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. యుద్ధ

అఖిల జీవులందు వనితలవధ్యలు

ఎఱ్ఱన. హరి. I-128

స్త్రీలఁ జంపువాడు శిథిలమగును

స్త్రీలఁ జంపువాడు శివశివా నరకంబుఁ జెందునయ్య

స్త్రీలఁ జంపువాని శివుఁడు సైరింపఁడు

వేమన

ఆడువారల వధియింపఁగాదు

జక్కన. విక్రమార్క. VII-166

పాపంబు వచ్చుఁ జంపకు మాడుదాని

వరద. రామా. అయో.

## స్త్రీస్వాతంత్ర్యము

తానే నేర్పరియైనను
మానినిదగు మెలఁకు వెఱిగి మహినేలుఁజుమీ !
దానిని స్వేచ్ఛగ విడిచెడు
హీనుఁడు తానైనఁ దుదకు నేస్చు

ఆడువాండ్ర స్వేచ్ఛ గోడొసర్చు

వేమన

బాల్యమునఁ దల్లిదండ్రులు ప్రాయమునధ
వుండు వార్ధక్యమున నందనుండుఁ జెప్పి
నట్లు చేయంగఁదగుఁగాని యరసిచూడఁ
దెఱవలకు నెంతుఁ దమయిచ్ఛఁ దిరుగఁజనదు

పిల్ల. పిన. జైమి. III-37

## స్థానబలము

బలియునింట బానిసనైనఁ బఱపవెఱతురు

ఎఱ్ఱన, నృ. పు. III-47

తమతమ నెలవులు దప్పిన
దమమిత్రులె శత్రులౌట తథ్యము

అనువు గానిచోట నధికుల మనరాదు
కొంచెముండుటెల్లఁ గొదువగాదు
కొండ యద్దమందుఁ గొంచెమై యుండదా

నీళ్లలోన నోడ నిగిడి తిన్నగఁ బ్రాకు
బైట మూరెడయిన బ్రాకలేదు
నెలవుదప్పుచోట నేర్పరి కొఱగాదు

వేమ.

నీళ్లలోన మొసలి నిగిడి యేనుఁగుఁబట్టు
బైట కుక్కచేత భంగపడును
స్థానబలముగాని తనబలము గాదయా

వేమన

......భావించి చూడంగనె
య్యేడలన్ స్థానగుణం బునం గలుగవే యేమేనియుం జిత్రముల్

మారన. కా. V-132

స్థానంబు సకల ఫలసం
ధానం బొనరించుఁ బతికిఁ దగనజకంఠ

స్థానస్తనమిదునె యథా
స్థానస్తనభంగి మధురతర దుగ్ధంబుల్

భైరవరాజు. పంచ. III-16

## స్వధర్మము

స్వీయకులాచారముల మాని పరమతంబులను గొనకు

అ. నా. రామ. జానకి.

ఒప్పుకున్నను నిజధర్మ ముత్తమమగు
రక్తుఁడై చేయు నన్యధర్మంబుకంటె

తనికెళ్ళ ప్రకాశశాస్త్రి. వేదాంతసిద్ధాంత ప్రకాశము

స్వధర్మ మాచరించెడి తఱిన్ జావైన శ్రేష్ఠము
అన్యధర్మంబు మంచిదై తోఁచియున్ భీకరంబెయా

చ. గ. శాస్త్రి. గీత.

## స్వపరవిషయములు

తనకార్య మొరుమతంబున
నొనరింపఁగ నేరనగునె యొరుని మతంబుం
దన మతము నొకఁడుగానోపునె?

నన్నయ. భారత. సభా II-149

తన భుజశక్తియున్ రిపులదర్పము నేర్పడఁ జూచిచూచి యె
ట్లును దెగకున్నఁ బోకయది లోకము చక్కటి

తిక్కన. భారత. విరాట. IV-61

ఎదిరిందమ యట్టులకా
మదిఁ దలఁచినఁ బొసఁగుఁగాక మాకుంగుమిం
డిదె మీరు వ్రక్క గొనుఁడని

చదురడఁచిన మనసు పొందు చక్కంబగునే?

తిక్కన. భారత. ఉద్యో. I-312

......ఎదిరికిన్నడఁచు వాఁడు
దనకుఁ దగరంబు చఱచు నెంతటి భరంబు

నాచన సోమన. ఉ. హ. వం. V-184

చేతి పదార్థము దలఁచక చేరువనుండిన వారల
చేతిపదార్థము దలఁచఁగఁ జేతికిలోనౌనా?

అన్నమయ్య. అధ్యా. సం.

ఒకరి జెఱుతుమనుచు నుల్లమందెంతురు
తమకు గలుగు చేటుఁ దామెఱుఁగక

తనకు గలుగు పెక్కుతప్పు లటుండగా
బరుల నేరుచుందు నరుడు

వేమన

విను చెట్టుగొట్టి పయివేసుకోరాదు
తనసత్వ మెదురు సత్వముఁ గనవలయు

గోగులపాటి కూర్మనాథకవి. మృత్యుంజయ విలాసము. I-33

పరసుఖమ్ములోన నరుసుఖమున్నది
పరుని బాధలోన నరునిబాధ
కాన నరుఁడు తనసుఖమె కోరెడియైనను
బరులసుఖమె సేయవలయు నెపుడు

పానుగంటి. బుద్ధ.

అన్యులధనములు తనకంటె నంచునెంచి
యితరులను దిట్టి తన్ను శ్లాఘించుకొనుట

కంటెమనుజుఁడు తనకంటె ఘనుల నుతులో
నచ్చి తను దిద్దుకొనుటయె న్యాయమగును

పానుగంటి. మాలతీమా.

నరునకు స్వకీయ దోషము
గుఱిగింజ విధంబుగానె గోచరమగుఁగా
పరుఁ డొనరించిన దోషము
ధరాధరము వోలెఁదోఁచుఁ దనమదికి

వి.ర్క. దే. వ.

## స్వప్నము

స్వప్నమనగ జీవసంకటంబు

వేమన

చూడఁ బర్యాయమున శుభాశుభములైన
స్వప్నములు రాకయుండవు జనులకెల్ల

వ. ను. రాయకవి. వేణీసంహారము. II-20

కలలకు ఫలములు గలవే?
తలఁపమరీచికలజలము తథ్యంబగునే?

కోలాచలం. శిలాదిత్య నాటకము. II-iv-28

స్వర్గసౌఖ్యమ్ము నిరయ నిసర్గబాధ
స్వప్నమానీదు గర్భాన సంభవించు

దువ్వూరి. వనకుమారి. V-24

## స్వభావములు

అహిశిరంబున మణికడనమరు విషము
ధనముగలచోటనే వివాదంబు దనరు

దివియ దిగువనె చీఁకటి గవిసియుండు
పగలునకు నంటియే రేయి పరఁగుచుండు
ఇహసుఖంబు తుదినె దుఃఖమొసఁగు నెపుడు
భోగమునకుఁ దర్వాతనే రోగముండు
యౌవనానంతరమె జరయలవడెడిని
జనన సహితంబ మరణంబు జంతుతతికి

విక్ర. దే. వ.

## స్వయంకృతాపరాధము

తన తనయ ప్రసవవేదన కోర్వలేకుంటే
అనయమునల్లునిపై అహంకార పడనేల ?
ఏజన్మమున పాత్రమెత్తఁగి దానంబీక
పూజించమఱచి వేల్పులనాడుకోనేల ?

త్యాగరాజ

తానె చిచ్చు దగిల్చి దరికొన్న పిదప
దాని నోర్వఁగలేక దైన్యమొందినను
అవనిలో నన్యులకాడఁ ఒట్టగును

సోమన. ద్విప. భారత. స్త్రీ

ఎల్లవారికి శకునంబు లెల్లఁ బలికి
బల్లి తాఁబోయి తొట్టెలోఁ బడినరీతి
నౌకరి ననసేల తాఁజేసికొనిన పనికి
వెనుకఁ జింతించుటెల్లను వెఱ్ఱితనము

ముద్దుపళని. రాధికా. III-46

చేఁజేతఁ దెచ్చికొన్నట్టి యొదరు
ననుభవింపక తప్పునేమనుజులకును

వేం. పా. కవులు. కావ్యకుసుమావళి.

## స్వవిషయము

తమ లావుకొలఁది తామె తెలియవలెఁ
గాక యూరక తివురనేల ?

అ. మొల్ల. రామా. బా. కాం. 75

తనయూన మొకనితోఁ దలపోయవలదు

తిమ్మయ ద్విప. భారత. ఆది.

తన విషయమునెంచ నొరులె తగు వారుసుమీ

చిలకమర్తి. ప్రసన్నయాదవము. I-4

......ఎవ్వం డొనరించెడుచేఁత వాని కొప్పుగఁదోచున్
పనులన్ని యెంతబాగుగ
నొనరించిన వానియందు నోగె యగపడున్

విక్ర. దే. ప.

ఎట్టినేర్పులు గలిగిన దిట్టయైనఁ
బరులకును బుద్ధులను జెప్పవచ్చుఁగాని
యాత్మకై నప్పు డాబుద్ధు లడుగువట్టు

తిరు. వేం. కవులు. V-55

## స్వార్థపరత్వము

తనకై కాదే మది నె
ల్లను గోరుట వినుము దాఁ బ్రబలయమొందెన యే

నిని వారని యుద్యోగం
బునకు ఫలంబేమి

తిక్కన. భారత. శల్య. I-58

తన కలిమి యింద్రభోగము

బద్దెన. సుమతి. 52

ఆపదవచ్చిన యప్పుడే మున్ను
దాఁచిన ధనమిచ్చి తగుఁ బత్నిఁ గావఁ
జనుఁ బత్నినైనను జట్టిగానమ్మి
తనకు వచ్చినబారిఁ దప్పింపవలయు

గౌరన. హరిశ్చంద్ర

తన సంరక్షణ కొఱకై
మనమున గార్యంబుబూని మనుజుల జెఱుపం
దినదినము గడచుచుండెడి
మనుజాధముడే యసురుడు

వేమన

స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ గరుణాసంగంబు సాలించి య
న్యప్రాణంబులచేత రక్షణముసేయన్ వాడధోలోకదుః
ఖప్రాప్తుండగు

పోతన. భాగ. I-123

......తనకుఁ గల్యాణముగా
భావించి పరులనొంచినఁ
బోవునె తత్ఫలము పిదపఁ బొందకయున్నే

పోతన. భాగ. X-33

తన సౌఖ్యము దానెఱుఁగక యొరులకు
తగుబోధన సుఖమా ?

త్యాగరాజు

తండ్రినిపస్తుంచి తాదిన్నదుర్మతి
యాకొన్న యతిథులకన్న మిడునె

వేంకటకవి. మదనగోపాలశతకము. 10

స్వార్థపరులకుం గడ్డిదికూడిదియటంచు గనరాదుసుమీ

దా. శ్రీ. దేవీభాగ. VII-147

దేహసౌఖ్యమే పరమావధిగ గణించు
జాతిగల దేశమందుఁ బాచకులు తొత్తు
లనృతవాదులు తుచ్ఛశాస్త్రార్థవిదులు
కర్మశాలలు నభివృద్ధిగాంచు...

పానుగంటి. పద్మిని

తమదుపని దీరఁజాలును దమకు; పరమ
హా ర్థినైనను జింత యావంత లేదు
తనగుడిసె ప్రాఁత తాటాకు దునియకున్న
గ్రామమంతయుఁ గాలిన నేమితనకు !

పానుగంటి. విజయరాఘ.

## స్వేచ్ఛ

అడవిలో మృగజాతినైనాఁ గావచ్చుఁగాక
వడిని తరులఁ గొలువఁగ వచ్చునా ?
ఉడివోని పక్షినై యుండనైనా వచ్చుఁగాక
విడువ కెవ్వరినైనా వేఁడవచ్చునా ?

పసరమై వెదలేని పాటుపడవచ్చుఁగాక
కసివో నోరులఁ బొగడఁగా వచ్చునా ?
ఉసురుమానై పుట్టి యుండనైన వచ్చుఁగాక
విడువక వీరివారి వేసరించవచ్చునా ?

అన్నమయ్య. అధ్యా. సం.

పిన్నవాండ్ర స్వేచ్ఛ మన్నన జెఱచును

వేమన

# హింస

ఎఱుక గలఁడేని మతిశక్తుఁడేని నన్యు
లన్యులకు హింస గావించునపుడ దానిఁ
బూని వారింపకున్న నప్పురుషుఁడేగు
హింససేసిన వారలయేఁగుగతికి

నన్నయ. భారత. ఆది. VII-145

ప్రాణులఁ జంపఁ బాపంబురాదె ?

గోన బుద్ధారెడ్డి. రంగ. రామా. అర.

చనునె యొక్కరునికై చంప పల్వురను

గోనబుద్ధారెడ్డి. రంగ. రామా, యుద్ధ.

కలుగు నవశ్యమున్ సకల కర్మములందును హింస

హింస సేయనివాఁడు లేఁడిజ్జగమున

ఎఱ్ఱన. భారత. అరణ్య. V-58, 60

హింసదలప సద్ధర్మంబే ?

భాస్కరుఁడు. భా రా. అరణ్య. I-54

హింస చేయరాదు

వేమన

యశము సిరియు ధర్మమాయువు భద్రంబు
నార్య హింససేయనడఁగుఁ గాదె

పోతన. భాగ. X-171

జృంభణమున నెవఁడు దంభార్థమై పశు
వులనుజంపి జన్నములను జేయు
వానిఁబట్టి యమునివారలు గోయుచు
నుందు రెపుడు మిగుల సందడిలుచు

ఎనయదొడ్డిలోన నిండ్లలోనైనను
బశుపతంగ హరిణ పంక్తినెల్లఁ
బట్టి హింససేయు పాపాత్మువిమవహ్ని
ధూమశిఖల ద్రొబ్బుదురు

గంగన. భాగ. V-153, 139

సాధు జనుల సంకట పెట్టేటి
వాఁడు పాతకీ బ్రహ్మఘాతకీ

రామదాసు చరిత్ర

ఎట్టివారికైన హింసకుఁ దొలఁగ
నెట్టనవశమానె! నిజబుద్ధి చూడ
కాయలఁ బండ్లను గమలంబులందు
మాయఁగాలేవె సూక్ష్మంపు జంతువులు?
ప్రాణికిఁ బ్రాణియే భక్షంబుగాఁగ
నేణాంకకుల విధియింపఁడే బ్రహ్మ?

మునుకొనియట కందమూలాదులకును
మునులు సేయరె హింస పుడమిలోపలను ?

...... పరహింసచేసి యాగములు
బలువడి నొనరింపఁ బాపంబులగునె ?

సోమన. ద్విప. భారత. శాంతి.

హింసాపరుండు మోక్షార్హుఁడగునె ?

భవానీశకవి. ధర్మ. VI-344

హింస చేసినవాడె హింసతాఁబొందు

పాతపాటలు. టి. కా మే. రావు. (సంపా)

నవ్వులకునైనను దగ
దెవ్వరికిని నొప్పినించుకేనియుఁ జేయన్.

కం. వీ. లిం. శుద్ధా. భార. సంగ్ర. III-48

అజ్ఞతను దెచ్చుకొన్న దొంగమ్మవారి
చలువకై నోరులేని యాజంబు చెవిని
జనుఁడు కోయుట సత్యదృష్టిని గనంగఁ
దనదుగొంతుకఁ దాఁగోసి కొనుటగాదె ?

పానుగంటి. బుద్ధ.

ప్రాణిజీవంబు దీయుట యతిసుకరము
జీవమొసఁగుట యేరికిఁజేతకాదు
జీవదుఁడు తదీశుఁడు వాసుదేవుఁడొకఁడ
కాన దానిని హరియింపఁ బూనఁజనదు

విక్ర. దే. వ.

## హింసాపరుఁడు :-

తొలఁగును హింసాపరులకు దుఃఖప్రాప్తుల్

నన్నయ. భారత. ఆది. IV–271

అతిక్రూర కర్మములం దుద్యతులైన వారికి
నశర్మప్రాప్తి గాకుండునే

నన్నయ. భారత. ఆది. VII–136

## హితోపదేశము :-

పాలుగలవారి నెమ్మోయిఁ బాపనగును

నన్నెచోడ. కు. సం. X. 82

ఎదిరికి హితమును బ్రియమును
మదికింపునుగాఁగఁ బలుకుమాటలు పెక్కై
యొదవినను లెస్సయటుగా
కిదియది యనకూరకునికి యొంతయు నొప్పున్

తిక్కన. భారత. ఉద్యో. II–59

చాలఁగాలంబు వోవక చతురులైన
వృద్ధజనముల బుద్ధులు విందుగాక
ముదియ మతిదప్పి నోరికి నొదవినట్లు
పలుకు వెడఁగుల మాటలు పాటియగునె

తిక్కన. భారత. ఉద్యో. IV-243

మతిమంతులైన వారికి
హితులగు వెరవుగలవార లెటిఁగింతురు దు

స్థితి రాకుండఁగఁ గార్యము
గతి యొత్తియుఁ దప్పలిడియుఁ గడవఁబలికియున్

తిక్కన. భారత. శాన్తి. I.79

లోభం బాప్పదేనియు నతివ్యయశీలత్వంబు మేలె

మంచెన. కే. బా. చ. III-146

అయాచితోప పన్నంబయిన హితంబు
పరిహరింపంబని లేదు.

శ్రీనాథ. శృం. నై. II-8

ఆడకు మసత్యభాషలు
కూడకు కొఱగానివానిఁ గొంకక యొరులె
గ్గాడిన నెదురుత్తరమీఁ
జూడకు విని విననివాని చొప్పునఁ జనుమీ

అనంత. భోజరాజీయము. VI-317

సోదిచెప్పరాదు సూక్ష్మమెఱిఁగి

సంతకూటమందు వింతలు చూడకు

తనదు నృపతితోడఁ దనయాయుధముతోడ
నగ్నితోడ బరుని యాలితోడ
హాస్యమాడు టెల్లనగును బ్రాణాంతమ్ము

వేమన

......దాదవుల కార్యంబు
కనుఁగొనవలయు......

సోమన. ద్విప. భారత. శాంతి.

ఆత్మరక్షాపరుండవై యనుదినంబు
నప్రమత్తుఁడవై యుండు

శ్రీధరమల్లె. బ్రహ్మోత్తర. VI-93

జరయు మృతియులేని జనుసట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్యఁగూర్పఁ దలఁపవలయు
ధర్మమాచరింపఁదగు మృత్యుచేఁ దల
వట్టి యీడ్వఁబడిన వాఁడుబోలె

చిన్నయ్యసూరి నీతిచంద్రిక

# కావ్యములు – కవులు

| కావ్యము | కవి |
|---|---|
| అంబరీషోపాఖ్యానము | ఆదిభట్ల నారాయణదాసు |
| అచ్చ తెలుఁగు రామాయణము | కూచిమంచి తిమ్మన |
| అజవిలాపము | చ. గణపతిశాస్త్రి |
| అధ్యాత్మ సంకీర్తనము | తాళ్ళపాక అన్నమయ్య |
| అనర్ఘరాఘవము | బిజ్జుల తిమ్మభూపాలుఁడు |
| అనిరుద్ధ చరిత్ర | కనుపర్తి అబ్బయామాత్యుఁడు |
| అనుభవసారము | పాల్కురికి సోమన |
| అప్పకవీయము | అప్పకవి |
| అభిజ్ఞాన శాకుంతలము | కందుకూరి వీరేశలింగము |
| అభిజ్ఞాన శాకుంతలము | కాంచనపల్లి కనకమ్మ |
| అమరశ్రీ | కొమరవోలు వేంకటసుబ్బారావు |
| అమృతానందము | శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి |
| అమృతసారము | వేంకట పార్వతీశ్వరకవులు |
| ఆంధ్రభాషాభూషణము | కేతన |
| ఆత్మగౌరవము | అన్నంభట్టు |
| ఆత్మారామ శతకము | తిమ్మరాజు పేరకవి |
| ఆనందసారము | కాంచనపల్లి కనకమ్మ |
| ఆనందకాననమాహాత్మ్యము | లింగంకుంట రామకవి |
| ఆముక్తమాల్యద | శ్రీకృష్ణదేవరాయలు |
| ఆముదపు చెట్టు | నాళం కృష్ణారావు |

| కావ్యము | కవి |
|---|---|
| ఆర్యవాణి | నారు నాగనార్యకవి |
| ఉచ్ఛల విషాదము | సూరవరం ప్రతాపరెడ్డి |
| ఉత్తర రామాయణము | కంకంటి పాపరాజు |
| ఉత్తర రామచరిత్ర | వావిలాల వాసుదేవశాస్త్రి |
| ఉత్తర హరివంశము | నాచన సోముఁడు |
| ఉద్భటారాధ్య చరిత్ర | తెనాలి రామకృష్ణుఁడు |
| ఉపనిషదనువాదము | పరవస్తు వేంకటరంగాచార్యులు |
| ఉషాభ్యుదయము | పూసపాటి వేంకటపతి |
| ఉషానాటకము | వేదము వేంకటరాయశాస్త్రి |
| ఎంకి పాటలు | నండూరి సుబ్బారావు |
| ఏకావళీ పరిణయము | శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి |
| ఏగంటి వారి వచనాలు | గార్లపాటి లక్ష్మయ్య |
| కనకగిరి | శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి |
| కళ్యాణరాఘవము | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| కవికర్ణసాయనము | సంకుసాల నృసింహకవి |
| కవిచౌడప్ప శతకము | కుందవరపు కవిచౌడప్ప |
| కవిజనరంజనము | అడిదము సూరకవి |
| కవిరాజ మనోరంజనము | కనుపర్తి అబ్బయామాత్యుఁడు |
| కాటమరాజుకథ | పిన వెల్లయ |
| కాలజ్ఞాన తత్త్వాలు | పోతులూరి వీరబ్రహ్మము |
| కావ్యకుసుమావళి | వేంకట పార్వతీశ్వరకవులు |
| కావ్యాలంకార సంగ్రహము | భట్టుమూర్తి |
| కావ్యాలంకార చూడామణి | విన్నకోట పెద్దన |
| కాశీఖండము | శ్రీనాథుఁడు |

| కావ్యము | కవి |
|---|---|
| కాళహస్తీశ్వర శతకము | ధూర్జటి |
| కాళిందీ పరిణయము | అహోబలపతి |
| కుంభరాణా | దువ్వూరి రామిరెడ్డి |
| కుక్కుటేశ్వర శతకము | కూచిమంచి తిమ్మకవి |
| కుచేలోపాఖ్యానము | గట్టుప్రభువు |
| కుబ్జాకృష్ణ విలాసము | అక్కెనప్రగ్గడ హరిదాసు |
| కుమార సంభవము | నన్నెచోడుఁడు |
| కుమారీ శతకము | వేంకట నరసింహకవి |
| కువలయము | చిననారాయణ |
| కుశలవయుద్ధము | సంపాదకులు. శ్రీపాద గోపాల కృష్ణమూర్తి |
| కృషీవలుడు | దువ్వూరి రామిరెడ్డి |
| కృష్ణరాయ విజయము | కుమార ధూర్జటి |
| కృష్ణశతకము | కృష్ణదాసు |
| కృష్ణశతకము | నృసింహకవి |
| కృష్ణార్జున సంవాదము | నాదెండ్ల గోపనమంత్రి |
| కేయూరబాహుచరిత్ర | మంచన |
| కోకిల | పానుగంటి లక్ష్మీనరసింహరావు |
| కోదండరామ శతకము | చట్రాతి లక్ష్మీనరుసు |
| క్షేత్రయపదములు | క్షేత్రయ |
| గంగావివాహము | పసగాడ సన్యాసి |
| గజేంద్రమోక్షము | ఆదిభట్ల నారాయణదాసు |
| గయోపాఖ్యానము | చిలకమర్తి లక్ష్మీనరసింహము |

| కావ్యము | కవి |
|---|---|
| గయోపాఖ్యానము | ధేనువకొండ వెంకయ్య |
| గరుడాచలము (జంగంకథ) | దినవహి అహోబలకవి |
| గీతామృత | సదానంద |
| గీరతము | తిరుపతి వేంకటకవులు |
| గుంటూరు సీమ | తిరుపతి వేంకటకవులు |
| గురుదీక్షాబోధ | పిడుపర్తి బసవన |
| గువ్వలచెన్న శతకము | పట్టాభిరామకవి |
| గ్రాంథాలయ సూక్తులు | నాళం కృష్ణారావు |
| చంద్రభానుచరిత్ర | తరిగొప్పుల మల్లన |
| చంపురామాయణము | జయంతి రామయ |
| చాటువు | పుష్పగిరి తిమ్మన |
| చాటుపద్యమణిమంజరి | (సేకరణ) వేటూరి ప్రభాకరశాస్త్రి |
| చాటువు | వత్సవాయి నీలాద్రిరాజు |
| చింతామణి | కాళ్ళకూరి నారాయణరావు |
| చిత్రకాథాసుధాలహరి | వేంకట పార్వతీశ్వరకవులు |
| చిత్రనళీయము | ధర్మవరపు కృష్ణమాచార్యులు |
| చిత్రభారతము | చరిగొండ ధర్మన్న |
| చిత్రహరిశ్చంద్రీయము | సెట్టెల లక్ష్మీనరసింహాము |
| చిత్రాభ్యుదయము | కాళ్ళకూరి నారాయణరావు |
| చిత్రవతీ పరిణయము | కుప్పిలి సీతారామకవి |
| చిరుతవజీరు శతకము | పూసపాటి వీరరాజు |
| చూడామణి | పానుగంటి లక్ష్మీనరసింహరావు |
| జగద్గురువు | కుమారి సుందరి |

| కావ్యము | కవి |
|---|---|
| జగన్నాథ రథోత్సవ విలాసము | తనికెళ్ళ ప్రకాశశాస్త్రి |
| జగన్నాయక శతకము | వరహాగిరి కొండ్రాజు |
| జానకీ శతకము | నారాయణదాసు |
| జానకీశపథము | నారాయణదాసు |
| జానకీశపథము | తనికెళ్ళ లక్ష్మీనారాయణశాస్త్రి |
| జాహ్నవీ మాహాత్మ్యము | ఏనుఁగు లక్ష్మణకవి |
| జీవనయాత్ర | కాంచనపల్లి కనకమ్మ |
| జైమిని భారతము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు |
| జ్ఞానబోధ | రంగావధూత |
| తపతీ సంవరణోపాఖ్యానము | అద్దంకి గంగాధరకవి |
| తారాశశాంకము | కొప్పరపు సుబ్బారావు |
| తెలుఁగు జానపదసాహిత్యము | |
| తేనెచినుకులు | నాళం కృష్ణారావు |
| త్యాగరాజ కీర్తనలు | త్యాగరాజు |
| త్రివేణి | (ప్రకటన) ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడమీ |
| దక్షిణగోగ్రహణము | కందుకూరి వీరేశలింగము |
| దత్తాత్రేయ శతకము | పరమానందయతి |
| దమ్మపదము | గణపతిశాస్త్రి |

| కావ్యము | కవి |
|---|---|
| దశమగ్రహము | చాటువు |
| దశకుమార చరిత్ర | కేతన |
| దశావతార చరిత్ర | ధరణిదేవుల రామయమంత్రి |
| దాశరథీ శతకము | కంచర్ల గోపన్నకవి |
| దివ్యనామ సంకీర్తనము | త్యాగరాజు |
| దూతాంగదము | చర్లి నారాయణశాస్త్రి |
| దేవీభాగవతము | త్రిపురాని తిమ్మయ్యదొర |
| దేశింగురాజుకథ | జంగం సుబ్బయ్య |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | కోలాచలము శ్రీనివాసరావు |
| ద్విపద భారతము | సోమన |
| ద్విపద భారతము | తిమ్మయ |
| ద్విపద భారతము | సింగన |
| ద్విపద భారతము | బాలసరస్వతి |
| ద్విపదనలచరిత్ర | భక్తపురి రాఘవాచార్యులు |
| ధర్మబోధ | భవానీశకవి |
| నయనోల్లాసము | చేమకూర వేంకటకవి |
| నరకాసుర విజయ వ్యాయోగము | కొక్కొండ వేంకటరత్నము |
| నరసభూపాలీయము | మూర్తికవి |
| నరసింహ విలాసము | వడ్డాది సుబ్బరాయకవి |
| నర్మదాపురు కుత్సీయము | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| నలజారమ్మ | రామిరెడ్డి |
| నవకుసుమాంజలి | జనమంచి వేంకటరామయ్య |
| నవచోళ | పోలిసెట్టి లింగకవి |

| కావ్యము | కవి |
|---|---|
| నవనాథ చరిత్ర | గౌరన |
| నానారాజ సందర్శనము | తిరుపతి వేంకటకవులు |
| నాయిల్లు | నాళం కృష్ణారావు |
| నారాయణ శతకము | బమ్మెర పోతన |
| నాసికేతోపాఖ్యానము | దుగ్గుపల్లి దుగ్గన |
| నిరంకుశోపాఖ్యానము | రుద్రకవి |
| నిర్వచన సుందరకాండము | తిరుమల వింజమూరు పార్థసారథి అయ్యంగారు |
| నిర్వచనోత్తర రామాయణము | తిక్కన సోమయాజి |
| నిశ్శంక వంశము | తనికెళ్ళ ప్రకాశశాస్త్రి |
| నీతిచంద్రిక | పరవస్తు చిన్నయసూరి |
| నీతికథామంజరి | కందుకూరి వీరేశలింగము |
| నీతిదీపిక | కందుకూరి వీరేశలింగము |
| నీతితారావళి | కంచనామాత్యుఁడు |
| నీతిభూషణము | అభినవభోజుఁడు |
| నీతిసారము | ప్రతాపరుద్రుఁడు |
| నీలాసుందరీ పరిణయము | కూచిమంచి తిమ్మకవి |
| నూటుగంటి | ఆదిభట్ల నారాయణదాసు |
| నృసింహ పురాణము | ఎఱ్ఱాప్రగడ |
| నైషధీయచరిత్ర | శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి |
| పంక్తిరథోపాఖ్యానము | క్రాలేటి లక్ష్మీనరసింహకవి |
| పంచతంత్రము | బైచరాజు వెంకటకవి |

| కావ్యము | కవి |
|---|---|
| పంచతంత్రము | దూబగుంట నారాయణకవి |
| పంచతంత్రము | భానుకవి |
| పంచవటి | మాధవపెద్ది బుచ్చిసుందరరామ శాస్త్రి |
| పండితరాజము | తిరుపతి వేంకటకవులు |
| పద్మిని | పానుగంటి లక్ష్మీనృసింహారావు |
| పద్మపురాణము | మడికి సింగన |
| పద్మవ్యూహము | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| పరకీయ | క్షేత్రము |
| పరమయోగి విలాసము | తాళ్ళపాక తిరుమలయ్య |
| పరమయోగి విలాసము | సిద్ధరాజు తిమ్మరాజు |
| పరతత్త్వరసాయనము | ఈశ్వర ఫణిభట్టు |
| పర్వతపురాణము | నాగలూటి సేవనారాధ్యులు |
| పల్నాటిచరిత్ర | శ్రీనాథుఁడు |
| పల్లెపదాలు | (సేకరణ) శ్రీపాద గోపాలకృష్ణ మూర్తి |
| పాంచాలీ పరిణయము | కాకుమాని మూర్తికవి |
| పాండవ జననము | తిరుపతి వేంకటకవులు |
| పాండవ ప్రవాసము | ,, |
| పాండవోద్యోగము | ,, |
| పాండవ విజయము | ,, |
| పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణుఁడు |
| పాతపాటలు | (కూర్పు) ఉత్కుమళ్ళ కామేశ్వరరావు |

| కావ్యము | కవి |
|---|---|
| పాదప్రకరణము | పాల్కురికి సోమన |
| పాదుకాపట్టాభిషేకము | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| పానశాల | దువ్వూరి రామిరెడ్డి |
| పారిజాతాపహరణము | నంది తిమ్మన |
| పూజ్యుఁడు | శుద్ధానంద యోగి |
| పూతనాహరణము | విజయరాఘవుఁడు |
| పురుషార్థసారము | శివదేవయ్య |
| పూర్వకవిచాటువు | |
| పూర్ణిమ | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| పెమ్మయసింగధీమణి శతకము | పేరంరాజు జక్కన |
| ప్రతాపరుద్రీయము | వేదము వేంకటరాయశాస్త్రి |
| ప్రతాపాగ్బరీయము | కోలాచలం శ్రీనివాసరావు |
| ప్రతిమానాటకము | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | పింగళి సూరన |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | తిరుపతి వేంకటకవులు |
| ప్రభాస శాపవిమోచనము | సెట్టి లక్ష్మీనరసింహము |
| ప్రభులింగ శతకము | పిడుపర్తి సోమన |
| ప్రభులింగలీల | పిడుపర్తి సోమన |
| ప్రబోధచంద్రోదయము | కందుకూరి వీరేశలింగము |
| ప్రశ్నోత్తర మణిమాల | |
| ప్రసన్న యాదవము | చిలకమర్తి లక్ష్మీనరసింహము |
| ప్రహ్లాద భక్తవిజయము | త్యాగరాజు |

| కావ్యము | కవి |
|---|---|
| ప్రాక్పురరాజకుమారా | |
| భ్యుదయము | తనికెళ్ళ ప్రకాశశాస్త్రి |
| ప్రాచీనచాటువు | |
| బసవపురాణము | సోమన |
| బాలనీతిశతకము | శేషాద్రి రమణకవులు |
| బుద్ధచరిత్ర | తిరుపతి వేంకటకవులు |
| బుద్ధచరిత్ర | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| బృందావనము | వేంకట పార్వతీశకవులు |
| బొబ్బిలి నాటకము | శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి |
| బొబ్బిలిరాజు లండను | ,, |
| యాత్రా చరిత్ర | తనికెళ్ళ ప్రకాశశాస్త్రి |
| బ్రహ్మోత్తరఖండము | శ్రీధరమల్లె వేంకటరామకవి |
| బ్రూసు-సాలీడు | నాళం కృష్ణారావు |
| భక్తచింతామణి | వడ్డాది సుబ్బారాయకవి |
| భక్తిరసామృతము | పూర్వకవి |
| భగవద్గీత | మాధవమంత్రి |
| భగవద్గీత | సెట్టిలక్ష్మీనరసింహము |
| భద్రాపరిణయము | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి |
| భర్తృహరినిర్వేదము | చర్ల నారాయణశాస్త్రి |
| భల్లాణచరిత్ర | వీరన్న |
| భాగవతము | బమ్మెర పోతన |
| భాగవతము | సింగయ |

| కావ్యము | కవి |
|---|---|
| భాగవతము | గంగన |
| భాగవతము | నారయ |
| భారతము | నన్నయ |
| భారతము | తిక్కన |
| భారతము | ఎఱ్ఱన |
| భారతము | అథర్వణాచార్యులు |
| భల్లాణచరిత్ర | వీరన్న |
| భావలింగ శతకము | |
| భావసంకీర్తనము | వేంకట పార్వతీశ్వరకవులు |
| భాస్కర రామాయణము | కుమార రుద్ర దేవుఁడు |
| భాస్కర రామాయణము | అయ్యలార్యుఁడు |
| భాస్కర రామాయణము | మల్లికార్జునుఁడు |
| భాస్కర శతకము | మారన వెంకయ |
| భీమకవిచాటువు | వేములవాడ భీమకవి |
| భీమఖండము | శ్రీనాథుఁడు |
| భీష్మచరిత్ర | నారాయణదాసు |
| భోజరాజీయము | అనంతామాత్యుడు |
| భోజసుతాపరిణయము | కోటీశ్వరకవి |
| మత్స్య పురాణము | హరిభట్టు |
| మదన విజయము | రావిపాటి త్రిపురాంతకుఁడు |
| మదనగోపాల శతకము | వేంకటకవి |
| మధ్యమవ్యాయోగము | చిలకమర్తి లక్ష్మీనరసింహము |
| మధుసేవ | కాళ్ళకూరి నారాయణరావు |
| మనుచరిత్ర | అల్లసాని పెద్దన |

| కావ్యము | కవి |
|---|---|
| మన్నారు కృష్ణశతకము | పైడిపాటి వేంకటనరసింహకవి |
| మార్కండేయపురాణము | మారన |
| మార్కండేయపురాణము | హరిభట్టు |
| మార్కండేయపురాణాను వాదము | మండచిట్టి రామశాస్త్రి |
| మార్కండేయ | ఆదిభట్ల నారాయణదాసు |
| మాలతీమాధవము | పానుగంటి లక్ష్మీనరసింహము |
| మల్లభూపాలీయము | ఎలకూచి బాలసరస్వతి |
| మల్లెలరామలింగశతకము | మగ్గిసెట్టి పులియప్పశెడు |
| మాఘమాహాత్మ్యము | పెద్దయకవి |
| ముకుంద మానసము | కాణాద పెద్దనసోమయాజి |
| ముత్యాలసరాలు | గురజాడ అప్పారావు |
| మృచ్ఛకటికము | తిరుపతి వేంకటకవులు |
| మృత్యుంజయ విలాసము | గోగులపాటి కూర్మనాథకవి |
| మైరావణచరిత్ర | మాడయకవి |
| మైసూరురాజ్యము | శ్రీనివాసరావు |
| మొదలి మాతృశతకము | మాతకుర్తి అప్పారావు |
| మొయిలు రాయబారము | చర్ల గణపతిశాస్త్రి |
| మొల్ల రామాయణము | ఆతుకూరి మొల్ల |
| యథార్థ రామాయణము | అదిభట్ల నారాయణదాసు |
| యయాతిచరిత్ర | పొన్నిగంటి తెలగన్న |
| యాజ్ఞవల్క్య చరిత్ర | శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి |

| కావ్యము | కవి |
|---|---|
| యాదవరాఘవ పాండవీయము | వీరరాఘవకవి |
| రంగనాథరామాయణము | గోన బుద్ధారెడ్డి |
| రఘునాథాభ్యుదయము | విజయరాఘవుఁడు |
| రత్నావళి | కందుకూరి వీరేశలింగము |
| రసికజనమనోరంజనము | కందుకూరి వీరేశలింగము |
| రాఘవపాండవీయము | పింగళి సూరన |
| రాఘవయాదవ పాండవీయము | అయ్యగారి వీరభద్రకవి |
| రాజగోపాల శతకము | యోగానందకవి |
| రాజవాహన విజయము | కాకుమాని మూర్తికవి |
| రాజశేఖర చరిత్ర | మాదయగారి మల్లన |
| రాతిస్తంభము | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| రాధాకృష్ణ | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| రాధికాసాంత్వనము | ముద్దుపళని |
| రామదాసు చరిత్ర | కంచర్ల గోపనకవి |
| రామరాజు చరిత్ర | కోలాచలం శ్రీనివాసరావు |
| రామశతకము | శతానందయోగి |
| రామలింగేశ శతకము | అడిదము సూరకవి |
| రామాయణము | చింతలపూడి యెల్లనార్యుఁడు |
| రామాయణము | రామభద్రాంబ |
| రామావధూటితారావళి | మాడభూషి వేంకటాచార్యులు |

| కావ్యము | కవి |
|---|---|
| రామేశ్వరమాహాత్మ్యము | ఏనుఁగు లక్ష్మణకవి |
| రుక్మవతీ పరిణయము | రేకపల్లి సోమప్ప |
| రుక్మాంగద చరిత్ర | ప్రౌఢకవి మల్లన |
| రుక్మిణీ పరిణయము | నారాయణదాసు |
| రుబాయతు | నారాయణదాసు |
| రూపలత | కూచి నరసింహము |
| లంకావిజయము | పిండిప్రోలు లక్ష్మణకవి |
| లక్షణసార సంగ్రహము | కొ. గణపతిదేవ |
| వనకుమారి | దువ్వూరి రామిరెడ్డి |
| వనవాసరాఘవము | పానుగంటి |
| వనవాసి | కూచి నరసింహము |
| వరదరాజరామాయణము | వరదరాజు |
| వరదరాజ శతకము | బాలకృష్ణకవి |
| వరవిక్రయము | కాళ్ళకూరి నారాయణరావు |
| వరాహపురాణము | నంది మల్లయ, ఘంట సింగయ |
| వసంతసేన | కొప్పరపు సుబ్బారావు |
| వసుచరిత్ర | రామరాజ భూషణుఁడు |
| వారకాంత | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి |
| వాల్మీకి చరిత్ర | రఘునాథరాయలు |
| వసిష్ట రామాయణము | మడికి సింగన |
| విక్రమదేవవర్మ రచనలు | శ్రీ విక్రమ దేవ వర్మ |
| విక్రమ సేనము | చిమ్మపూడి అమరేశ్వరుఁడు |
| విక్రమార్క చరిత్ర | జక్కన |

| కావ్యము | కవి |
| --- | --- |
| విజయ విలాసము | చేమకూర వేంకటకవి |
| విజయ రాఘవము | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| విజయాశ్వ చరిత్రము | పురాణం పిచ్చయశాస్త్రి |
| విజ్ఞానేశ్వరీయము | కేతన |
| విప్రనారాయణ చరిత్ర | విజయరాఘవుఁడు |
| విప్రనారాయణ చరిత్ర | చదలవాడ మల్లన |
| విప్రనారాయణ చరిత్ర | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| విష్ణు పురాణము | వెన్నెలకంటి సూరన |
| విష్ణుమాయా పురాణము | కంకంటి పాపరాజు |
| విష్ణుమాయా విలాసము | హరోసూరి వెంకటపతి |
| విష్ణు కీర్తనములు | త్యాగరాజ |
| విశ్వకర్మ పురాణము | |
| విష్ణు మాయావిలాసము | రోసనూరి వేంకటపతి |
| వెన్నెల వెలుఁగులు | నాళం కృష్ణారావు |
| వేంకటాచలమాహాత్మ్యము | తరిగొండ వెంకమ్మ |
| వేంకటేశ శతకము | తాళ్ళపాక పెద్దతిరుమలయ్య |
| వేఁటకాడు-రాబందు | నాళం కృష్ణారావు |
| వేణీ సంహారము | వడ్డాది సుబ్బరాయకవి |
| వేదాంత సిద్ధాంత ప్రకాశము | తనికెళ్ళ ప్రకాశశాస్త్రి |
| వేదాంత రసాయనము | మంగళగిరి ఆనందకవి |
| వేమన శతకము | వేమన |
| వేల్పుమాట | నారాయణదాసు |
| వైజయంతీ విలాసము | సారంగు తమ్మయ |

| కావ్యము | కవి |
|---|---|
| వైశ్యపురాణము | భాస్కరాచార్యులు |
| శంకర విజయము | ఆలూరి కుప్పన |
| శకుంతలాపరిణయము | కృష్ణకవి |
| శకుంతలా పరిణయము | పెద్దాడ నాగరాజామాత్యుఁడు |
| శరభాంకలింగ శతకము | శరభాంకుఁడు |
| శశిరేఖా పరిణయము | అప్పకవి |
| శిలాదిత్యనాటకము | కోలాచలం శ్రీనివాసరావు |
| శివజ్ఞాన దీపిక | పెదపాటి సోమయ్య |
| శివయోగ సారము | గణపతిదేవుఁడు |
| శివరాత్రి మాహాత్మ్యము | శ్రీనాథుఁడు |
| శివలీలా మాహాత్మ్యము | నిశ్శంక కొమ్మన |
| శిశుపాలవధము | గోపీనాథము వెంకటకవి |
| శుకసప్తతి | కదిరీపతి |
| శు. భా. సంగ్ర | కందుకూరి వీరేశలింగము |
| శృంగార గాథేయోపాఖ్యానము | రేవూరి అనంత యజ్వ |
| శృంగార నైషధము | శ్రీనాథుఁడు |
| శృంగార మల్హణము | ఎడపాటి ఎఱ్ఱన |
| శృంగార శాకుంతలము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు |
| శృంగార సావిత్రి | రఘునాథ రాయలు |
| శేషధర్మములు | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి |

| కావ్యము | కవి |
|---|---|
| శ్రవణానందము | తిరుపతి వేంకటకవులు |
| శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యము | ధూర్జటి |
| శ్రీకృష్ణ భారతము | శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి |
| శ్రీకృష్ణ తులాభారము | ముత్తరాజు సుబ్బారావు |
| శ్రీకృష్ణరాయభారము | తనికెళ్ళ ప్రకాశశాస్త్రి |
| శ్రీ దేవీ భాగవతము | దాసు శ్రీరాములు |
| శ్రీనివాస కళ్యాణము | శ్రీ విక్రమదేవ వర్మ |
| శ్రీరంగ మాహాత్మ్యము | భైరవకవి |
| శ్రీరంగ మహాత్మ్యము | వరదరాజు |
| శ్రీరామ కర్ణామృతము | చేకూరి సిద్దయ |
| శ్రీరామ స్తవరాజము | ముమ్మడి మల్లన |
| శ్రీ సత్యదేవ విలాసము | వోలేటి పార్వతీశము |
| షట్చక్రవర్తి చరిత్ర | మల్లారెడ్డి |
| షోడశకుమార చరిత్ర | వెన్నెలకంటి అన్నయ |
| సకలనీతి కథాసారము | ఎఱ్ఱన |
| సత్య హరిశ్చంద్రీయము | బలిజేపల్లి లక్ష్మీకాంతకవి |
| సదానందయోగి శతకము | సదానందయోగి |
| సదానంద గీతామాత | సదానందయోగి |
| సమీర కుమార విజయము | పుష్పగిరి తిమ్మన |
| సరస్వతి నారద విలాసము | కందుకూరి వీరేశలింగము |
| సరోజిని | పానుగంటి లక్ష్మీనరసింహారావు |

| కావ్యము | కవి |
|---|---|
| సర్వేశ్వర శతకము | యథావాక్కుల అన్నమయ్య |
| సాంబోపాఖ్యానము | రామరాజు రంగపరాజు |
| సానందోపాఖ్యానము | శివరామకవి |
| సానందోపాఖ్యానము | భద్రలింగకవి |
| సారంగధర చరిత్ర | చేమకూర వేంకటకవి |
| సారంగధర చరిత్ర | తిమ్మరాయ |
| సారంగధర చరిత్ర | పానుగంటి లక్ష్మీనరసింహం |
| సారంగధర చరిత్ర | బాణాల శంభుదాసుడు |
| సావిత్రీ చరిత్ర | నారాయణదాసు |
| సింహాసన ద్వాత్రింశిక | కొఱవి గోపరాజు |
| సిద్ధరామశతకము | సిద్ధరామకవి |
| సీత చెఱ | స్త్రీల రామాయణము |
| సీతారామాంజనేయ సంవాదము | పరశురామ పంతుల లింగమూర్తి |
| సీతావనవాసము | దువ్వూరి రామిరెడ్డి |
| సీతాపతి శతకము | సాహెబురాణ రాయన్న |
| సీమంతినీ కళ్యాణము | సోమనామాత్యుడు |
| స్త్రీల రామాయణపు పాటలు | (సేకరణ) శ్రీపాద గోపాలకృష్ణ మూర్తి |
| సుందరేశ్వర విలాసము | చేయ్యూరు చెంగల్వరామకవి |
| సుకన్య | తిరుపతి వేంకట కవులు |

| కావ్యము | కవి |
|---|---|
| సుఖమంజరీ విలాసము | కోలాచలం శ్రీనివాసరావు |
| సుగ్రీవ విజయము | రుద్రకవి |
| సుదక్షిణా పరిణయము | తెనాలి అన్నయ్య |
| సుభద్రా పరిణయము | జగ్గకవి |
| సుభద్రా పరిణయము | తాళ్ళపాక తిమ్మకవి - |
| సుభాషితములు | ఎలకూచి బాలసరస్వతి |
| సుభాషితము | పుష్పగిరి తిమ్మన |
| సుభాషితము | ఏనుఁగు లక్ష్మణకవి |
| సుమతీశతకము | బద్దెన |
| సుల్తాన చాందు బీబీ | కోలాచలం శ్రీనివాసరావు |
| సెలయేఱు | (సేకరణ) నేదునూరి గంగాధరము |
| సౌభాగ్యవతి చాటువులు | |
| హంస వింశతి | అయ్యలరాజు నారాయణామాత్యుఁడు |
| హరవిలాసము | శ్రీనాథుఁడు |
| హరివంశము | ఎఱ్ఱన |
| హరిశ్చంద్రోపాఖ్యానము | గౌరన |
| హరిశ్చంద్రోపాఖ్యానము | శంకరకవి |
| హైమవతీ పరిణయము | పిసుపాటి చిదంబరశాస్త్రి |
| క్షేత్రయ పదములు | క్షేత్రయ్య |

---

